శ్రీమదాంధ్రకవితాపితామహబిరుదాంకిత

అల్లసాని పెద్దనామాత్య ప్రణీతంబగు

స్వారోచిష

# మనుచరిత్రము

శ్రీ కొమాండూరు - అనంతాచార్యవిరచిత

టీకా తాత్పర్య సహితము

ఉభయభాషాప్రవీణ - సాహిత్యవిద్యాప్రవీణ

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిచేఁ

పరిష్కృతము

ఆర్. వేంకటేశ్వర్ అండు కో.,

ఆనందముద్రణాలయము

మద్రాసు

1947





# విషయసూచిక




| | పుటలు |
|---|---|
| మనవి ... ... ... | i-iv |
| పీఠిక ... ... ... | 1-31 |
| కథాసంగ్రహము ... ... ... | 32-38 |
| ప్రథమాశ్వాసము ... ... ... | 1-42 |
| ద్వితీయాశ్వాసము ... ... ... | 43-82 |
| తృతీయాశ్వాసము ... ... ... | 83-166 |
| చతుర్థాశ్వాసము ... ... ... | 167-235 |
| పంచమాశ్వాసము ... ... ... | 236-294 |
| షష్ఠాశ్వాసము ... ... ... | 295-350 |
| అకారాదిగద్యపద్యానుక్రమణిక ... ... | 351-361 |
| దిద్దుబాట్లు ... ... ... | 162 |

# మనవి



ఇంతవఱకు ముద్రితములయి ప్రచారమున నున్న ఆంధ్రగ్రంథములు పెక్కులు పునస్సంస్కరణాపేక్షితములయి యున్నవి. అట్టివానిలో ఈ 'మనుచరిత్ర' మొక్కటి.

ఆంధ్రవాఙ్మయోద్ధారకులగు శ్రీ సి. పి. బ్రౌనుదొరగారు గతశతాబ్దిలో దీనికి టీకతోఁగూడ శుద్ధప్రతిని వ్రాయించిరి. ఇప్పుడు ప్రచారములోనున్న సటీకా మనుచరిత్రముల కయ్యదియే యాధారము.

ఎక్కువ ప్రచారముగల గ్రంథములకు లెక్కలేని ప్రతులు తయారగుటయు, అవి తలకొక రీతి నుండుటయు సహజము. ఈ మనుచరిత్రపు వ్రాఁత ప్రతులును పెక్కురీతులఁ గన్పట్టుచున్నవి. ఒక ప్రతిలో నున్న పాఠములు వేఱొక ప్రతిలోఁ గానరాకున్నవి. కావుననే తొలిసారి క్రీ. శ. ౧౮౬౨ - సం. లో ముద్రింపఁబడి పెక్కు సంస్థలవారు చాలసారులు ప్రకటించిన దీని ముద్రణములలోఁ గొన్ని అపపాఠములు దొరలినవి. వాని ననుసరించిన వ్యాఖ్యానమును సంగతము కాకున్నది. వ్రాఁతప్రతులను పరిశీలించినఁగాని సాధుపాఠములను నిర్ణయింప నవకాశము లేకున్నది. ఈ యంశమును గమనించియే పూజ్యపాదులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రాచీన 'గ్రంథగ్రంథు'లను విడఁదీయునెడ నీ 'మనుచరిత్రము' లోని పాఠముల యౌచిత్యమును, వ్యాఖ్యానపద్ధతిని అప్పుడప్పుడు పత్రికలమూలమున వెల్లడించిరి. అమూల్యములగు వారి వ్యాసములను చదివిన పిదప పెద్దనార్యుని యీ పెద్ద ప్రబంధమును వ్రాఁతప్రతుల సాయమునఁ బరిశీలింప మనసు పుట్టి యథాశక్తి నా కార్యమును నెఱవేర్చఁగడంగితిని. ఇంతలో ఆంధ్రుల కత్యంతాదరపాత్రులును, వాఙ్మయపోషకులు నగు శ్రీ ఆనందముద్రణాలయాధిపతులు ఈ మహాగ్రంథమును మఱల ముద్రింపఁ గడంగినట్లు తెలిసి 'ఈ గ్రంథమును చక్కఁగ సంస్కరింపఁజేసి ప్రకటించుట యుత్తమ' మని వారికి మనవిచేసితిని. శ్రీవారు నా యభిప్రాయము నామోదించుటయే గాక, ఆ సంస్కరణ భారమును నాపయినే వైచిరి. వారి కోరిక ననుసరించి నాకుచితమని తోఁచినట్లు ఈ 'మనుచరిత్రము'ను సవ్యాఖ్యానమును సంస్కరించి ఆంధ్రలోకమున కర్పించుచున్నాను.

M

వ్రాఁతప్రతులను పరిశీలింపఁగా లభించిన పాఠములలో ఉచితములగు వానిని మూలమునఁజేర్చి, పాఠాంతరములను అధస్సూచిక (Foot Note) లో 'పా.' అను సంకేతమున నిచ్చితిని. ఆ పాఠముల ననుసరించి టీకయందును కొలఁది మార్పులు చేయఁబడినవి. వ్యాఖ్యాతలగు శ్రీ అనంతాచార్యులుగారు అక్కడక్కడ కొన్ని పాఠాంతరములను సూచించి యున్నారు. వానిని అధస్సూచికలోఁ జేర్పక ఎట్లున్నవాని నట్లే (టీకలోనే) యుంచివేసితిని. అట్లే 'పీఠిక' లోని యుదాహరణములలో నెట్టి మార్పును చేయలేదు.

ఉపలబ్ధపాఠముల ననుసరించి టీకను సంస్కరించుటయేగాక, ఎడనెడఁ గొన్ని విశేషాంశములను జూపితిని. కొన్నియెడల పూర్వవ్యాఖ్యాతలు వ్రాసిన యర్థముల బాగోగులను చూపవలసి వచ్చినది. అట్లొనర్చుటకు విషయవివరణాభిలాషయే కారణ మనియు, వ్యాఖ్యాతలయెడ ననాదర మెంతమాత్రమును కాదనియు పాఠకులు గమనింపవలెనని వేడికోలు.

పెద్దన కవితాప్రాశస్త్యమునుగూర్చి కీర్తికాయులు శ్రీమాన్ తంజనగరం తేవప్పెరుమాళ్లయ్యవిద్వద్వతంసులు దీని 'పీఠిక' యందు విపులముగ విమర్శించి చూపియున్నారు. అంతియగాక ప్రాచీనాధునాతనసంప్రదాయములకుఁ జెందిన విజ్ఞులు పెక్కురు పత్రికలయందు ఇందలి బాగోగులనుగూర్చిన వ్యాసములను ప్రకటించి యున్నారు. కాన మఱల నా విషయమునే వ్రాయుచు 'పిష్టపేషణము' చేయక కొన్ని విషయములను మాత్రము - నా చెప్పఁదలఁచినవానిని సంగ్రహముగ నిట వివరింతును.

అల్లసాని - పెద్దనకవీంద్రునకు మనుచరిత్రరచనకారణముగ 'ఆంధ్ర కవితాపితామహుఁ' డను బిరుదము వచ్చెనని చాలమంది యభిప్రాయపడుచున్నారు. శ్రీ తేవప్పెరుమాళ్లయ్యగారు నట్లే తలఁచిరని 'పీఠిక' వలనఁ దెలియవచ్చుచున్నది. కాని యంతకు మునుపే పెద్దన కా బిరుద మున్నట్లు 'ఆంధ్రకవితా పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్' అను కృత్యాదిలోని శ్రీ కృష్ణదేవ రాయల వచనమే తెలుపుచున్నది.

'ఆంధ్రకవితాపితామహ' బిరుదము పెద్దనకుఁ బూర్వమే ప్రసిద్ధమయి యున్నది. క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమున ఓరుగంటి ప్రభువగు శ్రీ కాకతి గణపతి దేవచక్రవర్తికి గురువును, 'పురుషార్థసార' కర్తయు నగు శ్రీ శివదేవదేశికులకు(శివ దేవయ్యగారికి) ఈ బిరు దుండినది. మఱియు క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమువాఁడును, 'రామాయణ' రచయితయు, 'సింహాసన ద్వాత్రింశతి' కర్తయగు కొరవి - గోప రాజునకుఁ బినతాతయు నగు భీమకవికి నీ బిరు దుండెడిది.

దీనిని గ్రహించుటలో పెద్దనామాత్యుఁడు మూఁడవవాఁడు. ఇతనికిఁ బిదప క్రీ. శ. ౧౬౦౫ సంllలో మట్ల - అనంత భూపాలుని యాస్థానమున నుండిన ఉప్పుగుండూరు-వేంకటకవి యీ బిరుదు పొందియుండెను. ఈ యంశములు శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారి వ్యాసమువలనఁ దెలియనయ్యెను. [చూ. 'ప్రథమాంధ్రకవితాపితామహుఁడు - శివదేవయ్య' భారతి - పార్థివ ఫాల్గుణము.]

'మనుచరిత్ర' యాంధ్రవాఙ్మయమునఁ బేరెన్నికగన్న ప్రబంధ మగుటచే దీనికి రూపాంతరములును, భాషాంతరీకృతులును వెలయుచుండినవి. శ్రీ పూండ్ల - వేంకటరమణయ్యగారు దీనిని ద్విపదగాఁ గూర్చిరి. శ్రీ సాధుపల్లి - చంద్రశేఖర శాస్త్రిగారు దీనిని కన్నడములోనికి మార్చిరి.

ఛందోవ్యాకరణములఁగూర్చి రెండు మాటలు—

దేశీయచ్ఛందమగు 'రగడ'ను భారతకవు లుపయోగింపలేదు. శైవకవులు స్తోత్రరూపములగు రగడలను 'బసవరగడ' మున్నగువానిని గూర్చిరి. శ్రీనాథుఁడా సంప్రదాయము ననుసరించి 'రగడ'ను వాడెను. శ్రీనాథునియెడ భక్తియుక్తుఁడును, అతని సంప్రదాయముల ననుసరించువాఁడును అగు పెద్దనకవి యిందు 'రగడ'ను వరూథిని చెలికత్తెలతో వనవిహారముచేయు సందర్భమున వాడెను. తరువాతి కవులు పెద్దన మార్గమునే మేలుబంతిగఁగైకొని రగడలను వనవిహారాదులయెడ స్వేచ్ఛగ నుపయోగింపఁ దొడఁగిరి. కావున 'రగడ'ను భక్తిరసమునుండి శృంగారరసమునకు దింపుటకు పెద్దనయే దారితీసెనని చెప్పవలెను.

'తేఱిచూచినయపుడ కన్నీరు వ్రేఁడమె' ననుచో రేఫ, శకటరేఫల యతి కాననగును.

మహాకవుల యనర్గళకవితాప్రవాహము ఎడనెడ వ్యాకరణసేతువులఁ దెగగొట్టి స్వేచ్ఛగా ప్రవహించుట ప్రసిద్ధము. అట్టి ప్రయోగములను మనము నెఱసులని పరిగణించుట పాడిగాదు. అయ్యవి ప్రధానమగు రసమునకు భంజకములు కానంతవఱకును ఉపాదేయములు. పెద్దన ప్రయోగించిన 'పణినసూన, కొఱంతంబడున్, తామరసనేత్రలిండ్ల, కౌఁగిలది' మున్నగునవి యీవఱకే విమర్శకులదృష్టి నాకర్షించినవి. '(ముయ్యెలగుట్ట + అయినట్టి=) ముయ్యెలగుట్టయినట్టి, (ఒక్క + ఓరణంబుః=) ఒక్కోరణంబు, (పొల+ఆనలేక=) పొలానలేక' మున్నగు ప్రయోగము లత్వసంధియెడఁ బెద్దనకుఁగల స్వేచ్ఛాప్రవృత్తిని వెల్లడించుచున్నవి.

ద్వితీయాంతమునఁ గల ద్రుతమును లోపింపఁజేయు విషయమున 'జవరాండ్ర నేపంబిడి, కుమారుల నిరతము గనుగొనమె, ప్రాక్కమఠంబు నినున్'

మున్న గునవి యుదాహరణములు. 'తల్లిం దండ్రియు' ననుచో ( దండ్రియు నను) సముచ్చయార్థమున ద్రుతమే కానవచ్చుచున్నది. ఇట్టి ములు విరళములు.

ఇంచుకచ్చుకారమునకు ప్వాదేశము పెద్దనకు సమ్మతమైనట్లు ముద్రితప్రతులందు మాత్రము ఆ యాదేశముతోడి రూపము లే చున్నవి. అట్టిచోట్ల వ్రాంతప్రతులలో 'వాయింపుచుండ' అనుటకు గాను' అనియు, 'మాన్పెన్'కు బదులు 'మాన్చెన్' అనియు, 'రో అనుటకు బదులుగా 'రోషంబునన్' అనియు పాఠములు కన్పడుచున్న యమున పెద్దన ప్రాచీనుల పద్ధతి ననుసరించి యుండవచ్చును.

ఏతద్గ్రంథసంస్కరణ సమయమున - ఏతత్సంబద్ధములగు వ్యా ములను - నాకు లభించినంతవఱకును బరికించితిని. వానిలో శ్రీ వేట కరశాస్త్రిలుగారి వ్యాసములు, శ్రీ చిలుకూరి - నారాయణరావుగారి రజతోత్సవ సంచికలోఁ బ్రకటించిన వ్యాసమును మిగుల ఉపయోగప త్రకు సంబంధించిన కొన్ని విషయములను మన్మిత్రులును, మద్రాసు లయ ప్రాచ్యపరిశోధనాలయమున ఆంధ్రోపన్యాసకులును అగు శ్రీ ని వేంకటరావుగారు (ఎం. ఏ.) దయతోఁ దెలియఁజేసిరి. పయి విద్వద్వత కృతజ్ఞతాపూర్వకవందనములు.

విశాలహృదయులును, వాఙ్మయాభిమానులును, ఆనందముద్ర పతులును అగు శ్రీ బి. మాధవరావుపంతులుగారు న న్నీ యుత్కృష్ట నియోగించి, నా పరిశ్రమను కృతార్థమొనర్చిరి. వారికి నా వినతితతుల ద్రణ సమయమున ప్రూఫులు దిద్దుటలో వంతు పంచుకొని, యీ శీఘ్రముగ వెలువడుటలో సాయపడిన ఆనందముద్రణాలయపండితులు ఈయుణ్ణి - గోపాలకృష్ణమాచార్యులుగారికి నా ధన్యవాదములు.

బులుసు వేంకటరమణయ్య
ప్రధానాంధ్రోపాధ్యాయ
కెల్లెట్ హై

మదరాసు
4-11-1947

# పీ ఠి క



ఉ. కేవల కల్పనాకథలు ♦ కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము ల ♦ వారితసత్కవికల్పనావిశే
షావహపూర్వవృత్తములు ♦ సానలఁదీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథ ♦ గా నొనరింపుము నేర్పు పెంపునన్.

(వసుచరిత్రము ౧ ఆ. ౧౮ ప.)

సంస్కృతమునందు వాల్మీకి కాళిదాసాది మహాకవులు కవిత నెలకొలిపి, దానికి వలయు
గ్యసంపద లన్నియుఁ గూర్చిరి. పిదప నాలంకారికులు చమత్కారబీజము లన్నియుఁ
రించి, శాస్త్రరూపమునఁ బ్రపంచించి,యాంధ్రాదిభాషలకు సంచితధనంబుగా నొసంగిరి. మన
సనకు సంస్కృతమును, దాని వికృతులును, విశేషించి ద్రవిడ-కన్నడ-భాషలును బదపరి
ఁ గూర్చినవి. గీర్వాణ మలంకారమార్గంబులను, ద్రవిడాదులు మఱికొన్ని లక్షణంబులను
గినవి. ఇంతకును గవిత్వము పాకము నొందమిచే మన తెనుఁగువారు 'గాసటబీసటే చదివి
ం త్రవ్వ' చుండిరి. మొట్టమొదటఁ దెనుఁగునఁ గవిత్వ మవతరింపఁజేసి, పరిపాకమునకు
టి వగు ప్రథమావస్థలను బొందించుచు వచ్చిన కవు లెవరో మనకుఁ దెలియకున్నది. అయినను
కుఁ బూర్వమందున్న యుద్ధమల్లుని శాసనమునందలి పద్యములంబట్టి కవిత్వ మప్పటికే
రించి, యభివృద్ధిమార్గమును ద్రొక్కుచుండెనని తెలియుచున్నది. అట్లు కవిత్వపరిపాకము
టకు వలయు సాధనములు సమకూరుచుండె. అయిన నొక యోజకుఁడు గావలయు.
ండ నాంధ్రభాషా భాగ్యవిశేషంబున 'నుభయభాషాకావ్యరచనాభిశోభితుం' డగు నన్నయ
కుం డేర్పడి, యట్టి సాధనసంపత్తిం గొని 'మత్యమరాధిపాచార్యుండు' గావున నాంధ్రకవితకుఁ
ఁ గూర్పంబూని యొక పాలు తెనుఁగును, రెండు వంతులు సంస్కృతపదంబులును గోమలము
మనోహరముగాను గూర్చి, యక్కవిత నవతరింపంజేసె. ఇతని గుంభనము లతిసుకుమారములు.

క. శారదరాత్రు లుజ్జ్వల ల ♦ సత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వివి ♦ సన్నవకైరవగంధబంధురో
దారసమీర సౌరభము ♦ దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచి ♦ పూరములం బరిపూరితంబులై.

'గాసటబీసట'గా నుండిన తెనుఁగు ననుశాసించి, యం దింత కోమలముగాఁ గవిత్వమును
ంతమాత్రకే యిమ్మహాకవికాలంబు చెల్లె. ఇంతమాత్రమును సామాన్యము గాదు. ఇంతకును మన
గుకవితకు వలయు నన్ని చిన్నెలు వన్నెలు గుదిరినవి గావు. సంస్కృతపదముల యర్థంపుఁ
రయే, సంస్కృత సమాసముల మిసిమియే వానితోఁ గూర్పఁబడిన తెనుఁగుపలుకులకుఁ జొకినవి.
యభట్టునకుఁ బిదప నన్నెచోడుఁడు మొదలగు కవు లచ్చతెనుంగుల మెచ్చులుకూడఁ గొంత
ంచిరి. కాని ప్రత్యేకముగాఁ దెనుంగుపలుకుల ముద్దుసుద్దులు తెలియరావయ్యె. అంతఁ
బహ్మ నాఁదగు తిక్కన యచ్చతెనుంగుపదములే మిక్కిలి కూర్చి, యుజ్జ్వలంబైన ప్రతిభావిల

సనముచేతను, ననదృశమైన కవితాప్రౌఢిమచేతను నపూర్వములు, నతి మనోహరములు నగు పెక్కు రచనావైచిత్ర్యములు పచరించి యాంధ్రభాషాలలన కగణ్యలావణ్యంబు నొడఁగూర్చి దానిని 'రామణీయకంబు రమియించు నిక్కఁ' గావించె. ఈ మహాకవిచేత సీసము తన సొబగువగలన్నియు నెఱపి, యద్భుతమగు చమత్కారసాధన మయ్యె. వేయేల? ఇతనికిఁ బిమ్మటికవుల యలంకారములందలి రతనముల కితని రచనలు గనులు. కృతిపతిని, దద్వంశావతారమును వర్ణించుట, షష్ఠ్యంతములు మున్నగునవి యీ కవిసార్వభౌమునికడనుండి వచ్చిన సంప్రదాయములు. ఈతఁ డిట్లాంధ్రభాషామణిని భూరిశోభామనోహరత్వమున భువనమోహినిం గావించె. పిదప నెఱ్ఱనార్యుం డుభయభాషాపదముల సమంబుగాఁ జొనిపి, మఱికొన్ని సొంపులు గూర్చె. నాచన సోముఁడు, భాస్కరుఁడు, పోతన మున్నగువారును సంస్కృతపదములనే విశేషముగాఁ జొనుపుచు, ముద్దులుగులుకు మఱికొన్ని రచనలఁ గూర్చి, భాషాసమష్టిని, మాధుర్యపుష్టిని మిక్కిలియుఁ గలిగించిరి. అయినను వీరందఱును గేవల మచ్చతెనుఁగునకు నంతగా మెచ్చులుగులుకు సొంపులు నించినవారు గారు. పిదప శ్రీనాథుం డాంధ్రకవితను సంస్కృతపదభూయిష్ఠంబును, దీర్ఘసాంస్కృతికసమాస బంధురంబును గావించె. ఈ కవికి వెనుకఁ బింగళి సూరనార్యునివఱకును గల కవు లందఱకు నీ సంస్కృతరచనాబాహుళ్య మంటుతెవులువలె వ్యాపించినది. శ్రీనాథుని కవనము మిక్కిలి రసవంతంబును, ప్రౌఢంబు నగుటచే దాని ననుకరించిన కవుల కవనంబున కాతని సంస్కృతపదభూయిష్ఠత్వంబును బట్టువడియెఁగాఁబోలు! అట్టి కవులలో మన పెద్దనార్యుఁడు ముఖ్యుండు. ఇతం డొక నాలవ యాశ్వాసము తప్పఁ దక్కిన గ్రంథము నంతయు శ్రీనాథునివలె సంస్కృతపదప్రచురంబుగా రచించియున్నాఁడు. ఇక్కవికాలంబుననే యన్యదేశీయులతోడి సాంగత్యమువలనఁ గలుగుచు వచ్చిన మాఱుపాటులన్నియు ముదిరి, క్రొత్త రుచి కుదిరియుండుటచే దాని కనుగుణముగఁ గవిత్వమును బ్రాచీనపు ఫక్కికిఁ గొంత యెడతెగి, యపూర్వకల్పనావిశేషములకుఁ జొచ్చినదయ్యె. ఇదియె ప్రబంధకవనావతారమునకు మూలము. దీనినిగుఱించి కొన్ని విశేషములు వ్రాయుట యావశ్యకము.

కవనము తాను బుట్టిన కాలమందలి రుచివిశేషమును, మతస్వరూపమును బ్రతిఫలించు నద్దమువంటిది. అది యప్పటి నాగరకతా ప్రబంధమునకు విషయసూచి యనఁదగు. అందుఁ బ్రాఁకిన సంప్రదాయము లా రుచిమతాదిమూలములనుండి పుట్టి, దానిం బెనఁచుకొనియున్న బలుతీగలు. మతము సులభముగా మాఱదు గాని, రుచిమాత్ర మయ్యెకాలములఁ బూర్ణముగా మాఱుటగాని, సంకరము నొందుటగాని కలదు. అందులకు . నన్యదేశీయసాంగత్యము, నన్యరాజప్రభుత్వము, నూతనమతసంపర్కము మొదలగునవి కారణములుగాఁ జరిత్రలందుఁ గానంబడుచున్నవి. నన్నయభట్టునకు ముందు బహుకాలమునుండి ద్రవిడుల కార్యులతో నైక్యముకలిమిచే వారి వేషభాషలయందుఁ బ్రీతియు, గౌరవమును, వారి వైదికానుష్ఠానవృత్తులును గుదిరియుండె. కాన వారి వ్యవహారములందెల్ల రుచియును ముదిరియుండె. నన్నయకాలమున మహమ్మదీయసేనాసముద్రము హిమాలయపుఁగట్టలపయిఁ బొంగి, యుత్తరహిందూదేశమునందుఁ బొలయుచుండెను; గాని వింధ్యపర్వతము దాఁటి ద్రవిడదేశమునకు రాలేదు. ఇట్లన్యదేశీయసాంగత్యము లేమిచే ప్రాచీనాచారములగు పురాణశ్రవణపఠనాదులందు మనవారికిఁగల రుచికి సంకరముగాని, మాఱుపాటుగాని కలిగినది కాదు. మఱియు నప్పటికి గీర్వాణకవనమును సౌభాగ్యగరిమము నొంది యుండె. ప్రౌఢకవనములు గల రామాయణాది గ్రంథములును, రచనావైచిత్రిం జూపు రఘువంశాది కావ్యములును, గల్పనానైపుణ్యము నెఱపు శాకుంతలాది నాటకములును నాంధ్రులు

మొదలగువారికిఁ బండిన పెరటికల్పకములై యుండినవి. అన్ని తెలుఁగుల కవిత్వముండియు నాంధ్రభాషయందా కవిత్వరచనా వైచిత్ర్యము లెల్ల నన్నయకాలమునందు నంతగా రూఢములు కామిం జేసి యతఁడు కల్పనానిబంధన మొకటియుఁ గావింపఁడయ్యె. మఱియుఁ గృతిపతియగు రాజరాజనరేంద్రుఁడు 'మదీయమనంబు భారతకథాశ్రవణప్రవణంబు కావునన్, మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడఁ దెలుఁగున రచింపు' మని చెప్పుటచేతను, బవిత్రమైన భారతమునందుఁ దన నూత్నప్రయత్నముఁ జూపుటవలన నది సర్వసమాదరపాత్ర మగునను తలంపుచేతను భారత రచనకుఁ గడఁగి, యట్లు చేసి, తన కవితను నూత్న కల్పనలకుఁ జొనుప సమర్థుఁడయ్యు సాహసింపఁ డయ్యెఁగాబోలు ! కాఁబట్టి యతఁడు నవీనకల్పనలకుఁ జొరకుండుట యుచితము. అది యప్పటి తెలుఁగువారికో రాజునకో పురాణశ్రవణాదులందుఁ గల రుచి కనుగుణముగా నుండియుండును. అయినను బిమ్మట వచ్చిన తిక్కనాదులును 'కావ్యేషు నాటకం రమ్య' మ్మను నభియుక్తోక్తిని గల్పనాంశమిళితములగు శాకుంతలాదుల యుత్కర్షము గర్ణతాడితమయ్యు, నట్టి రచనలకుఁ బ్రౌఢు లయ్యు, గతానుగతికముగా నన్నయభట్టమార్గమునఁ బూర్వగ్రంథమును దేనినో భాషాంతరము సేయుటతోఁ దృప్తినొందుచు వచ్చిరి; గాని ప్రబంధములను రచింపరైరి. మనవారికిఁ బూర్వ ములైనవానియందు గౌరవప్రతిపత్తియుఁ, గ్రొత్తవానియందు ననాదరదార్ఢ్యమును సహజములు. ఎఱ్ఱన హరివంశమును, సోమన యుత్తరహరివంశమును, భాస్కరుఁడు రామాయణమును, శ్రీనా థుఁడు నైషధ, కాశీఖండాదులను నాంధ్రీకరించిరి. కల్పనాగ్రంథముల పస దెలిసియే యున్నది. అయినను దెనుఁగునం దాదికవు లెవ్వరును వానిని రచింపమియే యనుకారైకపరాయణులగు పిమ్మటి వారును వానిని రచింపకుండుటకుఁ గారణముగాని, మఱి వానిపలని యనాదరము గాదు. బహు కాలముగాఁ బురాణాదులఁ దెలిఁగించుచు వచ్చు నీ యాచారము రూఢమై, తన్ను మార్పఁజాలినట్టి రుచిభేదము పుట్టకుండుటచేఁ దానును మాఱినది గాదయ్యె. పిమ్మటఁ గృష్ణదేవరాయల కాలము నకు మహమ్మదీయులు మొదలగు నన్యదేశీయులును, మహమ్మదీయ ప్రభుత్వములును నిందుఁ బ్రబల, తదనుగుణముగాఁ బెక్కు నూతనవిషయములు కలుగుటచే నవీనకల్పనలయందు రుచి పుట్టి, యా యాచారమును గొంతఁ గదల్చినది. అయిన నీ యాచారము బహుకాలముగా వచ్చుచుండుట చేతను, దెనుఁగునం దాదికవు లెవరును గల్పనాగ్రంథములకుఁ బూనకుండుటచేతను శుద్ధకల్పన ములు దోషప్రాయములుగాఁ దోఁచుటవలననేమో ! అట్టివానిని విడిచి సామరస్యముతోఁ బూర్వాచారమునుబట్టి యాద్యసత్కథలను గొని, నూత్నరుచిప్రాబల్యమునుబట్టి, స్వకపోలకల్పిత ములను గొంతఁ జేర్చి, ప్రబంధరూపముగాఁ గవనము సేయుట యుపపన్న మయ్యె. కేవల కాల్ప నికములగు మాలతీమాధవాది రూపకముల కీర్తి ఘంటాపథముగా నుండియుఁ దెనుఁగులోని శుద్ధ కల్పనములకుఁ 'గేవల కల్పనాకథలు కృత్రిమరత్నము' లను నిట్టి యపకర్షము కలుగుట యీ పూర్వాచారమహిమచే కాని వేఱుకాదు. ఇట్లు రుచి ప్రబంధకవనమునకుఁ బురికొలిపెను. శ్రీనాథుని కవనప్రక్రియలును, పినవీరభద్రుని శాకుంతలము మొదలగు కావ్యములును ప్రబంధ కవనమునకు వలయు పరికరములు సమకూర్చియుండెను. అట్టి ప్రేరణమునకు నిట్టి యుపకరణములును గూడఁగాఁ గలిగిన ప్రబంధము మనుచరిత్రము.

ఈ ప్రబంధమునకు మనుచరిత్రము, స్వారోచిషమనుచరిత్రము, స్వారోచిషమనుసంభవము నని మూఁడు పేళ్లు కవియే వాడి యున్నాఁడు.

'మనుచరిత్రం బందుకొను వేళఁ బుర మేఁగఁ, బల్లకి తనకేలఁ బట్టి యెత్తె' (చాటువు)
'కారికచ నీ స్వారోచిషు, చారిత్రము వినిన వ్రాయ' (౬ ఆ. ౧౧౯ ప.)
'నా యొనర్పం బూనిన స్వారోచిషమనుసంభవం బను మహాప్రబంధమునకు' (౧ ఆ. ౪౮ ప.)

ఇం దయిదాశ్వాసములందును, నాఱవ యాశ్వాసమునందు బహుభాగమువఱకును స్వారోచిషుని సంభవమునకుఁ గారణభూతమైన చరిత్రమే యున్నదిగాని యతనిచరిత్రము లేదు. అతని చరిత్రమంతయు నాఱవయాశ్వాసము కడపట నిరువదియొక్క పద్యములలో నిమిడి యున్నది. ఇది యొక చరిత్ర కానేరదు. కాన 'మనుచరిత్ర' మనుటకన్న మనుసంభవకారణమైన చరిత్ర యగుటచే 'స్వారోచిషమనుసంభవ' మనుటయే యుచితము. ఇదియే పెద్దన యాశ్వాసాంత గద్యములందును జెప్పియున్నాఁడు. కావున నిదియే మొదటినామ మగును. తక్కినవి వ్యవహార వశమున వచ్చియుండును. దీనికిఁ గృతిపతి కృష్ణదేవరాయలు.

ఈ మహారాజు విజయనగరరాజులలో నెల్ల నగ్రగణ్యుఁడు. ఇతని రాజధాని యగు విజయ నగరము బళ్లారిమండలమునం దానెగొందికి సమీపమున నున్నది. దక్షిణహిందూస్థానమును బాలించిన రాజులలో నిట్టి సార్వభౌముఁడును, శూరాగ్రేసరుఁడును లేఁడని చెప్పవచ్చు. ఇతని తండ్రి నరసరాయలు. ఈ నరసరాజునకు నాగాంబిక యను భోగకాంతయందుఁ గృష్ణరాయలు పుట్టెనని కొందఱు వ్రాసియున్నారు. కాని యది నిజముగాదు. కృష్ణరాయని సవతితమ్ముఁడగు నచ్యుత రాయనికి నంకితము సేయఁబడిన 'అచ్యుతరాయాభ్యుదయ' మ్మను సంస్కృతకావ్యమున

'తిస్రో నృపస్యేత్యభవన్నభీష్టా, స్తిప్పాంబికా తాసు చ నాగమాంబా,
పట్టాభిషిక్తాః పతిదేవతానా, ముత్తంసభూషామణి రోబమాంబా.'
'తిప్పాంబికాయాం ద్విజసంపదేఽభూ, ద్విఖ్యాతిమాన్వీరనృసింహరాయః,
నాగాంబికాయాం నరసావనీన్ద్రాః, కీర్త్యైకరోఽజాయత కృష్ణరాయః.'

అని తిప్పాంబ, నాగాంబ, ఓబమాంబ యను ముగ్గురును నరసరాజు పట్టపురాణు లనియు, నందు నాగాంబికయందుఁ గృష్ణరాయలు పుట్టెననియుఁ జెప్పఁబడినది. కాఁబట్టి నాగాంబ కుల కాంతయేకాని భోగకాంత కాదు. కృష్ణరాయలు ౧౪౬౫ లో జన్మించె నని యొకరును, ౧౪౭౮ లో జన్మించె నని యొకరును వ్రాసిరి; కాని జన్మసంవత్సర మిది యని చెప్పుటకుఁ దగిన యాధారము లేదు. కృష్ణరాయలు ౧౫౦౯ వ సం॥ ఫిబ్రవరి నెల ౪-వ తేదిని బట్టాభిషిక్తుఁడయ్యె. అతనికడ సాళువ తిమ్మరుసను మంత్రిశిఖామణి యుండెను. ఈ తిమ్మరుసు నరసరాయ, వీరనరసింహ రాయల కాలములనుండి మంత్రిత్వము వహించి యున్నవాఁడు. ఈతని బుద్ధిబలమునను, దన యప్రతిమపరాక్రమమునను రాయ లన్నిదిక్కులను దండయాత్రలు సలిపి, యఖండరాజ్యవైభవము ననుభవించె. మొదట ౧౫౧౧-౨-వ సం॥ దక్షిణ దిగ్విజయమునకై వెడలి, కర్ణాట-ద్రవిడ-మళయాళదేశము లన్నియుఁ దనవశముఁ గావించుకొనియె. ౧౫౧౩ లో పూర్వదిగ్విజయ యాత్రకుఁ బోయి నెల్లూరుమండలములో నుదయగిరిని బదునెనిమిది నెలలవఱకు ముట్టడించి పట్టుకొనియె. పిదప గుంటూరుమండలములోని కొండవీటిపై నెత్తె. ఇది దక్షిణహిందూదేశములోని గొప్ప పర్వతదుర్గములలో నొకటి. ఇది యుత్కలదేశపురాజైన ప్రతాపరుద్రగజపతి కుమారుఁడు వీరభద్రగజపతిపాలనలో నుండె. వీరికిఁ దోడుగా శ్రీనాథరాజు, జన్యాయమల కసవాపాత్రుఁడు మొదలగు సరదారు లుండిరి. రాయలు తన్నెదిరింపవచ్చిన ప్రతాపరుద్రగజపతి నెదుర్కొని జయించి, పిదపఁ గొండవీటిని స్వాధీనము చేసికొనియె. పిదప బెల్లముకొండ మొదలైన దుర్గములను

సాధించి, కొండపల్లిని గెలిచి, ప్రతాపరుద్రగజపతిని దఱుముచు నుత్తరమునకుఁ బోయి, కృష్ణా-గోదావరీ-నదీముఖములకు మధ్యనుండు వేఁగీదేశముపై దండెత్తి, జమ్మిలోయ - కోనసీమ - కొట్టాము మొదలగు మన్యసీమలను, రాజమహేంద్రవరమును జయించి, విశాఖపట్టణమండలములోని పొట్నూరి కడ జయస్తంభము నాటి, మాడుగుల మొదలగు మన్యసంస్థానములను, వడ్డాదిని వశపఱచుకొని, సింహాద్రి చేరి, స్వామిని సేవించి, జయస్తంభములు వేయించి, కటకమునకుఁ బోయి, దానిం గెల్చి, మరలి ౧౫౧౫ లో విజయనగరము చేరెను. పిదప రాయలకును, గజపతికిని సంధి జరుగఁగా రాయలు గజపతికూఁతును బెండ్లాడెను. ఈ విజయములే మనుచరిత్రములోని—

సీ. తొలుదొల్త నుదయాద్రి ♦ శిలఁ దాఁకి తీండ్రించు, నసిలోహమున వెచ్చ ♦ నై జనించె
మఱి కొండవీ డెక్కి ♦ మార్కొన్న నలిఘైన, యలకసవాపాత్రు ♦ నంటి రాఁజె
నట సాఁగి జమ్మిలో ♦ యఁ బడి వేఁగి దహించెఁ, గోన బిట్టేర్చెఁ గొ ♦ ట్టానఁ బగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ ♦ గరఁచె గౌతమిఁ గ్రాఁచె, నవుల నా పొట్నూర ♦ రవులుకొనియె.

తే. మాడెములు వ్రేల్చె నొడ్డాది ♦ మసి యొనర్చెఁ, గటకపురిఁ గాల్చె గజరాజు ♦ వలఁగి పఱవఁ
దోఁకచిచ్చన నౌర యు ♦ ద్ధురతఁ గృష్ణరాయబాహుప్రతాపజా ♦ గ్రన్మహాగ్ని. (౧ ఆ. ౩౭ ప.)

ఉత్సాహ. ... ... దుర్భరానకార్భటీ
ఘూర్ణమాన కొండపల్లి ♦ కొండవీటిమండలా. (౩ ఆ. ౧౪౪ ప.)

మ. ధర కెంభూళులు కృష్ణరాయల చమూ ♦ ధాటీగతిన్ వింధ్యగ
హ్వరముల్ దూఱఁగఁ జూచి, తా రచటఁ గాఁ ♦ పై యుండుటం జాల న
చ్చెరువై యెఱ్ఱని వింతచీఁకటులు వ ♦ చ్చెం జూడరే యంచు నే
సొరిదిం జూతురు వీరరుద్రగజరా ♦ ట్పుద్ధాంతముగ్ధాంగనల్. (౧ ఆ. ౩౮ ప.)

క. నిమిషార్ధగృహీతకళింగరాజ ♦ తనయాగ్రణికిన్. (౧ ఆ. ౪౬ ప.)

చ. అభిరతిఁ గృష్ణరాయఁడు జ ♦ యాంకములన్ లిఖియించి, తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ ♦ నిల్పిన కంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం దిగు సు ♦ రప్రకరంబు కళింగ మేదినీ
విభు నపకీర్తి కజ్జలము ♦ వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్. (౧ ఆ. ౪౭ ప.)

శా. ... ... ... మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహ విగాహితోత్తరకకు ♦ ద్ధాటీసమాటీకనా. (౩ ఆ. ౧౪౨ ప.)

శా. ... ... ... కటకా♦ధ్యక్షానుగక్షోణిభృ
త్కాయగ్రావభిదావిధాభిదురదోః ♦ ఖడ్గాగ్ర... (౬ ఆ. ౧౨౪ ప.)

అను పద్యములవలన తెలియనగును.

కడమ యైదు సంవత్సరములు విద్వత్పరిసంగములందును, భావి యుద్ధపరికర సంకలనమందును బుచ్చి, ౧౫౨౦ సం॥న రాయలు రాచూరు దండయాత్ర వెడలెను. రాచూరు మున్ను విజయనగర రాజులది. దీనికై కను న్న రాజులకును, దురుష్కులకును బెక్కు యుద్ధములు జరిగియుఁ గడపట నది తురుష్కులపా లయ్యెను. అది ప్రకృతకాలమున బీజపూర్ ఆదిల్‌షాహ వశమున నుండెను. రాయలు పది లక్షల సైన్యముతో వెడలి, ఘోరముగాఁ బోరి, యాదిల్‌షాహను బాఱఁదోలి, రాచూరిదుర్గమును బట్టుకొనియె. ఈ దాడిలోనే రాయలు కలబరిగిదుర్గమును ధ్వంసముచేసి,

లోఁబఱుచుకొనియె. అందు ఆదిల్‌షాహ చెఱపెట్టిన బహమనీరాజపుత్రులను ము
విడిపించి, యందుఁ బెద్దవానికి రాజ్యము గట్టెను. ఈ విషయము—

ప్రళయఘనాఘన ఘోషజయానక ♦ ఘాంకృతిభీమ చపేటలుఠత్
కలబరగీ కటకక్షితిరక్షక ♦ కన్నడరాజ్య రమారమణా. (౨ ఆ.

శా. ... ... యవనక్షోణీధవస్థాపనా. (౩ ఆ.

అని మనుచరిత్రమునఁ గానంబడియెడి. ఈ దండయాత్రలయందుఁ గృష్ణరాయ
మునఁ బెక్కునూఱుల యేనుంగులును, బహుసహస్ర సంఖ్యల గుఱ్ఱములును భయంకరము
యుండెనని పోర్చుగీసుచరిత్రకారులు వ్రాసియున్నారు. దాని కనుగుణముగా—

క. పుంఖానుపుంఖసైంధవ, రింఖాసంఘాతజాత ♦ రేణూత్కరతమో
రింఖద్రిపున్నృప. (౧ ఆ

శా. ... ... ఘీంకారహే
షా ఘోషోద్భటధాటికా గజఘటా ♦ శ్వోత్థూర్ణ విశ్వంభరా. (౪ ఆ.

మాలిని. సరభస జయదాటీ ♦ చండవేదండకోటీ
కరనమధు హిమానీ ♦ కంపితాశావధూటీ. (౫ ఆ.

అని పెద్దన వర్ణించినాఁడు. ఇతఁడు విద్వాంసుఁడును, విద్వద్గోష్ఠీలోలుఁడును, గవి
కావుననే—

క. కవితా స్త్రీరిలోలునకున్.
క. విద్యాఖేలనభోజసుధీలేఖద్రుమ.
మ. భోజక్షమాపతివిద్యాపరిపాక.
క. కల్పకద్రుమాధికదాన, శ్రీ కుతుకాగతలోకా, లోకాంతర సకలసుకవిల
అని వర్ణితుఁ డయ్యెను.

రాయలు మిక్కిలి పొట్టియును, బొడుగునుగాక కొలఁదియగు నెత్తు గలవాఁ
ముఖవర్చస్సును, సుందరాకృతియుఁ గలిగియుండె నని చరిత్రకారులు వర్ణించిర
పెద్దనయు—

'శ్రీనందనసౌందర్య' 'కాంతాలతాంతశర' 'పంకజద్భుగంగీకారధీరాకృతీ'
అని వర్ణించినాఁడు. రాయలు గరిడీసాధన చక్కఁగాఁ జేసినవాఁడు. ప్రతిదినమును వా
సేయుచుండెను. కావుననే 'వ్యాయామస్థిర సంధిబంధ' యని యున్నది. ఇతఁడు
మఱియు విష్ణుభక్తాగ్రేసరుఁడు. అందును తిరుపతివేంకటేశ్వరస్వామియెడ విశేషభక్తి
కాఁబట్టి 'భావభరితశ్రీకాంత' 'కరుణాకర వేంకటవిభు, చరణ స్మరణ ప్రసంగ
'శ్రీ వేంకటేశ పదపద్మావేశిత పదయహృదయ' అని పెద్దన చెప్పినాఁడు.

ఇట్లుఖండజయముల నొంది, యపార, రాజ్యవైభవమును బడసి, కవుల నాద
దాను గవియు నగుచు నాంధ్రభాషామణి నత్యంతభూషితం జేసి, యీ విద్వచ్చక్ర
సంవత్సరములోఁ గీర్తిశేషుఁ డయ్యె. మనుచరిత్ర కృతికర్త అల్లసానిపెద్దన్న.

ఇతఁడు నందవరీకుఁడు; చొక్కనామాత్యుని పుత్రుఁడు; కృష్ణదేవరాయల యా
రులలో నెల్ల నగ్రగణ్యుఁడు; తెనుఁగునందుఁ బ్రబంధరచనమునకు మార్గదర్శకుఁడు. ఇత

మొదట స్మార్తుఁడై యుండినను బిదప వైష్ణవమును బుచ్చుకొని, శఠకోపయతికి శిష్యుఁడయ్యె. రాయలు తన కిచ్చిన కోకటగ్రామమును వైష్ణవుల కగ్రహారముసేసి, దానికి శఠకోపపురమని పేరు పెట్టెను. ఇతండు మనుచరిత్రమునే కాక హరికథాసారమను గ్రంథమునుగూడ రచించెనని లక్షణ గ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది; కాని యది యిప్పుడు నామావశిష్టము. మార్కండేయ పురాణమందలి స్వారోచిషమనుసంభవకథను గొని, స్వకపోలకల్పనలను గూర్చి, తొలుదొలుత మను చరిత్రమును ప్రబంధరూపమున రచించుటచే నాంధ్రకవితాపితామహుఁ డను బిరుద మితనికిఁ గలిగినది. రాయ లొకనాఁడు కవిగండపెండేరమును బసిఁడిపళ్లెరమున నుంచుకొని "సంస్కృతాంధ్రములందు సమానముగాఁ గవనము సేయువాఁడు దీనిని స్వీకరింప నర్హుం" డనఁగాఁ బెద్దనార్యుఁడు క్రింది యుత్పలికమాలికను జదివెనఁట !

ఉ. పూఁతమెఱుంగులుం, బసరుఁ ♦ బూపబెడంగులుఁ జూపునట్టివా
కైతలు? జగ్గునిగ్గు నెన ♦ గావలెఁ, గమ్మనఁ గమ్మనన్ వలెన్;
రాతిరియుం బవల్ మఱపు ♦ రాని హొయల్ చెలియారజంపు ని
ద్దాతరితీపులంబలెను ♦ దారసిలన్ నలె లోఁ దలంచినన్;
బాఁతిగఁ బైకొనన్ వలెను ♦ బైదలి కుత్తుకలోని పల్లటీ
కూఁతలనన్వలెన్ సొగసు ♦ కోర్కులు రావలె నాలకించినన్;
డాతొడ నున్నమిన్నుల మి ♦ టారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱదొండపండుపలె ♦ వాచవి గావలెఁ బంట నూఁదినన్;
గాతలఁ దమ్మిచూలిదొర ♦ కైవసపుంజవరాలిసిబ్బెపు
న్నెతెలియబ్బురంపు జిగి ♦ నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బపొం
బూఁతల నున్నకాయసరి ♦ పోఁడిమి కిన్నెరమెట్లబంతి సం
గాతపు సన్నతంతి బయ ♦ కారపుఁగన్నడి గౌళపంతు కా
సాతతతాన తానలప ♦ సం దివుటాడెడు గోట మీటు బల్
మ్రోఁతలునుంబలెన్ హరువు ♦ మొల్లముగావలె; నచ్చతెన్గు లీ
రీతిగ - సంస్కృతంబు పచ ♦ రించినపట్టున భారతీవధూ
టీ తపనీయగర్భ నిక ♦ టీ భవదానన పర్వసాహితీ
భౌతికనాటకప్రకర ♦ భారత భారత సమ్మతప్రభా
శీతనగాత్మజాగిరిశ ♦ శేఖరశీతమయూఖరేఖికా
పాత సుధాప్రపూర బహు ♦ భంగ ఘుమంఘుమ ఘుంఘుమార్భటీ
జాతక తాళయుగ్మలయ ♦ సంచిత చుంచు విపంచికామృదం
గాతతదేహి తత్తహిత ♦ హాధిత దంధణు ధణు ధింధిమి
వ్రాత నయానుకూల పద ♦ వార కుహూద్వహ హారికింకిణీ
నూతన ఘల్ఘలాచరణ ♦ నూపుర ఝుణుఝుణీ మరందసం
ఘాతవియద్ధునీచకచ ♦ కద్వికచోత్పలసార సంగ్రహా
యాత కుమారగంధవహ ♦ హారిసుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁజేయవలె; ♦ జిల్లునఁ జల్లవలెన్ మనోహర
ద్యోతక గోస్తనీఫలమ ♦ ధుద్రవ గోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచి ♦ రప్రతిమంబుగ సారెసారెకున్.

దీనికి రాజు మెచ్చి, కవిపాదమునఁ దానే గండపెండేరమును దొడిగెనఁట !
రచించె ననఁబడు నీ చాటుపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. ఎదురైనచోఁ దన • మదకరీంద్రము నిల్పి, కేలూఁత యొసఁగి యె • క్కించుకొని
మనుచరిత్రం బందు • కొనువేళఁ బురమేఁగఁ, బల్లకి తన కేలఁ • బట్టి యెత్తె
బిరుదైన కవిగండ • పెండేరమున కీవె, తగు దని నాదు • పాదమునఁ దొడిగెఁ
గోకటగ్రామాద్య • నేకాగ్రహారము, లడిగినసీమల • యందు నిచ్చె
తే. నాంధ్రకవితాపితామహ • యల్లసాని, పెద్దనకవీంద్ర ! యని నన్నుఁ • బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి • కేఁగలేక, వసుధ బ్రతికితి జీవచ్ఛ • వంబనగుచు.

ఈ పద్యమువలనఁ గృష్ణరాయలకుఁ గవియందుఁ గల గౌరవాదరములు దెలియ
రాయల యనంతర మీతఁడు బ్రతికియున్నట్లును గానవచ్చుచున్నది.

## కవిత్వము

వినినను, జదివినను మనసునకు వికాసముం బుట్టించు రామణీయకముగల రచనా
త్వము నాఁబడు. అది కవులపాలిసొమ్ము. విదగ్ధహృదయముల కది యమృతరసాం
కవుల హృదయములం దుద్దీపించు నా యా రసమువలనఁ దనంతనె యుప్పతిల్లి, 
తదీయప్రతిభావిలసనంబున మునింగి, మెఱుఁగెక్కి, విన్నాణంబగు తదీయరుచి
దోఁగి, మాధుర్యము నొంది, మకరందమువలెఁ దొరుగుచు, నతిహృద్యమై, రసికజ
యలరుచుండును. ఆ యా విషయములు స్ఫుటముగను, గాఢముగను మనస్సున నాటుకొ
నట్టు లా యా రసము లుప్పతిల్లి, కవితామృతలహరీమూలములై యుల్లసిల్లుచుండు.
కందు రసోల్లాసమునఁ గవిత్వము కందళించుట గలదు. అయిన నది గనిలో ర
కవులయందో యది సానఁబట్టిన రత్నమువలెఁ దీరి, మెఱుంగులు దుఱఁగలించుచు
సద్యఃకర్ణభూషణార్హముగా నొప్పుచుండు. కవిమనస్సు సూక్ష్మంబుల గ్రహించుట
పుణంబు; సారంబుల నాస్వాదించుటయం దతిచతురంబు; అతిలుబ్ధంబును సూక్ష్మగ్ర
గాన దానియం దే విషయముగాని యతిస్ఫుటముగను, నతిగాఢముగను స్ఫురించుచుం
జ్ఞమునైనది గాన దాని కే వస్తువునందేని సొంపులు గూర్చు విశేషములు చూపట్టుచుం
విశేషములనఁగాఁ దత్త్వశాస్త్రజ్ఞులును రసాయనకళావేత్తలు నా యా వస్తువులందు
విశేషములు గావు. తేఁటి పూవునందలి తేనియను గ్రోలునట్లు కవిమనంబు వస్తువునం
సారమును గ్రహించును. ఒకరి విశాలనేత్రములను జూచినపు డది యా కన్నుల రు
తత్త్వముల విచారింపక తామరరేకులవలె నున్న తదీయసౌందర్యవిశేషమునే
చుండును. అది భోగ్యసారమునే జుఱ్ఱునది. అట్టి సారమునుండి మకరందమువలెఁ
మానందైకప్రయోజనము. ఇట్లు విషయముల స్ఫూర్తివిశేషమునఁ గలుగు రసోల్లాస
భావము తనంతఁ బొడమి, ప్రతిభాచాతుర్యమువలన మనోహరాకృతిని బడసి, రచనా
ప్రకారంబై, లోకోత్తరచమత్కారకారి యగుచుండును. ద్రౌపది యపూర్వసౌంద
కీచకునికిఁ దోఁచినభావము—

సీ. ఇయ్యంతి ప్రాపున • నయ్యనంగుఁడు పార్వ, తీశునైనను దక్క • నేలకున్నె
యిన్నాతి చెలువంబు • కన్న శచీప్రియుం, డైనను గనుకలి • నవయకున్నె

యిత్తన్వి కేనలేమి ♦ కెదిరిపన్నిదము భా, సావిభుతో నైనఁ ♦ జరుపరాదె
యిత్తలోదరి జీవి ♦ తేఋన కిందిరా, పతి నైన మెచ్చక ♦ పలుకఁజనదె
కుసుమబాణు బాణంబులు ♦ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి ♦ కరువుగట్టి
పోసి విధి చేసి చైతన్య ♦ పుటముఁ దగ ఘటించెనో కాక యిట్టి చే ♦ డియలు గలదె ?

అను నిప్పద్యపాదములం దతిసుభగములై, ప్రతిభాతరంగితములైన భంగివిశేషముల రసోత్తరంగముగను, రసజ్ఞజన హృదయంగమముగను రచింపఁబడినది. ఇట్టి చెలువొందిన భావముల చమత్కారపటిమచే సహృదయహృదయంబులందు రత్యాది స్థాయిభావము లుదయించి, పయింబయిఁ బెంపుగాంచి, నిర్భరానందసంవిదనుభవరూపములగు శృంగారాదిరసములుగాఁ బరిణమించుచున్నవి.

కేవలదృష్టికి సామాన్యాకారమునఁ దోఁచు విషయములు కవితామృతరసమునఁ బ్రతిబింబించునపుడు వింతలై, యత్యంతరమణీయములుగా విడంబించుచుండును. మ్రాఁకునఁ బెనఁగొన్న యెలదీగయు, జవరాలిమోవి నంటిన యెలదేఁటియుఁ, జందురుని కరములు సోఁకిన కలువయు, సూర్యుని కిరణములు తాఁకిన విరిదమ్మియుఁ గవిత్వంపుమాయచే వింతలైన కాముకీ కాముకులై, యపూర్వశోభ గాంచి, శృంగారరస ముప్పొంగఁజేయుచుండును.

సీ. కటికి-చీఁకటి తిండి ♦ కరముల గిలిగింత, నెవ్వాఁడు తొగకన్నె ♦ నవ్వఁజేయు
... ... వేవెలుఁగులదొరజోడు ♦ రేవెలుంగు. (మనుచరిత్రము)

సీ. తేఁటికాటుకరేక ♦ నీటు మీఱగఁదీర్చి, మిసిమిగాఁ బుప్పొడి ♦ పసుపుఁ బూసి
... ... పద్మినీ, కాంత పతికన్న మున్న మే ♦ ల్కాంచియుండె.
(తారాశశాంకము)

ఇది యెల్ల యథార్థమా ? కాదు. కవితాదేవత పన్నిన యింద్రజాలము.

కవిత్వము తన శిల్పకౌశల్యము లన్నియుఁ బచరింపక కేవల మొక స్వభావమును మిక్కిలి తేటగాను, సూటిగాను నిరూపించు నెఱనీటుమాత్రముచేతను, మెత్తందనపుముద్దుచేతను, దద్దయు సాధారణములైనవానిని సయితము చెలువములు గావించి, చవు లొలికించుచుండును. ఆ తేటయందే తీయందనము మిటారించుచుండును. ఆ మెత్తఁదనమే యొక యందము.

చ. కడుఁ బసిబిడ్డ వీ వొకటి ♦ గా దవు నా నెఱుఁగండు ముంప రె
య్యెడ నొకపా టెఱుంగఁ డెవ ♦ యెంతయుఁ గోమల మెప్పు డైన నేఁ
గుడువఁగఁ బిల్తుఁ గాని తనకుం ♦ గల యాఁకటిప్రొద్దెఱుంగఁ డీ
కొడుకిటు వోకకున్ మనము ♦ గుందెడు; నీకుఁ గని యూఱడిల్లెదున్.

తే. ఎప్పు డెయ్యెడ నేమిట ♦ నెట్టులరయ, వలసె నమ్మోయి నారయు ♦ మలసి డస్సి
నొచ్చి యయినను నేమఱ ♦ కిచ్చ దలఁచి, తడమి నాచేత దీవన ♦ పడయుమమ్మ.
(భారత. విరాట. ౨ ఆశ్వా)

సీ. ప్రాలుపారఁగా బోరగిలి ♦ పాన్పునాల్గుమూ, లలకును వచ్చుచు ♦ మెలఁగి మెలఁగి
లలిఁ గపోలంబులు ♦ గిలిగిలింతలు వుచ్చి, నవ్వింపఁ గల కల ♦ నవ్వి నవ్వి
ముద్దులు దొలఁగిడ ♦ మ్రాఁకాలఁ గేలను, దడవుచు నెందును ♦ దాఁటి తాఁటి
నిలుచుండఁబెట్టి యం ♦ గుళియూఁత సూపఁగాఁ, బ్రీతిఁ దప్పడుగులు ♦ వెట్టి పెట్టి

తే. యన్నఁ గంటిఁ దండ్రిని గంటి • నయ్యఁ గంటి, నిందు రావయ్య విందులు • విందు లనుచు
నర్థిఁ దనుఁ బిలువఁగ నడ • యాడి యాడి, యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశ • వోత్సవముల.
(హరివంశము, పూర్వభాగము, ౫ ఆశ్వా)

ఇందలి పస కవిత్వంపు మిసిమియేకాని మఱేమియుఁ గాదు. అది ప్రతిపాద్యవస్తువునకుఁ బెట్టిన చికిలి సునుమెఱుంగు ; అది దానికిఁ బూసిన బంగరుమొలాము.

కవిత్వమున కిట్టి యపూర్వరంజకశక్తి యెట్లు కలిగె? కవుల కనన్యసామాన్యమగు భావనాశక్తివిశేష మొకటి గలదు. దాని మహిమచే వారియం దతివిలక్షణమై, యపూర్వచిత్రమైన యొక మానసప్రపంచము విలసిల్లుచుండు. అందలి వస్తువు లపూర్వమనోహరములును, నత్యాశ్చర్యములు నగు సౌందర్యవీర్యాదిగుణంబుల రాణించుచుండు. అందలి మృత్తిక యెల్ల బంగరుమయము. రా లన్నియు రత్నములు. దీపములు జీవమణులు. గందపురొంపి కలయంపి. ఆణిపాణి ముత్తియపు ముగ్గులు. అచటి కరులు 'మండి గాలిడి దంతతుండాగ్రహతిఁ జించి, జలధరాంభమ్మును జల్లులాడు.' అందలి వీరుల పరాక్రమోద్ధతికి 'ధరణీచక్రము దిర్గిరందిరుగు.' 'అర్ణవముల్ ఘూర్ణిలు'. 'గిరివర్గంబెల్ల నూటాడు'.

కవిప్రతిభాకల్పితమైన యిట్టి భావనాత్మకప్రపంచము లోకోత్తరచమత్కారకారియగు కావ్యసృష్టి యని మన యాలంకారికు లండ్రు. వస్తువేదిగాని కవిహృదయవీథిం జొచ్చెనేని, యది యందలి ప్రపంచములోని యనన్యాదృశశోభావిలసనములందు మునిఁగి, యపూర్వమనోజ్ఞముగాఁ బ్రకాశించుచుండును. చెలువలమోవియందలి తేనియలును, వారి పలుకులందలి పచ్చకపురమును నా ప్రపంచములోని యంగడిసరకులు. వారి తళతళలును, నిగనిగలును, జకచకలును గవిహృదయ ఫలకమం దా యపూర్వశక్తి దిద్ది, పూసిన వింతవన్నియల మెఱుఁగులు. ఇట్టి చెలువలే

ఉ. 'జంగమవల్లులో యమృత • సాగరవీచులొ రత్నమూర్తులో
యంగజు మోహనాస్త్రములొ • యంచితహేమశలాకలో మహీ
రంగనటత్తటిల్లతలొ • రాజకళాసఖులో......' (భాస్కరరామాయణము)

అనంబరఁగుదురు. ఇట్లు రసోద్దీపనమువలనఁ దనంతఁ దొరఁగి, ప్రతిభావికాసమువలనఁ బయింబయి మురువుగాఁ బెరిఁగి, భావనాశక్తివైలక్ష్యంబున వింతలగు చిన్నెలు వన్నెలు సూపుచు నిర్గమించిన కవిత్వధార సరళమై, స్వభావమధురమై, చిత్రమై మకరందఝరివలె జాలుగొనుచుండును. అది తనంతఁ దొరఁగినదగుటచే శ్రమంపడి చెఱిచి విఱిచి తెచ్చుకొన్న శబ్దములును, జప్పిడి సందుగొందులును జూపట్టవు. పయింబయిఁ బొంగి పొరలి వచ్చిన దగుటచే నెందును గుంటు గానిపింపదు. వింతవింతగాఁ బొలయుచుండుటచే నొక్కటే పాడిన పాటగా విసువుఁ బుట్టింపదు. కావున వట్టి పదాడంబరములును, వ్యర్థపూరణములును గనఁబడవు. అర్థము గ్రిక్కిఱిసి రసపారవశ్యమునఁ బయింబయి మురువుగా నురవడించుచుండగా నా యర్థంపుఁబెనుభారమును వహించునంతియ పరిమితిగల యల్పశకటములవలె శబ్దములు పరిచరించుచుండుంగాని యనవసరములైనవి యెల్ల వచ్చి ముసరుకొననేరవు.

ఉ. పెట్టనికోట నీకు హరి • భీముఁడు నర్జునుఁడున్ రణంబునం
దొట్టిన మంట లాకొలఁది • యోధులె సాత్యకియున్ విరాటుఁడుం
జుట్టపుమేరు వుగ్రరణ • శోభితుఁ డా ద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే? సురల • కైనను నొల్లవుగాక చివ్వకున్. (భార. ఉద్యోగ)

ొలుదొ ల్త నుదయాద్రి ♦ శిలఁ దాఁకి తీండ్రించు, నసిలోహమున వెచ్చ ♦ నయి జనించె
ంటి కొండవీ డెక్కి ♦ మార్కొని నలియైన, యల కసవాపాత్రు ♦ నంటి రాఁజె
ట సాఁగి జమ్మిలో ♦ యఁ బడి వేఁగి దహించెఁ, గోన బిట్టేర్చెఁ గొ ♦ట్టానఁ దగిలెఁ
నకగిరిస్ఫూర్తిఁ ♦ గరఁచె గౌతమిఁ గ్రాఁచె, నవుల నా పొట్నూర ♦ రవులుకొనియె
ాడెములు వ్రేల్చె నొడ్డాది ♦ మసి యొనర్చెఁ, గటకపురిఁ గాల్చె గజరాజు ♦ గలఁగిపఱవఁ
ఁక చిచ్చన నార యు ♦ ద్ధురతఁ గృష్ణ, రాయబాహుప్రతాపజా ♦ గ్రన్మహాగ్ని.

(మనుచరిత్రము)

ప్పద్యంబుల నొక్క వ్యర్థపదమేనియుఁ గానిపింపదు. అర్థసంపదయుఁ గ్రిక్కిఱిసి
యు సొంపులు నించుచున్నది. అర్థబాహుళ్యము గల యల్ప పదపరికరమే రచనాప్రౌఢికి
అర్థవ్యక్తి కతిమాత్రమైన పదచ్ఛటాపటలము కవితారమణికి రోగంపుబలుపువంటిదే
ందర్యపుష్టి గానేరదు. కొన్ని పదముల యొక సొగసైన పొందిక చేతనే యర్థములు కుప్ప
ేయుటయు, రెండొకపదముల సొబగైన యొక కులుకు చేతనే రసములు చిప్పిలఁజేయుటయుఁ
ల్పములు.

ు పరసీమ వలరాజు ♦ మేనమామ,
ేవెలుంగుల దొర జోడు ♦ రేవెలుంగు (మనుచరిత్రము)
్కతతిం బువుఁబోండ్లు దుటారికత్తియల్. (కళాపూర్ణోదయము)
క్షణముల్ జవరాండ్రచిత్తముల్. (మనుచరిత్రము)
ంగు లెల్ల నచ్చెద, వేసరకుఁడు మీరు లేక ♦ వేగునె మాకుం
ం జేయుఁడు బాలకుఁ, డాసురపుంబనులు నిజము ♦ లనియెదరు బలే.

(హరివంశము, పూర్వభాగము)

ందుఁ బరికరము స్వల్పము. అర్థము నిబిడము. మహాకవులు దీర్ఘసమాసమును, బదాటోప
క కొన్ని పదముల చేతనే రసము మిక్కిలియుఁ గూర్తురు.

డలుక వొడిమియును సు, స్థిరుఁడై తనయఱ్ఱుసెరల ♦ చెలువునఁ గెందా
ం దెగడెడు కన్నుల, నరుణచ్ఛవి నెఱయ నిట్టు ♦ లనియె నరేంద్రా.
యున్న బాము దలఁపవ, యీ యొడ లీచీర యిట్టి ♦ యేవపుఁజందం
యున్న మదనవికృతిం, జేయు ననుట యెంతయును ని ♦ షిద్ధము గాదే. (భారతము)
ాళ్లు వాడి యప్పుడు, వసంతసమయంపు టెండ ♦ వలనన్ నెఱి వోఁ
గందులు గందిన నవ, కుసుమలతికవోలె మిగులఁ ♦ గోమలి యొప్పెన్. (కళాపూర్ణోదయము)

ాచ్యాద్యర్థములలో వ్యంగ్యము మిక్కిలి హృదయంగమము. వ్యంగ్యప్రధానమగు ధ్వనియె
కావ్యముగదా! కాన వ్యంగ్యమె కవితాచమత్కృతికిఁ బరికరము. కవితాజీవాతు
అర్థవిభవమే కావ్యశోభాకరము. అర్థగాంభీర్యముతో మృదుమధురపదగుంభనమును
ో రసము వెల్లివిరిసిన దగును. ఇట్టి పదసందర్భములే 'శిరీషకుసుమపేశలసుధామయోక్తులు.'
ధురపదసందర్భమును రసోద్దీపకము.

ి చదలేటినీటికి, హాటకగర్భునిపథూటి ♦ కమరద్రువనీ
ికి మధుకైటభరిపు, వీటికి శ్రీపోలమంత్రి ♦ విశదయశంబుల్. (భీమఖండము)

క. వాలికలై వెలిదమ్ముల, పోలికలై చందమామ ♦ పులుఁగులకును దా
మేలికలైన నిరీక్షణ, మాలికల నృసింహుఁ జూచె ♦ మదవతి వేడ్కన్. (నరసభూపాలీయము)

క. జటివరుఁ డిటువలెఁ గనలుచుఁ, జిటజిట నిప్పుకలు సెదర ♦ జిగికనుఁగొనలం
దటతట కటతటు లదరఁగ, గిటగిటమన రదనపటలి ♦ గీఁటుచుఁ బలికెన్. (దశావతారచరిత్ర)

క. నాళీక మధూన్మత్త మ, రాళీముఖరాళి సుఖక ♦ రం బగు కొలనం
గేళీలాలసగతి డిగి, యాళీనివహంబు లోల ♦ లాడెడు వేళన్. (మనుచరిత్ర)

సామాన్యమైన యొక పదమే దానిని హవణించిన విన్నాణముచేతఁ బదసందర్భమునకును, నర్థసంపదకును మిక్కిలియు సొంపు గూర్చుచుండును. ఆ పదమును విడఁదీసి, మఱి యే పర్యాయము నుంచినను నా సారస్యము గుదురదు. అట్టియెడ నా పదంబును నర్థంబును నవినాభావమున రెండు నొక్కటియై, యర్థసౌభాగ్యగరిమకుఁ గారణమగును.

ఉ. నీ వలమూఁపులావు మును ♦ నేల వహించిన నాగకూర్మ గో
త్రావనిభృద్దిశాకరుల ♦ కారయ సూరటపట్టు గాదె సం
భావన భూజనంబులకుఁ ♦ బండువు గాదె మహోగ్రకోప రే
ఖావిభవంబు వైరులకు ♦ గాలము చేరువగాదె పావనీ. (భారత. విరాట)

'అచటఁ బుట్టిన చిగురుఁగొ♦మ్మైనఁ జేవ' (మనుచరిత్రము)
'పాఱవైచితె మిన్నులు ♦ పడ్డచోట' (మనుచరిత్రము)
'పద్మసంభవ వైకుంఠ ♦ భర్గసభలు, సాముగరిడీలు మాకు' (మనుచరిత్రము)
'ఎక్కడనుండి వచ్చెఁ దర♦శేక్షణకున్ నునుసిగ్గుదొంతరల్.' (విజయవిలాసము)
'నొసలిపై ముంగురుల్ ♦ మసలి ముద్దులు సూప' (విజయవిలాసము)
'తామరసనేత్ర లిండ్ల బం♦దాలు' (మనుచరిత్రము)

నాగరకత హెచ్చుకొలఁదిని రుచిసౌష్ఠవమును, రచనావైచిత్ర్యమును, గల్పనాప్రౌఢిమయుఁ బరిపక్వము లగుచుఁ గవితాంగనకుఁ గ్రొత్తసొంపులు నించుచుండును. రుచి, సంస్కారవశమునఁ బరిపక్వమై, కవిత్వపాకము నతిభోగ్యము గావించును. రచనావైచిత్రివలన శబ్దములును, విశేషించి యర్థములును, జమత్కారకరములగు విచిత్రప్రకారముల రచనము సేయఁబడుచుండు. ఇట్టి రచనా ప్రకారములు కావ్యలక్ష్మి నలంకరించునవిగాన యలంకారము లంద్రు. అవి శాబ్దంబులగు ననుప్రాసాదులును, ఆర్థంబులగు నుపమాదులు నగు. ఇట్లు—

సీ. పొసఁగ ముత్తెపుసరుల్ ♦ పోహళించినలీలఁ, దమలోన దొరయు శ ♦ బ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్య ల ♦ క్ష్య వ్యంగ్య భేదంబు, లెఱిఁగి నిర్దోషత ♦ నెసఁగఁ జేసి
రసభావములకు న ♦ ర్హంబుగ వైదర్భి, మొదలైన రీతు లి ♦ మ్ముగ నమర్చి
రీతుల కుచితంబు ♦ లై తనరారెడు, ప్రాణంబు లింపుగఁ ♦ బాదుకొల్పి

తే. యమర నుపమాదులును యమ ♦ కాదులు నగు, నట్టి యర్థశబ్దాలంక్రి ♦ యలు ఘటించి
కవితఁ జెప్పంగనేర్చు స ♦ త్కవి వరునకు, వాంఛితార్థంబు లొసఁగని ♦ వారు గలరె.

అను పూర్వోక్తలక్షణలక్షితంబై, రసంబు నుద్దీపింపఁజేయుచు రామణీయకవైభవవిలాసభాసమానంబై యొప్పు కవనంబునకు మించిన సిద్ధియు, నానందంబును గలుగదు.

ఈ సుకవిత్వలక్షణములం గొని, యీ ప్రబంధపుఁ గవనమును బరిశీలింపఁదగు. 'శిరీషకుసుమపేశలసుధామయోక్తు'లను నీ మృదుమధురగుంభనము తనచొప్పున నే యిందలి రచన యుండు నని నునుమట్టఁ జాటుచున్నది. మెచ్చులుగులుకు నీ పదసందర్భ ముత్తరప్రబంధ మాధుర్యగరిమకు మచ్చు. ఇది యెన్నిమాఱులు చదివినను దిరిసెనంపుఁబూవు లేర్చి తెచ్చి గ్రుచ్చినట్లు మృదువై సుధ లొలుకుచు నే యుండును గాని విసువుఁ బుట్టింపదు. 'నవరసార్థ, గుంభగంభీరతర వచోజృంభణముల' నను రచన శబ్దాలంకారకలితమై యున్నను, బ్రకృతపదగుంభన మంత మధురము గాదు; అంత మనోహరమును గానేరదు. పిదపఁ గృతిపతి తద్వంశావతారవర్ణనము కవి సేయుచున్నాఁడు. ఇది తిక్కన మొట్టమొదటఁ జూపిన మార్గమై రాజాశ్రయము గల శ్రీనాథాది కవులకు సంప్రదాయముగా వచ్చుచుండెను. ప్రాయికముగాఁ గవులు దీనిని మొదట సీసముచేతఁ బ్రారంభించి, దాని గీతమంతయు నించుమించుగ నొక దీర్ఘసమాసముగాఁ బదార్భటితో వీరరసోత్కటముగా రచియింతురు. ఇట్టి గీతమును—

'అతఁడు భూరిప్రతాప మ ♦ హాప్రదీప, దూరవిఘటిత గర్వాంధ ♦ కారవైరి
వీర కోటీరమణి ఘృణి♦వేష్టి తాంఘ్రి,తలుఁడు కేవల మర్త్యుఁడే ♦ ధర్మసుతుఁడు.(భార.విరా.)

అని తిక్కనయె రచించి చూపినాఁడు. దీనివలెనే—

'అతిశితకృపాణకృత్తమ ♦ త్తారివీర, మండలేశ సకుండల ♦ మకుటనూత్న
మస్తమాల్యపరంపరా ♦ మండనార్చి, తేశ్వరుం డగు నారసిం ♦ హేశ్వరుండు. (మనుచరిత్రము)

అని పెద్దనయు రచించినాఁడు. పిదపఁ బురాదివర్ణనముఁ గవి చేసినాఁడు. ఇందలి పురము భావనాశక్తి నైపుణ్యముచేఁ గట్టఁబడిన యపూర్వశిల్పములు గలది. కోట మిన్నుముట్టుచుండును. మేడల తెలిగచ్చుమెఱుఁగు చంద్రమండలము నచ్చదెలుపుగాఁ జేయుచుండును. ఇఁకఁ దక్కినవి చెప్పనేల! అది యొప్పిదముల కుప్ప. కావున నది 'మహీకంఠహారతరళము.' పిదప నందలి చతుర్వర్ణములను, వారాంగనాజనమును గొని, యం దొక్కొకటిని రెండొకమాటలతో నర్థచమత్కృతి గలుగునట్టు లతిచతురముగా వర్ణించి, పయిపెచ్చులకుఁ జొరక తక్కినవాని యతిశయమును 'అచటఁ బుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ' యని యొక్కపలుకులోఁ బ్రౌఢముగా సంగ్రహించినాఁడు. ఇఁక నట్టిపురంబునఁ బ్రకృతగ్రంథకథావతారమునకు మూలమగు ప్రథమపాత్రమును బెట్టుచున్నాఁడు. వాఁడు ప్రవరుఁడను బ్రాహ్మణుఁడు. వరూథిని 'యక్షతనయేందు జయంత వసంత కంతులం, జక్కఁదనంబునం గెలువఁజాలెడువాఁ' డని మెచ్చుకొనునట్టి 'మకరాంకశశాంక మనోజ్ఞమూర్తి'; 'అలేఖ్యతనూవిలాసుఁడు; ఆ లలన వలలకుం జిక్కని 'వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీక్షానిరతుఁడు'; 'అనారతాధ్యాపనతత్పరుండు.' ఇచట నుత్తరకథావిస్తృతికి బీజములగు ప్రవరుని సౌందర్యసంశ్రిత వ్రతిత్వములు గవి నిపుణముగా నుంచినాఁడు. కావుననే,

ఆ. వాని చక్కఁదనము ♦ వైరాగ్యమునఁజేసి కాంక్షసేయు జార ♦ కామినులకు
భోగబాహ్య మయ్యెఁ ♦ బూచినసంపెంగ, పొలుపు మధుకరాంగ ♦ నలకుఁబోలె.

అని వరూథినీయత్నవైయర్థ్యమునకు మొదటి హేతువగు ప్రవరు వైరాగ్యమును రూపించినాఁడు. ఈ పద్యమునడ యొకతీరైన హుటాహుటి గలిగి, హొయలు గులుకుచున్నది. ఇతని భార్య 'కూఁకటుల్ గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ.' ఇందలి జాతీయము మిక్కిలియు నర్థము సొంపు నిచ్చుచున్నది. సోమిదమ్మ 'సౌఖ్యావహయై' యనుటచే నితనివైరాగ్యము విషయభోగ వైముఖ్యము గాదుగాని యేకపత్నీవ్రతపర్యవసితమగు నిష్ఠాతిశయమే యగు. 'కూరిమి సోమిదమ్మ'

యనుటచేఁ బత్నీవిషయానురాగమును, 'దలిదండ్రులు దేవియుందేవరవోలె' ననుటచే మాతాపితృభక్త్యతిశయమును, 'సచ్ఛాత్రు' లనుటచే శిష్యవాత్సల్యమును నిందు బీజరూపమున నుంపఁబడినవి. ఇవియ పయింబయిఁ గథాప్రణాళిక కనుగుణముగా వెలివిరియింపఁబడును. ఆ యా స్వభావ విశేషంబులును, తత్తద్గుణవైచిత్ర్యంబులును, మహాకవుల హృదయఫలకములందు యథావస్థితముగాఁ బ్రతిఫలించుచుండు. ఇది వారి కుశాగ్రమతిమహత్త్వము కాన, సంకల్పించుకొన్న పాత్రమున కత్యంత నైజములగు గుణవిశేషము లభినయించి,తద్గుణబీజములతో మొదల నా పాత్రమును జిత్రించి, పిదప వాని నందంద వెలివిరియించుచు, నా పాత్రము పూర్ణాకృతిని రచించుట మహాకవికల్పనాశిల్పము. వారు తమ పాత్రములఁ దామై యభినయించి, తదీయస్వభావాదులఁ దామే యనుభవించుచు రచించుటచేఁ బాత్రములం దే ప్రకృతి కా ప్రవృత్తియు, నే గుణమున కా వ్యాపారమును, నే భావమున కా రసమును దమంతఁ దుదివఱకుఁ బొసఁగి యెసలారుచుండునుగాని యేపట్టున నసంగతి చూపట్టదు. ఇట్టి విశేషమే యియ్యెడను దెలియుచున్నది. ఇట్లు పాత్రస్వరూపమును నిరూపించి, పిదప సిద్ధుం డతిథియై రాకకు మూలమగు నతిథిసంతర్పణమునకు సాధనములుగాఁ బ్రవరుని పాఁడిపంటల పెంపును, దత్పత్ని యన్నదానగుణమును మృదుశైలిని వర్ణించి, సిద్ధాగమనమున కుపపత్తిఁ గుదురుపఱిచినాఁడు. పిదప హిమాచలమునకుఁ బోకకుఁ జిరకాలముగాఁ బెరుఁగుచున్న కారణ సంపత్తిని—

సీ. తీర్థసంవాసు లే ♦ తెంచినా రని విన్న, నెదురుగా నేఁగు ద ♦ వ్వైన నైన
నేఁగి తత్పదముల ♦ కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ, దెచ్చి సద్భక్తి నా ♦ తిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్నసం ♦ తృప్తులఁగా జేయుఁ, జేసి కూర్చున్నచోఁ ♦ జేరవచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు ♦ వనధిపర్వతసరి, త్తీర్థమాహాత్మ్యముల్ ♦ దెలియ నడుగు
తే. నడిగి యోజనపరిమాణ ♦ మరయు నరసి, పోవలయుఁ జూడ ననుచు నూ ♦ ర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శ ♦ నాభిలాష, మాత్మ నుప్పొంగ నత్తరు ♦ ణాగ్నిహోత్రి.

అని వర్ణించినాఁడు. ఇందులకు మార్కండేయ పురాణమున—

'అతిథిజనార్చనాభిరతుఁ ♦ డై చరియించుచు శైలకాననాం
చిత సకలావనీతల వి ♦ శేషము లెల్లను బ్రీతిఁ గన్గొనన్
మతిఁ గడుఁ గోరుచుండ'

అను మక్కయే మూలము. ఇది యింత రసోద్వేలముగా రచింపఁబడినది. ఇందుఁ గ్రియాపదముల యావృత్తి పద్యగమనికకు నొక హొయలు గూర్చుచు రస మొలికించుచున్నది. ఇదియే పదముల యొక సొబగైన కులుకు. సిద్ధుఁడు రాఁగా నతనికి వలయు పరిచర్యలు నడపి, తన్మహిమలు పొగడి, పిదపఁ దీర్థయాత్రాప్రశ్నమున కవతారికగా—

'మానినాథ! కుటుంబ జం ♦ బాలపటల, మగ్నమాదృశ గృహమేధి ♦ మండలంబు
నుద్ధరింపఁగ నౌషధ ♦ మొండు గలదె, యుష్మదంఘ్రిరజోలేశ ♦ మొకఁడుదక్క.

అని యడిగినాఁడు. ఇందలి వినయానుసంధానమును, భక్త్యతిశయమును, భాషాచమత్కృతియు మిక్కిలి హృదయాకర్షములు. సిద్ధుఁడును 'మావంటి తైర్థికావళికెల్లన్, మీవంటి గృహస్థుల సుఖ, జీవనమునఁగాదె తీర్థసేవయు' నని తీర్థసేవాప్రస్తావమునకుఁ దెఱపిచూపి, 'మాదృశ గృహమేధి' అని ప్రవరుండు నికృష్టముగాఁ జెప్పిన గార్హస్థ్యమును నిరతిశయమైనదని నానారూపణ వైచిత్ర్యమున నతిరమణీయముగా—

సీ. కెలఁకుల నున్న తం ♦ గేటిజున్ను గృహమేధి, యజమానుఁ డంకస్థి ♦ తార్థపేటి
పండిన పెరటి క ♦ ల్పకము వాస్తవ్యుండు, దొడ్డిఁ బెట్టిన వేల్పు ♦ గిడ్డికాఁపు
కడలేని యమృతంపు ♦ నడబావి సంసారి, సవిధమేరునగంబు ♦ భవనభర్త
మరుదేశపథమధ్య ♦ మప్రప కులపతి, యాఁకటి కొదవు స ♦ స్యము కుటుంబి
తే. బధిర పంగ్వంధ భిక్షుక ♦ బ్రహ్మచారి, జటి పరివ్రాజ కాతిథి ♦ క్షపణ కావ
ధూత కాపాలికాద్యనా ♦ థులకుఁ గాన, భూసురోత్తమ గార్హస్థ్య ♦ మునకు సరియె.

అని వర్ణించినాఁడు. ఈ తంగేటిజున్ను—

ఆ... ... పరమ మగు ప
దంబు తంగేటిజున్నుచం ♦ దంబు నొందు. (భార. శాంతి. ౪ ఆ.)

అని తిక్కన చెప్పినది. ఇందలి 'అంకస్థితార్థపేటి' 'పండిన పెరటికల్పకము' మొదలైనవి **పండితులు** మిక్కిలి వాడుకొను నుడులు. పిదప 'తైర్థికావళి' 'తీర్థసేవ' యను సిద్ధునిమాటలూఁతగాఁ బ్రవరుఁడు తీర్థయాత్రాప్రసంగమును దెచ్చి, 'పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థమహిమ వినుటయు నఖిలకల్మషహరంబ, కాన వేఁడెద' నని యనునయోక్తిఁ జాతుర్యధుర్యముగాఁ బ్రార్థించుటయు, సిద్ధుండు నన్నిదేశంబుల నయ్యై యద్భుతంబుల 'నీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునఁ గనుఁగొంటి' ననియె. ప్రవరుం డది కల్లగాఁ దలఁచి, దానిచే వెలికిఁ గొంత పిక్కటిల్లిన వెడనవ్వును జెక్కులలోఁ గాఁచినవాఁ (ఈషదంకురిత హసనగ్రసిష్ణుగండ యుగళుం) డయ్యె. ఈ సమాసంపు నర్థ సారస్యమునకు 'గ్రసిష్ణు' శబ్దము జీవము. అవిశ్వాసముతో నడుగుట దోషము. వింతపాటో యడుగకుండనీయదు. అవిశ్వాసంపుఁ గటుత్వమునకు భక్తిరసము నుత్కటంపుఁదీపిని జేర్చుటకై తద్రసవ్యంజకముగా 'వెఱవక' యని జెప్పినాఁడు.

'వెఱవక మీ కొనర్తు నొక ♦ విన్నప మిట్టివి యెల్లఁ జూచి రా
నెఱకలు గట్టుకొన్న మఱి ♦ యేండ్లును బూండ్లును బట్టుఁ బ్రాయపుం
జెఱుతతనంబు మీమొగము ♦ చెప్పక చెప్పెడు నద్దిరయ్య! మా
కెఱుఁగఁదరంబె మీ మహిమ ♦ లీర యెఱుంగుదు రేమి సెప్పుదున్.

భక్తిచే వెఱపు పుట్టినది; అయినను 'వెఱవక' యడిగెద నని యాకూతము. 'వెఱవక' యొనర్చినది ప్రశ్నము గాదు; 'విన్నపము'. ఈ పద మవిశ్వాససంగతిచే నయిన భక్తిరసంపుఁ గసటును 'ఓషధీశు గరళ సౌందర్యాత్తకరసుధాకటుకత్వము నుడుపుతేనె' వోలె నుడుపుచున్నది. అవిశ్వాసముచేఁ జేయు ప్రశ్నము గాదు; జిజ్ఞాసచేఁ జేయు విజ్ఞాపన మని భావము. ఈ విన్నపమును గౌణముగాను, భావగర్భముగాను 'ఇట్టివి యెల్లఁ జూచి రా నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టు' ననియు, 'ప్రాయపుంజెఱుతతనంబు మీమొగము చెప్పక చెప్పెడు' ననియు రెండు వాక్యములఁ బచరించి, యా రెంటికి నిగమమును జెప్పక యూహనీయముగాఁ దేల్చినాఁడు. ఇప్పలుకుపొందిక యందును నవినయగంధము నాశంకించి, యది వాయుటకై యవియెల్లఁ దన్మహిమలుగాఁ జెప్పి యబ్బురపడినాఁడు. సిద్ధుండును దాను మున్ను చెప్పిన 'యీశ్వరసత్కృప'చేఁ గలుగు పాదలేపము మహిమను జెప్పఁగాఁ బ్రవరుండు విని—

......................' మీ దివ్యప్రభావం బెఱుం
గని నాప్రల్లదముల్ సహించి మునిలో ♦ కగ్రామణీ సత్కృపన్
నను మీ శిష్యునిఁ దీర్థయాత్రవలనన్ ♦ ధన్యాత్ముఁగాఁ జేయరే.

అని వినయోద్వేలంబగు శైలిని వేఁడి, దానిం బూయించుకొని, 'తుహినభూధరశృంగ శ్యామల కోమలకానన హేమాఢ్యదరీఝరీసిరీక్షాపేక్షం' బోయెను. కవి, బిందువులుగాఁ బడు చున్న యమృతము నోక్కుమ్మడిగాఁ గుమ్మరించినట్లు లీ నిడుదసమాసంపుధాటిని గడపట దీటు కొలిపినాఁడు. ఈ సిద్ధప్రవరసంవాదమున భక్తికరుణారసోల్లసితములగు రచన లతిప్రౌఢములును, స్వభావోక్తిలలితములు నగును. ప్రవరుని వినయోచిత పరిభాషావైదుష్యమును, గరుణారసోద్దీపక మగు సూక్తినైపుణ్యమును నగణ్యములు. ఇవియ వాని 'భాషాపరశేషభోగి'త్వమును బట్టి యిచ్చు చున్నవి. సిద్ధుని గార్హస్థ్యవర్ణనమును హృదయంగమము.

ఆ ప్రవరుఁడు పోయి యందలి వేడుకలం జూచుటయు, స్థలమహిమలం బొగడుటయు నతిచిత్రముగాను, నాశ్చర్యరసపరిప్లుతముగాను వర్ణింపఁబడినవి. అందు మృదుమధురములైన దీర్ఘ సమాసములును, ముద్దుమురిపములు గులుకు నచ్చతెనుంగుపదములును, మంచి స్వభావోక్తులును నెరసి జెరసియున్నవి. ఇందు 'నడ్డంబునిడుపునాఁబడ్డలగతి మనుఁబిల్లి డొంకలనుండి క్రేళ్లుదాఁటు'టఁ జదువునపు డవి ముందట దాఁటుచున్నట్లే యుండును. 'పరిపరివిధంపు జన్నంపుఁ బరికరంపు సొంపు సంపద' యని వినినంతనే యా పరికరము లెదుట సమకట్టినట్లే తోఁచును. 'నళినీబాంధవ భానుతప్త రవికాంతస్యందినీహారకం, దళచూత్కారపరంపర' లనునప్పుడే యా చూత్కారములు వినఁబడుచుండును. 'నిఖిల నిలింపసభయు నప్పటప్పటికిని జిహ్వాత్రుప్పు డుల్ల నామెత నెఱింగె' ననుమాట కేవలయజ్వనోటనుండియే వచ్చునది.

ఇట్లు కుతూహలములతోఁ బోఁగా మంచు దగిలి, పాదలేపము కరఁగిపోయె. దానిచేఁ బ్రవరునికిఁ గలిగిన శోకరసమును గవి మిక్కిలి స్వభావానుగుణముగా వర్ణించి, ప్రవరునియం దారోపించిన గుణబీజముల నిచట వెలివిరియించుచున్నాఁడు—

సీ. నను నిముసంబు గా♦నక యున్న నూరెల్ల, నరయు మజ్జనకుఁ డెం♦తడలునొక్కొ
యెపుడు సంధ్యలయందు♦ నిలు వెళ్లనీక న, న్నోమెడుతల్లి యెం♦తొరలు నొక్కొ
యనుకూలవతి నాదు♦ మనసులో వర్తించు, కులకాంత మది నెంతఁ♦ గుందునొక్కొ
గడతోడునీడలై♦ క్రీడించు సచ్ఛాత్రు, లింతకు నెంతఁ జిం♦తింతురొక్కొ
తే. యతిథి సంతర్పణంబు లే♦మయ్యె నొక్కొ, యగ్ను లేమయ్యె నొక్కొ ని♦త్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ♦ కినుక నిట్లు, పాఱువైచితె మిన్నులు♦ పడ్డచోట.

మం దా శ్రోత్రియు నెట్టి గుణములతో నెట్టి కృత్యములతోఁ గవి చిత్రించెనో యవియే యిందును వెలయింపఁబడినవి. 'దేవియుం దేవరవోలె నుండు' తలిదండ్రులవలని గురుత్వమును 'గూరిమి సోమిదమ్మ' వలని వలపును, 'దోడునీడలై' వర్తించు శిష్యులవలని వాత్సల్యమును, బ్రవరు నింటికిఁ దెచ్చిన 'యతిథి సంతర్పణవ్రతమును' 'దరుణాగ్నిహోత్రి' వేలుచు నగ్నులునే యిచటం జూపట్టునవి. రసపారవశ్యము మర్మములను దాఁపదు. ఆ శ్రోత్రియుని హృదయమునుండి యింత కంటె శోకరస మేమి వెలిపుచ్చఁగలదు ? 'దైవంబ కినుక నిట్లు, పాఱువైచితె మిన్నులు పడ్డ చోట' ననునది శోకరస ప్రవాహము. ఇట్లు 'చింతాసాగరమున మునిఁగి భయంబు గదురఁ బోవుచుండఁగా—

సీ. కులిశధారాహతి♦ పొలుపునఁ బైనుండి, యడుగు మోవఁగ జేగు♦రైన తటులఁ
గనుపట్టులోయ గం♦గానిర్ఝరము వాఱఁ, జలువయౌ నయ్యేటి♦ కెలఁకులందు

నిసుకపెట్టిన నేల ♦ నేచి యర్కాంశులఁ, జొరనీక దట్టమై ♦ యిరులు గవియు
క్రముక పున్నాగ నా ♦ రంగ రంభా నాళి, కేళాది విటపికాం ♦ తారవీథిఁ
తే. గెరలు పికశారికాకీర ♦ కేకిభృంగ, సారసధ్వనిఁ దనలోని ♦ చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గం ♦ ధర్వయక్ష, గానఘూర్ణిత మగు నొక్క ♦ కోనఁ గనియె.

ఒక కోన గనుపట్టె. ఇది కవికల్పితము. కల్పనాపటిమయు, భావనాసౌభాగ్యమును జేరి, నిర్మించి, దీనికి నిసర్గసిద్ధములైన యపూర్వమనోజ్ఞతలనెల్లఁ గూర్చినవి. కవి యీ కోనయం దొక లోయ(చీలిక)ను గల్పించి, యందు గంగానిర్ఝరమును బ్రవహింపఁజేసినాఁడు. ఆ లోయ చూడ్కికి వేడ్కగా నుండుటకై దాని రెండుప్రక్కలను బయినుండి యడుగువరకు నెఱుపు గావించినాఁడు. ఇట్టి ప్రదేశము, వృక్షవాటి యొకటి లేనిచో సొంపు నింపదు. అవి గోముగాఁ బెరుఁగుటకు గంగనీటి చలువ యున్నది. దట్టముగా మొలచుటకు నిసుకనేల గావలయును. కాన ఆ యేటియొడ్డుల 'నిసుకపెట్టిననేల'యు, నందుఁ బోఁకలు, పొన్నలు మొదలగు మ్రాఁకుల తోఁపులును గలిగినవి. ఇంకఁ దక్కిన సొంపులు కలవా? శుకశారికాదులు కెరలి, కలధ్వనులు సేయుచున్నవి. వాని ప్రతిశబ్దములు చంద్రకాంతపు గుహలనుండి శ్రావ్యముగా వీతెంచుచున్నవి. ఇంతియ కాదు. గంధర్వ, యక్షగానమును గర్ణపర్వముగా వినఁబడుచున్నది. ఇట్టిది యెట్టివారికిని రామణీయకంపు సొంపులు నింపదే! దీనిం జూచియే రామరాజభూషణుఁడు వసుచరిత్రమునందు—

సీ. రేలెల్ల నమృతమ ♦ రీచినంటున నంటఁ, గరఁగి నిర్మలపయో ♦ ఝరుల దొరఁగి
బలువిడి పెనులోయఁ ♦ బడిన క్రొన్నెలతాల, చరులలో నిరుగడఁ ♦ దఱచు మెఱచు
పటికంపుఁబణతుల ♦ పజ్జ గొజ్జఁగనీటి, యేటిక్రేవలఁ జలి ♦ యిసుక వెట్టు
నేడాకుటనఁటుల ♦ నెలమావిగుమురుల, సురపొన్నకూటాలఁ ♦ జుట్టుకొనిన
తే. బండిగురివెందతీగె ల ♦ ప్పరము లెనసి, ముడిగొనిన ద్రాక్షపందిళ్ల ♦ నడుమఁ గిన్న
రీనినాదానుకారి శా ♦ రీశుకాది, ఘోషఘుమఘుమితం బైన ♦ కోనఁ గనియె.

అని యొక కోన మనోహరముగా రచించినాఁడు. ఇందు శిల్పాడంబర మెక్కుడు; కాని యిది పెద్దన కోనవలె నంత స్వాభావరమణీయము కాదు. అట్టి కోనఁ జూచి, యందు గంధర్వయక్షగానము వినియు, ఛాందసమున కనుగుణముగా నది యొక 'మునియాశ్రమ' మనియే తలఁచి పోవఁ జూచె. దిగుటకు నూఁత యెట్లు? ఇచటఁ గల్పనకు మఱియుఁ బని గుదిరినది.

చ. నికటమహీధరాగ్రతట ♦ నిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలక ♦ లై దిగు కాలువవెంటఁ బూచు మ
ల్లిక లవలంబనంబుగ న ♦ లిప్రకరధ్వని చిమ్మిరేఁగ లో
నికి మణిపట్టభంగసర ♦ ణిం ధరణీసురుఁ డేఁగి చెంగటన్.

దాపున కొండకొమ్మునుండి యొక సెలయేఱు పాఱుచున్నది. దానినుండి యొక కాలువ చీలి, లోయలోనికిఁ దలక్రిందుగా నిటునటు వంపులు దిరిగి ప్రవహించుచున్నది. ఆ కాలువవెంబడిని మల్లెతీగలు మొలచి బూచియున్నవి. వానిం బట్టుకొని, కోనలోనికి దిగినాఁడు. అందలి 'మణిపట్టభంగసరణి' యది మునియాశ్రమము గాదనుటకు సూచకము. ఆ మెట్లవరుసను గోనలోనికి దిగి, యం దొక చెంగలువమడియోరగా మామిళ్లు, క్రోవిచెట్లు దట్టముగాఁ బెనఁచుకొని, నీడలు గ్రమ్ముచున్న యొక వనముఁ గాంచె. అచటఁ జంద్రకాంతపురాళ్లపందిరియందు నల్లుకొని, పండ్లగుత్తులు వ్రేలుచున్న

ద్రాక్షతీగలును, బూఁదీగలును నావరించియున్న యొక మందిరము గలదు. వసుచరిత్రములోని 'ముడిగొన్న ద్రాక్షపందిళ్లును, జెంగలువయోరిక'లును సిందుండి కొనిపోయి నాటిన యంట్లవలనఁ జెరిఁగినవే. ఆ మందిరము గరుడపచ్చలు దాపినది. దానిని జూచి, యచ్చెరుపడుచుఁ జేరఁబోఁగా-

క. 'మృగమదసౌరభవిభవ, ద్విగుణితఘనసారసాంద్ర ♦ వీటీగంధ
స్థగితేతరపరిమళమై, మగువపాలుపుఁదెలుపు నొక్క ♦ మారుత మొలసెన్.'

ఆ మారుత మొలయుటయే కాదు. తదీయ 'పరంపరాపరిమళవ్యాపారలీల'యుఁ గలిగినది. అట్టి మారుత మట్లు పొలసియు, నా శ్రోత్రియుఁ డప్పటి భయాతిశయముననో, శాంతరసంపు గ్రుడ్డితనముననో స్త్రీ లున్నారని స్ఫుటముగాఁ గనుఁగొనక యెవరో జను లున్నారని యెన్ని 'జనాన్విత' మన్నాఁడు. ఇదియె వాని కప్పటికిఁ దగినది. మహాకవివర్ణనములం జూపట్టు సర్వ భావానుగుణ్య మిదియ. ఇట్లు చేరఁబోయి—

మ. ... ... ... విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం ♦ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరు ♦ న్నారీశిరోరత్నమున్.

కాంచినాఁడు. ఇదియ ప్రథమ నాయికాపాత్రము. దీనిం జూచియే రామరాజ భూషణుఁడు—

చ. తరువులపొంతఁ బొంచి వసు ♦ ధావరమిత్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ దమోవినీలకచఁ ♦ దామరసోదర సాదరప్రభం
దరళవిలోచనం దతని ♦ తంబఁ దటిన్నిభగాత్రవల్లరిం
దరుణశశాంకఫాల నొక ♦ తన్విఁ దరంగవళిం దలోదరిన్.

అని తన కథానాయికను వర్ణించినాఁడు.

ఆ తరుణియు దేవకాంత. అందును వేశ్య. అది తన యింటి తియ్యమామిడిగున్నక్రింది యరుఁగుపైఁ గూర్చుండి—

సీ. తతనితంబాభోగ ♦ ధవళాంశుకములోని, యంగదట్టపుఁగావి ♦ రంగువలన
శశికాంతమణిపీఠి ♦ జాజువాఱఁగఁ గాయ, లుత్తుంగ కుచపాళి ♦ నత్తమిల్లఁ
దరుణాంగుళీధూత ♦ తంత్రీస్వనంబుతో, జిలిబిలిపాట ము ♦ ద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి ♦ యరమోడ్పుఁగనుదోయి, రతిపారవశ్య వి ♦ భ్రమముఁ దెలుపఁ
తే. బ్రౌఢిఁ బలికించు గీత ప్ర ♦ బంధములకుఁ, గ్రమకరపంకరుహరత్న ♦ కటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమా ♦ నములు గొలుప, నింపుదళుకొత్త వీణ వా ♦ యింపుచుండె.

ఇట్టి వీణియసే వసుచరిత్రకారుఁడు గిరికచేతఁ బెట్టినాఁడు. ఇందు వేశ్యాసముచితమగు వేషవైఖరిని గవి రచించినాఁడు. వస్త్రము కావిపావడ. దాని కావిరంగు పయి నలమియున్న పయిఁటగుండ శశికాంతమణిపీఠిని జాజువాఱఁజేసిన దనుటచే నా పయంట జిలుఁగు రవసెల్లా గావలయు. పయఁట యలముకొని యుండుటను జెప్పుటతోఁ బిఱుఁదుల వైశాల్యమును, కాయ లత్తమిల్లుటను జెప్పుటతోఁ గుచముల యౌన్నత్యమును సరసముగాఁ గూర్చినాఁడు. అనఁగాఁ బిఱుఁదుల విశాలత్వము 'తత' శబ్దముచే స్ఫురించుటకంటె ధవళాంశుక మలమికొనుటచే మఱింత మనోహరముగాను, గుచముల యున్నతత్వ 'ముత్తుంగ' శబ్దముచే స్ఫురించుటకంటెఁ గాయ లత్త మిల్లుటచే మఱింత మోహాకరముగాను స్ఫురించుచున్నవి. అవయవములకు విశేషములు గూర్చు పస

యా యా ప్రసక్తి విశేషములచే మఱింత పుష్టినొంది, సౌందర్యసమష్టిని మిక్కిలియు హెచ్చించుచున్నది. ఇదియ మహాకవుల వర్ణనాచమత్కృతి మర్మము. ఇట్లుగాక కేశమున కొకటి, కుచమున కొకటిగా శివ మెత్తినట్లు పద్యము లల్లి, రసమొలికించుట యీవల కవనసంప్రదాయమై యున్నది. అవయవము లన్నిటిని నొక్కొక్కటిగా వేఱువేఱ వర్ణించుటచే సౌందర్య మంతగా స్ఫురింపదు. అప్పటికి వన్నెగూర్చు నయ్యయ్యవయవముల వర్ణించి, యాకారమును జిత్రించుటచేఁ దదీయసౌందర్య మంతయు నొక్కుమ్మడిని స్ఫురించును. పిదపఁ బ్రసక్తివశమున నా యా యవయవముల వర్ణనలచే నా సౌందర్య మతిశయించుచు వచ్చును. ఈ రీతియ యిప్పద్యమునను జూపట్టుచున్నది. తతనితంబములును, నుత్తుంగకుచములును జెప్పి, కావి యంగదట్టముపై ధవళాంశుకమును జుట్టి, బిలిబిలిపాట ముద్దులును, గనుదోయి యరమోడ్పును, గ్రమకర పంకరుహ రత్నకటకఝుణఝుణ ధ్వనిస్ఫూర్తిని బచరించి, యా వేశ్యయాకృతి కపూర్వసౌందర్యస్ఫూర్తిని గూర్చినాఁడు. మీఁదఁ గన్నులు మొదలగువాని నయ్యై ప్రసక్తుల వర్ణించుచు, దాని నద్భుతమోహనముఁ గావించినాఁడు. పిదప—

ఉ. అబ్బురపాటుతోడ నయ ♦ నాంబుజముల్ వికసింపఁ గాంతిపె
ల్లుబ్బ కనీనికల్ వికసి ♦ తోత్పలపంక్తులు గుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁజన్గవ గ ♦ గుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నల ♦ కూబరసన్నిభు నద్ధరామరున్.

ఇది వరూథినీ ప్రథమదర్శనము. నాయిక యబ్బురపాటుచేఁ గనుఁదమ్ములు మిక్కిలి విచ్చి చూచె. అట్లు చూచునపుడు కనీనికల కాంతులు వెల్లిగొని, నల్లగలువలచాలువలె నిగిడె. సుందరాకృతిని జూచుటవలనఁ గామము పొటకరించుటచే 'గుబ్బచనుఁగవ' గగురుపొడిచె. ఇఁక మరుఁడూరకుండునా? కోరికలు పయిఁబయి గుబ్బటిల్లె. ధరామరునిపయి నింత వలపేల? వాఁడు నలకూబరసన్నిభుఁడుగదా! పిదప—

ఉ. చూచి ఝుళంఝుళత్కటక ♦ సూచితవేగ పదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము ♦ లేనడుము మల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్క పోఁక నును ♦ బోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపద ♦ వీకలశాంబుధి వెల్లిగొల్పుచున్.

నూత్న పురుషదర్శనమున స్త్రీసామాన్యమునకు స్వాభావికమగు లజ్జ విడువదు. వేశ్యయయ్యు మొట్టమొదటనే లజ్జ వీడుట రసహీనము. లజ్జాత్యాగమునకు వలయు రసపారవశ్యమింకను బరిపక్వము కాలేదు. కాన చూచినంతనే లేచి, పూచిన పోఁకబోదియమాటునఁ జేరె. ఇచ్చట విచ్చలవిడిగాఁ దేఱిచూడవచ్చును. కాన 'విలోకనప్రభావీచికలం దదీయపదవీకలశాంబుధిని వెల్లిగొలిపినది.' 'చెలువగువానిఁ గన్గొనిన చెల్వకుఁ జూపుల కావె కూటముల్' అను వచనమపార్థకమా? ఈ పూర్వపద్యములు రెంటను గన్నులును, జూడ్కులును, గుచములు, నడుమును బెడఁగుగాఁ బ్రసక్తివశమున రూపింపఁబడి యాకారమును నిరతిశయమనోహరముం గావించినది. మఱియు—

మ. మునుమున్ పుట్టెడు కొంకు లౌల్యము నిడన్ ♦ మోదంబు విస్తీర్ణతం
జొనుపం గోర్కులు గ్రేళ్లుద్రిప్ప మదిమె ♦ చ్చుల్ ఱెప్ప లల్లార్పన
త్యనుషంగస్థితి ఱిచ్చపా టొసఁగ నొ ♦ య్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫు ♦ ల్లసన్నేత్రపద్మంబులన్.

ఇందుఁ బ్రవరునిఁ దొలుత దర్శించినది మొదలుగా నాయిక కనుపమ్ము లయ్యె కారణములచే దశావిశేషములు పొందుచుఁ, బరిపూర్ణ వికాసమును జెందుచువచ్చుట నత్యంత నైజముగాను, రసభాజనముగాను బదమాధురితోఁ గవి రచించినాఁడు. ఇట్లు గన్నులు నెఱయవిచ్చుచు, నాతని పూర్ణసౌందర్యమును మఱిమఱి చూడఁగా మదనాగ్ని వ్యాపించి, మున్ను 'గుబ్బమెఱుంగుఁజన్గవ' యందుమాత్రము గలిగిన పులక లిపుడు మైనెల్ల నంకురితములయ్యె. వీనిని 'ఆవిష్కృత మీనాంకానలసూచక ధూమాంకురము' లనుట ఎంతయుఁ బ్రౌఢము. ఆ విప్రకుమారుని సౌందర్యామృత మెంత గ్రోలినను దనివినొందక కన్నుఁగవ 'తొంగలిఱెప్పలం దొలఁగఁద్రోయుచుఁ బైపయి విస్తరిల్లుచుండె.' దానిం జూడఁగా నది 'యాక్రమించుకొనునో ముఖచంద్రు నటంచుఁ' దోఁచె. అనఁగా మొగమెల్లఁ గన్నులే యగునేమోయని శంక పుట్టె. ఎవరి కీ శంక ? కవిసృష్టిలోని శృంగార రసాధిదేవత యగు నంగజునికే ! తన విజయధ్వజమగు ముఖచంద్రుని చేటునకుఁ దా నోర్చునా ? కనుక వాఁడు లేఁజెమటచేఁ గరఁగిన కస్తురిబొట్టును గొని, లలాటమునుండి చెక్కుల వఱకు గుఱి వ్రాసి, యా గుఱిని గన్నులు దాఁటకుండున ట్లానవెట్టినాఁడఁట ! కన్నులు మీఁదు మిక్కిలి విచ్చుచు, వానిని జూడంజూడఁగా మన్మథతాపాగ్ని మిక్కిలి యతిశయించుటవలన లలాటమునఁ లేఁజెమట గ్రమ్మి, కస్తురిబొట్టును గరఁగింపఁగా నది గీఱగాఁ జెక్కులవఱకు స్రవించె నని భావము. ఇది యొకఁడు మఱొకని నాక్రమించుటలు, ఇంకొకఁ డాన పెట్టుటలు, గుఱి వ్రాయుటలు నని యొక వింతకత యయ్యె. ఆ ! కావ్యసృష్టివైచిత్ర్యము ! ఇట్లు కాంత వాని 'రూపరేఖావిలాసంబులకుం జొక్కి' చేయు వర్ణనము కర్ణామృతము. అందు—

తే. 'నేరెటేటియసల్ దెచ్చి ♦ నీరజాప్తు, సానఁబట్టిన రాపాడి ♦ చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో ♦ పద్మభవుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీ ♦ మేనికాంతి.

అని మేనికాంతికి నిష్పత్తి నుత్ప్రేక్షించినాఁడు. ఇది భావనాశక్తి పన్నిన యపూర్వ శిల్పము. ఈ మేలుబంతిని జూచియే రామరాజభూషణుఁడు—

తే. మేటి జమ్మేటియసటఁ గ్రొ ♦ మ్మించు మించుఁ
బోదివి మదనప్రతాపాగ్నిఁ ♦ బుటము వెట్టి
తమ్మిగద్దియ దాకట ♦ గ్రెమ్మి యట్టి
కొమ్మ గావింపఁబోలు నె ♦ త్తమ్మిమాలి.

అని తన నాయికను దిద్దినాఁడు. ఇట్లు—

మ. 'అని చింతించుచు మీనకేతనధను ♦ ర్జ్యాయుక్తనారాచ దు
ర్దినసమ్మూర్ఛిత మానసాంబురుహయై ♦ దీపించు పెంపత్తఱిం
బునఁ జేపెత్తిన లజ్జ నంఘ్రికటకం ♦ బుల్ మ్రోయ సడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁ జని ప ♦ ల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై.'

ఇందు 'మీనకేతన...దుర్దినసమ్మూర్ఛితమానసాంబురుహ' యనుచో 'దుర్దిన' శబ్ద మర్థ నిబిడము. మనస్సు మూర్ఛనొందఁగాఁ జెంద త్తరము గలిగె. తత్తరము మీఱఁగా లజ్జ పేపెత్తె; అనఁగాఁ జేటులవలె వీడియు వీడక యుండె. మున్ను లజ్జ పాటమరించినపుడు పోఁకమాటునకుఁ బోయినది. ఇపుడు లజ్జ పేపెత్తఁగా - అనఁగాఁ గొంత వీడుటచే, సడ్డంబు నిల్చినది. ఇంక నది పూర్ణముగా వీడలేదు. అంతటి రసపారవశ్యము నుంచుకొన్నయెడ నిపుడే 'ప్రాంచదుద్భావణ

బాహుమూలరుచితో' పయింబడదా ? కాలి యందియలు గల్లుగల్లుమని మొరయ నది యడ్డంబు నిలువగాఁ బ్రవరుఁడును 'జేరఁజని'యె. శృంగారరస మున్పొంగియా ? కాదు. విభ్రాంతుఁడై. దాని సౌందర్యాతిశయమునకా యీ విభ్రాంతి ? కాదు కాదు. కావని క్రింది పద్యమే ఘోషించుచున్నది—

ఉ. ఎవ్వతె వీవు భీత హరి ♦ ణేక్షణ యొంటి చరించె దోట లే
కివ్వనభూమి; భూసురుఁడ ♦ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమున ♦ కుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగద ♦ వే తెరు వెద్ది ? శుభంబు నీ కగున్.

ఎవరు ? ఎక్కడ ? అని రెండో ప్రశ్నలు; పుట్టు విది పే రది, తప్పి వచ్చితి నని చరిత్రపు ముక్కలు రెండు; పురమునకుఁ దెరువెద్ది యని దీనప్రార్థన మొకటి; 'శుభంబు నీకగున్' అని యాశీర్వాదము. ఇదియ వారిద్దఱ ప్రథమసంభాషణము. తప్పి వచ్చిన శ్రోత్రియునికి శృంగారనాయికతో నింతకన్న నెక్కుడు మాట లేమి వచ్చు? శృంగారరస మిందొకబొట్టును గానరాదు. 'అనుకూలవతి నాదు మనసులో వర్తించు కులకాంత మది నెంతఁగుందునోక్కొ' యన్నవాఁడు శృంగారరసానభిజ్ఞుఁడు గాఁడు. అయినను వాఁడు కేవలశాంతరసమగ్నుఁడు. వాని శాంతరసమునకు శృంగారరసము గులాము. అది దానిని సూరిమిసోమిదమ్మకడనే పచరించును. వరూథినికో పట్టి తెలికపిండియే. ఇఁక మఱి యెవ్వతెకును 'మధుకరాంగనలకుఁ బూచిన సంపెంగపోలు' పనుట యిట మున్నాటికి సత్యమైనది. శృంగారరస ముద్రేకించుచున్న నాయికకు నీ చప్పిడి దీనత్వములును, ఛాందసపు దీవెనయును రుచించునా ? ఇఁక వాని కా రసమును గలిగింపవలసిన పని వరూథినిది. వరూథినియందో యా రసమునకుఁ గొఱఁతలేదు. అపుడు దానికిఁ గనుఁగవ మెఱుఁగు లుబ్బె. తాటంకములును, జనుఁగవయు, నడుమును వడఁకె. ఇచటఁ గన్నుఁగవను, జన్నుఁగవను వర్ణింపక యూరక వచించినను నిప్పటి ప్రసంగపుసోయగమే వానికిని జోకఁగా నవి యతిసుందరములుగాఁ బిసాళించుచున్నవి. ఇట్లు శృంగారరసము కలుగునట్లు కాయికములగు నొయ్యారిచిన్నెలు నెఱపినది. అది చిప్పలునట్లు సెలవివాఱ నవ్వను నవ్వినది. ఇఁక వాచికము లగు వగలు చూపవలదా ?

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు ♦ వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర ? యే
కాంతములందు నున్న జవ ♦ రాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియ కాక, నీ వెఱుఁగ ♦ వే మును వచ్చినత్రోవ చొప్పు; నీ
కింత భయంబు లేకడుగ ♦ నెల్లిద మైతిమి మాట లేటికిన్ ?

ఇందలి నర్మోక్తిచాతుర్యము నిరతిశయము. వాని దిగులును మఱుని వగలుగా రూపించినది. 'ఏకాంత' మనుటచే భయసంకోచాదుల కవకాశములేమియు, 'జవరాండ్ర' ననుటచేఁ దన యత్యంతభోగ్యత్వమును సూచించినది. ఇంతమాత్రకు రస మూరదు. ఇంకను దన యతిశయములు వర్ణించుకొనవలయును.

సీ. చిన్ని వెన్నెలకందు ♦ వెన్నుదన్ని సుధాబ్ధిఁ, బొడమిన చెలువ తోఁ ♦ బుట్టు మాకు
రహిఁ బుట్టఁ జంత్రగా ♦ త్రముల రాల్గరఁగించు, విమల గాంధర్వంబు ♦ విద్య మాకు
ననవిల్తుశాస్త్రంపు ♦ మినుకు లావర్తించు, పని వెన్నతోఁ బె ♦ ట్టినవిద్య మాకుఁ
హయమేధరాజసూ ♦ యము లనఁ బేర్వడ్డ, సవనతంత్రంబు లుం ♦ కువలు మాకుఁ

తే. గనకనగసీమఁ గల్పవృ ♦ క్షములనీడఁ, బచ్చరాచట్టుగమి రచ్చ ♦ పట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ ♦ భర్గసభలు, సాముగరిడీలు మాకు గో ♦ త్రామరేంద్ర !

పాలసముద్రము పుట్టినిల్లు. చంద్రుఁడును, లక్ష్మియుఁ దోఁబుట్టువులు. విద్య రాలనుగూడఁ గరఁగించునది. మన్మథశాస్త్రము పిన్ననాఁటనుండి పఠనము. ఉంకువలు యాగములు. ఇంటి పునాది బంగరుకొండ. కల్పవృక్షములు పెరటిచెట్లు. ఇవన్ని వేయునేల ? కార్యస్థానములో, హరి హర బ్రహ్మసభలు ! ఇంతకన్న నతిశయ మెక్కడిది ? ఇఁకఁ జెలిమికత్తియలో స్మరించినమాత్రనే శృంగారరసము విజృంభింపఁజేయు రంభాదులు. ఇంతకును రస మూరదా ? పోనీ. కాంతార సంతానములో 'నభోవాహినీలహరీ శీతల గంధవాహ పరిఖేలన్మంజరీసౌరభగ్రహణేందిందిరతుందిలంబులు.' వీనినిబట్టియైన నిందు నిలుచునా? ఇంతవఱకుఁ దన యతిశయము లన్నియుఁ దెలిపి, తన యభిలాషము నర్మగర్భముగా సూచించినది. నిలువు మనియు నభిప్రాయమును సూచించినది. ఈ నర్మసూచనము లీ నైష్ఠికశిరోమణికడఁ బనికిరావు. మఱికొంత తేటగాఁ జెప్పవలయు.

క. భూసుర ! కైతవకుసుమ శ, రాసన ! మాయింటివింద ♦ వైతివి; గైకొ
మ్మా సముదంచన్మణిభవ, నానీనత సేదదేఱి ♦ యాతిథ్యంబుఁ.

'కైతవకుసుమశరాశన' అని యభిలాషము మఱికొంత తేటపఱిచినది. 'ఆతిథ్యము గైకొమ్మా' యనియు స్పష్టముగా నిలుపుచున్నది. 'భూసుర' యనుటచే నాతిథ్య మీయవలసిన ధర్మమును దెలిపినది. 'కైతవకుసుమశరాసన' యనియుఁ జెప్పుట యేల ? కేవలాతిథ్యమునకా? అట్లైన వట్టి యతిథి మేను 'కుందనమువంటి' దనునా ? వదన 'మొప్పులొలుకు' ననుట తగునా? 'అస్మద్గృహంబు పావనము సేయు'మనుట యొప్పునుగాని, ఇట్లు తళుకులు బెళుకు లన్నియుఁ జూపినది. పలుకుల కులుకు లన్నియుఁ బచరించినది. మన్మథుఁడనియు వర్ణించినది. ఆ మన్మథునికిఁ దాను రతియైనదా? తాపతిమకుఁ జక్కిలిగింతలు ! బదులు విందము. 'నీ వొసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె' నన్నాఁడు. ఏనురాకుండనొకండు, వచ్చి మఱియొండునె యని సమాధానము చెప్పినాఁడు. 'భక్తియ చాలు; సత్క్రియాకాండము తీర్ప వేగ చనగావలయు' నని శుద్ధశ్రోత్రియత్వము చూపినాఁడు. కరుణింపు' మని వేఁడినాఁడు. 'మీ మహత్త్వముల్ దివ్యము' లని పొగడినాఁడు. ఇప్పటికి శృంగార రసశూన్యుఁడైనను 'భాషాపరశేషభోగి' గదా! ఇదె వింత ! అది 'కైతవకుసుమశరాసన' అని పిలిచినందులకు మాఱుగా తాను 'తల్లి' యని సంబోధించినాఁడు. ఇఁక సందేహ మేల? 'కూరిమి' సోమిదేవమ్మ రసికుఁడు 'తల్లి' వరూథినికిఁ 'జెక్కుగీటిన పసవల్చు బాలకుఁడె' ఆ ! హరిహర బ్రహ్మల క్రిందఁ గొలు వన్నది. రంభాదులు చెలు లన్నది. మన్మథుఁ డన్నది. ఇంతటి మహిమాతిశయమును, భోగ్యతాసౌభాగ్యమును, అభిలాషవిశేషమును దెలిపి, యిన్ని పోకలు పోయియు శృంగారరసము వెల్లిగురిసియుఁ దుదకుఁ దల్లి యయ్యెనా? ఇట్టి చప్పిడిచేలయు నుండునా? కాని వరూథినికి 'లేఁతన వ్వాననసీమఁ దోఁచి'నది. ఇఁకఁ దన ముద్దులును, మహిమలును వానికిఁ బసగూర్ప వని తలఁచి, వానిని మాని, 'యిక్కడి రత్నకందరములు' 'నందన చందనోత్కరము' 'గాంగ' సైకతములు 'లవలీనికుంజములును' జెప్పి నిలుపఁజూచినది. ఇవన్నియుఁ బనికిరావు. అఱిగొఱ మాటలచేతను, సంబోధనలచేతను నభిప్రాయము చూపినను, వాని శాంతభయరసములలో నవి మనసున నాటవు. స్పష్టముగాఁ దన తలంపు చెప్పవలయును. 'నిక్కము దాఁప నేల' చల్లకుఁ బోయి ముంత దాఁపరాఁదు. నిక్క మేమి ?

'... ... ... ... నీపయిం
జిక్కి మనంబు నాకు ననుఁ ♦ జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల ♦ చూఱలఁ బాటలు పాడు తేంట్ల సొం
పెక్కినయట్టి పూవుఁబోద ♦ రిండ్లను గౌఁగిట గారవించెదో.'

ఇందుల కా శ్రోత్రియుఁడు 'వ్రతులై దినములు గడపెడు విప్రులఁ' గామింపరాదనియు, 'జననీజనకుల్ కడువృద్ధు లాఁకటఁ సోలు' చుందురనియు, 'నేఁ డిలు సేరకుండిన సమస్త ధర్మములు దూలు' ననియుఁ జెప్పినాఁడు. ఈ శాంతరస మహాప్రవాహములో శృంగారరసము మొలకెత్తునా?

వరూథినికి మున్ను వాని జేలతవమునకు లేఁతనవ్వు పుట్టినది. ఇపుడు వాని దృఢవైరాగ్యము నకు నిరాశ గలిగి, 'విన్నఁబాటు వదనంబున నించుక' దోఁచినది. ఇఁక వర్ణనలు పనికిరా దని తెలిసి, యుక్తివాదమునకుఁ జొచ్చి "మీ కర్మనిష్ఠలు, యజ్ఞకోటులును మా కవుఁగిళ్ళ సుఖింపనే కదా! 'సశరీరస్వర్గము సమకొనియుండం' గష్టపడి, శరీరము విడిచి, వానిని బడయనేల?" యనఁగా, వాఁడు "నీవు చెప్పునదెల్లఁ గాముకునకే కాని నాకుఁగాదు. ఈ యానందమును జూచినయెడ నా 'బ్రహ్మానందాధిరాజ్య'ము దప్పిపోవు" నని కామ్యమగు స్వర్గభోగము నాశింపక, నిష్కామమగు నపవర్గఫలముఁ గాంక్షించుటఁ దెలిపినాఁడు. 'ఎటేఁగితేని నగరమార్గంబుఁజూపి పుణ్యమునఁ బొమ్మన్నాఁడు. ఇది 'తెరువెద్ది శుభంబు నీ కగుఁ' అనుటకుఁ బర్యాయము. ఇందులకు వరూథిని 'డెందము నిశ్చలమై, యెక్కడ నిర్వృతినొందునో యట్టి యానందమే బ్రహ్మముగాని నీవు చెప్పు బ్రహ్మానందము వేఱొకటి లే'దని ఖండనము సెప్పి, యిందులకు 'ఆనందో బ్రహ్మ' యన్న శ్రుతిముక్కను బ్రమాణీకరించినది. ఇంకను దన్నొడఁబఱచుట కయ్యమరకాంత పడు తత్తఱము సూచి, 'సిగ్గు, వెగటును, నిస్పృహతఁ దెలుపు నవ్వ' నే కలిగినది. ఇతఁడుగదా శ్రోత్రియుఁడు! ఇది గదా శాంతరసము! అతఁడు 'త్రయీధర్మముల్' పాపములు, రతి పుణ్యమంచుఁ దర్కమేల? నాకు నరణుల్, దర్భలు నే ప్రియములు; తక్కినవి తుచ్ఛము'లని యొక్కమాటను ఖండించివైచె. ఇట్లన్న పిదప నింక యుక్తివాదము పసమాలినదయ్యె. బదులు 'మాటలేక' పోయె. 'హృదయాబ్జము జ'ల్లనియె. 'మోము వెల్ల నయ్యె. తానై వలచి వచ్చినది తప్పు; మించిపోయినది. ఇఁక బలాత్కృతి యుపాయ మని పయిఁబడి కౌఁగిలించినది. శ్రీహరిపుత్రునికి లోనై యతఁడు గౌఁగి లించెనా? లేదు. 'హా శ్రీహరీ' యని పట్టి త్రోసె. బుద్ధిని జలింపఁజేయుట కింతకంటె బలవంత మైన మోహనపరికరము గలుగదుగదా! ఇంతటికిని గలఁగినవాఁడు గాఁడు! ఇదియ శాంతరససర్వ స్వము! ఇట్టి వైరాగ్యనిష్ఠయె దాని పరాకాష్ఠ. ఇఁక 'గలంచునే సతులమాయల్ ధీరచిత్తం బులన్' అని ఢంకా కొట్టి చాటవచ్చునుగదా!

ఇఁక వరూథిని యేమి చేయును? వేదనఁ నెపం బిడి 'యతికరుణముగాఁ గన్నుఁగవ ధవళ రుచుల్ కావికొన' నేడ్చినది. దయ లేదని దూఱినది. పరాశరాదుల పోకలన్నియుఁ జూపి, యట్టి 'మునిముచ్చులెల్లఁ దామరసనేత్రలిండ్ల బందాలుకారె' యని మర్మము దూఱనాడినది. ఎంత పిండిన నేమి? ఇసుకలో నూనియ యూరునా? ప్రవరుఁ 'డేమియు నన' కుండె. 'అవ్వనజగంధి మేని జవ్వాదిపస' యది కౌఁగిలించినపుడు వాని యొడలియందుఁ గదంబించినది. అది రసజ్ఞజనుల కత్యంతభోగ్యము. ప్రవరుఁడో దానిని 'గడిగి'కొన్నాఁడు. ఆ! ఏమి వైరాగ్యాతిశయ మిది; ఈ నిరూపణ మెంత నైజము! అవసరము పొసఁగినపుడెల్ల నిట్లు దానిని మిక్కిలి సూటిగను, స్వాభా వికముగను వర్ణించుటయే కవితాతత్త్వవిత్త్వము. ఇది యాంధ్రకవితాపితామహునికే తగు.

పిదప నగ్నిని స్తుతించి, తదీయ ప్రసాదమునఁ బ్రవరుఁడు స్వగృహంబుఁ జేరుట విదితమే.

## కథాదివిమర్శనము

ఇందలి కథ 'మార్కండేయ పురాణోక్తప్రకారంబునఁ జెప్పు' మన్నట్టు లప్పా
నుండి కయికొనఁబడినది. మారన తన తెనుఁగుమార్కండేయపురాణమునందు రచించిన య
భాగమును బాటించియే పెద్దన యీ ప్రబంధమును గావించినాఁడు. కావున నందలి వా
గొన్ని యిందును గానంబడుచున్నవి. ఎట్లనిన—

ఉ. ఈ సుకుమారుఁ డెవ్వఁడొకో • యిందుల కెందులనుండి వచ్చెనో
భాసురరూపకాంతిజిత • భావజచంద్రుఁ డితండు రాగలీ
లాసరసత్వ మొప్పఁ గడు • లాలసుఁడై ననుఁ జూచె నేని నేఁ
జేసినపుణ్య మెవ్వరును • జేయరు కాముని దక్క నేలుదున్. (మార్క

ఉ. ఎక్కడివాఁడొ యక్షతన • యేందు జయంత వసంత కంతులం
జక్కఁదనంబునం గెలువఁ • జాలెడివాఁడు ? మహీసురాన్వయం
బెక్కడ యీ తనూవిభవ • మెక్కడ యేలనిబంటుగా మరుం
డక్కఁ గొనంగరాదె యక • టా నను వీఁడు పరిగ్రహించినన్.

సీ. అనలునియందు రే • పును మాపు వేల్వంగఁ, బడు హవ్యములఁజేసి • పడయవచ్చు
పుణ్యలోకంబులు • పొలఁతి నీ వెఱుఁగవి, త్రిజగంబు హవ్యప్ర • తిష్ఠితంబ

... ... ... ... ... ... ...

తే. వినుము దర్భలు నరణులు • వేదికలును, నగ్నులును నాకుఁ గరముఁ బ్రి • యం బ
గాని యొంటను బ్రియ మెదఁ • గలుగ దనిన....... (మార

మ. తరుణీ ! రేపును మాపు హవ్యములచే • తం దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణాదృష్టి నొసంగుసౌఖ్యము లెఱుం • గన్ శక్యమే నీకు ? నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియములై • న ట్లన్యముల్ గావొ డ
ల్దిరమే చెప్పకు మిట్టి తుచ్ఛసుఖము • ల్మీసాలపైఁ దేనియల్.

తే. అనఘ మందారవిద్యాధ • రాత్మజన్మ, నే విభావసి యనుదాన. (మార

తే. అనఘ మందారవిద్యాధ • రాత్మభవను, నను విభావసి యంద్రు.

మఱియు నిట్టివి పెక్కులు గలవు. దీనిచేఁ బెద్దనరచనమునకుఁ గొఱంత రాదు. అ
స్వతంత్రముగాఁ జూపిన రచనావైచిత్ర్యమును, గల్పనాప్రౌఢిమనుఁ బట్టి చూడఁగా ని
వశమునఁ బడినవే కాని యశక్తిచేఁ దెచ్చుకొన్నవి గావని తేటపడును. అందు ౧౫౦ ప
నిమిడిన కథ నిం దించుమించుగా ౬౦౦ పద్యముల నిబంధించినాఁడు. స్వబుద్ధికల్పితముల
విశేషము లిందుఁ గూర్చుటచే నిది యింత విరివినొందినది. అయినను గథాంశమున రెంటి
భేదము కానిపించుచున్నది. ఇందీవరాక్షుఁ డాయుర్వేదవిద్యను స్వరోచి కిచ్చి, తన క
మనోరమను బెండ్లియాడు మని యడుగునపుడే మనోరమ తన సఖులు రోగపీడితలై యు
నెట్లు సుఖింపంగూడు నని చెప్పి, స్వరోచిచే వారి రుగ్ణత మాన్పించె నని మార్కండేయ
దున్నది. ఇం దీవిషయము స్వరోచిమనోరమల ప్రథమసంగమసమయమున జరిగిన ట్లున్నది
స్వరోచి హంసమిథునసంవాదము విని, విరక్తుఁడై, వనంబునఁ దపంబుఁ గావించి, స్వర్గ
విషయ మిందుఁ గానరాదు. భేద మింతియ. ఇదియుఁ జమత్కారపుష్టికిని, రసపాట
ననురూపముగు నిరంకుశవిహారమే కాని దెలసు గాదు.

తిక్కన యచ్చతెనుంగుతేటల నీటులును, శ్రీనాథుని సంస్కృత సమాసాడంబరమును గూడి పెద్దనకవనం బయ్యె. ఇతని సీసము లచ్చతెనుంగుమురిపముల మూటగట్టుచుండు. ఇవి స్వభావోక్తి రచనకు మనోజ్ఞసాధనమై తిక్కన సీసములం బోలియుండును.

సీ. ముదమున నెలమి సొం ♦ పొదవి నెమ్మొగమునఁ, దోఁపంగ వచ్చినఁ ♦ ద్రోచి త్రోచి
లలి నుల్లసిల్లుచు ♦ లలితలోచనదీప్తు, లడర నుంకించిన ♦ నాఁగి యాఁగి
సంతసంబున బాలి ♦ శములగు చెయ్వులు, దొడరఁ జూచినఁ జేయ ♦ కుడిగి యుడిగి
మనమున నుబ్బుమై ♦ మాట నాలుకకు రాఁ, గడఁగిన నాడక ♦ కడపి కడపి

తే. ధీరయై యిట్లు సమ్మద ♦ పూరమునకు, గలుపతన మను బలితంపుఁ ♦ గట్టవెట్టి
నెలఁది యెఱుఁగనియదివోలె ♦ వికృతిలేక, యల్ల నెప్పటియట్టుల ♦ యరుగుటయును.
(భార-విరా.)

సీ. కొనసాఁగి కామినీ ♦ గోష్ఠిఁ బ్రౌఢములైన, యుదుటుఁజూపుల జెప్ప ♦ తుదల నాఁచి
సంతసంబున ముఖా ♦ బ్జమునందుఁ జిఱునవ్వు, కందళింపక యుండ ♦ డిందుపఱిచి
పొంగారుమైఁ దోఁచు ♦ శృంగారచేష్టల, తమిఁ దెచ్చికోలుమా ♦ ధ్యమున డాఁచి
పొడము రసావేశ ♦ మున వచ్చు నర్మోక్తి, లొదవి నాలుకకు రా ♦ కుండఁ గ్రుక్కి

తే. మస్తకము వాంచి యుసురని ♦ మౌనముద్ర, నేల బొటవ్రేల వ్రాయుచు ♦ నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి ♦ శిర సొకింత, యెత్తి సన్నంపుటెలుఁగుతో ♦ నిట్టు లనియె. (మను.)

తిక్కన యచ్చతెనుంగులను మెచ్చి, కవి యిందు నాలుగవ యాశ్వాసమును జాలఁ దన్మయముఁ జేసినాఁడు. శ్రీనాథుని గీర్వాణరచనలకుఁ జొక్కి, దీనిని బెక్కుచోట్ల సంస్కృత భూయిష్ఠముఁ గావించినాఁడు. గీర్వాణరచన కొక యుదాహరణము—

మ. పవమానప్లవమానపంకజరజః ♦ పాళీపిశంగచ్ఛవి
భవదభ్యర్ణవికీర్ణకృత్రిమసరి ♦ త్పాథస్తరంగాహతైం
దవపాషాణవితర్దికాతలమునన్ ♦ నాళీకపత్త్రాక్షు లు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవా ♦ చాప్రౌఢిమల్ మీఱఁగన్. (మను.)

ఈ కవి శ్రీనాథుని కృతులను జక్కఁగాఁ జదివియే తన ప్రబంధమును గావించినాఁడు. కావున శ్రీనాథుని రచనలు గొన్ని యిందుఁ గాన్పించుచున్నవి. శ్రీనాథుని శృంగారనైషధము లోని తొలి పద్యమును జూచి, యితఁడు తన గ్రంథాదిపద్యమును నిబంధించినాఁడు. అందు—

శా. శ్రీరామాకుచమండలీమృగమద ♦ శ్రీగంధసంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు ధరణీ ♦ సంశ్లేషసంభావనా
పారీణుండు కృతార్థుఁ జేయుఁ గరుణా ♦ పాథోధి పద్మాక్షుఁ డిం
పారన్ మామిడిపెద్దమంత్రిసుతు సిం ♦ గామాత్యచూడామణిన్. (శృంగార.)

అను నీ పద్యమందలి విషయముం గాని 'ధరణీసంశ్లేషసంభావన'ను సనందనాదుల నెక్కు-డుగాఁ జేర్చుకొని, యొక్కింత భేదముతో నత్యంతమనోహరముగా—

శా. శ్రీవక్షోజుషరంగనాథ మెదప్రైఁ ♦ జెన్నొందఁ విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ శ్రీ ♦ తిక్క నిల్చినాఁడో యనం
గా వందారుసనందనాది నిజభ ♦ క్తశ్రేణికిం దోఁచు నా
జీవాత్ముండు గృతార్థుఁ జేయు శుభదృ ♦ ష్టిం గృష్ణరాయాధిపుక్.

అని రచించినాఁడు. మఱికొన్ని యుదాహరింపఁదగు.

సీ. నలినసంభవువాహ ♦ నమువారువంబులు, కులముసాములు మాకుఁ ♦ గువలయాక్షి
చదలేటిబంగారు ♦ జలరుహంబులతూండ్లు, భోజనంబులు మాకుఁ ♦ బువ్వుఁబోఁడి
సత్యలోకముదాఁక ♦ సకలలోకంబులు, నాటపట్టులు మాకు ♦ నబ్జవదన
మధురాక్షరము లైన ♦ మా మాటల వినంగ, నమృతాంధసులు యోగ్య ♦ లనుపమాం

తే. భారతీదేవిముంజేతి ♦ పలుకుచిలుక, సమదగజయాన స్రబహ్మ ♦ చారి మాకు
వేదశాస్త్రిపురాణాది ♦ విద్య లెల్లఁ, దరుణి నీయాన ఘంటాప ♦ థంబు మాకు. (

సీ. చిన్ని వెన్నెలకందు ♦ వెన్నుఁదన్ని సుధాబ్ధిఁ, బొడమినచెలువ తోఁ ♦ బుట్టు మాకు
రహి పుట్టి జంత్రగా ♦ త్రముల రాల్గరఁగించు, విమలగాంధర్వంబు ♦ విద్య మాకు
ననవిల్తుశాస్త్రింపు ♦ మినుకు లావర్తించు, పని వెన్నతోఁ డఁ బె ♦ ట్టినది మాకు
హయమేధరాజసూ ♦ యము లనఁ బేర్వడ్డ, సవనతంత్రంబు లుం ♦ కువలు మాకుఁ

తే. గనకనగసీమఁ గల్పవృ ♦ క్షములనీడఁ, బచ్చరాచట్టుగమి రచ్చ ♦ పట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ ♦ భర్గసభలు, సాముగరిడీలు మాకు గో ♦ త్రామరేంద్ర.

ఉ. వానిఁ బ్రశంససేయఁదగు ♦ వాఁడు కృతార్థతముండు వానిచే
నీ నిఖిలంబు పావన మ ♦ హీనకృపావిభవం బెలర్ప నె
వ్వానిగృహాంగణంబునకు ♦ వచ్చిన త్రోవరజంబులందు నీ
మానిత పాదయుగ్మక మ ♦ మర్చుఁ బ్రఫుల్లసరోజధామమున్.

ఉ. వానిది భాగ్యవై భవము ♦ వానిది పుణ్యవిశేష మెమ్మెయిక్
వాని దవంధ్యజీవనము ♦ వానిదె జన్మము వేయు నేయ కె
వ్వాని గృహాంతరంబున భ ♦ వాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల ♦ సంతస మందుచుఁ బోవు నిచ్చలున్.

సీ. త్ర్యంబకాచలకన్య ♦ కాంబుపూరంబున, నఘమర్షణస్నాన ♦ మాచరించి. (కా

సీ. సచ్ఛాత్రుఁ డగుచు ని ♦ చ్చలు నేఁగి యయ్యేట, నఘమర్షణస్నాన ♦ మాచరించి. (

సీ. నిద్దమైన మడుంగు♦నీర్కావిదోవతిఁ, గనక మేఖలతోడఁ ♦ గటి ఘటించి.

సీ. సరిలేని రాకట్టు ♦ జాళువా మొలకట్టు, బెడఁగారు నీర్కావి ♦ పింజెతోడ.

సీ. డాకాలి గండపెం ♦ డారంబుదాపున, బొమ్మలై వైరి ♦ భూభుజులు వ్రేల.

సీ. కవుబంతనిఖిలరా ♦ జ్ఞీకరంబుఁ జరణమం, జీరంబుసాలభం ♦ జికలఁ జేసె.

మఱియుఁ బిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగారశాకుంతలమునందలి రచనలం
రచన లిందుఁ గానంబడుచున్నవి. ఇట్టివి పెక్కులు చూపవచ్చును. ఈ మహ
ప్రౌఢము. 'అల్లసానివాని యల్లికబిగియును' అను వాక్యమే యీ కవిగుంభనములు

గొనబుసూపుట తెలుపుచున్నది. ఆ యా పాత్రముల స్వభావస్వరూప గుణాదులను నయ్యెయెడల వాని బీజ రూపములకు మిక్కిలి యనురూపముగాను, నత్యంతసైజముగాను నిరూపించుటయందును, నాయా రసములకుఁ బొసఁగునట్లుగా వానిని స్థూలసూక్ష్మాకారముల నొందించుటయందును, నాయా ప్రసంగ విశేషములవలన వాని నపూర్వశోభాకలితముగా వెలయించి, లోని మర్మముల వెలిపుచ్చి, పాత్రాకారముఁ బూర్ణముగాఁ బ్రకాశింపఁజేయుటయందును నీ కవి యసమానుఁడు. దీనింబట్టి యితనికి మానుషస్వభావమర్మములం దతిగాఢప్రవేశముకలిమి దెలియుచున్నది. ప్రవర-వరూథినీ సంవాదమునఁ బరస్పరవిరుద్ధములగు శాంత శృంగారరసములకు నొండొంటికి మిగుల పోరాటఁ గల్పించి, యా రెంటి స్వరూపములను మిక్కిలి స్ఫుటముగా వెలయించినాఁడు. ఆ శ్రోత్రియుని పృథఙ్నైష్ఠికత్వమూలమగు విజ్ఞానమును, ఆ శృంగారనాయిక కామోద్రేకమువలని మోహమును బరస్పరసంఘర్షణముచే మిక్కిలియుఁ బ్రకాశితములైనవి. వరూథిని పయిపాటునఁ గౌఁగిలించుట శృంగారరసంపువెల్లి; ప్రవరుఁడు జవాదిగదంబించునొడలు గడిగికొనుట శాంతరసంపువెల్లి. మఱియుఁ బ్రవరుని శాంతరసము వరూథినికి విసపువిత్తగునట్లు గడుసుగా నుండెనను గూరిమి సోమిదమ్మయెడఁ గొంత శృంగారరసముతో సంకరము గలిగి పొంకముగా నున్నది. మనోరమ చెప్పిన 'బూచివోలె నున్న వాచంయమును' యందో యది 'తిమిరంపు వయసుగుబ్బల కోమలా' లని తెలిపియు, దానిని దిట్టి కొట్టునట్లు గావించి, తాను మిట్టిపడినది. పుంజికస్థలను జూచి, 'యనంగగ్లాని' పడిన పారర్శ్వియందో యది యాపిన 'తపమంతయుఁ బొలివోవఁగ,' దాను భంగము నొందినది. 'ముసరుకొను జరభరంబున నసురుసురై యున్న' వాచంయమునియం దా రసము కోపరసముచేఁ దూలె. 'మూఁడుగాళ్ళ ముసలి' యగు పారర్శ్వియం దది శృంగారరసముచేత బ్రుంగుడుపడెను. ఇట్టి ముదుకముదుసళ్ళయందును నది విరుద్ధమగు మిశ్రణమునొంది యుండఁగా, నట్టి లేఁబ్రాయపువారియం దది విహితమగు సంకరమునొంది సార్థకమైనది. 'తపమంతయుఁ బొలివోవుట' యా మిశ్రణమునకు ఫలము. 'పవనజవంబున నిజమందిరంబున కరిగి, నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించుట' యీ సంకరము ప్రభావము. 'నాగబెత్తముగొని యదయుఁడై కొట్టిన' వగ్గుతపసికన్నను, 'బ్రోవవే నన్నునుచుక్ జెయ్యివట్టిన' ముదియతికన్నను, 'హా శ్రీహరీ యని పొమ్మంచుఁ ద్రోసిన' ప్రాయపు గృహస్థే మేలు. వయస్సు ముదిరినంతనే రాగద్వేషములు ముదురవు. ప్రవరునికి నొక ప్రాయమే కాదు; ప్రత్యేక మనర్థదాయకములైన రూపము, సిరి, కులము, విద్యయు నున్నవి. శృంగార రసంపుఁజవియుఁ గూరిమి సోమిదమ్మ తెలిపియున్నది. మీఁదుమిక్కిలి యొక దేవవేశ్య 'తనంతఁ దా వలచి వచ్చినది'. మిక్కిలి బలవత్తరములైన యిట్టి మోహపరికరము లిన్నియుండియు నణుమాత్రమేని చిత్తము కలంగని యా ధీరశ్రోత్రియుపాలి సొమ్మెగదా శాంతరసము! స్వరోచియందు శృంగారరసము సర్వాధిపత్యము వహించి శాంతరసమును గాలూఁదనిచ్చినదిగాదు. చక్రవాకి పలుకులు బహుసక్తివలని రసాభాసము నెత్తి దూఱియు 'తలవాంచి యుస్సురనుటే' కాని 'తమకము మానరాదు.' హంసమిథునసంవాదము శాంతరసమును నూరిపోసియు 'వీరలతోడి సంగమిఁక వీడెదనంచుఁ దలఁచుటే' కాని 'దుర్వారములైన కోరికలవంక వివేకముచొప్పు దక్కె'నదికాదు. ఈ యంకుశపుఁబోటు లా మదపుటేనుఁగును గుదియింపవయ్యె. మార్కండేయపురాణమున హంస సంవాదము విన్నపిదప స్వరోచి విరక్తుఁడై యడవికిఁ దపంబుసేయఁబోయినాఁడని యున్నది. శృంగార రసార్ణవంబునం బడి తెప్పలఁదేలి తూలి దరిఁజేరి దృఢవైరాగ్యవృత్తికిం బూనినవానికి మగుడ వనదేవతాసంగతిరూపమగు శృంగారరసావృత్తిగూర్చుటగాని, యా సంగతికి వలయు శృంగారరసపౌష్కల్యము గుదుర్చుటగాని యొప్పిదము గానేరదని తలఁచి, కవి స్వరోచి నడ

వీకిఁ పపను నేయుటకుఁగాక, వేఁటాడుటకే పంపినాఁడు. రుచిపై శిష్ట్యముచేఁ గలి
మాఱుపాటు రమణీయముగానే యున్నది. కావున స్వరోచియందు శృంగారరసము శా
నడంచి మించియున్నను నది కేవలముగా నుండక వీరకరుణరసములతోఁ బొంకముగా
గలిగి, రాక్షసరూపుఁడగు నిందీవరాక్షుని గెలిచిన కీర్తిని, మనోరమాదులబాధ లుడిపిన
మును గలిగించినది. కళావతిని గామించిన దేవాపియందో యది రౌద్రభీభత్సరసములతో
కళావతి తండ్రియగు పారర్షి కుత్తుకను గోయించి, వానిని బ్రహ్మహత్యపాలు గావించిన
నేర్చిన విద్య నడిగిన వారికెల్లఁ జెప్పరాదను నభిమానాతిశయమును నాయుర్వేదగురుఁడగ
దత్తునియందును, దమ కన్నకూఁతును దక్కువవారి కియ్యరాదను నాభిజాత్యగర్వమును
పితయగు పారర్షి యందును, మాయలువన్ని పెద్దల నవమానించుటవలని ఫలము సిందీ
యందును గవి తత్తదుచితభాషావిశేషముతోను, తదితరపరికరసామగ్రితోను గడు ని
నిరూపించినాఁడు. ప్రవరుఁడు కామ్యకర్మ ఫలమగు స్వర్గమును గోరక, నిష్కామత్వ
మోక్షమునుగూర్చి గార్హస్థ్యమును జరుపుటను గవి దెలిపినాఁడు. దీనిచే ఫలాపేక్షార
శాస్త్రవిహిత కర్మానుష్ఠానము మోక్షసాధనము నగు నను విశిష్టాద్వైతసిద్ధాంతము నా శఠ
శిష్యుఁడు ప్రతిపాదించినాఁడు. స్వరోచివలె శృంగారరసైకమగ్నుఁడుగాక, వాచ
వోలె కోపావేశమునను, బారర్షివలెఁ గామపారవశ్యమునను బ్రతమునుఁ జెఱుపుకొనక,
మగు నిష్ఠ గలిగి, యైహికసుఖము లనుభవించుచు, నాముష్మికసామ్రాజ్యమునకుఁ బా
ప్రవరుఁడే యిందలి పురుషపాత్రములందెల్ల నుత్తముఁడు.

స్త్రీపాత్రములలో వరూథిని శృంగారరసాలవాలము. పురుషులను వశ్యలఁ గావి
టకు వేశ్య లుపచరించు కులుకుబెళుకులును, గరువంపు మురువులును, మాటనెఱనీటులును
జూడవచ్చును. కాముకురాండ్ర చిట్టకంపుఁజదురులును, దిట్టతనంపుఁజయువులును, మిత్రి
ములును గూడఁ జూపట్టును. వరూథిని తన వలపుకాని నొడఁబఱచుచుఁ దోడిచెలులను
రాకుండ 'జంకెనల వారించినది.' మనోరమ తన చెలువుని కౌఁగిలియందుండియు 'నెచ్చె
మాన్పకున్న నా కెక్కడిసౌఖ్య' మన్నది. అదియ స్వప్రయోజనైకపరమగు చాపల్యము,
పరహితైకాసక్తమగు సౌహార్దము. మనోరమతండ్రి యగు నిందీవరాక్షుఁడు దానిని
కిచ్చెద నన్నప్పుడే యా లలన తన చెలులమాట స్వరోచికిఁ జెప్పెనని మార్కండేయపు
నున్నది. ఇందీవరాక్షుఁడు స్వరోచితోఁ దనకూఁతు నిచ్చెద నన్నప్పుడు మనోరమ
మించుగాఁ బెండ్లికూఁతురే యైనది గావున నెంతయు స్వరోచియెడ లజ్జఁ బొందియుండు
యెడ నది తండ్రియెదురఁ దన వరునితోఁ జెలులనుగుఱించి మాటలాడె ననుట యొప్పదని
పెద్దన యా సంభాషణమును మరల వారిరువురును దొలుదొలుత మాటాడుకొను ప్రథమ
నాఁటికిఁ బెట్టినాఁడు. ఇది యౌచిత్యమునకు మిక్కిలి యనుగుణముగా నున్నది. మన
స్త్రీపాత్రములందెల్లఁ గీర్తనీయురాలు.

ఈ కవి స్వభావోక్తులు మిక్కిలి శుభదములు. వేఁటలాడుటను వర్ణించుటఁ
నితఁడు గన్నారఁ జూచి వ్రాసినవాఁడని తెలియుచున్నది. చక్కని లోకోక్తులును, జ
లును నితని కవనంబున కందంద కొమరు గూర్చుచుండును. 'ముల్లుపుచ్చి కొఱ్ఱడఁచిన
'గుండ్రాడ డాఁచిన పెండ్లి యేమిటికిఁ జిక్కును' 'కంటను వత్తిఁబెట్టుకొని' 'కంటికిం జేడిన

'వేళ్లఁగొల్చుఁగ విజ్జివీఁగిపండె' 'రాచపండ నొకండు వచ్చి మఱియొండునె' అని పెక్కులు గాన్పించు చున్నవి. ప్రౌఢములగు పెక్కు వర్ణనములను, గల్పనలను గావించి, యీ కవి యాంధ్రభాషా లలనకు విలాసప్రౌఢిఁ గూర్చినాఁడు. తొలుదొలుత నన్యభాషాపదములను—.

సీ. 'పచ్చని హురుమంజి ♦ పనివాగెపక్కెర, పారసిపల్లంబు ♦ పట్టమయము
రాణనొప్పారు పై ♦ తాణంపుసింగిణి, తళుకులకోరుల ♦ తరకసంబు
మిహిపసింఫిపరుంజు ♦ మొహదా కెలంకుల, తావుగుజ్జరిసేత ♦ కేవడంబు
డాకెలంకున సిరా ♦ జీ కరాచురకత్తి, కుఱంగటఁ గ్రొవ్వాఁడి ♦ గొరకలపాది'

అని తెనుఁగునం దీ కవియే చేర్చినాఁడు. ఇతనిం జూచి, పిమ్మటికవులును వానిని ప్రయోగింపఁజొచ్చిరి. భాషావిస్తృతి కావశ్యకములగు నిట్టి ప్రయోగములు సామాన్యకవులకుఁ జేయ సాహసము పుట్టదుగాని, కవియు, సార్వభౌముండు నగు ప్రభుని ప్రాపున నున్న పెద్దన కివి చెల్లె. ఇటు లీవలి ప్రబంధరచనముల కెల్ల మార్గదర్శియైన మనుచరిత్రమును రచియించి, యీ కవిశిరోమణి యశఃకాయుండై యున్నవాఁడు.

ఇమ్మహాకవి రచనలను బెక్కండ్రు పిమ్మటికవు లనుసరించి యున్నారు.

శా. శ్రీవత్సోజకురంగనాభ మెదపైఁ ♦ జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలా సమీపమునఁ బ్రీ ♦ తిన్ నిల్పినాఁడో యనన్ (మను.)

శా. శ్రీవృత్తస్తననిస్తులైణమద సం ♦ సిక్తం బురోవీధి బా
గై విన్నాణపుఁబుట్టుమచ్చ రవిక ♦ న్యాసన్న విశ్వంభరా
దేవీ విభ్రమలక్ష్మిఁ దేటపఱుపన్ (పంచతంత్రము)

మ. ..................రతిశ్రాంతాంగనా నేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్ధవళిమం ♦ దాఁ బూనెనో చొప్పుమా
ర్పననన్ వెల్వెలఁబాఱె దీపకళికా ♦ వ్రాతంబు... (మను.)

శా. నానాదీపమరీచికల్ గొనియెనో నాఁ జూడ నిద్రాపరా
ధీన శ్రీనయనంబులుం...జపాసుమమఁ జెన్నారెన్ నిశాంతంబునన్. (పంచతంత్రము)

మ. సకలాశాగతశర్మకోపవిరతి ♦ శ్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ ... ... పల్లెలం
గృకవాకుల్ మొరసెం గృహోపరిఁ బ్రదీప్తం ♦ గిన్ ఘుగ్నకంఠధ్వనిన్. (మను.)

మ. తొలి దేవేంద్రుఁడు మాకులంబుఁ జోర లే ♦ దో మేము నారోన్నమురా
యలయంకస్థితిఁ గాంచలేదో స్వరవి ♦ ద్యల్ మున్ను మావారిశి
క్షలచేఁ బాణిని నేర్వఁడో యని కుల ♦ స్థానప్రతిష్ఠల్ బ్రతిభం
గుల ఘోషించెనొనాఁగఁ గోళ్లు గలయం ♦ గూసెన్ ధరామండలిన్. (తారాశశాంక.)

మఱియు నిట్టివి పెక్కులు గనుపట్టెడిని. ఇందుఁ బ్రక్షిప్తములును గొన్ని గానిపించు చున్నవి. ఆఱవయాశ్వాసమున నింద్రుఁడు పుంజికస్థలను బారర్షితపోభంగమునకై పంపు ఘట్టమునఁ గల ౨౮-వ పద్యము ప్రక్షిప్తము. ఏలన నిందుఁగల—

'............అమ్మునిపాలికి వచ్చె వేల్పుఁదొ
య్యాలి సునుసానఁబట్టిన య ♦ నంగుని మోహనబాణమో యనన్.'

అనునదియే ఆమీఁద ౩౧-వ పద్యము

'..............ప్రతికిం బొడకట్టె వేల్పుదొ
య్యాలి చిఱుసానఁబట్టిన య ♦ నంగునిమోహనబాణమో యనన్.'

అని యున్నది. ఈ రెంటను సమానవాక్యమొకటియే 'అమ్మునిపాలికివచ్చె' న
'ప్రతికిం బొడకట్టె' ననుటయు నించుమించుగా సమానార్థకములే. ఈ పౌనరుక్త్య
కము గాదు. కాన నీరెంటిలో నొకటి ప్రక్షిప్తము గానోపు. అయినను ౩౧-వ పద్య
'పొడకట్టె' ననుక్రియ యవ్యవహితముగా ౩౨-వ పద్యమునందును 'అత్తె ఱంగునఁ..
కట్టె' యని ప్రయోగింపఁబడి యుండుటయే ౩౧-వ పద్యము కవికృతి మని చాట
మఱియుఁ బారర్షి లేపమును జెఱుచుటకు సాధనములుగాఁ బుంజికస్థల యను నాలంబనవి
వసంతర్తుసమాగమ మను నుద్దీపనవిభావమును జెప్పఁబడినవి. ఈ రెండు విభావములును
రసోద్దీపనసామగ్రిని సవరించి, పిదప వేల్పుఁదొయ్యాలిని 'అనంగుని మోహనబాణమో
ప్రతికిఁ బొడకట్టునట్లుచేయుట మిక్కిలి సరసమును, మఱింత కార్యసిద్ధికరము నగున
మొదట నాలంబనమును జెప్పి, యా వేల్పుఁదొయ్యాలిని ౨౮-వ పద్యమునసే 'మునిపాలికి
చేసి, పిదప నుద్దీపనమును చెప్పి, మరల నా వేల్పుఁ దొయ్యాలిని ప్రతికిఁ బొడకట్టునట్లు
సరసముగాదు. ఈ కారణములంబట్టి ౨౮-వ పద్య మనవసరముగా నుండుటచేఁ ప్రక్షి
తప్పదు.

సిద్ధుఁడు కుతపకాలమునందు వచ్చెననుటచే నొక సందర్భవిరోధము కానిపించ
కుతపమనఁగా పగటి పదియేను ముహూర్తములలో నెనిమిదవ ముహూర్తము. అనఁగాఁ
యేనవ పదియాఱవ గడియలు. అప్పుడు వచ్చినవాఁడే యతిథి యగును గాన సిద్ధుఁ డావే
నని కవి చెప్పినాఁడు. ప్రవరుఁ డా సిద్ధుని నిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁజేసి, తీర్థయాత్ర
ములు జరిపి, ముగించునంతకు మధ్యాహ్నము చాలఁ గడచిపోయి యుండును. పిదప వా
లేపమును బూసికొని, హిమవంతమునకుం బోయి, యందలి వేడుకలు సూచుచుఁ గొం
పుచ్చిన వెనుక,

'నళినీబాంధవభానుతప్తరవికాం ♦ తస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ ♦ మధ్యాహ్నముం దెల్పెడిన్'

అన్నాఁడు. మధ్యాహ్నము చాలఁ గడచినవెనుకఁ గొండకుఁబోయి, యచ్చటను
ప్రొద్దుపుచ్చి, కడపట మధ్యాహ్నమే యైన దనుట యసంగతము. అయినను మార్కండే
మునం దీ యంశమును బరిశీలింపఁగా నీ విరోధమునకు సరియైన పరిహార మొకటి కనుపట్టె
అందుఁ బ్రవరుఁడు 'సహస్రయోజనానాం హి దినార్ధేన వ్రజామి యత్ । ఆయాస్యామీతి
తదర్ధేనాపరేణ హి' ఒక దినార్ధమున (ఒకపూఁట) సహస్రయోజనములు పోయి, యపర
(రెండవపూఁట)కుఁ దిరిగివచ్చెద నని తలఁచి, పాదలేపమును బూసికొని పోయినాఁడు.
'నరుఁడేఁగు యోజనసహస్రము సాఁబగలింటిలోపలన్' అని చెప్పినాఁడు. సిద్ధునికిఁ బూ
వానితో సంభాషించునప్పుడు రెండవపూఁట యగును గాన నపుడు ప్రవరుఁడు వెళ్లి

తీర్థయాత్రాప్రసంగములచే సిద్ధునితో నా రాత్రి గడపి, మఱునాఁడు దానసుకొన్నట్లు మొదటి పూఁటనే కొండకుఁ బోయినాఁడు. అందలి వేడుకలు చూచునంతకు మధ్యాహ్నమయ్యె. నాఁటి రెండవపూఁటనే మరలి రాఁదలచుకొన్నవాఁడు గావునఁ బాదలేపము కరఁగిపోవుటచే నట్లు రానశక్యమయ్యె. పిదప నగ్నిదేవుని ప్రసాదమున నాఁడే యిల్లుచేరి, నిత్యకర్మకలాపములు నిర్వర్తించినాఁడు. కథ నిట్లు గ్రహించుటయే మూలానుగుణముగా నున్నది. కథ యిట్టి దని పెద్దన యీ తన ప్రబంధమున సువ్యక్తముగాఁ దెలుపక పోయినను, దాని నిట్లే మనసున నుంచుకొని దీనిని రచించినవాఁడు గావున 'మధ్యాహ్నముం దెల్పెడి' నన్నాఁడు. ఇట్లు గాక సిద్ధుఁడు వచ్చిననాఁడే ప్రవరుఁడు పాదలేపమును బూయించుకొని, యా రెండవపూఁటనే కొండకుఁ బోయినాఁడని మను చరిత్రమాత్రపరిశీలనమున గ్రహించినయెడల నిది మూలవిరుద్ధమగుటయే కాక, నీ ప్రబంధమునకుఁ గళంకాపాదకము నగుటంజేసి, యనుపపన్న మగుచున్నది.

ఈ ప్రబంధమునకు 'స్వారోచిషమనుసంభవ' మనుటయే యర్థనామమని శ్రీ కోపల్లి-వేంకటరమణరావుగారు నిరూపించిన కారణముల నిందు వ్రాసియున్నవాఁడ. శ్రీనాథుని రచనల వంటివి యిందును గలవని బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగముపంతులవారెత్తిచూపిన పద్యములను గొన్నిఁటిని నే నుదాహరించిన పద్యములతోఁ గూడ నిందుఁ బొందుపఱిచి యున్నవాఁడ. సిద్ధుఁడు కుతపకాలమున వచ్చెననుట సంగతమే యని మహారాజ శ్రీ బోడపాటి - రాజన్నపంతులుగారు చేసిన సిద్ధాంతము నిందు నిరూపించినాఁడను. కావున వారికెల్లను గృతజ్ఞతాపూర్వకములగు వందనము లర్పించుచున్నాఁడను.

తంజనగరం - తేవప్పెరుమాళ్లయ్య

# కథాసంగ్రహము



## ప్రథమాశ్వాసము

ఆర్యావర్తమున వరుణానదీతటమున నరుణాస్పద మను పుర మొండు గలదు
బ్రవరుఁడను విప్రకుమారుఁడు తన తల్లిదండ్రులతోడను, భార్యతోడను, శిష్యవర్గముతో
సించుచుండెను. అతఁడు యజనాది షట్కర్మనిరతుఁడై యతిథిపూజా ధురంధరు
చుండెను. అతనిభార్య యన్ననో యన్నపూర్ణాదేవియుంబోలె నభ్యాగతుల కన్నదాన
చుండెను. ఇట్లుండ మంత్రౌషధసిద్ధుఁ డొకఁ డా ప్రవరుని యింటికి వచ్చెను. ప్రవరుఁడు
సత్కారంబులఁ దనిపి, యాతం డద్దానం దృప్తినొంది సుఖాసీనుఁడై యున్నతఱి నతని
"స్వామీ! మీ రే యే దేశములఁ జూచినా" రని ప్రశ్న చేయఁగా నా సిద్ధుఁ "డో
యా దేశ మని చెప్పుటకు వీలులేదు. నేను సమస్త ప్రపంచమును జుట్టివచ్చితి" న
బ్రవరుఁ డచ్చెరువంది "యో మునిలోకగ్రామణీ! మీరు రూపమునందుఁ దరుణ
యున్న ట్లగపడుచున్నారు. ఇట్టి చిఱుతప్రాయములోన నెట్లు భూప్రదక్షిణము జేయ
నెఱిఁగింపుఁ" డనవుడు నా సిద్ధుఁ "డో భూసురవతంసా! మా సంచారమునకు నాధార
మైన సంగతియైనను నీయందు నాకుఁ గల యనురాగముచేత దాఁచక చెప్పెదను. ఒ
దమునఁ బాదలేప మను దివ్యౌషధ మొకటి మాకు లభించెను. ఆ రసమును బాదము
కొని, తన్మాహాత్మ్యమున నెచ్చటికిఁ బోవ నిచ్చ వొడము నచ్చటి కేఁగుచుండెద" మని
దాన నెవ్వెఱఁగుపడి ప్రవరుఁ 'డో యతిసత్తమా! దివ్యక్షేత్ర సందర్శనాభిలాష
నెంతకాలమునుండియో బాధించుచున్నది. మీరు నన్ను శిష్యునిఁగా భావించి, నాయ
గలవారయి నన్నుఁ దీర్ఘయాత్రవలన ధన్యునిఁగాఁ జేయుఁ' డని పలువిధములఁ బ్ర
సిద్ధుం డొక పసరు నిది యది యని చెప్పక యా ప్రవరుని కాలికిం బూసి, తన మార్గము
దివ్యక్షేత్రసందర్శనాభిలాషి యగు నవ్విప్రకుమారుండు హిమవత్పర్వతనిరీక్షాపేక్ష
బోయెను.

## ద్వితీయాశ్వాసము

ఇట్లు వోయి, నరనారాయణాశ్రమమగు బదరీవన మార్గమునం జని, యపరిమిత
నాంచితంబులును, నానావిధ తరులతాశోభితంబులు నగు నరణ్యంబులఁ గడచి చని, ర
ఘుఁడు తప మాచరించిన ప్రదేశము, గంగానది భూమికి దిగినచోటు, పార్వతి యీ
పరతం జొక్కిన చోటు, మన్మథుఁడు ఫాలలోచను కంటిమంటం గాలి బూడిదయైన చ
పత్నులయం దనురాగముచే ము న్నగ్నిహోత్రుఁడు విరహవేదనం బడినచోటు, క
పుట్టినచోటు మొదలగు పుణ్యస్థలములం గాంచి, యందందుఁ గల విశేషముల నెల్ల
నా నగమహత్త్వంబును వేనోళ్లం బొగడుచుండ మధ్యాహ్నము ప్రాపించెను. ఇఁక
లినఁ దన నిత్యకర్మానుష్ఠానములకు భంగము కలుగునని భావించి, నాఁటి కింటికిం జని
మరల వచ్చి తక్కిన విశేషములం జూడ నిశ్చయించి, పోవను గమనింపఁగా, నతని

బూయఁబడిన లేపము మంచువలనఁ గరఁగిపోయి, కదలుటకు వీలు కాకపోయెను. దాన మిగులఁ బరితాపము నొంది, మార్గాన్వేషియై తిరుగుచుండఁగా నొక్కెడ నతనికి దివ్యభవన మొకటి కాన్పించెను. అందు నివసించువారు తపసులై యుందురని భావించి, వారి నడిగి దారి తెలిసికొని పోవ సమకట్టి యచ్చోటికిం బోయి, ప్రవరుఁ డచట నొక యుద్యానవనమందుఁ జంద్రకాంత శిలావేదికపైఁ గూరుచుండి, వీణ వాయించుచున్న వరూథిని యను నచ్చరలేమ నొకతెం గని, నిశ్శంక నామెచేరువకుం బోయి, తన వృత్తాంత మామెకుఁ దెలిపి, నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్మని పరిపరివిధములఁ బ్రార్థించెను. అవ్వరూథినియుఁ బ్రథమదర్శనముననే యత్తరుణవయస్కునందుఁ దన చిత్తము తగిలినకతన నదనుగని మదనుఁడు పదనగు తూపులం దనయెద నొవ్వనేయఁ దద్వేదనం గుంది, యతనిం గవయ నభిలషించి, మెల్లఁగ నతనితో సరసమాడ నారంభించెను. ప్రవరుఁడును మార్గాన్వేషణమే తన ముఖ్యోద్దేశమగుట నామె మాటలు పెడచెవిఁ బెట్టఁగా నామె తన నేర్పుకొలందిఁ గామశాస్త్రోపన్యాసములఁ జేయ నారంభింపఁగా, నతండు పరస్త్రీవిముఖుఁ డగుటం దన వేదాంతోపన్యాసముల నవ్వరూథిని వాదమును ఖండింప, నామె యొండుతెఱంగు గానక, మోహోద్రేకమున నతనిపైఁబడి యాలింగన మాచరింపఁబోఁగా, నతఁడు చలింపక యామె నవ్వలకుం ద్రోచిపోయి, యామె శరీరస్పర్శముచేఁ దన దేహమున కంటిన కళంకమును జేరువనున్న పవిత్రతోయములం గడిగికొని, యాచమనము చేసి, నిత్యమును దాను బూజించు గార్హపత్యాగ్నిం దలంచి, తత్ప్రభావంబునం దన గృహంబునకుఁ బోయెను.

## తృతీయాశ్వాసము

ఇట్లా బ్రాహ్మణకుమారునిచే నిరాకృతయై, యాశాభంగము నొందిన యచ్చెలువ యతని సాంగత్యము లభింపమికి నత్యంతవిరహావేదన నొంది, మైఁదెలియక యతని న్వేదకఁదలఁచి, యతఁడు మున్ను సంచరించిన ప్రదేశముల నెల్ల నరసి, యటఁ గానక నెవ్వగఁ జెంది యట్టి రూపలావణ్యాతిశయములుగల యువకునితోడం గూడియుండని బ్రదుకేల? యని రోసి కుందుచుండ, నింతలో సూర్యాస్తమయ మగుడు నామెచెలులెల్లఁ జేర వచ్చి, శీతలోపచారము లాచరించి, యోదార్పం దలంచి యామె నుద్యానవనములకుం గొంపోయి, నిండారఁ బండువెన్నెల గాయుచుండ శశికాంతశిలావేదికాతలంబులందును, నికుంజాంతరంబులను, సరోవర తటంబులను విహరించున ట్లాచరించి, యా రాత్రిం గడపిరి. ఇంతలో మున్నీ వరూథినిసంగమం బపేక్షించి యామెచే నిరాకృతుఁడైన గంధర్వకుమారుఁ డొక్కఁ డీ వృత్తాంతము నంతయు నాత్మ నెఱింగి, యిదియ యామెం గదియ నదనని మది నెంచి, మాయచే నామెను వంచింపందలంచి, గంధర్వులు కామరూపధరు లగుటం దా నా ప్రవరునియాకృతిం దాల్చి, మున్నాతఁడు సంచరించిన ప్రదేశములం దల్లనల్లఁ దిరుగుచుండెను. వరూథినియు వనవిహారము తన విరహతాపము నతిశయింపంజేయ నస్వస్థచిత్తయై వేకువను లేచి, యున్మాదినియుంబోలె నందందుఁ దిరుగుచు నొక్కెడ దేవపూజకుం బూవులు గోయు మిషచేఁ దిరుగు నమ్మాయావిప్రకుమారునిం గాంచి, ఱిచ్చవడి పట్టరాని తమకంబున నేకతంబ యతనిని సమీపించి, గద్గదకంఠయై యతనిం బలువితములఁ బ్రార్థింప, నెట్టకేలకు సమ్మతించినవాఁడునుంబోలె నతఁడు తన ప్రథమనిరాకరణమునకుఁ దన యగ్నిహోత్రాది కృత్యములును, నిజగృహంబున మాతాపితృసేవాసక్తియు, నతిథిపూజాపరత్వమును గారణంబులుగ నిరూపించి, మఱి విరహసంతప్తాంగియైన యామె నాదరింపకుండుటయు దోషముగ భావించి, యామెం గవయవచ్చిన ట్లభినయించి, యామెను స్వవశను చేసికొనెను. మఱియు సంభోగకాలమున నిజ

స్వరూపము నామె తెలిసికొనునను భయమునో నా సమయంబున నామె కన్నులు
యుండునట్లు దా నామెను సమ్మతింపఁజేసె, తానుగాఁ బోవువఱకు నామె తన్ను
కుండునట్లు నామె నొడంబఱిచి, యామెతోఁ గూడి క్రీడింపఁ గొంత కాలమున కా య
లయ్యెను. ఆ గంధర్వుఁ డది గాంచి, యింక నామెను విడచి చనువాఁడై, యొకనాఁ
నిట్లనియె - "చెలియా! నీకొఱకు స్వగృహమును, భార్యను, మాతాపితలను, శిష్యవర్గ
మాన్యములను, అగ్నిహోత్రాదులను విడిచి వచ్చియుంటిని. ఏ మహాత్ముఁడు నాకు
మొసఁగి, యిచ్చటికి వచ్చి నీతో సుఖింప ననుకూలించు నట్లొనర్చెనో యాతఁడు నేఁ డి
యచటి వృత్తాంతమునెల్ల నాకు వివరించి చెప్పెను. మడిమాన్యము లెండిపోయె
చంద్రులు పుత్త్రివియోగముచేఁ దపించుచుఁ గడుఁ గృశించి యున్నారఁట! శిష్యు
యనశూన్యులై పోయిరఁట! ఇట్టి విపత్తులనెల్ల నేను వేగంబ పోయి, చక్కఁబె
యున్నది. అచ్చటఁ గుదురుపా టొనరించి, మరల నీకడకు వచ్చి, నిన్ను సంతసి
నేఁటికిఁ బోయిరా ననుమతింపుము" అని యనేకవిధంబుల నామె మనస్సు కరఁగున
వియోగమును సహింపఁజాలని యామె నెట్టకేల కొడంబఱచి కృతార్థుఁడై యామెన
మార్గమునఁ బోయెను.

## చతుర్థాశ్వాసము

ఇచట వరూథిని నెలలు నిండఁగా శుభగ్రహవీక్షణముగల యొక శుభలగ్నమం
మాన్యుఁడైన కుమారుం గనియెను. ఆ సమయంబున దేవతలు కుసుమవృష్టిం గురిసిరి.
డగు నక్కుమారునకు నచ్చటి మునులు స్వరోచి యను పేరిడి, జాతకర్మ మాచరించి,
నాది కృత్యములం దీర్పం బెరిఁగి, యక్కుమారుండు రణశూరుఁడై ధనుర్విద్య నభ్యసి
పర్వత పార్శ్వమందు విశ్వకర్మ నిర్మితమైన నగరియందుఁ జెంచులు మొదలగు నాటవి
బరివేష్టించియుండఁ గాఁపుర ముండెను. ఇట్లుండ నొకనాఁడు జడివాన గురిసి, సెల
ప్రవహించుచుండఁ బక్షిరవసంకులంబైన యక్కొండ నెత్తపుభూమిని జూచుటకై
కొండ నెక్కి, తదగ్రమున నొక చంద్రకాంత వేదిపై నాప్తజన పరివృతుండై కూర్చున్న
కిరాతప్రభు వతనియొద్దకు వచ్చి, నక్కకొమ్ము, చాఱపప్పు మొదలగు వస్తువులను గా
తత్సమీపారణ్యంబున భల్లూకాది క్రూరమృగంబులు నిండియుండి, యుపద్రవము
చున్న వని విన్నవింప విని, యాఖేటకౌతుకంబు చిత్తంబునం దతిశయింపఁ, బ్రయాణ
తన దండుతోఁగూడ నయ్యరణ్యంబునకుం జని, పలుదెఱంగుల మృగయావినోదంబు
చాలించి, పురంబునకు మగిడి వచ్చుచు నొక్కెడ విశ్రమించియుండ, శుభాశుభమిశ్రము
లనేకంబులు గానరా, నం దశుభశకునంబులవలనఁ బ్రాణరక్షాసంశయం బగు రణం బ
శుభశకునంబులవలన మీఁద నెట్టకేలకు మితిపెట్టరాని జయమంగళంబు లగు ననియు
మున నిశ్చయించి యున్నంతఁ, జేరువ నొక్క యాఁడుకూయి వినవచ్చెను. అంత
శరాసనుండగుచు నిది యే మని వితర్కించుచుండుతఱి, భయార్తయు, దీనాననయు
యబల యతనిని సమీపించి 'యో రాజేంద్రా! నన్ను రక్షింపు' మని ప్రార్థింప, నతం
కుండు మని చెప్పి, తద్వృత్తాంతముం దెలియ నడుగుటయు, నామె యిట్లనియె. "
నేను మరుదశ్వపుత్త్రి కిందీవరాక్షగంధర్వరాజువలనం బుట్టినదానను. నా పే
నాపై నీఁగనైన వాలనీక, నా తండ్రి యెల్లప్పుడును బ్రేమతోఁ బెంచుచుండును. మం

ధరతనూభవయగు విభావసియుఁ, బౌరర్ష్ణిపట్టి కళావతియుఁ నాకుఁ బ్రియసఖులు. వారును, నేనును గలసి, యొక దినమునఁ గైలాసపర్వత శిఖరమునఁ బుష్పాపచయాపేక్ష నికుంజాంతరంబులం దిరుగుచుండి, యొక బిలమునందు వికృతస్వరూపుఁడైన యొక మునిం గని, యతని ముఖమును బాల్య చాపలమునం బట్టఁగా, నతండు నా కరస్పర్శమువలన ధ్యానము చెడి, కన్నులుఁ దెఱచి, 'యో దుర్మార్గురాలా! సమస్త సుఖములం బరిత్యజించి, నిర్జనప్రదేశమునం దప మాచరించు మమ్మిట్లుపహసింప నేమి వచ్చెను? ఎలప్రాయమున నున్న నీవు నీకుం దగినయువకులతో సరసమాడం జనునుగాని, మాబోఁటి ముసలివాండ్రతో నీ కేమి? జరాభారమున శ్రమ నొందియున్న మమ్మిట్లులసటపెట్టితివి. కావున నీ వొక రాక్షసునికిం బట్టువడు' మని శపించి, యంతంబోక తనచేత నున్న నాగబెత్తముతోఁ బశువును గొట్టినట్లు నన్నుఁ గొట్టెను. ఇట్లు తిట్టువడియుం, గొట్టువడియు నేడ్చు నన్నుం జూచి, నాచెలు లాగ్రహించి, యమ్మునిని దూషింప, నతఁడు వారిని రాజయక్ష్మక్షోభం బెనఁగ నశింపుఁ డని శపించెను. అప్పుడే వారి కా వ్యాధి సంప్రాప్త మయ్యెను. నన్ను మూఁడు దినములనుండి యొక రాక్షసుఁడు తఱుముకొని వచ్చుచున్నాఁడు. చూడుము! నాయొద్ద నస్త్రహృదయ మను విద్య గలదు. సకలరిపునాశకరము, యశస్కరము నైన యవ్విద్య యెందున్నను గొనవలయును గాన నే నాఁడుదానను - నావలన విద్య గ్రహించుట సరిగా దని యెంచక దానిని బరిగ్రహించి, యీ యసురునిం బరిమార్పు" మని వేఁడెను. ఇంతలో నా రాక్షసుఁడును రాజును సమీపించెను. అంత నా రాక్షసునకిని, స్వరోచికిని ఘోరయుద్ధము జరిగి, రాక్షసుఁడు చెంచుబలము నెల్లను సంహరించి, స్వరోచి నెదిర్చి, యతని ప్రయత్నములనెల్ల విఫలము చేయఁగా స్వరోచి విస్మయం బంది, రోష మతిశయింప, నాగ్నేయాస్త్రంబు నతనిపైఁ బ్రయోగింప, దాన నాతఁ డా రాక్షసరూపము న్విడిచి, గంధర్వుఁ డయ్యెను.

## పంచమాశ్వాసము

ఇట్లు రాక్షసరూపమును విడిచి, గంధర్వమూర్తిం జేకొనిన యతండు భూమికి డిగ్గి, స్వరోచిని సమీపించి, 'యో యయ్యా! నే నిందీవరాక్షుఁడను గంధర్వుఁడను. మీ తల్లికిం దోడఁబుట్టినవాఁడను గాని యన్యుఁడను గాను. నే నొక్క ముని యొసఁగిన శాపముచే రాక్షసుఁడనై యీ నా కూర్మినందనను భక్షింపం దలంచితి' నని చెప్పుచుండఁగా మనోరమ వచ్చి, తండ్రిపాదములకు నమస్కరింపఁగా నతఁ డామె నెత్తి యాదరమున మూర్ధాఘ్రాణము గావించెను. అంత స్వరోచి 'యిట్టి శాపము నీ కేల వచ్చె' నని యడుగుటయు నతం డిట్లనియె. "బ్రహ్మమిత్రుఁ డను ముని యొకండు తన శిష్యులకు నిరంతరము నాయుర్వేదముం జెప్పుచుండ నే నది చూచి, యవ్విద్యం బడయఁ గాంక్ష వొడమ నతని సమీపించి 'నన్ను శిష్యునిఁగా గ్రహించి,యాయుర్వేదముం జెప్పుఁ డని వేఁడితిని. అతండు నన్ను దూషించి, నిరాకరింప నతనిని వంచింపందలంచి, శాంబరీ విద్యచే నొరులకుఁ గానరాక యతనిచేరువ నే శిష్యవర్గముతోఁ గూరుచుండి, యాయుర్వేదము నంతయు సాంగముగా నభ్యసించి, యందుం బ్రవీణుఁడనై, యతంబోక యమ్మునిని నపహసింపం దలంచి, శాంబరిం బాసి,యతనికిం బొడసూపి, 'యో వెఱ్ఱితపసీ! సవినయముగ వచ్చి, విద్య నేర్పుమని యడుగ, నిరాకరించి దూషించితివి. ఇదె చూడుము. విద్య నభ్యసించితిని. విద్యాభ్యాసమునం దపేక్షగలవారికి విద్య యెట్లయినను వచ్చు' నని నిష్ఠురోక్తు లాడితిని. దాన నతఁడు కోపించి, 'మాయోపాయమున నన్ను వంచించి, విద్య నభ్యసించినదే కాక, గురువునగు నా యెదురఁ బరిహాసోక్తులు పలుకుచున్నావుగదా! కానిమ్ము. అసురియగు మాయ మాయెడలఁ బ్రయోగించి, వంచించి

యపహసించితివి గావున, నసురవై పిశితం బశనంబుగా మను' మని శపించెను. దానికి నే నులికి పడి, యతనిపదములపైఁ బడి 'మహాత్మా! బుద్ధిదోషమున మీకడఁ గాఱు లఱచిన నన్ను మన్నించి, శాపవిమోచనముం గరుణింపవే!' యని వేఁడుకొంటిని. అందుల కాతఁడు ప్రసన్నుఁడై, నన్ను లేవనెత్తి, 'పశ్చాత్తాపముం బొందితివి గాన నీకుఁ గొన్నినాళ్లకు నిజకుమారిని మ్రింగఁబోయి యొక్క మహాత్ముని దివ్యశరార్చిఁ ద్రెళ్లి, స్వస్వరూపముం బొందెద' వని యనుగ్రహించెను. వెంటనే నేనును బురంబునకు వచ్చి, రాక్షసభావ మంకురింపఁ బురంబునం గలవారి నెల్ల మ్రింగ నారంభించితిని. ఈ రాక్షసభావము నుదరకయున్న నా భార్యలను బుట్టినింటివారు పిలుచుకొని పోయిరి. పుర మెల్ల జనశూన్యముగఁ జేసి, యాహారంబు గానక కైలాసశిఖరంబునఁ బూవులు గోయుచున్న యీ కన్నెను గూఁతు రనియైన భావింపక, క్షుత్పీడ సహింపనోపక, మ్రింగఁ దఱుముకొని వచ్చి,మహాత్ముఁడవగు నీశరస్త్రీదారణం బవిత్రుండనై నిజస్వరూపముఁ బొందితి''నని తన యుదంతం బంతయుం జెప్పి, మఱియు నిట్లనియె. 'నీవు నా కొనర్చిన యుపకృతికిం బ్రత్యుపకార మొనర్పంజాలను. నాయొద్దనున్న యాయుర్వేదముతోడ మత్కుమారి యగు నీ కన్నెమిన్నం బరిగ్రహించి, నన్నుఁ గృతార్థుం జేయు' మని వేఁడఁగా, స్వరోచి దానికి సమ్మతించెను. అంత సూర్యాస్తమయ మగుటయు వారు విశ్రమించిరి. ప్రభాతమున నయ్యిందీవరాక్షుని పూర్వపు భృత్యు లతఁడు శాపవిముక్తుఁ డగుట విని, సంతోషించి యచటికిఁ దెచ్చి యిచ్చిన కానుకల నతండు గ్రహించి, వారు తెచ్చిన తన దివ్యరథంబును స్వరోచితోడ నధిరోహించి, కూఁతును నొక్క స్యందనం బెక్కించి, భృత్యజనులు గొలిచి రాఁ గతిపయప్రయాణంబుల రమానారాయణ పరిణయగేయ విగాయన గంధర్వమైన మందరపర్వతంబునకుం జని, నిజనివాసంబుఁ జేరి, యమాత్యులం బిలిపించి, వివాహసన్నాహముం జేయ నియమించి, స్వరోచి నొక దొరయింట నివ్వడి యించి, యొక శుభలగ్నంబున నాతనికి మనోరమ నిచ్చి వివాహముచేసెను. అల్లున కనేకాభరణాదుల నొసంగెను. తక్కుంగల బంధువర్గము నా నూతనవధూవరులకుఁ గానుక లొసంగిరి. స్వరోచియూరేఁగునప్పు డతని చక్కఁదనముం గాంచి, యప్పురమునందలి స్త్రీలందఱును మోహపరవశ లైరి. నలకూబరుఁడు మొదలగువారుగూడ నవ్వధూవరులకు వస్త్రాభరణాదు లొసంగి గారవించిరి. ఇట్లు మహావైభవమున స్వరోచి మనోరమం బరిగ్రహించెను.

## షష్ఠాశ్వాసము

నాఁటిరాత్రి చెలులెల్ల మనోరమకు మజ్జనం బాచరించి, చందనాది పరిమళద్రవ్యముల మేన నలంది,దివ్యాంబరాభరణభూషితం జేసి, శయనగృహంబును బ్రవేశపెట్టి, తా మటనుండి కదలి పోయిరి. స్వరోచియు మోహాతిశయమున నామెం గవయ గమకింప నమ్ముగుద దీనాస్యయై తపించుటం దిలకించి "తోయజాక్షీ! యక్షయానంద సంధాయకంబగు నిట్టి క్రీడాసమయంబున వగపునకుం గారణం బేమి? ఏమి సాధింపవలయుం జెప్పు; మది వేధచేత నున్నను సాధించెద''నని పలుక నాతనిఁ జూచి, మనోరమ 'నాథా! నాయెడ మిగులఁ గూరిమి గలిగి చరించు సఖు లిద్దఱును రాజయక్ష్మబాధితలై తపించుచుండఁగా, నే నెట్లు సుఖించెదను? నీవు వారి రుగ్ణత మాన్పితివేని నే నానందము నొందెదను. అట్లు చేయవేని నాకు సౌఖ్యము గలుగనేరదు' అని చెప్పెను. దాని కతం 'డో హరిణాక్షీ! ఇంతమాత్రమున కీ పరితాప మేల? నా వెంట వచ్చి, వా రెచట నున్నారో చూపుము. మదీయ సంచితాయుర్వేదస్ఫురణమునం దదీయ రోగబాధఁ బరిహరించెద' నని చెప్పి, యామెను వెంటఁబెట్టుకొని పోయి, కైలాసాచలప్రాంతకాంతారంబునం గుందుచున్న

సఖులం గాంచి, తదామయవ్యథాభారమును మాన్పెను. ఇట్లు వ్యాధివిముక్తలయిన యా రజనీశ బింబ రుచిరాస్యలు రాజుం జూచి 'స్వామీ ! నీవు మా కిపు డొనర్చిన యుపకారమునకుఁ బ్రతి సేయ నేర; మయిన మావలనం జేకొనుకార్యములు కొన్ని గలవు, చెప్పెదము. ముందు మా వృత్తాంత మాకర్ణింపుము' అని యందు విభావసి యనునది యిట్లనియె. "అనఘా ! నేను మందారుఁడను విద్యాధరుని కూఁతురను. నా పేరు విభావసి. ఈ జగంబునం గల మృగపక్షిజాతులభాష లెల్ల నాకుఁ దెలియును. ఈ విద్య నాచే నెఱింగి, నన్ను వివాహమగుము" అని చెప్పునంతలో రెండవది యగు కళావతి యిట్లనియె. "పారుఁడను బ్రహ్మర్షి మాతండ్రి. అతండు సకలవిద్యల నభ్యసించి, తప మాచరింపం దలంచి, యొక్క యరణ్యమధ్యంబునకుం బోయి, యాశ్రమం బొండు కల్పించుకొని, కందమూలఫలభక్షణుఁడై, పంచాగ్నిమధ్యమున ఘోరంబగు తపం బాచరించిన నతని తపోయుక్తికి బెగడి, పురుహూతుండు తపోభంగ మాచరింపఁదలంచి, యతనియొద్దకుఁ బుంజికస్థల యను నచ్చర లేమం బంచెను. అవ్వేల్పువెలఁదియు 'మన్మథ వసంత మలయానిలులు తనకుం దోడుగ నునుసానఁ బట్టిన యనంగుని మోహనబాణమో' యనునట్లు మందగమన విలాసంబున నమ్మునిం జేరవచ్చుటయు, నతండు ప్రథమ దర్శనమునసె మోహపరవశుండై తపంబెల్ల నేటఁ గలిపి, యామెతోడ నిరంతర క్రీడారతిం దవిలియుండం, గొన్నాళ్ళకా లేమ గర్భముం దాల్చి తజ్జయైన నన్నుం గాంచి, విపినాంతరమునఁ బడవైచి పోయెను. తొలుత మునియు నన్నుపేక్షించెను. ఇట్లు తల్లిదండ్రులచే విడువఁబడిన నేను శశిమండలంబున వెడలు శిశిరకిరణప్రణాళికామిళదమృతరసగ్రాసంబునంజేసి కొన్ని పూఁటలం బుటపుటనైన నన్నుఁ గనుంగొని,యా మునీంద్రుండు ప్రియం బంది నిజాశ్రమమునకుం గొని చని, శశికళాసంవర్ధిత నగుటంజేసి నాకుఁ గళావతి యను నామం బిడి పెనుచుచుండ; నేనును జనక సేవాపరతం బ్రవర్తిల్లుచుండి, కొంతకాలమునకు యౌవనవతి నైతిని. అంత దేవాపి యను గంధర్వుఁడు బంధువర్గముతోడ మా తండ్రికడకు వచ్చి నన్నుఁ దన కిమ్మని యడుగ మాతండ్రి, యతని కులమును దూషించి, నట విట గాయకులైన గంధర్వులకుఁ గన్నె నిచ్చుటలేదని నిరాకరింప, నతఁడు క్రోధోద్రేకముతో వెడలిపోయి, యొక్కనాఁటి నిశాసమయమున మా యాశ్రమంబుఁ బ్రవేశించి, గాఢక్రోధాంధుఁడు గాన మాతండ్రికుత్తుకఁ గోయ, నతఁడు రోఁజు టాలకించి, నేను మేలుకొని దీపము వెలిఁగించి చూచి, రోదనము చేయుటయుఁ బొరుగున నున్న, తపసు లందఱునువచ్చి,నన్నుం బొదివి యోదార్చిరి. ఆ దుర్మార్గుఁ డంతకుముందే పరుగెత్తిపోయెను. పిమ్మట మా యయ్యకు నే నగ్నిసంస్కార మాచరించి, దుఃఖార్తనై తల్లి విడిచి చనినపిదపఁ దానే తల్లికి మాఱుగాఁ బెనిచిన జనకుఁడు మృతి నొందె, నిం కేటి జీవన మని యాత్మహత్యం గావించుకొనఁ జూచు నన్ను సంతరిక్షమునం దెచ్చుటికో పోవుచున్న పార్వతి చూచి, భూమి కవతరించి 'ఓ తన్వీ ! అలభ్యమగు సృష్టి సౌందర్యనిశాంతమయిన తనువు నన్యాయముగా విడువవలదు. అతిలోకుండగు స్వరోచి నీకు భర్త కాఁగలడు. అతని సంగమంబువలన నప్రతిమ శ్రీ విభవంబు గాంచెదవు. ఇదియునుంగాక, పద్మిని యను విద్య నొకటి నీ కిచ్చెదను. దానివలన నీ కభీష్టసౌఖ్యములు సిద్ధించును' అని చెప్పి, యవ్విద్య నా కుపదేశించి, యా ముక్కంటివాల్గంటి మింటికిఁ జనిన, నేనును బ్రాణంబులు నిల్పుకొని యున్న దానను. ఆస్వరోచివి నీవే యని తోఁచెడిని. వంచనాలాపంబు లుడిగి, యప్పద్మినీ విద్యారత్నంబుతోఁ గూడ నన్నుం బరిగ్రహింపుము!" అన నంగీకరించి యమ్మహీవిభుండు వారి రిద్దఱివలన నవ్విద్యలం గైకొని, యొక శుభముహూర్తంబున వారి నిరువురం బరిణయంబై, యప్పువ్వుంబోఁడులు మువ్వురతోఁ వివిధ విహారసంగతులఁ దత్పరుఁడై పద్మినీవిద్యాప్రభావఘటితాన్నపాన భూషా విశేష మాల్య వస్త్రానులేపన సామగ్రి నొంది క్రీడించుచుండెను. ఇట్లు విహరించుచు నతం డొకనాఁ డొక్కసరో

వర సమీపంబునకుం బోయి యున్నతఱి నొక కలహంసిక చక్రవాకి నొకతెం జూచి "యీ యిందు నిభాస్యలుం, బఱియు నేకమతిం గవగూడియుండ నెంత తపం బొనర్చిరో కదా!" యని యుచ్చరించెను. దానికిఁ జక్రవాకి "పలువురు భార్యలు గల యితనికి వారివలన సుఖ మెక్కడిది? వారి కితని వలన సుఖమును లేదు. ఒక్క తరుణికిం బగులువాఁడును, ఒక్క పతిని వలచు మెలఁతయునే ధన్యులు గాని యిట్టివారు కారు. ఈ విషయమున ధన్యులము నేనును, నా భర్తయునే" యనిన చక్రవాకి పలుకు లాలకించి, స్వరోచి తల వాంచి, యిస్సురని తలపోయుచు, మానరాని తమకమున నా నెలఁతలతో మరల నూఱేండ్లు క్రీడించి, యొక్కనాఁడు వనవిహారమునకుం జని, లేడిపిండుతోఁ గూడి యున్న యొక యిఱ్ఱిం జూచి, దానిని దన సతులకుం జూపెను. ఆయిఱ్ఱియు నా లేడులం జూచి "మీ యందు నిరంతర సంభోగరతిని సంచరించుటకు నేను స్వరోచిని గాను. ఇట్టి కృత్యము స్వరోచికిఁ జెల్లును గాని నాకుఁ జెల్లదు. నేను భోగేచ్ఛ నివారించితిని. మీ రింక నన్ను విడిచిపోయి, వేఱొక్కని వరింపుఁ" డని చెప్పఁగా, నవి యా యిఱ్ఱిని విడిచిపోయెను. ఆ మాటలను విని, స్వరోచి యుందు చక్రవాకి పలికిన పలుకులు, నిప్పు డీయిఱ్ఱి పలికిన పలుకులును దన మనసును గలఁతపెట్టఁగా సతులను విడనాడఁ దలంచియు దాన దుర్వారములయిన కోరికలవంక వివేకముచొప్పు దక్కి మఱియు నాలునూఱేండ్లు వారితో సంభోగించి, వారిలో మనోరమయందు విజయుండును, విభావసియందు మేరునందనుండును, కళావతియందు విభావసుండు నను సుతత్రయముం గాంచి, వారికిఁ బద్మినీవిద్యా ప్రభావంబున వేలు వేలు పట్టణంబులఁ గట్టించి యిచ్చి, వారి నప్పట్టణంబులకుఁ బట్టంబు గట్టి, కృతార్థుఁడై యొక్కనాఁడు మృగయావినోదార్థ మడవికిం బోయి, యచ్చట నొక వరాహముం గాంచి, బాణ మెక్కువెట్టి వేయఁబోవుచున్నతఱి నొక్క యాఁడుజింక యతనిని సమీపించి "రాజా! నిరపరాధియైన యీ వరాహము నేల చంపెదవు? ఆ శరమును నాపైఁ బ్రయోగింపు"మని చెప్పఁగా నతండు "నీ కేల యీ శరీరముమీఁద నింత రోఁత పుట్టె" ననియడుగ "రాజా! అన్యసతులం దాసక్తుఁ డగువానిఁ దమక మొదవి కూడఁ దలఁచుటకంటె మరణమే శ్రేయ" మనుటయు, స్వరోచి "నీ హృదయ మెవ్వనిపై నిలిచె? నీ భావము తెలియం జెప్పు" మన, నయ్యది "నీయందే నా కనురాగము గల" దనెను. దాన నతండు విస్మయం బంది, "నేను నరుఁడను. నీవు మృగివి. మన కిద్దఱకు సమాగమం బెట్లగు" ననిన, నా లేడి "రాజా! నీ వొక్కసారి న న్నాలింగన మాచరింపు" మనఁగా నతఁ డట్లు చేసెను. వెంటనే యది దివ్యస్త్రీరూపమును ధరించి "నృపశేఖరా! నే నీ వనదేవతను. సకలభూభువన రక్షాదక్షుఁడైన మనువర్యుని నీయందుఁ బడయుటకై సమస్త దివిజులు నన్నుఁ బ్రార్థించిన వచ్చితిని. నన్నుఁగూడి యభీష్టసిద్ధిం బొందు" మనెను. స్వరోచియు నామెను బరిగ్రహించెను. అయ్యువతి యంతఁ గొంతకాలమునకు గర్భిణియై, శుభదినమునఁ దేజోవంతుఁడగు పుత్త్రునిం గనెను. ఆ కుమారకుండు స్వారోచిషాఖ్యం బరఁగి, శాంతి దాంతి దయా సత్య శౌచ నిరతుండై, యకామత నచ్యుతుంగూర్చి చిరతపం బాచరింప, నారాయణుండు ప్రసన్నుండైన, నక్కుమారుం డతనిఁ బెక్కుతెఱంగుల సంస్తుతింప నతండు ప్రసన్నుండై, నీవు రెండవమనువవై, యీ మహి నేలి పిమ్మట సాలోక్యముం బడయు మని వరంబిచ్చి, మనుత్వమున కాతనిఁ బట్టము గట్టి యంతర్హితుం డయ్యెను. స్వారోచిషుఁడును సుఖస్థితిని బ్రజాపరిపాలన మాచరించెను.

కోపల్లి - వేంకటరమణరావు

# స్వారోచిష మనుచరిత్రము

## టీకా తాత్పర్య సహితము

### ప్రథమాశ్వాసము



వక్షోజకురంగనాభి[1] యెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాదినిజభక్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్.

పెద్దనార్యుఁ డీ కావ్యమును గృష్ణరాయల కంకితముగా రచించువాఁడై 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే' అను ప్రమాణముంబట్టియు, శిష్టపరంపరాగతమైన యాచారముంబట్టియు, విఘ్నములు దొలంగి, యిది పయింబయిఁ బుష్టినొందుటకును, దొలుత మంగళ మాచరింపఁబూని, యదియు 'ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్' (కావ్యారంభము ఆశీర్వాదమైనను, నమస్కారమైనను, వస్తునిర్దేశమైనను గావచ్చును) అను మూఁడు విధములగుటంజేసి, యం దాశీర్వాదరూపమైన మంగళమును శిష్యశిక్షార్థము గ్రంథరూపముగా నీ పద్యము చేరచించెను.

టీక. శ్రీవక్షోజకురంగనాభి - శ్రీ = లక్ష్మీదేవియొక్క; వక్షోజ = స్తనములయందలి; కురంగనాభి = కస్తూరి; ఎదపైన్ = ఱొమ్ముమీఁద; చెన్నొందన్ = ఒప్పుచుండఁగా; విశ్వంభరాదేవిన్ = భూదేవిని; తత్కమలా సమీపమునన్ = ఆ లక్ష్మీదేవిదగ్గఱ; ప్రీతిన్ = ప్రేమచేత; నిల్పినాఁడో = ఉంచుకున్నాఁడో; అనంగాన్ = అనునట్లు; వందారు...శ్రేణికిన్ - వందారు = మ్రొక్కుచున్న; సనందన = సనందనుఁడు; ఆది = మొదలుగాఁగల; నిజ = తనవారైన; భక్త = భక్తులయొక్క; శ్రేణికిన్ = సమూహమునకు; తోఁచు = అగపడునట్టి; రాజీవాక్షుండు = కమలములవంటి కన్నులుగల విష్ణువు; శుభదృష్టిన్ = మంగళకరమైన చూపుచేత; కృష్ణరాయాధిపున్ = కృష్ణరాయప్రభువును; కృతార్థున్ = చేయఁబడినప్రయోజనము గలవానిఁగా (ఇష్టసిద్ధిగలవానిఁగా ననుట); చేయున్ = చేయునుగాక!

తాత్పర్యము. లక్ష్మీదేవిని కౌఁగిలించుకొన్నప్పు డామె స్తనములందలి కస్తూరి విష్ణువుఱొమ్ముపయి నంటుకొని భూమివలె నల్లగా నగపడుటవలన, విష్ణువు తన ఱొమ్మునందు లక్ష్మీదేవితోడ భూదేవినిగూడఁ బ్రీతిచే నుంచుకొన్నాఁడో యన్నట్లు ఆ దేవునకు నమస్కరించునట్టి సనక

1. కురంగనాభ మెదపై. పాఠాంతరము.

సనందనాది భక్తులకుఁ దోఁచెను. అట్టి విష్ణు వీ కృతిపతి యయిన కృష్ణదేవరాయని శుభవీక్షణముసఁ జూచి, ధన్యునిఁ జేయుఁగాక యని తాత్పర్యము.

పద్యముమొదట శ్రీశబ్దమును, మగణమును బ్రయోగించుట మంగళకరము. కవి తనకును, గృతిపతికిని, జదువువారికిని బరమాభ్యుదయము గలుగుటకై, లక్ష్మీదేవ్యాలింగనోత్తరకాల రూప మైన విష్ణుదేవుని పరమానందసమయ మనుసంధించెను. విష్ణువునందు లక్ష్మీపతిత్వము గాక, భూపతిత్వమును స్ఫురింపఁజేయుటవలన 'నావిష్ణుః పృథివీపతిః' అను వచనముచొప్పున భూపతి యయిన కృతిపతి విష్ణ్వంశసంభూతుఁ డగుట వ్యంజిత మగుచున్నది. ఎవ్వని కేది సమృద్ధముగాఁ గలదో యదియ వానివలనఁ గోరఁబడును గావున లక్ష్మిని, భూమినిం దాల్చిన విష్ణుదేవుఁడు కృష్ణరాయలకు లక్ష్మీభూముల సమృద్ధముగా నిచ్చుఁగాక యని కవిహృదయము. లక్ష్మీదేవిని గౌఁగిలించుటచే నంటిన కస్తురిని ప్రియాలింగన సంక్రాంతముగా గ్రహింపఁజాలమియు, విష్ణుభార్యాంతరమగు భూమిగా భ్రమించుటయు, నిత్యబ్రహ్మచర్యధుర్యు లగు సనందనాదులయందు వర్ణించుట మిక్కిలియు నొప్పిదము. రాజీవాక్షుఁ డనుట శుభదృష్టిపాతమున కత్యంత శోభావహము. కరుణారస సముత్ఫుల్ల సుందరనయనారవిందుఁడై కటాక్షించుఁగాక యని యాశయము.

ఇందు కస్తూరియందు భూభ్రాంతి కలుగుటను వర్ణించుటవలన భ్రాంతిమదలంకారము. భూమిని లక్ష్మీదేవితోఁగూడ నిల్పినట్లు సంభావించుటవలన వస్తూత్ప్రేక్ష. రెంటికిని సంకరము.

ఉ. ఉల్లమునందు నక్కటిక యూనుట మీకులమందుఁ గంటి మం
చల్లన మేలమాడు నచలాత్మజమాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపత దివ్యశరాఢ్యునిఁ జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్. 2

టీ. ఉల్లమునందున్ = మనస్సునందు; అక్కటికము = కనికరమును; ఊనుటన్ = పొందుటను; మీ కులమందున్ = మీజాతియందు; కంటిమి = చూచితిమి; అంచున్ = అనుచు; అల్లనన్ = మెల్లఁగా; (నేర్పుతో ననుట. ఈ శబ్దము మందస్మితసిద్ధికిఁ గడుంబోషకముగా నున్నది.) మేలమాడు నచలాత్మజమాటకున్ = కోడిగపుమాటలు చెప్పునట్టి పార్వతియొక్క పలుకునకు; లేఁతనవ్వు = చిఱునగవు; సంధిల్లన్ = కలుగఁగా; కిరీటిన్ = అర్జునుని; పాశుపతదివ్యశరాఢ్యునిన్ = (పశుపతి యగు నీశ్వరునికి సంబంధించినదగుటచే) పాశుపతమను పేరుగల దివ్యాస్త్రముచేత సంపన్నునిగా - (ఆ దివ్యాస్త్రము కలవానినిగా ననుట); చేయు శాంబరీభిల్లుఁడు = చేయునట్టి మాయాకిరాతుఁడు (మాయచే బోయవానివేషము దాల్చిన శివుఁ డనుట); కృష్ణరాయలకున్ = కృష్ణదేవరాయలకు; అభీష్టశుభప్రతిపాది = కోరఁబడిన మంగళములను బొందించువాఁడు; కావుతన్ = అగుఁగాక!

తా. పాశుపతాస్త్రముకై తపస్సు చేయుచున్న యర్జునుని ననుగ్రహింప శివుఁడు కిరాతరూపముతోఁ బోడసూపి, క్రీడార్థ మాతనితోఁ బోరునపుడు, తా నతని జయింప సమర్థుఁడయ్యును గారుణ్యంబున నతనిచే జయింపఁబడినట్లు అభినయింపఁగా, అపు డా కరుణను బార్వతి చూచి, 'కనికర మెంతమాత్రమును లేని బోయజాతియందుఁ గనికరము దాల్చుట గనఁబడినది. ఇదేమి వింత!' అని కోడిగము సేసెను. అప్పుడు చిఱునవ్వునవ్వుచు, నర్జునునకుఁ బాశుపతాస్త్రము నిచ్చి, యనుగ్రహించిన మాయాకిరాతుండగు నా శివుఁడు కృష్ణదేవరాయలయభీష్టముల నెఱవేర్చుఁగాక!

శివుఁడు కటికికిరాతుం డయ్యు నక్కటికమూనినాఁ డనుటచే దయాసముద్రుఁ డనియుఁ, బాశుపతాస్త్రి మొసంగినాఁ డనుటచే దానశౌండుఁ డనియు సూచిత మగుచున్నది. ఇట్లు దయానిధియై పాశుపతాస్త్రిమంతటిదాని నొసంగినట్టివాఁడు కృష్ణరాయని యభీష్టముల నొసఁగూర్చుననుట చెప్పనేల ? యని భావము. నిష్కరుణమగు బోయజాతియందుఁ గరుణ పుట్టుట యను విరూపకార్యోత్పత్తిచే నిందు విషమాలంకారము.

ఉ. నాలుగుమోములన్ నిగమ * నాదము లుప్పతిలం బ్రచండవా
తూలహతిం జనించు రొద * తోడి గుహావళి నొప్పు మేరువుం
బోలెఁ బయోజపీఠి ముని * ముఖ్యులు గొల్వఁగ వాణిఁగూడి పే
రోలగమున్న ధాత విభ * వోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. 3

టీ. నాలుగు మోములన్ = నాలుగు ముఖములందును; నిగమనాదములు = వేదములధ్వనులు; ఉప్పతిలన్ = పుట్టుచుండఁగా ; ప్రచండవాతూలహతిన్ = మిక్కిలివడిగల వాయుసమూహము యొక్క అధికమయినతాఁకుడుచేత ; జనించు రొదతోడి గుహావళిన్ = పుట్టునట్టి ధ్వనితోఁ గూడిన కొండగవులవరుసచేత ; ఒప్పు మేరువుంబోలెన్ = ప్రకాశించునట్టి మేరుపర్వతమువలె ; పయోజపీఠిన్ = కమలాసనమునందు ; మునిముఖ్యులు = మునిశ్రేష్ఠులు ; కొల్వఁగన్ = సేవింపఁగా ; వాణిన్ = సరస్వతిని; కూడి = పొంది ; పేరోలగము = పెద్దకొలువు ; ఉన్న ధాత = ఉన్నట్టి బ్రహ్మ ; కృష్ణరాయనిన్ ; విభవోజ్జ్వలున్ = సంపదచేఁ బ్రకాశించువానినిఁగా ; చేయుతన్ = చేయునుగాక.

తా. వేదధ్వని గల నాలుగు ముఖములతోఁ గూడిన తాను, బెనుగాలిగొట్టుటచేఁ బ్రతిధ్వని గలిగి మ్రోఁగు గుహాలతోఁ గూడిన మేరుపర్వతమువలె నొప్పుచు, సరస్వతీసమేతుఁడై పద్మాసనంబునందుఁ గూర్చుండి, మహర్షులు సేవింపఁగాఁ బెద్దకొలువుతీరియున్న బ్రహ్మదేవుఁడు కృష్ణదేవరాయలకు నైశ్వర్యాభివృద్ధి కలుగఁజేయుఁగాక !

ఇచట మేరువునకును-బ్రహ్మకును, మోములకును - గుహాలకును, వేదధ్వనికిని - వాతధ్వనికిని ఉపమానోపమేయభావముంబట్టి యలంకార ముపమ. బ్రహ్మయెడ 'నాలుగుమోములన్ నిగమ నాదము లుప్పతిలన్' అనుటచే విద్యాసమృద్ధి చెప్పఁబడినది. ఆ నిగమనాదములకు మహావాయువుచే మేరుగుహాలయందుఁ గలుగు ధ్వని యుపమానముగాఁ జెప్పుటవలన, ఆ విద్యాసమృద్ధి యనర్గళమయినదని సూచింపఁబడినది. 'మేరువుంబోలె' ననుటచే స్థైర్యమును, ధైర్యమును, గాంచనసమృద్ధియు సూచితము లైనవి. 'పయోజపీఠిన్' అని తామరపయిఁ గూర్చుండుటను జెప్పుటచే నతిమృదులసుఖాసనసమృద్ధి సూచింపఁబడినది. 'మునిముఖ్యులు గొల్వఁగ' నని నిగ్రహానుగ్రహసమర్థులగు మహర్షులచే సేవింపఁబడునట్లు వచించుటచే సర్వాతిశాయిమహిమ తెలుపఁబడినది. 'వాణిఁగూడి' యనుటచే సర్వదేవదుర్లభమయిన భోగము సూచితమైనది. 'పేరోలగమున్న' అనుటచే ప్రభుత్వవైభవము చెప్పఁబడినది. ఇట్లు సర్వవిధవిభవములు గల బ్రహ్మయే కృష్ణరాయలకు సర్వవిభవముల నీయఁగలవాఁడని భావము.

ఉ. అంకముఁ జేరి శైలతన * యా స్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున * నవ్వలిచ న్గబళింపఁబోయి యా

వంకఁ గుచంబు గాన కహీవల్లభహారముఁ గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యునిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్. 4

టీ. అంకమున్ చేరి = ఒడిలో కూర్చుండి; శైలతనయా స్తనదుగ్ధములు = పార్వతియొక్క చనుఁబాలను; ఆను వేళన్ = త్రాగునప్పుడు; బాల్యాంకవిచేష్టన్ = పసితనపుగురుతైన విశేష చేష్టచేత; తొండమునన్ = తొండముతో; అవ్వలి చన్ = మరియొక ప్రక్కదైన చంటిని; కబళింపఁబోయి = పట్టుకోఁబోయి; (బిడ్డలు స్తన్యపానము చేయునప్పుడు త్రాగుచున్న చన్ను నోట నుండఁగా రెండవచంటిని జేతులతోఁ బుణుకుట స్వభావముగనుక, కబళింపన్ అనఁగా మ్రింగఁగా నని యర్థమైనను ఇచటఁ బట్టుకొనఁగా నని చెప్పుట యుక్తము.) ఆ వంకన్ = ఆ ప్రక్కను; కుచంబున్ = స్తనమును; కానక = పొడగనక; అహివల్లభహారమున్ = సర్పరాజ రూపమైన దండను; కాంచి = చూచి; వే = శీఘ్రముగా; మృణాళాంకురశంకన్ = లేఁతతామర తూఁడనెడిభ్రాంతిచేత; అంటెడు గజాస్యునిన్ = తాఁకునట్టి యేనుఁగుమొగముగల విఘ్నేశ్వరుని; అభీష్టసిద్ధికిన్ = కోరిక నెఱవేఱుటకొఱకు; కొల్తున్ = సేవించెదను.

తా. విఘ్నేశ్వరుఁడు పార్వతియొడిలోఁ గూర్చుండి, యొక చన్ను త్రావుచు, బిడ్డలయల వాటుచొప్పున రెండవ స్తనముఁ బుణుక నావలిప్రక్కకుఁ దొండము సాఁపఁగా, నర్ధనారీశ్వరత్వముచే నా ప్రక్క సగముదేహము శివరూపము గనుక స్తనము చిక్కక సర్పహారము దొరకెను. తాను గజముఖుఁడు గనుక గజమునకు తూఁడ్లు త్రెంచుపని స్వాభావిక మగుటచే నా సర్పహారమును దామరతూఁడనుకొని పట్టఁబూనిన విఘ్నేశ్వరునిఁ గృష్ణదేవరాయలకోరికలు తీర్చుటకై సేవించెదను.

బాల్యమందుఁ జేసినచేష్టలను, అందును దలిదండ్రులయెడఁ గావించినవానిని, జెప్పుట మిక్కిలియు నానందకరము గావున, గణాధిపతి తనకుఁ బ్రసన్నుఁ డగుటకై కవి తదీయశైశవ క్రీడ నభివర్ణించినాఁడు. అలంకారము భ్రాంతిమంతము.

సీ. చేర్చుక్కగా [1]నుండు చిన్ని జాబిల్లిచే, సిందూరతిలకంబు చెమ్మగిల్ల
నవతంసకుసుమంబు నం దున్న యెలదేఁటి, [2]రుతి కించిదంచిత శ్రుతుల నీన
ఘనమైనరారాపు చనుదోయిరాయిడిఁ, దుంబీఫలంబు తుంబురుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ దంతపు[3]సరికట్టు, లింగిలీకపువింత రంగు లీన
తే. నుపనిషత్తులు బోటులై యోలగింపఁ, బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
నించువేడుక వీణ వాయించు చెలువ, సలుపవరాణి మదాత్మ [4]నిలుచుఁగాత.

టీ. చేర్చుక్కగాన్ = పాపటబొట్టుగా; ఉండు = ఉన్న; చిన్నిజాబిల్లిచేన్ = బాల చంద్రునిచేత; సిందూరతిలకంబు = చెందిరపుబొట్టు; చెమ్మగిల్లన్ = తడియఁగాను; అవతంసకుసుమంబునందున్ = కర్ణాభరణముగా నుంచికొన్న పువ్వునందు; ఉన్న యెలదేఁటి రుతి = ఉన్నట్టి కొదమతుమ్మెదయొక్క ఝుంకారధ్వని; కించిదంచితశ్రుతులన్ = ఇంచుక యొప్పుచున్న సుతులను (సుతి యనఁగా సంగీతమునందుఁ గంఠధ్వనికి సహాయమయిన తంబుఱ మొదలయినవాని ధ్వని.) ఈనన్ = కలుగఁజేయఁగాను; ఘనమైన = గొప్పదైన; రారాపుచనుదోయిరాయిడిన్ = మిక్కిలి యొరపిడిగల చన్నులజంటయొక్క ఒరపిడిచేత; తుంబీఫలంబు = వీణకు నమర్చిన యెండు సొర

1. నిడ్డ. పా. 2. శ్రుతి కించునంచిత. పా. 3. సరకట్టు. పా. 4. వెలయు. పా.

ఆ. వ్యాసరచితభారతామ్నాయ మాంధ్రభా, షగ నొనర్చి జగతిఁ బొగడుఁ గనిన
నన్నపార్యుఁ దిక్కనను గృతక్రతు శంభు, దాసు నెఱ్ఱసుకవిఁ [1]దలఁతు భక్తి.

టీ. ఆంధ్రకవులను స్తుతించుచున్నాఁడు:—వ్యాసరచితభారతామ్నాయము = వ్యాసునిచేఁ జేయఁబడిన భారతమనెడి వేదమును; ("భారతః పంచమో వేదః" అను వచనమువలన భారతమునకు వేదసంజ్ఞ.) ఆంధ్రభాషగన్ ఒనర్చి = తెనుఁగుభాషగాఁ జేసి; జగతిన్=లోకమునందు; పొగడు = పొగడ్తను; కనిన = పొందిన; నన్నపార్యున్ = నన్నయభట్టారకుని; కృతక్రతున్ = చేయఁబడిన యాగములుగల; తిక్కనన్ = తిక్కనసోమయాజిని; శంభుదాసున్=శంభుదాసుఁడను నామాంతరముగల; ఎఱ్ఱసుకవిన్ = ఎఱ్ఱాప్రెగడ యను సత్కవిని; భక్తిన్=భక్తితో; తలఁతున్=స్మరించెదను.

మ. [2]బరువై తోఁచు కుటుంబరక్షణకుఁగాఁ బ్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళసంపుటప్రకరకాంతారంబునం దర్థపుం
దెరువాటుల్ [3]గొని కొట్టి తజ్జ్ఞపరిషద్విజ్ఞాతచౌర్యక్రియా
విరసుండై [4]కొఱఁతం బడుం గుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్. 9

టీ. ఇందుఁ గుకవినిఁ జోరునిగా రూపించి యుభయులయందు నభేదారోపమును జేయుచున్నాఁడు - బరువై; తోఁచు = తోఁచునట్టి; కుటుంబరక్షణకుఁగాన్ = పెండ్లాము, బిడ్డలు మొదలయినవారి పోషణమునకై; ప్రాల్మాలి = ప్రాలుమాలి - ఓపలేక; చింతన్ = విచారముచేత; నిరంతర...కాంతారంబునందున్ - నిరంతర = దట్టమయిన; తాళీదళసంపుట = తాటియాకుల పుస్తకములయొక్క; ప్రకర = సమూహమనెడి; కాంతారంబునందున్ = అడవియందు; అర్థపుందెరువాటుల్ = పరకవిత్వ పద్యార్థము లనెడి యర్థముల (ధనముల) యొక్క మార్గములను; కొని = తీసికొని; కొట్టి = అడ్డగించి; (కుకవిపక్షమునందు అర్థములను జెఱచి, యపార్థములుచేసికాని, యొకరు చేసినదానిని దాను చేసినదానినిగాఁ జెప్పుకొని కాని యనుట.) తజ్జ్ఞ...విరసుండై - తజ్జ్ఞ = ఆ యర్థములను దెలిసిన - లేక అందుల నిజమును దెలిసినవారియొక్క; పరిషత్ = సభలచే; విజ్ఞాత = తెలియఁబడిన; చౌర్యక్రియా = దొంగతనమను వ్యాపారముచేత; విరసుండై = పనిలేనివాఁడై; పృథ్వీభృత్సమీపక్షితిన్ = రాజసన్నిధానమనెడి పర్వతసమీపప్రదేశమునందు; కుకవి = దుష్టకవి అను దొంగ; కొఱఁతన్ = అవమానమనెడి కొఱ్ఱునందు; పడున్ = పడినవాఁడగును.

తా. కుకవి యను దొంగ కుటుంబరక్షణమునకై కక్కుఱితిపడి, తాటియాకు పుస్తకముల సమూహములనెడి యడవియందా పుస్తకములలోని యర్థములనెడి ధనములను దోఁచుకొని, అర్థముస్వరూపము దెలిసినవారనెడి ధనము గుఱుతు దెలిసినవారు, తన యపార్థకరణమను దొంగతనమును గనుంగొనుటవలన ద్వేషింపంబడి, రాజసన్నిధానమనెడి పర్వతముయొక్క సమీపమునందు నవమానమను కొఱ్ఱునం బడును.

ఇట కుకవి కుటుంబరక్షణకై ప్రాలుమాలుటకును - దొంగ కుటుంబరక్షణకై ప్రాలుమాలుటకును, తాళీదళసంపుటప్రకరమునకును - కాంతారమునకును, అభిధేయవాచకమైన యర్థశబ్దమునకును- ధనవాచకమైన యర్థశబ్దమునకును, శబ్దార్థజ్ఞపరమైన తజ్జ్ఞులకును - ధనజ్ఞపరమైనతజ్జ్ఞులకును, గమ్య

1. దగ భజింతు. పా. 2. భరమై. పా. 3. దెగి. పా. 4. ఈ శబ్దము 'కొఱ్ఱు' అనునర్థమున 'కొఱుతన్' అని యుండఁదగును. 'కొఱఁతన్' అనుట విచార్యము.

మైన యపార్థకరణమునకును - చౌర్యక్రియకును, అవమానవాచియగు కొఱఁతశబ్దమునకును - కొఱ్ఱు ఎను వాచకమైన కొఱతశబ్దమునకును, రాజవాచకమైన పృథ్వీభృచ్ఛబ్దమునకును - పర్వతవాచకమైన పృథ్వీభృచ్ఛబ్దమునకును అభేదారోపము చేయఁబడినది. కాఁబట్టి యిది సావయవరూపకము. అన యవి యగు కుకవికి చోరత్వరూపణము కంఠోక్తము కాక గమ్య మగుటచే ఏకదేశవివర్తియు. 'కొఱతన్' ఇత్యాదులందు శ్లేషానుప్రాణితము నగు. దొంగ కుటుంబభరణమునకై యడవులందు దారిగొట్టి ధనము దోఁచుకొని, పిదప దానిని గుఱుతుపట్టినవారిచేఁ బట్టుకొనఁబడినవాఁడై, కొండ దాపునఁ గొఱత వేయఁబడునట్లు, కుకవి కుటుంబభరణమునకై తాటియాకుపుస్తకములలోని యర్థము లకు నపార్థములు సేసి, పిదప శబ్దార్థము చక్కఁగాఁ దెలిసినవారిచే బోధింపఁబడినవాఁడై, రాజ సన్నిధానమున నవమానము నొందు నని భావము. కుకవికి నిట్లు అపార్థములు సేసి యవమానపడుట, కొఱత వేయఁబడుటతో సాటియే యగునని ధ్వని.

క. అని యిష్టదేవతావం, దనసుకవిస్తుతులుఁ గుకవి తతినికృతియుఁ జే
సి నవీనకావ్యరచనకు, ననుకూలకథల్ దలంచు నా సమయమునన్. 10

టీ. అని = ఈ ప్రకారముగా; ఇష్టదేవతావందన సుకవిస్తుతులున్ = ఇష్టదేవతలయొక్క నమస్కరించుటలను, సత్కవులయొక్క పొగడుటలను; కుకవితతి నికృతియున్ = కుత్సితకవుల సమూహముయొక్క నిరాకరణమును; చేసి; నవీనకావ్యరచనకున్ = క్రొత్త ప్రబంధముయొక్క నిర్మాణమునకు; అనుకూలకథల్ = తగినకథలను; తలంచు నా సమయమునన్ = ఆలోచించుచున్నట్టి యా కాలమునందు; ముందు పద్యముతో నన్వయము.

సీ. ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమా, రతకుఁ గ్రౌంచాచలరాజ మయ్యె
నావాడపతి [1]శకం ధర సింధురాధ్యక్షు, లరిగాఁపు లెవ్వాని ఖరతరాసి
కాపంచగౌడధా త్రీపదం బెవ్వాని, కసివాలుగా సేఁగు నట్టి బయలు
సకలయాచకజనా శాపూర్తి కెవ్వాని, ఘనభుజాదండంబు కల్పశాఖ

తే. ప్రబలరాజాధిరాజ వీ ర ప్రతాప, రాజపరమేశ బిరుదవి భ్రాజి యెవ్వఁ
డట్టి శ్రీకృష్ణ[2] రాయవీరాగ్రగణ్యుఁ, డొక్కనాఁడు కుతూహలం బుప్పతిల్ల. 11

టీ. ఎవ్వని కుమారతకున్ = ఏ కృష్ణరాయలయొక్క పిన్నతనమనెడి కుమారస్వామిపన మునకు; మొదలన్ = మొదట; ఉదయాచలేంద్రంబు = ఉదయగిరిదుర్గము; క్రౌంచాచలరాజము = క్రౌంచమను పర్వతశ్రేష్ఠము; అయ్యెన్ = ఆయెనో; ఎవ్వాని ఖరతరాసికిన్ = ఎవనియొక్క చిక్కని వాఁడియయిన కత్తికి; నావాడపతి శకంధర సింధురాధ్యక్షులు = నావాడదేశపురాజును, శకంధరదేశపురాజును, గజపతియనెడి కళింగరాజును; అరిగాఁపులు = కప్పముకట్టునట్టి కాఁపులయిరో; ఎవ్వానికిన్ = ఏ కృష్ణరాయనికి; ఆపంచగౌడధాత్రీపదంబు = పంచగౌడ దేశములతోఁ గూడిన భూభాగము-అనఁగా గౌడులు, కనోజులు, సారస్వతులు, ఉత్కళులు, మైథిలులు అను పంచగౌడుల దేశములతోఁగూడిన హిందూస్థానపురాజుల భూమి యంతయు; అసివాలుగాన్ = షికారుగా; ఏఁగు నట్టిబయలు = పోవునట్టి బయలో; (పంచగౌడదేశములతోఁగూడిన హిందూస్థాన మంతయును కృష్ణ

1. ఇచటి శకంధరపదముచే - అక్కాలమున గుజరాతును పాలించుచుండిన సికందరుషా సూచింపఁబడెను. ఇందువలన కృష్ణరాయల ప్రభుత్వ మెంతదూరము వ్యాపించినదియు స్పష్టము.
2. దేవరాయ వ్రా. పా.

రాయలకు విహారముగాఁ దిరుగుచోటుగా నుండెనో యనుట.) ఎవ్వాని ఘనభుజాదండంబు = ఎవని యొక్క గొప్పదైన దండమువంటి చేయి; సకలయాచకజనాశాపూర్తికిఁ = సమస్తమైన యాచక జనులయొక్క కోరికలను నిండించుటకు; కల్పశాఖి = కల్పవృక్షమో; ఎవ్వఁడు; ప్రబల...విభ్రాజి= గొప్పవైన రాజాధిరాజ, వీరప్రతాప, రాజపరమేశ అనియెడు బిరుదులచేత గొప్పవీరుఁడుగ ప్రకాశించుచుండువాఁడో; అట్టి శ్రీకృష్ణరాయవీరాగ్రగణ్యుఁడు = అట్టి శ్రీకృష్ణదేవరాయలు; ఒక్క నాఁడు = ఒక దినమునందు; కుతూహలంబు = వేడుక; ఉప్పతిల్లఁ = ఉదయింపఁగా; రాఁబోవు మూఁడవపద్యములోని పల్కె నను క్రియతో నన్వయము.

తా. కృష్ణదేవరాయలు మొట్టమొదటఁ గుమారస్వామి క్రౌంచపర్వతమును భేదించినట్లు లుదయగిరిదుర్గమును సాధించి, పిమ్మట నావాడపతి మొదలయినరాజులను దనకుఁ గప్పము కట్టునట్లుగా నొప్పించి, హిందూస్థానపర్యంతమైన పంచగౌడదేశముల స్వారితిరుగుభూములవలె నిష్కంటకముగా నేలి, కల్పవృక్షమువలె యాచకులు కోరినవాని నెల్లఁ దనివిదీఱ నిచ్చుచు, రాజాధిరాజాది బిరుదములు పొంది, రాజ్యము నేలుచుండి యొకనాడు వేడుకపుట్టఁగా; అలంకారములు రూపకాతిశయోక్తులు.

సీ. ఇందీవరంబుల [1]నెనయు క్రాల్గన్నుల, శరదిందుముఖులు చామరము లిడఁగఁ
బణినసూను కణాద బాదరాయణ సూత్ర, [2]ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
బార్శ్వభూమి నభీరు భటకదంబకరాళ, హేతిచ్ఛటాచ్ఛాయ [3]లిరులుకొనఁగ
సామంతమండనోద్దామమాణిక్యాంశు, మండలం [4]బొలసి యీరెండ గాయ
తే. మూరురాయరగండపెండారమణిమ, రీచిరింఛోళిఁ గలయ నావృతములగుచు
నంకపాళి నటద్దుకూలాంచలములు, చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీ వహింప. 12

టీ. ఇందీవరంబులఁ = నల్లగలువలను; ఎనయు = పోలునట్టి; క్రాల్గన్నుల శరదిందు ముఖులు = ప్రకాశించుచున్న కన్నులు గలిగిన శరత్కాల చంద్రునివంటి ముఖములుగలస్త్రీలు; చామరములు = వింజామరలను; ఇడఁగఁ = వీవఁగాను; విద్వాంసులు = పండితులు, పణిన... ఫక్కిఁ = పాణినియొక్కయు, కణాదునియొక్కయు, వ్యాసునియొక్కయు సూత్రముల మార్గమును (వ్యాకరణ, వైశేషిక (తర్క), వేదాంత శాస్త్రములయొక్క మతములననుట); ఉపన్యసింపఁ = ప్రసంగించుచుండఁగాను; పార్శ్వభూమిఁ = ఇరుప్రక్కలందు, అభీరు...ఛాయలు- అభీరు = భయములేని; భట = భటులయొక్క; కదంబ = సమూహముయొక్క; కరాళ=భయంకరములయిన; హేతి = కత్తులయొక్క; ఛటా = సమూహముయొక్క; ఛాయలు = కాంతులు; ఇరులుకొనఁగఁ = చీఁకటులు క్రమ్మఁగాను; సామంత...మండలంబు - సామంత = ఇరుగుపొరుగు రాజులయొక్క; మండన = నగలయందలి; ఉద్దామ = అధికమయిన; మాణిక్య = కెంపులయొక్క; అంశు = కాంతులయొక్క; మండలంబు = సమూహము; ఒలసి = నలుప్రక్కలఁజుట్టుకొని; ఈ రెండ = లేఁతయెండ, కాయఁ = వెలుఁగగాను; (వేఁడిమిలేని యెండవలెఁ బ్రకాశించు రత్నాభరణములు దాల్చిన సామంతరాజులు కొలిచియుండి రని భావము.) మూరురాయరగండ పెండారమణిమరీచిరింఛోళిఁ-మూరురాయర = అశ్వపతి, గజపతి,నరపతి యను ముగ్గురు రాజులకు; గండ = మగఁడనెడి బిరుదును దెలిపెడి; పెండార = కాలియందెయొక్క; మణి = రత్నముల

1. నీను. పా. 2. భంగి. పా. 3. నిరులు. పా. 4. జెలసి. పా.

యొక్క; మరీచి=కాంతులయొక్క; రింఛోళిక్=సమూహముచేత; కలయన్ = అంతటను; అప్పళింపములు = కప్పఁబడినవి; అగుచున్; అంకపాళిక్ = ఒడియందు; నటన్ = కౌఁగిలించుచున్న; మరాళాంచలములు = తెల్లపట్టువస్త్రముయొక్క చెఱఁగులు; చిత్రమాంజిష్ఠవిభ్రమసృక్ = చిత్రవర్ణము గలిసి యెఱుపుమించిన పసుపురంగుయొక్క విలాసముయొక్క సంపదను; వహింపన్ =పొందఁగాను; (ధరించిన బిరుదుబంగారపుటందె యందలి రత్నములకాంతులు ప్రసరించుటవలనఁ దొడ్డప్పుడుంచి తెల్లపట్టువస్త్రముచెఱఁగులు నానావర్ణమై, యెఱుపుమించిన పసుపుకాంతిగలిగియుండఁగా ననుట.) ముందు పద్యముతో నన్వయము. ఇట వణిసూనుఁ డగు పాణినిని 'వణిసూనుఁ' డనుట విచార్యము. అలంకారము తద్గుణము.

క. భువనవిజ[1]యాఖ్యసంస, ద్భవన[2]స్థితసింహపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిం
గవితామధురిమ డెందము, దవులం గొలువుండి సదయతన్ ననుఁ బల్కెన్.

టీ. భువన......పీఠిక్ = భువనవిజయమను పేరుగల సభాభవనమునందున్నట్టి సింహాసనమునందు; ప్రాజ్ఞులగోష్ఠిక్ = పండితుల ప్రసంగమువలన; కవితామధురిమ = కవిత్వముయొక్క తియ్యఁదనము; డెందము = మనస్సును; తవులక్ = అంటఁగా; కొలువుండి = కొలువుదీరియుండి; సదయతక్=కృపతోఁగూడినతనముచేత; ననుక్ = నన్నుఁగూర్చి; పల్కెన్ = ఒకసలుకు పలికెను. దీనికిఁ బైపద్యము కర్మము.

తే. సప్తసంతానములలోఁ బ్రశస్తిఁగాంచి, ఖిలముగాకుండునది ధాత్రిఁ గృతియకాన
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ, పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య. 14

టీ. పెద్దనార్య = పూజ్యుఁడవైన పెద్దనా! ధాత్రిక్ = భూమియందు; సప్తసంతానములలోక్ = తటాకము, నిధి, అగ్రహారము, దేవాలయము, వనము, ప్రబంధము, పుత్త్రుఁడు అను నీ యేడు సంతానములలోపల; ప్రశస్తిక్ = ప్రసిద్ధిని; కాంచి=పొంది; ఖిలము గాకుండునది=నెడక యుండునట్టిది; కృతియకాన = ప్రబంధమే కనుక; శిరీషకుసుమ......ఉక్తులక్ = దిరిసెనపుఁ బువ్వువలె మృదువై అమృతమయములయిన - అనఁగా రసవంతములయిన మాటలచేత; కృతిక్ = ప్రబంధమును; మాకుక్ = మాకొఱకు (మా కంకితముగా ననుట); రచింపుము = చేయుము. అలంకారము ఉపమ.

క. హితుఁడవు చతురవచోనిధి, వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా, పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్?

టీ. హితుఁడవు = మా మేలుకోరువాఁడవు; చతురవచోనిధివి = సరసములయిన మాటలకుఁ జోటయినవాఁడవు; అతుల......యుతుఁడవు = సాటిలేని (ఇది 'స్మృతి'కి విశేషణము); భాగవతాది పురాణములయొక్కయు, పాంచరాత్రము మొదలయిన యాగమములయొక్కయు, భారతము మొదలయిన పూర్వరాజచరిత్రములయొక్కయు, కథలయొక్కయు అభిప్రాయముల జ్ఞప్తితో గూడినవాఁడవు; ఆంధ్రకవితాపితామహుఁడవు = ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మవు; నీకున్ = నీతో; పేర్కొనక్ = సాటిగాఁజెప్పుటకు; ఈడు=సాటి; ఎవ్వరు=ఎవరున్నారు? (ఎవ్వరును లేరనుట.)

క. మనువులలో స్వారోచిష, మనుసంభవ మరయ వినఁగ మనమునకు ఫలకృ
ద్విన నింపు కలిధ్వంసక, మనఘ భవచ్చతురరచన కనుకూలంబు. 16

1. యాంక. పా. 2. స్థితి. పా.

టీ. అనఘ = పాపములేనివాఁడవయిన పెద్దనార్యా! మనువులలోన్ = స్వాయంభువుఁడు మొదలుగాఁగల పదునలుగురు మనువులలోపల; స్వారోచిషమనుసంభవము = రెండవవాఁడైన స్వారోచిషమనువుయొక్క జన్మకథ; అరయన్ = విచారింపఁగా; రససమంచితకథలన్ = శృంగారాదిరసములతో ఒప్పు కథలచేత; వినన్ = వినుటకు; ఇంపు = ఇష్టమైనదియు; కలిధ్వంసకము = పాపములను నశింపఁజేయునదియు; భవచ్చతురరచనకున్ = నీయొక్క ప్రౌఢమయిన కూర్పునకు; అనుకూలంబున్ = తగినదియు (అగును).

వ. కావున మార్కండేయపురాణోక్తప్రకారంబునం జెప్పుమని కర్పూరతాంబూలంబు వెట్టినం బట్టి మహాప్రసాదం బని మోదంబున నమ్మహాప్రబంధనిబంధనంబునకుఁ బ్రారంభించితి నేతత్కథానాయకరత్నం బగు నమ్మహీ[1]నాథు వంశావతారం బెట్టిదనిన. 17

టీ. కావునన్ = కనుక; మార్కండేయపురాణోక్త ప్రకారంబునన్ = మార్కండేయపురాణమునందుఁ జెప్పఁబడినవిధమున; చెప్పుము = ప్రబంధరచన చేయుము; అని; కర్పూరతాంబూలంబు = పచ్చకర్పూరముతోడి తాంబూలమును; పెట్టినన్ = ఈయఁగా; పట్టి = గ్రహించి; మహాప్రసాదంబు = గొప్ప యనుగ్రహము; అని = అనుకొని; మోదంబునన్=సంతోషముతో; అమ్మహాప్రబంధనిబంధనమునకున్ = ఆ గొప్ప కావ్యముయొక్క రచనకు; ప్రారంభించితిన్ = మొదలు పెట్టితిని; ఏతత్కథానాయకరత్నంబు = ఈ కృతిపతిశ్రేష్ఠుఁడు; అగు నమ్మహీనాథు వంశావతారంబు = అయిన యా కృష్ణదేవరాయని వంశముయొక్క పుట్టుక; ఎట్టిది = ఎటువంటిది; అనినన్ = అనఁగాఁ; ముందు పద్యముతో నన్వయము.

సీ. కలశపాథోరాశి ♦ గర్భవీచిమతల్లి, కడుపార నెవ్వాని ♦ గన్నతల్లి
యనలాక్షుఘనజటా ♦ వనవాటి కెవ్వాఁడు, వన్నె వెట్టు ననార్త ♦ వంపుఁబువ్వు
సకలదైవతబుభు ♦ క్షాపూర్తి కెవ్వాఁడు, పుట్టుగానని మేని ♦ మెట్టపంట
కటికిచీఁకటితిండి ♦ కరములగిలిగింత, నెవ్వాఁడు తొగకన్నె ♦ నవ్వఁ[2]జేయు
తే. నతఁడు ప్రొగడొందు మధుకైట ♦ భారిమఱఁది, కళలనెలవగువాఁడుచు ♦ క్కలకుఱేఁడు
మిసిమిపరసీమ వలరాజు ♦ మేనమామ, వేవెలుంగులదొరజోడు ♦ రేవెలుంగు. 18

టీ. కలశ...మతల్లి = పాలసముద్రముయొక్క లోపలిభాగమనెడి కడుపునందలి తరంగశ్రేష్ఠము; కడుపారన్=కడుపుతనియునట్లు; ఎవ్వానిన్ = ఏ చంద్రుని; కన్నతల్లి = కనినతల్లియో; అలం. పర్యాయోక్తి. ఎవ్వాఁడు = ఏ చంద్రుఁడు; అనలాక్షు... వాటికిన్ = (నిప్పుకన్నుగల) శివునియొక్క గొప్పవయిన జడలనెడు అడవులయొక్క పంక్తికి; వన్నెవెట్టు ననార్తవంపుఁబువ్వు= అలంకారమును కలుగఁ జేయునట్టి ఋతుసంబంధములేని పుష్పమో; (ఇతరపుష్పము లా యా ఋతువులందుఁ బుట్టునవి. ఈ చంద్రుఁ డను పుష్పమో యట్టిదిగాదు. అనఁగా నే చంద్రుఁడు సర్వకాలమును శివుని శిరస్సునకుఁ బుష్పాలంకారమై యుండునో యనుట. వన్నెవెట్టెడునార్తవంపుఁబువ్వు అను పాఠమున - ఆర్తవంపుఁబువ్వు=పరువమైన పుష్పము అని యర్థము.) అలం. రూపకము. ఎవ్వాఁడు=ఏ చంద్రుఁడు; సకల...పూర్తికిన్ = సమస్తమైన దేవతల ఆఁకలితీఱుటకు; పుట్టుకానని మేనిమెట్టపంట = మొలకెత్తుట తెలియని దేహరూపమయిన మెరకనేలపంటయో;

1. కాంతు. పా. 2. జెనకు. పా.

('మెట్టపంట' అనుటచే వర్షప్రతిబంధముచేఁ జెడని దని సూచితము. ఎన్నఁడును జెడని యాహారమగునో యనుట.) ఎవ్వాఁడు; కటికి...గిలిగింతన్ = గాఢాంధకారమే ఆహారముగాఁగల-(చీఁకటి నణఁచివేయునట్టి యనుట) కిరణము లనెడి చేతులచేనైన చక్కిలిగింతచేత; తొగకన్నెన్ = కలువ యను పడుచును; నవ్వన్ = నవ్వునట్లు; (వికసించునట్లు.) చేయున్ = చేయునో; అలం. రూపకము. మధుకైటభారిమఱంది = మధుకైటభులకు శత్రువయిన విష్ణువుయొక్క భార్యకుఁ దోఁడఁబుట్టినవాఁడును; కళలనెలవగువాఁడు = షోడశసంఖ్య గల కళలకుఁ జోటయినవాఁడును; చుక్కలకున్ ఱేఁడు = అశ్విన్యాదినక్షత్రములకు నాథుఁడును; మిసిమిపరసీమ = కాంతికిఁ బరమావధియును - అనఁగా దానికడపటి హద్దయినవాఁడును; వలరాజు మేనమామ = మన్మథునితల్లి తోఁబుట్టువయినవాఁడును; వేవెలుంగులదొరజోడు = వేయి కిరణములుగల సూర్యునికి జతయైన వాఁడును; రేవెలుంగు = రాత్రియందుఁ బ్రకాశముగలవాఁడును (రాత్రిని బ్రకాశించువాఁ డనుట); (అగు) అతఁడు = ఆ చంద్రుఁడు; పొగడు = పొగడ్తను; ఒందున్ = పొందును.

తా. పాలసముద్రమునందుఁ బుట్టినవాఁడును, శివుని జటాజూటమునకుఁ బుష్పాలంకారమైనవాఁడును, దేవతలకుఁ దన కళల నాహారముగా నిచ్చువాఁడును, గలువలను వికసింపఁజేయువాఁడును, లక్ష్మీదేవికిఁ దోఁడఁబుట్టినవాఁడును, బదియాఱుకళలకుఁ జోటయినవాఁడును, నశ్విన్యాది నక్షత్రములకు భర్తయుఁ, గాంతికి నిధియు, సూర్యునికి జతకాఁడు నయిన చంద్రుఁడు పొగడొందును. అలం. ఉదాత్తము.

తే. ఆ సుధాధామువిభవమహాంబురాశి, కుబ్బ మీఱంగ నందనుఁ డుదయమయ్యె
వేదవేదాంగశాస్త్రార్థ విశదవాస, నాత్తధిషణాధురంధరుం డైన బుధుఁడు.

టీ. ఆ సుధా...అంబురాశికిన్ = అమృతకిరణుఁడైన యా చంద్రునియొక్క సంపద యనెడు గొప్పసముద్రమునకు; ఉబ్బ = ఉబుకుట (ఆధిక్యము); మీఱంగన్ = అతిశయించునట్లు; వేద... ధురంధరుండు - వేద = నాలుగువేదములయొక్కయు; వేదాంగ = శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనెడి యాఱువేదాంగములయొక్కయు; శాస్త్ర = మీమాంసాది శాస్త్రములయొక్కయు; అర్థ = అభిప్రాయములందలి; విశద = స్పష్టమయిన; వాసనా = పరిచయముచేత; ఆత్త = పొందఁబడిన, ధిషణా = బుద్ధియొక్క; ధురంధరుండు = భారమును వహించువాఁడు (నిర్వాహకుఁడు); ఐన బుధుఁడు = అయినట్టి బుధుఁడు; (ఇట బుధనామ మన్వర్థసంజ్ఞ యని తెలియనగును.) (అను) నందనుఁడు = కొడుకు; ఉదయమయ్యెన్ = పుట్టెను.

తా. ఆ చంద్రుని యైశ్వర్యము మఱియు నతిశయించునట్టు లతనికి వేదశాస్త్రార్థములు చక్కఁగాఁ దెలిసినట్టి బుధుఁడను పేరుగల - పండితుఁ డయిన కొడుకు పుట్టెను.

క. వానికిఁ బురూరవుఁడు ప్రజ్ఞానిధి [1]యుదయించె [2]శక్రసదృశుఁడు; తద్భూ
జానికి నాయువు తనయుం, డై నెగడె; నతండు గనె యయాతినరేంద్రున్. 20

టీ. వానికిన్ = ఆ బుధునకు; ప్రజ్ఞానిధి = బుద్ధికి స్థానభూతుఁడయిన (మిక్కిలిబుద్ధిమంతుఁడయిన); పురూరవుఁడు = పురూరవుడను రాజు; ఉదయించెన్ = పుట్టెను; తద్భూజానికిన్ = ఆ పురూరవునకు; శక్రసదృశుఁడు = ఇంద్రునితో సమానుఁడయిన; ఆయువు = ఆయువనువాఁడు; తనయుండై = కుమారుఁడై; నెగడెన్ = వర్ధిల్లెను; అతఁడు = ఆ యాయువు; యయాతి నరేంద్రున్ = యయాతి యను రాజును; కనెన్.

1. జనియించె. పా. 2. సింహ. పా.

క. అతనికి యదుతుర్వసులను, సుతు లుద్భవమొంది రహిత సూదనులు కళా
న్వితమతులు; వారిలో వి, శ్రుతకీర్తి వహించెఁ దుర్వ సుఁడు గుణనిధియై. 21

టీ. అతనికిన్ = ఆ యయాతికి; అహితసూదనులు = శత్రులను జంపువారును; కళాన్విత మతులు = విద్యతోఁ గూడిన బుద్ధిగలవారును నయిన; యదుతుర్వసులు = యదువు, తుర్వసుఁడు; అను సుతులు = అను పేళ్లుగల కొడుకులు; ఉద్భవమొందిరి = పుట్టిరి; వారిలోన్ = ఆ యిద్దఱిలోను; తుర్వసుఁడు = తుర్వసుఁ డనువాఁడు; గుణనిధియై = మంచిగుణములకు స్థానమయినవాఁడై; విశ్రుతకీర్తిన్ = ప్రసిద్ధమయిన యశస్సును; వహించెన్ = పొందెను.

తే. వాని వంశంబు తుళువాన్వ యాయ మయ్యె;
నందుఁ బెక్కండ్రు నృపు లుద యంబు నొంది
నిఖిలభువన ప్రపూర్ణని ర్ణిద్రకీర్తి
నధికు లైరి; తదీయాన్వ యమునఁ బుట్టి. 22

టీ. వాని వంశంబు = ఆ తుర్వసునియొక్క వంశము; తుళువాన్వాయము = తుళువవంశము; అయ్యెన్ = ఆయెను; అందున్ = ఆ తుళువవంశమునందు; పెక్కండ్రు = అనేకులు; నృపులు = రాజులు; ఉదయంబునొంది = పుట్టి; నిఖిల...కీర్తిన్ = సమస్తమయిన లోకములయందు నిండిన ప్రకాశించుచున్న యశస్సుచేత; అధికులైరి = గొప్పవారైరి. తదీయాన్వయమునన్ = ఆ తుళువ రాజులదైన వంశమునందు; పుట్టి = పుట్టినవాఁడై: దీనికిఁ గర్త క్రింది పద్యమునందలి తిమ్మ క్షితీశాగ్రణి.

మ. స్ర. ఘనుఁడై తిమ్మక్షితీశా గ్రణి శఠకమఠ గ్రావసంఘాత వాతా
శనరాడాశాంతదంతి స్థవిరకిరుల జం జాటముల్ మాన్పి యిమ్మే
దిని దోర్దండైకపీఠిం దిరముపఱిచి కీ ర్తిద్యుతుల్ రోదసిం బ [పెన్.
ర్వ నరాతుల్ నమ్రులై పా ర్శ్వములఁగొలువఁ దీ వ్రప్రతాపంబు సూ

టీ. తిమ్మక్షితీశాగ్రణి = తిమ్మయ యను రాజశ్రేష్ఠుఁడు; ఘనుఁడై = గొప్పవాఁడై; శఠ...జంజాటముల్ - శఠ = కృత్రిమమయిన; కమఠ = తాఁబేటియొక్కయు (కూర్మావతార మెత్తిన విష్ణువుయొక్కఅనుట); గ్రావసంఘాత = కొండల సమూహముయొక్కయు (కులపర్వతముల యొక్కయు ననుట); వాతాశనరాట్ = (గాలి యన్నముగాఁగల సర్పములకు రాజైన) ఆది శేషునియొక్కయు; ఆశాంతదంతి = దిక్కుల కొనయందలి యేనుఁగులయొక్కయు (దిగ్గజముల యొక్కయు ననుట); స్థవిరకిరుల = ఆదివరాహముయొక్కయు; జంజాటముల్ = మానని సంబంధములను; మాన్పి = పోఁగొట్టి; ఇమ్మేదినిన్ = ఈ భూమిని; దోర్దండైకపీఠిన్ = దండమువంటి బాహువనెడి ముఖ్యమయిన పీఠమునందు; తిరముపఱిచి = స్థిరముగాఁ బాదుకొలిపి; కీర్తిద్యుతుల్ = యశస్సుయొక్క కాంతులు; రోదసిన్ = భూమ్యాకాశముల మధ్యభాగమందు, పర్వన్ = వ్యాపింపఁగాను; అరాతుల్ = శత్రువులు; నమ్రులై = వంగినవారై; పార్శ్వములన్ = ఇరుప్రక్కలయందును; కొల్వన్ = సేవింపఁగాను; తీవ్రప్రతాపంబు = తీక్ష్ణమయిన పరాక్రమము; చూపెన్ = కనఁబఱిచెను.

---

1. జంఝూటముల్ మాన్చి. పా.

తా. తిమ్మరాజు తాను తన బాహువుచేతమాత్రమే భూమిని జక్కఁగా భరించుటచేత నాదికూర్మము మొదలగు భూమిని మోచువారు భూమిని మోయవలసిన యక్కఱ లేక సుఖింపఁగా నధికపరాక్రమముచేత శత్రువుల నందఱను జయించి, మిక్కిలి గీర్తిమంతుఁడయ్యెను. అలం. అతిశయోక్తి.

క. వితరణఖని యా తిమ్మ, క్షితిపగ్రామణికి దేవ ౹ కీదేవికి నం
చితమూర్తి యీశ్వరప్రభుఁ, [1]డతినిపుణుఁడు పుట్టె సజ్జ ౹ నావనపరుఁడై. 24

టీ. వితరణఖని = దానమునకు గనియయిన; ఆ తిమ్మక్షితిపగ్రామణికిన్ = ఆ తిమ్మరాజశ్రేష్ఠునకును; దేవకీదేవికిన్ = దేవకియను రాణికిని; అంచితమూర్తి = ఒప్పిదమయిన యాకారము గలవాఁడును; అతినిపుణుఁడు = మిక్కిలి సమర్థుఁడును నైన; ఈశ్వరప్రభుఁడు = ఈశ్వరరాజు; సజ్జనావనపరుఁడై = సాధువులను రక్షించుటయం దాసక్తుఁడై; పుట్టెన్.

చ. బలమదమత్తదుష్ట పుర ౹ భంజనుఁడై పరిపాలితార్యుఁడై
యిలపయిఁ దొంటి యీశ్వరుఁడె ౹ యీశ్వరుఁడై జనియింప రూపఱెన్
జలరుహనేత్రలం దొఱఁగి ౹ శైలవనంబుల భీతచిత్తులై
మెలఁగెడు శత్రుభూపతుల ౹ మేనులఁ దాల్చిన మన్మథాంకముల్. 25

టీ. బల...భంజనుఁడై = బలముచేతను, క్రొవ్వుచేతను మత్తుగొన్న చెడ్డరాజులయొక్క (దుష్టులయిన రాక్షసులయొక్క యని శివపరమైన యర్థాంతరము) పట్టణములను (త్రిపురములను అని యర్థాంతరము) నాశనముచేసినవాఁడై; పరిపాలితార్యుఁడై = కాపాడఁబడిన పూజ్యులుగలవాఁడై (కాపాడఁబడిన పార్వతిగలవాఁడై అని యర్థాంతరము); తొంటి యీశ్వరుఁడె = మునుపటి శివుఁడే; ఇలపయిన్ = భూమిమీఁద; ఈశ్వరుఁడై = ఈశ్వరరాజయి; జనియింపన్ = పుట్టఁగా; జలరుహనేత్రలన్ = కమలములవంటి కన్నులుగల స్త్రీలను; (భార్యలను); తొఱఁగి = విడిచి; భీతచిత్తులై = భయమునొందిన మనస్సుగలవారలై; శైలవనంబులన్ = కొండలయందును, నడవులయందును; మెలఁగెడు శత్రుభూవరులమేనులన్ = తిరుగునట్టి శత్రురాజులయొక్క శరీరములయందు; తాల్చిన మన్మథాంకముల్ = ధరించిన మన్మథచిహ్నములు; రూపఱెన్ = నశించెను. (ఈశ్వరుఁడు మన్మథునిఁ గాల్చి భస్మముచేసినవాఁడు గనుక మన్మథాంకములు నశించెనని సంబంధము.)

తా. ఈశ్వరరాజు - మునుపు త్రిపురములను బాడుచేసి, లోకములకు మేలుచేసిన పార్వతీపతియైన శివునివలె దుష్టరాజుల నందఱను జయించి, సత్పురుషులను గాపాడుచు, దుష్టులను శిక్షించుచు, భూమినంతయుఁ జక్కఁగాఁ బాలించుచుండుటవలన నతని శత్రురాజులు భార్యలను వదలి, యడవులందు భయమునఁ దిరుగుచుండుటచే వారికి స్త్రీలవలనం గలుగు మన్మథవికారములు బొత్తిగా మాసిపోయెను. అలం. రూపకము.

సీ. నిజభుజాశ్రితధారు ౹ణీవజ్రకవచంబు, దుష్టభుజంగాహి ౹ తుండికుండు
వనజేక్షణామనో ౹ ధనపశ్యతోహరుం, డరిహంససంపద ౹ భ్రాంగమంబు
మార్గణగణపిక ౹ మధుమాసదివసంబు, గుణరత్నరోహణ ౹ క్షోణిధరము
బాంధవసందోహ ౹ పద్మవనీహేళి, కారుణ్యరసనిమ్న ౹ గా కళత్రుఁ

1. డతిపుణ్యుఁడు. పా.

తే. డన జగంబుల మిగులఁ బ్ర § ఖ్యాతిఁ గాంచె, ధరణిధవదత్తవివిధోప § దావిధాన
మార్జితశ్రీవినిర్జిత § నిర్జరాల, యేశ్వరుఁడు తిమ్మభూపతి § యీశ్వరుండు. 26

టీ. ధరణి...ఈశ్వరుఁడు - ధరణిధవ = రాజులచేత; దత్త = సమర్పింపఁబడిన; వివిధ= నానావిధములయిన; ఉపదా = కానుకలయొక్క; విధా = రీతిచే; సమార్జిత = సంపాదింపఁబడిన; శ్రీ = సంపదచే; వినిర్జిత = జయింపఁబడిన; నిర్జరాలయేశ్వరుఁడు = స్వర్గమునకుఁ బ్రభువైన యింద్రుఁడు గలవాఁడైన (దేవేంద్రభోగమును మించినభోగము గలవాఁడనుట); తిమ్మభూపతి యీశ్వరుండు = తిమ్మరాజు కుమారుఁడైన యీశ్వరరాజు; నిజ...కవచంబు = తనదైన బాహువును పొందిన భూమికి, వజ్రమణులతోఁ జేయఁబడిన కవచము వంటివాఁడును; దుష్ట...అహితుండికుండు = దుర్మార్గులనెడు పాములకు పాములవానివంటివాఁడును; వనజేక్షణా...పశ్యతోహరుండు = కమలమువంటి కన్నులుగల స్త్రీలయొక్క మనస్సనెడు ధనమునకు చూచుచుండునప్పుడే దొంగిలించుకొని పోవునట్టి దొంగయు; అరి...అభ్రభాగమంబు = శత్రువులనెడి అంచలయొక్క సమూహమునకు వర్షాకాలమువంటివాఁడును(హంసలకు వర్షర్తువు వినాశకరము);మార్గణ...దివసంబు= యాచకుల సమూహమనెడు కోయిలలకు=చైత్రమాసపు దినమువంటివాఁడును (వసంతఋతువైనవాఁడనుట); గుణ...ధరము = సద్గుణములనెడి మణులకు రోహణ పర్వతమువంటివాఁడును (రోహణ పర్వతమునందు రత్నపుగను లెక్కువగా నుండును); బాంధవ...హేళి = బంధువులయొక్క సమూహమనెడు తామరల సమూహమునకు సూర్యునివంటివాఁడును; కారుణ్య...కళత్రుఁడు = దయారసమనెడి నీటికి (నదులు భార్యలుగాఁగల) సముద్రునివంటివాఁడును; అనన్ = అనునట్లు, జగంబులన్ = లోకములయందు; మిగులన్ = అధికముగా; ప్రఖ్యాతిన్ = ప్రసిద్ధిని; కాంచెన్= పొందెను. అలం. రూపకోల్లేఖములు.

క. ఆ యీశ్వరనృపతికిఁ బు, ణ్యాయతమతియైన బుక్క § మాంబకుఁ దేజ
స్తోయజహితు లుదయించిరి, ధీయుతులగు నారసింహ § తిమ్మనరేంద్రుల్. 27

టీ. ఆ యీశ్వరనృపతికిన్ = ఆ యీశ్వరరాజునకును; పుణ్యాయతమతి = పుణ్యములయందతిశయించినబుద్ధిగలది; ఐన బుక్కమాంబకున్ =అయినట్టి బుక్కమదేవికిని; తేజస్తోయజహితులు = ప్రతాపమునందు సూర్యులును; ధీయుతులు = దొడ్డబుద్ధితోఁ గూడినవారును; అగు నారసింహ, తిమ్మనరేంద్రుల్ = అగునట్టి నరసింహరాజును, తిమ్మరాజును; ఉదయించిరి = పుట్టిరి.

క. అందు నరసప్రభుఁడు హరి, చందన మందార కుంద § చంద్రాంశునిభా
స్పందయశస్తుందిల ది, క్కందరుఁడై ధాత్రి యేలెఁ § గలుషము లడఁగన్.

టీ. అందున్ = ఆ యిద్దఱిలోను; నరసప్రభుఁడు = నరసింహరాజు; హరిచందన...కందరుఁడై - హరిచందన=శ్రీగంధముతోను; మందార=కల్పవృక్షముతోను; కుంద=మొల్లపువ్వులతోను; చంద్రాంశు = చంద్రకిరణములతోను; నిభ = సమానమైన; అస్పంద = చలనములేని; యశః = కీర్తిచేత; తుందిల = బలిసిన (నిండుకొన్న); దిక్కందరుఁడై = దిక్కులనెడి గుహలుగలవాఁడై; కలుషములు = పాపములు; అడఁగన్ = నశించునట్లు; ధాత్రి = భూమిని; ఏలెన్ = పరిపాలించెను. అలం. ఉపమ, అతిశయోక్తియు.

ఉ. శ్రీరుచిరత్వ భూతి మతి § జిత్వరతాకృతి శక్తి కాంతులన్
ధీరత సార భోగముల § ధీనిధి యీశ్వరనారసింహుఁ డా

వారిజనాభశంకరుల ౹ వారికుమారుల వారితమ్ములన్
వారియనుంగుమామలను ౹ వారివిరోధులఁ బోలు నిమ్మహిన్. 29

టీ. ఇమ్మహిన్ = ఈ భూమియందు; ధీనిధి = బుద్ధికి గనియయిన; ఈశ్వరనారసింహుఁడు= ఈశ్వరరాజుకుమారుఁడైన నరసరాజు; శ్రీ...కాంతులన్ - శ్రీరుచిరత్వ = లక్ష్మిచేఁ బ్రకాశించుటచేతను; భూతి = ఐశ్వర్యముచేతను, మతి = బుద్ధిచేతను, జిష్ణుతా = జయించు స్వభావము చేతను; ఆకృతి = రూపముచేతను; శక్తి=సామర్థ్యముచేతను; కాంతులన్ = ప్రకాశముచేతను; ధీరతన్ = ధైర్యముచేతను; సార,భోగములన్ = జేవచేతను, భోగముచేతను; ఆ వారిజనాభ శంకరులన్ = ప్రసిద్ధులగు విష్ణుశివులను; వారి కుమారులన్ = ఆ విష్ణుశివుల కొడుకులగు బ్రహ్మ, కుమారస్వాములను; వారి తమ్ములన్ = ఆ బ్రహ్మయొక్కయు, కుమారస్వామియొక్కయుఁ దమ్ములయిన మన్మథ, వీరభద్రులను; వారి యనుంగుమామలన్ = ఆ మన్మథ, వీరభద్రులకుఁ బ్రియమైన మేనమామలగు చంద్ర, మైనాకులను; వారి విరోధులన్ = ఆ చంద్ర, మైనాకుల శత్రువులగు రాహువును, నింద్రునిని; పోలున్ = సరిపోలును.

తా. నరసరాజు లక్ష్మికలిమిచేత విష్ణువును, నైశ్వర్యముకలిమిచేత శివునిని, బుద్ధిచేత బ్రహ్మను, జయశీలత్వముచేతఁ గుమారస్వామిని, జక్కదనముచేత మన్మథునిని, సామర్థ్యముచేత వీరభద్రునిని, గాంతిచేతఁ జంద్రునిని, ధైర్యముచేత మైనాకపర్వతమును, జేవచేత రాహువును, భోగముచేత నింద్రునిని సరిపోలును. అలం. ఉపమా, యథాసంఖ్యములు.

సీ. అంభోధివసనవి ౹ శ్వంభరావలయంబుఁ, దనబాహుపురిమర ౹ తకముఁ జేసె
నశ్రాంతవిశ్రాణ ౹ నాసారలక్ష్మికిఁ, గవికదంబముఁ జాత ౹ కములఁ జేసెఁ
గకుబంతనిఖిలరా ౹ ణ్ణికరంబుఁ జరణమం, జీరంబుసాలభం ౹ జికలఁ జేసె
మహనీయనిజవిని ౹ ర్మలయశస్సరసికి, గగనంబుఁ గలహంస ౹ కంబుఁ జేసె

తే. నతిశితకృపాణకృత్తమ ౹ త్తారివీర, మండలేశ సకుండల ౹ మకుట నూత్న
మస్తమాల్యపరంపరా ౹ మండనార్చి, తేశ్వరుం డగు నారసిం ౹ హేశ్వరుండు. 30

టీ. అతిశిత...ఈశ్వరుఁడు - అతిశిత=మిక్కిలివాఁడియయిన; కృపాణ = కత్తిచేత; కృత్త = నఱకఁబడిన, మత్త = మదించిన; అరి=శత్రువులలో; వీర=శూరులైన; మండలేశ=రాజులయొక్క; సకుండల=చెవిపోఁగులతోఁగూడిన; మకుట = కిరీటములుగల; నూత్న=క్రొత్తలయిన; మస్తమాల్య= శిరస్సులమాలికలయొక్క; పరంపరా = సమూహములనెడు; మండన=అలంకారములచేత; అర్చిత= పూజింపఁబడిన; ఈశ్వరుఁడు = శివుఁడుగలవాఁడు; అగు నారసింహేశ్వరుండు = అగునట్టి నరసరాజు; అంభోధి...వలయంబున్ - అంభోధివసన = సముద్రమే వస్త్రముగాఁగల; విశ్వంభరా వలయంబున్ = భూమండలమును; తన బాహుపురిమరతకమున్ = తనయొక్క భుజకీర్తులకు మరకత మణిగా; చేసెన్ (అనాయాసముగా భూమిని బాలించెననుట); అలం. అతిశయోక్తి. అశ్రాంత... లక్ష్మికిన్ = యెడతెగని ఈవి యనెడి ధారారూపమైన యెడతెగని వానయొక్క కలిమికి; కవికదంబమున్ = కవులయొక్కసమూహమును; చాతకములన్ = వానకోయిలలనుగా; చేసెన్; అలం. రూపకము. కకుబంత...నికరంబున్= దిగంతములయందలి సమస్త రాజులయొక్క, సమూహమును; చరణమంజీరంబు సాలభంజికలన్ = కాలి గండపెండేరమునందుఁ జెక్కఁబడిన బొమ్మలనుగా; అలం. అతిశయోక్తి. మహనీయ...సరసికిన్ = పూజ్యమైన తన స్వచ్ఛమైన కీర్తియనెడు

కొలనికి; గగనంబు = ఆకాశమును; కలహంసకంబుగా = హంసగా; చేసెన్. అలం. రూపకము, అతిశయోక్తియు.

తా. నరసరాజు భూమిని దన బాహుబలముచే ననాయాసముగా నేలె ననియుఁ, గవులను నిరంతరము దానము లిచ్చి మనిచె ననియు, సకలదేశాధిపతులను గెలిచినందులకు బిరుదుగాఁ దన కాలి గండపెండేరమునందు నా రాజులరూపమును చెక్కించెననియు, ఆకాశమును దాఁటునట్టు వ్యాపించిన కీర్తిగలవాఁ డయ్యెననియు, శివుఁడు కపాలమాలికలు ధరించువాఁడు గనుకఁ దన శత్రువుల తలలు నఱికి సరములుగాఁగూర్చి శివునికి సమర్పించె ననియుఁ దాత్పర్యము.

తే. ఆ నృసింహప్రభుండు దిప్పాంబవలన, నాగమాంబికవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయభూవిభుని నచ్యు, తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు.

టీ. ఆ నృసింహప్రభుండు = ఆ నరసరాజు; తిప్పాంబవలనన్ = తిప్పమ్మవలనను; నాగమాంబికవలనన్ = నాగమ్మవలనను; (క్రమముగా) వీరనరసింహరాయభూవిభునిన్ = వీరనరసింహరాజును; అచ్యుతాంశసంభవున్ = విష్ణువుయొక్క యంశమువలనఁ బుట్టిన; కృష్ణరాయక్షితీంద్రునిన్=కృష్ణరాయ ప్రభువును; నందనులన్ = (ఈ యిద్దఱు) కొడుకులను, కాంచెన్=కనియెను.

క. వీరనృసింహుఁడు నిజభుజ, దారుణకరవాలపరుష ధారాహతవీ
రారి యగుచు నేకాతప, వారణముగ నేలె ధరఁ న వారణమహిమన్. 32

టీ. వీరనృసింహుఁడు = వీరనరసింహరాజు; నిజ ..అరి - నిజ = తనదైన; భుజ=బాహువునందలి; దారుణ=తీక్ష్ణమయిన; కరవాల = కత్తియొక్క; పరుష = కఱకైన; ధారా=వాదరచేత; హత = నఱికి చంపఁబడిన; వీర = శూరులయిన; అరి = శత్రువులు గలవాఁడు; అగుచున్; అవారణమహిమన్ = అడ్డులేని ప్రభావముచేత; ఏకాతపవారణముగన్ = ఏకచ్ఛత్రాధిపత్యముగా; ధరన్ = భూమిని; ఏలెన్ = పాలించెను.

క. ఆ విభునసంతరంబ ధ, రావలయముఁ దాల్చెఁ గృష్ణ రాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల, దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులుగాన్. 33

టీ. ఆ విభునసంతరంబ = ఆ వీరనరసింహరాయని పిమ్మటనె; కృష్ణరాయఁడు = కృష్ణదేవరాయలు; చిన్నాదేవియున్; శుభమతి = మంచిబుద్ధిగల; తిరుమలదేవియునున్ = తిరుమలదేవి యనునామెయు; తనకున్; కూర్చు దేవేరులుగాన్ = ప్రియులయిన పట్టపుభార్యలు కాఁగా; ధరావలయమున్ = భూమండలమును; తాల్చెన్ = ధరించెను.

సీ. తొలఁగెను ధూమకే తుక్షోభ జనులకు, నతివృష్టిదోషభ యంబు వాసెఁ
గంటకాగమభీతి గడచె నుద్ధతభూమి, భృత్కటకం బెల్ల నెత్తువడియె
మాసె నఘుస్ఫూర్తి మరుభూములందును, నెలమూఁడువానలు నిండఁ గురిసె
నాబాలగోపాల మఖిల[1]సద్ద్విజమును, నానందమును[2]బొంది యతిశయిల్లెఁ

తే. బ్రజలకెల్లను గడు రామరాజ్యమయ్యెఁ, జారుసత్త్వాఢ్యుఁ డీశ్వర నారసింహ
భూవిభునికృష్ణరాయఁ డభ్యుదయమొంది, పెంపుమీఱంగ ధాత్రిఁ[3]బాలింపఁగాను.

1. సత్త్వజయును. పా. 2. మునమున్కన. పా. 3. పాలింపుచుండ. పా.

టీ. చారుసత్త్వాఢ్యుఁడు = ఒప్పుచున్న బలము గలవాఁడయిన; ఈశ్వరనారసింహభూవిభుని కృష్ణరాయఁడు = ఈశ్వర నరసింహరాజుకొడుకైన కృష్ణరాయఁడు; అభ్యుదయము = రాజ్యాధిపత్యసంబంధమైన మేలిని; ఒంది = పొంది; పెంపు = అభివృద్ధి; మీఱంగన్ = అతిశయింపఁగా; ధాత్రిన్ = భూమిని; పాలింపఁగాను = ఏలఁగా; జనులకున్ = భూప్రజలకు; ధూమకేతుక్షోభ = అరిష్టసూచకమయిన తోఁకచుక్కయొక్క యుపద్రవము; తొలఁగెను = లేకపోయెను. అతివృష్టిదోషభయంబు = అధికమయిన వానవలనిభయము; పాసెన్ = తొలఁగిపోయెను. కంటకాగమభీతి = అల్పశత్రువులవలని భయము (అనఁగా బందిపోటుదొంగ మొదలగు వారివలని భయము); కడచెన్ = తొలఁగిపోయెను. ఉద్ధత...కటకంబు = దురహంకారులైన రాజులయొక్క స్థానము; ఎల్లన్ = అంతయు; ఎత్తుపడియెన్ = అణఁగిపోయెను. అఘస్ఫూర్తి = పాపములయొక్క విజృంభణము; మాసెన్ = స్వరూపనాశనమొందెను. మరుభూములందును = నిర్జలప్రదేశములందుఁగూడ; నెల మూఁడు వానలు = నెలకు మూఁడువానలు; నిండన్ = కొఱంత లేకుండునట్టుగా; కురిసెన్ = వర్షించెను. ఆబాల గోపాలము = చిన్నవాండ్రు గొల్లవాండ్రు మొదలుకొని; అఖిలసద్ద్విజమును = సమస్తమయిన సత్పురుషుల సమూహమును; ఆనందమును = సంతోషమును; పొంది; అతిశయిల్లెన్ = మించెను. ప్రజలకున్ = జనులకు; ఎల్లను = అందఱకును; కడున్ = మిక్కిలి; రామరాజ్యము = రామునిరాజ్యమువంటి సుఖమయిన రాజ్యము; అయ్యెన్ = ఆయెను.

**మ.** అల పోత్రిప్రభుదంష్ట్రి భోగివరభోగాగ్రాళిరా లుద్భటా
చలకూటోపలకోటి రూపుచెడ నిచ్చల్ రాయఁగా నైన మొ
క్కలు భూకాంతకు నున్న నయ్యె నరసక్ష్మాపాలు శ్రీకృష్ణరా
యల బాహామృగనాభిసంకుమదసాంద్రాలేపపంకంబునన్. 35

టీ. భూకాంతకున్ = భూదేవికి; అల...దంష్ట్రి = ప్రసిద్ధుఁడయిన ఆదివరాహస్వామి యొక్క కోఱయును; భోగివర.....రాలు = ఆదిశేషుని పడగలయొక్క కొనల పంక్తియందలి రాలును (ఇచట రాలనఁగా రత్నములు); ఉద్భట...కోటి = గొప్పవైన పర్వతముయొక్క శిఖరములందలిరాలయొక్క సమూహమును; రూపుచెడన్ = చక్కఁదనము చెడునట్లు; నిచ్చల్ = ఎల్లప్పుడును; రాయఁగాన్ = ఒరసికొనఁగా; ఐన మొక్కలు = ఏర్పడినట్టి గాయపుగుంటలు; నరసక్ష్మాపాలు...పంకంబునన్ - నరసక్ష్మాపాలు శ్రీకృష్ణరాయల = నరసరాజుకొడుకైన శ్రీకృష్ణరాయనియొక్క; బాహా = భుజమునందలి; మృగనాభి = కస్తురిచేతను; సంకుమద = జవ్వాజిచేతను; సాంద్ర = గట్టిపడిన; ఆలేపన = పూయునట్టి గంధముయొక్క; పంకంబునన్ = బురదచేత; నున్న నయ్యెన్ = నునుపుగా నేర్పడెను.

తా. మునుపు భూమిని వహించిన యాదివరాహముకోఱ, యాదిశేషుని శిరస్సునందలి రాలు, కులపర్వత శిఖరములందలి రాళ్లసమూహము నీ మూఁడు నొరయుటచేత భూమియందు నొక్కులు కలిగెను. ఇప్పుడు కృష్ణరాయలు, తన భుజముచేత భూమిని వహించుటవలన నాయనభుజమునకుఁ బూసియున్న మంచివాసనతోడి గందము తగిలి,యా భూమియొక్క నొక్కులు మాసి నున్ననయ్యెను. అనఁగాఁ - గృష్ణదేవరాయఁడు భూమిని భరించిన యాదివరాహమును, నాదిశేషునిఁ, గులపర్వతములను గ్రిందుపఱిచి తనబాహువుచేత సర్వభూభారమును వహించినాఁడని తాత్పర్యము. చంద

నము పట్టించినయెడ గాయములు మాయుట స్వభావము. భూమిని జక్కఁగా నేలె ననియు, డెప్పుడు సుగంధిచందనాలంకృతుఁడై యుండు ననియు భావము. అలం. అతిశయోక్తి.

ఉ. క్రూరవనేభదంతహత ÷ కుడ్యపరిచ్యుతవజ్రపంక్తిఁ [1]జె
ల్వారు మిడుంగురుంబురువు ÷ లంచు వెసం గొనిపోయి పొంత శృం
గారవనద్రుమాళి గిజి ÷ గాఁడులు గూఁడులఁ జేర్చు దీపికల్
గా రహిఁ గృష్ణరాయమహి ÷ కాంతుని శాత్రవపట్టణంబులన్.

టీ. కృష్ణరాయ...పట్టణంబులన్ = కృష్ణరాయ మహారాజుయొక్క శత్రువుల పట్ట యందు; క్రూర...పంక్తిన్ = కఠినములయిన అడవియేనుఁగుల కొమ్ములచేత కొట్టఁబడిన గ నుండి అంతటను రాలిన వజ్రములయొక్క సమూహములను; చెల్వారు మిడుంగురుంబురువులు= శించునట్టి మిణుఁగుఱుఁబురుగులు; అంచున్ = అనుకొనుచు; గిజిగాఁడులు = బంగారుపిచ్చు వెసన్ = శీఘ్రముగా; కొనిపోయి = తీసికొనిపోయి; పొంతన్ = సమీపమున నుం శృంగార వనద్రుమాళిన్ = ఉద్యానవనమునందుఁగల చెట్ల సమూహమునందలి;గూఁడుల తమ గూండ్లయందు; దీపికల్ గాన్ = దీపములుగా; రహిన్ = ఆసక్తితో; చేర్చున్ = పె (గిజిగాఁడులు తమ గూండ్లలో రాత్రి వెలుతురుకై మిణుఁగుఱుఁబురుగుల నుంచుకొనుట ప్రసిద్ధ

తా. కృష్ణరాయల శత్రువులయొక్క పట్టణములు పాడుపడి, యేనుఁగులు నివసించ యోగ్యమగునంతటి యడవులు కాఁగా, నం దడవియేనుఁగులు గోడలను దంతములతోఁ బొడ వలన నా గోడలనుండి రాలిన వజ్రములను బంగారుపిచ్చుకలు మిణుఁగుఱుఁబురుఁగులని భ్రమి వానిని దీసికొనిపోయి తమగూండ్లలో రాత్రికాలములయందు వెలుతురునిమిత్త ముంచుకొ అలం. అతిశయోక్తి, భ్రాంతిమంతమును.

సీ. తొలుదొల్తనుదయాద్రి ÷ శిలఁదాఁకితీంద్రించు, నసిలోహమున వెచ్చ ÷ నయిజ
మఱి కొండవీ డెక్కి ÷ మార్కొని నలినైన, యల కసవాపాత్రు ÷ నంటి
నటసాఁగి జమ్మిలో ÷ యఁబడి వేగి[2] దహించెఁ గోన [3]బిట్టేర్చి గొ ÷ ట్టానఁ ద
గనకగిరిస్ఫూర్తిఁ ÷ [4]గరఁచి గౌతమిఁ గ్రాఁచె, [5]నవులనాపొట్నూర ÷ రవులుకొ
మాడెములు ప్రేల్చె నొడ్డాది ÷ మసియొనర్చెఁ, గటకపురిఁ గాల్చె గజరాజు ÷ గలఁగిప
దోఁకచిచ్చన నౌర! యు ÷ ద్ధురతఁ గృష్ణ,రాయబాహుప్రతాపజా ÷ గ్రన్మప

టీ. కృష్ణరాయ...మహాగ్ని = కృష్ణరాయనియొక్క భుజపరాక్రమముయొక్క ప్రకా చున్న గొప్ప నిప్పు (ఇది కర్త); ఉద్ధురతన్ = పరవి కమ్ముకొనుటచేత; తోఁకచిచ్చనన్ రగిలించిన పిడుకల వరుసయో యన్నట్లు (అలం. ఉత్ప్రేక్ష); తొలుదొల్తన్ = మొట్టమె ఉదయాద్రిశిలన్=ఉదయగిరి యనెడు చెకుముకిరాతిని; తాఁకి=తగిలి; తీంద్రించు నసిలోహమ తీక్ష్ణమగు ఖడ్గమనెడి యుక్కువలన; వెచ్చనై=వేఁడియయి; జనించెన్ = పుట్టెను (కృష్ణర మొట్టమొదట నుదయగిరి యను పట్టణమును జయించెననుట.) (అలం. రూపకము.) మఱి=పి కొండవీడు=కొండవీడనెడి పట్టణమును; ఎక్కి = ఆక్రమించి; మార్కొని = ఎదుర్కొని; న యల కసవాపాత్రున్ = నలఁగియున్న ప్రసిద్ధుఁడైన కసవాపాత్రుఁడనెడు రాజును; అ తగులుకొని (కసవాపాత్రునంటి యనుటచే గడ్డియనుటకుఁ దగిన కసవాపాత్రునంటి య

1. భ్రొల్వారు. పా. 2. వేగ. పా. 3. బిట్టేర్చె. పా. 4. గరఁచె. పా. 5. నవల

రాఁజెన్ = రగులుకొనెను. (ఉదయగిరిని జయించినపిమ్మట కసవాపాత్రుఁడనెడు కొండవీటి రాజును జయించె ననుట.) (అలం. రూపకము.) అటన్ = అటుపిమ్మట; సాఁగి = అందుండి వెడలి; జమ్మిలోయన్ = జమ్మువంటి జమ్మిలోయ యను మన్నెములో; పడి = పడినదై; వేఁగి దహించెన్ = వేఁగీదేశమును కాల్చెను. కోనన్ = కోన యనెడి మన్నెమును; బిట్టేర్చి = శీఘ్రముగాఁ గాల్చి; కొట్టానన్ = కొట్టామను స్థలమున; తగిలెన్ = అంటుకొనెను. కనకగిరిస్ఫూర్తిన్ = కనకగిరిదుర్గ మనెడి బంగారుకొండయొక్క యతిశయమును; కరఁచి = కరఁగించి; గౌతమిన్ = గోదావరిని; క్రాఁచెన్ =తపింపఁజేసెను. అవులన్ = అటుపిమ్మట; ఆ పొట్నూరన్ = ఆ పొట్నూరనెడి ప్రసిద్ధ పట్టణమునందు; రవులుకొనియెన్ = చక్కఁగా మండెను. మాడెములు = మాడెము లనెడి మన్నెపు భూములను; ప్రేల్చెన్ = ప్రేలించెను. ఒడ్డాది = ఒడ్డాది యనెడి పట్టణమును; మసియొనర్చెన్ = బొగ్గుగాఁ జేసెను. గజరాజు = గజపతి; కలఁగి = కలఁతనొంది; పఱవన్ = పరుగెత్తఁగా; కటకపురిన్ = కటకమను పట్టణమును; కాల్చెన్ = దహించెను. ఔర = ఆశ్చర్యము!

తా. కృష్ణదేవరాయలు మొట్టమొదట నుదయగిరిపై దండెత్తి జయించి, పిమ్మట క్రమముగా కొండవీటిని, జమ్మిలోయను, వేఁగిదేశమును, కోనదేశమును, కొట్టామును, కనకగిరిని, గోదావరీతీరదేశమును, పొట్నూరిని, మాడెములను, ఒడ్డాదిపురమును, కటకమును జయించె నని తాత్పర్యము. ఇట్లుదయగిరిమొదలు కటకమువఱకు బహుదీర్ఘముగా ప్రాఁకుటవలన నా ప్రతాపాగ్ని తోఁకచిచ్చుగా నుత్ప్రేక్షింపఁబడెను. ఇట ప్రతాపమును అగ్నిగా రూపించుటవలన అగ్నిధర్మము లగు 'రాఁజె' 'దహించె' మొదలగు క్రియాపదములు ప్రయుక్తము లయ్యెను. ఇందు రూపకమునకు, నుత్ప్రేక్షకును సంకరము.

మ. ధరకెందూళులు కృష్ణరాయల చమూ ఽ ధాటీగతిన్ వింధ్యగ
హ్వారముల్ దూఱఁగఁ జూచి తా రచటఁ గాఁ ఽ పై యుండుటం జాల న
చ్చెరువై యెఱ్ఱని వింతచీఁకటులు వ ఽ చ్చెం జూడరే యంచు వే
సారిదిం జూతురు వీరరుద్రగజరా ఽ ట్శుద్ధాంతముగ్ధాంగనల్. 38

టీ. వీరరుద్ర...అంగనల్ = వీరరుద్రగజపతియొక్క అంతఃపురమునందలి ముగ్ధంగు స్త్రీలు; తారు = తాము; కృష్ణరాయల చమూధాటీగతిన్ = కృష్ణరాయల సైన్యముయొక్క దాడి నడచుట చేత; ధరకెఁదూళులు = భూమియందలి యెఱ్ఱని దుమారములు; వింధ్యగహ్వారముల్ = వింధ్యపర్వత గుహలను; దూఱఁగన్ = చొరఁబాఱఁగా; చూచి; అచటన్ = ఆ పర్వత గుహలయందు; కాఁపై ఉండుటన్ = కాపురమయి ఉండుటచేత; చాలన్ = మిక్కిలి; అచ్చెరువై = ఆశ్చర్యముకలిగి - ఆశ్చర్యపడి; ఎఱ్ఱని వింత చీఁకటులు = ఎఱ్ఱగానుండెడి క్రొత్త చీఁకట్లు; వచ్చెన్; చూడరే = మీరు చూఁడుఁడు; అంచున్ = అని ఒకరితో నొకరనుకొనుచు; వే = శీఘ్రముగా; సారిదిన్ = వరుసగా (నిలిచి); చూతురు = చూచుచుందురు.

తా. వీరరుద్రగజపతి - కృష్ణరాయలు దండెత్తి వచ్చుట విని, యంతకుమును పే భయపడి వింధ్యపర్వతమునకుఁ బాఱిపోఁగా నా పర్వతగుహలందు వాసముచేయునట్టి యా రాజుభార్యలు, కృష్ణరాయలదండు వచ్చుటచే నేలనుండి రేఁగి యా గుహలకు దట్టముగా వ్యాపించిన యెఱ్ఱని దుమ్ముఁ జూచి, యట్టిదుమ్ము నెన్నఁడును జూచి యెఱుఁగనివా రగుటచే నది దుమ్మని తెలిసికోలేక యెఱ్ఱని చీఁకటి యని భ్రమించి, యొకరితో నొకరు చెప్పుకొని రని తాత్పర్యము. వీరరుద్రగజపతి కృష్ణదేవరాయలు తనపై దండెత్తివచ్చెడి వృత్తాంతమును విని, యంతఃపుర స్త్రీలతోడ వింధ్య

పర్వతమునకుఁ బాఱిపోయి, యందలి గుహలలో దాఁగియుండె నని భావము. ఇట ఘూకములను నెట్టని చీఁకటులనుగా భ్రమించుట వాని బాహుళ్యమును, నిబిడత్వమును దెలుపుచున్నది. (అలం. సంబంధాతిశయోక్తి.) మఱియు 'ముగ్ధ' యను విశేషణము సాభిప్రాయము గాన పరికరము. ఎట్టని దుమ్మును నెట్టని చీఁకటులుగా భ్రమించుటచే భ్రాంతిమంతము. పరికర భ్రాంతిమంతములకు నంగాంగి భావము. కృష్ణరాయలు దండుతో వచ్చునను హేతుప్రసక్తిచేతనే వీరరుద్రగజపతి భార్యాసహితముగా వింధ్యపర్వతమునకుఁ బాఱి వసించియున్న కార్యము గలిగినట్లు వర్ణించుటంజేసి చపలాతిశయోక్తి.

చ. [1]అభిరతిఁ గృష్ణరాయఁడు జ । యాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ । నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం దిగు సు । ర[2]ప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తికజ్జలము । వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్. 39

టీ. కృష్ణరాయఁడు; అభిరతిన్ = ఆసతో; జయాంకములన్ = తన గెలుపు బిరుదాంకములను; లిఖియించి = వ్రాసి; తాళసన్నిభముగన్ = తాటిచెట్టుతో సమానముగా - మిక్కిలి పొడుగుగా ననుట; పొట్టునూరికడన్ = పొట్నూరియొద్ద; నిల్పిన కంబమున్ = నాటినట్టి స్తంభమును; సింహభూధరప్రభు తిరునాళ్లకున్ = సింహాచలనాథుఁడైన వరాహనరసింహస్వామి యుత్సవమునకు; దిగు సురప్రకరంబు = స్వర్గమునుండి భూమికి దిగివచ్చునట్టి దేవతలయొక్క సమూహము; కళింగ...కజ్జలము = కళింగరాజుయొక్క అపయశస్సనెడి మసిని; వేమఱున్ = మాటిమాటికి; పెట్టి = పూసి - అనఁగా కప్పువేసి; నిచ్చలున్ = ఎల్లప్పుడును; పఠించున్ =చదువును. ఇట 'వేమఱున్' 'నిచ్చలున్' అను శబ్దములచే దేవతలు ప్రతిసంవత్సరము నుత్సవమునకు వచ్చునప్పుడెల్లఁ జదువుచుందురనియు, గళింగరాజునపయశస్సు అను మసి యెల్లప్పుడు నా యక్షరములకుం బూయుటకుఁ జాలినట్టు లపరిమితముగా నున్న దనియు సూచితము.

తా. కృష్ణరాయలు, తా నాయాయి దేశములను జయించిన వృత్తాంతములు వ్రాసి పొట్నూరి యొద్ద జయస్తంభము నాటఁగా, నా పొట్నూరి సమీపముననుండు సింహాచలమునందలి వరాహనరసింహస్వామి యుత్సవమునకుఁ బ్రతిసంవత్సరమును స్వర్గమునుండి దిగివచ్చునట్టి దేవతలు దారిలో నత్యున్నతమయి యొప్పునట్టి యా జయస్తంభమును జూచి, యందలి జయవార్తలను గళింగరాజు పరాజయము నొందుటచే నతనికిఁ గలిగిన యపారమయిన యపకీర్తియను మసిచేఁ గప్పువేసి చదువుచుందురు. అలం. అతిశయోక్తి, రూపకము. కళింగరాజు కృష్ణరాయలచే జయింపఁబడె నని వ్యంగ్యము.

మ.స్ర. ఏకరాలన్ మందువాసా । హిణములఁ గల భ । ద్రేభసందోహవాహ
ప్రకరంబుల్ గొంచుఁ దత్తత్ప్రభువులు వనుపన్ । రాయబారుల్ విలోకో

1. తాళపత్రములపయి వ్రాయఁబడిన యక్షరములకు మసిపూసి, వానిని వ్యక్తమగునట్లు చేసి చదువు పద్ధతి యిందు సూచితము. ఇచటి 'కళింగమేదినీవిభు—' పదముచే ఆ కాలమున పొట్నూరిని పాలించిన 'మేదినీరావు' కుటుంబములోని నరసింహరాజుగారు సూచింపఁబడిరి. కాన ఇచటి 'మేదినీవిభు' పద మెంతయు ననుగుణము.

2. ప్రకరంబుం- పా.

త్సుకులై నిత్యంబు శ్రీకృష్ణుని యవసరముల్ చూతు రందంద కొల్వం
దక యాప్రత్యూష మాసంధ్యము పనివడి తన్మందిరాళిందభూమిన్. 40

టీ. తత్తత్ప్రభువులు = ఆయాయి రాజులు; పనుపన్ = పంపఁగా; రాయబారులు = దూతలు; ఎకరాలన్ = మొగసాలలయందును; మందువాసాహిణములన్ = ఒకతట్టు గోడలేని దూలముల సరి యెత్తుకంబములు గల గుఱ్ఱపుశాలలయందును; కల..ప్రకరంబుల్ = ఉన్నట్టి భద్రజాతియేనుఁగుల యొక్క సమూహమును, గుఱ్ఱముల గుంపులను; కొంచున్ = కానుకలుపెట్టుటకై తెచ్చుచు; విలోకోత్సుకులై = దర్శనము చేయుటయందు దాసక్తిగలవారై; నిత్యంబున్ = ఎల్లప్పుడును; కొల్వందక = దర్శనము దొరకక; ఆప్రత్యూషము = తెల్లవారినది మొదలుకొని; ఆసంధ్యము = సాయంకాలమువఱకును; పనివడి = ప్రయత్నపడి; తన్మందిరాళిందభూమిన్ = ఆ కృష్ణరాయల యొక్క యింటి ముంగిటి ప్రదేశమునందు; శ్రీకృష్ణుని యవసరముల్ = శ్రీకృష్ణమూర్తి యయిన శ్రీకృష్ణరాయని సమయములను; అందంద = మఱిమఱి; చూతురు = ఎదురుచూచుచుందురు. కానుక పంపినవి ఎకరాలలోని యేనుఁగులును, మందువాలలోని గుఱ్ఱములు ననుటచే నవి మిక్కిలి యుత్తమములైన వని యాశయము.

తా. ఆ యా దేశపురాజులచేఁ బంపఁబడినదూతలు కృష్ణరాయలకుఁ గానుకగా సమర్పించుటకై కొనివచ్చిన యేనుఁగులను, గుఱ్ఱములను ముందిడుకొని, శ్రీకృష్ణరాయల నగరివాకిట తద్దర్శనార్థులయి యుండి, దర్శనము లభింపమిచే సమయము నిరీక్షించుచుఁ, బ్రతిదినము నుదయముమొదలు సాయంకాలమువఱకుఁ గాచి యుందు రని తాత్పర్యము. కృష్ణరాయలకు ననేకులు రాజులు కానుకలతోడ రాయబారము లంపుచుందు రని భావము.

చ. మదకలకుంభికుంభనవమౌక్తికముల్ గనుపట్టు దట్టమై
వదలక కృష్ణరాయకరవాలమునం దగు ధారనీట న
భ్యుదయము నొంది శాత్రవులపుట్టి మునుంగఁగ ఫేనపంక్తితోఁ
బొదిగొని పైపయిన్ వెడలు బుద్బుదపంక్తులు వోలెఁ బోరులన్. 41

టీ. పోరులన్ = యుద్ధములయందు; కృష్ణరాయకరవాలమునన్ = కృష్ణరాయని కత్తియందు; తగు ధారనీటన్ = ఒప్పునట్టి వాదర యను నీటియందు; మద...మౌక్తికముల్ = మదముచే నొప్పుచున్న యేనుఁగులయొక్క కుంభస్థలములయందలి క్రొత్తవైన ముత్తెములు; అభ్యుదయమున్ = శుభోదయమును; ఒంది = పొంది - విశేషమయి; శాత్రవులపుట్టి = శత్రురాజులయొక్క పుట్టి; మునుంగఁగన్ = మునిఁగిపోవుచుండఁగా; (పుట్టి అనఁగా వెదురుబద్దలు లోనగువానితో నిడుపాటితొట్టివలె నల్లి మీఁదఁ దోలుకట్టి,యేఱుదాఁటుట కుపయోగించు సాధనము.) ఫేనపంక్తితోన్ = నురుఁగుల సమూహముతో; పొదిగొని = జతకూడి; పైపయిన్ = మీఁదమీఁద; వెడలు బుద్బుదపంక్తులువోలెన్ = లేచునట్టి నీటిబుగ్గలసమూహమువలె; వదలక = విడువక - ఎల్లప్పుడు; దట్టమై = తఱచై; కనుపట్టున్ = అగపడుచుండును.

తా. యుద్ధములందుఁ గృష్ణదేవరాయలు కత్తితో శత్రురాజుల యేనుఁగుల కుంభస్థలములు పగుల నఱకునప్పుడు వానివలననుండి వెడలునట్టి ముత్యములు కత్తివాదర యనెడి నీటియందు బ్ర... వారి పుట్టి మునుఁగఁగా నురుగుతో లేచెడి నీటిబుగ్గలవలెఁ గానవచ్చుచుండెను.



ఒక వస్తువు నీటిలో మునుఁగఁగా నురుఁగును, నీటిబుగ్గలును లేచునట్లు కృష్ణరాయల కత్తివాదరయను నీట పగవారి పుట్టి మునుఁగఁగా లేచిన నురుఁగును నీటిబుగ్గలునుంబోలి దాఁకి నేనుఁగుతలలనుండి యంటిన ముత్తెములు గానిపించె నని యర్థము. ఆ ముత్తెములలో సన్నవి నురుఁగుగాను, బెద్దవి నీటిబుగ్గలుగాను నుత్ప్రేక్షింపఁబడినవి. పుట్టి మునుఁగుట యనఁగా ప్రవాహమునందుఁ బుట్టియెక్కి దాఁటుచుండఁగా నది మునిఁగినట్లు మనుష్యులు తమ వ్యాపారములందుఁ బ్రవర్తించుచుండఁగా నా పనులు చెడి, యాపదలు వచ్చుచుండుట యని యర్థము. కనుక "ఇప్పుడేమిపుట్టిమునిఁగెను ?" అని జనుల వాడుకగా నున్నది. 'శాత్రవులపుట్టి మునింగె' ననుచోఁ గృష్ణరాయ లనేకశత్రువుల నడంచె ననియు, శాత్రవులు కాక శాత్రవులపుట్టియే మునింగె ననుట వలన వారు తమ రాజ్యాదికములే కోలుపోయిరి గాని శరణుఁజొచ్చుటచేఁ బ్రాణములు గోలుపోలే దనియు ధ్వనించెడిని. దీనిచేఁ గృష్ణదేవరాయలకు శత్రువుల నడంచు ప్రచండపరాక్రమముతోఁగూడ శరణన్నఁ గాచు కారుణ్యాతిశయమును సూచితమగుచున్నది. కుంభికుంభమౌక్తికములతని కరవాలధారఁ గనుపట్టు ననుటచే నతం డసంఖ్యములయిన శత్రురాజగజములఁ గత్తిచే నఱికినాఁ డనియు వ్యంజితము. జలము మహావేగముతోఁ బ్రవహించుటచేఁ గలిగిన సుళ్లయందే పుట్టి మునుంగును గాన ఇట్టిసుళ్లకుఁ బ్రతియైన ఖడ్గము మిక్కిలి తీక్ష్ణమయిన దనియు, వేగవత్ప్రవాహస్థానీయమైన ఖడ్గధారి కృష్ణరాయబాహువు మహాబలాఢ్యమైన దనియుఁ దెలియఁదగు. ఏనుఁగుల కుంభస్థలములందు ముత్తెములు పుట్టు ననుట సుప్రసిద్ధము. ముత్తెముల నురుఁగుతోఁగూడిన నీటిబుగ్గలుగా నుత్ప్రేక్షించుటచే అలం. ఉత్ప్రేక్ష. 'ధారనీటఁ' అనుచో రూపకము. ఖడ్గధారయందు 'కుంభికుంభమౌక్తికము' లంటె ననుచో నతిశయోక్తి. రూపకాతిశయోక్తులకును, ఉత్ప్రేక్షకును అంగాంగిభావము.

సీ. వేదండభయదశుం ॥ డాదండనిర్వాంత, వమథుపుల్ పైఁజిల్కు ॥ వారి గాఁగఁ
దత్కర్ణవిస్తీర్ణ ॥ తాళవృంతోద్ధూత, ధూళి చేటలఁ జల్లు ॥ దుమ్ము గాఁగ
శ్రమబుర్బురత్తురం ॥ గమనాసికాగళ, త్పంకంబు వైచు క ॥ ర్దమము గాఁగఁ
గుపితయోధాక్షిప్త ॥ కుంత[1]కాంతారఖే, లనములు దండపు ॥ ట్టనలు గాఁగఁ
తే. జెనఁటిపగఱప్రతాపంబు ॥ చిచ్చులార్చు, కరణిఁగడిదేశములుచొచ్చి ॥ కలఁచియలఁచు
మూరురాయరగండాంక ॥ వీరకృష్ణ, రాయభూభృద్భయంకర ॥ ప్రబలధాటి. 42

టీ. మూరురాయర...ధాటి - మూరురాయరగండ = అశ్వపతి, గజపతి, నరపతులను ముగ్గురు రాజులను జయించినశూరుఁ డనెడు; అంక = బిరుదుపేరు గల; వీర = శూరుఁడైన; కృష్ణరాయభూభృత్ = కృష్ణరాయప్రభువుయొక్క; భయంకర = వెఱపును గలుగఁజేయునట్టి; ప్రబల = అధికమయిన; ధాటి = దాడి - యుద్ధయాత్ర; (ఇది కర్త.) వేదండ...వమథుపుల్ = ఏనుఁగుల యొక్క వెఱపునట్టి తొండములనుండి వెడలిన తుంపురులు; పైఁజిల్కు వారిగాఁగన్ = పయిని జల్లునట్టి జలమగుచుండఁగా; తత్కర్ణ...ధూళి = ఆ యేనుఁగులయొక్క చెవులనెడు విరివియయిన విసనకఱ్ఱలచేత ఎగురఁగొట్టఁబడిన దుమ్ము; చేటలన్ = చేటలతో; చల్లు దుమ్ముకాఁగన్ = చల్లునట్టి దుమ్మగుచుండఁగా; శ్రమ...పంకంబు = అలఁతచేత బురబురయని ధ్వనిచేయుచున్న గుఱ్ఱముల ముక్కులనుండి జాఱుచున్న బురదవంటి చీమిడి; వైచు కర్దమముగాఁగన్ = (నిప్పు చల్లాఱుటకై)

1. కృత్తారి. పా.

వేయునట్టి బురదయగుచుండఁగా; కుపిత...ఖేలనములు = కోపించిన యుద్ధవీరులచేత చిమ్మఁబడిన వెదురుటడవివంటియీఁటెలయొక్క ఆటలు; దండఘట్టనలు కాఁగన్ = కఱ్ఱలతోఁ గొట్టుట లగుచుండఁగా; చెనఁటి...చిచ్చులు = దుష్టులైన శత్రువులయొక్క పరాక్రమమనెడు నిప్పులను; ఆర్చుకరణిన్ = చల్లార్చుచున్నదో యన్నట్లు; గడిదేశములన్ = సరిహద్దుదేశములను; చొచ్చి = ప్రవేశించి; కలఁచి = కలఁతపెట్టి; అలఁచున్ = అలయునట్లు చేయును.

తా. శ్రీకృష్ణదేవరాయలు దండయాత్ర చేయునపుడు దండునందలి యేనుఁగుల తొండములనుండి వెడలుచున్న తుంపురులును, ఆ యేనుఁగులు చెవులు వీచుటచే లేచెడు దుమ్మును, గుఱ్ఱములలసి బురబుర యనుచుండఁగా వాని ముక్కులనుండి కారెడు చీమిడియు, యుద్ధవీరులు ప్రయోగించునట్టి యీఁటెలబారును - శత్రురాజుల ప్రతాపాగ్ని నార్పుటకై చల్లునట్టి నీళ్లును, జేటలతోఁబోయునట్టి దుమ్మును, మీఁదవేసెడి బురదయు, నణఁగఁగొట్టునట్టి కఱ్ఱలు నై యొప్పెనని తాత్పర్యము. కృష్ణరాయలు ఏనుఁగులతోను, గుఱ్ఱములతోను, భటులతోను గడిదేశములమీఁదికి దండెత్తిపోయి, వానినెల్ల జయించె నని భావము. ఇట పైఁజిలుక్కువారి మొదలైనవి యగ్నిని జల్లార్చు సాధనము లగుట గ్రాహ్యము. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

## షష్ఠ్యంతములు

క. ఏవంవిధగుణవంతున, కావల్గత్తురగ బహువి ధారోహ కళా
రేవంతున కతిశాంతున, కావిష్కృత కీర్తిధవళి తాశాంతునకున్. 43

టీ. ఏవంవిధగుణవంతునకున్ = ఇట్టిగుణములు గలవానికి; ఆవల్గత్ ... రేవంతునకున్ = అంతటను దుముకులాడుచున్న గుఱ్ఱములయొక్క పలువిధములయిన ఎక్కుటయను విద్యయందు అశ్వశిక్షకుఁ డయినవానికి; అతిశాంతునకున్ = మిక్కిలి శాంతముగలవానికి; ఆవిష్కృత...ఆశాంతునకున్ = వ్యాపింపఁజేయఁబడిన యశస్సుచేత తెల్లగాఁజేయఁబడిన దిక్కులయొక్క కొనలుగలవానికి; దిగంతములవఱకు వ్యాపించిన కీర్తి గలవానికి.

క. పుంఖానుపుంఖ సైంధవ, రింఖా సంఘాత జాత రేణూగ్ర తమో
రింఖ ద్రిపునృప దహర, ప్రేంఖదసుగ్రసన జఠర భృత్యసిఫణికిన్. 44

టీ. పుంఖానుపుంఖ ... ఫణికిన్ - పుంఖానుపుంఖ = ఎడతెగని; సైంధవ = గుఱ్ఱములయొక్క; రింఖా = గిట్టలయొక్క; సంఘాత = చక్కఁగా నలఁగఁద్రొక్కినట్టి త్రొక్కుడులవలన; జాత = పుట్టిన; రేణు = దుమ్మనెడు; ఉగ్ర=భయంకరమయిన; తమః = చీఁకటియందు; రింఖత్ = తొట్రువడుచున్న; రిపునృప = శత్రురాజులయొక్క; దహర = హృదయములందు; ప్రేంఖత్ = చలించుచున్న; అసు = ప్రాణములయొక్క; గ్రసన = మ్రింగుటయను; జఠర = ఉదరముయొక్క; భృతి = నిండించుకొనుటగల; అసిఫణికిన్ = కత్తియనెడి సర్పముగలవానికి. (అశ్వసైన్యముతోఁ గూడినవాఁడై శత్రువులను ఖడ్గముచే ఖండించి, హృదయగతములైన ప్రాణవాయువులను దీసినాఁడనుట. వారిని వధించినవాఁడని భావము.) అలం. రూపకము.

క. అవిరళ వితరణవిద్యా, నవరాధేయునకు సజ్జ న విధేయునకుం
గవితాస్త్రీలోలునకున్, ఖవిటంకనటద్యశోఽబ్ధి కల్లోలునకున్. 45

టీ. అరవిళ...రాధేయునకున్=ఎడతెగని దానవిద్యయందు = క్రొత్తకర్ణుఁడైనవానికి-కర్ణుని వలె దానము చేయువానికి ననుట; సజ్జనవిధేయునకున్=సత్పురుషులకుఁ బరతంత్రుఁడైనవానికి; కవితాస్త్రీలోలునకున్ = కవితయను స్త్రీయం దాసక్తుఁడైనవానికి - కవితయందు మిక్కిలి ప్రీతిగల వానికి ననుట; ఖవిటంక...కల్లోలునకున్ = ఆకాశముయొక్క ముందటి భాగమునందు నటించు చున్న (నలించుచున్న) కీర్తియను సముద్రముయొక్క అలలుగలవానికి. (ఆకాశమంతయు వ్యాపించిన కీర్తి గలవానికి ననుట.)

క. దిగధీశాసహ్య ధగ, ద్ధగితేద్ధరుచిప్రతాప  తపనస్ఫురణ
స్థగితద్యుమణికి నిమిషా, ర్ధగృహీతకళింగరాజ  తనయాగ్రణికిన్. 46

టీ. దిగధీశ...ద్యుమణికిన్ - దిగధీశ = దిక్పాలురైన యింద్రాదులకు; అసహ్య = ఓర్వఁ గూడని; దగద్ధగిత = ధగధగాయమానమైన; ఇద్ధ = ప్రకాశించుచున్న; రుచి = కాంతిగల; ప్రతాప తపన = పరాక్రమమనెడి సూర్యునియొక్క; స్ఫురణ = ప్రకాశముచేత; స్థగిత = కప్పఁబడిన; ద్యుమణికిన్=సూర్యుఁడు గలవానికి - అధికమయిన పరాక్రమముగల వాని కనుట; నిమిష...అగ్ర ణికిన్=అర్ధనిమిషకాలమున పట్టుకోఁబడిన కళింగదేశపురాజుయొక్క కుమారశ్రేష్ఠుఁడు గలవానికి. (అతి స్వల్పకాలమునఁ గళింగరాజును జయించినవాని కనుట.)

క. కరుణాఽఽకర వేంకటవిభు, చరణస్మరణప్రసంగ  సంగతమతి కీ
శ్వరనరసింహమహీభృ, ద్వరనందన కృష్ణరాయ  ధరణీపతికిన్. 47

టీ. కరుణాఽఽకర...మతికిన్=కరుణాఽఽకర=దయకు గనియయిన; వేంకటవిభు=వేంక టేశ్వరునియొక్క; చరణ = పాదములయొక్క; స్మరణ = తలంచుటయొక్క; ప్రసంగ=ప్రస్తావము నందు; సంగత మతికిన్ = సంబంధించిన బుద్ధిగలవానికి - వేంకటేశ్వరునియందు భక్తిగలవాని కనుట; ఈశ్వర...పతికిన్ = ఈశ్వరనారసింహరాజుయొక్క కుమారశ్రేష్ఠుఁడగు కృష్ణరాయుఁ డను భూపతికి. (ముందు వచనముతో నన్వయము.)

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా [1]యొనర్పంబూనిన స్వారోచిషమనుసంభవం
బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన-జైమినిముని స్వాయంభువ
మనుకథాశ్రవణానంతరంబున మీఁద నెవ్వండు మను వయ్యె నెఱింగింపు మన
వుడుఁ బక్షులు మార్కండేయుండు క్రోష్టికిం జెప్పిన ప్రకారంబున నిట్లని
చెప్పందొడంగె. 48

టీ. అభ్యుదయపరంపరాభివృద్ధిగాన్ = మంగళపరంపరయొక్క యభివృద్ధి కలుగునట్లుగా; నా యొనర్పఁబూనిన స్వారోచిషమనుసంభవంబు = నేను రచియింప యత్నించిన స్వారోచిష మనుసంభవము; అను మహాప్రబంధంబునకున్=అనునట్టి మహాకావ్యమునకు; కథాక్రమంబు; ఎట్టిది= ఎటువంటిది; అనినన్ = అన్నను; జైమినిముని; స్వాయంభువమనుకథా శ్రవణానంతరంబునన్ = స్వాయంభువుఁ డనెడి మనువుయొక్క కథను విన్నపిమ్మట; మీఁదన్ = స్వాయంభువునకుఁ బిమ్మటికాలమునందు; ఎవ్వండు; మనువయ్యె? = మనువాయెను ?; అనవుడున్= అని యడుగఁగా; పక్షులు = ధర్మపక్షులు; మార్కండేయుండు; క్రోష్టికిన్ = క్రోష్టియనువానికి; చెప్పిన ప్రకా రంబునన్; ఇట్లని; చెప్పఁదొడంగెన్ = చెప్పుటకు నారంభించెను.

---

1. రచియింపం. పా.

# కథాప్రారంభము

మ. వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళిత ప్రాలేయరుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యావర్తదేశంబునం
బుర మొప్పున్ మహికంఠహారతరళ స్ఫూర్తిన్ విడంబించుచున్. 49

టీ. ఆర్యావర్తదేశంబునన్; (హిమవత్పర్వతమునకును, వింధ్యపర్వతమునకును నడుమనుండు దేశ మార్యావర్త మనఁబడును.) వరణాద్వీపవతీతటాంచలమునన్ = వరణ యనెడి నదియొక్క సమీపమునందు; వప్రస్థలీచుంబితాంబరమై = ప్రాకారప్రదేశములచేత తాఁకఁబడిన ఆకాశముగలదై; సౌధ...హరిణంబై - సౌధ = మేడల యందలి; సుధా = సున్నపు గచ్చుయొక్క; ప్రభా = కాంతులచేత; ధవళిత= తెల్లగాఁ జేయఁబడిన; ప్రాలేయరుఙ్మండలీ=చంద్రబింబమునందలి; హరిణంబై = జింకగలదై; మహికంఠహారతరళస్ఫూర్తిన్ = భూమియొక్క మెడయందలి ముత్యాలహారములోని నాయకమణియొక్క ప్రకాశమును; విడంబించుచున్ = అనుకరించుచు; అరుణాస్పదం బనఁగన్ = అరుణాస్పదము అనుపేరితో; పురము = ఒక పట్టణము; ఒప్పున్ = ఒప్పిదమగుచుండును.

తా. ఆర్యావర్త దేశమందు నరుణాస్పద మను పట్టణ మొకటి కలదు. అది యాకాశము నొరయునట్టి మిక్కిలి యున్నతములయిన ప్రాకారములును, చంద్రమండలము నొరయుచు, నందలి జింకనుగూడఁ దెల్లగాఁ జేయునట్లు తళతళ వెలిఁగెడి పాలగారచేతఁ దెల్లనివై, యున్నతములైన మేడలును గలిగి భూదేవి ధరించిన కంఠహారముయొక్క పతకమో యనున ట్లుండెను. అలం. అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, ఉపమయును.

సీ. అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి, ముది మది దప్పిన మొదటివేల్పు
నచటిరాజులు బంటు నంపి భార్గవునైన, బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటిమేటికిరాటు లలకాధిపతినైన, మును సంచి మొద లిచ్చి మనుప దక్షు
లచటినాలవజాతి హాలముఖాత్తవిభూతి, నాదిభిక్షువుభైక్ష మైన మాన్చు
తే. నచటివెలయాండ్రురంభాదులైననొరయఁ, గా సెకొంగునవారించి[1]కడవఁగలరు
నాట్యరేఖాకళాధురం ధరనిరూఢి; నచటఁ [2]బుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ.

టీ. అచటి విప్రులు=ఆ యరుణాస్పదపురమునందలి బ్రాహ్మణులు; అఖిలవిద్యాప్రౌఢిన్ = ఎల్లవిద్యలయందలి నేర్పుచేత; ముది మది దప్పిన మొదటివేల్పున్ = ముసలితనముచేత మనస్సు నిలుకడచెడిన బ్రహ్మను; మెచ్చరు = లక్ష్యముచేయరు. (అచటి బ్రాహ్మణులు తాము సర్వవిద్యల యందు మిక్కిలి పండితులగుటచే ముసలివాఁడయి చిత్తభ్రమనొందినవాఁడని బ్రహ్మను సరకుసేయరనుట. అనఁగా నచటి బ్రాహ్మణులు మిక్కిలి విద్యావంతులని భావము.) అచటిరాజులు = ఆ పట్టణమునందలి రాచవారు; బంటున్ = సేవకుని; అంపి = పంపి; భార్గవునైనన్ = పరశురాముని నయినను; బింకానన్ = గర్వముచేత; అంకమునకున్ = తమదగ్గఱకు; పిలిపింతురు = పిలువనంపు

1. కడప. కదుమ. పా. 2. బట్టిన. పా.

దురు. (అచటి క్షత్రియులు మహాబలశాలులు కాఁబట్టి పరశురామునినైనను లక్ష్యముచేయక బంటు నంపి తమయొద్దకు బలవంతముగాఁ బట్టి తెప్పింతు రనుట. అనఁగా నచటి రాచవారు మిక్కిలి పరాక్రమవంతు లని భావము.) అచటి మేటికిరాటులు = ఆ పట్టణమునందలి ప్రముఖులయిన కోమట్లు; అలకాధిపతినైనన్ = అలకాపురికి రాజైన కుబేరునైనను; మును = ముందుగా; సంచి మొదలు = బండవలమును - అనఁగా మూలధనమును; ఇచ్చి = తామే యిచ్చి; మనుపన్ = రక్షించుటకు; దక్షులు = సమర్థులు. (అచటి వైశ్యులు కుబేరునకుఁగూడ బండారాలమిచ్చి, కాపాడఁ దగినవా రనుట. అనఁగా మిక్కిలి ధనవంతు లని భావము.) అచటి నాలవజాతి = ఆ పట్టణము నందలి శూద్రజనులు; హాలముఖాత్తవిభూతిన్ = నాగేటి మొనచేత పొందఁబడిన యైశ్వర్యముచేత; ఆదిభిక్షువుభైక్షమైనన్ = మొదటిబిచ్చగాఁ డయిన శివునియొక్క భిక్షావృత్తినయినను; మాన్పన్ = పోఁగొట్టును. (అచటి శూద్రులు సేద్యముచే మిక్కిలి సంపద గలవారును, దాతృత్వము గలవారు నని భావము.) అచటి వెలయాండ్రు = ఆ పట్టణములోని వేశ్యలు; నాట్య...నిరూఢిన్ = నృత్య పద్ధతియనెడు విద్యయొక్క భారమును వహించిన సామర్థ్యముచేత; రంభాదులైనన్ = రంభ మొదలగు నప్సరసలైనను; ఒరయన్ = సరిపోవలయునని వచ్చినయెడల; కాసెకొంగునన్ = వెనుక దోఁపుకొనెడి కోకచెఱఁగుచేత; వారించి = (కొంతదూరమునందే నిలుచునట్లుచేసి) తిరస్కరించి; కడవఁగలరు = అతిక్రమింపఁగలరు. (అచటి వేశ్యలు నాట్యవిద్యయందు రంభ మొదలగు నప్సరసలను సయితం మవమానపఱుపఁగల రనుట. అనఁగా అచటి వేశ్యలు నాట్యమందు మిక్కిలి సమర్థ లని భావము.) అచటన్ = ఆ పట్టణమునందు; పుట్టిన చిరుగుఁగొమ్మైనన్ = పుట్టినట్టి చిగురుతోడి లేఁతకొమ్మయైనను; చేవ = సారముగలది. (ఆ యూరఁ బుట్టిన వస్తువు మిక్కిలి సారవంతము లని భావము.) అలం, అతిశయోక్తి.

ఇచట 'చిగురుకొమ్మైనఁజేవ' అను పాఠమును గ్రహించి శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారును, శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారును చిగురుచెట్టు కొంచెమైనను పటుత్వము లేనిదనియు, అట్టి చెట్టుకొమ్మకూడ నా యూరఁ జేవగలదయి యుండుననియు వివరించిరి.

ఉ. ఆ పురిఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై. 51

టీ. మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి = మన్మథునివలెను, చంద్రునివలెను సుందరమయిన ఆకారముగలవాఁడును; భాషాऽపరశేషభోగి = మాటలయందు రెండవ శేషాహి యయినవాఁడును; వివిధ...పరతంత్రుఁడు - వివిధ = నానావిధములయిన; అధ్వర = యాగములనెడి; నిర్మల = దోషరహితములయిన; ధర్మ కర్మ = పుణ్య క్రియలయందలి; దీక్షా = నియమమునకు; పరతంత్రుఁడు = అధీనుఁడును; అంబురుహగర్భకులాభరణంబు = బ్రాహ్మణజాతికి అలంకార మయిన వాఁడును; అనారతాధ్యాపనతత్పరుండు = ఎల్లప్పుడును వేదములు చదివించుటయందు ఆసక్తిగల వాఁడును నయిన; ప్రవరాఖ్యుఁడు = ప్రవరుఁడు అను పేరుగలవాఁడు; అలేఖ్యతనూ విలాసుఁడై = చిత్తరువునందు వ్రాయ నలవిగాని రూపరేఖ గలవాఁడై; ఆ పురిన్ = ఆ నగరమును; పాయక = విడువక; ఉండున్ = వాసముచేయుచుండును. అలం. ఉపమ, రూపకమును.

ఆ. వానిచక్కఁదనము వైరాగ్యమునఁ జేసి, కాంక్షసేయు జార కామినులకు
భోగబాహ్యమయ్యెఁ బూచినసంపెంగ, పొలుపు మధుకరాంగ నలకుఁబోలె.

టీ. వాని చక్కఁదనము = ఆ ప్రవరుని సౌందర్యము; వైరాగ్యమునన్ చేసి = విషయేచ్ఛ లేమిచేత; కాంక్షసేయు జారకామినులకున్ = వలచునట్టి కులటలకు; పూచిన సంపెంగపొలుపు = వికసించిన సంపెఁగపువ్వుయొక్క వికాసము; మధుకరాంగనలకుఁబోలెన్ = ఆఁడుతుమ్మెదలకు వలె; భోగబాహ్యము = అనుభవమునకు వెలియయినది; అయ్యెన్.

తా. ఆ ప్రవరుఁడు విరక్తుఁడైనందున వానిసౌందర్యమును వలచివచ్చిన జారస్త్రీలకు నబ్బక యుండెను. వికసించిన సంపెఁగపువ్వు తుమ్మెదలకు నుపయోగపడనట్లు వానిసౌందర్య మా స్త్రీలకు ననుభవింప నలవికాని దయ్యె నని తాత్పర్యము. తుమ్మెదలకును, సంపెంగకును విరోధము సుప్రసిద్ధము. అలం. ఉపమ.

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడునై కమనీయకౌతుక
శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి చేసిన కూరిమిసోమిదమ్మ సౌ
ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియున్
దేవరవోలె నుండి యిలు దీర్పఁగఁ గాఁపుర మొప్పు వానికిన్. ౫౩

టీ. యౌవనమందున్ = వయసునందు; యజ్వయున్ = యాగముచేసినవాఁడును - సోమయాజియును; ధనాఢ్యుఁడునై = ధనవంతుఁడునై; కమనీయకౌతుకశ్రీవిధిన్ = మనోహరమయిన కంకణబంధమున సంపత్కరమయిన క్రియయందు - వివాహమునందనుట; కూఁకటుల్ = పిల్లజుట్లను; కొలిచి = కొలఁతపెట్టి - ఈడుచూచి యనుట; (ఇద్దఱియందును ఈడు కొంచెము హెచ్చుతక్కువగాఁ జూచి యని భావము.) చేసిన = పెండ్లిచేసినట్టి; కూరిమిసోమిదమ్మ = ప్రియురాలైన సోమిదేవి - అనఁగా భార్య; (సోమిదమ్మ యనఁగా సోమయాజి భార్య.) సౌఖ్యావహయై = సుఖము గలిగించునదియై; భజింపన్ = సేవింపఁగా; సుఖులై = సుఖముగలవారలై; తలిదండ్రులు = ఇతని తల్లియుం, దండ్రియు; కూడి = జతగూడి; దేవియున్ దేవరవోలెన్ = పార్వతీపరమేశ్వరులవలె; ఉండి = ఇంటనున్నవారై; ఇలుతీర్పఁగన్ = గృహకృత్యములు చక్కఁబెట్టుచుండఁగా; వానికిన్ = ఆ ప్రవరునికి; కాఁపురము = సంసారము; ఒప్పున్ = చక్కఁగా జరుగుచుండును.

తా. ఆ ప్రవరుఁడు ధనవంతుఁడయి తనకు ఈడయిన ప్రియభార్య సేవింపఁగా, యౌవనము నందే యజ్ఞము చేసి, పార్వతీపరమేశ్వరులవలెఁ దన తల్లిదండ్రులు క్షేమముగ నింటనుండి గృహకృత్యములు విచారించుకొనుచుండఁగా సుఖముగఁ గాఁపురము చేయుచుండెను.

సీ. వరణాతరంగిణీ దరవికస్వరనూత్న, కమలకషాయగంధము వహించి
ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ, వామనస్తుతిపరత్వమున లేచి
సచ్ఛాత్రుఁడగుచు నిచ్చలు నేఁగి యయ్యేట, నఘమర్షణస్నాన మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి సావిత్రి జపియించి, సైకతస్థలిఁ గర్మసాక్షి కెఱఁగి
ఫలసమిత్కుశకుసుమాదిబహుపదార్థ, తతియునుదికినమడుఁగుదోవతులుఁగొంచు
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు, వచ్చు నింటికిఁ బ్రజ తన్ను మెచ్చిచూడ.

టీ. వరణా...గంధమున్ - వరణాతరంగిణీ = వరణానదియందు; దరవికస్వర = ఇంచుక వికసించిన; నూత్న = క్రొత్తవైన; కమల = తామరపూవులయొక్క; కషాయగంధమున్ = వగరుతోడి వాసనను; వహించి = పూని; ప్రత్యూషపవనాంకురములు = వేకువయందలి పిల్ల వాయువులు - మందమారుతము లనుట; పైకొనువేళన్ = మీఁదసోఁకునట్టి సమయమునందు - తెల్ల వాఱుసమయమునం దనుట; వామనస్తుతిపరత్వమునన్ = దధి వామనస్తోత్రమునందలియాసక్తిచేత- శ్రీకృష్ణస్తోత్రపారాయణముతో ననుట; లేచి = నిద్రలేచి; సచ్ఛాత్త్రుఁడు = శిష్యులతోఁ గూడినవాఁడు; అగుచున్; నిచ్చలున్ = ఎల్లప్పుడును - ప్రతిదినము ననుట; ఏఁగి = పోయి; అయ్యేటన్ = ఆ వరణానదియందు; అఘమర్షణస్నానము = అఘమర్షణసూక్తములు పఠించుచుఁ జేయునట్టి స్నానమును; ఆచరించి = చేసి; సాంధ్యకృత్యమున్ = సంధ్యావందనాదికార్యమును; తీర్చి = జరపి; సావిత్రిన్ = గాయత్రీమంత్రమును; జపియించి = జపముచేసి; సైకత స్థలిన్ = ఇసుకదిన్నెయందు; కర్మసాక్షికిన్ = సూర్యునకు; ఎఱఁగి = నమస్కరించి - సూర్యోపస్థానముచేసి యనుట; ఫల...తతియున్ = పండ్లు, సమిధలు, దర్భలు, పువ్వులు మొదలుగాఁగల పెక్కు వస్తువుల సమూహమును; ఉదికిన మడుఁగుదోవతులున్; కొంచున్ = తీసికొంచు; బ్రహ్మచారులు = శిష్యులైన వడుగులు; వెంట రాన్ = తనతోడ రాఁగా; ప్రజ = జనసమూహము; తన్నున్; మెచ్చి; చూడన్; బ్రాహ్మణుండు = ప్రవరుఁడు; ఇంటికిన్; వచ్చున్.

శా. శీలంబుం గులమున్ శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయముం
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే భూపాలు[1] రీ వచ్చినన్
సాలగ్రా[2]మము మున్నుగాఁ గొనఁడు; మాన్యక్షేత్రముల్ పెక్కు చం
దాలం బండు; నొకప్పుడుం దఱుఁగ దింటం బాఁడియుం బంటయున్. 55

టీ. శీలంబున్ = సదాచారమును; కులమున్ = మంచివంశమును; శమంబున్ = బహిరింద్రియ నిగ్రహమును; దమమున్ = అంతరింద్రియమగు మనస్సుయొక్క నిగ్రహమును; చెల్వంబున్ = చక్కఁదనమును; లేఁబ్రాయమున్ = లేఁతవయస్సును; పోలన్ = పొసఁగియుండఁగా; చూచి; ఇతండు = ఈ బ్రాహ్మణుఁడు; పాత్రుఁడు = దానమిచ్చుటకుఁ దగినవాఁడు; అని; ఏ భూపాలురు = ఏరాజులు; ఈ వచ్చినన్ = దానమియ్యవచ్చినను; సాలగ్రామము మున్నుగాన్ = సాలగ్రామము మొదలుకొని; (సాలగ్రామదానము దోషములేని దని శాస్త్రీయము.) కొనఁడు = తీసికొనఁడు; మాన్యక్షేత్రముల్ = మాన్యపు భూములు (పూజ్యులని గౌరవించి యినాముగా రాజులు మొదలగువారిచ్చునట్టి భూమి మాన్య మనఁబడును.) పెక్కుచందాలన్ = బహువిధములుగా; పండున్ = ఫలించును. ఇంటన్ = ఇంటియందు; పాఁడియున్ = పాలసమృద్ధియు; పంటయున్ = పైరులు పండుటవలని ధాన్యసమృద్ధియు; ఒకప్పుడున్ = ఒక కాలమందును; తఱుఁగదు = తగ్గదు.

తా. ప్రవరుని యోగ్యతను జూచి, రాజులు నానావిధములయిన దానముల నీయవత్తురు. అతఁడు ప్రతిగ్రహము పాపము కలిగించు నని నిర్దోషమైన సాలగ్రామదానముసయితము తీసికొనకుండును. అయినను మాన్యపుభూములు తప్పక పండుచుండును; కావున నతని యింటఁ బాఁడి పంటలు కొఱఁతలేక యుండును.

---

1. భూపాలుఁడీ. పా. 2. గ్రామము. పా.

తే. వండ నలయదు వేవురు § వచ్చిరేని, నన్నపూర్ణకు నుద్దియౌ § నతనిగృహిణి
నతిథు లేతేర నడికిరే § యైనఁ బెట్టు, వలయు భోజ్యంబు లింట న § వ్వారిగాఁగ.

టీ. అన్నపూర్ణకున్ = అన్నపూర్ణాదేవికి; ఉద్దియౌ = ఈడైన; అతని గృహిణి = ఆ ప్రవరుని భార్య; వేవురు = వేయిమంది; వచ్చిరేనిన్ = అన్నార్థులయి వచ్చినను; వండన్ = వంటచేయుటకు; అలయదు = విసుగుకొనదు. అతిథులు = ఆగంతుకులు - (లేక) విందులు; ఏతేరన్ = రాఁగా; నడికిరేయైనన్ = అర్ధరాత్రమందైనను; ఇంటన్ = తమ ఇంటియందు; వలయు భోజ్యంబులు = కావలసిన భోజనవస్తువులు; అవ్వారిగాఁగన్ = సమృద్ధము అగునట్టుగా; పెట్టున్.

సీ. తీర్థసంవాసు లే § తెంచినా రని విన్న, నెదురుగా నేఁగు ద § వ్వెంతయైన
నేఁగి తత్పదముల § కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ, దెచ్చి సద్భక్తి నా § తిథ్యమిచ్చు
నిచ్చి [1]మృష్టాన్నసం § తృప్తులఁగాఁ జేయుఁ, జేసి కూర్చున్నచోఁ § జేర వచ్చు
వచ్చి యిద్ధరఁగల్గు § వనధిపర్వతసరి, త్తీర్థమాహాత్మ్యముల్ § దెలియ నడుగు
తే. నడిగి యోజనపరిమాణ § మరయు నరసి, పోవలయుఁ జూడ ననుచు నూ § ర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శ § నాభిలాష, మాత్మ నుప్పొంగ నత్తరు § ణాగ్నిహోత్రి.

టీ. అత్తరుణాగ్నిహోత్రి = ఎలప్రాయముగల ఆ యాహితాగ్ని - ప్రవరుఁడు; (అగ్నిహోత్రి యనఁగా నియతితో నగ్నిహోత్రమును వేల్చుచుండువాఁడు.) అనుదినము = ప్రతిదినమును; తీర్థసందర్శనాభిలాషము = తీర్థములఁ జూచుటయందలి కోరిక; ఆత్మన్ = మనస్సునందు; ఉప్పొంగన్ = అతిశయింపఁగా; తీర్థసంవాసులు = పుణ్యతీర్థములందు వాసముచేయువారు; (తీర్థయాత్రలు సలుపువా రనియుఁ జెప్పవచ్చును.) ఏతెంచినారు = వచ్చినారు; అని విన్నన్ = అని యెవరేనిచెప్పఁగా వినినయెడ; దవ్వు = దూరము; ఎంతయైనన్ = ఎంత యధికమయినను; ఎదురుగాన్ = వారికెదుర్కోలుగా; ఏఁగున్ = పోవును; ఏఁగి; తత్పదములకున్ = ఆ తీర్థవాసుల పాదములకు; ఎఱఁగి = మ్రొక్కి; ఇంటికిన్ = తనయింటికి; తెచ్చున్ = తీసికొని వచ్చును. తెచ్చి; సద్భక్తిన్ = మంచిభక్తితో; ఆతిథ్యము = అతిథిపూజను; ఇచ్చున్ = సమర్పించును. చేయుననుట. ఇచ్చి; మృష్టాన్నసంతృప్తులఁగాన్ = షడ్రసోపేత భోజనముచేతఁ దృప్తినొందినవారలనుగా; చేయున్; చేసి; కూర్చున్నచోన్ = వారు భోజనముచేసి కూర్చుండినప్పుడు; చేరవచ్చున్ = వారిదగ్గఱకు వచ్చును. వచ్చి; ఇద్ధరన్ = ఈ భూమియందు; కల్గు...మాహాత్మ్యముల్ = ఉండునట్టి సముద్రములయొక్కయు, కొండలయొక్కయు, నదులయొక్కయు, పుణ్యనదీక్షేత్రములయొక్కయు ప్రభావములను; తెలియన్ = విశదముగా; అడుగున్. అడిగి; యోజనపరిమాణము = ఆ తీర్థములకును, దానుండుచోటునకును గల యామడలకొలఁదిని; అరయున్ = విచారించును. అరసి = విచారించి; చూడన్ = ఆ తీర్థక్షేత్రములను జూచుటకు; పోవలయున్ = తాను బోవలయును; అనుచున్ = అని; ఊర్పులు = నిట్టూర్పులను; నిగుడ్చున్ = పుచ్చును.

క. ఈవిధమున నభ్యాగత, సేవాపరతంత్రసకల § జీవనుఁ డయి భూ
దేవకుమారకుఁ డుండం, గా విను మొకనాఁడు కుతప § కాలమునందున్. 58

1. యిష్టాన్న. పా.

టీ. ఈ విధమునన్ = ఈరీతిని; అభ్యాగత...జీవనుఁడై = భోజనార్థులయి యింటికి వచ్చిన యతిథులయొక్క పరిచర్యకు అధీనమయిన సమస్తమయిన బ్రతుకుదెరువుగలవాఁడై - తనబ్రతుకున కంతయు నతిథిసేవయే ముఖ్యముగాఁ దలంచినవాఁడై; భూదేవకుమారకుఁడు = బ్రాహ్మణపుత్త్రుఁడయిన ప్రవరుఁడు; ఉండంగాన్ = ఉండఁగా; వినుము. దీనికిఁ గర్త కృతిపతి. ఒకనాఁడు; కుతపకాలమునందున్ = మధ్యాహ్నానంతరకాలమునందు (పగటిలోఁ బదునాల్గుగడియలకు మీఁదిముహూర్తము కుతపకాల మనఁబడును). తరువాతి పద్యముతో నన్వయము.

సీ. ముడిచినయొంటికెంజెడ మూయ మువ్వన్నె, [1]మెగముతోలు కిరీటముగ ధరించి
కకపాలకేదార కటకముద్రితపాణిఁ, గుఱుచ[2]లాతముతోడఁ గూర్చి పట్టి
యైణేయమైన యొడ్డాణంబులవణిచే, నక్కళించినపొట్ట మక్కళించి
యారకూటచ్ఛాయ నవఘళింపఁగఁజాలు, బడుగుదేహంబున భస్మమలఁది

తే. మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయఁ, జెవుల రుద్రాక్షపోఁగులు చవుకళింపఁ
గావికుబుసంబు జలకుండికయును బూని, చేరెఁ దద్గేహ మౌషధసిద్ధుఁ డొకఁడు.

టీ. ముడిచినయొంటికెంజెడ మూయన్ = ముడివేసిన ఒక్కటయిన యెఱ్ఱనిజెడ కప్పుకొనునట్లు; మువ్వన్నెమెగముతోలు = మూఁడురంగులుగల మృగమైన పులియొక్కచర్మమును; కిరీటముగన్ = కుళ్లాయగా; ధరించి; కకపాల...పాణిన్ - కకపాల = కక్షపాలను - సన్న్యాసులు చంకనుంచుకొనునట్టి యొకవిధమైన సంచిని; కేదారకటక = పంచలోహములు చేర్చిచేసిన కడియము చేత; ముద్రిత = గుఱుతుగలదిగాఁ జేయఁబడిన - ఆ కడియమును ధరించిన యనుట, పాణిన్ = హస్తముచేత; కుఱుచ లాతముతోడన్ = పొట్టిదయిన యోగదండముతో; కూర్చి పట్టి = చేర్చి పట్టుకొని; ఐణేయమైన = ఆఁడుజింకతోలుతోఁ జేయఁబడినట్టి; ఒడ్డాణంబులవణిచేన్ = నడికట్టుపట్టెయొక్క బిగువుచేత; అక్కళించిన పొట్టన్ = లోపలికి నణఁగిన కడుపును; మక్కళించి = ఉబ్బించి; ఆరకూటచ్ఛాయన్ = ఇత్తడిచాయను; అవఘళింపఁగఁజాలు = అతిక్రమించుటకుఁ దగినట్టి; బడుగుదేహంబునన్ = బక్కటిల్లిన శరీరమునందు; భస్మము = విభూతిని; అలఁది = పూసికొని; మిట్టయురమునన్ = ఎత్తయినఱొమ్మునందు; నిడుయోగపట్టె = యోగాభ్యాససమయమునందు యజ్ఞోపవీతమువలె వేసికొనెడి నిడుపయిన పట్టుపట్టె; మెఱయన్ = ప్రకాశింపఁగా; చెవులన్ = చెవులయందు; రుద్రాక్షపోఁగులు = రుద్రాక్షలు గ్రుచ్చిన రాలచెవిపోఁగులు; చవుకళింపన్ = ఊఁగులాడఁగా; కావికుబుసంబున్ = ఎఱ్ఱమట్టిచాయ చొక్కాయయును; జలకుండికయును = నీళ్లతోడి కమండలువును; పూని = ధరించి; ఔషధసిద్ధుఁడు = ఓషధులసిద్ధిగల యోగీశ్వరుఁడు; ఒకఁడు; తద్గేహము = ఆ ప్రవరునియింటిని; చేరెన్ = ప్రవేశించెను.

తా. పులితోలుతోఁ జేయఁబడిన కుళ్లాయయు, పంచలోహములు చేర్చిచేసిన కడియమును, కక్షపాలయును, యోగదండమును, ఆఁడుజింకతోలితోఁ జేసిన నడికట్టుపట్టెయు; యోగపట్టమును ధరించి, పసుపువన్నెగల దేహమునందు విభూతి పూసికొని, రుద్రాక్షపోఁగులు పెట్టుకొని, కావి చొక్కాయ తొడిగి, నీళ్లతోడి కమండలువును జేతఁబట్టినవాఁడయి యొక సిద్ధపురుషుఁడు ప్రవరుని యింటికి వచ్చెను. అలం. స్వభావోక్తి.

---

1. మృగము. పా. 2. లాతాముతో. పా.

తే. ఇట్లు చనుదెంచు పరమయో । గీంద్రుఁ గాంచి, భక్తిసంయుక్తి నెదు రేఁగి । ప్రణతుఁ డగుచు
నర్ఘ్యపాద్యాదిపూజనం । బాచరించి, యిష్టమృష్టాన్నకలన సం । తుష్టుఁ జేసి.

టీ. ఇట్లు = ఈ రీతిని; చనుదెంచు = వచ్చిన; పరమయోగీంద్రుఁన్ = ఉత్తమయోగీశ్వరుని; కాంచి = చూచి; (ప్రవరుఁడు); భక్తిసంయుక్తిన్ = భక్తితోడికూడిక చేత - భక్తితోఁ గూడినవాఁడై యనుట; ఎదురేఁగి = ఎదురుగాఁ బోయి; ప్రణతుఁడు = నమస్కరించినవాఁడు; అగుచున్; అర్ఘ్యపాద్యాదిపూజనంబు = అర్ఘ్యము, పాద్యము మొదలుగాఁగల యుపచారములతోఁ బూజను; (అర్ఘ్యము = పూజకొఱకైనది; పాద్యము = పాదములకొఱకైనది; కాళ్లు చేతులు కడుగుకొన నీళ్లిచ్చి, పుష్పాదులతోఁ బూజించి యనుట.) ఆచరించి = చేసి; ఇష్టమృష్టాన్నకలనన్ = ఇష్టమును, తృప్తికరమయినదియు నగు భోజనము పెట్టుటచేత; సంతుష్టున్ = సంతోషించిన వానిఁగా; చేసి. దీనికిఁ దర్వాతి పద్యముతో నన్వయము.

క. ఎందుండి యెందుఁ బోవుచు, నిందుల కేతెంచినార । లిప్పుడు విద్వ
ద్వందిత! నేఁడుగదా మ, న్మందిరము పవిత్రమయ్యె । మాన్యుఁడ నైతిన్. 61

టీ. విద్వద్వందిత! = పండితులచేఁ గొనియాడఁబడినవాఁడా! (మీరలు) ఎందుండి = ఎక్కడనుండి; ఎందుఁబోవుచున్ = ఎక్కడికిఁ బోవుచు; ఇందులకున్ = ఇక్కడికి; ఇప్పుడు = ఈ సమయమునందు; ఏతెంచినారలు = వచ్చినారు? నేఁడుగదా = ఈ దినమునఁగదా; మన్మందిరము = మాయిల్లు; పవిత్రము = పావనము; అయ్యెన్; (నేను) మాన్యుఁడన్ = పూజింపఁదగినవాఁడను; ఐతిన్.

తా. ఓ యోగీంద్రా! మీ రెచటనుండి యెచటికిఁ బోవుచు నిచటికి వచ్చినారు? పెద్దలయిన మీ రాకచేత మాయిల్లు పావనమైనది. మీదర్శనముచేత నేను బూజ్యతను బొందితిని.

క. మీమాటలు మంత్రంబులు, మీమెట్టినయెడ ప్రయాగ । మీపాదపవి
త్రామలతోయము లలఘు, ద్యోమార్గఝరాంబుపౌన । రుక్త్యము లుర్విన్.

టీ. ఉర్విన్ = భూమియందు; మీమాటలు = మీరు చెప్పెడిమాటలు; మంత్రంబులు = మంత్రములవంటివి. మీమెట్టినయెడ = మీరు త్రొక్కినచోటు - మీ రడుగు పెట్టిన తావు; ప్రయాగ = ప్రయాగక్షేత్రమువంటిది. మీపాదపవిత్రామలతోయములు = మీపాదములు కడిగిన పరిశుద్ధములు, నిర్మలములు నయిన నీళ్లు; అలఘు...పౌనరుక్త్యములు = అధికమయిన ఆకాశమార్గమునఁ బోవు నేఱయిన గంగానదియొక్క జలములయొక్క పునరుక్తి గలిగినవి - అనఁగా అవియే మరలఁ జెప్పఁబడినవి. వానిని జెప్పిన వెనుక వీనిని జెప్పుట పునరుక్తియే. వానినే మరలఁ జెప్పుట యగు ననుట. మీ పాదతీర్థము లాకాశగంగాజలములతో సమానము లని భావము.

ఉ. వానిది భాగ్యవైభవము । వానిది పుణ్యవిశేష మెమ్మెయిన్
వాని దవంధ్యజీవనము । వానిది జన్మము వేఱు సేయ కె
వ్వానిగృహాంతరంబున భ । వాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల । సంతస మందుచుఁ బోవు నిచ్చలున్. 63

టీ. భవాదృశయోగిజనంబు = మీవంటి యోగులసమూహము; ఎవ్వాని గృహాంతరంబునన్ = ఎవనియింటిలోపల; వేఱుసేయక = భేదమెంచక; పావన......పానములన్ = పవిత్రమయిన స్నానవిధిచేతను, భోజనముచేతను, నీళ్లుత్రాగుటచేతను; నిచ్చలున్ = ఎల్లప్పుడును; సంతసము అందుచున్ = సంతోషమును పొందుచు; పోవున్ = పోవుచుండునో; వానిది = అటువంటివానిది; భాగ్యవైభవము = అదృష్టసంపద. వానిది = ఆ పురుషునిది; పుణ్యవిశేషము = సుకృతాతిశయము. వానిది; ఎమ్మెయిన్ = ఏవిధముచేతను; అవంధ్యజీవనము = వ్యర్థముగాని బ్రతుకు. వానిది; జన్మము = పుట్టుక - అటువంటి గృహస్థుని పుట్టుకయే సార్థక మనుట.

తా. ఓ యోగీశ్వరా! మీవంటి పెద్ద లెవనియింట భేదములేక స్వబంధువులవలెనే స్నానభోజనపానములు చేసి తృప్తినొంది పోవుచుందురో, యా గృహస్థుఁడు భాగ్యవంతుఁడును, బుణ్యవంతుఁడు నగును. అటువంటి గృహస్థునిదే సార్థకజన్మము నగును.

తే. మౌనినాథ! కుటుంబజం౯బాలపటల, మగ్నమాదృశగృహమేధి ౯ మండలంబు
నుద్ధరింపంగ నౌషధ౯మొండు గలదె, యుష్మదంఘ్రిరజో లేశ౯మొకటి దక్క.

టీ. మౌనినాథ = మునిశ్రేష్ఠుఁడా! కుటుంబ......మండలంబున్ - కుటుంబ = సంసారమనెడి; జంబాల = బురదయొక్క; పటల = సమూహమునందు; మగ్న = మునిఁగిన; మాదృశ = నాబోఁటి; గృహమేధి మండలంబున్ = గృహస్థులయొక్క సమూహమును ; ఉద్ధరింపంగన్ = ఆ యడుసునుండి లేవనెత్తుటకు; యుష్మదంఘ్రిరజోలేశము = మీ పాదములయొక్క దుమ్మురవ; ఒకటి తక్కన్ = ఒకటేతప్ప; ఔషధము = మందు; ఒండు = ఇతరము; కలదె? = ఉన్నదా? లేదనుట.

తా. ఓ మునీంద్రా! బురదయందువలెనే పెట్టినకాలూడఁదీసికొన శక్యముకాని సంసారమునందు మునిఁగియున్న మావంటివారి నుద్ధరింపఁజాలినది మీపాదధూళి యొకటేకాని మఱి యేదియుం గాదని తాత్పర్యము. మీపాదధూళి సోఁకినమాత్రమున సంసారబంధము వీడిపోవునని భావము.

'కుటుంబ జంబాల పటల మగ్న' అనుటచే 'మేము సంసారమునం దగులువడి, యిల్లు వదలి పోవుటకు వీలులేనివారము. కావున మీరలై మాయింటికి వచ్చి, మీపాదధూళిచే మమ్ము సంసారమునుండి యుద్ధరింపవలయు' నని ధ్వని. పటలశబ్దముచే సంసారముయొక్క బాహుళ్యమును, సులభముగాఁ బరిహరింపరామియు సూచితములు. 'జంబాలమగ్న'లకు 'అంఘ్రిరజ'మే యుద్ధారకముగాఁ జెప్పుటచే బురదయందు రజము పడి నిండినయెడల నందలి నీ రింకును గాన నందు మరల దిగఁబడుట కలుగదు. కనుక నదియే మముబోఁటులకు నుద్ధారక మగు నని సారస్యము. మిముబోఁటివారి పాదసేవచే మా సంసారబాధ నివృత్త మగు నని ధ్వని. అలం. రూపకము.

క. నా విని ముని యిట్లను వ, త్సా! విను; మావంటితైర్థి౯కావళి కెల్లన్
మీవంటిగృహస్థులసుఖ, జీవనమునఁ గాదె తీర్థ౯సేవయుఁ దలఁపన్. 65

టీ. నాన్ = అని ప్రవరుఁడు చెప్పఁగా; విని; ముని = సిద్ధుఁడు; ఇట్లనున్; వత్సా! = ఓయి చిన్నవాఁడా! విను = నామాట వినుము. మావంటితైర్థికావళికిన్ = మాబోఁటి తీర్థయాత్ర చేయువారి సమూహమునకు; ఎల్లన్ = అందఱకును; తీర్థసేవయున్ = గంగాప్రయాగాది పుణ్యతీర్థముల సేవించుటగూడ; తలఁపన్ = విచారింపఁగా; మీవంటిగృహస్థుల సుఖజీవనమునఁ గాదె = మీఁబోఁటి గృహస్థులు సుఖముగా జీవించుటచేతనే కదా!

తా. ప్రవరుఁ డిట్లు విన్నవింపఁగా సిద్ధుఁడు 'ఓచిన్నవాఁడా! మీవంటిగృహస్థులు సుఖముగా జీవించుచుండుటవలననే మావంటి తీర్థయాత్రాపరు లాతిథ్యము మొదలయినవి పడసి, తీర్థయాత్రలు సేయఁగలవారైరి. మీవంటివారే లేనియెడ యాత్రాపరు లూరక యున్నతావుననే యుండవలసిన వారేకదా!' యని పలికెను.

సీ. కెలఁకుల నున్నతంగేటిజున్ను గృహమేధి, యజమానుఁ డంకస్థితార్థపేటి
పండినపెరటికల్పకము వాస్తవ్యుండు, దొడ్డిఁబెట్టినవేల్పుగిడ్డి కాఁపు
కడలేని యమృతంపునడబావి సంసారి, సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశపథమధ్యమప్రప కులపతి, యాఁకటికొదవుసస్యము కుటుంబి
తే. బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి, జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావ
ధూత కాపాలికాద్యనాథులకు[1]నెల్ల, భూసురోత్తమ! గార్హస్థ్యమునకుసరియె.

టీ. గృహమేధి = గృహస్థుఁడు; బధిర...అనాథులకున్ - బధిర = చెవిటివారు; పంగు = కుంటివారు; అంధ = గ్రుడ్డివారు; భిక్షుక = బిచ్చగాండ్రు; బ్రహ్మచారి = వడుగులు; జటి = వానప్రస్థులు; పరివ్రాజక = సన్న్యాసులు; అతిథి = ఆగంతుకులు; క్షపణక = క్షపణక మతస్థులు. అనఁగా బౌద్ధులయిన భిక్షుకులు; అవధూత = దిగంబరులు; కాపాలిక = కాపాలికమతస్థులు - తలపుఱ్ఱెపెంకుతో భిక్షమెత్తి జీవించువారు; ఆది = మొదలుగాఁగల; అనాథులకున్ = దిక్కులేనివారలకు; ఎల్లన్ = అందఱకును; కెలఁకులన్ = పార్శ్వములయందు; ఉన్న; తంగేటిజున్ను = తంగేటిచెట్టునందుఁ బెట్టఁబడిన తేనెపెరవంటివాఁడు. యజమానుఁడు = గృహస్థుఁడు; అంకస్థితార్థపేటి = తొడపైనుండెడి రూకల పెట్టెవంటివాఁడు. వాస్తవ్యుఁడు = గృహస్థుఁడు; పండినపెరటికల్పకము = ఫలించిన యింటివెనుక దొడ్డియందలి కల్పవృక్షమువంటివాఁడు. కాఁపు = గృహస్థుఁడు; దొడ్డిన్ = పసులదొడ్డియందు; పెట్టినవేల్పుగిడ్డి = కట్టివేసి యుంచిన కామధేనువువంటివాఁడు. సంసారి = గృహస్థుఁడు; కడలేని యమృతంపు నడబావి = అంతములేని అమృతముయొక్క నడవయేర్పఱచినట్టి బావి వంటివాఁడు. భవనభర్త = గృహస్థుఁడు; సవిధమేరునగంబు= సమీపమునందున్న మేరుపర్వతము వంటివాఁడు. కులపతి = గృహాధిపతి - గృహస్థుఁడు; మరుదేశపథమధ్యమప్రప = నీళ్లులేని ప్రదేశమునందు మార్గమధ్యమున నుండెడి చలిపందిరివంటివాఁడు. కుటుంబి = గృహస్థుఁడు; ఆఁకటికిన్ = ఆఁకలి యెత్తినవేళకు; ఒదవు సస్యము = ఉపయోగించునట్టి పైరువంటివాఁడు. భూసురోత్తమ! = బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! గార్హస్థ్యమునకున్ = గృహస్థధర్మమునకు; సరియె = (ఇతరాశ్రమధర్మములు) సమానములా? కా వనుట. ఇందుఁ దంగేటిజున్ను మొదలగునవి యనాయాసముగా లభించునను నర్థముం దెలుపును.

తా. చెవిటి, కుంటి, గ్రుడ్డి మొదలయిన దిక్కుమాలినవారికెల్లను గృహస్థుఁడే రక్షకుఁడు. కాఁబట్టి గృహస్థాశ్రమమువంటి యాశ్రమము లేదు. అలం. రూపకము, ఉల్లేఖమును.

క. నావుడుఁ బ్రవరుం డిట్లను, దేవా! దేవర సమస్తతీర్థాటనముం
గావింపుదు రిలపై; నటు, గావున విభజించి యడుగఁ గౌతుకమయ్యెన్. 67

1. ఁగాన. పా.

టీ. నావుడున్ = అని సిద్ధుఁడు చెప్పఁగానే; ప్రవరుండు; ఇట్లు; అనున్; దేవా! = స్వామీ! దేవర = దేవరవారు - మీరు; ఇలపై = భూమిమీఁద; సమస్తతీర్థాటనమున్ = ఎల్ల తీర్థములనుగూర్చి తిరుగుటను - సకలతీర్థయాత్ర ననుట; కావింపుదురు = చేయుచుందురు. అటు గావునన్ = అట్లు కాఁబట్టి; విభజించి = (ఒక్కొక్క విషయమును) వేఱుపఱిచి - వేఱువేఱుగా ననుట; అడుగన్ = అడుగుటకు; కౌతుకము అయ్యెన్ = వేడుక కలిగెను.

శా. ఏ యే దేశములన్ [1]చరించితిరి మీ ♦ రే యే గిరుల్ చూచినా
రే యే తీర్థములందుఁ గ్రుంకిడితి ♦ రే యే ద్వీపముల్ మెట్టినా
రే యే పుణ్యవనాళిఁ [2]గ్రుమ్మరితి ♦ రే యే తోయధుల్ డాసినా
రా యా చోటులఁ గల్గు వింతలు మ ♦ హాత్మా! నా కెఱింగిం[3]పరే. 68

టీ. మహాత్మా! = ఓ మహానుభావా! మీరు; ఏ యే దేశములన్ = ఏ యే దేశములయందు; చరించితిరి = తిరిగితిరి. ఏ యే గిరుల్ = ఏ యే పర్వతములను; చూచినారు = చూచితిరి? ఏ యే తీర్థములందున్ = ఏ యే పుణ్యోదకములందు; క్రుంకిడితిరి = స్నానముచేసితిరి? ఏ యే ద్వీపముల్ = ఏ యే దీవులను; మెట్టినారు = త్రొక్కితిరి - ప్రవేశించితిరి; ఏ యే పుణ్యవనాళిన్ = ఏ యే పుణ్యారణ్యపంక్తియందు; క్రుమ్మరితిరి = తిరిగితిరి; ఏ యే తోయధుల్ = ఏ యే సముద్రములను; డాసినారు = సమీపించితిరి - స్నానార్థము చేరఁబోయితిరనుట. ఆ యా చోటులన్ = ఆ యా ప్రదేశములందు; కల్గు వింతలు = కలయట్టి యాశ్చర్యములను; నాకున్; ఎఱింగింపరే? = తెలియఁజేయరయ్యా!

తా. ఓ మహానుభావా! మీరు తిరిగిన దేశములను, మీ రాడిన తీర్థములను, చూచిన కొండలను, చొచ్చిన దీవులను, విహరించిన పుణ్యారణ్యములను, స్నానార్థము పోయిన సముద్రములను, వానివాని యందుఁ గల వింతలను నాకు విశదముగా నానతీయవలయును.

తే. పోయి సేవింప లేకున్నఁ ♦ బుణ్యతీర్థ, మహిమ వినుటయు నఖిలకల్మషహరంబ
కాన వేఁడెద ననిన న ♦ మ్మౌనివర్యుఁ, డాదరాయత్తచిత్తుఁడై ♦ యతనికనియె.

టీ. పోయి = పుణ్యతీర్థయాత్రపోయి; సేవింపలేకున్నన్ = ఆ పుణ్యతీర్థానుభవము చేయలేకయున్నను; పుణ్యతీర్థమహిమ = పుణ్యతీర్థములయొక్క ప్రభావమును; వినుటయున్ = (మీబోఁటి పెద్దలవలన) వినుటకూడ; అఖిలకల్మషహరంబ = ఎల్లపాపములను పోఁగొట్టునదే; (అగును). కానన్ = కనుక; వేఁడెదన్ = ప్రార్థించెదను. అనినన్ = అని ప్రవరుఁడు వేఁడఁగా; అమ్మౌనివరుఁడు = ఆ మునిశ్రేష్ఠుఁడు; ఆదరాయత్తచిత్తుఁడై = ఆదరమునకు నధీనమయిన మనస్సు గలవాఁడై - ఆదరణతో ననుట. అతనికిన్ = ఆ ప్రవరునితో; అనియెన్ = ఇట్లు చెప్పెను.

ఉ. ఓ చతురాస్యవంశకల ♦ శోదధిపూర్ణశశాంక! తీర్థయా
త్రాచణశీలినై జన ♦ పదంబులుఁ బుణ్యనదీనదంబులుం
జూచితి; నందు నందుఁ గల ♦ చోద్యములుం గనుఁగొంటి నాపటీ
రాచల పశ్చిమాచల హి ♦ మాచల పూర్వదిశాచలంబులన్. 70

టీ. ఓ చతురాస్య...శశాంక!; = ఓయి బ్రహ్మయొక్క వంశమనెడు పాలసముద్రమునకు నిండు చంద్రుఁడయిన ప్రవరుఁడా! తీర్థయాత్రాచణశీలినై = తీర్థయాత్రలు చేయుటయందు

1. వసించితిరి. పా. 2. ద్రిమ్మరితి. పా. 3. పవే. పా.

సమర్థమయిన స్వభావముగలవాఁడవై; జనపదంబులున్ = దేశములను; పుణ్యనదీనదంబులున్ = పవిత్రములయిన నదులను, నదములను; (తూర్పుతట్టు ప్రవహించునవి నదులు; పడమరతట్టు ప్రవహించునవి నదములు అని తెలియునది.) చూచితిన్; ఆపటీరాచల...దిశాచలంబులన్ = ఆ = ప్రసిద్ధమైన; పటీరాచల = మలయపర్వతము; పశ్చిమాచల = అస్తపర్వతము; హిమాచల = హిమవత్పర్వతము; పూర్వదిశాచలంబులన్ = ఉదయపర్వతము; ఈ నాలుగు పర్వతములందు; అందునందున్ = అక్కడక్కడ; కలచోద్యములున్ = ఉన్నట్టి వింతలనుగూడ; కనుఁగొంటిన్ = చూచితిని.

శా. కేదారేశు భజించితిన్; శిరమునం గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్; ప్రయాగనిలయుం బద్మాక్షు సేవించితిన్;
యాదోనాథసుతాకళత్రు బదరీ నారాయణుం గంటి; నీ
యా దేశంబన నేల ? చూచితి సమస్తాశావకాశంబులన్. 71

టీ. కేదారేశున్ = కేదారేశ్వరుఁడనెడి శివమూర్తిని; భజించితిన్ = సేవించితిని. హింగుళా పాదాంభోరుహముల్ = హింగుళయనెడి మహాదేవియొక్క పాదకమలములను; శిరమునన్ కీలించితిన్ = తలయందు చేర్చితిని - నమస్కరించితి ననుట. ప్రయాగనిలయున్ = ప్రయాగ క్షేత్ర మునికిపట్టుగాఁ గల; పద్మాక్షున్ = మాధవస్వామిని; సేవించితిన్ = కొలిచితిని. యాదోనాథసుతాకళత్రున్ = సముద్రునియొక్క కూఁతురైన లక్ష్మీదేవి భార్యగాఁగల; బదరీనారాయణున్ = బదరికాశ్రమమునందలి నారాయణదేవుని; కంటిన్ = చూచితిని. ఈ యా దేశంబు = ఈ దేశ మాదేశము; అనన్ ఏల? = అనుట యేమి? సమస్తాశావకాశంబులన్ = ఎల్లదిక్కుల మధ్య ప్రదేశములను; చూచితిన్.

వ. అది యట్లుండె. వినుము. గృహస్థరత్నంబ! లంబమానరవిరథతురంగశృంగార చారుచామరచ్ఛటాప్రేక్షణక్షణోద్గ్రీవచమరసముదయం బగు నుదయంబునం గల విశేషంబులు శేషఫణికినైన లెక్కింప శక్యంబె? యంధకరిపుకంధరావాసవాసుకివియోగభవ దుర్వ్యథాభోగభోగినీభోగభాగ పరివేష్టిత పటీరవిటపి వాటికావేల్లదేలాలతావలయం బగు మలయంబునం గల చలువకు విలువ యయ్యెది? యకటకట! వికటకూటకోటివిటంకశృంగాటకాఢౌకమాన[1]శరదిందుబింబగళదమృతబిందు దుర్దినార్ద్రీకృత సల్లకీపల్లవ ప్రభంజనపరాంజన హాస్తిహస్తంబగు నస్తంబునం గల మణిప్రస్తరంబుల విశ్రాంతిఁ జింతించిన మేనం బులక లిప్పుడుం బొడమెడు. స్వస్వప్రవర్ధితవర్ధిష్ణుధరణీరుహాసందోహదోహద ప్రధానాసమానఖేలద్వైలబిల విలాసినీ [2]విలాస వాచాలతులాకోటి కలకలాహూయమానమానసమరాళంబగు రజతశైలంబు నోలంబులం గాలగళువిహారప్రదేశంబులం గన్న సంసృతిక్లేశంబులు వాయవే? సతతమదజలస్రవణపరాయణైరావణవిషాణకోటిసముట్టంకిత కటకపరిస్ఫురత్కురువింద కందళవ్రాత జాతాలాతశంకాపసర్పదభ్రముభ్రమీ విభ్రమ ధురంధరంబగు

1. జరదిందు పా. 2. 'విలాస' కొన్నింట లేదు.

మేరుధరాధరంబుశిఖరంబుల సోయగంబులు గలయం గనుంగొనుట బహుజన్మ కృతసుకృతపరిపాకంబునం గాక యేల చేకూరనేర్చు? నే నిట్టి మహాద్భుతంబు లీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునం గనుంగొంటి ననుటయు, నీషదంకురిత హాసనగ్రసిష్ణుగండయుగళుం డగుచుం బ్రవరుం [1]డతని కిట్లనియె. 72

టీ. గృహస్థరత్నంబ! = గృహస్థులలో శ్రేష్ఠుఁడయిన యో ప్రవరుఁడా! అది = ఆ వృత్తాంతము; అట్లుండెన్ = అటుండనిమ్ము. వినుము = నేనిఁకమీఁదఁ జెప్పఁబోవు వృత్తాంతము వినుము. లంబమాన...సముదయంబగు - లంబమాన = వ్రేలుచున్న; రవిరథ =సూర్యుని తేరివైన; తురంగ = గుఱ్ఱములకు; శృంగార = అలంకారముగానున్న; చారు = సుందరములయిన; చామర = వింజామరలయొక్క; ఛటా = గుదులను; ప్రేక్షణ = చూచుటయనెడి; క్షణ = ఉత్సవముచేత; ఉద్గ్రీవ = పైకెత్తఁబడిన మెడలుగల; చమర = సవరపుమృగములయొక్క; సముదయంబగు = సమూహము గలిగినట్టి; ఉదయంబునన్ = ఉదయపర్వతమునందు; కల విశేషంబులు; శేషఫణికినైనన్ = (వేయినోళ్లుగల) యాదిశేషునికైనను; లెక్కింపన్ = ఇన్నియని లెక్కలుపెట్టుటకు; శక్యంబె = తరమా? అంధక...వలయంబగు - అంధకరిపు = అంధకాసురుని శత్రువైన శివుని యొక్క; కంధరా = మెడయే; ఆవాస = ఉనికిపట్టుగాఁగల; వాసుకి = సర్పరాజైన వాసుని యొక్క; వియోగ = ఎడఁబాటువలన; భవ = పుట్టిన; దుర్వ్యథా = చెడ్డవిచారముయొక్క; ఆభోగ = అతిశయముగల; భోగినీ = సర్పస్త్రీలయొక్క; భోగభాగ = శరీరభాగములచేత; పరివేష్టిత = అంతటను జుట్టఁబడిన; పటీరవిటపి = గంధపుమ్రాఁకులయొక్క; వాటికా = వరుసలయందు; వేల్లత్ = అల్లుకొనుచున్న; ఏలాలతా = ఏలకితీఁగెలయొక్క; వలయంబు అగు = సమూహములు గలిగినట్టి; మలయంబునన్ = గందపుఁ గొండయందు; కల చలువకున్ = ఉన్న చల్లఁదనమునకు; విలువ ఎయ్యది? = వెల ఏది? - లే దనుట. అకటకట! = ఆశ్చర్యము! వికట...హస్తంబగు - వికట = హెచ్చుతగ్గులై యుండెడి; కూటకోటి = శిఖరసమూహములయందలి; విటంక = ముంజూరునందలి గువ్వగూండ్ల సందులవంటి సందులయందుఁగల; శృంగాటక = నాలుగు త్రోవలను కలియు మార్గములందు; ఆఘోకమాన = అంతటను సంచరించుచున్న; శరదిందుబింబ = శరత్కాలచంద్రమండలమువల్లనుండి; గళత్ = జాఱుచున్న; అమృతబిందు = అమృతపుబొట్లచేతనైన; దుర్దిన = మబ్బుకమ్మిన దినముచేత; ఆర్ద్రీకృత = తడిసినవిగాఁ జేయఁబడిన; సల్లకీపల్లవ = అందుగుఁజిగుళ్లయొక్క; ప్రభంజనపర = మిక్కిలి ధ్వంసము చేయుటయం దాసక్తిగల; అంజనహస్తి = అంజనమనెడి పడమటిదిగ్గజముయొక్క; హస్తంబు = తొండము గలిగినట్టి; అస్తంబునన్ = అస్తమయపర్వతమునందు; కల మణిప్రస్తరంబుల విశ్రాంతిన్ = ఉన్న మానికపురాలపై విశ్రమించుటను; చింతించినన్ = తలఁచుకొన్నచో; మేనన్ = దేహమునందు; పులకలు = గగుర్పాటు; ఇప్పుడున్ = ఇప్పుడుగూడ; పొడమెడున్ = పొటమరించుచున్నవి. స్వస్వ... మరాళంబగు - స్వస్వప్రవర్ధిత = తమతమచేతఁ బెంపఁబడినవైన; వర్ధిష్ణు = పెరుఁగునట్టి స్వభావముగల; ధరణీరుహ = వృక్షములయొక్క; సందోహ = సమూహముయొక్క; దోహద = అకాలమునందుఁ బుష్పింపఁజేయు క్రియయే; ప్రధాన = ముఖ్యమైనట్టుగాను; అసమాన = సరిలేనట్టుగాను; ఖేలత్ = క్రీడించుచున్న; ఐలబిలవిలాసినీ = కుబేరుని యంతఃపురస్త్రీలయొక్క; విలాస = వినోదవిహారములయందు; వాచాల = మ్రోఁగుచున్న; తులాకోటి = అందెలయొక్క;

1. డిట్లనియె. పా.

కలకల = కోలాహల ధ్వనులచేత; ఆహూయమాన = పిలువఁబడుచున్న; మానస = మానసమనెడి సరోవరమునందున్న; మదాలస = మదముచే మందములగుచున్న మరాళంబగు = హంసలు గలిగినట్టి; రజతశైలంబునోలంబులన్ = వెండికొండయొక్క మఱుఁగుతావులయిన; కాలగళు విహారప్రదేశంబులన్ = శివుని వినోదసంచార స్థానములను; కన్నన్ = చూచినయెడ; సంసృతి క్లేశంబులు = సంసారదుఃఖములు; పాయవె? = తొలఁగిపోవా? (స్త్రీలు నడచునప్పుడు కాలి యందెలు మ్రోఁగుట హంసలు కూయునట్లుండును, గనుక కుబేర స్త్రీలు విహరించునప్పటి యందెల చప్పుళ్లు విని, హంసలు తమజాతి పక్షులధ్వను లని భ్రమించి, వారివారిం జేరవచ్చు నని సంబంధము.) సతత...ధురంధరంబగు - సతత = ఎల్లప్పుడు; మదజల స్రవణ = మదపునీటిని జాఱ్చుట యందు; పరాయణ = ఆసక్తమయిన; ఐరావణ = ఇంద్రుని యేనుఁగైన యైరావతముయొక్క; విషాణకోటి = కొమ్ముకొనలచేత; సముట్టంకిత = చక్కఁగాఁ బొడువఁబడిన; కటక = కొండ వడిమి నేలలందు; పరిస్ఫురత్ = మిక్కిలి వెలుఁగుచున్న; కురువింద = (మదకోకిలముల నేత్ర కాంతివంటి కాంతిగల) కెంపులయొక్క; కందళ = వెలుఁగు మొలకలయొక్క; వ్రాత = సమూహమువలన; జాత = పుట్టిన; అలాతశంకా = కొఱవులనెడి సందేహముచేత; అపసర్పత్ = ఎడముగాఁ దొలఁగిపోవుచున్న; అభ్రము = ఐరావతగజము భార్యయయిన యభ్రమువుయొక్క; భ్రమీ = గిరగిరఁదిరుగుటలవలన్; విలాస = ఒయ్యారముయొక్క; ధురంధరంబు అగు = భారము వహించినట్టి; మేరుధరాధరంబు శిఖరంబుల సోయగంబులు = మేరుపర్వతపు శృంగముల యొక్క చక్కఁదనములను; కలయన్ = అంతటను; కనుంగొనుట = చూచుట; బహు... పాకంబునన్ = అనేక జన్మములయందు చేయఁబడిన పుణ్యములయొక్క పరిపక్వమైన ఫలముచేత; కాక = కాని; ఏల చేకూర నేర్చున్ = ఎట్లు సిద్ధింపఁగలదు? (అభ్రమువు కురువిందమణులను గొఱవులనుగా శంకించె నన్నచోట నలంకారము భ్రాంతిమంతము.) నేను; (ఇది సిద్ధుని కన్వయము.) ఇట్టి మహాద్భుతంబులు = ఇటువంటి దొడ్డవింతలను; ఈశ్వరానుగ్రహంబునన్ = దేవుని యనుగ్రహముచేత; అల్పకాలంబునన్ = కొంచెపుఁగాలమున నే; కనుంగొంటిన్ = చూచితిని. అనుటయున్ = అని సిద్ధుఁడు చెప్పఁగా; ఈషత్...యుగళుండు = కొంచెము మొలచిన నవ్వును మ్రింగునట్టి స్వభావముగల (అణఁచుచున్న) చెక్కిళ్లజంట గలవాఁడు; అగుచున్; ప్రవరుండు; అతని కిట్లనియెన్.

తా. సూర్యుని తేరిగుఱ్ఱముల కలంకారముగా వేసియున్న సీవిరుల గుదులను జూచి, మోరలు మీఁది కెత్తుకొని, తమ జాతిమృగములే యం దున్న వని భ్రమించుచున్న సవరపుమృగములు గల యుదయపర్వతమునందలి వింతలు లెక్క లేని వనియు, తమ భర్తయయిన వాసుకి శివుని మెడయందాభరణమై యుండుటవలన విరహవేదనపడుచున్న సర్పస్త్రీలచేతఁ జుట్టుకోఁబడిన గందపు మ్రాఁకు లేలకితీఁగెల యల్లికచేత మిక్కిలిచల్లఁదనము నిచ్చుచుండగా నొప్పెడి మలయపర్వతము నందలి చల్లఁదనమునకు వెల యింతని చెప్పఁ దరము కా దనియు, శిఖరాగ్రములందు ముంజూరుల గువ్వగూండ్లం బోలెడి సందులయందు శరచ్చంద్రబింబమునుండి జాఱునట్టి యమృతంపుఁజినుకుల చెమ్మచేఁ బెరిఁగిన యందుగుమ్రాఁకుల చిగుళ్లను దొండముచే నొడిసిపట్టి తినుచుండెడి యంజనమనెడి దిగ్గజము సంచరించుచుండునట్టి యస్తమయపర్వత ప్రదేశములందుఁ గల రత్నపుశిలపయిం బరున్నప్పటి సుఖమును దలఁచుకొన్నప్పుడెల్ల దేహమునందు గగురు చిగురొత్తుచుండు ననియు, కుబేరునిభార్యలు తాము పెంచిన వృక్షములకు దోహదక్రియలు చేయుచు విహరించునప్పుడు మ్రోఁగుచున్న యందెల మ్రోఁతలు విని, వారిం జేరవచ్చుచున్న హంసలకు నెలవులయిన శివుని విహారప్రదేశములు చూచువారికి సంసారదుఃఖములు పాయు ననియు, ఐరావతము తనదంతములచేఁ

బొడిచి పెల్లగించి వెదచల్లఁగాఁ గోకిలములవలె వెలుఁగుచుండెడి కురువింద రత్నములను జూచి, యైరావతముయొక్క భార్యయయిన యభ్రమువనెడి యాఁడేనుఁగు కొఱవులని భ్రమసి, తోలంగెడి ప్రదేశములు గల మేరుపర్వతశిఖరములం జూచునంతటి భాగ్యము బహుజన్మములందుఁ జేసిన పుణ్యఫలముచేతనే కాని లభింప దనియు, ఇట్టి మహాశ్చర్యంబుల నెల్ల నీశ్వరానుగ్రహమువలన నల్పకాలములనె చూడఁగంటి ననియు సిద్ధుఁడు చెప్పఁగా నించుక నవ్వు వచ్చినను దాని నణఁచుకొని ప్రవరుఁడు సిద్ధునితో నిట్లు వచియించె నని తాత్పర్యము. (సూర్యుని గుఱ్ఱములకు నలంకారముగా వ్రేలవేసిన వింజామరలను దమజాతిమృగము లని చమరమృగములు భ్రమయుట, హంసలు స్త్రీల యందెల చప్పుడు తమజాతిపక్షులకూఁత లని భ్రమయుట అను నిట్టి చోట్ల భ్రాంతిమదలంకారము గమ్యము. వాసుకి వియోగమువలని తాపముచేత సర్పస్త్రీలు గంధపుమ్రాఁకులం జుట్టుకొనె నన్నచోట అలంకారము ఉత్ప్రేక్ష.)

చ. వెఱవక మీ కొనర్తు నొక ౯ విన్నప; మిట్టివి యెల్లఁ జూచి రా
నెఱకలు గట్టుకొన్న మఱి ౯ యేండ్లును బూండ్లును బట్టుఁ; బ్రాయపుం
జిఱుతతనంబు మీ మొగము ౯ సెప్పక చెప్పెడు; నద్దిరయ్య! మా
కెఱుఁగఁ దరంబె మీ మహిమ ౯ మీర యెఱుంగుదు; రేమి చెప్పుదున్. 73

టీ. వెఱవక = భయపడక; ఒక విన్నపము = ఒక విజ్ఞాపనము; మీకున్ = తమకు; ఒనర్తున్ = చేయుదును. మిమ్ము నొక్క విషయ మడిగెద ననుట. ఇట్టివి యెల్లన్ = ఇటువంటివింత లన్నియు; చూచిరాన్ = చూచివచ్చుటకు; ఎఱకలు = ఱెక్కలను; కట్టుకొన్నన్ = కట్టుకొనినను-ఱెక్కలు కట్టుకొని యెగిరిపోయినను; మఱి = ఇంకను; ఏండ్లును బూండ్లును = అనేక సంవత్సరములకాలము; పట్టున్; మీ మొగము; ప్రాయపుంజిఱుతతనంబున్ = వయస్సుయొక్క లేఁతఁదనమును; చెప్పక చెప్పెడున్ = ఒకరు చెప్పనక్కఱలేకయే తెలియఁజేయుచున్నది - మీ ముఖమే మీ లేఁతవయస్సును దెలుపుచున్న దనుట. అద్దిరయ్య! = ఆశ్చర్యము! మీ మహిమలు = మీ ప్రభావములు; మాకున్ = మా వంటివారికి; ఎఱుఁగన్ తరంబె? = తెలిసికొన సాధ్యమా? ఈర = మీరే; ఎఱుంగుదురు = గుర్తెఱుఁగుదురు - మీ మహిమ మీకే కాని యితరులకుఁ దెలియ దనుట. ఏమి చెప్పుదున్ = ఇఁక నే నేమి చెప్పఁగలను?

తా. నేను జంకక మిమ్ము నొక్క విషయ మడిగెదను. మీరు చెప్పిన విశేషములను ఱెక్కలు గట్టుకొని పోయి చూచిరాఁ దలఁచినను, పెక్కు సంవత్సరములు పట్టును. ఇఁక నడచిపోయి చూచి రావలయు నన్నఁ జెప్పవలయునా? ఇది యిట్లుండ, మీ మొగముఁజూడఁగా మీరు మిక్కిలి పసివా రగుట స్పష్టముగ తెలియుచున్నది. ఇంతలో వాని నెల్ల నెట్లు చూడఁజాలితిరో! మీ మహిమ మీకేకాక మఱి యెవ్వరికిఁ దెలియును?

క. అనినఁ బరదేశి గృహపతి, కనియెన్ సందియముఁ దెలియ ౯ నడుగుట తప్పా?
వినవయ్య జరయు రుజయును, జెనకంగా వెఱచు మమ్ము ౯ సిద్ధుల మగుటన్. 74

టీ. అనినన్ = ఇట్లని ప్రవరుఁ డడుగఁగా; పరదేశి = సిద్ధుఁడు; గృహపతికిన్ = గృహస్థుడైన ప్రవరునితో; అనియెన్ = ఇట్లు చెప్పెను. సందియమున్ = కలిగిన సందేహమును; తెలియన్ = విశదముగాఁ దెలియునట్లు; అడుగుట; తప్పా = నేరమా? (కా దనుట.) వినవయ్య! =

వినుము. సిద్ధులము అగుటన్ = (మేలు) ఔషధసిద్ధిగలవారము కావున; మమ్ము; జరయున్ = ముసలితనమును; రుజయున్ = వ్యాధియును; చెనకంగాన్ = ముట్టుటకు; వెఱచున్ = భయపడును. మాకు ముసలితనమును, వ్యాధియు రావనుట.

మ. పరమంబైన రహస్య మౌ; నయిన డాఁ ✽ పం; జెప్పెదన్; భూమిని
ర్జరవంశోత్తమ ! పాదలేప మనుపే ✽ రం గల్గు దివ్యౌషధం
పురసం బీశ్వరసత్కృపం గలిగెఁ; ద ✽ ద్భూరిప్రభావంబునం
జరియింతుం బవమానమానసతిర ✽ స్కారిత్వరాహంకృతిన్. 75

టీ. భూమినిర్జరవంశోత్తమ ! = బ్రాహ్మణశ్రేష్ఠుఁడవైన ప్రవరుఁడా! పరమంబైన = మిక్కిలి; రహస్యము = గోప్యవిషయము; ఔన్ = అవును; అయినను = ఐనప్పటికిని; డాఁపన్ = నేను దాఁచను; చెప్పెదన్. పాదలేపమనుపేరన్ = పాదలేపము అనెడి పేరితో; కల్గు దివ్యౌషధంపు రసంబు = కలిగిన శ్రేష్ఠమయిన యౌషధరసము; ఈశ్వరసత్కృపన్ = దేవుని దయచేత; కలిగెన్ = నాకు లభించెను. తద్భూరి ప్రభావంబునన్ = దాని దొడ్డ మహిమచేత; పవమాన...అహంకృతిన్ = వాయువును, మనస్సును అవమానపఱచునట్టి వేగముచేతనయిన గర్వముచేత; చరియింతున్ = తిరుగుదును.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! నాకు నింతటి మహిమ గలిగినవిషయము మిక్కిలి రహస్యము. అయినను దానిని దాఁపక చెప్పెదను. పాదలేపము అనుపేరుగల దివ్యౌషధరస మొకటి నాకు నీశ్వరానుగ్రహమువలన దొరికినది. దానిచే వాయువుకన్నను, మనస్సుకన్నను హెచ్చయిన వేగముతో నెల్లదేశములను దిరుగుదును.

క. దివి బిసరుహబాంధవసైం, ధవసంఘం బెంత దవ్వు ✽ దగ లే కరుగున్
భువి నంతదవ్వు నేమును, తవతవ లే కరుగుదుము హు ✽ టాహుటినడలన్. 76

టీ. దివిన్ = ఆకాశమునందు; బిసరుహ...సంఘంబు = కమలములకు చుట్టమయిన సూర్యుని గుఱ్ఱములయొక్క సమూహము; ఎంత దవ్వు = ఎంత దూరములు; దగలేక = దప్పిలేక - అనాయాసముగా ననుట; అరుగున్ = పోవునో; భువిన్ = భూమియందు; అంత దవ్వున్ = అంత దూరమును; ఏమును = మేమును; తవతవలేక = ఆయాసములేక; హుటాహుటి నడలన్ = అతిత్వరితము లయిన గమనములచేత; అరుగుదుము.

మ. అనినన్ విప్రవరుండు కౌతుకభర ✽ వ్యగ్రాంతరంగుండు భ
క్తినిబద్ధాంజలిబంధురుండు నయి మీ ✽ దివ్యప్రభావం బెఱుం
గని నా ప్రల్లదముల్ సహించి మునిలో ✽ కగ్రామణీ! సత్కృపన్
నను మీశిష్యునిఁ దీర్థయాత్రవలనన్ ✽ ధన్యాత్ముఁగాఁ జేయరే.[1] 77

టీ. అనినన్ = అని సిద్ధుఁడు చెప్పఁగా; విప్రవరుండు = బ్రాహ్మణ శ్రేష్ఠుఁడైన ప్రవరుఁడు; కౌతుక...అంతరంగుండున్ = కుతూహలముయొక్క అతిశయముచేత తొట్రుపడుచున్న మనస్సుగ్గలవాఁడును; భక్తి...బంధురుండు నయి = భక్తిచేత కట్టఁబడిన దోసిలిచేత ఒప్పినవాఁడు నై; మీ దివ్యప్రభావంబు = మీయొక్క ఘనమయిన మహిమను; ఎఱుంగని నా ప్రల్లద

1. జేయవే. పా.

ముల్ = తెలియని నాయొక్క దుర్భాషణములను - వ్యర్థవాక్యముల ననుట; సహించి = ఓర్చి; మునిలోకగ్రామణీ! = మునిసమూహమునందు శ్రేష్ఠుఁడవయిన యో సిద్ధుఁడా! సత్కృపన్ = మంచిదయచేత; మీ శిష్యునిన్ = మీ శిష్యుఁడయిన; ననున్ = నన్ను; తీర్థయాత్రవలనన్ = తీర్థములనుగూర్చి పోవుటవలన; ధన్యాత్ముఁగాన్ = కృతార్థమయిన మనస్సు గలవానిఁగా - మనసులోని కొఱఁత తీఱినవానిఁగా; చేయరే = చేయుఁడు.

క. అనుటయు రసలింగము నిడు, తనవట్రువ ప్రేఁపసజ్జ ◆ దంతపుఁబరణిన్
నినిచిన యొక పస రిది యది, యని చెప్పక పూసెఁ దత్ప ◆ దాంబుజయుగళిన్.

టీ. అనుటయున్ = ప్రవరుఁ డిట్లనుగఁగా; (సిద్ధుఁడు) రసలింగమున్ = రసముతోఁ జేసిన గుళికను; ఇడు తన వట్రువప్రేఁపసజ్జన్ = ఉంచునట్టి గుండ్రమైన తన ప్రేఁపబుట్టలోని; దంతపు బరణిన్ = దంతపుఁగరాటమునందు; నినిచిన యొక పసరు = నిండించిన యొక విధమయిన యాకు రసమును; ఇది యది యని చెప్పక = పేరుచెప్పక; తత్పదాంబుజయుగళిన్ = ఆ ప్రవరుని కమలములవంటి యడుగులజంటయందు; పూసెన్ = రాచెను.

క. ఆ మం దిడి యతఁ డరిగిన, భూమీసురుఁ డరిగెఁ దుహిన ◆ భూధరశృంగ
శ్యామలకోమలకానన, హేమాఢ్యదరీఝరీని ◆ రీక్షాపేక్షన్. 79

టీ. ఆ మందు ఇడి = ఆ పసరును పూసి; అతఁడు = ఆ సిద్ధుఁడు; అరిగినన్ = పోఁగా; భూమీసురుఁడు = బ్రాహ్మణుఁడు - ప్రవరుఁడు; తుహిన...అపేక్షన్ - తుహినభూధర = మంచుకొండయొక్క; శృంగ = శిఖరములయందలి; శ్యామల = పసరుమించిన నలుపువన్నెగల; కోమల = లేఁతవైన; కానన = అడవులయొక్కయు; హేమాఢ్య = బంగారుతో నిండిన - సువర్ణమయములైన యనుట; దరీ = గుహలయొక్కయు; ఝరీ = సెలయేళ్లయొక్కయు; నిరీక్షాపేక్షన్ = చూచుటయందలి కోరికచేత; అరిగెన్ = పోయెను. (దరీశబ్దమునకు కొండలు లోయ యని యర్థము చెప్పెదరు.)

వ. అనిన విని యమ్మహీసురవరుఁ డట్లరిగి యెట్లు ప్రవర్తించె; నతని పుణ్యావర్తన శ్రవణంబు మనంబునకు హర్షోత్కర్షంబు కల్పించెఁ దర్వాతివృత్తాంతంబు గృపాయత్తచిత్తంబున నానతీయ వలయు నని యడుగుట యును. 80

టీ. అనినన్ = అని పక్షులు చెప్పఁగా (జైమిని) విని; అమ్మహీసురవరుఁడు = బ్రాహ్మణోత్తముఁ డయిన యా ప్రవరుఁడు; అట్లు; అరిగి = పోయి; ఎట్లు = ఏరీతిని; ప్రవర్తించెన్ = నడిచెను? అతని పుణ్యావర్తన శ్రవణంబు = ఆ ప్రవరునిదయిన ధర్మప్రవర్తనముయొక్క వినికి; మనంబునకున్ = మనస్సునకు; హర్షోత్కర్షంబు = సంతోషాతిశయమును; కల్పించెన్ = పుట్టించెను. తర్వాతి వృత్తాంతంబు = అటుపిమ్మటి సమాచారమును; కృపాయత్తంబగు = దయకు నధీనమయిన; చిత్తంబునన్ = మనస్సుతో; ఆనతీయవలయున్ = చెప్పవలయును. అని యడుగుటయున్ = అని జైమినిముని యడుగఁగా; దీనికి రెండవయాశ్వాసమునందలి 'అవధరింపుము' అను క్రియతో నన్వయము.

శా. గంగా స్వచ్ఛ తరంగ భంగిక యశో ఽ గాఢ చ్ఛవి చ్ఛన్న సా
రంగాంకాంక! నిరంకుశ ప్రతికళా ఽ ప్రౌఢి ప్రియంభావుకా!
గాంగేయాచలచాప నూపుర వచో ఽ గాంభీర్య లీలాస్పదా!
బంగాళాం[1]ధ్రకళింగ భూప సుభటా ఽ భ్రశ్రేణి ఝంఝానిలా! 81

టీ. గంగా...అంక! = గంగానదియందలి నిర్మలమయిన అలలయొక్క రీతివంటి రీతిగల కీర్తియొక్క దట్టమయిన కాంతిచేత కప్పఁబడిన చంద్రునిదైన చిహ్నముగలవాఁడా! (అలం. ఉపమ, అతిశయోక్తియు.) నిరంకుశ...భావుకా! = అడ్డములేని ప్రతివిద్యయందలి సామర్థ్యముచేత ప్రియుఁడగునట్టివాఁడా! గాంగేయ...ఆస్పదా! = బంగారుకొండయే విల్లుగాఁగల శివునియొక్క అందెయయిన యాదిశేషుని మాటలయొక్క గంభీరభావముయొక్క విలాసమువంటి విలాసమునకు స్థానమయినవాఁడా! (అలం. పదార్థవృత్తినిదర్శన) బంగా...అనిలా = బంగాళము, ఆంధ్రము, కళింగము అను దేశముల రాజులయొక్క మంచిబంట్లనెడు మేఘములవరుసకు మహాధ్వనితోఁగూడిన పెనుగాలి యయినవాఁడా! (ఝంఝా శబ్దమునకు ధ్వానితోఁగూడిన గాలి యను నర్థము ప్రసిద్ధము.) (అలం. రూపకము.)

తా. శ్రీకృష్ణదేవరాయలు గంగయందలి యలలవలెఁ దెల్లనై చంద్రమండలమువఱకు వ్యాపించిన కీర్తిగలవాఁడును, ఎల్ల విద్యలందును గల మిక్కుటమయిన పాండిత్యముచే మేలొందినవాఁడును, ఆదిశేషుని వాగ్వైఖరివంటి వాగ్వైఖరి గలవాఁడును, కళింగాంధ్రబంగాళదేశముల రాజులసేనలను గెలిచినవాఁడు నని తాత్పర్యము.

క. మండలికతపన! [2]పూజిత, కుండలిపతిశయన! కర్ణ ఽ కుండలితరసా
ఖండకవికావ్య! దిగ్వే, దండశ్రుతిదళనకలహ ఽ తాడితపటహా! 82

టీ. మండలికతపన! = మండలిక తపనుఁడు (సామంతులకు సూర్యుఁడు) అనెడి బిరుదము కలవాఁడా! పూజితకుండలిపతిశయన = పూజింపఁబడిన శేషశాయియగు విష్ణువుకలవాఁడా! కర్ణ...కావ్య - కర్ణ = చెవులకు; కుండలిత = పోఁగులుగాఁ జేయఁబడిన; రసాఖండ = శృంగారాది నవరసములచేతను నిండిన; కవి = కవులయొక్క; కావ్య = ప్రబంధములు గలవాఁడా! రసవంతములగు కవుల కావ్యములు కర్ణభూషణములుగాఁ జేసికొన్నవాఁడా! యనుట. దిగ్వే...పటహా! = దిగ్గజములయొక్క చెవులను పగుల్చునట్లు యుద్ధమునందుఁ గొట్టఁబడిన వాద్యవిశేషము గలవాఁడా! (మండలికుఁ డనఁగా - వింశతి యోజన విస్తృతిగల దేశము నేలువాఁడు అని శబ్దార్థకల్పతరువు.)

ఉత్సాహము. కుకురు కాశ కురు కరూశ ఽ కోస లాంధ్ర సింధు బా
హ్లీక శకాంగ[3] వంగ సింహ ఽ ళేశ కన్యకామణి
ప్రకర పాణి ఘటిత రత్న ఽ పాదుకా కలాచికా
ముకుర పీటికాకరండ ఽ ముఖ్య రాజలాంఛనా! 83

టీ. కుకురు...లాంఛనా! = కుకురు, కాశ, కురు, కరూశ, కోసల, ఆంధ్ర, సింధు, బాహ్లీక, శక, అంగ, వంగ, సింహళ దేశములకు; ఈశ = ప్రభువులయిన రాజులయొక్క; కన్యకామణి =

1. ళాంగ. పా. 2. శోభిత. పా. 3. శకాంధ్ర. పా.

కన్యారత్నములయొక్క; ప్రకర = సమూహముచేత; పాణి = చేతులయందు; ఘటిత = కూర్పఁ నడిన - పట్టుకోఁబడిన; రత్నపాదుకా = రత్నములు పొదిఁగిన పావకోళ్లు; కలాచికా = తమ్మ పడిగము; ముకుర = అద్దము; వీటికాకరండ = తాంబూలపుబరణి - అడపము; ముఖ్య = మొద లుగాఁగల; రాజలాంఛనా ! = రాజచిహ్నములు గలవాఁడా !

తా. కృష్ణదేవరాయలు కుకురు, కాశ, కరూశాది దేశముల రాజులను గెలిచి, వారి కన్యలను గొనివచ్చి, పరిచారికలను జేసికొనియెను; గనుక నా కన్యకలు పావకోళ్లు మొదలైనవానిని జేతుల ధరించి, కొలువు చేయఁగా నొప్పువాఁ డని తాత్పర్యము.

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష పాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లికాల్లసాని చొక్కయామాత్య పుత్త్ర పెద్దనార్యప్రణీతం బైన స్వారోచిషమనుసంభవంబను మహా ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము. 84

టీ. ఇది; శ్రీమత్...ప్రణీతంబైన - శ్రీమత్ = విద్యాసంపత్తిచేనైన; ఆంధ్రకవితాపితామహ = ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మయనెడు; సర్వతోముఖ = అంతటను వ్యాపించిన; అంక = బిరుదుపేరు గలవాఁడును; పంకజాక్ష = విష్ణువుయొక్క; పాదాంబుజ = పాదములనెడు కమలము లందు; అధీన = ఆసక్తమయిన; మానసేందిందిర = మనస్సనెడి తుమ్మెదగలవాఁడును; నందవర పురవంశోత్తంస = నందవర మను పట్టణమువారి వంశమునందు శ్రేష్ఠుఁడును - నందవరకులవంశ మునందు శ్రేష్ఠుఁడును; శఠకోపతాపస = శఠకోపయతియొక్క; ప్రసాద = అనుగ్రహముచేత; ఆసాదిత = పొందఁబడిన; చతుర్విధ = నాలుగువిధములయిన; కవితామతల్లిక = శ్రేష్ఠమయిన కవిత్వము గలవాఁడును; (చతుర్విధకవిత్వములు - ఆశువు, మధురము, చిత్రము, విస్తరము.) అల్లసాని చొక్కయామాత్యపుత్ర = అల్లసాని చొక్కయమంత్రియొక్క కుమారుఁడు నగు; పెద్దనార్య ప్రణీతంబైన = పెద్దనార్యునిచేఁ జేయఁబడినట్టి; స్వారోచిషమనుసంభవంబు; అను; మహాప్రబంధంబునందుక్ = మహాకావ్యమునందు; ప్రథమాశ్వాసము = మొదటి యాశ్వాసము.

# స్వారోచిష మనుచరిత్రము

## టీకాతాత్పర్యసహితము

### ద్వితీయాశ్వాసము



క. ఖండశీతనగమ
ధ్యాఖండక్షోణిమండ ౹ లాఖండల! వి
ద్యాఖేలనభోజ! సుధీ
లేఖద్రుమ! కృష్ణరాయ! ౹ లీలామదనా! 1

టీ. శ్రీఖండ...ఆఖండల - శ్రీఖండ, శీతనగ = గందపుఁగొండ, మంచుకొండ యను నీ రెండు కొండలయొక్క; మధ్య = నడుమనుండెడి; అఖండ = సమస్తమయిన; క్షోణిమండల = భూమండలమునకు; ఆఖండల! = ఇంద్రుఁడైనవాఁడా! పాలకుఁడా! యనుట. విద్యాఖేలన భోజ! - విద్యా విద్యలయందు; ఖేలన = క్రీడించుటలో; భోజ = భోజరాజైనవాఁడా! భోజరాజువలె విద్యావినోదముచేతఁ బ్రొద్దుపుచ్చువాఁడా! యనుట. సుధీలేఖద్రుమ! = విద్వాంసులకు దేవతావృక్ష (కల్పవృక్ష) మైనవాఁడా! - విద్వాంసులు కోరినవి కోరినట్లిచ్చువాఁడా! యనుట. లీలామదనా! = విలాసమునందు మన్మథుఁడా! కృష్ణరాయ! (అని కృతిపతి సంబోధనము.) అవధరింపు మని క్రింది వచనముతో నన్వయము.

వ. అవధరింపుము జైమిని మునీంద్రునకుఁ బ్రజ్ఞాసాంద్రంబు లగు పక్షీంద్రంబు లవ్వలికథ యిట్లని చెప్పందొడంగె. 2

టీ. అవధరింపుము = వినుము. జైమినిమునీంద్రునకున్ = జైమినిమునిశ్రేష్ఠునితో; ప్రజ్ఞాసాంద్రంబులు అగు = బుద్ధిచేత నతిశయించినట్టి; పక్షీంద్రంబులు = పక్షిశ్రేష్ఠములు; అవ్వలికథన్ = తరువాతికథను; ఇట్లని చెప్పం దొడంగున్ = క్రిందిరీతిని చెప్ప నారంభించెను.

చ. [1]అట చని కాంచె భూమిసురుఁ ౹ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహు ర్లుఠద ౹ భంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనాను[2]కూల పరి ౹ ఫుల్ల కలాప కలాపి జాలముం
గటకచరత్కరేణు కర ౹ కంపితసాలము శీతశైలమున్. 3

టీ. భూమిసురుఁడు = బ్రాహ్మణుఁడు - ప్రవరుఁడు; చని = పోయి - ముందు చెప్పిన చొప్పున హిమవత్పర్వతమునకుఁ బోయి యనుట; అటన్ = అక్కడ; అంబర...జాలమున్ -

1. అటఁజని. పా. 2. రూప. పా.

అంబర = ఆకాశమును; చుంబి = ఒరయుచున్న; శిరః = శిఖరములందుండి; సరత్ = ప్రవహించుచున్న; ఝరీ పటల = సెలయేళ్ల సమూహమునందు; ముహుర్ముహుః = మాటిమాటికి; లుఠత్ = పొరలుచున్న; అభంగ = ఎడతెగని; తరంగ = అల లనెడి; మృదంగ = మద్దెలల యొక్క; నిస్వన = ధ్వనులచేత; స్ఫుట = స్పష్ట (ప్రకటన) మగుచున్న; నటన = నాట్యమునకు; అనుకూల = తగినట్టుగా; పరిఫుల్ల = బాగుగా విప్పఁబడిన; కలాప = పురులు గల; కలాపి జాలమున్ = నెమిళ్ల సమూహములు గలదానిని; కటక... సాలమున్ - కటక = కొండ నడిమి ప్రదేశములందు; చరత్ = తిరుగుచున్న; కరేణు = ఆఁడుయేనుఁగులయొక్క; కర = తొండములచేత; కంపిత = వడఁకింపఁబడిన - కదలింపఁబడిన; సాలమున్ = వృక్షములు గలదానిని; శీతశైలమున్ = హిమవత్పర్వతమును; కాంచెన్ = చూచెను.

తా. ప్రవరుఁ డట్లు పోయినచోట నాకాశము నంటిన శిఖరములయందుండి దిగువకుఁ బాఱుచున్న సెలయేళ్ల యలలచప్పుడు మద్దెలల మ్రోఁతవలె వినఁబడఁగా నందులకుఁ దగినట్టు పురులు విప్పి యాడుచున్న నెమిళ్ళగుంపులు గలదియు, కొండ నడిమినెలలయందలి వృక్షములను దొండములతోఁ బట్టి యాడించుచున్న యేనుఁగులు గలదియు నైన మంచుకొండను జూచెను. అలం. రూపకము.

వ. కాంచి యంతరంగంబునఁ దరంగితం బగు హర్షోత్కర్షంబున. 4

టీ. కాంచి = చూచి; అంతరంగంబునన్ = మనస్సునందు; తరంగితంబు = అలలు గొట్టునది - ఎడతెగక పైపయి నుప్పొంగుచున్నది; అగు హర్షోత్కర్షంబునన్ = అయిన సంతోషాతిశయముచేత.

క. నరనారాయణచరణాం, బురుహద్వయభద్రచిహ్న ముద్రితబదరీ
తరుషండమండలాంతర, సరణిన్ ధరణీసురుండు సనఁజన నెదుటన్. 5

టీ. ధరణీసురుండు = బ్రాహ్మణుఁడైన ప్రవరుఁడు; నర...సరణిన్ - నరనారాయణ = నరుఁడు, నారాయణుఁడు నని విష్ణువునంశమున జనించిన ఋషులయొక్క; చరణాంబురుహద్వయ = పాదపద్మముల జంటయొక్క; భద్ర = శుభకరములైన; చిహ్న = హల కులిశాది రేఖలయొక్క గుఱుతులచేత; ముద్రిత = ముద్రింపఁబడిన - గుఱుతిడఁబడిన; (ఇది సరణికి విశేషణము.) బదరీతరు = రేఁగుమ్రాఁకులయొక్క; షండ = సమూహముయొక్క; మండల = ఆవరణరూపమైన ప్రదేశముయొక్క; అంతర = మధ్యభాగమునందలి; సరణిన్ = త్రోవను; చనఁ జనన్ = పోఁగాఁ బోఁగా - చాలదూరము పోఁగా ననుట; ఎదుటన్ = ముందట. క్రింది పద్యముతో నన్వయము.

తా. అట్లు హిమవత్పర్వతమును జూచి, సంతోషించిన ప్రవరుఁడు పూర్వకాలమునందు విష్ణుదేవునంశమున నవతరించిన నరనారాయణులను మహామునులు తపస్సుచేసిన బదరీవనముఁ జొచ్చి, దాని నడుమ నొక త్రోవను గని, యా త్రోవను చాల దూరము పోవునప్పు డెదుటిభాగమునందు.

క. ఉల్లలదలకాజలకణ, పల్లవితకదంబ[1]కుసుమ పరిమళలహరీ
హల్లోహలమదబంభర, మల్లధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్. 6

టీ. ఉల్లల...ధ్వనులు - ఉల్లలత్ = గట్లుమీఁది కెగయుచున్న; అలకా = అలక యనెడి యేటియందలి; జలకణ = నీటిబిందువులచేత; పల్లవిత = చిగిరించిన; కదంబ కుసుమ = కడిమి పూల

1. ముకుళ. పా.

యొక్క; పరిమళ = మంచివాసనలయొక్క; లహరీహల్లోహల=ప్రవాహ ధారయందలి; మదబంభర మల్ల = మత్తుగొన్న తుమ్మెద మిన్నలయొక్క; ధ్వనులు = ఝంకారపు మ్రోఁతలు; ఎసఁగన్ = అతిశయించునట్లుగా; మరుదంకురముల్ = గాలిమొలకలు - తిన్ననిచల్లగాలి; విసరెన్ = వీచెను; అనఁగా అలకానదిమీఁదుగాఁ గడిమిపువ్వులవాసనలతోఁ గూడి వచ్చినతిన్నని చల్లగాలి, యా వాసనలకు వచ్చిన దుమ్మెదల ఝంకారధ్వను లతిశయింపఁగా వీచెను.

సీ. తొండముల్సాఁచియందుగుఁజిగుళ్లకు నిక్క, కరులదంతచ్ఛాయ గడలుకొనఁగ
సెలవులవనదంశములుమూఁగి నెఱవెట్టఁ, గ్రోల్పులుల్పొదరిండ్ల గుఱకలిడఁగ
సెలయేటియిసుకలంకల వరాహంబులు, మొత్తంబులై త్రవ్వి[1]ముస్తలెత్త
నడ్డంబు నిడుపు నా పడ్డలగతి మనుఁ, బిళ్లు డొంకలనుండి క్రేళ్లు దాఁటఁ
తే. ప్రబలభల్లుక నఖభల్ల భయద మథన, శిథిల మధుకోశ విసర విశీర్ణ మక్షి
కాంతరాంతరదంతురితాతపమునఁ, బుడమి తిలతండులన్యాయమున వెలుంగ.

టీ. తొండముల్ చాఁచి = తొండములను చాఁగించి; అందుగుఁజిగుళ్లకున్ = అందుగు చెట్లయొక్క చిగురులకొఱకు; నిక్క = మునికాళ్లతో నిలుచునట్టి; కరుల = ఏనుఁగులయొక్క; దంత చ్ఛాయ = దంతముల కాంతి; కడలుకొనఁగన్ = వ్యాపింపఁగాను; సెలవులన్ = పెదవుల మూలలయందు; వనదంశములు = అడవి యీఁగలు; మూఁగి = ముసరి; నెఱవెట్టన్ = సందు తేర్పడఁ దొలుచుచుండఁగా; క్రోల్పులుల్ = పెద్దపులులు; పొదరిండ్లన్ = తీగలు లోనగునవి యల్లుకొనుటచే నిండ్లవలె నుండెడి పొదలయందు; గుఱకలిడఁగన్ = గుఱుపెట్టి నిద్రింపఁగాను; సెలయేటి యిసుకలంకలన్ = కొండయేళ్లలోని యిసుకదిబ్బలయందు; వరాహంబులు = పందులు; మొత్తంబులై = గుంపులు గుంపులుగాఁ గూడి; త్రవ్వి = ముట్టెలతోఁ ద్రవ్వి; ముస్తలు = తుంగగడ్డలు; ఎత్తన్ = పైకెత్తఁగాను; అడ్డంబు = వీఁపుమీఁది పఱపును; నిడుపును = నిడివియు (గల); ఆపడ్డలగతిన్ = ఆవు పెయ్యలవలె; మనుఁబిళ్లు = పెంటిమన్నులు; డొంకలనుండి = నడచుటచేతఁ బల్లముగా నేర్పడిన పెద్ద త్రోవలనుండి; క్రేళ్లుదాఁటన్ = గంతులు వేయుచుండఁగాను; (మనుఁబిళ్లు అనుటచేత ఆఁడుమన్నులే యందుఁ ద్రుళ్లుచుండఁగా నిఁక మనుఁబోతులు దుముకులాడుట చెప్పవలసినదే లేదని భావము.) ప్రబల...ఆతపమునన్ - ప్రబల = మిక్కిలి బలము గలిగిన; భల్లుక = ఎలుఁగుగొడ్లయొక్క; నఖభల్ల = బల్లెములవంటి గోళ్లచేనైన; భయద = భయమును బుట్టించునట్టి; మథన = త్రచ్చుటలచేత - కోరాడుటలచేత; శిథిల = చెదరిన; మధు కోశ = తేనెపెరలయొక్క; విసర = సమూహమునుండి; విశీర్ణ = రేఁగిన; మక్షికా = తేనె యీఁగలయొక్క; అంతరాంతర = నడుమనడుమఁ గల సందులనుండి; దంతురిత = వ్యాపించినదైన; ఆతపమునన్ = ఎండచేత; భూమి = నేల; తిలతండులన్యాయమునన్ = నువ్వులు, బియ్యము కలిసిన న్యాయమువంటి న్యాయముతో - నువ్వులు బియ్యము కలిసినట్లు; వెలుంగన్ = ప్రకాశింపఁగాను. దీనికి తర్వాతిపద్యమునందలి 'పరికించుచున్' అను క్రియతో నన్వయము.

తా. ఏనుఁగు లందుగుఁజిగుళ్లకై నిక్కి, తొండములు చాఁచునప్పుడు వానిదంతముల కాంతు లతిశయించుచుండె ననియు, పెద్దపులులు నిద్రపోవుచుండఁగా వానిపెదవులమూలలనుండి కారెడి జొల్లునకు నడవియీఁగలు ముసరుకొనుచుండె ననియు, పందులు సెలయేళ్లలోని యిసుకదిబ్బలు

---

1. ముస్తై. పా.

త్రవ్వి, తుంగగడ్డలు పెల్లగించి తినుచుండె ననియు, ఋశ్యమృగములు బలసినయావు పెయ్యలవలె డొంకలయందు దుముకులాడుచుండె ననియు, ఎలుఁగుగొడ్డు తేనెపెరలను గోళ్లతోఁ గోరాడఁగా నందున్న తేనెయీఁగలు రేఁగి యాడుచుండె ననియు, వానినీడలు నల్లగాను, వాని నడుమ నడుమ వ్యాపించునట్టి యెండపొడలు తెల్లగాను గనఁబడుటచే నవి రెండును భూమిమీఁద నువ్వులు, బియ్యము వెదచల్లిన ట్లుండె ననియుఁ దాత్పర్యము. అలం. స్వభావోక్తి.

క. పరికించుచు డెందంబునఁ, బురికొను కౌతుకముతోడ ♦ భూమీసురుఁ డ
గ్గిరికటకతటనిరంతర, తరుగహనగుహావిహార ♦ తత్పరమతియై. 8

టీ. పరికించుచున్ = చూచుచును; భూమీసురుఁడు = బ్రాహ్మణుఁడైన ప్రవరుఁడు; డెందంబునన్ = మనసునందు; పురికొను = అతిశయించుచున్న; కౌతుకముతోడన్ = కుతూహలముతో; అగ్గిరి...మతియై - అగ్గిరి = ఆ మంచుకొండయొక్క; కటక = మధ్య ప్రదేశమందును; తట = చఱులయందును; నిరంతర = దట్టమైన; తరు = వృక్షములుగల; గహన = అడవులయందును; గుహా = గుహలయందును; విహార = వినోదముగాఁ దిరుగుటయందు; తత్పరమతియై = ఆసక్తమయిన బుద్ధిగలవాఁడై.

సీ. నిడుదపెన్నెఱిగుంపు ♦ జడ గట్ట సగరుమ, మ్మనుమండు తపముఁ గై ♦ కొనినచోటు
జరఠకచ్ఛపకులే ♦ శ్వరువెన్ను గానరా, జగతికి మిన్నేఱు ♦ దిగినచోటు
పుచ్ఛడీకతనంబు ♦ పోఁబెట్టి గిరికన్య, పతిఁ గొల్వ నాయాస ♦ పడినచోటు
వలరాచరాచవా[1] ♦ రలికాక్షుకను వెట్టఁ,[2] గరఁగిన యల కని ♦ కరపుఁజోటు
తే. తపసియిల్లాండ్ర చెలువంబుఁ ♦ దలఁచి తలఁచి
మున్ను ముచ్చిచ్చును విరాళి ♦ గొన్నచోటు
కనుపపులు వేల్పుఁబడవాలుఁ ♦ గన్నచోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుఁ ♦ డాత్మలోన. 9

టీ. ప్రవరాఖ్యుఁడు = ప్రవరుఁ డనుపేరు గలవాఁడు; (ఇది కర్త.) సగరు మ్మనుమండు = సగరచక్రవర్తి మనుమనికొమారుఁడు - భగీరథుఁడు; నిడుదపెన్నెఱిగుంపు = నిడుపైన పెద్ద తలవెండ్రుకల సమూహము; జడగట్టన్ = జడవలెఁ బెనఁచుకొనునట్టుగా; తపము = తపస్సును; కైకొనిన చోటు = పూనిన ప్రదేశమును; మిన్నేఱు = ఆకాశగంగానది; జరఠ...వెన్ను - జరఠ = ముదిసిన; కచ్ఛపకులేశ్వరు = తాఁబేటికులమునకు రాజైన యాదికూర్మముయొక్క; వెన్ను = వీఁపుఁజిప్ప; కానరాన్ = కనఁబడునట్టుగా - అంతలోఁతునకు భూమి తెగున ట్లనుట; జగతికిన్ = భూమిమీఁదికి; దిగినచోటు = అవతరించిన ప్రదేశమును; గిరికన్య = పార్వతీదేవి; పుచ్ఛడీకతనంబు = సిగ్గరితనమును; పోఁబెట్టి = విడిచిపెట్టి; పతిన్ = పెనిమిటిని; కొల్వన్ = సేవింప; ఆయాసపడినచోటు = శ్రమపడిన ప్రదేశమును - తపస్సు చేసిన ప్రదేశ మనుట; వలరాచరాచవారు = మన్మథుఁ డనెడి క్షత్త్రియుఁడు; అలికాక్షుకనువెట్టన్ = నొసటఁగన్నుగల శివుని యొక్క నేత్రాగ్నిచేత; కరఁగిన = నీరైన - కాలి, భస్మమయిన; అల = ప్రసిద్ధమయిన; కనికరపుఁజోటు = జాలిఁ బుట్టించునట్టి ప్రదేశమును; (ఆ చోటు చూచువారు 'అయ్యో! యీ చోటనా మన్మథుఁడు కాలిపోయె' నని జాలిఁ బొందుదు రని భావము.) మున్ను =

1. వాఁడలికాక్షు. పా. 2. వెచ్చ. పా.

మునుపు; తపసి... చెలువంబు = సప్తమహామునుల భార్యలయొక్క అందమును; తలఁచి తలఁచి = పలుమాఱు తలఁచుకొని; ముచ్చిచ్చున = మూఁడగ్నులును; (గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని.) విరాళిగొన్నచోటు = మోహము నొందిన ప్రదేశమును; కనుపపులు = తెల్లుగడ్డి; వేల్పుఁబడవాలున్ = దేవసేనాధిపతియైన కుమారస్వామిని; కన్నచోటు = ప్రసవించిన ప్రదేశమును - కుమారస్వామికి జన్మస్థానమైన తెల్లుగంట ననుట; హర్షమునన్ = సంతోషముతో; చూచి; ఆత్మలోనన్ = తన మనసునందు. క్రింది పద్యముతో నన్వయము.

చ. విలయకృశానుకీలముల ♦ వేఁడిమిఁ బోఁడిమి మాలి వెల్మిడిం
గలసిన భూతధాత్రి మఱి ♦ క్రమ్మఱ రూపయి నిల్చి యోషధుల్
మొలవఁగఁ జేయునట్టి నయ ♦ ముం బ్రతికల్పము నెట్లు గాంచు నీ
చలిమలవల్ల నుల్లసిలు ♦ చల్లఁదనంబును నూనకుండినన్. 10

టీ. విలయ... వేఁడిమిన్ - విలయ = ప్రళయకాలమునందలి; కృశానుకీలముల = నిప్పుమంటలయొక్క; వేఁడిమిన్ = తాపముచేత; పోఁడిమి మాలి = బాగు చెడి; వెల్మిడిన్ = భస్మముతో; కలసి; భూతధాత్రి = కలసిపోయిన భూమి; మఱి; క్రమ్మఱన్ = మరల; రూపయి = స్వరూపమేర్పడి; నిల్చి = ఎప్పటివలె నిలిచి; ఓషధుల్ = మూలికలు - వృక్షలతాదులు; మొలవఁగఁజేయునట్టి = మొలిపించునట్టి; నయమున్ = నేర్పును; ప్రతికల్పమున్ = ఒక్కొక్క బ్రహ్మదినమునందును - ఒక్కొక్క సృష్ట్యారంభ సమయమునందును; ఈ చలిమలవల్లన్ = ఈ హిమవత్పర్వతమువలన; ఉల్లసిలు చల్లఁదనంబునున్ = ఒప్పునట్టి శైత్యమును; ఊనకుండినన్ = అవలంబింపకున్నచో - పొందకున్నచో; ఎట్లు; కాంచున్ = పొందును ?

తా. ప్రళయకాలమునందుఁ గాలి, భస్మమయిపోయిన భూమి యీ హిమవత్పర్వతముయొక్క చల్లఁదనమును దాల్పకున్నయెడల మరలఁ దనయందు వృక్షలతాదులు మొలచునట్టి నేర్పును బొంది యుండనేరదు. అలం. కావ్యలింగము.

సీ. పసుపునిగ్గులు దేఱు ♦ పాఁపజన్నిద మొప్పఁ, బ్రమథాధిపతి యింటిపట్టుటెంగ
శచి కీఁతఁ గఱపుచుఁ ♦ జదలేటి సురరాజు, జలకేళి సవరించు ♦ చెలువటెంగ
నదనుతోఁ జేఁపి చన్నవిసి యోషధుల మ,న్నొందవు కొండలకెల్లఁ బిడుకనేఁటెంగ
వేల్పుటింతులలోన ♦ విజ్ఞపిఁగుచు మేన, నవరత్నరచనల ♦ రవణ మెటిఁగెఁ

తే. బరిపరివిధంపుజన్నంపుఁ ♦ బరికరంపు, సొంపుసంపద నిఖలని ♦ లింపసభయు
నప్పటప్పటికిని జిహ్వ ♦ త్రుప్పుడుల్ల, నామెత లెటెంగె నీ[1]తుహినాద్రికతన. 11

టీ. ఈ తుహినాద్రికతనన్ = ఈ మంచుఁగొండయొక్క కారణముచేత; పసుపునిగ్గులు = పసుపుయొక్క కాంతులు; తేఱు = తేటగాఁదోఁచుచున్న; (పా. పసుపునిగ్గులుమీఱు = పసుపు కాంతులతిశయించు.) పాఁపజన్నిదము = సర్పయజ్ఞోపవీతము; ఒప్పన్ = ఒప్పుచుండఁగా - బ్రహ్మచర్యమునందు వర్తించుచున్న అనుట; ప్రమథాధిపతి = ప్రమథగణములకు నధిపతియైన శివుఁడు; ఇంటిపట్టు = గృహస్థధర్మమును; ఎఱింగెన్. అనఁగా హిమవంతుఁడు తన పుత్రిక నియ్యఁగా శివుఁడు గృహస్థుఁడయ్యె ననుట. సురరాజు = దేవేంద్రుఁడు; శచికిన్ = శచీదేవికి; ఈఁతన్ కఱపుచున్ = నీళ్లయందు దీఁదులాడుటను నేర్పుచు; చదలేటన్ = ఆకాశగంగానది

1. తుషారా. పా.

యందు; జలకేళిన్ = జలక్రీడను; సవరించుచెలువు = చేయునట్టివిధమును; ఎతింగెన్. అనఁగా హిమవంతుఁడు గంగను ధరించుటచేతనే యింద్రుని కా నదియందుఁ గ్రీడింప ననువుపడియె ననుట. మనోజ్ఞదవు = గోవురూపముధరించిన భూదేవి; అదనుతోన్ = సమయ మతిక్రమింపకుండునట్టుగా; చేఁపి - పాలుపొదుఁగు లోనికి దింపి; చన్ను (ఇది జాత్యేకవచనము.) అవిసి = మొనవిరిసి - మొనవిరియఁగా ననుట; కొండలకెల్లన్; ఓషధులన్ = తృణ గుల్మ తరు లతాదులను; పిదుక నెతిఁగెన్. అనఁగా హిమవంతుఁడు దూడ కాఁగా, భూమి యావై, యోషధిరూపమైన పాలను గొండలకై పిదికె ననుట. మేన = మేనక యనెడి యప్సరస; వేల్పుటింతులలోనన్ = దేవతాస్త్రీలలోపల; విఱ్ఱవీఁగుచున్ = మిక్కిలి నిక్కుచు; నవరత్న...రవణము - నవ = (వజ్రము, వైడూర్యము, నీలము, గోమేధికము, మరకతము, మాణిక్యము, పుష్యరాగము, మౌక్తికము, ప్రవాళము అని) తొమ్మిది విధములైన, (లేక) క్రొత్తయైన; రత్న = మణులయొక్క; రచనల = చెక్కడపుఁ బనులుగల; రవణము = ఆభరణమును; ఎతిఁగెన్. అనఁగా-హిమవంతుఁడు మేనకకు భర్త యగుటచేతను, హిమవంతునందు రత్నములగనులు మెండుగా నుండుటచేతను మేనక రత్నాభరణములు దాల్చి, దేవతాస్త్రీలలోపల మిక్కిలి గర్వించుచుండె ననుట. నిఖిలనిలింపసభయున్ = సమస్త దేవతాసమూహమును; పరిపరి...సంపదన్ - పరిపరివిధంపు = బహువిధములయిన; జన్నంపు = యజ్ఞములయొక్క; పరికరంపు = ఉపకరణములయొక్క; సొంపుసంపదన్ = సౌష్ఠవముయొక్క కలిమిచేత; అప్పటప్పటికిన్; జిహ్వాత్రుప్పు = నాలుకయందలి యరుచి; దుల్లన్ = పోవునట్టుగా - మానునట్లుగా; (పా. జిహ్వాతుప్పటిల్లన్ = నాలుక యరుచి చెడఁగా); ఆమెతలు = విందులను; ఎతింగెన్. అనఁగా నసేకులు రాజులు మొదలగువారు యజ్ఞములు చేయుటకు నీ మంచుకొండ చోటగుటంబట్టి యెడప దడప దేవతలకు హవిర్భాగము లారగింప ననుకూలించు ననుట. అలం. రూపకము, ఉదాత్తమును.

మ. తలమే బ్రహ్మకునైన నీనగమహత్త్వం బెన్న? నే నియ్యెడం
గల చోద్యంబులు రేపు గన్గొనియెదం గాకేమి; నేఁ డేఁగెదన్
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్. 12

టీ. ఈ నగమహత్త్వంబు = ఈ పర్వతముయొక్క మహిమను; ఎన్నన్; బ్రహ్మకునైనన్ = బ్రహ్మదేవునికైనను; తలమే = తరమా ? శక్యము కాదనుట. ఇయ్యెడన్; కల చోద్యంబులు = ఉన్న వింతలు; నేను; రేపు; కన్గొనియెదం గాకేమి ? = చూడనే చూచెదఁగాక. నేఁడు; ఏఁగెదన్ = పోయెదను; నలినీ...పరంపరల్ - నలినీ బాంధవ = సూర్యునియొక్క; భాను = కిరణములచేత; తప్త = కాలిన; రవికాంత = సూర్యకాంతపురాళ్ళమీఁద; స్యంది = కాఱుచున్న; నీహారకందళ = మంచునీటి బొట్లపలననైన; చూత్కార పరంపరల్ = చుంయి చుంయి మనెడు ధ్వనుల సమూహములు; పయిపయిన్ = మీఁదమీఁద - క్రమక్రమముగా; మధ్యాహ్నమున్ = పట్టపగలగుటను; తెల్పెడిన్ = తెలియఁజేయుచున్నవి.

తా. ఈ హిమవత్పర్వతమహిమము నెంచ బ్రహ్మకునయితము శక్యముకాదు. ఇప్పుడు సూర్యకిరణములచేత వేఁడిమినొందిన సూర్యకాంతపు రాళ్లమీఁదఁ బడునట్టి మంచుచినుకుల చుంయి చుంయి మను శబ్దములు మండుటెండ గల మధ్యాహ్నకాల మయ్యె ననుటను స్పష్టముగాఁ దెలుపుచున్నవి. కాఁబట్టి నేటికిఁ బోయి, రేపు వచ్చి చూచెదను.

తే. అనుచుఁ గ్రమ్మఱువేళ నీహారవారి, జెరసి తత్పాదలేపంబు గరఁగిపోయెఁ;
గరఁగిపోవుటయెఱుఁగఁడద్ధరణిసురుఁడు; దైవకృతమున కిలనసాధ్యంబుగలదె?

టీ. అనుచున్ = ఇట్లని తనలో ననుకొనుచు; క్రమ్మఱువేళన్ = వెనుకకుఁ దిరుగునప్పుడు; నీహారవారి = మంచునీరు; జెరసి = అంటి; తత్పాదలేపంబు = అతనియడుగుల పసరుపూఁత; కరఁగిపోయెన్ = ద్రవమై యంటులేకపోయెను. కరఁగిపోవుట = అట్లు కరఁగిపోవుటను; అద్ధరణిసురుఁడు = ఆ బ్రాహ్మణుఁడు - ప్రవరుఁడు; ఎఱుఁగఁడు. ఇలన్ = భూమియందు; దైవకృతమునకున్ = దైవయత్నమునకు; అసాధ్యంబు = సాధ్యముకానిది; కలదె ? = ఉన్నదా ? - లేదు. అనఁగా నే పనియయినను దైవము తలఁచినట్లే యగును గాని మఱియొకవిధముగాఁ గానేరదనుట. అలం. అర్థాంతరన్యాసము.

మ. అతఁడట్లౌషధహీనుఁడై నిజపురీయాత్రామిళత్కౌతుకో
ద్ధతిఁ బోవన్ సపదిస్ఫుటార్తిఁ జరణద్వంద్వంబు రాకుండిన
న్మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా! నన్నిట్లు దైవంబ! తె
చ్చితె యీ [1]దూరవనప్రదేశమునకున్ [2]సిద్ధాపదేశంబునన్. 14

టీ. అతఁడు = ఆ ప్రవరుఁడు; అట్లు = ఆ విధముగా; ఔషధహీనుఁడై = అడుగులకుఁ బూసిన పసరుచేతఁ దక్కువైనవాఁడై - పసరు పోయినవాఁడై; నిజ...ఉద్ధతిన్ - నిజపురీ = తన పట్టణమునుగూర్చిన; యాత్రా = ప్రయాణముచేయుటయందు; మిళత్ = కూడిన - పొందిన; కౌతుక = కుతూహలముయొక్క; ఉద్ధతిన్ = ఎగవుచేత; పోవన్ = ఎగిరిపోవుటకు; చరణద్వంద్వంబు = రెండుకాళ్లును; రాకుండినన్ = లేచి రాకయుండఁగా; సపదిస్ఫుటార్తిన్ = అప్పుడే స్పష్టమగుచున్న దుఃఖముచేత; (పా. సపరిస్ఫుటార్తిన్ = చక్కఁగాఁ దోఁచుచున్న దుఃఖముతోఁ గూడుకొనుటచేత.) మతిన్ = బుద్ధియందు; చింతించుచున్ = విచారపడుచు; అవ్విధంబు = ఆ పాదలేపము కరఁగిపోయినవిధము; ఎఱిఁగి = తెలిసికొని; హా ! = అయ్యో! దైవంబ! = దైవమా! నన్ను; ఇట్లు = ఈ విధముగా; సిద్ధాపదేశంబునన్ = సిద్ధుని నెపముచేత; ఈ దూరవనప్రదేశమునకున్ = దూరమైన యీ యడవిభూమికి; తెచ్చితె? = తీసికొనివచ్చితివా? తరువాతి పద్యముతో నన్వయము.

తా. ప్రవరుఁ డట్లు పాదలేపము లేకపోఁగాఁ దనపట్టణమునుగూర్చి యెగిరిపోవుటకుఁ గాళ్లు రాలేకపోవుటచేతఁ బాదలేపము పోయిన దని తెలిసికొని, వెంటనే కలిగిన విచారముతో దైవమా ! సిద్ధునియొక్క ఉపదేశమున నన్నీ దూరముగా నున్న యడవికిఁ దెచ్చి చేర్చితివా ? యని దుఃఖించెను. అలం. కావ్యలింగము.

క. ఎక్కడియరుణాస్పదపుర ?, మెక్కడితుహినాద్రి? క్రొవ్వి యే రాఁదగునే?
యక్కట!మునుసనుదెంచిన, దిక్కిదియనియెఱుఁగ; వెడలు[3]తెఱుఁగెయ్యదియో?

టీ. ఎక్కడి యరుణాస్పదపురము ? = అరుణాస్పదపుర మెక్కడనున్నది ! ఎక్కడి తుహినాద్రి = ఈ మంచుఁగొండ యెక్కడ నున్నది ? (దీనికి దానికి నెంతోదూరము కలదనుట.) క్రొవ్వి = మదించి; ఏన్ = నేను; రాఁదగునే ? = వచ్చుట తగునా ? అక్కటా ! = అయ్యో !

1. ఘోర. పా. 2. సిద్ధోప. పా. 3. తెరువె. పా.

మును = మునుపు; చనుదెంచిన దిక్కు = ఇక్కడికి వచ్చినదిశ; ఇది = ఇట్టిది; అని యెఱుఁగక = అని నేను గుర్తెఱుఁగను. వెడలు తెఱఁగు = బయలు వెడలు విధము; ఎయ్యదియో? = ఏదోగదా!

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయా ద్వారకావంతి కా
 శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే సేవింప కుద్దండ గం
 డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచుఁగొం
 డకు రాఁ జెల్లునె? బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా! శ్రోత్రియుల్. 6

టీ. నేన్ = నేను; అకలంక...సత్త్వమున్ - అకలంక = నిర్దోషమయిన; ఔషధ = మందుయొక్క; సత్త్వమున్ = బలమును - ప్రభావమును; తెలియన్ = తెలిసికొనుటకు; మాయా...ప్రయాగములు = మాయానగరము (హరిద్వారము), ద్వారవతీపట్టణము, ఉజ్జయినీపట్టణము, కాశీపట్టణము, కురుక్షేత్రము, గయాక్షేత్రము, ప్రయాగక్షేత్రము; (వీనిని) సేవింపక=చూడఁబోవక; ఉద్దండ...వ్యాఘ్రము - ఉద్దండ = మిక్కిలి క్రూరములైన; గండక = గండకములనెడి మృగములు; వేదండ = ఏనుఁగులు; వరాహ = అడవి పందులు; వాహరిపు = కారుదున్నపోతులు; ఖడ్గ = ఖడ్గమృగములు; ('గండకే ఖడ్గఖడ్గినౌ' అని నామలింగానుశాసనమునందు గండక, ఖడ్గ శబ్దములు పర్యాయములుగాఁ జెప్పఁబడియున్నవి. ఇందు భిన్నములుగాఁ గానఁబడుచున్నవి. ఇందులకుఁ బ్రమాణ మేమో తెలియలేదు.) వ్యాఘ్రము = పెద్దపులులు గలదైన; ఇమ్మంచుఁగొండకున్ = ఈ హిమవత్పర్వతమునకు; రాన్ = వచ్చుట; చెల్లునే = నాకుఁ దగునా? శ్రోత్రియుల్ = వేదము చదివి వైదికనిష్ఠగలవారు - ఛాందసు లనుట; బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా ! = బుద్ధిమాంద్యమువలనఁ బుట్టిన చిత్తవిభ్రమము గలవారు కదా ! - చిత్తవిభ్రమము కలవారే యనుట.

తా. నేను సిద్ధుఁ డిచ్చిన మందుమహిమ తెలియవలె నన్న మాయ, ద్వారక, యవంతి, కాశి, కురుక్షేత్రము, గయ, ప్రయాగము మొదలయిన పుణ్యక్షేత్రములకుఁబోయి, వానిని సేవింపక - గండకము, లేనుఁగు, లడవిపందులు, కారుదున్నలు, పెద్దపులులు మొదలుగాఁగల క్రూరమృగములు విశేషముగా నుండెడి యీ మంచుఁగొండకు రావచ్చునా? కేవలవైదికులయిన నావంటివారు బుద్ధిమాంద్యమువలని చిత్తవిభ్రమముగలవారై యుందురు. కాఁబట్టి నేను నట్టి చిత్తభ్రమముచేత నీ రారాని చోటికి వచ్చితిని. అలం. అర్థాంతరన్యాసము.

సీ. నను నిముసంబు గానకయున్న నూరెల్ల, నరయు మజ్జనకుఁ డెంతడలు నొక్కొ
 యెపుడు సంధ్యలయందు నిలువెళ్లనీక న, న్నోమెడు తల్లి యెంతో ఱలునొక్కొ
 యనుకూల[1]గతినాదు మనసులో వర్తించు, కులకాంత మది నెంత కుందునొక్కొ
 గెడఁ దోడునీడలై క్రీడించుసచ్ఛాత్రు, లింతకు నెంత చింతింతు రొక్కొ
తే. యతిథిసంతర్పణంబు లేమయ్యెనొక్కొ, యగ్ను లేమయ్యెనొక్కొ నిత్యంబులైన
 కృత్యములఁ బాపి [2]దైవంబ! కినుక నిట్లు, పాఱ[3]వైచితె [4]మిన్నేలు పడ్డచోట.

టీ. నన్నున్ = నన్ను; నిముసంబు = నిమిషకాలము; కానకయున్నన్ = చూడకున్నయెడ; ఊరెల్ల = గ్రామమంతయు; అరయు మజ్జనకుఁడు = వెదకునట్టి మా తండ్రి; ఎంతడలు నొక్కొ? = ఎంతదుఃఖపడునో?; (నన్ను) ఎపుడున్ = ఎల్లప్పుడును; సంధ్యలయందున్ = సంధ్యాకాలములయందు; ఇలు వెళ్లనీక = ఇల్లువెడలి బయటఁబోనియ్యక; ఓమెడు తల్లి = కాపాడునట్టి

1. వతి. పా. 2. దైవంబు. పా. 3. వైచుసె. పా. 4. మిన్నులు. పా.

మాయమ్మ; ఎంతొ యలుసొక్కొ = ఎంత విలపించునో; అనుకూలగతి = అనుకూలప్రవర్తనముగలదై; నాదు మనసులోన్ = నాతలఁపు ననుసరించి; వర్తించు కులకాంత = నడుచుకొనునట్టి యిల్లాలు - నా భార్య; మదిన్ = మనస్సునందు; ఎంత కుందునొక్కొ = ఎంతగా శోకించునో; గెడన్ = దగ్గఱ; తోడునీడలై = సహాయులై; క్రీడించు సచ్ఛాత్రులు = విహరించునట్టి మంచి శిష్యులు; ఇంతకున్ = ఇప్పటికి; ఎంత చింతింతురొక్కొ = ఎంతగా విచారపడుచుందురో; అతిథిసంతర్పణంబులు = అన్నార్థులై యింటికి వచ్చిన పెద్దల యారాధనములు; ఏమయ్యెనొక్కొ = ఏమి యాయెనో; అగ్నులు = గార్హపత్యాదులయిన యగ్నులు; ఏమయ్యెనొక్కొ = ఏమి యాయెనో; దైవంబ! = ఓ దేవుఁడా! కినుకన్ = కోపముతో; నిత్యంబులైన = ప్రతిదినము తప్పక నడపఁ దగినట్టి; కృత్యములన్ = వ్యాపారములనుండి; పాపి = ఎడఁబాపి; మిన్నేఱుపడ్డచోటన్ = గంగానదిపుట్టిన తావునందు - మిక్కిలి దూరమైన యూర్ధ్వభాగమునందు; పాఱవైచితె = విసరి వైచితివా! అనఁగా మిక్కిలి దూరమునందుఁ జేర్చితివా యనుట.

క. నను నిలు సేరు నుపాయం,బొనరింపఁగఁ జాలు సుకృతి యొకఁ డొదవఁడొకో
యనుచుం జింతాసాగర, మున మునిఁగి భయంబు గదురఁ బోవుచు నెదురన్.

టీ. ననున్ = నన్ను; ఇలు సేరు నుపాయంబు = ఇంటికిఁబోయి చేరునట్టి యుపాయమును; ఒనరింపఁగన్ = చేయుటకు; చాలు సుకృతి = తగినట్టి పుణ్యాత్ముఁడు; ఒకఁడు = ఎవఁడేనొకఁడు; ఒదవఁడొకో = కలుగఁడా? అనుచున్ = అనుకొనుచు; చింతాసాగరమునన్ = విచారమనెడి సముద్రమునందు; మునిఁగి = మునిఁగినవాఁడై; భయంబు = వెఱపు; కదురన్ = కలుగఁగా; పోవుచున్ = ఏదో యొక దారిఁ బట్టి పోవుచు; ఎదురన్ = ఎదుటిభాగమునందు. క్రింది పద్యముతో నన్వయము. అలం. రూపకము.

సీ. కులిశధారాహతి పోలుపునఁ బైనుండి, యడుగుమోవఁగ జేగు రైనతటులఁ
గనుపట్టులోయ గంగానిర్ఘరము వాఱఁ, జలువయౌ నయ్యేటి కెలఁకులందు
నిసుక వెట్టిననేల నేచి యర్కాంశులఁ, జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముక పున్నాగ నాగరంగ రంభా నాళి, కేరాది విటపికాంతారవీథిఁ
తే. గెరలు పిక శారికా కీర కేకి భృంగ, సారస ధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు[1] ప్రతిశబ్దమీన గంధర్వయక్షు,గానఘూర్ణితమగునొక్క కోనఁ గనియె.

టీ. కులిశ...పోలుపునన్ - కులిశ = వజ్రాయుధముయొక్క; ధారా = వాయిచేసైన; హతి = దెబ్బయొక్క; పోలుపునన్ = విధమున - ఇంద్రుఁడు వజ్రాయుధముతో నఱికిన నఱకుడో యనునట్లు; పైనుండి = మీఁదితట్టునుండి; అడుగుమోవఁగన్ = దిగువతట్టానునట్లు; జేగురైన = ఎఱ్ఱనివైన; తటులన్ = దరులతో; కనుపట్టు లోయన్ = అగపడుచున్న కొండచీలికయందు; (పా. కనుపట్టి లోనన్ = కనఁబడి లోపలిభాగమునందు.) గంగానిర్ఘరము = గంగానది; పాఱన్ = ప్రవహించుచుండఁగా; చలువయౌ = చల్లఁదనముగలదైన; అయ్యేటికెలఁకులందున్ = ఆ గంగానదియొక్క రెండు ప్రక్కలందును; ఇసుక వెట్టిన నేలన్ = ఇసుక క్రమ్మిన నేలయందు; ఏచి = పెరిఁగి; అర్కాంశులన్ = సూర్యకిరణములను; చొరనీక = ప్రవేశింపనియ్యక; దట్టమై =

1. దరులఁ బ్రబలి. పా.

తలుచై; ఇరులుగవియు...వీథిన్ - ఇరులుగవియు = చీఁకటిక్రమ్ముచున్న; క్రముక = 
పున్నాగ = పొన్న; నారంగ = నారింజ; రంభా = అరఁటి; నాళికేర = టెంకాయ; 
మొదలుగాఁగల; విటపి = వృక్షములయొక్క; కాంతారవీథిన్ = వనపంక్తియందు; కెర
ధ్వనిన్ - కెరలు = కూయుచున్న; పిక = కోయిలలయొక్కయు; శారికా = గోరు
యొక్కయు; కీర = చిలుకలయొక్కయు; కేకి = నెమిళ్లయొక్కయు; భృంగ = తుమ్మె
యొక్కయు; సారస = బెగ్గురు పక్షులయొక్కయు; ధ్వనిన్ = ధ్వనిచేత; తనలోని...దర
తనలోపలివైన నెలరాలయొక్క గుహలు; ప్రతిశబ్దము = మాఱుమ్రోఁతను; ఈనన్ = పుట్టింప
గంధర్వ...ఘూర్ణితమగు - గంధర్వ = గంధర్వులయొక్కయు; యక్ష = జక్కులయొక్క
గాన = సంగీతధ్వనులచేత; ఘూర్ణితమగు = మ్రోగుచున్నట్టి; ఒక్క కోనన్ = ఒక కొండ
గొందిని; కనియెన్ = చూచెను.

తా. ఇంద్రుఁడు వజ్రాయుధముచే నఱకఁగా నేర్పడిన గాయపుఁబగులో యున్నట్లు 
నుండి యడుగువఱకు నెట్టిగా నగపడుచున్న యిరుపార్శ్వములు గల కొండచీలికయందు
హించుచున్న గంగయొక్క యిరుదరులందు నిసుకపాలైనయెడల మిన్నంటఁ బెరిఁగి, దట్ట
గదిసి, యెండ చొరనీని మ్రాఁకులతోఁపులందుఁ గలకల కూయుచున్న కోయిలలు, చిలుకలు 
లైనవాని ధ్వనులచేతను, ఆ ధ్వనులకుఁ బ్రతిధ్వను లిచ్చుచున్న గుహలచేతను, అచట విహ
చున్న యక్ష, గంధర్వుల సంగీతధ్వనులచేతను నొప్పుచున్న యొక కొండసందుగొందిని ప్రవ
చూచెను. అలం. స్వభావోక్తి.

క. కనుఁగొని యిది మునియాశ్రమ,మను తహతహ వొడమి యిచటికిన్ కరిగినన
గననగు నొక తెఱువ యని, మనమునఁ గల దిగులు కొంత న్ మట్టువడం

టీ. కనుఁగొని = (ఆ కోనను) జూచి; ఇది = ఈ కానవచ్చునది; మునియాశ్రమము = 
తపస్సుచేయుచోటు; అను తహతహ = అనునట్టి తమకము - అనియెడి భ్రాంతి; పొడమ
పుట్టఁగా; ఇచటికిన్ అరిగినన్ = ఈ చోటికి పోయినచో; నాకు; ఒక తెఱువ = ఒక్క 
యము; కననగున్ = కానవచ్చును - కలుగును; అని = అనుకొని; మనమునన్ = మనస్సు
కల దిగులు = కలిగిన యధైర్యము; కొంత = కొంచెము; మట్టుపడంగన్ = తగ్గఁగా. త
పద్యముతో నన్వయము.

చ. నికటమహీధరాగ్రతట న్ నిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁక న్ లై దిగు కాలువవెంటఁ బూచు మ
ల్లిక లవలంబనంబుగ న న్ లిప్రకరధ్వని చిమ్మ రేఁగ లో
నికి మణిపట్టభంగసర న్ ణిన్ ధరణీసురుఁ డేఁగి చెంగటన్.

టీ. ధరణీసురుఁడు = బ్రాహ్మణుఁడు - ప్రవరుడు; నికట...ధారన్ - నికట = 
పమునందలి; మహీధర = కొండయొక్క; అగ్ర = చివరయందుఁగల; తట = ప్రదేశము
నిర్గత = వెడలిన; నిర్ఝరధారన్ = సెలయేటిధారను; పాసి = విడిచి - దానినుండి చీలి య
లోయకున్ = కోనతట్టునకు; తలక్రిందుగా = పైభాగము క్రిందికి వాలునట్లుగా; మలఁకలై = 
వంపుగాఁ దిరిగినవై; దిగు కాలువవెంటన్ = దిగువకుఁ బాఱుచున్న కాలువవెంబడిని; 
మల్లికలు = పుష్పించినట్టి మల్లెతీగలు; అవలంబనంబుగన్ = చేతిపట్టుకాఁగా; అలిప్రకరధ

తుమ్మెదగుంపుల మ్రోఁత; చిమ్మిరేఁగన్ = మిక్కిలి యతిశయింపఁగా; మణిపట్టిభంగసరణిన్ = రత్నములమెట్లదారిని; లోనికిన్ = ఆ కోనలోపలికి; ఏఁగి = పోయి; చెంగటన్ = సమీపమునందు. క్రింది పద్యముతో నన్వయము.

తా. ప్రవరుఁడు తా నున్న తావునకు దాపునఁ గొండకొమ్మునుండి లోయలోనికి వంపులు దిరిగి దలక్రిందుగాఁ బ్రవహించుచున్న సెలయేటికాలువ యిరుదరులందును మొలచి, పూచి, పరిమళించుచున్న మల్లెతీగలను బట్టుకొని, వాని యందు మూఁగిన తుమ్మెదలు రేఁగి ఝుంకారము చేయుచుండఁగా, నచ్చటఁ గట్టఁబడియున్న రతనపుమెట్లమార్గమునఁ గోనలోనికి దిగి, యా సమీపమునందు.

శా. తావుల్ గ్రేవలఁజల్లు [1]చెంగలువకే ♦ దారంబుతీరంబునన్
మావుల్ గ్రోవులు నల్లిబిల్లిగొనుకాం ♦ తారంబునం దైందవ
గ్రావాకల్పితకాయమానజటిల ♦ ద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుందీవెల నొప్పు నొక్క భవనం ♦ బుఁ గారుడోత్కీర్ణమున్. 22

టీ. గ్రేవలన్ = పార్శ్వములందు; తావుల్ = పరిమళములను; చల్లు = ప్రసరింపఁజేయునట్టి; చెంగలువ = చెంగల్వపూవులు గల; కేదారంబు = వరిమడియొక్క; తీరంబునన్ = చేరువను; మావుల్ = మామిడిమ్రాఁకులును; గ్రోవులు = ఎఱ్ఱపువ్వుల గోరంటచెట్లును; అల్లిబిల్లిగొను కాంతారంబునందున్ = ఒకటితో నొకటి పెనఁగొన్న వనమునందు; ఐందవ...గుళుచ్ఛంబులన్ - ఐందవగ్రావా = చంద్రకాంతపురాలచేత - ఆ ఱాలతోఁ జేయఁబడిన కంబములు మొదలైనవాని చేత ననుట; ఆకల్పిత = చక్కఁగా రచింపఁబడిన; కాయమాన = పందిటియందు; జటిల = దట్టముగా నల్లుకొన్న; ద్రాక్షాగుళుచ్ఛంబులన్ = ద్రాక్షపండ్ల గుత్తులచేతను; పూవుందీవెలన్ = పుష్పించిన తీగెలచేతను; ఒప్పు నొక్క భవనంబున్ = ఒప్పునట్టి యొక యింటిని; గారుడోత్కీర్ణమున్ = గరుడపచ్చలచేఁ బొదుఁగఁబడినదానిని. (దీనికిఁ గ్రియ తర్వాతి పద్యములోని 'కాంచి' అనునది.)

తా. చెంగలువల పరిమళములు చుట్టుపట్లఁ బ్రసరింపఁజేయుచున్న వరిమడి వెంబడి, మామిళ్లు, గోరంటలు నొకటితో నొకటి పెనఁగొన్న యొక వనమునడుమఁ, జంద్రకాంతపుఱాలచే రచింపఁబడిన పందిటియందు ద్రాక్షతీగలును, బువ్వుదీగలును నల్లుకొని, ద్రాక్షపండ్లగుత్తులును, పూగుత్తులును వ్రేలఁబడి, పరిమళించుచుండఁగా నొప్పునట్టిదియు, గరుడపచ్చలు దాఁపినట్టిదియు నగు నొక యింటిని ప్రవరుఁడు చూచెను.

క. కాంచి తదీయవిచిత్రో, దంచితసౌభాగ్య[2]గరిమ ♦ కచ్చెరువడి య
క్కాంచనగర్భాన్వయమణి, యించుక దఱియంగ నచటి ♦ కేఁగెడువేళన్. 23

టీ. కాంచి = (అట్టి దివ్యభవనమును) చూచి; తదీయ...గరిమకున్ - తదీయ = దానిదైన; విచిత్ర = వింతయైన; ఉదంచిత = మిక్కిలి యొప్పిదమైన; సౌభాగ్యగరిమకున్ = చక్కఁదనము యొక్క గొప్పతనమునకు - అతిశయిత్వమునకు; అచ్చెరువడి = ఆశ్చర్యపడి; అక్కాంచనగర్భ

1. చెంగలువ యనఁగా 'ఎఱ్ఱకలువ' యని పూర్వవ్యాఖ్యాత లర్థము వ్రాసిరి. ఎఱ్ఱకలువలు నీటిలోఁ బెరుగునవి కాని మెట్టపై నుండునవికావు. చెంగల్వలు వరిమళ్లగట్లపయి మొలచు దుంపజాతి గడ్డిమొక్కలు. అవి తెల్లనిపూవులు పూచుచుండును. అందు నీలిపూవులు పూచునవియుఁ గలవు. ఇచటి చెంగల్వలోని 'చెన్ను' రమ్యార్థకము; కాని శోణార్థకముకాదు.

2. మహిమ. పా.

వ్వయమణి = బ్రాహ్మణవంశశ్రేష్ఠుఁడైన యా ప్రవరుఁడు; ఇంచుక = కొంచెము; తఱియంగన్ = దగ్గఱగా; అచటికిన్ = ఆ తావునకు; ఏఁగెడువేళన్ = పోవునప్పుడు. క్రింది పద్యముతో నన్వయము.

క. మృగమద సౌరభ విభవ, ద్విగుణిత ఘనసారసాంద్ర ఽ వీటీ గంధ
స్థగితేతరపరిమళమై, మగువపొలుపుఁదెలుపు నొక్క ఽ మారుత మొలసెన్. 24

టీ. మృగమద...పరిమళమై - మృగమద = కస్తూరియొక్క; సౌరభ = పరిమళముయొక్క; విభవ = వైభవముచే; ద్విగుణిత = రెండింతలుగాఁ జేయఁబడిన; ఘనసార = పచ్చకర్పూరము చేత; సాంద్ర = దట్టమయిన; వీటీ = తాంబూలముయొక్క; గంధ = పరిమళముచేత; స్థగిత = కప్పఁబడిన - అణఁచివేయఁబడిన; ఇతరపరిమళమై = అన్యములయిన పువ్వులు మొదలైనవాని వాసనలుగలదై; మగువపొలుపున్ = స్త్రీయొక్క జాడను; తెలుపు నొక్క మారుతము = తెలియఁజేయునట్టి యొక గాలి; ఒలసెన్ = వీచెను.

తా. అప్పుడు కస్తూరి, పచ్చకర్పూరము మొదలయిన పరిమళద్రవ్యములతో విడెము చేసిన వాసన తక్కిన వాసనలనెల్ల నణఁచివేయఁగా, నట్టివాసనచేత స్త్రీ యొకతె యిచ్చట నున్నదను జాడను దెలుపునట్టి గాలి మెల్లఁగా వీచెను. అలం. కావ్యలింగము.

మ. అతఁ డావాతపరంపరాపరిమళ ఽ వ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ ఽ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం ఽ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరు ఽ న్నారీశిరోరత్నమున్. 25

టీ. అతఁడు = ఆ ప్రవరుఁడు; ఆ వాత...లీలన్ - ఆ వాతపరంపరా = ఆ గాలితెరలవలని; పరిమళ = మంచి వాసనయొక్క; వ్యాపారలీలన్ = ప్రవర్తనవిలాసముచేత; ఇచ్చోటు = ఈ ప్రదేశము; జనాన్వితము = జనులతోఁ గూడినది - జనులు గలది; అని = అనుకొని; చేరఁబోయి = దగ్గఱకుఁబోయి; విద్యుల్లతావిగ్రహన్ = మెఱుపుఁదీగవంటి శరీరము గలదానిని; శతపత్రేక్షణన్ = తామరలవంటి కన్నులుగలదానిని; చంచరీకచికురన్ = తుమ్మెదలవంటి తలవెండ్రుకలు గలదానిని; చంద్రాస్యన్ = చంద్రునివంటి ముఖము గలదానిని; చక్రస్తనిన్ = చక్రవాకములవంటి చన్నులు గలదానిని; నతనాభిన్ = లోఁతయిన బొడ్డుగలదానిని; ఒకానొక మరున్నారీశిరోరత్నమున్ = ఒకానొక దేవతాస్త్రీలలో శ్రేష్ఠురాలయిన; నవలాన్ = స్త్రీని; కనియెన్ = చూచెను.

తా. ఆ ప్రవరుఁడా గాలితెరలవలని మంచివాసనలు పయింబయి వ్యాపించుటచేత, నిది జను లుండు తావనుకొని, దగ్గఱకుఁబోయి, మెఱపుఁదీగెను బోలిన దేహమును, దామరలను బోలిన కన్నులును, తుమ్మెదలను బోలిన వెండ్రుకలును, చంద్రునిఁ బోలిన ముఖమును, చక్రవాకపక్షులంబోలిన చన్నులును, లోఁతైన పొక్కిలియుఁ గలిగి యొప్పుచున్న యొక దేవతాస్త్రీని గనియెను.

తే. అమలమణిమయనిజమంది ఽ రాంగణస్థ, తరుణసహకారమూలవి ఽ తర్దిమీఁద
శీతలానిలమొలయ నా ఽ సీనయైన, యన్నిలింపాబ్జముఖియు న ఽ య్యవసరమున.

టీ. అమల...మీఁదన్ - అమల మణిమయ = తెల్లగా వెలుఁగునట్టి వజ్రమణి వికారమయిన - వజ్రమణులు పఱచిన; నిజమందిర = తనయింటియొక్క; అంగణస్థ = ముంగిటియందున్న; తరుణసహకార = తియ్యమామిడి గున్నయొక్క; మూల = మొదట వేయఁబడిన; వితర్ది

మీఁదన్ = అరుఁగుమీఁద; శీతలానిలము = చల్లగాలి; ఒలయన్ = ప్రసరింపఁగా - వీవఁగా; ఆసీనయైన = కూర్చుండి యున్నట్టి; అన్నిలింపాబ్జముఖియున్ = ఆ దేవతాస్త్రీయును; అయ్యవసరమునన్ = ఆ సమయమునందు. క్రింది పద్యముతో నన్వయము.

సీ. తతనితంబాభోగ ✻ ధవళాంశుకములోని, యంగ[1]దట్టపుఁగావి ✻ రంగువలన
శశికాంతమణిపీఠి ✻ జాజువాఱఁగఁ గాయ, లుత్తుంగకుచపాళి ✻ న త్తమిల్లఁ
దరుణాంగుళీధూత ✻ తంత్రీస్వనంబుతో, జిలిబిలిపాట ము ✻ ద్దులు నటింప
నాలాపగతిఁజొక్కి ✻ యరమోడ్పుఁగనుదోయి, రతిపారవశ్యవి ✻ భ్రమముఁదెలుపఁ

తే. బ్రౌఢిఁ బలికించు గీతప్ర ✻ బంధములకుఁ,గమ్రకరపంకరుహరత్న ✻ కటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమా ✻ నములుగొలుప,నింపుదళుకొత్త వీణవా ✻ యింపుచుండి.

టీ. తత...వలనన్ - తత = వ్యాప్తమైన - ఆవృతమైన; నితంబాభోగ = పిఱుఁదులపూర్ణవిస్తారము గల - పిఱుఁదుల విరివిపైనంతయు వ్యాపించిన - విశాలములగు పిఱుఁదులనంతయుఁ గప్పియున్న యనుట; ధవళాంశుకములోని = తెల్లని వస్త్రములోపలి; అంగదట్టపు = పావడయొక్క; కావి రంగువలనన్ = ఎఱ్ఱవన్నెవలన; శశికాంతమణిపీఠి = చంద్రకాంతమణులు పొదిఁగిన పీఠము; జాజువాఱఁగన్ = ఎఱుపు వన్నెగలది యగుచుండఁగాను; (ఇటఁ దెల్లనివస్త్రము పిఱుఁదుల నంతయు నావరించియున్న దనుటచే దానిలోపలి యెఱ్ఱపావడ కూర్చున్న పీఁటకు పగులలేదనియుఁ, గావున దాని యెఱ్ఱనివన్నె యా వస్త్రముమూలముననే దానిపైఁ బ్రసరించుచుండె ననియు, నిట్లు ప్రసరించి యా పీఠ మెఱ్ఱవాఱియుండె ననుటచే నా పావడ మిక్కిలి రక్తిమగలదిగాను, దానిపై నావరించియున్న వస్త్రము మిక్కిలి సన్నమైన రవసెల్లాగాను నుండవలయు ననియు గ్రాహ్యము.) కాయలు = వీణెకు నమర్చిన సొఱకాయలు; ఉత్తుంగకుచపాళిన్ = ఉన్నతమయిన స్తనప్రదేశమునందు; అత్తమిల్లన్ = ఆనఁగాను; తరుణ...స్వనంబుతోన్ - తరుణ = లేఁతవైన - కోమలములైన; అంగుళీ = వ్రేళ్లచేత; ధూత = మీటఁబడిన; తంత్రీ స్వనంబుతోన్ = ఉక్కుతీగెలయొక్క నాదముతోడ; జిలిబిలిపాట = సన్నగొంతువలన నవ్యక్తమధురమయిన పాట; ముద్దులు నటింపన్ = మనోహరత్వములు కూర్పఁ గాను; ఆలాపగతిన్ = రాగము నాలాపనచేయు రీతిచేత; చొక్కి = పరవశయై - పరవశ యగుటచేత ననుట; అరమోడ్పుఁగనుదోయి = సగము మూయుట గల కన్నులజంట - సగముమూసిన రెండు కన్నులును; రతి...విభ్రమమున్ - రతి = సంభోగకాలమందలి; పారవశ్య = చొక్కువంటి చొక్కుయొక్క; విభ్రమమున్ = విలాసమును; తెలుపన్ = తెలియఁజేయఁగాను; ప్రౌఢిన్ = నేర్పుతో; పలికించు = వీణెయందుఁ బలికించునట్టి; గీతప్రబంధములకున్ = సంగీతపుఁ గృతులకు; క్రమ...స్ఫూర్తి - క్రమ = అందమైన; కరపంకరుహ = హస్తకమలములయందలి; రత్నకటక = మణులు చెక్కిన కడియములయొక్క; ఝుణఝుణధ్వని = ఝుణఝుణ యనెడి నాదముయొక్క; స్ఫూర్తి = తోఁచుట; - (వీనికి) తాళమానములు= తాళప్రమాణములను; కొలుపన్ = పొందింపఁగాను; ఇంపు = హాయి; తళుకొత్తన్ = ప్రకాశింపఁగా - మీఱఁగా; వీణన్; వాయింపుచుండి = మీటుచుండి. క్రింది పద్యముతో నన్వయము.

తా. ఆ యువతి మొలను జంద్రకావిపావడ గట్టి, దానిపై నాణెమైన రవసెల్లా చుట్టి, పైఁటవేసికొని, చంద్రకాంతమణులు పొదిఁగిన పీఁటపైఁ గూర్చుండి యుండఁగాఁ, బావడయొక్క

1. ధట్టపు. పా.

యెఱ్ఱనివన్నె చేతఁ గూర్చున్నపీఁట సయిత మెఱ్ఱగాఁ దోఁచుచుండెననియు, వీణ మీటుటకై బొమ్మన నానించుకొనఁగా నా వీణకు సమర్చిన సొఱకాయలు స్తనములపై నొఱగియుండె ననియు, వ్రేళ్లతో మీటునపుడు తంత్రులవలనఁ బుట్టిన నాదముతో నవ్యక్తమధురమయిన సన్నని కంఠనాదము లయించి, మనోహరముగా వినఁబడుచుండె ననియు, రాగ మాలాపన చేయునప్పుడు గలిగిన యానందపరవశత్వము సంభోగకాలమునందలి పరవశత్వమును బోలి యుండె ననియు, వీణయందుఁ బలికించునట్టి కృతులకుఁ జేతి కంకణములయొక్క ఝుణఝుణ యనెడి ధ్వనులు తాళములు వేసిన ట్లుండె ననియు - ఇట్లు హాయిగా వీణ వాయించుచుండి యని తాత్పర్యము. అలం. తద్గుణము, నిదర్శన, రూపకమును.

ఉ. అబ్బురపాటుతోడ నయ \ నాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బ కనీనికల్ వికసి \ తోత్పలపంక్తులఁ గ్రమ్మరింపఁగా
గుబ్బ మెఱుంగుఁజన్గవ గ \ గుర్పొడువన్ మదిలో[1]ని కోరికల్
గుబ్బ[2]తిలంగఁ జూచె నల \ కూబరసన్నిభు నద్ధరామరున్. 28

టీ. అబ్బురపాటుతోడన్ = అచ్చెరుపాటుతో; నయనాంబుజములు = కన్నుదామరలు; వికసింపన్ = విరియఁబాఱఁగా; కాంతి = శోభ; పెల్లు ఉబ్బి = మిక్కిలిగా అతిశయించి; కనీనికల్ = కంటినల్లగ్రుడ్లు; వికసితోత్పలపంక్తులన్ = పూచిన కలువల మాలికలను; క్రమ్మరింపఁగాన్ = నిండుకొలుపఁగా; గుబ్బ...కవ = వట్రువై నిగనిగనికాంతి గల స్తనద్వయము; గగుర్పొడువన్ = పులకాంకురములు కలది కాఁగా; మదిలోని = మనసులోని; కోరికల్ = వాంఛలు; గుబ్బతిలంగన్ = అతిశయింపఁగా; నలకూబరసన్నిభున్ = (చక్కఁదనముచేత) నలకూబరునిఁబోలిన; అద్ధరామరున్ = ఆ బ్రాహ్మణుని - ప్రవరుని; చూచెన్.

తా. ఈ విధముగా వీణ వాయించుచున్న యా దేవతాస్త్రీ యితరులెవ్వరును లేని తానున్న చోటికి సుందరుండైన యా ప్రవరుఁడు రాఁగానే, చూపులు భ్రమింప, దేహము గగుర్పొడువఁగా, మనసునందు లేనికోరికలు పుట్టుచుండఁగా నతని నాశ్చర్యముతోఁ జూచెను. అలం. పరిణామము. ఇందు అభిలాషము వ్యక్తము.

ఉ. చూచి [3]ఝుణంఝుణత్కటక \ సూచితవేగపదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము \ లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్క పోఁకనును \ బోదియఁ జేరి [4]విలోకనప్రభా
వీచికలం దదీయపద \ [5]విం గలశాంబుధి వెల్లిగొల్పుచున్. 29

టీ. చూచి = చూచినదై; ఝుణంఝుణ...విందయై - ఝుణంఝుణత్ = ఝుణఝుణమని మ్రోఁగుచున్న; కటక = అందెలచేత; సూచిత = తెలియఁజేయఁబడిన; వేగ = వడిగల; పదారవిందయై = పాదకమలములు గలదై; లేచి = కూర్చున్న పీఠమునందుండి లేచి; కుచంబులున్ = స్తనములును; తుఱుమున్ = కొప్పును; లేనడుము = సన్ననినడుమును; అల్లలనాడన్ = జవజవలాడఁగా - చలింపఁగా; అయ్యెడన్ = అచ్చట నున్న; పూచిన...బోదియన్ - పూచిన = పుష్పించిన; ఒక్క = ఒంటరిగానున్న; పోఁక నునుబోదియన్ = నునుపైన పోఁకమ్రాని మొదటు;

1. లోనఁగోరికల్. పా. 2. టిలంగ. పా. 3. ఝుళంఝుళ. పా. 4. విలోచన. పా. 5. వీకలశాం. పా.

చేరి = చేరుకొని; విలోకన ప్రభావీచికలన్ = చూపులయొక్క కాంతిపరంపరలచే; తదీయ పదవిన్ = ఆ ప్రవరుఁడు వచ్చునట్టి మార్గమున; కలశాంబుధిన్ = పాలసముద్రమును; వెల్లిగొల్పుచున్ = పొంగి ప్రవహింపఁ జేయుచును. (ఆ యచ్చర యత్యంతాసక్తిచేఁ బొరింబొరి నవ్వారిగాఁ బ్రవరునిదెసఁ జూడ్కులు నిగుడ్చుటచే నా చూపుల తెల్లనికాంతు లతఁడు వచ్చు మార్గమునందు మిక్కిలిని బ్రసరించుచుండెను గాన నా మార్గమును బాలసముద్రముగాను, నందుఁ బ్రసరించు నా చూపుల తెల్లనికాంతులు ప్రవహింపఁజేయు దాని యలలుగాను వర్ణింపఁబడెను. తెల్లని కాంతులు ప్రసరించుట పాలవెల్లువ ప్రవహించిన ట్లుండె నని భావము. ఇచట చూపుల తెల్లనికాంతులను వీచికలనుగా వర్ణించుటకుఁ బోషకముగా నది ప్రసరించుపదవి పాలసముద్రముగాఁ బరిణమించుట నెఱుంగునది. ఇక్కడ 'తదీయ పదవీకలశాంబుధిన్' అను పాఠమును గ్రహించి, పదవీశబ్దమునకు సౌందర్యవైభవ మని కొంద ఱర్థము వ్రాసియున్నారు. అది ప్రకరణమునకుఁ దగియున్నను, పదవీశబ్దమునకు నా యర్థము సంస్కృతమునం దున్నట్లు తోఁచలేదు. కనుక మార్చి వ్రాయ నయ్యెను.) తరువాతి పద్యముతో నన్వయము.

తా. ఆ యప్సరస యచ్చటికి వచ్చిన ప్రవరునిఁ జూచి, తన కాలియందెలు గల్లుగల్లని మ్రోయఁగాఁ దటాలున లేచి, యచ్చట నున్న పోఁకమ్రానిమఱుఁగునకు బోయి, యతఁడు వచ్చుచున్న మార్గమునే చూచుచు నిలిచెను. అలం. పరిణామము. ఇందు లజ్జ సూచితము.

మ. మునుమున్ పుట్టెడు కొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతం
జొనుపన్, గోర్కులు గ్రేళ్లు[1]దాట, మదిమెచ్చుల్ ఱెప్ప లల్లార్ప, న
త్యనుషంగస్థితి ఱిచ్చపా టొ[2]దవు నొయ్యారంబునం జంద్రిక
ల్దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్. 30

టీ. లతాంగి = ఆ స్త్రీ; మునుమున్ = ముందుముందు; పుట్టెడు కొంకు = పుట్టుచున్న సంకోచము; లౌల్యమున్ = చంచలభావమును; ఇడన్ = ఇయ్యఁగా - కలిగింపఁగా; మోదంబు = సంతోషము; విస్తీర్ణతన్ = విశాలత్వమును; చొనుపన్ = పొందింపఁగా - విరివిగా విప్పఁజేయఁగా ననుట; కోర్కులు = కోరికలు; క్రేళ్ళు దాటన్ = పరుగువాఱఁగా - మిక్కిలి చలింపఁజేయఁగా ననుట; (కన్నులు మొదట గొంకుచేతను, నిపుడు కోర్కులచేతను జంచలములయ్యె నని తెలియునది.) మదిమెచ్చుల్ = మనసులోని మెచ్చుకొనుటలు; ఱెప్ప లల్లార్పన్ = కనుఱెప్పలను జలింపఁజేయఁగా; అత్యనుషంగస్థితిన్ = మిక్కిలి చేరికగల యునికిచే; ఱిచ్చపాటొదవు = ఆశ్చర్యమును కలిగించునట్టి; ఒయ్యారంబునన్ = విలాసముచేత; చంద్రికల్ = వెన్నెలలు; తనుకన్ = ప్రకాశింపఁగా; ప్రఫుల్లన్నేత్రపద్మంబులన్ = మిక్కిలి వికాసము పొందుచున్న కన్నుఁదామరలతో -- తామరలవంటి కన్నులను జక్కఁగా విచ్చి యనుట; భూసురున్ = బ్రాహ్మణుని - ప్రవరుని; చూచెన్.

తా. ప్రవరునిఁ జూడఁగానే పుట్టినసంకోచముచేత నామె కన్నులు మఱింత చంచలము లయ్యెను. ఇట్టివాఁడు లభించె నను సంతోషాతిశయముచేత నవి విచ్చి విశాలము లయ్యెను. మీఁద మీఁదఁ బుట్టెడు కోరికలచేత నవి మిక్కిలి చలింపసాగెను. మనసులో మెచ్చుకొనుటలు కనుఱెప్పల నాడింపసాగెను. అతఁడు మిక్కిలి సమీపింపఁగా వాని చక్కఁదనమునకుఁ గలిగిన యాశ్చ

1. ద్రిప్ప. పా. 2. టొనఁగ. పా.

ర్యముచే నవి స్తిమితములయ్యెను. ఒయ్యారముగా నతనిఁ జూచునపుడా కన్నుల ధవళకాంతులు హెచ్చి, వెన్నెలకాయు నట్లయ్యెను. ఇట్లు రానురాను దశలు మాఱుచున్న కన్నుఁదమ్ములను జక్కఁగ విచ్చుచు, నామె యతనిని దేఱిచూచెను. అలం. పరిణామము. ఇందు శంకా, చపలతా, హర్షౌత్సుక్యాదులగు సంచారిభావములు వర్ణితములు.

క. పంకజముఖి కప్పుడు మై, నంకురితము లయ్యెఁ బులక § లావిష్కృతమీ
నాంకానలసూచకధూ, మాంకురములువోలె మఱియు § నతనిం జూడన్. 31

టీ. మఱియును = మరల; అతనిన్ చూడన్ = ఆ ప్రవరుని చూడఁగా, అప్పుడు = ఆ చూచునప్పుడు; పంకజముఖికిన్ = తామరవంటి మొగముగలదైన యా యప్సరసకు; మైన్ = దేహమునందు; ఆవిష్కృత...అంకురములు - ఆవిష్కృత = వెల్లడిచేయఁబడిన; మీనాంకానల = మన్మథాగ్నిని; సూచక = తెలియఁజేయునట్టి; ధూమ = పొగయొక్క; అంకురములు పోలెన్ = మొలకలువలె; పులకలు = రోమాంచములు; అంకురితములు = పొటమరించినవి; అయ్యెన్; (అనఁగాఁ బ్రవరుని మఱియొకసారి చూడఁగానే యతనియెడ జనించిన మోహముచేత మన్మథాగ్ని వ్యాపింపఁగా, నా యగ్ని వ్యాపించుటను సూచించుచున్నట్టి పొగమొలకలో యనునట్లు లామె దేహమునందు గగుర్పాటుమొలకలు గాన నయ్యెను.) అలం. ఉత్ప్రేక్ష. ఇందు రోమాంచ మను సాత్త్వికభావము వర్ణితము.

ఉ. తొంగలిఱెప్పలం దొలఁగఁ § ద్రోయుచుఁ బైపయి విస్త[1]రిల్లి, క
న్నుంగవ యాక్రమించుకొను § నో ముఖచంద్రు నటంచుఁ బోవనీ
కంగజుఁ డానవెట్టి కది § యన్ గుఱివ్రాసె ననంగ[2]జాఱె సా
రంగమదంబు లేఁజెమట § గ్ర[3]మ్మ లలాటము డిగ్గి చెక్కులన్. 32

టీ. తొంగలిఱెప్పలన్ = వాలుగలఱెప్పలను; తొలఁగన్ = ఎడగలుగ; త్రోయుచున్ = త్రోయుచును; పైపయిన్ = మీఁదమీఁద; కన్నుంగవ = కన్నుదోయి; విస్తరిల్లి = వ్యాపించి; ముఖచంద్రున్=చంద్రునివంటి ముఖమునుగూడ; ఆక్రమించుకొనునో=క్రమ్ముకొనునో; అటంచున్ = అని; పోవనీక = అవతల సాగిపోనీయక; అంగజుఁడు = మన్మథుఁడు; ఆనపెట్టి = దురాయిపెట్టి; కదియన్=కదిసికొనునట్లు; గుఱి = గుఱుతు; వ్రాసె ననంగన్ = వ్రాసెనో యనునట్లు; లేఁజెమట క్రమ్మన్ = చిఱుచెమట వ్యాపింపఁగా; సారంగమదంబు = (బొట్టుపెట్టుకొన్న)కస్తూరి; లలాటమున్ = నొసటనుండి; డిగ్గి = దిగి; చెక్కులన్ = చెక్కిళ్ల పయిని; జాఱెన్.

తా. ఱెప్పలు వాల్పక చూచుచున్న యామె కన్నులు విశాలములై యుండుటచేత ఱెప్పల నెగసనఁ ద్రోచి, మీఁదికిఁ బరపుచున్నవి. ఇఁక ముఖమునుగూడ నావరించుకొనునేమో యని తలఁచి, మన్మథుఁ డంతకుమీఁద నది యెక్కిపోఁగూడ దని దురాయిపెట్టి గీచిన గీఁతయో యనునట్లు నొసటఁ బెట్టుకొన్న కస్తురిబొట్టు కరఁగి చెక్కిలిమీఁదికి స్రవించినచాఱ దోఁచెను. అలం. ఉత్ప్రేక్ష. ఇందు స్వేద మను సాత్త్వికభావము వర్ణితము.

మ. అనిమేష[4]త్వము మాన్చె బిత్తరపుఁజూ § పస్వేదతావృత్తి [5]మా
న్చె నవస్వేదసమృద్ధి; బోధకళ మా § [6]న్చెన్ మోహవిభ్రాంతి ; నో

1. విస్తరిల్లు. పా. 2. జాఱె. పా. 3. గ్రమ్మె. పా. 4. స్థితిమాన్పె. పా. 5. మాన్పె. పా. 6. మాన్పెన్. పా.

డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయ మొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వమె[1] మెయింగ జూపట్టెనా నత్తఱిన్. 33

టీ. గీర్వాణవధూటికిన్ = ఆ దేవతాస్త్రీకి; అత్తఱిన్ = ఆ సమయమునందు; భ్రమరకీట న్యాయము = పచ్చపురుగు (తుమ్మెదనే మనసున భావించి) తుమ్మెద యగునట్టి న్యాయము; ఒప్పన్ = ఒప్పునట్లుగా - తార్కాణమగునట్లుగా; మనుష్యునిన్ = మనుష్యుఁడయిన ప్రవరుని; భావించుటన్ = మనసునఁ దలఁచుటచేత; తోడనె = వెంటనే; మానుషత్వమె = మనుష్యత్వమే; మెయిన్ = తన దేహమునందు; చూపట్టెన్ = కనఁబడెనో; నాన్ = అనునట్లు; బిత్తరపుఁ జూపు = శృంగారముగాఁ జలించునట్టిచూపు; అనిమేషత్వమున్ = ఱెప్పపాటు లేని యునికిని; మాన్చెన్ = పోఁగొట్టెను; నవస్వేద సమృద్ధి = క్రొత్త చెమటయొక్క నింపు; అస్వేదతావృత్తిన్ = చెమటలేనితనము నునికిని; మాన్చెన్ = పోఁగొట్టెను; మోహావిభ్రాంతి = వలపువలని విశేషమైన భ్రమము; బోధకళన్ = జాగరూకతాంశమును; మాన్చెన్ = పోఁగొట్టెను.

తా. ఆ దేవతాస్త్రీకి మనుష్యుని మనసునఁ గోరినందున భ్రమరకీటన్యాయముచేత స్వాభావికములయిన దేవజాతిధర్మములు పోయి, మనుష్యజాతిధర్మము లన్నియు సిద్ధించెను. (దేవజాతిధర్మములు - అనిమేషత్వము, అస్వేదతావృత్తి, బోధకళ; మానుషధర్మములు - బిత్తరపుఁ జూపు; నవస్వేదసమృద్ధి, మోహావిభ్రాంతి అని యెఱుంగునది.) అలం. ఉత్ప్రేక్ష, తద్గుణమును.

వ. ఇట్లు తని[2]రూపరేఖావిలాసంబులకుం జొక్కి, యక్కమలపత్రేక్షణ యాత్మగతంబున.

టీ. ఇట్లు = ఈ విధముగా; అతనిరూపరేఖావిలాసంబులకున్ = ఆ ప్రవరునియొక్క రూప = అవయవసౌష్ఠవముయొక్క; రేఖా = క్రమమునకును; విలాసంబులకున్ = ఒయ్యారములకును; చొక్కి = పరవశయై; అక్కమలపత్రేక్షణ = తామరఱేకులవంటి కన్నులుగలదైన యా యప్సరస; ఆత్మగతంబునన్ = తనలో (ఇట్లు తలఁచెను).

ఉ. ఎక్కడివాఁడొ యక్షతనయేందు జయంత వసంత కంతులం
జక్కఁదనంబునన్ గెలువఁ జాలెదు[3]వీని మహీసురాన్వయం
బెక్కడ? యీ తనూవిభవ మెక్కడ? [4]యేలనిబంటుగా మరున్
డక్కఁగొనంగరాదె? యకటా! నను వీఁడు పరిగ్రహించినన్. 35

టీ. ఎక్కడివాఁడో = ఎక్కడనుండివచ్చినవాఁడో ! (ఈ బ్రాహ్మణుఁడు)యక్ష... కంతులన్ - యక్షతనయ = కుబేరునికొడుకైన నలకూబరుని; ఇందు = చంద్రుని; జయంత = ఇంద్రునికొడుకైన జయంతుని; వసంత = వసంతఋతుపురుషుని; కంతులన్ = మన్మథుని; చక్కఁదనంబునన్ = సౌందర్యముచేత; గెలువన్ చాలెదు = జయింపఁదగినట్టి; వీని మహీసురాన్వయం బెక్కడ? = ఈతని బ్రాహ్మణకుల మెక్కడ ? ఈ తనూవిభవ మెక్కడ? = ఈ దేహ సౌందర్యసంపత్తి యెక్కడ ? (దేవతాంశమునందుఁ బుట్టిన మహాపురుషులందుఁ గాక సామాన్యులైన బ్రాహ్మణులలో నిట్టి సౌందర్యవంతుఁ డుండుట యరుదనుట.) అకటా! = అయ్యో ! వీఁడు = ఈ పురుషుఁడు; ననున్ పరిగ్రహించినన్ = నన్ను చేపట్టినట్లయిన; మరున్ = మన్మథుని; ఏలనిబంటుగాన్ = జీతబత్తెములిచ్చి పోషింపకయే కొలువు చేయునట్టి సేవకుఁ డగునట్టుగా; డక్కఁగొనంగరాదె = స్వాధీనునిఁ జేసికోఁగూడదా ?

1. త్వము. పా. 2. రూపాతిశయంబునకు. పా. 3. వాఁడు. పా. 4. ప్రోవని. పా.

తా. 'ఈ బ్రాహ్మణుఁడు నలకూబర, చంద్ర, జయంత, వసంత, మన్మథులకంటెఁ జ
దనముగలవాఁడై యున్నాఁడు. వీఁడు దేవగంధర్వాదులలో నెవఁడో యొకఁడు కావ
కాకున్న బ్రాహ్మణమాత్రుని కింతటిచక్కఁదన మెక్కడనుండి వచ్చును ? ఇటువంటివీఁడు న
ప్రియురాలిఁగాఁ గ్రహించినయెడల మన్మథవేదనను లక్ష్యము చేయక సుఖింపవచ్చును గదా'
వరూథిని యనుకొనియెను.[1] అలం. విషమము.

సీ. వదనప్రభూతలా ॥ వణ్యాంబుసంభూత, కమలంబు లన వీని ॥ కన్నులమ
నిక్క వీనులతోడ ॥ నెక్కసక్కెము లాడు, కరణి నున్నవి వీని ॥ ఘనభుజ
సంకల్పసంభవా ॥ స్థానపీఠిక వోలె, వెడఁద యై కనుపట్టు ॥ వీనియురమ
[2]ప్రతిఘటించుచిగుళ్ల ॥ పై నెఱ్ఱవాఱిన, రీతి నున్నవి వీని ॥ మృదుపద
తే. నేరెళేటియసల్ తెచ్చి ॥ నీరజాప్తు, సానఁబట్టినరా[3]వొడి ॥ చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో ॥ పద్మభవుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీ ॥ మేనిక

టీ. (ఆ సౌందర్యము నీ పద్యముచే వివరించుచున్నది.) వీనికన్నులు = ఈ పు
కన్నులు; వదన...కమలంబులు - వదన = ముఖముయొక్క; ప్రభూత = అధికమైన; లావ
కాంతి యనెడి (అణిముత్తెముల నిగ్గునుబోలిన దేహచ్ఛాయ యనెడు); అంబు = నీటియందు; సంభ
పుట్టిన; కమలంబులు = తామరలు; అనన్ = అనునట్లు; అమరున్ = ఒప్పుచున్నవి. వీనిఘ
ములు = ఈ పురుషుని దొడ్డవైన బుజములు -ఎగుబుజములనుట; నిక్క = ఎగపుగలిగి; వీనులతో
చెవులతో; ఎక్కసక్కెములు = వికటపుఁబలుకులు; ఆడుకరణిన్ = పలికెడువిధమున -
సము చేయునట్లు; ఉన్నవి. వీనియురము = ఈ పురుషునిఱొమ్ము; సంకల్ప...వోలెన్ - స
సంభవ = మన్మథునియొక్క; ఆస్థాన = కొలువుకూటమునందలి; పీఠికవోలెన్ = సింహా
వలె; వెడఁదయై = విశాలమై; కనుపట్టున్ = కానఁబడుచున్నది. వీని మృదుపదములు
పురుషుని మెత్తనిపాదములు; ప్రతిఘటించు చిగుళ్లపైన్ = ఎదిరించునట్టి చిగురులవి
ఎఱ్ఱవాఱినరీతిన్ = కోపించి యెఱ్ఱనయినవిధమున; ఉన్నవి. వీనిన్; పద్మభవుఁడు
బ్రహ్మ; నేరెళేటియసల్ = జంబూనదిలోని యడుసు; తెచ్చి = తీసికొనివచ్చి; నీరజా
సూర్యుని; సానఁ బట్టిన రావొడి = సానయం దఱుగఁబట్టఁగా రాలిన పొడిని; చల్లి = కలియ
మెదిపి = మేదించి; పదను = తడి (చేతి కంటుకొనకుండుటకుఁ గావలసినంతతడి); సుధన్ =
తము చేత; ఇడి = పెట్టి - కలుగఁజేసికొని; చేసెనో = సృజించెనో యేమో!; కాకున్నన్ =
కానిపక్షమున; ఈ మేనికాంతి = ఈ దేహలావణ్యము; కలదే ? = కలుగునా? - కలుగ దన

తా. ఈ పురుషునికన్నులు ముఖకాంతి యనెడి తేటనీటఁబుట్టిన కమలములవలె నున్న
యెగుబుజములు మీఁదికి నిక్కి, చెవులతోఁ బరిహాసము లాడునట్లున్నవి. వీని ఱొమ్ము విశాల
మన్మథరాజ్యసింహాసనమువలె నున్నది. వీని పాదములు చిగుళ్లను దిరస్కరించునట్లు మెత్త
నెఱ్ఱఁదనమును గలిగియున్నవి. ఇట్టి యీ పురుషుని సృజించినప్పుడు బ్రహ్మ బంబూనదిలోని బ

1. ఇంతదనుక ప్రవరుఁడామెతో మాటలాడలేదు; అతని కుల మేదో యామెకుఁ దె
అయినను ఆకారవిశేషాదులనుబట్టి యాతఁడు బ్రాహ్మణుఁడయి యుండనోపునని యా
యూహించి, యిట్లు తలఁచి యుండవలెను.

2. ప్రతిభటించు (చి). పా. 3. రాపొడి. పా.

మట్టి తెచ్చి, దానిలో సూర్యుని సానఁబట్టినరావొడి తెచ్చి కలిపి, యమృతముతోఁ జేతికిఁ దేమఁ గలుగఁజేసికొని యిట్లు సృజించినాఁడో యేమో యని యా దేవతాస్త్రీ వితర్కించెను. (సూర్యుని భార్యయైన సంజ్ఞాదేవి పెనిమిటిశరీరము వేడిమికిఁ దాళలేకపోఁగా నామెతండ్రి త్వష్ట యనునతఁడు సూర్యునివేఁడిమిని సానయందఱుగ రాచి, తగ్గించెనని పురాణకథ.) అలం. ఉత్ప్రేక్ష.

క. సుర గరుడోరగ నర ఖే, చర కిన్నర సిద్ధ సాధ్య ÷ చారణ విద్యా
ధర గంధర్వకుమారుల, నిరతము గనుఁగొనమె! పోల ÷ నేర్తురె వీనిన్. 37

టీ. సుర...కుమారులన్ = దేవతలు, గరుడులు, నాగులు, మానవులు, ఖేచరులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, చారణులు, విద్యాధరులు, గంధర్వులు నైన యౌవనపురుషులను; నిరతము= ఎల్లప్పుడు; కనుఁగొనమె = చూడమా? ఎందఱనో చూచితి మనుట. వీనిన్ = ఈ పురుషుని; పోల నేర్తురె = వారు సరిపోలఁజాలుదురా? సరిపోలఁ జాల రనుట.

మ. అని చింతించుచు మీనకేతనధను ÷ ర్జ్యాముక్తనారాచదు
ర్దినసమ్మూర్ఛితమానసాంబురుహ యై ÷ దీపించు పెందత్తఱం
బునఁ బేటెత్తినలజ్జ నంఘ్రికటకం ÷ బుల్ మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁ జని ప ÷ ల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై. 38

టీ. అని చింతించుచున్ = ఇట్లు విచారించుచు; మీనకేతన...రుహయై - మీనకేతన = మన్మథునియొక్క; ధనుః = వింటియొక్క; జ్యా = అల్లెత్రాటివలననుండి; ముక్త = విడువఁబడిన; నారాచ = నారసములవలననైన - (నారాచములనెడి వర్ష ధారలచేతనైన యనుట); దుర్దిన = సూర్యరశ్మిలేని దినముచేత; సమ్మూర్ఛిత = చక్కఁగా మూర్ఛనొందిన - వికాసముచెడిన; మానసాంబురుహయై = మనఃకమలముగలదై - మన్మథవేదనచేతఁ జిన్నవోయిన మనసుగలదై యనుట; దీపించు పెందత్తఱంబునన్ = ప్రకాశించు (స్పష్టముగా నుల్లసిల్లు) చున్న మిక్కుటపుఁదొందఱ చేత; పేటెత్తిన లజ్జన్ = చిటిలిన లజ్జచేత - సిగ్గువిడిచియనుట; అంఘ్రికటకంబుల్ = కాలియందెలు; మ్రోయన్ = మొరయఁగా; అడ్డంబు = (ప్రవరుఁడు వచ్చునట్టిత్రోవకు) అడ్డముగా; నిల్చినన్ = నిలువఁబడఁగా; అయ్యచ్చరన్ = ఆయప్సరసను; చూచి = కనుఁగొని; వాఁడు = ఆ ప్రవరుఁడు; విభ్రాంతుఁడై = మిక్కిలి భ్రమసినవాఁడై; చేరఁజని = దగ్గఱఁబోయి; పల్కెన్ = ఇట్లు పలికెను.

తా. ఈవిధముగా వితర్కించుచున్న యా దేవతాస్త్రీ మన్మథవేదన యతిశయింపగాఁ దాలిమిచెడి సిగ్గువిడిచి మిక్కుటమైన తత్తఱపాటుతోఁ గాలియందెలు మొరయఁగాఁ, దానున్న పోఁకమ్రానిమఱుఁగుననుండి ప్రవరుఁడు వచ్చుచున్న త్రోవ కడ్డముగా వచ్చి నిలిచెను. అది చూచి భ్రమసినవాఁడై యతఁడు దానిదగ్గఱగాఁ బోయి, యీ మీఁదఁ జెప్పఁబోవురీతిని బలికెను. అలం. రూపకము.

ఉ. ఎవ్వతె వీవు భీతహరి ÷ ణేక్షణ! యొంటి చరించె దోట లే
కివ్వనభూమి; భూసురుఁడ ÷ నేఁ బ్రవరాఖ్యుఁడఁ; ద్రోవ తప్పితిం;
గ్రొవ్వున నిన్నగాగ్రమున ÷ కుం జనుదెంచి[1]తి; నూరుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగద ÷ వే! తెరు వెద్ది? శుభంబు నీకగున్. 39

1. పురంబు. పా.

టీ. భీతహరిణేక్షణ! = బెదరిన జింక చూపులవంటి చూపులు గల యో చిన్నదానా! ఈ
నీవు; ఎవ్వతెవు? = ఎవరిచిన్నదానవు? ఓటలేక = భయములేక; ఇవ్వనభూమి = ఈ యడ
నేలను; ఒంటి చరించెదు = ఒంటరిగాఁ దిరుగుచున్నావు; ఏన్ = నేను; ప్రవరాఖ్యుఁడన్
ప్రవరుఁడను పేరుగలవాఁడను; భూసురుఁడన్ = బ్రాహ్మణుఁడను; క్రొవ్వునన్ = మదము
ఇన్నగాగ్రమునకున్ = ఈ కొండకొమ్మునకు; చనుదెంచితి = వచ్చితిని; త్రోవతప్పితిన్ = మార్గ
తప్పినవాఁడనైతిని; ఇంకన్ = ఇఁకను, ఊరున్ జేరన్ = నా పట్టణము చేరుటకు; ఎవ్విధిన్
ఏవిధమును; కాంతున్ = పొందుదును? తెరువు = నేను బోవలసినత్రోవ; ఎద్ది? తెల్పఁగద
నీకు; శుభంబగున్ = మేలగును.

తా. ఓ చిన్నదానా! నీ వెవతవు? భయము విడిచి తోడులేక యీ యడవిలో నొక
దాన వేల తిరుగుచున్నావు? నేను ప్రవరుఁ డనెడు బ్రాహ్మణుఁడను. కండకావరముచేత ము
వెనుక విచారింపక యీ కొండకొమ్మునకు వచ్చి త్రోవతప్పి చిక్కులఁబడుచున్నాను. నాకు
చూపుము. నీకు మే లగును.

క. అని తనకథ నెఱిఁగించినఁ, దనకనుఁగవమెఱుఁగు లుబ్బఁ దాటంకములుం
జనుఁగవయు నడుము వడఁకఁగ, వనిత సెలవివాఱ నవ్వి వానికి ననియెన్.

టీ. అని = ఇట్లని; తనకథన్ = తన వృత్తాంతమును; ఎఱిఁగించినన్ = ప్రవరుఁడు తెలి
జేయఁగా; వనిత = ఆ దేవతాస్త్రీ; తనకనుఁగవమెఱుఁగులు = తన రెండు కన్నులయొక
కాంతులు; ఉబ్బన్ = మీఁదికి వ్యాపింపఁగా, తాటంకములున్ = చెవికమ్మలును; చ
గవయున్ = స్తనద్వయమును; నడుమున్ = మధ్యమును; వడఁకఁగన్ = చలింపఁగా; సెలవివాఱ
పెదవులమూలలు విచ్చునట్లుగా (చక్కఁగా నోరుతెరచి); నవ్వి; వానికిన్ = ఆ ప్రవరుని
అనియెన్. (కనుఁగవ మొదలగునవి చలించుట తమక మతిశయించుటచేత నని యెఱుఁగునది.)

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర? యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవచొప్పు? నీ
కింతభయంబు లేకడుగ నెల్లిద మైతిమి; మాట లేటికిన్.

టీ. భూసురేంద్ర! = ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! ఇంతలు = ఇంతవిశాలములయిన; కన్ను
ఉండన్ = కలిగియుండఁగా; తెరువు = త్రోవ; ఎవ్వరిన్ = ఎవరిని; వేఁడెదు = అడిగెద
నెపంబిడి = ఏదే నొక మిషపెట్టుకొని; ఏకాంతమునందు = ఇతరులెవ్వరును లేనిచోట; ఉ
జవరాండ్రన్ = ఉండునట్టి యౌవనస్త్రీలను; పల్కరించులాగు = మాటలాడించునట్టిరీతి
ఇంతియకాక = ఇంతేకాని; మును = మునుపు; వచ్చినత్రోవచొప్పు = వచ్చినట్టిదారియొక్క
నీవు; ఎఱుఁగవే? = గుర్తెఱుఁగవా? మాటలేటికిన్? = పలుమాటలేల? ఇంత భయంబులేక = కొంచెమై
భయములేక; అడుగన్ = ఇట్లడుగుటకు; నీకు; ఎల్లిదమైతిమి = చులుకనైతిమి? మేము
జులుకనఁగాఁ గనఁబడితిమి. (ఇచ్చట ఏకాంతమునం దనుటచే భయసంకోచాదుల కవకా
లేమియు, జవరాండ్ర ననుటచేఁ దన యత్యంత భోగ్యత్వమును నాయికచే సూచిత మ
నెఱుంగఁదగును.)

తా. ఓ బ్రాహ్మణుఁడా! ఇంత పెద్ద కన్నులు పెట్టుకొని నీవు వచ్చినత్రోవఁ గానవా? ఒకరి నడుగ వలయునా? ఈ యొక మిష కల్పించుకొని, యొంటరిపాటున నున్న ప్రాయపుఁ బడుచుల మైన మాతో మాటలాడ నారంభించితివి. ఏల పలు మాటలు ? మేము నీకంటికింత చులుకనివారమై కనఁబడుచున్నాము. కావున్న నీ విట్లు భయము లేక మమ్ముఁ బలుకరింతువా? అలం. అపహ్నవము.

వ. అని నర్మగర్భంబుగాఁ బలికి, క్రమ్మఱ నమ్మగువ యమ్మహీసు[1]రకుమారున కిట్లనియె. 42

టీ. అని = ఇట్లని; నర్మగర్భంబుగాన్ = పరిహాసగర్భముగా - నిజాభిప్రాయము లోపలఁ గలిగియుఁ బైకి సరసమని తోఁచునట్టివిధముతో ననుట; పలికి = మాటాడి; క్రమ్మఱన్ = మరల; అమ్మగువ = ఆ దేవతాస్త్రీ; అమ్మహీసురకుమారునకున్ = ఆబ్రాహ్మణపుత్రునితో; ఇట్లనియె.

సీ. చిన్ని వెన్నెలకందు * వెన్నుదన్ని సుధాబ్ధిఁ, బొడమినచెలువ తోఁ * బుట్టుమాకు
రహిపుట్ట జంత్రగాత్రములరాల్ * గరఁగించు, విమలగాంధర్వంబు * విద్య మాకు
ననవిల్తుశాస్త్రంపు * మినుకు లావర్తించు, పని వెన్నతోఁడఁ బె * ట్టినది మాకు
హయమేధ రాజసూ * యము లనఁ బేర్వడ్డ, సవనతంత్రంబు లుం * కువలుమాకుఁ

తే. గనకనగసీమఁ గల్పవృ * క్షములనీడఁ, బచ్చరాచట్టుగమి రచ్చ * పట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ * భర్గ సభలు, సాముగరిడీలు మాకు గో * త్రామరేంద్ర!

టీ. గోత్రామరేంద్ర! = ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! చిన్ని...కందున్ = మనోహరమైన బాలచంద్రుని; వెన్నుదన్ని = వెంబడించి; సుధాబ్ధిన్ = పాలసముద్రమునందు; పొడమిన చెలువ = పుట్టిన స్త్రీ - లక్ష్మీదేవి; మాకు; తోఁబుట్టు = తోడఁబుట్టినది. రహి పుట్టన్ = రక్తి పుట్టునట్లుగా; జంత్రగాత్రములన్ = వీణానాదముచేతను, గంఠనాదముచేతను; రాల్ = ఱాళ్లను; కరఁగించు = ద్రవింపఁజేయునట్టి; విమలగాంధర్వంబు = నిర్మలమైన - ఏ లోపమునులేని సంగీతము; మాకు; విద్య = చదువు. నన...మినుకులు - ననవిల్తు = మన్మథునియొక్క; శాస్త్రంపు మినుకులు = శాస్త్రసంబంధులయిన వాక్కులను - మాటలను - అనఁగాఁ గళాశాస్త్రమును సంబంధించిన మాటలను; ఆవర్తించు పని = వల్లించునట్టి వ్యాపారము; మాకు; వెన్నతోడన్ = చిన్నప్పుడు పెట్టునట్టి - వెన్నతోడఁజేర్చి; పెట్టినది = తినుటకై పెట్టినది. హయమేధ రాజసూయములు = అశ్వమేధము, రాజసూయము; అనన్ = అనఁగా; పేర్వడ్డ = ప్రసిద్ధినొందిన; సవనతంత్రంబులు = యజ్ఞకర్మములు; మాకు; ఉంకువలు = ఓలిపెట్టెడి ధనములు, కనకనగసీమన్ = మేరుపర్వత ప్రదేశమునందు; కల్పవృక్షములనీడన్ = కోరినకోరికల నిచ్చునట్టి దేవవృక్షముల నీడయందు; పచ్చరాచట్టుగమి = మరకతమణి రూపములైన చాపఱాల సమూహము; మాకు; రచ్చపట్టు = సభగూడెడి చోటు; పద్మసంభవ...సభలు - పద్మసంభవ = బ్రహ్మదేవునియొక్కయు; వైకుంఠ = విష్ణుదేవునియొక్కయు; భర్గ=శివునియొక్కయు; సభలు = కొలువుకూటములు; మాకు; సాముగరిడీలు = సాము నేర్చెడి శాలలు.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! నా వృత్తాంతము వినుము. మేము చంద్రునితోడఁబుట్టిన లక్ష్మీదేవికిఁ దోడఁబుట్టువులము. ఱాలుసయితము రక్తిపుట్టి కరఁగునట్లు వీణ వాయించుచుఁ బాటపాడెడి నేర్పుగలవారము. కామశాస్త్రమర్యాద చిన్నప్పటినుండి నేర్చి గడిదేరినవారము. రాజసూ

1. సురున. పా.

యాశ్వమేధాదులయిన మహాయజ్ఞములు చేసినవారికే లభింపఁగలవారము. మేరుపర్వతముమీఁది కల్పవృక్షములనీడలోఁ బచ్చలచాఁపరాలపైఁ గొలువుదీరి కూర్చుండువారము. బ్రహ్మ,విష్ణు, మహేశ్వరుల సభలలో నాట్యము చేయువారము. కనుక మమ్ము సామాన్యస్త్రీలనుగా నెంచవలదు. దేవకన్యకలము గాని మానవస్త్రీలము గా మని భావము.

క. పేరు వరూథిని [1]విప్రకుమార ! ఘృతాచీ తిలోత్త ♦ మా హరిణీ హే
మా రంభా శశిరేఖ లు, దారగుణాఢ్యలు మదీయు ♦ లగు ప్రాణసఖుల్. 44

టీ. విప్రకుమార! = ఓ బ్రాహ్మణపుత్రుఁడా! పేరు వరూథిని = వరూథినియనునది నా పేరు. ఉదారగుణాఢ్యలు = దొడ్డగుణములు గలవారు; ఘృతాచీ...శశిరేఖలు = ఘృతాచి, తిలోత్తమ, హరిణి, హేమ, రంభ, శశిరేఖ యనెడి యప్సరసలు; మదీయలు = నావారు; అగు ప్రాణసఖుల్ = అగునట్టి ప్రాణపదమయిన చెలికత్తెలు.

మ. బహురత్నద్యుతిమేదురోదరదరీ ♦ భాగంబులం బొల్చు ని
మ్మహికాహార్యమునం జరింతు మెపుడుం ♦ బ్రేమన్; నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖే ♦ ల న్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి మ ♦ త్కాంతారసంతానముల్. 45

టీ. బహు...బులన్ - బహు = అనేకములయిన; రత్న = మణులయొక్క; ద్యుతి=కాంతుల చేత; మేదుర = దట్టములైన; ఉదర = లోపలిభాగములుగల; దరీభాగంబులన్ = బిలప్రదేశముల చేత; పొల్చునిమ్మహికాహార్యమునన్ = ఒప్పునట్టియీ మంచుఁగొండయందు; ఎపుడున్; ప్రేమన్; చరింతుము. నభో...బులు - నభోవాహినీ = ఆకాశగంగయొక్క; లహరీ = ప్రవాహమువలని; శీతల = చల్లని; గంధవాహ = గాలివలన; పరిఖేలత్ = అంతటను గదలుచున్న; మంజరీ = పూగుత్తులయొక్క; సౌరభ = పరిమళములయొక్క; గ్రహణ = గ్రహించుటగల; ఇందిందిర = తుమ్మెదలచేత; తుందిలంబులు = బలసినవి - నిండుకొన్నవి; (అయిన) ఇవి = ఈ కానవచ్చునవి; మత్కాంతారసంతానముల్ = మా విహారవనసమూహములు.

క. భూసుర ! కైతవకుసుమశ, రాసన ! మాయింటివింద ♦ వైతివి; గైకొ
మ్మా సముదంచన్మణిభవ, నాసీనత సేదదేఱి ♦ యాతిథ్యం[2]బుల్. 46

టీ. కైతవ...శరాసన! = కపటపు మన్మథుఁడవైన - మన్మథునివలెనే యున్న యనుట; భూసుర! = ఓ బ్రాహ్మణుఁడా! మాయింటివిందవు = మాయింటికివచ్చిన చుట్టమవు; ఐతివి = నీవైనాఁడవు; సము...సీనతన్ - సముదంచత్ = మిక్కిలి యొప్పుచున్న; మణిభవన = రత్నవికారమైన యీయింటియందు; ఆసీనతన్ = కూర్చుండుటచేత; సేదదేఱి = శ్రమమువలనఁ దేఱినవాఁడవై - శ్రమ తీర్చుకొని యనుట; ఆతిథ్యంబుల్ = అథితిపూజలను; కైకొమ్మా = అంగీకరింపుము - అనఁగా మాయింటికి నతిథివై వచ్చితివి గనుకఁ గొంచెముసేపు కూర్చుండి, యాయాసము తీర్చుకొని, మేము చేయు నతిథిపూజలు గ్రహించి పొమ్ము.

తే. కుందనమువంటిమేను మధ్యందినాత, పోష్మహతిఁగందె;వడదాఁకెఁగెన్నొప్పులొలుకు
వదన; మస్మద్గృహంబుపావనము సేసి, బడలికలువాసి చనుమన్న ♦ బ్రాహ్మణుండు.

1. యంత్రుడు. పా. 2. యాతిథ్యంబున్. పా.

టీ. కుందనమువంటిమేను = అపరంజివలెఁ దళతళలాడెడి దేహము; మధ్యందినాతపోష్మహతిన్ = మధ్యాహ్నకాలమునందలి యెండవేఁడిమిదెబ్బచేత; కందెన్ = నల్లవడియెను; ఒప్పులొలుకు వదనము = ముద్దులు కాఱునట్టి ముఖము; వడదాఁకెన్ = డస్సెను; అస్మద్గృహంబు = మాయిల్లు; పావనముచేసి = పరిశుద్ధము అగునట్లుచేసి - పుణ్యాత్ముఁడవు గనుక నీవు కొంతసేపున్న మాయిల్లు పరిశుద్ధమగు ననుట. బడలికలు = శ్రమములు; పాసి = తీర్చుకొని; చనుము = పొమ్ము; అన్నన్ = అని పల్కఁగా; బ్రాహ్మణుఁడు = బ్రాహ్మణుఁడైన ప్రవరుఁడు. (క్రింది 'ఏ నిఁక' అను పద్యములోని 'అటన్న'తో అన్వయము.

ఉ. అండజయాన ! నీ వొసఁగు నట్టి సపర్యలు మాకు వచ్చె; నిం
దుండఁగ రాదు ; పోవలయు నూరికి; నింటికి నిప్పు డేను రా
కుండ నొకండు వచ్చి మఱి యొండునె? భక్తియ చాలు; సత్క్రియా
కాండముఁ దీర్ప వేగ చనఁ గా వలయుం; గరుణింపు నాపయిన్. 48

టీ. అండజయాన! = హంసనడకవంటి మనోహరమైన నడకగల యో చిన్నదానా! నీవొసఁగునట్టిసపర్యలు = నీవు చేయునట్టి యతిథిమర్యాదలు; మాకు వచ్చెన్ = మాకుఁజెందినవి - నేను గ్రహించినట్లె యనుకొను మనుట; ఇందున్ = ఇక్కడ; ఉండఁగరాదు = ఉండఁగూడదు; ఊరికిన్ = మాగ్రామమునకు; పోవలయున్ = తప్పకపోవలయును; ఇప్పుడు = ఈసమయమునందు; ఇంటికిన్ = మీయింటికి; ఏను = నేను; రాకుండనొకండున్ = రాకున్ననొకటియు; వచ్చి మఱి యొండునె? = రాఁగా నింకొకటియునా? భక్తియ = ప్రీతియే; చాలును. సత్క్రియాకాండము=మాధ్యాహ్నికస్నానము మొదలయిన సత్కార్యసముదాయమును; తీర్పన్=జరుపుటకు; వేగ = శీఘ్రముగా; చనఁగావలయున్ = పోవలయును. నాపయిన్ = నామీఁద; కరుణింపు = దయ యుంచుము.

తా. ఓ చిన్నదానా ! నీవు చేయదలఁచినట్టి మర్యాద లన్నియుఁ జేసినట్లె యనుకొనుము. ఇప్పు డిక్కడ నిలుచుటకు వీలుకాదు. మీయింటికి నేను వచ్చిన నొకటి, రాకున్న నొకటి కాదు. ప్రీతియే చాలును. నేను శీఘ్రముగా మాయూరికిఁ బోవలయును. దయచేసి త్రోవ చూపి, నన్నుఁ బంపుము.

ఉ. ఏ నిఁక నిల్లు సేరుటకు నెద్ది యుపాయము ? మీమహత్త్వము
ల్మానిని ! దివ్యముల్ ; మదిఁ దలంచిన నెందును మీ కసాధ్యము
ల్గానము; గాన తల్లి! ప్రజలన్ ననుఁ గూర్పు; మటన్న లేఁతన
వ్వాననసీమఁ దోఁప ధవళాయతలోచన వాని కిట్లనున్. 49

టీ. ఏన్ = నేను; ఇఁకన్ = ఇఁకమీఁద; ఇల్లుసేరుటకున్ = మాయిల్లుచేరుటకు; ఉపాయము = మార్గము; ఎద్ది ? మానిని = ఓ మానవతీ ! మీమహత్త్వముల్ = మీప్రభావములు; దివ్యముల్ = దేవసంబంధమైనవి. మదిన్ = మనస్సునందు; తలంచినన్ = మీరు తలఁచిన పక్షమున; ఎందును = ఎక్కడను; మీకు; అసాధ్యముల్ = సాధింపరానివి; కానము = ఉన్నట్లు కనుఁగొనము. కాన = కాఁబట్టి, తల్లి! = ఓ యమ్మా! ప్రజలన్ = నావారైన జనులను; ననున్ = నన్నును; కూర్పుము = చేర్చుము; అటన్న = అనఁగా; ధవళాయతలోచన = తెల్లనై (అనఁగా తెల్లని కాంతులు గలవై), విశాలములైన కన్నులుగలదైన వరూథిని; లేఁతనవ్వు=చిఱునవ్వు; ఆననసీమన్ =

ముఖప్రదేశమునందు; తోఁపఁగ = కనఁబడఁగా - చిఱునవ్వునవ్వి యనుట; వానికిన్ = ఆ ప్రవరునితో; ఇట్లనున్.

తా. అమ్మా! మీరు దేవతలు గనుక మీ ప్రభావములు దొడ్డవి. ఏ కార్యములైనను మీరు చేయఁదలఁచినపక్షమునఁ దప్పక చేయఁగలరు. మీ కసాధ్యములు లేవు. కాఁబట్టి యిప్పుడు నేను నాయిల్లుచేరునట్టి యుపాయము నాకుఁ దెలిపి, నన్ను నావారితోఁ జేరునట్లు చేయుము. అనఁగానే వరూథిని చిఱునవ్వు నవ్వుచు నతనితో నీవిధముగాఁ బలికెను.

ఉ. ఎక్కడి యూరు? కాల్ నిలువ ♣ కింటికిఁ బోయెద నంచుఁ బల్కె దీ;
వక్కట! మీకుటీరనిల ♣ యంబులకున్ సరి రాకపోయెనే
యిక్కడి రత్నకందరము ♣ లిక్కడి నందనచందనోత్కరం
బిక్కడి గాంగసైకతము ♣ లిక్కడి యీ లవలీనికుంజముల్? 50

టీ. ఎక్కడి యూరు? = ఊరనఁగా నెక్కడిది? - మీయూరిలో నేమున్నదనుట. కాల్నిలువక = కాలూని నిలువనోపక; ఈవు = నీవు; ఇంటికిఁబోయెదను; అంచున్ = అని; పల్కెదు = చెప్పెదవు; అక్కట! = అయ్యో! ఇక్కడిరత్నకందరములు = ఇక్కడఁ గల మణిమయములయిన గుహలును; ఇక్కడి...త్కరంబు - ఇక్కడి; నందన = ఉద్యానవనములలోని; చందన = గందపుమ్రాఁకులయొక్క; ఉత్కరంబు = సమూహమును; ఇక్కడి గాంగసైకతములు = ఇచ్చటఁగల గంగానదిలోని యిసుకతిన్నెలును; ఇక్కడి యీ లవలీ నికుంజముల్ = ఇచ్చటఁగల యీ వెన్నెలతీగ లల్లుకొన్న పొదరిండ్లును; మీ కుటీరనిలయంబులకున్ = మీరుండెడి గుడిసెలతో; సరిరాకపోయెనే? = సమానములు కాకపోయెనా?

తా. ఓ బ్రాహ్మణుఁడా! ఊరికిఁబోవలయు ననియు, నిల్లు చేరవలె ననియు నేల కలవరించెదవు? మీ యూ రేమి యంత హెచ్చైనదా? ఇక్కడ నుండెడి యీ రత్నములతో నిండిన గుహలు, గందపుమ్రాఁకులతోడి యుద్యానవనములు, గంగానదిలోని యిసుకతిన్నెలు, వెన్నెలతీగ లల్లుకొన్న పొదరిండ్లు నివి యన్నియు మీరు వసించునట్టి యక్కడి గుడిసెలతో సరిపోలఁజాలవా?

ఉ. నిక్కము దాఁప నేల? ధర ♣ ణీసురనందన! యింక నీపయిం
జిక్కె మనంబు నాకు; నను ♣ జిత్తజుబారికి నప్పగించెదో!
చొక్కి మరందమద్యముల ♣ [1]సూరెలఁ బాటలు పాడు తేంట్ల సొం
పెక్కినయల్ల[2] పూవుఁబొద ♣ రిండ్లను గౌఁగిట గారవించెదో! 51

టీ. ధరణీసురనందన! = ఓ బ్రాహ్మణకుమారా! ఇంకన్ = ఇంకను; నిక్కము = నిజమును; దాఁపనేల? = దాఁచిపెట్టనేల? - చెప్పక మనసులోనే యుంచుకొన్న ప్రయోజనము లేదనుట. నాకు; నీపయిన్ = నీమీఁద; మనంబు చిక్కెన్ = మనసు తగిలెను. ననున్ = నన్ను; చిత్తజుబారికిన్ = మన్మథునిబాధకు; అప్పగించెదో? = ఒప్పగించెదవో - లోఁబఱచిపోయెదవో; మరందమద్యములసూరెలన్ = పూఁదేనెయనెడి సారాయియొక్క కొల్లలచేత - మితిలేక దొరకు పూఁదేనెలను ద్రాగుటలచేత; చొక్కి = పారవశ్యమునొంది; పాటలుపాడు తేంట్లన్ = గానముచేయుచున్న తుమ్మెదలచేత; సొంపు ఎక్కిన = మనోజ్ఞములైన; అల్ల పూవుఁబొదరిండ్లన్ = ఆ కనఁబడు పువ్వులతోడి పొదరిండ్లయందు; కౌఁగిటన్ = ఆలింగనముచేత; గారవించెదో = సమ్మానించెదవో.

1. చూఱల. పా. 2. యట్టి. పా.

తా. ఓ బ్రాహ్మణుఁడా! నామనసులోని మాట దాఁపక చెప్పెద. నీయందు నాకు మోహము పుట్టె. నీవిఁక నన్ను మన్మథునిబాధకు లోఁబఱచి వెడలిపోయెదవా ? లేక పూఁదేనెలు కొల్లలుగాఁ ద్రాగి, మైమఱచి, ఝంకారము చేయుచున్న తుమ్మెదలచే మనసునకు నింపు పుట్టించుచుండెడి యీ పూచిన పొదరిండ్లలోఁ జేరి, యాలింగనసుఖ మిచ్చి యాదరించెదవా ? చెప్పుము.

క. అనుటయుఁ బ్రవరుం డిట్లను, వనజేక్షణ! యిట్లు వలుక ♦ వరుసయె? వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ, జనునే కామింప ? మది వి ♦ చారము వలదే?

టీ. అనుటయున్ = అని వరూథిని యనఁగానే; ప్రవరుండు; ఇట్లనున్; వనజేక్షణ ! = తామరలవంటి కన్నులుగల యో చిన్నదానా! ఇట్లు = ఈ విధముగా; పలుకన్ = మాటలాడుట; వరుసయె ? = క్రమమా ? వ్రతులై = ఉపవాసాదివ్రతములు జరుపువారై; దినములు = దినములను-కాలమును; కడపెడు విప్రులన్ = జరపునట్టి బ్రాహ్మణులను; కామింపన్ = కలయఁగోరుట; చనునే ? = తగునా ? మదిన్ = మనసునందు; విచారము = ఇది యుక్త, మిది యయుక్త మను నాలోచన; వలదే ? = ఉండవలదా ?

ఉ. వేలిమియున్ సురార్చనయు ♦ విప్రసపర్యయుఁ జిక్కె ; భుక్తికిన్
వేళ యతిక్రమించె ; జన ♦ నీజనకుల్ కడు వృద్ధు, లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురు ♦ సూచుచు నుండుదు; రాహితాగ్ని నేఁ;
దూలు సమస్తధర్మములుఁ ♦ దొయ్యలి! నేఁ డిలు సేరకుండినన్. 53

టీ. తొయ్యలి ! = ఓ చిన్నదానా ! - వరూథినీ ! వేలిమియున్ = వైశ్వదేవము మొదలుగాఁగల హోమకార్యమును; సురార్చనయున్ = దేవతారాధనమును; విప్రసపర్యయున్ = బ్రాహ్మణ పూజయును; చిక్కెన్ = తప్పెను. భుక్తికిన్ = భోజనమునకును; వేళ అతిక్రమించెన్ = సమయము మించిపోయెను. జననీజనకుల్ = నా తలిదండ్రులు; కడున్ వృద్ధులు = మిక్కిలి ముసలివాండ్రు. ఆఁకటన్ = ఆఁకలిచేత; సోలుచున్ = లేవలేక పడిపోవుచు; చింతతోన్ = విచారముతో; ఎదురుసూచుచున్ = నారాక యెదురు చూచుచు; ఉండుదురు. నేన్ = నేను; ఆహితాగ్నిన్ = అగ్నిహోత్రవ్యాపారము లుంచుకొని యుండువాఁడను. నేఁడు = ఈ దినము; ఇలు సేరకుండినన్ = ఇల్లుచేరనివాఁడనై యున్నయెడల; సమస్తధర్మములున్ = ఎల్ల విహితాచారములును; తూలున్ = చెడును.

ఉ. నావుడు విన్నఁబాటు వద ♦ నంబున నించుక దోఁపఁ బల్కె 'నో
భావజరూప! యిట్టి యెల ♦ ప్రాయము వైదికకర్మనిష్ఠలం
బోవఁగ నింక భోగములఁ ♦ బొందుట యెన్నఁడు? యజ్ఞకోటులం
బావను లౌటకున్ ఫలము ♦ మా కవుఁగిళ్ల సుఖించుటే కదా ! 54

టీ. నావుడున్ = అని ప్రవరుఁ డనఁగా; వదనంబునన్ = ముఖమునందు; ఇంచుక = కొంచెము; విన్నఁబాటు = చిన్నఁబోయినతనము; తోఁపన్ = కనుపట్టఁగా; పల్కెన్ = వరూథిని పలికెను. ఓ భావజరూప ! = మన్మథునిరూపమువంటి మోహనరూపము గల ఓ బ్రాహ్మణుఁడా ! ఇట్టి యెలప్రాయము = ఇటువంటి లేఁతవయస్సు; వైదికకర్మనిష్ఠలన్ = వేదవిహితములయిన క్రియలను నడపుటయందు; పోవఁగన్ = కడచిపోఁగా; ఇంకన్; భోగములన్ = సుఖములను; పొందుట = అనుభవించుట; ఎన్నఁడు ? = ఎప్పుడు ? యజ్ఞకోటులన్ = అగ్నిష్టోమము

మొదలుగాఁగల యజ్ఞసమూహములచేత; పావనులు ఔటకున్ = పరిశుద్ధు లగుటకు; ఫ
ప్రయోజనము; మాకవుఁగిళ్లన్; సుఖించుటే (పా. సుఖింపనే) కదా! = సుఖము నొంది
కదా! - సుఖించుటయే యనుట.

తా. అనఁగా విని వరూథిని ప్రవరునితో 'ఓ బ్రాహ్మణుఁడా! చక్కఁదన
గూడిన యిటువంటి లేఁతప్రాయమును వ్యర్థముగా వైదిక క్రియలయందుఁ బోఁగొట్టి,
సుఖము ననుభవించుట యెప్పటికి? మీబోఁటివా రనేకములయిన యజ్ఞములు చేసి పరిశుద్
యప్సరసలమైన మాతోఁగూడి సుఖించుటకే కాని మఱియెందులకును గాదు' అనెను.

సీ. సద్యోవినిర్భిన్న ౹ సారంగనాభికా, హృతమై పిసాళించు ౹ మృగమదంబు
కసటువో బీటెండఁ ౹ గరఁగి కఱ్ఱుల నంటి, గమగమ వలచు చొ ౹ క్కపు
పొరలెత్తి ఘనసార ౹ తరువులఁ దనుఁదాన, తొరఁగిన పచ్చక ౹ ప్పురపుసి
గొజ్జంగిపూఁబొదల్ ౹ గురియంగఁ బటికంపు, దొనలనిండినయట్టి ౹ తుహినజ
తే. వివిధకుసుమ కదంబంబు ౹ దివిజతరుజ
మృదులవసనఫలాసవా ౹ మేయరత్న
భూషణంబులు గల విందు ౹ భోగపరుఁడ
వయి రమింపుము ననుఁ గూడి ౹ యనుదినంబు.

టీ. ఇందున్ = ఇక్కడ; సద్యో...హృతమైన - సద్యః = అప్పుడే; వినిర్భిన్న =
బాఁటిన; సారంగ = కస్తూరిమెకముయొక్క; నాభికా = పొక్కిటివలననుండి; హృతమై = ప
బడినదై - తీసికోఁబడినదై; పిసాళించు మృగమదంబు = పరిమళించుచున్న కస్తూరియు;
పోన్ = మఱికి తొలఁగిపోవునట్లుగా; బీటెండన్ = తీక్ష్ణమయిన యెండచేత; కరఁగి =
ద్రవించి; కఱ్ఱులన్ = కఱ్ఱపుల్లలయందు; అంటి = అంటుకొని; గమగమ...జవాజి - గమ
గమగమయని; వలచు = పరిమళించునట్టి; చొక్కపు జవాజి = స్వచ్ఛమయిన జవ్వాజి
పొరలెత్తి = పైపట్టు లూడి; ఘనసారతరువులన్ = కర్పూరపు టరఁటిచెట్లనుండి; తనుఁ
తనకుఁదానే - ఒకరి ప్రయత్నము లేకయే; తొరఁగిన...సిరము - తొరఁగిన = క్రిందరాలిన
కప్పురపు = పచ్చకర్పూరముయొక్క; సిరము = పొడియును; (పా. రజము.) గొజ్జంగిపూఁబొ
పన్నీరు పూవుఁబొదలు; కురియంగన్ = వర్షింపఁగా - ధారలుధారలుగాఁ గార్చుటచేత; ప
దొనలన్ = స్ఫటికపు రాతినేలలయందలి దొనలయందు; నిండినయట్టి తుహినజలము =
యుండెడి పన్నీరును; వివిధకుసుమకదంబంబు=నానావిధములయిన పువ్వులసమూహమును; ది
భూషణంబులు - దివిజతరుజ = దేవవృక్షముల (కల్పవృక్షముల) వలనఁ గలిగిన; మృదుల =
నైన; వసన = వస్త్రములును; ఫల = పండ్లును; ఆసవ = పానద్రవ్యములును; అమేయ =
యని యూహించి చెప్పశక్యముగాని - మేరలేని; రత్నభూషణంబులు = రత్నములు పొ
సొమ్ములును; కలవు. భోగపరుఁడవై = సుఖమునం దాసక్తిగలవాఁడవై; అనుదినంబు = ప్ర
మును; ననున్ కూడి = నన్ను కలసి; రమింపుము = అనుభవింపుము.

తా. ఓ బ్రాహ్మణుఁడా! భోగవస్తువు లయిన కస్తూరి, జవాజి, పచ్చకర్పూరము, ప
పువ్వులు, పండ్లు, మృదుతరములయిన వస్త్రములు, రత్నపుసొమ్ములు; త్రాగఁదగిన మద
నివన్నియు మిక్కిలి శ్రేష్ఠములైనవి యిక్కడ సమృద్ధములుగా నున్నవి. వానివలని భో
నెల్ల నాతోఁగూడి యిక్కడ ప్రతిదినమును అనుభవించుచుండుము. అలం. ఉదాత్తము.

క. అంధునకుఁ గొఱయె వెన్నెల?, గంధర్వాంగనలపొందు ఽ గాదని సంసా
రాంధువునఁ [1]గూలె దకట! ది, వాంధము వెలుఁగు గని గొంది ఽ నడఁగినభంగిన్.

టీ. అంధునకున్ = గ్రుడ్డివానికి; వెన్నెల = చంద్రప్రకాశము; కొఱయె? = ప్రయోజకమా ? ఉపయోగింప దనుట. అక్కట ! = అయ్యో ! దివాంధము = పగలు కన్నుగాననిదైన గ్రుడ్లగూబ; వెలుఁగు = వెలుతురును; కని = చూచి; గొందిన్ = చీఁకటిమూలయందు; అడఁగిన భంగిన్ = ముడుఁగుకొన్నరీతిని; గంధర్వాంగనలపొందు = గంధర్వస్త్రీలమయిన మా కూటమి; కాదని = సరిపడ దని; సంసారాంధువునన్ = సంసారమనెడి నూతియందు; కూలెదు = పడుచున్నావు.

తా. గ్రుడ్డివానికి వెన్నెల పనికిరానియట్లు మావలని సంభోగసుఖ మెఱుఁగని నీకు నా మాటలు పనికిరాని వయ్యెను. నీవు, వెలుతురు చూడనొల్లక గ్రుడ్లగూబ చీఁకటిక్రమ్ముకొన్న యిఱుకుమూలలో దాఁగునట్లు గంధర్వస్త్రీలమయిన మా కూటమి యొల్లక సంసారమనెడి నూతిలోఁ బడియుండఁ గోరుచున్నావే? అయ్యో! యిది తగునా? అలం. ప్రతివస్తూపమ, ఉపమ, రూపకమును.

ఉ. ఎన్నిభవంబులం గలుగు ఽ నిక్షుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి ఽ కేలఁ గపోలము లూఁది [2]చూపులన్
విన్నఁదనంబు తోఁపఁ గను ఽ వేఁదు[3]ఱునం బయిగాలి సోఁకినన్
వెన్నవలెం గరంగు నలి ఽ వేణులఁ గౌఁగిటఁ జేర్చుభాగ్యముల్ ? 57

టీ. ఇక్షు...ఖిన్నతన్ - ఇక్షుశరాసన = చెఱకువింటివాఁ డయిన మన్మథునియొక్క; సాయక = బాణములయొక్క; వ్యథా = బాధవలననైన; ఖిన్నతన్ = దుఃఖముచేత; వాడి = నవకముచెడి; వత్తలయి = వరుగులై - మిక్కిలి కృశించి; కేలన్ = చేతులయందు; కపోలములు = చెక్కిళ్లు; ఊఁది = చేర్చి; చూపులన్ = చూపులయందు; విన్నఁదనంబు = దీనభావము; తోఁపన్ = కానరాఁగా; కనువేఁదుఱునన్ = చూపుపిచ్చిచేత - చూచుటవలని యత్యంతాపేక్ష చేత; పయిగాలిసోఁకినన్ = (తాము వలచినపురుషుని) మీఁదిగాలి తగిలినను - ఏ ప్రయత్నమును జేయ నక్కఱలేక యత్యంతసులభముగా ననుట; వెన్నవలెన్ = నిప్పుసోఁకినవెన్నవలె; కరంగు నలివేణులన్ = మనసుకరఁగునట్టి స్త్రీలను - అనురక్తలయినట్టి స్త్రీలను - అతిసులభముగా మనస్సు కరఁగి తమంతట వశంవదలగునట్టి స్త్రీల ననుట. కౌఁగిటన్ = భుజాంతరమునందు; చేర్చుభాగ్యముల్ = చేర్చుకొనునట్టి యదృష్టములు; ఎన్నిభవంబులన్ = ఎన్నిజన్మములందు; కలుగున్ ? = కలుగును ? అనేక జన్మములెత్తి తపస్సుచేసినను లభింపనేర వనుట.

తా. ఎవ్వరికిఁగాని తమ్ముఁ జూచి మోహించి మన్మథబాధచే మిక్కిలి కృశించి చింతచేఁ జెక్కిటఁ జెయ్యి సేర్చి కోర్కి యీడేర్ప వేఁడుకొనునట్లు దీనదృష్టుల నిగుడ్చుచును, దమ్ముఁ జూచుటవలనఁ బిచ్చియెత్తినట్లు మిక్కుటమైన యపేక్ష యుల్లసిల్లుటచేఁ దమగాలి సోఁకినంతన కరఁగియు, నతిసులభముగా వశంవద లగునట్టి స్త్రీలను గౌఁగిటఁ జేర్చి సుఖించునట్టి యదృష్టము పెక్కు జన్మము లెత్తినను లభింపదు.

---

1. బడియె. పా. 2. మాటలన్. పా. 3. ఱునున్. పా.

క. కుశలతయే వ్రతముల నగు, నశనాయాస[1]మున నింద్రియ నిరోధమునం
గృశుఁడ వయి యాత్మ నలఁచుట, సశరీరస్వర్గసుఖము సమకొని యుండన్.'

టీ. సశరీరస్వర్గసుఖము = ఈ శరీరముతోనే (అనుభవించునట్లు) స్వర్గమునందలి సుఖము; సమకొని = సిద్ధించి; ఉండన్ = ఉండఁగా; వ్రతములన్ = ఉపవాసాదినియమములతోఁ జేయు పుణ్యకర్మములచేత; అగు నశనాయాసమునన్ = అగునట్టి యాహార (వర్జనమువలని) శ్రమచేతను; (పా. అశనాయాసపీడన్.) ఇంద్రియనిరోధమునన్ = చక్షురాదులయిన యింద్రియములను యథేచ్ఛముగా విషయములందుఁ బ్రవర్తింపనీక నిర్బంధించుటచేతను; కృశుఁడవయి = చిక్కి-పోయినవాఁడవై; ఆత్మన్ = జీవాత్మను; అలఁచుట = శ్రమపెట్టుట; కుశలతయే? = నేర్పరితనమా ?

తా. ఈ దేహము విడిచినపిమ్మట నిప్పుడు చేయునట్టి పుణ్యకర్మముల ఫలముచేత లభింపఁబోవు స్వర్గసుఖ మీ శరీరముతో నున్నప్పుడే యనాయాసముగా లభించుచుండఁగా వ్యర్థముగ వ్రతచర్యలవలని యాయాసమును బొందుట యొక నేర్పరితన మగునా? కా దనుట. నే నప్సరసను గనుక నాతోడిసంభోగమే స్వర్గభోగ మని సంబంధము. అలం. కావ్యలింగము.

తే. అనినఁ బ్రవరుండు 'నీ వన్న యర్థ మెల్ల
నిజము కాముకుఁ డైనవానికి; నకాముఁ
డిది గణించునె? జలజాక్షి యెఱిఁగితేని
నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్ము. 59

టీ. అనినన్ = అని యిట్లు వరూథిని యనఁగా; ప్రవరుఁడు; జలజాక్షి! = ఓ చిన్నదానా ! నీవు; అన్న యర్థము = చెప్పిన విషయము; ఎల్లన్ = అంతయు; కాముకుఁడు = విషయాపేక్షగలవాఁడు; ఐనవానికిన్ = అయినట్టి పురుషునికి; నిజము = (అపేక్షితమగుట) సత్యము. అకాముఁడు = విషయాపేక్షలేనివాఁడు; ఇది = నీవు చెప్పిన విషయమును; గణించునె? = లెక్క-సేయునా ? - నీవలనఁగలుగు స్వర్గభోగమునుగూడ లక్ష్యపెట్టఁ డనుట. ఎఱిఁగితేని = నీవెఱిఁగియున్నపక్షమున; నగరమార్గంబున్ = మా పట్టణమునకుఁ బోవు త్రోవను; చూపి; పుణ్యమునఁ బొమ్ము = పుణ్యముఁగట్టుకొమ్ము - దానివలని పుణ్యమును సంపాదించుకొమ్మనుట.

తా. ఓ వరూథినీ ! నీవు చెప్పినదంతయు విషయాపేక్షకలవాని ధర్మముగాని యా యపేక్షలేనివాని ధర్మము కాదు. నాకు స్వర్గసుఖాపేక్ష లేదు గనుక వ్యర్థముగా నిట్టిమాటలచేతఁ బ్రొద్దుపుచ్చకుము. నీకుఁ దెలిసియున్నయెడల మాయూరిదారి చూపుము. లేదా యూరక పొమ్మనుము.

క. బ్రాహ్మణుఁ డింద్రియవశగతి, జిహ్మచరణైకనిపుణ చిత్తజ నిశితా
జిహ్మగములపాలై చెడు, బ్రహ్మానందాధిరాజ్య పదవీచ్యుతుఁడై.' 60

టీ. బ్రాహ్మణుఁడు = బ్రహ్మజ్ఞానసంపన్నుఁ డయిన ద్విజుఁడు; ఇంద్రియవశగతిన్ = ఇంద్రియములకు లోఁబడినవాఁడగుటచేత; జిహ్మ...పాలై - జిహ్మచరణ = వక్రవ్యాపారములు చేయుటయందు; ఏక = ముఖ్యముగా; నిపుణ = నేర్పుగలవాఁడైనట్టి; చిత్తజ = మన్మథుని

1. పీడ. పా.

యొక్క; నిశిత = వాఁడియయిన; అజిహ్మగములపాలై = బాణముల కధీనుఁడై; బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁడై - బ్రహ్మానంద = పరమాత్మానుభవమువలని సంతోషముయొక్క; అధిరాజ్య = అధిష్ఠించిన ప్రభుత్వముయొక్క; పదవీ = మార్గమువలననుండి; చ్యుతుఁడై = జారినవాఁడై - దిగఁబడినవాఁడై; చెడుఁన్ = నశించును. అనఁగా బ్రాహ్మణుఁ డగువాఁడెవఁడు విషయాపేక్షగలవాఁ డగునో, వాఁడు మోక్షమార్గమువలన భ్రష్టుఁడయి చెడిపోవును. అలం. కావ్యలింగము.

వ. అనిన నత్తెఱవ యక్కఱకరిపలుకుల నులికి గతిగతిం గఱవఁ గరకరిం జెఱకువిలుకాఁడు పరగించు విరిదమ్మిగొరకలు నెఱకులఁ జుఱుకుచుఱుక్కనం గాఁడినం గడుం గెరలి, పరిణతవివిధవిబుధతరు జనిత మధుర మధు రసం బాను మదంబు నదటునం జిదిమిన నెఱుంగక మదనహరునైనఁ [1]జదురునం గదియ గమకించు తిమురునం గొమిరెప్రాయంపు మదంబునను ననన్యకన్యాసామాన్యలావణ్యరేఖామదంబునను నొంటిపాటునం గంటికింబ్రియుండై తంగేటిజుంటిచందంబునం గొంటుఁదనం బెఱుంగక [2]కుఱుంగట నున్న యమ్మహీసురవరకుమారుతారుణ్యమాధుర్యంబులంజేసి తన వైదగ్ధ్యంబు మెఱయఁ గలిగె నని పల్లవించునుల్లంబునుల్లాసంబునం గదురుమదంబున నోసరించక, చంచలదృగంచలప్రభలతని ముఖాంబుజంబునం బొలయ, వలయమణిగణచ్ఛాయాకలాపంబులుప్పరం బెగయఁ గొప్పు చక్కం జెక్కుచు,జక్కవగిబ్బలుంబోని గబ్బిగుబ్బలం జొబ్బిల్లు కుంకుమరసంబునం బంకిలంబులగు హారముక్తాతారకంబుల నఖకోరకంబులన్ గీఁటి తీరువడంజేయుచుఁ, బలితవనతరుకుసుమకేసరంబులు రాల్చునెపంబునం బయ్యెద విదిల్చి చక్క నవరించుచు, నంతంతం బొలయుచెలులం దలచూపక యుండఁ దత్తఱంబునంజేసి బొమముడిపాటుతో మగిడిమగిడి చూచుచుఁ జిడిముడిపాటు చూపుల నంకురించుజంకెనల వారించుచుం, జేరి యిట్లనియె. 61

టీ. అనినన్ = ప్రవరుఁ డిట్లు పలుకఁగా; అత్తెఱవ = ఆ స్త్రీ - వరూథిని; అక్కఱకరిపలుకులకున్ = ఆ ప్రవరుని కఠినపుమాటలకు; ఉలికి = బెదరి; చెఱకువిలుకాఁడు = మన్మథుఁడు; కరకరిన్ = క్రూరభావముతో; గతిగతిం గఱవన్ = ఆక్కతో ఆక్క పెనఁగొనునట్లు - ఎడతెఱపిలేకుండ; పరగించు = ప్రయోగించునట్టి; విరిదమ్మిగొరకలు = విరిసిన తామరబాణములు; నెఱఁకులన్ = మర్మస్థానములయందు; చుఱుకుచుఱుక్కనన్ = చుఱుకుచుఱుకుమనునట్లుగా - నొప్పిపుట్టునట్లుగా; కాఁడినన్ = నాటుకొనఁగా; కడుం గెరలి = మిక్కిలి రేఁగి; పరిణత...రసంబు - పరిణత = పరిపక్వమైన; వివిధ = బహువిధములయిన; విబుధతరు = దేవతావృక్షములవలన; జనిత = పుట్టిన; మధుర = తియ్యని; మధురసంబు = మద్యమును; ఆను...టునన్ - ఆను మదంబు = త్రాగిన మత్తుయొక్క; అదటునన్ = ఉద్ధతిచేత; చిదిమినన్ = గిల్లినను; ఎఱుంగక = తెలియక; మదనహరునైనన్ = మన్మథుని హరించిన శివునైనను - ఇంద్రియనిగ్రహముగల శివునంతవానినైన ననుట; చదురునన్ = చతురత్వముచేత; కదియన్ = తారసింప;

1. బదరునం. పా. 2. కుఱుంగట. పా.

గమకించు తిమురునన్ = యత్నించునట్టి కండగరువము చేతను; కొమిరె ప్రాయంపు మదంబునన్ = యౌవనప్రాయమువలని మదముచేతను; అనన్య...మదంబునన్ - అనన్యకన్యాసామాన్య = ఇతర కన్యలకు సాధారణముగా నుండనట్టి; లావణ్యరేఖా = దేహకాంతి సౌష్ఠవముయొక్క; మదంబునన్ = క్రొవ్వుచేతను; ఒంటిపాటునన్ = ఒంటరిపాటున; కంటికిన్ = తనచూపునకు; ప్రియుండై = ఇంపైనవాఁడై; తంగేటిజుంటిచందంబునన్ = తంగేడుచెట్టునందుఁబెట్టఁబడిన తేనెపెరవలె; గొంటుఁదనంబు = ధూర్తత్వము; ఎఱుంగక = తెలియక - లేక; కుఱుంగటన్ = సమీపమునందు; ఉన్న...చేసి - ఉన్న = ఉండిన; అమ్మహీసురవరకుమారు = బ్రాహ్మణకుమారశ్రేష్ఠుఁడయిన యా ప్రవరునియొక్క; తారుణ్యమార్ధ్యంబులంజేసి = యౌవనముచేతను, చక్కఁదనముచేతను - వయసును, చక్కఁదనమును గలిగియుండుటచేత; తనవైదగ్ధ్యంబు = తనదైన నేర్పు; మెఱయన్ = ప్రకాశింప; కలిగెనని = అనువుకలిగెనని; పల్ల...బునన్ - పల్లవించు = చిగిరించుచున్న - పుట్టుచున్న; ఉల్లంబునుల్లాసంబునన్ = మనస్సులోని సంతోషముచేత; కదురు మదంబునన్ = కలుగుచున్న గర్వముచేతను; ఓసరించక = ఇటునటుఁ దొలఁగక; చంచల దృగంచలప్రభలు = చలించుచున్న కన్నుంగొనలకాంతులు; అతని ముఖాంబుజంబునన్ = ఆ ప్రవరుని ముఖకమలమునందు; పొలయన్ = ప్రసరింపఁగా; వలయ...కలాపంబు - వలయ = ముంజేతికడియములయొక్క; మణిగణ = రత్నసమూహములయొక్క; ఛాయా = కాంతులయొక్క; కలాపంబులు = సమూహములు; ఉప్పరంబెగయన్ = మీఁదికి వ్యాపింపఁగా; కొప్పు = వీడిన కొప్పును; చక్కన్ = చక్కఁగా; చెక్కుచున్ = చెరువుచు; జక్కవగిబ్బలుంబోని = లేఁబ్రాయపుఁ జక్రవాకపక్షులవంటి; గబ్బిగుబ్బలన్ = నిక్కుఁ జన్నులందుండి; జొబ్బిల్లు కుంకుమరసంబునన్ = స్రవించుచున్న కుంకుమపువ్వుతోడి చందనద్రవముచేత; పంకిలంబులు = బురద యంటుకొన్నవానివంటివైన; హారముక్తాతారకంబులు = ముత్యాలపేరుయొక్క నక్షత్రములవంటి ముత్యములను; నఖకోరకంబులన్ = మొగ్గవంటి గోళ్లచేత; గీఱి = గీఁచి; తీరుపడంజేయుచున్ = చక్కఁగా దిద్దుకొనుచు; పతిత...కేసరంబులు - పతిత = తనపై రాలిన; వనతరుకుసుమ = అడవిమ్రాఁకుల పువ్వులయొక్క; కేసరంబులు = కింజల్కములను; రాల్చు నెపంబునన్ = దులుపుకొనుచున్న నెపముచేత; పయ్యెద = పయఁట; విదిల్చి = విదిలించి; చక్కసవరించుచున్ = చక్కఁగా దిద్దుకొనుచు; అంతంతన్ = అంతటంతట; పొలయు చెలులన్ = సమీపింపవచ్చు చెలికత్తెలను; తలచూపకయుండన్ = తల కనఁబఱుపకుండునట్లు - తనయెదుటికి రాకుండునట్లనుట; తత్తఱంబునంజేసి = తొందరచేత; బొమముడిపాటుతోన్ = కనుబొమ్మలు ముడిపడియెడి సంజ్ఞతో; మగిడిమగిడి చూచుచున్ = తిరిగితిరిగి చూచుచును; చిడిముడిపాటుచూపులన్ = తొట్రుపడుచున్న చూపులందు; అంకురించు జంకెనలన్ = పొటమరించునట్టి బెదరింపులచేత; వారించుచున్ = ఆ చెలికత్తెలను దగ్గఱగా రాకుండ నిలుపుచు; చేరి = ప్రవరుని దగ్గఱి; ఇట్లనియెన్ = ఇట్లు పలికెను.

శా. ఎందే డెందము గందళింప[1] రహిచే, నే[2]కాంతతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప [3]నందిందుఁ బో
కెందే నింద్రియముల్ [4]సుఖించఁ గను, నా యింపే పరబ్రహ్మ; 'మా
నందో బ్రహ్మ' యటన్న ప్రాఁజదువు [5]నాంతంబర్థ మూహింపుమా! 62

1. కందళించు. పా. 2. నేకాగ్రతన్. పా. 3. నెందెందు. పా. 4. సుఖంబు. పా. 5. నంతర్బుద్ధి. పా.

టీ. ఎందేన్ = ఏ విషయమునందు; డెందము = మనస్సు; రహిచేన్ = రక్తి చేత; కందళింపన్ = చిగుర్పగా - వికాసము వహింపగా; ఏకాంతతన్ = నిశ్చలత్వము చేత; కుంభగత... శ్రీ - కుంభగత = కుండను బొందిన - కుండలోపల సుంచఁబడిన; ప్రదీపకళికా = దీపపుమొగ్గ యొక్క; శ్రీ = కలిమి; తోఁపన్ = కనఁబడఁగా; నిర్వృతిన్ = ఊఱటను; చెందున్ = పొందునో; (దీనికిఁ గర్త డెందము.) ఎందేన్ = ఏ విషయమునందు; ఇంద్రియములు = త్వక్కు చక్షుస్సు మొదలయిన యింద్రియములు; అందిందున్ పోక = అటునిటు పోక; సుఖించఁగనున్ = సుఖపడునో; ఆ యింపే = ఆ విషయానందమే; పరబ్రహ్మము = పరతత్త్వము; ఆనందో బ్రహ్మ = ఆనందమే బ్రహ్మము; అటన్న = అని పలుకు; ప్రాఁజదువునాంతంబర్థము = వేదవాక్యపంక్తికిఁ గల యర్థమును; ఊహింపుమా ! = విచారింపుమా.[1]

తా. ఏ విషయమునందు మనస్సు, నింద్రియములును జలింపక, వికాసమును, నూఱుటను వహించి సుఖించునో, యా విషయమువలని యానందమే పరబ్రహ్మమని వేదములు ప్రతిపాదించుచున్నవి. ఆ శ్రుతుల యర్థములు నీలో నీవే విచారింపుము. అట్టి బ్రహ్మానందము సిద్ధమై యుండఁగా వేఱేదో బ్రహ్మానందము తప్పిపోవు నని తలఁచి వెనుదీసెద వేల ?

తే. అనుచుఁ దన్నొడఁబఱుచు నయ్యమరకాంత
తత్తఱముఁ జూచి యాత్మ నతండు దనకు
సిగ్గు వెగటును బొడమ నిస్పృహతఁ దెలుపు
నొక్క చిఱునవ్వు నవ్వి యయ్యువిద కనియె. 63

టీ. అనుచున్ = ఇట్లు చెప్పుచు; తన్ను; ఒడఁబఱుచు...తత్తఱమున్ - ఒడఁబఱుచు = సమ్మతింపఁజేయునట్టి; అయ్యమరకాంత = ఆ దేవతాస్త్రీయొక్క; తత్తఱమున్ = తొట్రుపాటును; చూచి; అతండు = ఆ ప్రవరుఁడు; ఆత్మన్ = మనసునందు; తనకు; సిగ్గున్; వెగటును = విరసత్వమును; పొడమన్ = పుట్టఁగా; నిస్పృహతన్ = విరక్తిని; తెలుపు నొక్క చిఱునవ్వు = తెలియఁజేయునట్టి యొకవిధమయిన చిఱునవ్వు; నవ్వి; అయ్యువిదకున్ = ఆ జవరాలితో; అనియెన్ = ఇట్లు పలికెను.

తా. ప్రవరుఁ డట్లు తన్నుఁగలయికకు సమ్మతింపఁజేసెడిమాట లాడుచున్న యా వరూథిని తత్తఱమును జూచి, తనలో సిగ్గును, విరసత్వమును బొంది, విరక్తిని దెలియఁబఱచునట్లుగా నొక చిఱునవ్వు నవ్వి, యీ విధముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను.

శా. ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ గంటిమే ? కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు; మేలోహో ! త్రయీధర్మము

---

1. ఇచట 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్; ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే; ఆనందేన జాతాని జీవంతి; ఆనందం ప్రయన్త్యభిసంవిశంతీతి' అను నుపనిషత్సూక్తి పంక్తి 'ఆనందో బ్రహ్మ' అనుదానిచే సూచితము. ఇచటి యానందమునకు సంభోగమే యర్థము. అన్నింటికి నా సుఖమే మూల మనియు, జీవోత్పత్తి, స్థితుల కదియే మూల మనియు నభిప్రాయము.

ఈ యెడ పెక్కురు విద్వాంసులు తమ యిచ్చవచ్చిన ట్లర్థములు చెప్పిరి. కాని సాధు పాఠానుసారమగు నభిప్రాయమే యిట గృహీతము.

ల్పాపంబుల్ రతి పుణ్యమంచు; నిఁక నే ◆ లా తర్కముల్ ? మో
క్షశ్రీ[1]పాత్యాగమసూత్రపంక్తి [2]కివి పో ◆ మీ సంప్రదాయార్థముల్ !

టీ. ఈ పాండిత్యము = ఈ చదువరితనము; నీకుఁదక్కఁ = నీకుమాత్రమేత యొండేఁ = ఇఁక నెవరియందైనను; కంటిమే ? = చూచితిమా ? కామశాస్త్రోపాధ మన్మథశాస్త్రమునకు ఉపాధ్యాయత్వము చేయుదానవు - కామశాస్త్రము చదివిం నాఁ = అనునట్లుగా; త్రయీధర్మముల్ = వేదవిహితాచారములు; పాపంబుల్ = గలిగించునవి; రతి = సంభోగము; పుణ్యము = సుకృతము; అంచున్ = అని; వచి చెప్పుచున్నావు. మేలు; = మంచిది ! ఓహో ! = సెబాసు ! తర్కముల్ = చర్చ ఏలా ? = ఇంకను ఎందులకు ? అక్కఱ లేదనుట. మోక్ష..పంక్తికిన్ - మోక్షలక్ష్మి సంపదకగు; పాత్యాగమసూత్రపంక్తికిన్ = పాత్యమగు నుపనిషన్మంత్రక్రమమునకు (పా. రీతికి); మీ సంప్రదాయార్థముల్ = మీ యుపదేశపరంపరచే వచ్చిన యర్థములు పురుషార్థసాధకరూపములైన వనుట; ఇవిపో ! = ఇటువంటివే కాఁబోలు ?

తా. ఈ చదువరితనము నీకుఁ దప్ప మతి యొవరికిని లేదు. నీవు కామశాస్త్ర వలె వేదమునందు విధింపఁబడిన ధర్మములు పాపము నిచ్చునవి, సంభోగము పుణ్యమునిచ్చు చెప్పుచున్నావు. ఇది మిక్కిలి బాగుగా నున్నది ! మీపరంపరవారి యుపదేశక్రమమ మోక్షమార్గమును దెలుపునట్టి వేదాంతసూత్రముల కర్థము లిట్టివే కాఁబోలు ! అలం. వ్యాజ

మ. తరుణీ ! రేపును మాపు హవ్యములచే ◆ తం దృప్తుఁ[3]డై వహ్ని స
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుం ◆ గన్ శక్యమే నీకు; నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియము లై ◆ నట్లన్యముల్ గా; వొడ
తిరమే ? చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ ◆ మీసాలపైఁ దేనియల్.

టీ. తరుణీ! = ఓ చిన్నదానా ! రేపును = ప్రాతఃకాలమునందును; మాపున్ కాలమునందును; హవ్యములచేతన్ = హోమద్రవ్యములచేత; తృప్తుఁడై = తని వహ్ని = అగ్నిదేవుఁడు; సత్కరుణాదృష్టిన్ = మంచి దయతోడిచూపుతో; ఒసంగు సౌ ఇచ్చునట్టి సుఖములు; ఎఱుంగన్ శక్యమే ? = తెలిసికొన సాధ్యమా ? - సాధ్య నాకు; అరణుల్ = త్రచ్చి నిప్పును బుట్టించెడి కొయ్యలును; దర్భలున్ = కుశలును; అగ్ని అగ్నిహోత్రములును; ప్రియములు ఐనట్లు = ఇష్టములు అయినరీతిని; అన్యముల్ = కావు; ఒడల్ = ఈ దేహము; తిరమే? = స్థిరమా ? - ఎన్నఁటికిని జెడకయుండునదియ గనుక) ఇట్టి తుచ్ఛసుఖముల్ = ఇటువంటి యల్పభోగములను; చెప్పకు = నా కుపదె మీసాలపైఁదేనియల్ = ఇవి మీసములమీఁద నంటియున్న తేనెవంటివి - అనఁగా ములకుఁ దాఁకించుకొని, యవి నాలుకకు సోఁకినమాత్రముచేతనే యెంతో తేనె తృప్తిగా గ్లెంచుకొనుటవంటి వనుట. అతిస్వల్పములు గాన నిజముగాఁ దృప్తికరములు కాఁవని అలం. వ్యతిరేకము, ప్రతివస్తూపమయు.

చ. అనుటయు మాట లేక హృద ◆ యాబ్జము జల్లన మోము వెల్లనై
కనలుచు నీరుదేఱు తెలి ◆ గన్నుల నాతనిఁ బుల్కుపుల్కునం

1. పథ్యాగమ. పా. 2. కివెపో. పా. 3. తృప్తుఁడౌ. పా.

గనుఁగొని మాటలం దొదవు § గద్గదికం దల యూఁచి యక్కటా!
వనిత తనంతఁ దా వలచి § వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్? 66

టీ. అనుటయున్ = అని ప్రవరుఁ డనఁగానే; మాటలేక = బదులుచెప్పుటకు మాట తోఁచక; హృదయాబ్జము = హృదయకమలము - గుండెకాయ; జల్లనన్ = జల్లుమని యదురఁగా; మోము = ముఖము; వెల్లనై = వెలవెలఁబోయి - తెల్లఁబోఁగా ననుట; కనలుచున్ = తపించుచు; నీరుదేఱు తెలిగన్నులన్ = నీరుగ్రమ్ముచున్న తెలుపుమించినకన్నులతో; ఆతనిన్ = ఆ ప్రవరుని; పుల్కపుల్కనన్ = కన్నులు మూసిమూసి తెఱచుటలతో; కనుఁగొని; మాటలందు = మాటల యందు; ఒదవుగద్గదికన్ = పుట్టిన డగ్గుత్తికతో-దుఃఖాతిశయముచేత డగ్గుత్తికపడి, మాట వెడలక పోఁగా ననుట; తలయూఁచి = తలయాడించి; అక్కటా! = అయ్యో! వనిత = ఆఁడుది; తనంతఁ దాన్ = తనకుఁదానే; వలచి = వలపుగొని; వచ్చినన్ = వచ్చినపక్షమున; ఏరికిన్ = ఎవరికైనను; చుల్కనగాదె = లాఘవము కాదా? లాఘవమే యనుట.

తా. ప్రవరుఁ డిట్లు తెగనాడఁగా వరూథిని బదులేమి చెప్పుటకును శక్యముకాక మనసున దిగులుపడి మొగము చిన్నపుచ్చుకొని సంతాపముతోఁ గన్నుల నీళ్లుగ్రమ్మఁగా, ఱెప్ప లల్లార్చుచు నతనిం జూచి, డగ్గుత్తికతోడి మాటలతో 'నెవరికిఁగాని యాఁడుది తనంతఁ దాను గామించి వచ్చునెడఁ జులకనగాఁ దోఁచునుగదా!' అని యనెను. అలం. అర్థాంతరన్యాసము.

మ. వెతలం బెట్టకు మింక న న్ననుచు నీ § వీబంధ మూడన్, రయో
ద్ధతి నూర్పుల్ నిగుడన్, వడిన్ విరులు చిం § దం, గొప్పు వీడం, దనూ
లత తోడ్తోఁ బులకింపఁగా ననునయా § లాపాతిదీనాస్యయై
రతిసంరంభము మీఱ నిర్జరవధూ § రత్నంబు పైపాటునన్. 67

టీ. నిర్జరవధూరత్నంబు = శ్రేష్ఠురాలైన యా దేవతాస్త్రీ- వరూథిని; ఇంకన్ = ఇఁకన్; నన్ను; వెతలంబెట్టకుము = బాధలఁబెట్టకుము; అనుచున్ = అని పలుకుచు; నీవీబంధము = పోఁక ముడి; ఊడన్ = వదలఁగా; రయోద్ధతిన్ = వడియొక్క యతిశయముచేత; ఊర్పులు = నిట్టూర్పులు; నిగుడన్ = హెచ్చఁగా; వడిన్ = వడిచేత; విరులు = పువ్వులు; చిందన్ = రాలఁగా; కొప్పు = తుఱుము; వీడన్ = సడలఁగా; తోడ్తోన్ = వెంటవెంటనే; తనూలత = తీగవంటి శరీరము; పులకింపఁగాన్ = గగుర్పొడువఁగా; అను...ఆస్యయై - అనునయాలాప = ఊఱడింపుమాటలతో; అతిదీనాస్యయై = మిక్కిలి చిన్నపోయిన మొగముగలదై; రతిసంరంభము = సంభోగాపేక్షవలని తొందర; మీఱన్ = అతిశయింపఁగా; పైపాటునన్ = పైఁబడుటచేత. క్రింది పద్యముతో నన్వయము. అలం. స్వభావోక్తి.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ § బాలిండ్లు పొంగా[2]రి పై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం § బాసింప 'హా శ్రీహరీ!'
యంచున్ బ్రాహ్మణుఁ డోరమో మిడి తదీ § యాంసద్వయం బంటి పో
మ్మంచుం ద్రోచెఁ; గలంచునే సతులమా § యల్ ధీరచిత్తంబులన్? 68

టీ. ప్రాంచత్...రుచితోన్ - ప్రాంచత్ = మిక్కిలి యొప్పుచున్న; భూషణ = ఆభరణములు కల; బాహుమూల = చంకలయొక్క; రుచితోన్ = ప్రకాశముతోడ; పాలిండ్లు = స్తనములు;

1. బొదువు. పా. 2. గారఁ బై. పా.

పొంగారి = ఉబ్బి; పైయంచుల్ మోవఁగన్ = దోర్మూలకూలంకషములు కాఁగా;
యమాంతముగఁ బైబడునట్లు - అనుట) కౌఁగిలించి = ఆలింగనముచేసి; అధరంబ
ఆసింపన్ = అపేక్షింపఁగా; బ్రాహ్మణుఁడు = ప్రవరుఁడు; హా ! శ్రీహరీ! అం
(పాపపరిహారార్థము దేవుని స్మరించుచు;) ఓరమోమిడి = ముఖ మొకప్రక్కకుఁ ద్రి
యాంసద్వయంబు = దాని రెండు మూఁపులను; అంటి = తాఁకి; పొమ్మంచున్ =
మ్మనుచు; త్రోచెన్ = తొలఁగఁద్రోసెను. ధీరచిత్తంబులన్ = తాలిమిగలవారి మ
పండితుల మనసులను); సతులమాయల్ = స్త్రీలయొక్క కపటచేష్టలు; కలంచు
పెట్టునా? కలఁతపెట్టఁజాల వనుట. అలం. అర్థాంతరన్యాసము.

క. త్రోపువడి నిలిచి ఘనల, జ్జాపరవశ యగుచు గొప్పు సవరించి రె
దీపింప నతనిఁ జుఱచుఱఁ, [1]గోపన వీక్షించి క్రేటు కొనుచుం బలి

టీ. త్రోపువడి = త్రోయుటనుబొంది - ఈ విధముగా నతనిచేతఁ ద్రోయఁబ
తొలఁగినిలిచి; ఘనలజ్జాపరవశ = మిక్కుటమైన సిగ్గుచేతఁ బరాధీనురాలు; అగుచున్
రించి = వీడినకొప్పు చక్కఁగా దిద్దుకొని; ఒడల్ = తనశరీరము; దీపింపన్ = ప్ర
అవయవము లన్నియు వానికన్నులకుఁ దెలియునట్లుగాఁ బైఁటచెఱఁగు తొలఁ
అతనిన్ = ఆ ప్రవరుని; చుఱచుఱన్ = చుఱచుఱలాడునట్లు - వేఁడిచూపులతో
కోపముగలదియైన యా వరూథిని; (ఇది కర్తృపదము.) వీక్షించి = చూచి; క్రేఁటు
గొంతు సవరించుకొనుచు (వెక్కుచు నని కొందఱు); పలికెన్.

తా. అట్లు ప్రవరుఁడు తొలంగఁద్రోయఁగాఁ దొలఁగి నిలువఁబడి యవమాన
హెచ్చఁగా దేహమంతయు నతనికిఁ గానవచ్చునట్లు పైఁటచెఱఁగు తొలఁగించి
చక్కఁగా ముడుఁచుకొనుచుఁ గోపము కల వరూథిని వేఁడిచూపులతో నతనిఁ జూచి
పడిన గొంతు సవరించుకొనుచు నీ విధముగాఁ బలికెను.

ఉ. పాటున కింతు లోర్తురె? కృపారహితాత్మక !; నీవు త్రోవ ని
చ్చోటఁ భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి
ప్పాటలగంధి వేదనను పం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచను మిట్టల నశ్రులు చిందువందఁగన్.

టీ. కృపారహితాత్మక! = ఓయి దయమాలిన మనసుగలవాఁడా? ('కృపా
అను విశేషణముచే 'నీవు చేసిన పుణ్యకర్మము లన్నియును నిష్ప్రయోజనము లని
పాటునకున్ = పడుటకు-త్రోయఁబడుటకు; ఇంతులు = ఆఁడువారు; ఓర్తురె? =
నీవుత్రోవన్ = నీవు త్రోయఁగా; ఇచ్చోటన్ = ఇక్కడ- చంటిపై; భవన్నఖాంకు
మొన;సోఁకెన్ = తగిలెను; కనుంగొనుము = చూడుము; అంచున్ చూపి = అని ఆ
గనఁబఱిచి; అప్పాటలగంధి = పాదిరిపువ్వుల పరిమళమువంటి దేహపరిమళమ
వరూథిని; వేదననెపం బిడి = ఆ గాయమువలని నొప్పిని నెపముచేసికొని; మీటినన్
జిమ్మినచో; విచ్చు = విరియునట్టి-అంత బిగిగలిగిన; గుబ్బచనుమిట్టలన్ = వట్రువ

1. గోపమునం జూచి. పా.

లైన స్తనప్రదేశములయందు; అశ్రులు = కన్నీళ్లు; చిందువందఁగన్ = పడిచెదరఁగా; కలస్వనంబుతోన్ = అవ్యక్త మధురధ్వనితో; ఏడ్చెన్.

తా. 'ఓయి దయమాలినవాఁడా ! త్రోయఁగాఁ గలుగు బాధను స్త్రీలు తాళఁజాలుదురా ? ఇది యోచింపక త్రోసితివే ! నీవు త్రోయునప్పు డిక్కడ నీ గోరు తగిలి గాయమయ్యెను' చూడుమని చెప్పి చంటిపైనున్న గోటినొక్కుఁ జూపుచు దానివలని నొప్పికిఁ దాళలేనిదానివలె నది మిష చేసికొని యా వరూథిని చెవి కింపైన ధ్వనితో నేడువసాగెను.

క. ఈ విధమున నతికరుణము, గా వనరుహనేత్ర కన్నుఁ ి గవధవళరుచుల్
కావిగొన నేడ్చి వెండియు, నా విప్రకుమారుఁ జూచి ి యలమటఁ బల్కెన్.

టీ. వనరుహనేత్ర = తామరవంటి కన్నులుగలది - వరూథిని; ఈ విధమునన్ = ఇట్లు; అతికరుణముగాన్ = మిక్కిలి జాలిపుట్టునట్లుగా; కన్నుఁగవధవళరుచుల్ = రెండు కన్నుల యొక్క తెల్లనికాంతులు; కావిగొనన్ = ఎఱ్ఱవాఱఁగా; ఏడ్చి; వెండియున్ = మఱియును; ఆ విప్రకుమారున్ = ఆ ప్రవరుని; చూచి; అలమటన్ = విచారముతో; పల్కెన్.

ఉ. చేసితి జన్నముల్ దపము ి చేసితి నంటె; దయావిహీనతం
జేసిన పుణ్యముల్ ఫలము ి సెందునె ? పుణ్యము లెన్నియేనియుం
జేసినవాని సద్గతియె ి చేకుఱు భూతదయార్ద్రబుద్ధి; కో
భూసురవర్య ! యింత దల ి పోయవు; నీ చదు వేల చెప్పుమా ! 72

టీ. ఓ భూసురవర్య! = ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా ! జన్నముల్ = యజ్ఞములు; చేసితిని; తపము = తపస్సును; చేసితిని; అంటె = అని చెప్పితివి. దయావిహీనతన్ = దయలేనితనముతో - దయలేక; చేసిన పుణ్యముల్ = చేసినట్టి ధర్మకార్యములు; ఫలము సెందునె ? = సార్థకములగునా? పుణ్యములు = ధర్మములు; ఎన్నియేనియున్ = ఎన్నియో - అనేకములు; చేసినవానిసద్గతియె = చేసినట్టి పురుషునికిఁ గలిగెడి మంచిగతియే; భూతదయార్ద్రబుద్ధికిన్ = ప్రాణులయందలి దయచేతఁ దడిసిన బుద్ధిగలవానికి - ప్రాణులయందు దయగలవానికి; చేకుఱున్ = సిద్ధించును. ఇంత= ఇంతమాత్రము; తలపోయవు = ఆలోచింపవు - ఈ విషయ మిట్టిది యని విచారించినవాఁడవు కావనుట. నీచదువు = నీవు చదివిన చదువు; ఏల? = ఎందులకు ? దేని కుపయోగము ? చెప్పుమా !

తా. ఓ బ్రాహ్మణోత్తమా ! యజ్ఞములు చేసినా నని, తపస్సు చేసినా నని చెప్పుకొంటివి. ఏమిచేసిన నేమి? భూతదయ లేనిపక్షమున నవి యన్నియు నిష్ఫలమే. లెక్కలేనన్ని పుణ్యకార్యములు చేసినవాఁడు పొందునట్టి సద్గతి - యవి యేవియుఁ జేయక భూతదయమాత్రము గలవానికి సిద్ధించును. ఈ విషయము కొంచెమయిన విచారించి తెలిసికోలేని నీ పాండిత్య మేమిటికిఁ బనికి వచ్చును ? వ్యర్థమేకదా! అలం. కావ్యలింగము.

సీ. వెలివెట్టిరే బాడ ి బులు పరాశరుఁ బట్టి, దాశకన్యాకేళి ి తప్పుఁ జేసి?
కులములో వన్నె త ి క్కువ యయ్యెనే గాధి, పట్టికి మేనక ి చుట్టఱికము ?
ననుపుకాఁడై వేల్పు ి నాగవాసముఁగూడి,మహిమగోల్పడియెనే ి మాందకర్ణి?
స్వారాజ్య మేలంగ ి నీరైరె సుర లహ, ల్యాజారుఁ డైన జం ి భాసురారి?

తే. వారికంటెను నీమహత్త్వంబు ఘనమె?, పవనపర్ణాంబుభక్షులై తనవసి యినుప
కచ్చడాల్ గట్టుకొనుమునిముచ్చులెల్లఁ, దామరసనేత్రలిండ్లకుఁ బందాలుగారె?

టీ. బాడబులు = బ్రాహ్మణులు; దాశకన్యాకేళితప్పఁజేసి = దాశరాజుకూఁతురైన యోజనగంధియొక్క కూటమియనెడి నేరమింబట్టి; పరాశరుఁడు = పరాశరమహామునిని; పట్టి = పట్టుకొని; వెలివెట్టిరే? = వెలివేసిరా? - వెలివేయలేదు గదా! గాధిపట్టికిన్ = విశ్వామిత్రమునికి; మేనకచుట్టరికము = మేనకయను నప్సరఃస్త్రీయొక్క సంబంధము; కులములోన్ = తమవారితెగలో; వన్నెతక్కువ = గౌరవలోపము గలది; అయ్యెనే? = కాలేదుగదా! మాండకర్ణి = మాండకర్ణియను మునీశ్వరుఁడు; ననుపుకాఁడై = విటకాఁడై; వేల్పునాగవాసమున్ = దేవవేశ్యాసమూహమును; కూడి = కలసి; మహిమన్ = తనమహత్త్వమును; కోల్పడియెనే? = పోఁగొట్టుకొనెనా? పోఁగొట్టుకోలేదుకదా! సురలు = దేవతలు; అహల్యాజారుఁడైన = అహల్యకు అంకుమగఁడైన; జంభాసురారిన్ = దేవేంద్రుని; స్వారాజ్యము = స్వర్గరాజ్యమును; ఏలంగనీరైరె? = పాలింపనీయకపోయిరా? ఎప్పటివలెఁ బాలింపనిచ్చిరికదా! వారికంటెన్ = ఆ పరాశరుఁడు మొదలైనవారికంటెను - వారి మహత్త్వముకంటె ననుట; నీ మహత్త్వంబు = నీదైనప్రభావము; ఘనమె! = హెచ్చా? పవనపర్ణాంబు భక్షులై = గాలియు, ఆకులును, నీళ్లును ఆహారముగాఁ జేసికొనినవారై; నవసి = కృశించి; ఇనుపకచ్చడాల్ = ఇనుముతోఁ జేసిన గోఁచులు; కట్టుకొను మునిముచ్చులెల్లన్ = కట్టుకొన్న దొంగమును లందఱును - మేము నిర్జితేంద్రియుల మని మునివేషమువేసికొన్న వారందఱు ననుట; తామరసనేత్రలిండ్లన్ = కమలములవంటి కన్నులుగల (చక్కఁదనముగల) స్త్రీల యిండ్లలో; బందాలు = చెఱసాలలో నుంపఁబడినవారివంటివారు; కారె? = కారా? అగుదురు - అనఁగాఁ దపస్సులుచేసి స్వర్గమును బొందియు వారు దేవతాస్త్రీలతో సంభోగించువారె యని భావము. అలం. అర్థాంతరన్యాసము. (ఇందుఁ జెప్పఁబడిన పరాశరుని కథ భారతములో నాదిపర్వమందును, విశ్వామిత్రుఁడు, మాండకర్ణి, దేవేంద్రుఁడు అనువారి కథలు రామాయణమున బాలకాండాయోధ్యాకాండములయందును జూడవచ్చును.)

తే. అనిన నేమియు ననక య య్యవ్వనజగంధి, మేనిజవ్వాదిపస కదం బించునొడలు
గడిగికొని వార్చి ప్రవరుండు గార్హపత్య, వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి.

టీ. అనినన్ = అని వరూథిని యనఁగా; ప్రవరుండు; ఏమియు ననక = ప్రత్యుత్తరమేమియుఁ జెప్పక; అవ్వనజగంధి...పస - అవ్వనజగంధి = ఆ స్త్రీయొక్క; మేని = శరీరసంబంధమైన; జవ్వాదిపస = జవ్వాజియొక్క సారము; కదంబించునొడలు = అంటుకొన్న దేహమును; కడిగికొని = కడిగివేసికొని; వార్చి = ఆచమనముచేసి; గార్హపత్యవహ్నిన్ = తాను ప్రతిదినము నారాధించునట్టి శ్రౌతాగ్నిని; భావమునన్ = మనసునందు; తలఁచి = ధ్యానించి; ఇట్లని = ఈ మీఁదఁ జెప్పఁబోవురీతిని; పొగడెన్ = స్తుతించెను.

ఉ. దివిషద్వర్గము నీ ముఖంబునన తృప్తిం గాంచు; నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్; సమస్తజగదంతర్యామియున్[1] నీవ; యా
హవనీయంబును దక్షిణాగ్నియును నీ యం దుద్భవించుం; గ్రతూ
త్సవసంధాత! నన్నుఁ గావఁగదవే స్వాహావధూవల్లభా! 75

1. ర్యామివిన్ పా.

టీ. క్రతూత్సవసంధాయక ! = యజ్ఞరూపమయిన యుత్సవమును గూర్చువాఁడా! యజ్ఞకార్యమునకు ముఖ్యసాధనమైనవాఁడా! యనుట; స్వాహావధూవల్లభా!=స్వాహాదేవికిఁ బ్రియుఁడా! అగ్నిదేవుఁడా! దివిషద్వర్గము = దేవతలసమూహము; నీముఖంబునన = నీవనెడి మొగముచేతనే; దేవత లగ్నియే ముఖముగాఁగలవారని చెప్పుదురు గనుక నీవైన ముఖముచేతనే యని భావము. తృప్తిక్ = తనివిని; కాంచుక్ = పొందును; శ్రుతులు = వేదములు; నిన్నుక్ = తేజోమూర్తి వయిన నిన్ను; ఈశుఁగాక్ = ఈశ్వరునిఁగా; స్తవముల్ = స్తోత్రములను; చేయును. సమస్తజగదంతర్యామియుక్ = సకలమైన లోకములకు లోపలవర్తించువాఁడవును - అంతరాత్మవును; నీవ = నీవే. ఆహవనీయంబును = వైశ్వదేవాదిక్రియలకై గార్హపత్యాగ్నినుండి గ్రహింపఁబడి క్రియాపరిసమాప్తి పర్యంతము హోమము చేయఁదగినయగ్నియును; దక్షిణాగ్నియుక్ = వేదికి దక్షిణభాగమునందుఁ బ్రాయశ్చిత్తాదికార్యములకై యుంచుకోఁబడునట్టి యగ్నియు; నీయందుక్= నీయందే; ఉద్భవించుక్ = పుట్టును. (కనుక) నన్నుక్ = నిన్నారాధించువాఁడనైన నన్ను; కావఁగదవే! = ఈ యాపదవలననుండి కాపాడవయ్యా! అలం. ఉదాత్తము.

ఉ. దానజపాగ్నిహోత్రపర ♦ తంత్రుఁడ నేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేనిఁ బర ♦ దారధనాదులఁ గోరనేని స
న్మానముతోడ నన్ను సదనంబునఁ ♦ [1]జేర్పు మినుండు పశ్చిమాం
భోనిధి[2]యందుఁ గ్రుంకకయ ♦ మున్న రయంబున హవ్యవాహనా! 76

టీ. హవ్యవాహనా ! = హవ్యమును వహించువాఁడా ! - అగ్నిదేవుఁడా! దాన...నేని - దాన = ఈవికిని; జప = మంత్రావృత్తిచేయుటకును; అగ్నిహోత్ర = వైశ్వదేవాదిహోమకార్యములకును; పరతంత్రుఁడనేనిక్ = అధీనుఁడ నగుదునేని - వీనియం దాసక్తిగలవాఁడనైనపక్షమున ననుట; భవత్...రతుండనేనిక్ - భవత్=నీయొక్క; పదాంబుజ=పాదకమలములయొక్క; ధ్యాన = చలింపక తలఁచుటయందు; రతుండనేనిక్ = ఆసక్తుఁడ నయినపక్షమునను; పరదారధనాదులక్ = పరుల భార్యలు, పరుల ధనములు మొదలగువానిని; కోరనేనిక్=కోరనవాఁడనైన పక్షమునను; నన్ను; ఇనుండు = సూర్యుఁడు; పశ్చిమాంభోనిధియందున్ = పడమటి సముద్రములో; క్రుంకకయమున్న = మునుఁగకమును పే - ప్రొద్దుగ్రుంకకమును పే యనుట; రయంబునక్ = శీఘ్రముగా; సన్మానముతోడక్ = గౌరవముతో - ఈ వరూథినివలన గౌరవహాని కలుగకుండునట్లు; సదనంబునక్ = నాయింటియందు; చేర్పుము.

వ. అని సంస్తుతించిన నగ్నిదేవుం డమ్మహీదేవుదేహంబున సన్నిహితుం డగుటయు నమ్మహాభాగుండు గండు మీఱి పొడువుఁగొండ నఖండసంధ్యారాగ ప్రభామండలాంతర్గతుండగు పుండరీకవనబంధుండునుంబోలె [3]సంతప్తకనకద్రవ ధారాగౌరంబగు తనుచ్ఛాయాపూరంబున నక్కాన వెలిగించుచు నిజగమన నిరోధిని యగు నవ్వరూథిని హృదయకంజంబున రంజిల్లు నమందానురాగ రస మకరందంబు నందంద పొంగంజేయుచుఁ బావకప్రసాదలబ్ధంబగు [4]హయంబు నెక్కి పవనజవనంబున నిజమందిరంబున కరిగి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించెనని మార్కండేయుండు క్రోష్టికిం జెప్పె నని చెప్పిన. 77

1. నిల్పు. పా. 2. లోన. పా. 3. నుత్తప్త.పా. 4. ముద్రితప్రతులలో 'హయంబు నెక్కి' లేదు.

టీ. అని సంస్తుతించినన్ = ఇట్లు పొగడఁగా; అగ్నిదేవుఁడు; అమ్మహీదేవుదేహంబునన్ = ఆ బ్రాహ్మణుని శరీరమునందు; సన్నిహితుండు = ఉంపఁబడినవాఁడు - చేరినవాఁడు; అగుటయున్ = కాఁగా; అమ్మహాభాగుండు = పూజ్యుఁడయిన యా ప్రవరుఁడు; గండు = దేహపుష్టి; మీఱి = అతిశయించి - ఉత్సాహము హెచ్చి యనుట; పొడుపుఁగొండన్ =ఉదయపర్వతమునందు; అఖండ...గతుండు - అఖండ = ఖండముకాని - నిండిన; సంధ్యారాగ ప్రభా = సంధ్యాకాలమునందలి యెఱ్ఱని కాంతులయొక్క; మండల = సమూహముయొక్క; అంతర్గతుండు = లోపల నణఁగియున్నవాఁడు; అగు = అయినట్టి; పుండరీకవనబంధుండునుంబోలెన్ = (తెల్లదామరల సమూహమునకు చుట్టమయిన) సూర్యుఁడో యనునట్లు; సంతప్త...గౌరంబు - సంతప్త = పుటము తీరిన; కనకద్రవధారా = బంగారునీటిధారయొక్క; గౌరంబు = పసిమివంటి పసిమిగలిగినట్టి; తనుచ్ఛాయాపూరంబునన్ = దేహకాంతిప్రవాహముచేత; అక్కాననన్ = ఆ యడవిని; వెలింగించుచున్ = ప్రకాశింపఁజేయుచు; నిజగమననిరోధినియగు తనపోక నడ్డగించునట్టి; అవ్వరూథిని హృదయకంజంబునన్ = ఆ వరూథినియొక్క మనఃకమలమునందు; రంజిల్లు...దంబున్ - రంజిల్లు = రాజిల్లునట్టి; అమంద = తక్కువకాని - మిక్కుటమైన; అనురాగరస = స్నేహరసమనెడి; మకరందంబున్ = పూఁదేనెను; అందంద = మఱిమఱి; పొంగఁజేయుచున్ = పైకుబుకఁజేయుచు - పెంచుచు; పావకప్రసాద లబ్ధంబగు = అగ్నిదేవు ననుగ్రహమువలన లభించినట్టి; హయంబున్ = యోగాశ్వమును; ఎక్కి; పవనజవనంబునన్ = వాయువేగమువంటి వేగముతో; నిజమందిరంబునకున్ = తనయింటికి; అరిగి = పోయి; నిత్య...కలాపంబులు - నిత్య = ప్రతిదినమును; కృత్య = చేయఁదగిన; సత్కర్మ = సత్క్రియలయొక్క; కలాపంబులు = సమూహములను - తాను దినదినము చేయుచున్న వైశ్వదేవాది సత్కర్మముల నన్నిటిని ననుట; నిర్వర్తించెన్ = జరపెను. అని; మార్కండేయుండు; క్రోష్టికిన్ = క్రోష్టి యనెడు మునితో; చెప్పెను. అని; చెప్పినన్ = పక్షులు జైమినిమునితోఁ జెప్పఁగా. దీనికిఁ దర్వాతి పద్యముతో నన్వయము.

తా. అని ప్రవరుఁడు స్తోత్రము చేయఁగా నగ్నిదేవుఁ డతని దేహమునం దావేశించి, మితిలేని తేజోవిశేషమును గలిగింపఁగా నా బ్రాహ్మణుఁ డా యడవి నంతయు వెలిఁగింపఁగా నట్టి దేహకాంతితో నందుండి కదలి వరూథిని యడ్డగింతకు లోఁబడక దాని మనసులోని యనురాగము మఱిమఱి పెరుఁగునట్లు చేయుచు, అగ్నిప్రసాద లబ్ధంబగు గుఱ్ఱము నెక్కి, వాయువేగముతోఁ దక్షణమే తన యూరికిఁ జని, యిల్లుచేరి, స్నాన సంధ్యావందన వైశ్వదేవాది నిత్యకర్మము లన్నియు జరుపుకొనెను. అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

క. జైమిని యా దివ్యఖగ, గ్రామణులం జూచిం వేడ్క గడలుకొనంగా
 నామీఁద వరూథినివిధ, మే మయ్యె నెఱుంగఁ జెప్ప రే నా కనుడున్. 78

టీ. జైమిని; ఆ దివ్యఖగగ్రామణులన్ = దేవతాసంబంధము లయిన యా పక్షిశ్రేష్ఠములను; చూచి; వేడ్క = కథ వినుటయందలి కుతూహలము; కడలుకొనంగాన్ = అతిశయింపఁగా; ఆ మీఁదన్ = అటుమీఁద; వరూథినివిధము = వరూథినియొక్క ప్రకారము; ఏమయ్యెన్? = ఏమిగా జరిగెను ? నాకున్ = నాకు; తెలియన్ = విశదముగనట్లు; చెప్పరే = మీరు చెప్పుఁడు; అనుడున్ = అని యడుగఁగా. దీనికిఁ దర్వాతి యాశ్వాసమునందలి 'అవధరింపుము' అనుదానితో నన్వయము.

శా. నిస్తంద్రప్రతిభా[1]తిభాసుర ! దిశో ౨ న్మీలద్యశశ్శ్రీవధూ
హస్తాగ్రామలకాయమానమహనీ ౨ యాంభోజగర్భాండ ! సై
న్యస్తోమోత్థరజోవ్రజస్థగిత కృ ౨ ష్ణా గౌతమీ మధ్య భూ
మ్యస్తోకోత్కలరాట్పురీహరణ లీ ౨ లావార్య శౌర్యోదయా ! 79

టీ. నిస్తంద్ర...భాసుర! - నిస్తంద్ర = చొరవగల; ప్రతిభా = అప్పటప్పటికి వికాసము నొందెడి బుద్ధిచేత; అతిభాసుర! = మిక్కిలి ప్రకాశించువాఁడా! దిశోన్మీలత్...గర్భాండ - దిశా = దిక్కులయందు; ఉన్మీలత్ = వ్యాపించుచున్న; యశః = కీర్తియొక్క; శ్రీ = శోభా సంపత్తి (కాంతిసంపద) యనెడు; వధూ = స్త్రీయొక్క; హస్తాగ్ర = చేతికొనయందలి - అఱ చేతియందు; ఆమలకాయమాన = ఉసిరికకాయ యగుచున్న; మహనీయ = మిక్కిలి దొడ్డదయిన; అంభోజగర్భాండ! = బ్రహ్మాండముగలవాఁడా! - ఎల్లదిక్కులందును వ్యాపించి బ్రహ్మాండమును దనచేతిలోని యుసిరికకాయవలెఁ దోఁపించునట్టి గీర్తిసంపద గలవాఁడా యనుట; సైన్య... శౌర్యోదయా ! - సైన్య = సేనలయొక్క; స్తోమ = సమూహమువలన; ఉత్థ = పుట్టిన; రజః = దుమ్ముయొక్క; వ్రజ = సమూహముచేత; స్థగిత = పొదుగఁబడిన - కప్పఁబడిన; కృష్ణా = కృష్ణా నదియొక్కయు; గౌతమీ = గోదావరీనదియొక్కయు; మధ్య = నడుమనుండెడి; భూమి = నేల యందలి - భూభాగమందలి; అస్తోక = అల్పముకాని - అధికమైన; (ఇది పట్టణములకు విశేష ణము.) ఉత్కలరాట్ = ఉత్కలదేశపు రాజుయొక్క; పురీ = పట్టణములయొక్క; హరణ = హరించుటయనెడి; లీలా = విలాసమునందు - దొడ్డవయిన యుత్కలదేశపురాజుయొక్క పట్టణముల ననాయాసముగా నాక్రమించుటయం దనుట; అవార్య = నివారింపశక్యముగాని; శౌర్యోదయా! = శూరత్వసమృద్ధి కలవాఁడా !

తా. హెచ్చరికతో ప్రకాశించు బుద్ధివిశేషమును, బ్రహ్మాండము నలమి వెలుఁగుచున్న కీర్తియుఁ గలిగి, కృష్ణా గోదావరీనదుల మధ్యభాగమునందుఁ గల దేశమునంతయు నాక్రమించి, యుత్కలదేశపురాజు పట్టణముల ననాయాసముగ వశపఱచుకొని యడ్డము లేని శౌర్యాతిశయమును వహించిన కృష్ణదేవరాయా ! అలం. రూపకము, అతిశయోక్తియు.

క. బిసరుహనయనా నవవిధ, కుసుమాయుధ! యవధికుధర ౨ కూటాంచలభూ
విసృమర తేజ శ్చంపక, భసల దసత్కీ ర్తిమలిన ౨ పరిపంథినృపా ! 80

టీ. బిసరుహ...యుధ! - బిసరుహనయనా = తామరలవంటి కన్నులుగలవారికి - చక్కఁదనము గల స్త్రీలకు; నవవిధ = క్రొత్తరీతిగల; కుసుమాయుధ! = మన్మథుఁడా! అవధి...నృపా - అవధికుధర = చక్రవాళపర్వతముయొక్క; కూట = శిఖరములయొక్క; అంచల = కొనలయందలి; భూ = భూమియందు; విసృమర = వ్యాపించిన; తేజః = ప్రతాపమనెడు; చంపక = సంపెఁగ పువ్వులకు; భసలత్ = తుమ్మెదలవలె నాచరించుచున్న; అసత్కీర్తి = అపకీర్తిచేత; మలిన = మాలిన్యమునొందిన; పరిపంథినృపా! = శత్రురాజులు గలవాఁడా !

తా. చక్కఁదనముచేత మన్మథునివలె స్త్రీలను మోహింపఁజేయువాఁడవును, చక్రవాళ పర్వతము శిఖరములవఱకు వ్యాపించిన ప్రతాపముచేత శత్రురాజులను దఱుమఁ గొట్టినవాఁడవు నైన కృష్ణదేవరాయా! అలం. రూపకము.

1. సుధీనుత. పా.

కవిరాజ విరాజితము

నల నృగ రంతి భగీరథ భారత ׀ నందనకల్ప! యనల్పయశ
శ్చులుకితలోక! విలోకివధూజన ׀ సూనశరాసన! మానఖనీ!
ప్రళయఘనాఘనఘోషజయానక ׀ భాంకృతిభీమచపేటలుఠ
త్కలబరిగీకటకక్షితిరక్షక! ׀ కన్నడరాజ్యరమారమణా !

టీ. నల...కల్ప! = నలుఁడు, నృగుఁడు, రంతిదేవుఁడు, భగీరథుఁడు, భరత
బుట్టిన ధర్మరాజాదులు, మొదలగు రాజులను బోలినవాఁడా! అనల్ప...లోక! - అన
కాని; యశః = కీర్తిచేత; చులుకిత = పుడిసిలింపఁబడిన; లోక = జగత్తుగలవాఁ
శరాసన! - విలోకి = చూచునట్టి; వధూజన = స్త్రీల సమూహమునకు; సూనశరాసన
వాఁడా! - మన్మథుఁడా! మానఖనీ! = చిత్తౌన్నత్యమునకు (గొప్పతనమునకు) గని
ప్రళయ...రక్షక! - ప్రళయ = విలయకాలమునందలి; ఘనాఘన = వానకురియుచు
యొక్క; ఘోష = ధ్వనివంటి ధ్వనిగలిగిన; జయానక = జయభేరియొక్క; భాంకృ
మనెడి; భీమ = భయంకరమయిన; చపేట = చెంపదెబ్బచేత; లుఠత్ = నేలమీ
లాడుచున్న; కలబరిగీ కటక = కలబరిగి, కటకములయొక్క; క్షితిరక్షక = రాజుల
కన్నడరాజ్య రమారమణా! = కన్నడదేశముయొక్క సామ్రాజ్యలక్ష్మికి ప్రియుఁడా!
యనుట.

తా. నలుఁడు, నృగుఁడు, రంతిదేవుఁడు, భగీరథుఁడు, ధర్మరాజు మొదలుగ
రాజులతో సరిపోల్పఁదగిన సచ్చరిత్రము గలవాఁడవును, లోకాతీతమయినకీర్తి
స్త్రీల చూపులకు మన్మథునివలెఁ దోఁచునట్టి చక్కఁదనము గలవాఁడవును, మాన
ట్టియినవాఁడవును, జయభేరీధ్వని విన్నమాత్రముననే కలబరిగి, కటకనగరముల
నేలఁబడి పొరలాడునట్లు చేసినవాఁడవును, కర్ణాటదేశము నేలువాఁడవు నైన కృష్ణ

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంక
బుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోప
దాసాదిత చతుర్విధ కవితామతల్లి కాల్లసాని చొక్కయా
పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం బను మహా
నందు ద్వితీయాశ్వాసము.

ఈ గద్యమునకు నర్థము ప్రథమాశ్వాస గద్యమునకుంబోలె గ్రహించునది.



# స్వారోచిష మనుచరిత్రము

## టీకా తాత్పర్య సహితము

### తృతీయాశ్వాసము



వేంకటేశపదప
ద్మావేశిత సదయహృదయ! హారనిటలనట
త్పావక పరిభావిమహః
ప్రావృతనిఖిలాశ! కృష్ణ రాయ మహీశా! 1

టీ. శ్రీవేంక...హృదయ! - శ్రీ = లక్ష్మీసమేతుఁడయిన; వేంకటేశ = వేంకటేశ్వరస్వామియొక్క; పదపద్మ = పాదకమలములయందు; ఆవేశిత = పొందింపఁబడినదియు; సదయ = దయతోఁ గూడినదియు నైన; హృదయ! = మనస్సుగలవాఁడా! హార...నిఖిలాశ! - హార = శివునియొక్క; నిటల = నొసటియందు; నటత్ = నటించుచున్న - వర్తిల్లుచున్న; పావక = అగ్నిని; పరిభావి = తిరస్కరించునట్టి; మహః = తేజస్సు (ప్రతాపము) చేత; ప్రావృత = చక్కఁగా నావరింపఁబడిన; నిఖిల = సమస్తమైన; ఆశ! = దిక్కులుగలవాఁడా! కృష్ణరాయమహీశా!

తా. శ్రీ వేంకటేశ్వరస్వామిని ధ్యానించువాఁడవును, ఆశ్రితులయందు దయగలవాఁడవును, శివనేత్రాగ్నికంటె వేండ్రమును జూపునట్టి ప్రతాపమును దిక్కులయందు వ్యాపింపఁజేసి శత్రువుల నణఁచినవాఁడవు నైన శ్రీకృష్ణదేవరాయమహారాజా! అలం. ఉపమ.

వ. అవధరింపు మమ్మహాత్మునకుం బక్షు లిట్లనియె. 2

టీ. అవధరింపుము = చిత్తగింపుము - వినుము; అమ్మహాత్మునకున్ = దొడ్డవాఁడయిన యా జైమినిమునితోఁ; పక్షులు = కథఁ జెప్పెడి పక్షులు; ఇట్లనియెన్ = ఈవిధముగాఁ జెప్పెను.

శా. ఆ భూదేవకుమారుఁ డేఁగినఁ దదీ యానూనరమ్యాకృతిం
దా భావంబున నిల్పి యంగభవకో దండోగ్రమార్వీరవ
క్షోభాకంపితధైర్యయై యలఁత న చ్చో నిల్వ కచ్చేల్వ త
ద్భూభృన్మేఖలవెంటఁ గానలబ[1]డిన్ దుఃఖాబ్ధినిర్మగ్నయై. 3

టీ. ఆ భూదేవకుమారుఁడు = ఆ బ్రాహ్మణకుమారుఁడు - ప్రవరుఁడు; ఏఁగినన్ = అక్కడ నిలువక వెడలిపోఁగా; అచ్చేల్వ = ఆ స్త్రీ - వరూథిని; తాన్ = తాను; తదీయ...ఆకృతిన్ -

1. బడెన్. పా.

తదీయ = వానిదైన; అనూన = తక్కువకాని; రమ్య = అందమయిన; ఆకృతిన్ =
భావంబునన్ = మనసునందు; నిల్పి = నిలుపుకొని - ఎల్లప్పుడును దలఁచుచున్నదై
ధైర్యమై - అంగభవ = మన్మథునియొక్క; కోదండ = వింటియొక్క; ఉగ్ర = భ
మౌర్వీరవ = అల్లెత్రాటిమ్రోఁతవలననైన; క్షోభ = కలఁతచేత; ఆకంపిత = మిక్కి
బడిన - చలింపఁజేయఁబడిన; ధైర్యమై = తాలిమిగలదై - తాలిమి తూలఁగా ననుట
ఆయాసముచేత; దుఃఖాబ్ధినిర్మగ్నయై - దుఃఖాబ్ధి = చింతయనెడి సముద్రమున
గ్నయై = మునిఁగినదై; అచ్చోన్ = ఆ చోట - అప్పుడు తానున్నచోట; ని
యుండక; తద్భూభృన్మేఖలవెంటన్ - తద్భూభృత్ = ఆ కొండయొక్క; మేఖ
నడిమిభాగమువెంబడిని; కానలఁబడిన్ = అడవిమార్గమునందు. ముందున కన్వయము.

తా. ఆ బ్రాహ్మణుఁ డట్లు తన్ను నిరాకరించి పోఁగా వరూథిని యేమియుఁ
చక్కఁదనమునే తలఁచుచు మన్మథవేదన హెచ్చఁగాఁ దాలిమిమాలి, యున్నతావున
సొప్పక మిక్కిలి దుఃఖించుచు నా హిమవత్పర్వతము నడిమియడవుల త్రోవలందుఁ

క. తిరుగుచు [1]ధరణీసురవరుఁ, డరిగినచొప్పరసి యరసి యట గానక
హరిణాంకముఖి సఖీజన, పరివృత యై [2]మగిడి వచ్చి భావములో

టీ. తిరుగుచున్ = అట్లు సంచరించుచు; ధరణీసురవరుఁడు = బ్రాహ్మణశ్రేష్ఠ
రుఁడు; అరిగినచొప్పు = పోయినజాడను; అరసియరసి = వెదకివెదకి - బహుదూ
యనుట; అట = ఆ యడవులయందు; అతనిని; కానక = కనుఁగొనలేక; ఆ హరిణ
చంద్రునివంటి ముఖముగలిగినదైన యా వరూథిని; సఖీజనపరివృతయై = (అంతలోఁ
కొనివచ్చిన) చెలికత్తెలచేతఁ జుట్టుకోఁబడినదై - చెలికత్తెలతోఁ గూడుకొన్నదై
వచ్చి = తిరిగి (తనయునికిపట్టునకు) వచ్చి; భావములోనన్ = తనమనసునందు.
ముతో నన్వయము.

తా. అట్లడవులత్రోవలందుఁ జొచ్చిన వరూథిని ప్రవరుఁడు పోయినజాడ
వెదకి కనుఁగొననేరక యందందుఁ దిరుగుచుండి యంతలోఁ దన చెలికత్తెలు తన్ను
చేరుకొనఁగా వారితోడ మరలి తన నివాసస్థానమునకు వచ్చి తనమనసులో క్రిందిరీతి

ఉ. అక్కట! వాఁడు నాతగుల మాఱడి సేసి దయావిహీనుఁడై
చిక్కక త్రోచి పోయె; దరిఁ జేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీఁదుదాన? నిఁక నీ కొఱనోములు నోఁచినట్టి నే
నెక్కడ? వానికౌఁగి లది యెక్కడ? హా! విధి! యేమి సేయుద

టీ. అక్కట! = అయ్యో! వాఁడు = ఆ ప్రవరుఁడు; నాతగులము = నానె
చేసి = వ్యర్థముచేసి; (అల్లరిచేసి యని కొందఱు. అల్లరిచేసి యనఁగాఁ దాను దేవత
మనుష్యమాత్రుని వలచి వాని వలపింపలేకపోవుటచేత సరివారు ఇది యింత వ్యర్థ
నిందించునట్లు చేసి యని భావము.) దయావిహీనుఁడై = కనికరములేనివాఁడై; చి
చేతికిఁజిక్కక; త్రోచి = త్రోపాడి; పోయెన్ - నేను పైఁబడిపోయికౌఁగిలించుకొన
ద్రోసిపోయె ననుట. ఇంకన్; దరిన్ = తీరమును; చేరఁగన్ రాని = చేరుటకు శక్యము

1. నట ధరణీసురు. పా. 2. మరలి. పా.

సాగరంబు = విరహాసముద్రమును; ఎక్కడఁగ = ఎంతవఱ కని; ఈఁదుదానఁగ = ఈఁదఁ గలదానను? ఇంతదూర మీఁదిన దరిఁజేరవచ్చు నన్న మితియున్న నీఁదవచ్చును గాని మితిలేనిపక్షమున నీఁద శక్యమగునా? యనుట. ఈ... నేను - ఈ = ఈవిధమైన దశనొందించునట్టి; కొఱనోములు = తక్కువైనవ్రతములు; నోఁచినట్టినేను = ఆచరించిన నేను; ఎక్కడ ? = ఎచ్చట? వాని కౌఁగి లది = ఆ సుందరుని యాలింగనము; ఎక్కడ ? = ఎచ్చట ? నాకును వానికౌఁగిటికిని బహుదూర మనుట. (అనఁగా నట్టిసుందరుని కౌఁగిలి యెన్నెన్నో దొడ్డనోములు నోఁచిన పుణ్యవతులకుఁగాక నావంటి తక్కువనోములు నోఁచిన సామాన్యలకు లభింపనేర దని యర్థము.) హా విధి! = అయ్యో దైవమా ! ఏమి సేయుదుఁగ? = ఈ విరహవేదన మానుట కేమి చేయుదును? (పా. విధి నేమి చేయుదుఁగ = నా కిట్టిదశ గలుగ వ్రాసిన బ్రహ్మదేవు నేమి సేయుదును ?)

తా. అయ్యో! ఆ బ్రాహ్మణుఁడు నాయంత నేనై పైఁబడినను నాకుఁ జిక్కక నా యపేక్ష వ్యర్థముచేసి నన్ను దరిగానని విరహసముద్రమునందుఁ ద్రోసిపోయెను. నే నెట్లీ విరహసముద్రమును దాఁటుదును ? వాని నెట్లు చేరుదును ? చేరఁదగిననోము నేమియు నోఁచనైతిని కాఁబోలు, దైవమా ! వానికౌఁగిలి నాకు లభించుమార్గ మేదో దానిం జూపి కావుమని వరూథిని దుఃఖించెను. అలం. రూపకము, విషమమును.

ఉ. కమ్మనికుందనంబు కసు ✽ గందని మేఁ; నెలదేఁటిదాఁటులఁగ
బమ్మెరవోవఁ దోలుఁ దెగ ✽ బారెఁడు వెండ్రుక; లిందుబింబముం
గిమ్మన నీదు మోము; గిరి ✽ క్రేవులు మూఁపులు; కౌను గానరా;
దమ్మకచెల్ల ! వాని వికచాంబకముల్ శతపత్త్రజైత్రముల్. ౬

టీ. అమ్మకచెల్ల! = ఔరా! కసుగందనిమేను = కొంచెమైన వాడిపోవుట - నైల్యము - లేని వానిశరీరము; కమ్మనికుందనంబు = మనోహరమైన (పుటముపెట్టిన యనుట) యపరంజివలె మనోహరమైనది. తెగబారెఁడు వెండ్రుకలు = పొడవైన వెండ్రుకలు; ఎలదేఁటిదాఁటులఁగ = కొదమతుమ్మెదల సమూహమును; బమ్మెరవోవఁగ = భ్రమపడునట్టుగా; తోలుఁగ = తఱుమును. మోము = ముఖము; ఇందుబింబముఁగ = చంద్రమండలమును; కిమ్మననీదు = ఏమి? యని నోరెత్తి మాటాడనీయదు - తిరస్కరించు ననుట. మూఁపులు = భుజశిరస్సులు - బుజములమీఁద నెత్తుగా నుండెడి యవయవములు; గిరిక్రేవులు = పర్వతశిఖరములు - మిక్కిలి యున్నతములనుట. కౌను = నడుము; కానరాదు = అగపడనే యగపడదు - మిక్కిలి సన్నమనుట. వాని వికచాంబకముల్ = వికసించిన (తేట లయిన) వాని కన్నులు; శతపత్త్రజైత్రముల్ = కమలములను జయించునవి.

తా. ఔరా! యా ప్రవరుని సౌందర్య మే మనవచ్చును? వానిదేహము మేలిమి బంగారువలె మనోహరము. వానితలవెండ్రుకలు తుమ్మెదలబారో యనునట్లు నెఱులు గలిగి నల్లనై బారెఁడు నిడుపు గలిగి యొప్పుచున్నవి. మొగము కళాతిశయముచేతఁ జంద్రబింబమును దిరస్కరించుచున్నది. మూఁపులు కొండకొమ్ములవలె మిక్కిలి యున్నతములై యున్నవి. కన్నులు తేటలై తామరలను దిరస్కరించుచున్నవి. అలం. ఉపమ, రూపకము.

ఉ. చొక్కపుఁబ్రాయముఁగ మిగుల ✽ సోయగముం గల ప్రాణనాయకుం
డెక్కుడు వశ్యతఁగ రతుల ✽ [1]యేఁకట దీర్చి సమేళ మొప్పఁగా

1. నేఁకట. పా.

నక్కున గారవించి ప్రియ । మందఁగ నోఁచనియింతి [1]కైన యా
చక్కఁదనం బదేమిటికి? । జవ్వన మేటికి? [2]నేర్పు లేటికిన్? 7

టీ. చొక్కపుఁబ్రాయమున్ = స్వచ్ఛమయిన యౌవనమును - నిండిన యౌవనమును; మిగులన్ = ఎక్కువ; సోయగమున్ = సౌందర్యమును; కల ప్రాణనాయకుఁడు = కలిగినట్టి ప్రియ భర్త; ఎక్కుడు వశ్యతన్ = మిక్కిలి స్వాధీనత్వముతో; రతులయేఁకట = రతులందలి అపేక్షను; తీర్చి = నెఱవేర్చి; సమేళము = ఏకీభావము - ఒకటిగాఁగలసి యుండుట; ఒప్పఁగాన్ = అమరునట్లు; అక్కునన్ = ఱొమ్మునందు - ఱొమ్ముపైఁ జేర్చుకొని యనుట. గారవింపన్ = గౌరవము చేయఁగా; ప్రియము = ప్రేమను; అందఁగన్ = పొందునట్లు; నోఁచని = నోఁచుకొనని - అట్టి యదృష్టములేని; ఇంతికైన = స్త్రీకిఁగల; చక్కఁదనం బది = అట్టి యా సౌందర్యము; ఏమిటికిన్? = ఎందులకు? జవ్వనము = యౌవనము; ఏటికిన్? = ఎందులకు? నేర్పులు; ఏటికిన్? వ్యర్థ మనుట.

తా. చక్కఁదనముగలదైన యువతికిఁ దాను వలచినపురుషుఁడు మిక్కిలి స్వాధీనుఁడై సంభోగమునందలి యపేక్ష తీర్చి ఱొమ్మున నదిమి కౌఁగిలించుకొని లాలించునట్టి యదృష్టమును బొంది సుఖింపవలయుఁగాని, యట్టియదృష్టము లేనిదాని చక్కఁదనమును, యౌవనమును, నేర్పులును వ్యర్థము లగును; కనుక నట్టి యువతి జీవించి యుండుటకంటెఁ జచ్చుటయే మేలు. అలం. అప్రస్తుతప్రశంస.

ఉ. ఎంత తపంబు సేసి జని । యించినవారొకొ మర్త్యభామినుల్!
కాంతుఁ డవజ్ఞ సేసినను । గాయము వాయుదు; రే నమర్త్యనై
చింతల వంతలం జివికి । సిగ్గఱితిన్; మృతిలేని నాదుచె
ల్వింతయు శూన్యగేహమున । కెత్తిన దీపిక యయ్యె నక్కటా! 8

టీ. మర్త్యభామినుల్ = మనుష్యస్త్రీలు; ఎంత తపంబుచేసి = ఎంతటి ఘోరమయిన తపస్సు చేసి; జనియించినవారొకొ! = పుట్టినవారో కదా! కాంతుఁడు = ప్రియుఁడు; అవజ్ఞ చేసినను = అవమానముచేసిన పక్షమున; కాయము = దేహమును, వాయుదురు = విడుతురు. ఏన్ = నేను; అమర్త్యనై = చావులేని దేవతాస్త్రీనై; చింతలన్ = విచారములచేతను; వంతలన్ = ఆ విచారములనైన సంతాపములచేతను; చివికి = నవసి; సిగ్గఱితిన్ = సిగ్గుచెడినదాననైతిని. అక్కటా! = అయ్యో! మృతిలేని = చావు లేకుండునట్టి; నాదుచెల్వు = నాయొక్క సౌందర్యము; ఇంతయున్ = ఈ యంతయును - సర్వమును; శూన్యగేహమునకున్ = పాడుపడిన యింటికి; ఎత్తిన దీపిక = పెట్టినట్టి దివ్వెవంటిది; అయ్యెన్.

తా. మనుష్యస్త్రీలు చావుగలవారు గనుకఁ దమకుఁ బ్రియుఁడయిన పురుషుఁ డవమానము చేసినయెడఁ దోడనే దేహత్యాగము చేయుదురు. అంతటితో వారివిచారము తీఱును. నేను దేవతాస్త్రీ నగుటచేతఁ జావు లేనిదాననై బహువిధముల విచారపడి తపించుచు సిగ్గుమాలి యలయుచున్నాను. అయ్యో! ఇట్లు చావులేనిదాననైన నాచక్కఁదన మంతయుఁ బాడింటికిదీప ముండియుఁ బ్రయోజనము లేనట్లు ప్రయోజనములేని దాయెనే! మనుష్యస్త్రీలు చావనెడి సాధనము నొందుటకై యెంత కఠిన తపస్సు చేసి జనించిరో కదా! అలం. పరికరాంకురము, నిదర్శనయును.

---

1. దైన. పా. 2. కిఁబ్రాణమే. పా.

వ. అని వితర్కించుచుం గ్రించుదనంబునం బునఃపునః పరిభవకారియై కాఱియం
[1]బెట్టు సిరిపట్టి బెట్టేయం గాఁడి చను నల రంపకట్టియల గుట్టు చెడి వెచ్చవెచ్చ
నై హెచ్చి, విచ్చలవిడిం గాయు నుద్దామవిరహదవదహనదాహంబున దేహంబు
తల్లడిల్ల మల్లడి గొని పెల్లడరునిట్టూర్పుగాడ్పువిసరులం గసరెత్తి, యంతకంత
కంతరంగంబున నింతం తినరాక పొంగి చింతాసాగరంబు వేగిరంబ వెల్లివొడిచె
ననం దుడిచిన నడంగక సారెకుం దారకల నీరికలెత్తు పొగ[2]రున నిగనిగ లిను
మడిగ నిగుడ మిగులు వగల బుగులుబుగులున నెగసి యెగసి, యొప్పులకుప్ప
లగు ఱెప్పలం జిప్పిలు కాటుక లప్పళించి కరంచి దరదళదరుణకమలదళ
శోణంబు లగు దృక్కోణంబులన్ దిగువారుకన్నీరు చెన్నారు కర్ణద్వయీగోళం
బులు నిండి తనుతాపతప్తంబగు హాటకతాటంకయుగళంబునం బడి క్రొంబొగ
లెగయింప, బిసకిసలయసగంధం బగు మణిబంధంబునఁ జికురబంధంబుఁ జేర్చు
కొని పొరలం దుఱిమిన విరు లురుల, నరవిరిసి కవిసి యిరులుకొను గరగరని నెఱి
కురులు గుఱి గడవఁ బెరిఁగిన వగుటం జేసి రాశివడి మెయి మూసికొని గ్రహ
గణంబులం జెన్నగుమిన్ను విఱిగి పయిం బడిన వడువున బెడంగువడఁ, గలయం
దలకొను పులకమొలకపయిరునకుం బాఱు దుర్వారవారిపూరం బనం గ్రమ
క్రమంబున నంగంబులం గ్రమ్ముచెమ్మటల మిన్నేటి పెన్నీటి[3]వఱ్ఱున మునుంగ
కుండ నవరించిన మించుకుంభప్లవం బనం బరిభ్రష్టోత్తరీయంబై బయలువడి
యబ్బురంపుగుబ్బచనుదోయి నిబ్బరంపుమెఱుంగు లీనం, గుపితహరనయనశిఖి
శిఖా భస్మీకృత స్మరవిరహశోకంబునం [4]బడుచు చందురునిం బట్టుకొని యడలు
రతిరమణి చందంబునం గుసుమిత లతా నిశాంత శశికాంత వేదికాంతరంబున
మేను సేర్చి వివిధదశాంతరంబుల వేఁగుచుండె నంత. 9

టీ. అని = ఇట్లని; వితర్కించుచున్ = తనలోఁ దా నూహించుకొనుచు; క్రించుఁదనం
బునన్ = నీచత్వముచేత; పునఃపునః = మాటిమాటికిని; పరిభవకారియై = తిరస్కారము చేయు
వాఁడై, కాఱియంబెట్టు సిరిపట్టి = బాధపెట్టునట్టి మన్మథుఁడు; బెట్టు = తఱచుగా; ఏయన్ =
ప్రయోగింపఁగా; కాఁడి = నాటి; చను నల రంపకట్టియలన్ = దూసిపోవుచున్న యా పుష్ప
బాణములచేత; (ఇందుఁ గట్టియశబ్దము నిరర్థకము; ఇది యంపకోలవంటిది.) గుట్టుచెడి = మర్మము
చెడి; వెచ్చవెచ్చనై = కొంచెము కొంచెము వేఁడిమిపుట్టి; హెచ్చి = క్రమముగా నతిశయించి;
విచ్చలవిడిన్ = యథేచ్ఛముగా - మిక్కిలి యధికముగా; కాయు...బునన్ - కాయు = కాయు
చున్నట్టి; ఉద్దామ = అణఁపరాని; విరహ = వియోగమనెడి; దవదహన = కాఱుచిచ్చుయొక్క;
దాహంబునన్ = తాపముచేత; దేహంబు; తల్లడిల్లన్ = అదురఁగా; మల్లడిగొని = ముప్పిరిగొని -
క్రిక్కిరిసి యనుట; పెల్లు = మిక్కిలి; అడరు...రులన్ - అడరు = అతిశయించుచున్న;
నిట్టూర్పు = దీర్ఘశ్వాసములవలని; గాడ్పు = గాలియొక్క; విసరులన్ = వడిగా వీచుటలచేత;
కసరు = వానగాలి - తుపాను; ఎత్తి = రేఁగి; అంతకంతకున్ = అప్పటప్పటికి; అంతరంగం

1. బెట్టి. పా. 2. రన. పా. 3. వొఱ్ఱు. పా. 4. బడి. పా.

బునన్ = హృదయమునందు; ఇంతంతనరాక = ఇంత అంత అని చెప్పశక్యముగాక - మేరలేక యనుట; పొంగి = ఉప్పొంగి; చింతాసాగరంబు = దుఃఖమనెడి సముద్రము; వేగిరంబ = శీఘ్రముగానే; వెల్లివొడిచెననన్ = ప్రవహించెనో యనునట్లు; తుడిచినన్ = వస్త్రపుఁగొంగుతోఁ దుడిచినను; అడంగక=అణఁగక-నిలువక; సారెకున్ = మాటిమాటికి; తారకలన్ = కంటి నల్లని గ్రుడ్లవలననుండి; ఈరికలెత్తు = మొలకలెత్తునట్టి-పుట్టునట్టి; పొగరునన్ = (నల్లని) వర్ణమువలన; నిగనిగలు = నిగనిగనికాంతులు; ఇనుమడిగన్ = ఇబ్బడిగా; నిగుడన్ = వ్యాపింపఁగా; మిగులు వగలన్ = మితిమీఱిన విచారములచేత; బుగులు బుగులునన్ = బుగులు బుగు లను ననుకరణముతో; ఎగసి = పైకి వ్యాపించి; ఒప్పులకుప్పలు = చక్కఁదపురాసులు; అగు ఱెప్పలన్ = అగునట్టి ఱెప్పలవలననుండి; చిప్పిలు కాటుకలు = మీఁదికి వెడలుచున్న కాటుకలను; అప్పళించి = ఆక్రమించి; కరంచి = కరఁగించి; దరదళ...శోణంబులు - దరదళత్ = కొంచెము వికసించుచున్న; అరుణకమల = ఎఱ్ఱదామరలయొక్క; దళ = ఱేకువలె; శోణంబులు = ఎఱ్ఱగా నుండునవి; అగు దృక్కోణంబులన్ = అగునట్టి కనుకొలఁకులనుండి; దిగువాఱుకన్నీరు = క్రిందికిజాఱుచున్న కన్నీరు; చెన్నారు...బులు - చెన్నారు = అందగించుచున్న; కర్ణద్వయీ = రెండుచెవుల యొక్క; గోళంబులు = రంధ్రములు; నిండి = నిండుకొని; తనుతాపతప్తంబగు = మేనికాఁకచేతఁ గాఁచఁబడినట్టి; హాటకతాటంకయుగళంబునన్ = బంగారుకమ్మల జతమీఁద; పడి = చింది; క్రొంబొగలు = క్రొత్త పొగలను; ఎగయుంపన్ = లేపఁగా; బిసకిసలయ సగంధంబగు = తామర మోసులను బోలినట్టి; మణిబంధంబునన్ = మణికట్టునందు; చికురబంధంబు = తలవెంట్రుకల ముడిని - కొప్పును; చేర్చుకొని = పొందించుకొని - పెట్టుకొని; పొరలన్ = పొర్లునట్లు; తుఱిమిన విరులు = చెరివినపువ్వులు; ఉరులన్ = రాలునట్లు; అరవిరిసి = సగమువీడి; కవిసి = పర్వి; ఇరులు...కురులు - ఇరులుకొను = చీఁకటిక్రమ్ముచున్న; గరగరని = మనోహరమైన - అందమైన; నెఱికురులు = వంకర (నొక్కులు గల) తలవెంట్రుకలు; గుఱి కుడవన్ = మేర మీఱునట్లు; పెరిఁగినవి = ఎదిగినవి; అగుటంజేసి; రాశివడి = ప్రోగై; మెయి = దేహమును; మూసికొని = క్రమ్ముకొని; గ్రహగణంబులన్ = అంగారకాది గ్రహనక్షత్రసమూహములచేత; చెన్నగు మిన్ను = ఒప్పుచున్న యాకాశము; విఱిగి = తునిఁగి; పయిన్ = తనమీఁద; పడినవడువునన్ = కూలినవిధమున; బెడంగువడన్ = అందగించుచుండఁగా; కలయన్ = అంతటను; తలకొను...రునకున్ - తలకొను = కలుగుచున్న; పులక = రోమాంచమనెడి; మొలకపయిరునకున్ = మోసులెత్తుచున్న పైరునకు; పాఱు...పూరంబు - పాఱు = ప్రవహించునట్టి; దుర్వార = అడ్డపాటులేని; వారి పూరంబు = జలప్రవాహమో; అనన్ = అనునట్లుగా; క్రమక్రమంబునన్ = వరుసవెంబడిని; అంగమ్ములన్ = అవయవములందు; క్రమ్ము...వఱ్ఱునన్ - క్రమ్ము = ఆవరించునట్టి; చెమ్మటల మిన్నేటి = చెమటలనెడు ఆకాశగంగయొక్క; వెన్నీటి = అధికజలముయొక్క; వఱ్ఱునన్ = వఱదయందు; మునుంగకుండన్ = మునిఁగిపోకుండునట్లు; సవరిం...ప్లవంబునన్ - సరించిన = జతపఱిచిన; మించు = అతిశయించునట్టి; కుంభప్లవంబు అనన్ = కుండను బొరగించి కట్టిన తెప్పయో అనునట్లు; పరిభ్రష్టోత్తరీయంబయి = జాఱిన పయఁటగలదై; బయలువడి; అబ్బు...చనుగవ - అబ్బురపు = అపూర్వమైన; సిబ్బెంపు = సొబగలిగిన; గబ్బి = బిగువుగల; గుబ్బ = వట్రువైన; చనుఁగవ = స్తనద్వయము; నిబ్బరపు మెఱుంగులు = అధికమయిన కాంతులను; ఈనన్ = పుట్టించుచుండఁగా; కుపిత...బునన్ - కుపిత = కోపించిన; హర = రుద్రునియొక్క; నయన = (నొసటి) కంటిదైన; శిఖి = అగ్నియొక్క; శిఖా = జ్వాలచేత; భస్మీకృత = నీఱు

సేయఁబడిన; స్మర = మన్మథునియొక్క; విరహ శోకంబునన్ = ఎడఁబాటువలని దుఃఖమునందు; పడుచు; చందురునిన్ = చంద్రుని; పట్టుకొని = పట్టుకొన్నదై; అడలు...చందబునన్ - అడలు= ఏడ్చుచున్న; రతిరమణిచందంబునన్ = రతీదేవివలె; కుసుమిత... వేదికాంతరంబునన్ - కుసుమిత= పూచిన; లతానిశాంత = తీగయింటియందలి; శశికాంత = చంద్రకాంతపురాలచేఁ గావింపఁబడిన; వేదికాంతరంబున = అరుఁగుమీఁద; మేను సేర్చి = దేహము వైచి - పండుకొని; వివిధ... రంబులన్ - వివిధ = నానావిధములయిన;దశాంతరంబులన్ = అవస్థాభేదములచేత; వేఁగుచున్ = తపించుచు; ఉండెన్. అంతన్ = అంతట.

తా. అని యిట్లు వరూథిని తనలోఁ దాను వితర్కించుచుండ నప్పటప్పటికి విరహవేదన హెచ్చఁగా, దేహమునందుఁ గాఁక హెచ్చి వణఁకు పుట్టఁగా, నందులకు నోర్వక నిట్టూర్పు విడుచుచు నెడతెగక కన్నీళ్లు విడుచుటచేత నా కన్నీళ్లు కన్నులకాటుకతోఁ గలసి నలుపై నిగనిగలాడుచు నల్లని కనుగ్రుడ్ల నునుఁగాంతియో యన నొప్పి ప్రవాహరూపమునఁ జెక్కిళ్లగుండఁ జెవులకు జాఱి చెవికమ్మలను దడుపుచుండఁగాఁ, జేతిమణికట్టుపైఁ దల పెట్టుకొని పొర్లిపోవునట్లుగాఁ జుట్టుకొన్న పువ్వులు రాలఁగా, గొప్ప నగము పీడుటచే వెంద్రుకలు విరిసి దేహము నావరించి గ్రహనక్షత్రాదులతోడ మిన్ను విఱిగి మీఁదఁ బడ్డట్టు కాఁగా, దిగులుపడి దేహమునందుఁ జెమటయు, రోమాంచమును మించఁగాఁ, బైఁటకొంగు తొలఁగిపోవుటయు నెఱుఁగక శివునికంటిమంటలచేతఁ గాలిన మన్మథునియెడఁబాటుచేత వానికి మిత్రుఁడైన చంద్రునిఁ బట్టుకొని యేడ్చుచున్న రతిదేవియో యనునట్లు చంద్రకాంతరాల యరుఁగుమీఁదఁ బడి యేడ్చుచు, బహువిధములయిన మనస్సంగ, జాగర, కృశత్వాది మన్మథావస్థలం బొందుచుఁ దపించుచుండెను. (మన్మథావస్థలు - చక్షుఃప్రీతి, మనస్సంగము, సంకల్పము, జాగరము, కార్శ్యము, విషయవిద్వేషము, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మరణము అని పది.) అలం. 'వెచ్చవెచ్చనై విచ్చలవిడిం గాయునుద్దామవిరహదవదహనదాహంబున' - ఇక్కడ రూపకము. 'చింతాసాగరంబు వెల్లివొడిచె ననన్'- ఇట రూపకోత్ప్రేక్షలు. 'అరుణకమలదళశోణంబులు' - ఇచ్చట ఉపమ. 'హాటకతాటంకయుగళంబునం బడి క్రొంబొగ లెగయింపన్' - ఇట అతిశయోక్తి. 'బిసకిసలయసగంధంబు' - ఇట ఉపమ. 'కురులు... బెడంగువడన్, పాఱుదుర్వారవారిపూరంబనన్' - ఈ చోటుల నుత్ప్రేక్ష. 'చెమటల మిన్నేటి, పులకమొలకపయిరు'-ఈ చోటుల రూపకము. 'కుంభస్లవం బనన్' -ఇక్కడ నుత్ప్రేక్ష. 'రతిరమణిచందంబునన్' - ఇక్కడ ఉపమ.

చ. తరుణి ననన్యకాంత నతి ✽ దారుణ పుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవు ✽ బారికి నగ్గము సేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డ ✽ హంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన న ✽ భోమణి దాల్చెఁ గషాయదీధితిన్. 10

టీ. తరుణిన్ = లేఁతప్రాయము గలదానిని; అనన్యకాంతన్ = అన్యభర్తలేనిదానిని - ఒక పురుషుని కధీనురాలు కానిదానిని; అతి... వివశాంగిన్ - అతి = మిక్కిలి; దారుణ = భయంకరమయిన; (ఇది వ్యథకు విశేషణము.) పుష్పశిలీముఖ = పువ్వులు బాణముగాఁ గలమన్మథునియొక్క; వ్యథాభర = బాధయొక్క యతిశయముచేత - అధికమైన బాధచేత ననుట; వివశ = పరవశమైన - స్మృతితప్పిన; అంగిన్ = దేహముగలదానిని; అంగభవు బారికిన్ = మన్మథబాధకు; అగ్గము

సేసి = లోఁబఱచి; క్రూరుఁడై = కఠినుఁడై; మహీసురాధముఁడు = నీచబ్రాహ్మణుఁడు - ప్రవరుఁడు; అహంకృతితోన్ = గర్వముతో; అరిగెన్ = పోయెను; అని; రోషభీషణ స్ఫురణన్ - రోష = రోషముచేత; భీషణ = భయంకరమైన; స్ఫురణన్ = తేజస్సుసు; వహించెనో యనన్= తాల్చెనేమో అనునట్లు; నభోమణి = సూర్యుఁడు; కషాయదీధితిన్ = ఎఱ్ఱనికాంతిని; తాల్చెన్= ధరించెను.

తా. ప్రవరుఁడు, లేఁతప్రాయము గలిగి యొకనికి భార్యగాక తనకు భోగింపఁదగినదై తన్నువలచిన వరూథినిని గూడక యన్యస్త్రీ యను నిమిత్తమును గల్పించుకొని దానిని మన్మథబాధకు లోఁబఱచిపోయెనను కోపముచేత నెఱ్ఱదనమును బొందెనో యనునట్లు ఎఱ్ఱగా సూర్యుఁడు ప్రకాశించెను. ప్రవరుఁడు వరూథినిని విడనాడుట దోష మనియు, సత్పురుషులు దానికి సహింపరుగాన సూర్యుఁడు కోపించినవాఁ డయ్యె ననియు సంబంధము. సూర్యుఁ డెఱ్ఱగా వెలిఁగె ననుటచేత సూర్యాస్తమయసమయ మయ్యె నని భావము. అలం. పరికరము, ఉత్ప్రేక్ష, కావ్యలింగమును.

సీ. ఉరుదరీకుహరసు ప్తోత్థశార్దూలముల్, ఝురవారి శోణిత శంకఁ ద్రావ
వనకుంజమధ్యశా ద్వలచరన్మృగపంక్తి, దావపావకభీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతర భూరు హాగ్రముల్ మునికోటి, బద్ధకాషాయవి భ్రాంతిఁ జూడ
ఘనసానుశృంగశృం గాటకంబులఁ గాంచి,యమరులు హేమాద్రి యనుచువాల
తే. గాసెఁ బేశలరుచిఁ గింశుక ప్రవాళ, ఘుసృణ కిసలయ కంకేళి కుసుమగుచ్ఛ
బంధుజీవ జపా రాగ బాంధవంబు, లన్నగంబున జరఠారు ణాతపములు.

టీ. ఉరు...శార్దూలముల్ - ఉరు = పెద్దవైన; దరీకుహర = గుహారంధ్రములయందు; సుప్త = నిద్రించినవై; ఉత్థ = లేచిన; శార్దూలముల్ = పెద్దపులులు; ఝరవారిన్ = సెలయేళ్ళయందలినీటిని; శోణితశంకన్ = నెత్తురనెడి భ్రాంతిచేత; త్రావన్ = త్రాగఁగా - పులులు గుహలయందు నిద్రించి నిద్రమత్తు తీఱకమునుపే బయటికి వచ్చి, యెఱ్ఱగాఁ గనఁబడుచున్న సెలయేటినీళ్లను జూచి నెత్తు రని భ్రమించి త్రాగఁగా ననుట; వన...పంక్తి - వన = అడవి యందలి; కుంజ=పొదరిండ్లయొక్క; మధ్య = నడిమి ప్రదేశమునందలి; శాద్వల=పచ్చిక నేలలందు; చరత్ = మేయుచున్న; మృగపంక్తి = జింకలగుంపు; దావపావకభీతిన్ = కారుచిచ్చనెడి భయముచేత; తల్లడిల్లన్ = చలింపఁగాను - అడవియందుఁ బొదరిండ్లనడిమి పచ్చికనేలలందు మేయుచున్నజింకలు చుట్టునున్న పొద లెఱ్ఱగాఁ గాన్పించుటచేతఁ గార్చిచ్చు మండుచు వచ్చుచున్నదని భ్రమసి వెఱచి పాఱఁగా ననుట; ఆశ్రమాంతరభూరుహాగ్రముల్ - ఆశ్రమ = మునిపల్లెలయొక్క; అంతర = మధ్యభాగములందున్న; భూరుహ = వృక్షములయొక్క; అగ్రముల్ = కొనలను; మునికోటి = మునులసమూహము; బద్ధకాషాయవిభ్రాంతిన్ = ఎండఁగట్టిన కావివస్త్రములనెడి భ్రమచేత; చూడన్ = చూడఁగాను - యతులు తమ యాశ్రమములందలి వృక్షములకొనలెఱ్ఱఁగాఁ గనఁబడుటచేఁ దమ కావికోక లెండఁ గట్టి విప్పమఱచితిమా యని భ్రమించిచూడఁగా ననుట; ఘన.. శృంగాటకంబులన్ - ఘన గొప్పవైన; సాను = చఱియలను; శృంగ = శిఖరములను; శృంగాటకంబులన్ = చదుకములను - నాలుగుదారులు కలియుచోట్లను; కాంచి = చూచి; అమరులు = దేవతలు; హేమాద్రి యనుచున్ = బంగారుకొండ యని - (తమ నివాసస్థానమయిన) మేరుపర్వత మని; వాలన్ = (విమానములనుండి) దిగి రాఁగాను - విహారార్థముగా

విమానము లెక్కి, యాకాశమునందు విహరించుచున్న దేవతలు చఱియలు, శిఖరములు, చదుకములు బంగారుచాయతోఁ గనఁబడఁగా హిమవంతమునే మేరువుగాఁ దలంచి, దానిమీఁదికి దిగఁగా ననుట; అన్నగంబునన్ = ఆ మంచుకొండయందు; కింశుక ... బాంధవంబులు - కింశుక = మోదుగుపువ్వుల యొక్కయు; ప్రవాళ = పగడములయొక్కయు; ఘుసృణ = కుంకుమపువ్వుయొక్కయు; కిసలయ = చిగుళ్లయొక్కయు; కంకేళికుసుమగుచ్ఛ = రక్తాశోక పుష్పముల గుత్తులయొక్కయు; బంధుజీవ = మంకెనపువ్వులయొక్కయు; జపా = దాసానిపువ్వులయొక్కయు; రాగ = ఎఱుపునకు; బాంధవంబులు = చుట్టములు - ఆ యెఱుపునుబోలినవియైన; జరఠారుణాతపములు = వృద్ధుఁడైన సూర్యునివెలుఁగులు - సంధ్యాకాలపు ముదిరిన యెండలు; పేశలరుచిన్ = వేఁడిమిలేనికాంతితో; కాసెన్ = ప్రకాశించెను. అనఁగా సూర్యాస్తమయసమయమునందుఁ గాయుచున్న యెండ యెల్లవస్తువులును ఎఱ్ఱగాఁ గనఁబడున ట్లెల్లయెడలను వ్యాపించి, వేండ్రము లేక ప్రకాశించె నని తాత్పర్యము. అలం. భ్రాంతిమంతము, ఉపమయును.

శా. శ్రేణుల్ గట్టి నభోఽంతరాళమునఁ బా | ఱెం బక్షు; లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణ మయ్యె; మృగతృ | ష్ణావార్ధు లింకెన్; జపా
శోణం బయ్యెఁ బతంగబింబము; దిశా | స్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె; సరోజషండములు ని | ద్రాణంబు లయ్యెం గడున్. 12

టీ. పక్షులు; నభోఽంతరాళమునన్ = ఆకాశమధ్యమునందు; శ్రేణుల్ గట్టి= బారులుదీరి; పాఱెన్ = ఎగిరెను. ఉష్ణాంశుపాషాణవ్రాతము = సూర్యకాంతపురాల సమూహము; కోష్ణము = ఇంచుక వేఁడిమిగలది; అయ్యెన్. మృగతృష్ణావార్ధులు = ఎండమావులనెడి సముద్రములు - సముద్రములవలెఁ దోఁచుచున్న యెండమావులు; ఇంకెన్ = వట్టిపోయెను - కనఁబడకపోయె ననుట. పతంగబింబము = సూర్యమండలమును; జపాశోణంబు = దాసానిపువ్వులవలె నెఱ్ఱనైనది; అయ్యెన్. దిశాస్తోమంబు = దిక్కులయొక్క సమూహము; శోభాదరిద్రాణంబు = కాంతిచేతఁ బేదఱికము నొందినది - కాంతిలేనిది. అయ్యెన్. సరోజషండములు = కమలముల సమూహములు; కడున్ = మిక్కిలి; నిద్రాణంబులు = నిద్రను బొందినవి - ముకుళించినవి; అయ్యెన్.

తా. పక్షులు మేఁతకుఁ బోయినతావులనుండి తమతమ యునికితావులకు బారులుదీరి పఱవఁగా, నెండ సోఁకి మండుచున్న సూర్యకాంతపురాలు చల్లఁదనము నొందుచుండఁగా, నెండమావు లణఁగిపోఁగా, దిక్కులఁ గాంతి తఱుఁగఁగాఁ, గమలములు ముడుఁగఁగా, సూర్యమండల మెఱ్ఱవాఱెను. అనఁగాఁ బ్రొద్దు గ్రుంకు సమయ మయ్యెను. అలం. స్వభావోక్తి, ఉపమయును.

క. తరణి యిదె గ్రుంకుచున్నాఁ, డరుదె మ్మని చంద్రుఁ బిల్వ | నరిగెడు రజనీ
తరుణీమణిదూతిక లన, నరిగెం దూర్పునకు నీడ | లతిదీర్ఘములై. 13

టీ. తరణి = సూర్యుఁడు; ఇదె! = ఇదిగో!; క్రుంకుచున్నాఁడు = అస్తమించుచున్నాఁడు; అరుదెమ్ము = (నీవు) రమ్ము; అని = అని చెప్పి; చంద్రున్ = చందమామను; పిల్వన్ = పిలుచుటకై; అరిగెడు...దూతికలు - అరిగెడు = పోవుచున్న; రజనీతరుణీమణి = రాత్రియనెడి స్త్రీయొక్క; దూతికలు = కుంటెనకత్తెలో; అనన్ = అనునట్లు; నీడలు = మనుష్యాదుల నీడలు; అతిదీర్ఘములై = మిక్కిలి నిడుపులై; తూర్పునకున్ = తూర్పుదిక్కునుగూర్చి; అరిగెన్ =పోయెను.

తా. సాయంకాలమునందుఁ దూర్పుతట్టునకు మిక్కిలి నిడుదలై ప్రసరించునట్టి మనుష
నీడలు రాత్రి యనెడు స్త్రీ) తనప్రియుఁడయిన చంద్రుఁడు, ప్రతాపవంతుఁడైన సూర్యుఁ
శత్రురాజునకు వెఱచి, దాఁగియుండఁగా "నీపగవాఁడు నశించుచున్నాఁడు. నీ వింక వెలు
యిప్పుడే రావచ్చు" నని ప్రియవిరహమును సహింపక, యొకరివెంట నొకరినిగాఁ బంపిన దూ
యనున ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

క. క్రుంకె నపరాంబురాశిం, బంకజబంధుఁడు దదీయ బడబా ముఖవీ
క్షాంకురిత కుతుక రథ్యని, రంకుశ వేగాపహృత శ తాంగుఁ[1]డు పోలెన్.

టీ. పంకజబంధుఁడు = తామరలచుట్టమయిన సూర్యుఁడు; అపరాంబురాశిన్ = ప
సముద్రమునందు; తదీయ...శతాంగుఁడుపోలెన్ - తదీయ = ఆ పడమటిసముద్రము ద
ఆ పడమటిసముద్రమునం దుండెడి యనుట; బడబాముఖ = ఆఁడుగుఱ్ఱముయొక్క మొగ
వీక్షా = చూచుటవలన; అంకురిత = మొలచిన - పుట్టిన; కుతుక = కుతూహలముగల - త
గల; రథ్య = రథపుగుఱ్ఱములయొక్క; నిరంకుశ = అడ్డపాటులేని; వేగ = వడిచేత; అపహ
కొనిపోఁబడిన; శతాంగుఁడుపోలెన్ = రథము గలవాఁ డనునట్లు; క్రుంకెన్ = అస్తమి

తా. సూర్యుఁడు పడమటి సముద్రముఁ జేరఁబోవునప్పు డందు బడబాగ్నిని వహి
యాఁడుగుఱ్ఱపు మొగము గానవచ్చుటచేత దానిని గలియవలె నను తమకమున మగవయిన ర
గుఱ్ఱములు మిక్కిలి వేగముగా రథము నీడ్చుకొనిపోఁగా, నా సముద్రమునందుఁ బడెనేమో
ట్లస్తమించెను. (సముద్రమునం దాఁడుగుఱ్ఱ మొకటి యుండుటయు, దానికడుపున బడ
యనుపేర నగ్నియుండి సముద్రములో వచ్చి చేరునట్టి వాననీరంతయుఁ ద్రాగు ననుటయుఁ
ప్రసిద్ధము. సూర్యుని రథమును వహించునది సప్త యను పేరుగల గుఱ్ఱ మొకటియే యని కొంద
ఏడు గుఱ్ఱము లని కొందఱును జెప్పుదురు.) అలం. ఉత్ప్రేక్ష.

వ. ఆ సమయంబున.

సీ. ఏ విహంగముఁ గన్న నెలుఁగి[2]చ్చుచును సారె, కును సైకతంబులఁ గూడఁ
దారి కన్గొని యది తనజోడు గాకున్న, మెడ యెత్తి కలయంగ మింట న
నరసి కన్నీటితో మరలి తామర యెక్కి, వదన మెండఁగ సరో వా
నద్ది త్రావఁగ నైఁప కట్టిట్టు గన్గొని, ప్రతిబింబ మీక్షించి భ్రమసి య
తే. నుఱికి యెఱకలు దడియ వే యొక్క తమ్మి
కరుగు; నరిగి రవంబుతోఁ దిరుగు తేంట్లఁ
బొడుచు ముక్కున; మఱియును బోవు వెదక
సంజఁ బ్రియుఁ బాసి వగ నొక్క చక్రవాకి.

టీ. ఒక్కచక్రవాకి = ఒకానొక చక్రవాకస్త్రీ - ఆఁడుజక్కవపక్షి; సంజన్ =
కాలమునందు; ప్రియున్ = ప్రియుఁడైనభర్తను - మగజక్కవను; పాసి = ఎడఁబాసి; వ
విచారముతో; సైకతంబులన్ = ఇసుకదిన్నెలయందు; ఏ విహంగమున్ = ఏ పక్షిని; కన్న
ప్రాలఁగాఁ జూచినను; ఎలుఁగిచ్చుచును = కూయుచు - తన కంఠస్వరముఁ దెలుపుకొనుచు

1. శతాంగుఁడుఁబోలెన్. పా. 2. గించుచును. పా.

సారెకున్ = మాటిమాటికి; కూడన్ = ఆ చూచినపక్షిని గదియ; తారున్ = పోవును. తారి = అట్లుపోయి; కన్గొని = దానిని జూచి; అది = ఆ పక్షి; తన జోడు = తన జతది; కాకున్నన్=కాక పోఁగా; మెడ యెత్తి = (అందుండి తనప్రియపక్షి యెగిరెనో యేమో యని) మెడ పైకెత్తి; మింటన్ = ఆకాశమునందు; కలయన్ = అంతటను; అరయున్ = వెదకిచూచును. అరసి=వెదకి చూచి; కన్నీటితోన్ = (కనఁబడకపోయెనే యను దుఃఖముచేతఁ గలిగిన) కంటినీటితో; మరలి = తిరిగి; వచ్చి = (తాను ముందున్నచోటికి) వచ్చి; తామర యెక్కి = తామరపువ్వుపై నెక్కి; వదనము = నోరు; ఎండఁగన్ = (అఱచి అఱచి) తడియాఱిపోఁగా; సరోవారిన్ = కొలనినీటి యందు; అద్దున్ = తడుపుకొనును. అద్ది = తడుపుకొని; త్రావఁగన్ = ఆ నీళ్ళు త్రాగుటకు; సైఁపక - (విరహవేదనచే) రుచింపక; అట్టిట్టు = ఆ తట్టు నీ తట్టును; కన్గొని = చూచి; ప్రతిబింబము = నీళ్లలోఁ గనఁబడెడి తననీడను; ఈక్షించి = చూచి; భ్రమసి = (అది తనజతదైన మగపక్షి యని) భ్రమించి; ఉఱుకున్ = (దానిపైని) దుముకును. ఉఱికి = అట్లు దుమికి; ఎఱకలు = ఱెక్కలు; తడియన్= (నీళ్లుతగిలి) తడియఁగా; వేఱొక్క తమ్మికిన్ = మఱియొక తామరపువ్వు మీఁదికి; అరుగున్ = పోవును. అరిగి = (మరియొక తామరమీఁదికిఁ) బోయి; రవంబుతోన్ = ఝుంకారధ్వనితో; తిరుగు తేంట్లన్= సంచరించునట్టి తుమ్మెదలను; ముక్కునన్ = తనముక్కుతో; పొడుచున్ = (వానియుల్లాసమునకు సహింపక) పొడుచును. మఱియును = మరల; వెదకన్ = (ప్రియుని) వెదకుటకు; పోవున్ = (ఇంకొకతట్టు) పోవును.

తా. సాయంకాలమునందుఁ దన ప్రియభర్త నెడఁబాసిన యొక యాఁడుజక్కవ తన ప్రియుఁడు పోయినజాడఁ గానక, యే పక్షిని జూచినను, దనజతపక్షియే యని కదియఁబోవును. అట్లు కదియఁబోయి చూచునెడ నది తనజతది కాకున్న నంతలో నెగిరిపోయెనేమో యని మెడయెత్తి మింటివంకఁ జూచును. మింటివంకఁ బాఱఁజూచియుఁ గనఁబడకున్న దుఃఖమునొంది కన్నీరు పెట్టుకొని, కొలనియొద్దకు వచ్చి, యొక్క తామరపువ్వుపై వ్రాలి, యఱచియఱచి గొంతెండఁగాఁ దడి గలుగ నీళ్లలో గొంతు తడుపుకొని, విరహవేదనచే నా నీళ్లుసైతము త్రావుటకు రుచింపక దిక్కులు సూచుచుండ, నీళ్లలోఁ దన నీడ గానరాఁగా, ఆ నీడ తనజతపక్షియే యని భ్రమసి, దానిపై దుమికి ఱెక్కలు నీటఁ దడియఁగా నందును నిలువక మరియొక తామరపువ్వుమీఁదికిఁ బోయి, యందు ఝుంకారములు సేయుచుఁ దిరుగుచున్న తుమ్మెదలను జూచి, వానిసంచారము తనకు సహింపకపోఁగా వానిని ముక్కుతోఁ బొడిచి తఱిమి; యందును నిలువనోల్లక మరలఁ బ్రియుని వెదకుటకై మఱియొక ప్రక్కకుఁ బోయెను. (పక్షిమాత్రమునకే యిట్టి విరహవేదన కలుగుచుండఁగా సౌందర్యవతియు, యౌవనవతియు నైన వరూథినికి విరహోద్రేక మెటువంటిదిగా నుండునో యను నది దీనిచే నూహ్యము. చక్రవాకపక్షులకు రాత్రులు కన్నులు గానరావు; గనుక నవి ప్రొద్దు గ్రుంకఁగా నప్పటికి వచ్చి తావుచేరని జోడుపక్షి నెడఁబాసి వేదనపడుచుండు ననుట సుప్రసిద్ధము.) అలం. స్వభావోక్తి, భ్రాంతిమంతము.

సీ. రవిబింబ పతన దీ ర్ణ పయోధి గర్భ ని, ర్గత శేష ఫణి ఫణా రత్న రుచియొ
దివసావసాన సం దీప్తాస్తగిరి శిఖా, జ్యోతిర్లతాప్రతా నాతపంబొ
తపన ధూర్దండ ని ర్దళిత దిక్తట దృశ్య, కమలజాండకటాహ కనక ఘృణియొ
చండీశ తాండవో త్సవ సంభృత తుషా, హస్త్రాగ్ర దీప గభస్తి చయమొ

తే. ద్రాగ్విదాహ చ్ఛిదా [1]విని౯ద్రాళిమదవ, దంజనాలాన మూల శ౯య్యావిధాన
వారుణాధోరణాకల్పి౯ తోరు శోణ, మృత్తికారాశియో యన౯ మెఱసె సంధ్య.

టీ. సంధ్య = సంధ్యారాగము; రవి...రుచియొ - రవిబింబ = సూర్యబింబముయొక్క; పతన = పాటుచేత; దీర్ణ = పాయ యిచ్చిన; పయోధి = సముద్రముయొక్క; గర్భ = లోపలి భాగమునందుండి; నిర్గత = బయలువెడలిన; శేషఫణి = (నాగలోకమునం దుండెడి) శేషుఁడనెడి పాముయొక్క; ఫణా = పడగలయందలి; రత్న = మణులయొక్క; రుచియొ = కాంతియో; దివసా...నాతపంబో - దివసావసాన = పగటియొక్క చివరయందు - సాయంకాలమునందు; సందీప్త =చక్కఁగాఁ దేజరిల్లుచున్న; అస్తగిరి = పడమటికొండయొక్క; శిఖా=శిఖరములయందలి; జ్యోతిర్లతా = మెఱుఁగుదుఁదీగెలయొక్క (తీగలవలె వెలుఁగుచుండెడి జ్యోతులయొక్క యని కొందఱు); (కొండమీఁది యడవులలో రాత్రులయందు మెఱుఁగుదుఁదీగలు వెలుఁగుచుండును.) ప్రతాన = సమూహముయొక్క; ఆతపంబో = ప్రకాశమో; తపన...ఘృణియొ - తపన=సూర్యుని యొక్క; ధూర్దండ = రథమునొగచేత; నిర్దళిత = భేదింపఁబడిన - మిక్కిలి పొడువఁబడిన; దిక్తట = దిక్కుయొక్క పార్శ్వభాగమునందు; దృశ్య = తోఁచునట్టి; కమలజాండ= బ్రహ్మాండ మనెడి; కటాహ = పెద్ద కాఁగుయొక్క; కనకఘృణియొ = బంగారుకాంతియో; చండీశ... చయమొ - చండీశ = శివునియొక్క; తాండవోత్సవ = ఉద్ధతనాట్యోత్సవమునందు; సంభృత = పట్టుకోఁబడిన; క్షపా = రాత్రియనెడి స్త్రీయొక్క; హస్తాగ్ర = చేతితుదనున్న; దీప = దివ్వె యొక్క-దివిటీయొక్క; గభస్తిచయమొ=కాంతులయొక్క సమూహమో; ద్రాక్...రాశియో- ద్రాక్ = శీఘ్రముగా; విదాహ = విశేషమయినదప్పిని; ఛిదా = పోఁగొట్టుటయందు; వినిద్రాళు = హెచ్చరికతో నుండెడి; మదవత్ = మదముగల; అంజన = అంజనమనెడి పశ్చిమ దిగ్గజముయొక్క; ఆలాన = కట్టుఁగంబముయొక్క; మూల = మొదట; శయ్యావిధాన = పడుక పఱచునట్టి పనియందు - పడుకవలె నేర్పఱిచినట్లున్న యనుట; వారుణ = వరుణుని సంబంధమైన; ఆధోరణ = మావటివానిచేత; ఆకల్పిక = చక్కఁగాఁ జేయఁబడిన; ఉరు = పెద్దదయిన - విశాలమయిన; శోణమృత్తికారాశియో = ఎఱ్ఱమట్టిప్రోగో; అన౯ = అనునట్టుగా; మెఱసె౯ = ప్రకాశించెను. (మదమెక్కినకొలఁది నేనుఁగునకు దప్పి హెచ్చుననియు; నా దప్పి యెఱ్ఱమట్టిపై బరున్న మాను ననియు గజశాస్త్రమునందుఁ జెప్పఁబడి యున్నది.)

తా. సాయంసంధ్యాకాలమునందుఁ బడమటి సముద్రమునందు సూర్యుఁడు పడుటచేఁ బాయవిచ్చిన సందులనుండి మీఁదికి వ్యాపించిన యాదిశేషుని పగడలయందలి రత్నములకాంతియో, పడమటికొండ శిఖరములందు సూర్యకాంతులు తగ్గఁగానే వెలుఁగుచున్న మెఱుఁగుదు తీగెల వెలుఁగో, సూర్యునిరథము నొగ తాఁకున బ్రద్దలుగాఁ జీలిన దిక్కుమూలమున లోనికిఁ బ్రసరించిన బ్రహ్మాండ మనెడి బంగారుకుండయొక్క స్వర్ణకాంతియో, శివుఁడు తాండవము చేయునపుడు పట్టఁబడిన దివ్విటీ ప్రకాశమో, పడమటిదిగ్గజమునకు మద మెక్కి దప్పికలుగఁగా, నా దప్పి దీర్చుటకొఱకుఁ బఱచిన యెఱ్ఱమట్టిపఱపో యనునట్లు సంధ్యారాగకాంతి వెలుఁగొందెను. అలం. ఉత్ప్రేక్ష.

---

1. వినిద్రాణ. పా.

క. బహుళజలప్లవమాన, ద్రుహిణాండము చెమ్మ యుఱికి ఽ రూక్షార్కవిభా
రహితతఁ గాటుకపట్టెను, రహిచెడి యన నంధతమస ఽ రాసులు బెరసెన్. 18

టీ. బహుళ...ణాండము - బహుళ = అధికమయిన; జల=నీటియందు; ప్లవమాన=తేలుచున్న; ద్రుహిణాండము = బ్రహ్మాండము; చెమ్మయుఱికి = తడి దిగి; రూక్షా...తతన్-రూక్ష = తీక్ష్ణమైన; అర్కవిభా = సూర్యప్రకాశముయొక్క - ఎండయొక్క; రహితతన్ = లేమిచేత; రహి = అందము; చెడి = నశించి; కాటుకపట్టెన్ = నలుపుపాఱిపోయెను; అనన్ = అనునట్లు; అంధతమస రాసులు = కటికి చీఁకటి ప్రోవులు - దట్టమయిన చీఁకట్లు; బెరసెన్ = ఆవరించెను.

తా. ఆవరణజలమునందుఁ దేలుచుండెడి బ్రహ్మాండము వేఁడిమిహెచ్చిన కఱకుటెండ తగులకపోవుటచేతఁ జెమ్మగిల్లి, నలుపుపాఱినదో యనునట్లు దట్టమయిన చీఁకటి బ్రహ్మాండము నావరించెను. (తడిసినవస్తువు టెండసోఁకకున్నయెడల నలుపువారుట యనుభవసిద్ధము.) అలం. ఉత్ప్రేక్ష.

సీ. మృగనాభిపంకంబు ఽ మెయినిండ నలఁదిన, మాయాకి[1]రాతి మై ఽ చాయఁ దెగడి
నవపింఛమయభూష ఽ లవధరించి నటించు, పంకజాక్షుని చెల్వు ఽ సుంక మడిగి
కాదంబనికురుంబ ఽ కలితమై ప్రవహించు, కాళిందిగర్వంబుఁ ఽ గాకు సేసి
తాపింఛవిటపికాం ఽ తారసంవృతమైన, యంజనాచలరేఖ ఽ నవఘళించి

తే. కవిసె మఱియును గాకోల ఽ కాలకంఠ, కంఠ కలకంఠ కరిఘటా ఽ ఖంజరీట
ఘనఘనాఘన సం[2]కాశ ఽ గాఢకాంతిఁ, గటికిచీఁకటి రోదసీ ఽ గహ్వరమున.

టీ. కటికిచీఁకటి = గాఢాంధకారము; (ఇది కర్తృపదము.) మృగనాభిపంకంబు = అనుకుపదనుగా నున్న కస్తూరిని; మెయినిండన్ = దేహమునందంతటను; అలఁదిన...చాయన్ - అలఁదిన=పూసికొన్న; మాయాకిరాతి=కపటపుబోయదానియొక్క- కపటముగా బోయవేషము వేసికొన్న పార్వతియొక్క (పా. మాయాకిరాతు=కపటపు బోయువాఁడయిన శివునియొక్క); మైచాయన్ = దేహకాంతిని, తెగడి = తిరస్కరించి - మించి యనుట; నవపింఛమయభూషలు - నవ = క్రొత్తవయిన; పింఛమయ = నెమిలియీఁకల కుచ్చుతోఁ జేసిన; భూషలు = సొమ్ములను; అవధరించి = అంగీకరించి - పెట్టుకొని; నటించు...చెల్వు - నటించు = నాట్యము చేయునట్టి; పంకజాక్షుని = కృష్ణునియొక్క; చెల్వు = అందమును; సుంక మడిగి = సుంక మిమ్మని యడిగి - తన్నుఁబోలినందులకై సుంక మడుగునంతటి యాధిక్యమును వహించి; (సుంకము = అమ్ముడుసరకుల నమ్మికొనుటకై యిచ్చెడి పన్ను.) కాదంబ...కలితమై - కాదంబ = నల్లని ముక్కు, కాళ్లు, ఱెక్కలు గల హంసలయొక్క; నికురుంబ = సమూహముతోడ; కలితమై = కూడుకొనినదై; ప్రవహించు = పాఱుచున్న; కాళిందిగర్వంబున్ = యమునానదియొక్క అహంకారమును; కాకు సేసి = తిరస్కరించి; తాపింఛ...సంవృతము - తాపింఛవిటపి = చీఁకటి మ్రాఁకులయొక్క; కాంతార = దట్టమయిన యడవులచేత; సంవృతమైన = లెస్సగా నావరింపఁబడినట్టి; అంజనాచలరేఖన్ = కాటుకకొండయొక్క యాధిక్యమును; అవఘళించి = మించి; మఱియును = ఇంకను; కాకోల...కాంతిన్ - కాకోల = మాలకాకులతోడను; కాలకంఠకంఠ = నెమిళ్లమెడలతోడను; కలకంఠ = కోవెలలతోడను; కరిఘటా = ఏనుఁగుల గుంపుతోడను; ఖంజరీట = కాటుకపిట్టలతోడను;

1. కిరాతు పా. 2. సంఘాత. పా.

ఘన = దట్టమైన; ఘనాఘన = వర్షించుచున్న మేఘముతోడను; సంకాశ = సరిపో
అధికమయిన; కాంతిన్ = ప్రకాశముతో; రోదసీగహ్వరమునన్ = భూమ్యాకాశమ
మనెడి గుహయందు; కవిసెన్ = క్రమ్ముకొనెను.

తా. బోయతవేషము ధరించి కస్తూరి పూసికొన్న పార్వతీదేవి, నెమలియీ
ముగాఁ జేసికొన్న కృష్ణుఁడు, నల్లని ముక్కు, కాళ్లు, రెక్కలు గల హంసలతోఁగూడిన
చీఁకటి ప్రాఁకులతోఁపునడుమనున్న కాటుకకొండ, మాలకాకి, నెమలిమెడ, కో
పిట్ట, వానకాలపుమబ్బు మొదలగువాని యాకృతులందుఁ గల మిక్కుటమైన నల్లఁదన
నల్లఁదనముతోఁ గాఱుచీఁకటి యెల్లయెడలను గ్రమ్ముకొనియెను. అలం. నిదర్శన.
పున కతిశయత్వము కలిగించుటకై మృగనాభిపంక మలఁదుట మొదలైనవి చె
అర్జునునికిఁ బాశుపతాస్త్రి మిచ్చుటకు శివుఁడు - పార్వతియుం, దానును గిరా
ప్రత్యక్ష మగుటయు, కృష్ణుఁడు నెమలియీఁకల కుచ్చులను దాల్చి, బృందావనంబు
టయుఁ బురాణప్రసిద్ధములు.)

క. అంతటఁ బ్రాచి నిశాపతి, యంతికగతుఁ డౌట విని ము ఖాలంబి
కుంతలములు దీర్పఁగఁ గొను, దంతపుదువ్వెన యనంగ ధవళిమ

టీ. అంతటన్ = అట్లు చీఁకటి యావరించినతోడనే; ప్రాచి = తూర్పు దిశ
నిశాపతి = రాత్రికిఁ బతియైన చంద్రుఁడు; అంతికగతుఁడు ఔట = దగ్గఱకు
అగుట; విని; ముఖాలంబితమఃకుంతలములు - ముఖ = ముందటిభాగమనెడి ముఖమునంద
వ్రేలుచున్న; తమః = చీఁకటియనెడి; కుంతలములు = ముంగురులను; తీర్పఁగన్ =
రించుకొనుటకు; కొను దంతపుదువ్వెన = తీసికొనునట్టి దంతముతోఁజేసిన దువ్వెన;
అనునట్లు; ధవళిమ = తెల్లఁదనము; తోఁచెన్ = కనఁబడెను - అనఁగాఁ జం
సూచించుచుఁ దూర్పు తెల్లవాఱె ననుట.

తా. అటుపిమ్మటఁ దూర్పు దిక్కనెడి స్త్రీ భర్త యయిన చంద్రుఁడు తను
చున్నాఁడను మాట విని తా నలంకారహీనయయి యుండనేరక ముఖభాగమునం
చీఁకటియనెడి ముంగురుల నెగదువ్వి సవరించుకొనుటకై చేతికిఁ దీసికొన్న దంత
యనునట్లు తూర్పుదిక్కునందుఁ దెలుపు వ్యాపించెను. చంద్రోదయసమయ మయ్యె
అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

చ. మరున కొసంగఁ గాలము త మశ్ఛట గాటుకగా నవోదయ
స్ఫురదరుణప్రభా పథిక శోణిత సిక్త సితోడుభక్తముల్
హరిహయదిజ్మ్నభస్థ్సలము నన్ బలి చల్లి వటాంకముల్ వసూ
త్కరభరితంబునై వెలుఁగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్.

టీ. అత్తఱిన్ = ఆ సమయమునందు; కాలము = సమయ మనెడి పురుషుఁడు;
మన్మథునకు; ఒసంగన్ = ఇచ్చుటకై; తమశ్ఛట = చీఁకటిరాశి; కాటుక కాన్
నాంజనము కాఁగా; నవోదయ...భక్తముల్ - నవ = క్రొత్తయయిన; ఉదయ = ఉ
స్ఫురత్ = తేజరిల్లుచున్న - చంద్రోదయకాలమునందు వెలుఁగుచున్న యనుట; అ
ఎఱ్ఱనికాంతి యనెడు; పథిక = విరహిజనులయొక్క; శోణిత = రక్తము చేత; సి

బడిన; సిత = తెల్లనయిన; ఉడు = నక్షత్రములనెడి; భక్తముఁ = అన్నమును - రక్తాన్నమును; హరిహయ...స్థలమునన్ - హరిహయదిక్ = ఇంద్రునిదగు తూర్పుదిక్కునందుఁగల; నభస్థ్సల మునన్ = ఆకాశప్రదేశమునందు; బలి చల్లి = భూతబలి చల్లి; వటాంకముఁ = మఱ్ఱిచెట్టు గుఱుతుగలదియు; వసూత్కరభరితంబునై = కిరణసమూహ మనెడి ధనరాశిచేత నిండినదియునై; వెలుఁగన్ = (కనఁబడి) ప్రకాశింపఁగా; కాంచి = చూచి; సుధానిధిన్ = (అమృతనిధి యైన) చంద్రుఁడనెడి నిధిని; ఎత్తెన్ = బయటికిఁదీసెను - చంద్రోదయ మయ్యె ననుట.

తా. లోకములో నిధులు త్రవ్వి యెత్తువారు కొన్ని మూలికల రసముఁగూర్చి చేసిన నిధి సాధనపుఁగాటుకను గన్నులకుఁ బెట్టుకొని, నిధి యుండుచోటు గనిపెట్టి, నిధులను భూతములు కాచియుండునందురు కాఁబట్టి యా భూతములు తమ్ము బాధింపకుండుటకై నెత్తురుకూడు తూర్పు తట్టు బలిగాఁబెట్టి, దాని క్రేదే నొక చెట్టు గుఱు తుంచుకొని నిధిని త్రవ్వి యెత్తుదురు. కాఁబట్టి యట్లే ప్రకృతమునందుఁ గాల మనెడి నిధిసాధకుఁడు చీఁకటి యనెడి కాటుక పెట్టుకొని, చంద్రోదయ మగునప్పుడు తూర్పునఁ దోఁచునట్టి యెఱ్ఱనికాంతి యనెడి విరహులనెత్తురు కలిపిన తెల్లని నక్షత్రములనెడి యన్నమును దూర్పుదిశయందు భూతములకు బలిగా వెదఁజల్లి, చంద్రునిలోని కళంక మనెడి మఱ్ఱిచెట్టు గుఱుతు చేసికొని, విరహులను బాధింప మన్మథుని కొసఁగుటకై చంద్రుఁ డనెడి నిధిని త్రవ్వి పై కెత్తెను. (చంద్రునిలోని కళంకమును జింకగాను, కుందేలుగాను, మఱ్ఱిమ్రానుగాను కవులు వర్ణింతురు.) అలం. రూపకము.

మ. జలజాగారపరంపరల్ మఘవదా ౘ శాభిత్తిఁ దీండ్రించుచున్
దళమై వెన్నెలచిచ్చు లంటిన మిళ ౘ ద్బాహ్యాచ్ఛదశ్యామికా
చ్ఛలనం గంది ముడుంగుచో సిమసిమ ౘ చ్ఛబ్దంబుతోఁ బుట్టు న
గ్గలపుంగ్రొంబొగలో యనంగ వెడలెన్ ౘ గర్భస్వనద్భృంగముల్. 22

టీ. జలజాగారపరంపరల్ - జలజ = కమలము లనెడి; అగార = ఇండ్లయొక్క; పరంపరల్ = ఎడతెగని వరుసలు; మఘవదాశాభిత్తిన్ - మఘవత్ = ఇంద్రునియొక్క; ఆశా = దిక్కైన తూర్పు దిక్కనెడి; భిత్తిన్ = గోడమీఁద - గోడవంటి తూర్పు దిక్కునం దనుట; తీండ్రించుచున్ = వెలుఁగుచు; వెన్నెలచిచ్చులు = వెన్నెల యనెడి నిప్పులు; దళమై = దట్టమై; అంటినన్ = తగులుకొనఁగా; మిళత్...ఛలనన్ - మిళత్ = ఒకటితో నొకటి కలిసికొనుచున్న; బాహ్యాచ్ఛద = పైఱేకులయొక్క; శ్యామికా = నలుపనెడు; ఛలనన్ = మిషచేత; కంది = కమలి; ముడుంగుచోన్ = ముడుంగుకొనునప్పుడు; సిమసిమచ్ఛబ్దంబుతోన్ = సిమసిమ యనెడి ధ్వనితోడ; పుట్టు = కలుగుచున్న; అగ్గలపు క్రొంబొగలో = అధికమయిన క్రొత్త పొగలో; అనంగన్ = అనునట్లు; గర్భస్వనద్భృంగముల్ - గర్భ = కమలముల లోపలిభాగము నుండి; స్వనత్ = జుమ్మని ధ్వనిచేయుచున్న; భృంగముల్ = తుమ్మెదలు; వెడలెన్ = బయలు దేఱెను.

తా. చంద్రోదయ మయినతోడనే కమలములనెడి యిండ్లవరుసలు తూర్పుదిక్కనెడి గోడ యందుండి వెన్నెల యనెడి నిప్పుమంటలు లేచి తగులుకొనునప్పుడు మీఁద ముడుఁగుకొనుచున్న పైఱేకుల నలుపునెపముచేఁ గమలి, సిమసిమయనెడి ధ్వనులతో లేచునట్టి పొగలో యనునట్లు ఝుంఝుమ్మనెడి ధ్వనులతోఁ దుమ్మెద లా కమలములలోనుండి వెడలిపోవుచుండెను. చంద్రోదయమై

వెన్నెల వ్యాపింపఁగాఁ గమలములు ముకుళించెను. అవి ముకుళించునప్పుడు వానినుండి తుమ్మెదలు ఝుంకారము సేయుచు లేచిపోయె నని భావము. అలం. రూపకము, అపహ్నవము, ఉత్ప్రేక్షయు.

సీ. శిథిలకైరవదళ ♦ శ్రేణినొక్కులు దీఱె, శశికాంతపంక్తుల ♦ జలము లూఱెఁ
గోరి కాంతలతోఁ[1] జ ♦ కోరముల్ రతిఁ గేఱె, వారాశిగర్వంబు ♦ మేరమీఱెఁ
ద్రోపడి యిరులు ప ♦ టాపంచలై పాఱె, దిఙ్ముఖంబుల వింత ♦ తెలివి సేరెఁ
జక్రవాకంబు ల ♦ బ్జకుడుంగములఁ దూఱెఁ, గామినీకాంతుల ♦ కలఁక దేఱె

తే. మదనుఁ డమ్ములనూఱెహి ♦ మంబు పేరె, జడిసి విరహిణి వగఁ గూఱె ♦ జారచోర
దర్పములుజాఱె రవికర ♦ తాప మాఱెఁ, జూడఁజూడంగఁ దారక ♦ స్ఫురణ దాఱె.

టీ. శిథిల...నొక్కులు - శిథిల = వికాసముచెడిన (పా. ప్రిదిలి = విరిసి); కైరవ = తెల్ల గలువలయొక్క; దళ శ్రేణి = రేకుల వరుసలయొక్క; నొక్కులు = ముడుఁతలు; తీఱెన్ = చక్కఁబడెను - లేకపోయెను. శశికాంతపంక్తులన్ = చంద్రకాంతపు రాలవరుసలయందు; జలములు = నీళ్లు; ఊఱెన్ = ఊఁటయెత్తెను; కోరి = కావలయునని కోరి; కాంతలతోన్ = ప్రియురాండ్రతో; చకోరముల్ = వెన్నెలపులుఁగులు; రతిన్ = సంభోగములయందు; కేఱెన్ = విజృంభించెను. వారాశి గర్వంబు= సముద్రముయొక్క పొగరు - పొంగెత్తి యలలు లేచుట; మేర మీఱెన్ = మితి మించెను - మిక్కిలి హెచ్చెను. త్రోపడి = (వెన్నెలచే) తొలఁగఁద్రోయఁ బడి; ఇరులు = చీఁకటి; పటాపంచలై = కంటికిఁ గానరానిదై; పాఱెన్ = పరుగెత్తిపోయెను. దిఙ్ముఖంబులన్ = దిక్కులముందటిభాగములందు; వింత = క్రొత్తయయిన; తెలివి = తేటఁదనము; చేరెన్ = చేరుకొనెను. చక్రవాకంబులు; అబ్జకుడుంగములన్ = తామరపొదలయందు; తూఱెన్ = చొచ్చెను. కామినీకాంతులకలఁక = కాముకురాండ్రయొక్కయు, (వారిచేఁ గోరఁబడిన) పురుషులయొక్కయు కలఁతపాటు - ప్రణయకలహ మనుట; తేఱెన్ = తేటఁదనము నొందెను - పోయె ననుట. మదనుఁడు = మన్మథుఁడు; అమ్ములు = బాణములను; నూఱెన్ = పదనుపెట్టెను; హిమంబు = మంచు; పేరెన్ = పేరుకొనెను - హెచ్చెననుట; విరహిణి = ప్రియుల నెడఁబాసిన స్త్రీజనము (ఇచ్చట నిది జాత్యేకవచనము); జడిసి = భయపడి; వగన్ = విచారమును; కూరెన్ = పొందెను. జారచోరదర్పములు = విటులయొక్కయు, దొంగలయొక్కయు గర్వములు; జాఱెన్ = తొలఁగెను. జారచోరులు యథేచ్ఛముగాఁ దిరుగుటకుఁ బ్రతిబంధకము గలిగె ననుట. రవికరతాపము = సూర్యకిరణములకాఁక - ఎండవేండ్రము; ఆఱెన్ = చల్లారెను. చూడఁజూడంగన్ = చూడఁగాఁ జూడఁగా - క్రమక్రమముగా ననుట; తారకస్ఫురణ = నక్షత్రప్రకాశము; తాఱెన్ = కానరాకపోయెను.

తా. చంద్రోదయము కాఁగానే కలువలు వికసించెను. చంద్రకాంతశిలలు కరఁగెను. చకోరపక్షులు సంభోగసుఖము ననుభవించెను. సముద్ర ముప్పొంగెను. చీఁకట్లు తొలఁగెను. దిక్కులన్నియుఁ దెల్లగాఁ గనఁబడెను. చక్రవాకపక్షులు తామరతీగజొంపములలో ముడుఁగుకొనెను. స్త్రీ పురుషులు ప్రణయకలహములు మాని క్రీడించిరి. మన్మథుఁడు విరహులను వేధింపసాగెను. మంచు హెచ్చెను. విరహిణీస్త్రీలు చంద్రునివలన విరహవేదన పెరుఁగఁగా విచారపడ

---

1. కాంతలతోఁ జకోరికల్. పా.

సాగిరి. జారచోరుల సంచారము నిలిచిపోయెను. పగటివేళ కాసినయెండవలని వేండ్ర మంతయు వెన్నెలచే నుపశమిల్లెను. నక్షత్రములు క్రమక్రమముగా మఱఁగిపోయెను. (ఇందు విరహిణి యను పదము ఏకవచనాంతముగాఁ బ్రయోగింపఁబడుటచే వరూథిని చంద్రప్రకాశమునకు వెఱచి, దుఃఖము నొందె నను నర్థ మూహింపఁదగియున్నది.) అలం. స్వభావోక్తి.

మ. స్ఫుటసౌగంధికరాగరక్తరుచి మైఁ బూనెం జపాసన్నిధి
స్ఫటికంబట్లుదయాద్రిగైరికశిర స్థానస్థితిం జందురుఁ; డ
చ్చోటు వాయన్ శుచి యయ్యెఁ; నౌఁ; బ్రకృతి న చ్ఛుండైన సన్మార్గి యె
న్నఁటికిం గూటమివంక వచ్చు వికృతి న్మగ్నుండు గానేర్చునే? 24

టీ. చంద్రుఁడు; ఉదయా...స్థితిన్ - ఉదయాద్రి = పొడుపుఁగొండయొక్క; గైరిక = మనశ్శిలాదిగైరికధాతువులతోఁగూడిన; శిరస్స్థానస్థితిన్ = శిఖరప్రదేశమునందలి యునికిచేత; జపాసన్నిధిస్ఫటికంబట్లు = దాసానిపువ్వుయొక్క సమీపమునం దున్న పటికపురాతివలె; స్ఫుట...రుచిన్ - స్ఫుట = వికసించిన; సౌగంధిక = ఎఱ్ఱకలువలయొక్క (మెఱుఁగులు వెదచల్లుచున్న సుగంధులనెడి కెంపులయొక్క యని కొందఱు); రాగ = ఎఱుపువంటి; రక్త = ఎఱ్ఱని; రుచిన్ = కాంతిని; మైన్ = శరీరమునందు; పూనెన్ = ధరించెను. అచ్చోటు = ఆ యుదయపర్వతముయొక్క శిఖరస్థానమును; పాయన్ = విడిచినతోడనే; శుచి = పరిశుద్ధుఁడు - తెల్లని శరీరముకలవాఁడు; అయ్యెన్; ఔన్ = అది యుక్తమే. ప్రకృతిన్ = స్వభావముచేత; అచ్ఛుండైన = నిర్దోషియైనట్టి - తెల్లనివాఁడు అని చంద్రపరమైన యర్థము; సన్మార్గి = మంచినడవడిగలవాఁడు; నక్షత్రమార్గముగలవాఁ డని చంద్రపరమైన యర్థము; ఎన్నఁటికిన్ = ఎప్పటికైనను; కూటమివంకన్ = సహవాసమువలన; వచ్చు వికృతిన్ = వచ్చునట్టి వికారమునందు - దుర్మార్గమునందు; మగ్నుండు = మునిఁగినవాఁడు - ఆశతోఁ బ్రవర్తించువాఁడు; కానేర్చునే? = అగుటకుఁ బాలుపడునా? పాలుపడఁ డనుట.

తా. చంద్రుఁడు తూర్పున నుదయించునప్పు డుదయపర్వతశిఖరమునందలి జాజుడాలు తగులుటచేతనేమో దాసానిపువ్వుదగ్గఱనున్న పటికరాతివలె నెఱ్ఱగాఁ గనఁబడి, యందుండి కొంచెము పైకెగఁబ్రాఁకినపిమ్మట నా యెఱుపు పోయి, స్వభావసిద్ధమయిన తెలుపును వహించి, స్వచ్ఛముగాఁ బ్రకాశించెను. కనుక మంచి నడవడిగల పురుషుఁడు దైవికముగా దుష్టులచెంతఁ జేరి, వారిచేరికవలన నేదే నొక వికారపునడవడి గలవాఁడయినను వారిని విడిచినతోడనే యా వికారపు నడివడిని సైతము విడుచును గాని యట్లే ప్రవర్తింపఁడు. చంద్రుఁడు స్వభావముచేతఁ దెల్లనివాఁడు గనుక నుదయకాలమునం దెఱ్ఱగాఁ గనఁబడినను బిమ్మటఁ గ్రమక్రమముగాఁ దెల్లఁగానే వెలిఁగె నని భావము. అలం. అర్థాంతరన్యాసము, ఉపమయు.

శా. ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితా జాండంబులోఁ జంద్రుఁ డో
ప్పారెం గాలభిషగ్వరుం డవిర[1]ళం బై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్పఁ బాదరసమున్ [2]మర్దించి గ్రాసార్థమై
క్షీరస్థాలికిఁ బెట్టినట్టి గుటికా సిద్ధౌషధంబో యనన్. 25

1. అవిరతం. పా. 2. బంధించి. పా.

టీ. చంద్రుఁడు; ఆరూఢస్థితిన్ = ఆకాశమున కెగఁబ్రాఁకి యున్న యునికియందు; చంద్రికాధవళితాజాండంబులోన్ - చంద్రికా = వెన్నెలచేత; ధవళిత = తెల్లగాఁజేయఁబడిన; అజాండంబులోన్ = బ్రహ్మాండమునందు; కాలభిషగ్వరుండు = సమయమనెడి వైద్యశ్రేష్ఠుఁడు; కాముకశ్రేణికిన్ = విషయేచ్ఛగలిగినవారి సమూహమునకు; మారోత్సాహము = మన్మథోద్యోగము; అవిరళంబై = ఎక్కువయి - ఎడతెగనిదై; నిల్వన్ = నిలుచుటకై - ఉండుటకై; పాదరసమున్ = పాదరసమనెడి ద్రవద్రవ్యమును; మర్దించి = మూలికలతోఁ జేర్చి, గడ్డకట్టునట్లు నూఱి; గ్రాసార్థమై = మ్రింగుటకై; క్షీరస్థాలికన్ = పాలకుండలో; పెట్టి...యనన్ - పెట్టినట్టి= ఉంచినటువంటి; గుటికా = గుళికయగునట్లు; సిద్ధ = సిద్ధులచే సాధింపఁబడిన; ఔషధంబో = మందో; అనన్ = అనునట్లు; ఒప్పారెన్ = ఒప్పెను.

తా. కాలమనెడి మంచివైద్యుఁడు విషయేచ్ఛగల స్త్రీపురుషుల కా యిచ్ఛ యెక్కువగా నిలుచుటకై, పాదరసమును గుళికచేసి, మ్రింగుటకై పాలకుండలో నుంచినట్టిదియు, గుటికాసిద్ధి గల సిద్ధులచే సాధింపఁబడిన యౌషధమువంటి మహిమగలదియు నైన యా గుళికయో యనునట్లు వెన్నెలచేఁ దెల్లగా వెలుఁగుచున్న బ్రహ్మాండమునందుఁ జంద్రుఁడు వెలుఁగుచుండెను. ఇటఁ జంద్రికాధవళితాజాండము క్షీరస్థాలికగాను,జంద్రుఁడు పాదరసగుటికగాను రూపింపఁబడుట నెఱుంగునది. వెన్నెల యెల్లయెడలను వ్యాపించి కాయుచుండఁగాఁ జంద్రుఁ డాకాశమధ్యమునందు వెలుఁగుచుండె ననియు, నట్టి సమయమునందుఁ గాముకులు యథేచ్ఛముగాఁ గ్రీడించి రనియు భావము. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

తే. రాజు తేజస్వియై గ్రహ రాజుమీఁద, నలిగి దాడిగ వెంటాడ నిలువ కతఁడు
బెగడుపడి పాఱుచోఁ జెఱఁదగిలినట్టి,ఛాయ యిదియన నీలలాంఛనము మెఱసె.

టీ. రాజు = చంద్రుఁ డనెడిరాజు; తేజస్వియై = ప్రతాపవంతుఁడై; గ్రహరాజుమీఁదన్= సూర్యుఁడనెడి పగరాజుమీఁద; అలిగి = కోపించి; దాడిగన్ = ఆతని గెలువ దండువెడలుటగా; వెంటాడన్ = వెంబడించి తఱుమఁగా; అతఁడు = ఆ సూర్యుఁడనెడిరాజు; బెగడుపడి = భయపడి; నిలువక = తన పగవాని నెదిరించి నిలువఁజాలక; పాఱుచోన్ = పరుగెత్తిపోవునప్పుడు; చెఱన్ = చెఱలో; తగిలినట్టిఛాయ = చిక్కుకొన్న ఛాయాదేవి; ఇది = ఈ కనఁబడునది; అనన్ =అనునట్లు; నీలలాంఛనము = నల్లనిదైన చంద్రునిలోని కళంకము; మెఱసెన్ = ప్రకాశించెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. కలయ జగమునఁ గలయట్టి నలుపు లెల్లఁ
దెలుపులుగఁ జేసి నీడలు దెలుపు సేయఁ
గా వశముగామిఁ బాడము దుగి ఖమునఁబోలె
సాంద్రచంద్రిక తుహిన బాష్పము[1]లఁ గురిసె. 27

టీ. సాంద్రచంద్రిక = దట్టమయిన వెన్నెల; జగమునన్ = లోకమునందు; కలయన్ = ఎల్లయెడలను; కలయట్టి నలుపులెల్లన్ = ఉండునట్టి నల్లనివస్తువులనెల్లను; తెలుపులుగన్ = తెల్లని వస్తువు లగునట్లు; చేసి = చేసియు; నీడలు = వృక్షములు మొదలగువాని నీడలను; తెలుపు చేయఁగాన్ = తెల్లనివిగాఁ జేయుటకు; వశముగామిన్ = శక్యముకాకపోవుటచేత; పాడము

1. ములు. పా.

దుఃఖమునఁబోలెన్ = పుట్టిన దుఃఖముచేత నేమో యనునట్లు; తుహినబాష్పములన్ = మంచ నెడు కన్నీళ్లను; కురిసెన్ = కురియించెను.

తా. వెన్నెల దట్టముగాఁ గాయఁగా మంచు గురియ నారంభించెను. ఆ మంచు కురియుట యెట్లుండె ననఁగా,—వెన్నెల, తాను దన తెలుపుచే లోకములోఁ గల నల్లనివానినెల్లఁ దెల్లఁగాఁ జేసియు, వృక్షాదుల నీడలను మాత్ర మట్లు చేయనేరక యందులకై దుఃఖించి, కన్నీళ్లు విడిచె నేమో యన్నట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

వ. మఱియు వికసితకైరవంబులగు సరోవరంబుల నిజధవళధాళధళ్యంబున నాక్రమించి యందు నానందించు నరవిందమందిరకుం బుట్టినింటి సొబగు చూపి, చూపఱకు నిందుబింబం బిది గ్రహంబు లివి యనునంతరంబు లేకుండ నేకవర్ణంబు గావించి, సేవించు చకోరకదంబంబులపుక్కిళ్లకు వెక్కసంబై ముక్కులకు నెక్కి చిక్కంబడి, యొండొండ బొండుమల్లియలదండడిం దొరఁగుపుప్పొళ్లనుప్పతిల్లునెత్తావులకు వెకలులై యూడు మొకరితుమ్మెదలు రొదలు గల[1]మిడుంగురుం బురువులట్లు మిసమిసని మెఱయ[2] నసిమెఱుంగుముత్తంబుల నుమిసి [3]మినుమిసిడంబుమిసి, యందందఁ బ్రవహించు నిందూపలస్యదంబులకు విందులగు నిందీవరమరందంబుల బెందడిం బడి బందన గొనువలిమించు [4]క్రొమ్మంచుటూదు లీఁదియీఁది, వడి సడలి సుశీవడుచు నోడ లోము సోమరిగాలియలవ్రాకపోఁకులం గదలెం గదల వనం గదలు నుపవన కదళీ కేతకీ తాల హింతాల నారికేళ పూగావళి కోమల పలాశద్రోణికల నునుపుగల పొరలయోరల శరధితరఁగలమీఁదనుంబోలె గిఱికొని, యెల్లవల్లికలుం బూవకపూచిన ట్లుల్లసిల్ల త్రుల్లుల్లసిల్లినచందంబునం దెల్లతెల్లనై, మొల్లమిగ నంతకంతకు దిగంతంబులఁ దంతంబులు దీరిచిన యిడుపులుంబోలెఁ దీంద్రింప, రేయెండ దానగుటం జేసి యెండమావులం బుట్టించెననం బట్టుగల పటికంపు రాచట్టునేలల నెట్టుకొని, వెండియుం జిట్టకంబులకుం బెడమొగంబు వెట్టుకొని, పట్టఁబట్టం బోవు ప్రాణభర్తలవెంటం బడి నూపురంబులు మొరయ వేనలులు విరియఁ గ్రమంబునం బుట్టు నిట్టూర్పుపవనంబు జవంబునం బైకొం గెడలింప నందనికౌఁగిటం బొదవి ప్రియంబు చిలుకం బలికి ముద్దాడు జవరాండ్రదంతచంద్రికల సాంద్రతం బంతంబు మెఱసి, మంతనంపువేళల మాటతబ్బిబ్బునం బుట్టు పొలయలుకలం దలలు వంచి రొద లేని నాలియేడ్పు లేడ్చు ప్రియల ననునయింప నింపునం జనవు మెఱసి చెక్కుటద్దంబులు నొక్కి, మొగం బెగయ నెత్తి ముత్తియంపుముంగఱరంగునఁ గడలుకొను బుడిబుడికన్నీటం బ్రతిఫలించి తుఱంగలించు తనదు నిగనిగలు గనుంగొని నగెనగె ననుచుం జుంబనం బిడంబోయి కెంగేల నదరంట వాటువడు కాముకుల వెలవెలపాటుకూటువం గోటికిఁ బడగ

1. మెఱుంగుడుం. పా. 2. మెఱవ. పా. 3. 'మినుమిసిడంబు' కొన్నింట లేదు. 4. క్రొమ్మించుబొదరు. పా.

లెత్తి, పిండి చల్లినగతిం గాయ [1]డాయ లజ్జించి బుజ్జవంబునం బొదరిండ్లకుం దార్చి, కాంతులం గవయు నంగనాచులగు నంగనల యంగంబులపస ముంగిటం బడఁ జలితకిసలయాంతరాళంబులం దూఱి తూఱి యిరులు విరియించి, పతుల ప్రార్థనంబులం బుంభావసురతాడంబరంబునకుఁ దోడుసూప దూపటిలి యంగ రాగంబులు గరంగం జెమర్చిన చంచలాక్షుల నిద్దంపుఁదనూలతలం బుట్టి దట్టంబులగు చిఱుచెమటబొట్టులం బొడకట్టి తెలుపారు మలయజంపుఁ జిటులు గందంబుల యందంబు లొసంగి, సంజకడం దారు నొడివిన సంకేతంబుల నుండక తెరువుగట్టి పొరువుఁదరువులనీడల నడంగి నవ్వూటాలకు వెనుకపాటునఁ గదిసి ముసుంగు లెడలింప, బెగడి కళవళంపుఁజూపుల వల్లభులం జూచి యల్లన నగు నభిసారికల వెడందకన్నుల చెన్నున నన్నుకొని, పొదలు మదనోన్మాదంబునకుం బోఁదిగా మోదంబునం గాదంబరి గండూషించి విటకదంబంబునకు నొసంగు నంబురుహముఖుల యొప్పులకుప్పలగు నిప్పపూమొగ్గలంబోని బుగ్గలం దగ్గలిక సూపు కమ్మపంజుల వజ్రపుంజకచకల నకనకలు వీడుకొని, కలికితనంబునం గలసి మెలసి, రతాంతంబునం బరిశ్రాంతి[2]యడంగ నంగణంబుల నిలిచి యొండొరుల కురులు దువ్వుచు విహరించుసమయంబునం బల్లవులు కేళి కల్లప్పు డన్న తమ మాటలు దలంపించిన నుదరిపడి మందస్మితంబు లంకురించు హుంకృతుల జంకించి కంకణంబుల రత్నంపుఁ దళుకులు సెదర నుంకించి వైచు చేమం[3]తి పూబంతులం బుటపుటనై, మిటమిటం గాయు [4]దట్టంపుఁబండువెన్నెల మెండున బెండువడి, డెందంబు గంది, తాలిమి చిందువందై, కెందలిరుపాన్పునం దనువుపొందక లేచి కూర్చుండి, కన్నీరు గోట మీటుచు బోటితో వరూథిని యి ట్లనియె. 28

టీ. మఱియుఁ = ఇంతేకాక; (వెన్నెల కర్తృపదము.) వికసితకైరవంబులగు = విరియఁ బూచిన కలువలుగలట్టి; సరోవరంబులన్ = మేలైన కొలఁకులను; నిజ...బునన్ - నిజ = తనదైన; ధవళ = తెలుపుయొక్క; ధాళధళ్యంబునన్ = ధళధళయను ప్రకాశముచేత; ఆక్రమించి = ఆవ రించి; అందున్ = ఆ సరోవరములందు; ఆనందించు నరవిందమందిరకున్ = సంతోషించుచుండు నట్టి లక్ష్మీదేవికి; పుట్టినింటిసొబగు = పుట్టినయిల్లయిన పాలసముద్రముయొక్క యందమును; చూపి= కనఁబఱిచి - పాలసముద్రమువలెఁ, దెల్లఁదనము మించునట్లు చేసె యనుట. (పా. సోలిక చూపి.) (ఈ వాక్యమునందు అలం. ఉపమ.) చూపఱకున్ = చూచువారికి; ఇందుబింబంబిది=ఇది చంద్రమండ లము; గ్రహంబు లివి = ఇవి శుక్రాదిగ్రహములు - ఇందు గ్రహశబ్దముచేత నక్షత్రములన్నియు గ్రాహ్యములు. అను నంతరంబు = అనునట్టి భేదము; లేకుండన్ = లేక యుండునట్లు; ఏకవర్ణము= ఒక్కటే వర్ణము - తెల్లవన్నె యొక్కటే యగునట్లు; కావించి = చేసి; (ఇందు అలం. మీలనము.) సేవించు...పుక్కిళ్లకున్ - సేవించు = వెన్నెల ననుభవించునట్టి; చకోర = వెన్నెలపులుఁగుల యొక్క; కదంబంబుల = గుంపులయొక్క; పుక్కిళ్లకున్ = బుగ్గలలోపలిభాగములకు - నోళ్ల

1. డాయుటకు. పా. 2. యెడల. పా. 3. చేమంతిబంతు. పా. 4. తండంపు.పా.

లోనికి; వెక్కసంబై = మిక్కుటమై; ముకుళులకున్ = ముకుళలలోపలికి; ఎక్కి = ఎగఁదట్టి; చిక్కంబడి = చిక్కనై; (అలం. అతిశయోక్తి.) ఒండొండ = ఒక్కటొక్కటే - క్రమక్రమముగా ననుట; బొండు మల్లియలన్ = గుండ్రని పెనుమల్లెలవలననుండి; దండడిన్ = తఱుచుఁదనముతో - విశేషముగా ననుట; తొరఁగుపుష్పాళ్లన్ = రాలునట్టి పూవుదమ్ముల చేత; ఉప్పతిల్లునెత్తావులకున్ = పుట్టుచున్న నిండు పరిమళములకు; వెకలులై = అసక్తినొందినవై; ఆడు మొకరి తుమ్మెదలు = (అంతరాంగమునందు) చరించునట్టి ఝుంకారధ్వనితోడి తుమ్మెదలు; రొదలు గల మిడుంగురుంబురుపులట్లు = ధ్వనులుగల మిడుఁగురుఁబురుగులవలె; మిసమిసని మెఱయన్ = మిసమిసలాడుచు వెలుఁగఁగా; నసిమెఱుఁగు మొత్తంబులన్ = నిగ్గయిన వెలుఁగుప్రోవులను; ఉమిసి = వెళ్లఁగ్రక్కి; మినుమిసిడంబు = వెన్నెలకాంతిని; ఉమిసి = వెడలఁగ్రక్కి - బొండు మల్లెపూదుమ్ముల పరిమళము ననుభవింపఁ బాఱాడు తుమ్మెదలు వెన్నెలపై సోఁకుటచే మిడుఁగురుఁబురుగులవలె మిసమిసలాడునట్టి కాంతులతోఁ బ్రకాశించె ననుట. (అలం. ఉత్ప్రేక్ష.) అందంద = మఱిమఱి - మిక్కిలి యెక్కువగా; ప్రవహించు...స్యందంబులకున్ - ప్రవహించు = పాఱుచున్న; ఇందూపల = చంద్రకాంతశిలలయొక్క; స్యందంబులకున్ = నీటియూఁటలకు; విందులు = చుట్టములు - సరిపోలినవి; అగు...బెందడిన్ - అగు = అయిన; ఇందీవర = నల్లగలువలవలని; మకరందంబుల = తేనెలయొక్క; బెందడిన్ = పల్లపుఁదావుల బురదనీటియందు; పడి = పడినవై; బందనగొను...బౌదులు - బందనగొను = జిగటపాఱిన; వలిమించు = చలిహెచ్చుచున్న; క్రొమ్మంచు బౌదులు = క్రొత్త మంచునీళ్ల కాలువలు; ఈఁదియాఁది = బహుదూరము ఈఁది; వడి సడలి = వేగము తగ్గి; సుడివడుచున్ = సుడిపడుచు; ఒడలు = దేహమును; ఓము...సోఁకులన్ - ఓము = కాపాడుకొనునట్టి; సోమరిగాలి = మందమారుతముయొక్క; అలవోకసోఁకులన్ = లీలగాఁ దాఁకుటల చేత; గదలెం గదలవు = కదలెనో కదలలేదో; అనన్ = అనునట్లు; కదలు...ద్రోణికలన్ - కదలు = కొంచెము కదలునట్టి; ఉపవన = ఉద్యానవనములయందలి; కదళీ = అరఁటిచెట్లయొక్కయు; కేతకీ = మొగలిచెట్లయొక్కయు; హింతాల = ఈఁతచెట్లయొక్కయు; నారికేళ = కొబ్బరి చెట్లయొక్కయు; పూగ = పోకచెట్లయొక్కయు; ఆవళీ = వరుసలయొక్క; కోమల = మృదువులైన; పలాశద్రోణికలన్ = దోనెలవంటి యాకులయందు; నునుపు = నున్నఁదనము; కల పొరలయోరలన్ = కలిగిన యావరణముల యంచులందు; శరధితరఁగలమీఁదనుం బోలెన్ = సముద్రపుఁ గరళ్లపైనివలె; గిఱికొని = ఆవరించుకొని; (అలం. ఉపమ.) ఎల్లవల్లికలున్ = అన్ని తీగెలును; పూవక = పుష్పింపకయే; పూచినట్లు = పుష్పించినట్లు; ఉల్లసిల్లన్ = ఒప్పఁగా; ఔల్లు = ఔల్లుగడ్డి; ఉల్లసిల్లిన చందంబునన్ = పూచి విరియఁబడినట్లును; తెల్లతెల్లనై = మిక్కిలి తెల్లఁదనముగలదై; మొల్లమిగన్ = దట్టముగా; అంతకంతకున్ = అప్పటప్పటికి; దిగంతంబులు = దిక్కులకొనలు; దంతంబులన్ = ఏనుఁగుదంతముల చేత; తీరిచినయిడుపులుంబోలెన్ - తీరిచిన = దిద్దిన; ఇడుపులుంబోలెన్ = పార్శ్వభాగమువలె; తీండ్రింపన్ = ప్రకాశింపఁగా; తాన్; రేయెండ = రాత్రివేళఁ గాయునట్టి యెండ - వెన్నెల; అగుటంజేసి; ఎండమావులన్ = బయళ్ళయందు నీటివెల్లువలెఁ దోఁచునట్టి కిరణప్రసారములను; పుట్టించెను = కలిగించెను; అనన్ = అనునట్లు; పట్టుకల = అవకాశము కలిగిన; పటికంపురా = స్ఫటికపురాలచేతను; చట్టునేలలన్ = రాతివలె గట్టిపడిన నేలలయందు; నెట్టుకొని = పాదుకొని - దట్టముగా వ్యాపించి; (అలం. ఉత్ప్రేక్ష.) వెండియున్ = మఱియును; చిట్టకంబులకున్ = చెర్లాటములకు; పెడమొగంబు పెట్టుకొని = మాఱుమొగములు పెట్టుకొని - ముఖములు వెనుకకుఁ ద్రిప్పుకొని యనుట; పట్టఁబట్టన్ =

పట్టఁగాఁ బట్టఁగా; పోవు...వెంటంబడి - పోవు = పట్టున కందక పాఱిపోవునట్టి; ప్రా
మగలయొక్క; వెంటంబడి = వెంబడిఁదగిలి; నూపురంబులు = కాలియందెలు; మొ
మ్రోగఁగా; వేనలులు = సిగముళ్లు - కొప్పులు; విరియన్ = వీడఁగా; (పా. ఉరియన్
పఁగా.) క్రమంబునన్ = వరుసవెంబడిని; పుట్టు...పవనంబు - పుట్టు = కలుగుచున్న;
పవనంబు = దీర్ఘశ్వాసమువలని గాలి; జవంబునన్ = వేగముచేత; పైఁటకొంగు = పయ
గును; ఎడలింపన్ = తొలఁగింపఁగా - తమప్రయత్నము లేకయే పయఁటచెఱఁగు
ననుట; అందనికౌఁగిటన్ = అమరని భుజాంతరమునందు; పొదివి = అదిమి పట్టుకొని;
చిలుకన్ = ప్రేమ యతిశయించునట్లుగా; పలికి = మాటలాడి; ముద్దాడు...సాం
ముద్దాడు = ముద్దుపెట్టుకొనునట్టి; జవరాండ్ర = యౌవనస్త్రీలయొక్క; దంతచంద్రికల
వరుసమెఱుఁగులనెడి వెన్నెలయొక్క; సాంద్రతన్ = దట్టపుఁదనముచేత; పంతంబు
పద్దు దెలుపుకొని - తమ యాధిక్యమును బయలుపఱచి యనుట; మంతనంపు వేళలన్
సమయములందు; మాటతబ్బిబ్బునన్ = మాటల తడఁబాటుచేత; పుట్టు పొలయ
కలిగిన; ప్రణయకోపములచేత; తలలు వంచి; రొద = ధ్వని; లేని నాలియేడ్పులు
కపటమైన యేడ్పులు; ఏడ్చు ప్రియలన్ = ఏడ్చునట్టి ప్రియురాండ్రను; (ధ్వనిలేక
పరులకుఁ దెలియకుండుటకై యని యెఱుంగునది.) అనునయింపన్ = ఊరడించ
ఇంపునన్ = ఇష్టముతో; చనవు = తనకుఁగల స్వాతంత్ర్యమును; మెఱసి = మెఱ
కనఁబఱచి; చెక్కుటద్దంబులు = అద్దములవంటి చెక్కిళ్లను; నొక్కి = గోళ్లచే
మొగంబు; ఎగయనెత్తి = పైకెత్తి; ముత్తియంపు ముంగఱరంగునన్ = ముత్తెము
ముక్కఱ విధమున; కడలుకొను బుడిబుడి కన్నీటన్ = ఉబికి ముక్కుమీఁదుగా
కొంచెపుఁ గంటినీటియందు; ప్రతిఫలించి = ప్రతిబింబించి; తుఱంగలించు తనదు ని
ప్రకాశించునట్టి తనయొక్క నిగనిగని వెలుంగులను; కనుంగొని = చూచి; నగె
నవ్వెను నవ్వెను; అనుచున్ = అని పలుకుచు; చుంబనం బిడంబోయి = ముద్దు పెట్టుకొ
కెంగేలన్ = ఎఱ్ఱనిచేతులతో; అదరంటన్ = చుఱుకుముట్టు; వాటు...కూటువన్ - వ
దెబ్బపడునట్టి; కాముకుల = కామాసక్తులయిన పురుషులయొక్క; వెలవెలపాటు
బోవుటయొక్క; కూటువన్ = (తెల్లఁదనపు) చేరికచేత; కోటికిం బడగలెత్తి = న
లకు నొకటెక్కెమునెత్తి - మేరలేని కలిమి నొంది యనుట; మిక్కిలి ధావళ్యసంప
యని భావము. (అలం. ఉత్ప్రేక్ష.) పిండి చల్లినగతిన్ = తెల్లనిపిండి పఱపినరీతిని;
వెన్నెల ప్రకాశింపఁగా; డాయన్ = దగ్గఱఁజేరుటకు; లజ్జించి = సిగ్గుపడి; బుజ్జవ
లాలన చేయుటచేత; పొదరిండ్లకున్ = తీగెయిండ్లలోనికి; తార్చి = చేర్చి - తీసి
యనుట; కాంతులన్ = ప్రియపురుషులను; కవియు నంగనాచులగు = పొందునట్టి
(నంగనాచి = ఎంత సాహసపుఁబని యయినఁజేసి, యేమియుఁ దెలియనిదానివలె
యాఁడుది.) అంగనలయంగంబులపస = స్త్రీలయొక్క యవయవములసత్త - వారి య
లందుఁ దోఁచునట్టి సంభోగచిహ్నములు; ముంగిటంబడన్ = బయలుపడునట్లు; చలితకి
రాళంబులన్ = కదలెడి చిగురుటాకులసందులలో; తూఱితూఱి = చొచ్చిచొచ్చి; ఇరుల
రిండ్లలోని) చీఁకటిని; విరియించి = తొలఁగించి; (అలం. ఉత్ప్రేక్ష) పతులప్రార్థన
ప్రియులయొక్క వేఁడుకొనుటలచేత; పుంభావసురతాడంబరంబునకున్ = ఉపరతియం
భణమునకు; తోడుసూపన్ = సాహాయ్యమును కనఁబఱుపఁగా - పురుషాయితరతిసుఖ

లకుఁ గలిగింపఁగా; దూపటిలి=డస్సి; (దీనికిఁ గర్త చంచలాక్షులే.) అంగరాగంబులు =శరీరమునందుఁ బూసికొన్న గంధపుఁబూఁతలు; కరంగన్ = కరఁగిపోవునట్లు; చెమర్చిన...లతలన్ - చెమర్చిన = చెమటపట్టిన; చంచలాక్షుల = స్త్రీలయొక్క; నిద్దంపు = నునుపైన - నిగనిగ మెఱయుచున్న; తనూలతలన్ = తీగెలవంటి యొడళ్లయందు; పుట్టి; దట్టంబులగు = తఱుచైనట్టి; చిఱు చెమటబొట్టులన్ = చిన్నచిన్న చెమటబిందువులయందు; పొడకట్టి = ప్రతిఫలించుటచేతఁ గనఁబడి; తెలుపాఱు...అందంబులు - తెలుపాఱు = తెలుపెక్కిన; మలయజంపు = శ్రీచందనముయొక్క; చిటులు = చిట్లిన - పగుళ్లువాఱిన; గందంబుల = పరిమళముగల గందంపుఁ బూఁతలయొక్క; అందంబులు = చక్కఁదనములను; ఒసంగి = ఇచ్చి - కలుగఁజేసి; (ఆ స్త్రీల దేహములందలి చిఱు చెమటబొట్లలోఁ జిట్లిన గంధపుఁబూఁతవలె వెన్నెల చూపట్టె నని భావము.) (అలం - నిదర్శన.) సంజకడన్ = సంధ్యాసమయమునందు; తారు = తమరు; నొడివిన సంకేతంబులన్ = చెప్పి నిర్ణయించుకొన్న తావులయందు; ఉండక = చెప్పినచొప్పున నుండక; తెరువుగట్టి = దారి గాచి; పొరువుఁ దరువులనీడలన్ = త్రోవవెంబడి యిరుప్రక్కలనుండు వృక్షముల నీడలయందు; అడంగి= దాఁగియుండి; నవ్వాటాలకున్ = ఎగతాళికి; వెనుకపాటునన్ = వెనుకపడుటచేత - వెనుకతట్టుగా ననుట; కదిసి = చేరవచ్చి - తారసించి; ముసుంగులు = (తా మిట్టివారని చూచువారికిఁ దెలియకుండునట్లు వేసికొన్న) ముసుఁగులను; ఎడలింపన్ = తొలఁగఁదీయఁగా; బెగడి = భయపడి; కళవళంపుఁజూపులన్ = తొట్రుపాటుతోడి చూపులతో; వల్లభులన్ = ప్రియులను; చూచి; అల్లనన్ = మెల్లఁగా - ధ్వనికలుగకుండునట్లు; (గట్టిగా నవ్విన నితరు లెఱుఁగుదు రని భావము.) నగు...చెన్నునన్ - నగు=నవ్వునట్టి; అభిసారికల = ప్రియులఁ జేరఁబోవు స్త్రీలయొక్క; వెడంద= విశాలములయిన; కన్నుల చెన్నునన్ = నేత్రములయొక్క యందముచేత - వాని ధవళకాంతులచే ననుట; అన్నుకొని = మత్తిల్లి - మిక్కిలి యతిశయించి యనుట; (అలం. ఉత్ప్రేక్ష.) పొదలు మదనోన్మాదంబునన్ = అంతకంతకుఁ బెరుఁగుచున్న మన్మథసంబంధమైన పిచ్చికి; ప్రోదిగాన్ = పోషణముగా; మోదంబునన్ = సంతోషముతో; కాదంబరిన్ = మద్యమును; గండూషించి = పుక్కిలించి - పుక్కిటఁబెట్టుకొని యనుట; విట కదంబంబునకున్ = విటుల సమూహమునకును; ఒసంగు...బుగ్గలందు - ఒసంగు = ఇచ్చునట్టి; అంబురుహాముఖుల = కమలమువంటి మొగములుగల స్త్రీలయొక్క; ఒప్పులకుప్పలగు = చక్కఁదనాల ప్రోవులైనట్టి; ఇప్పపూ మొగ్గలంబోని = ఇప్పపువ్వుల మొగ్గలవంటి; బుగ్గలందున్ = చెక్కిళ్లక్రింద నుబ్బుగానుండు నవయవములందు; (కల్లు ద్రాగినవారి బుగ్గలు కొంచె మెఱుపు గలిగిన తెలుపు గలిగి యుండునుగనుక నవి యిప్పమొగ్గతోఁ బోల్పఁబడియెను.) అగ్గలిక = ఆధిక్యమును; చూపు...చకచకలు - చూపు = కనఁబఱుచుచున్న; కమ్మపంజుల = దివిటీలవలె వెలుఁగుచున్న కమ్మలయందలి; వజ్రపుంజకచకల = మగరాలకాంతులచేత; నకనకలు = కృశత్వములను; వీడుకొని = వదలి - పరిపూర్ణతనొంది యనుట; (అలం.ఉపమ.) కలికితనంబులన్ = నేర్పరితనములచేత; కలసిమెలసి = కూడిమెలఁగి - సంభోగించి; రతాంతంబునన్ = సంభోగించిన పిమ్మట; పరిశ్రాంతి = (సంభోగమువలనఁ గలిగిన) బడలిక; అడఁగన్= ఉపశమిల్లుటకై; (పా. ఎడలంగన్ = పోవునట్లుగా;) అంగణంబులన్ = ముంగిళ్లయందు - ఇండ్ల ముందఱి యావరణములోని బయళ్లయందు; నిలిచి = నిలువఁబడి; ఒండొరుల కురులు=(స్త్రీపురుషులు) ఒకరి తలవెండ్రుకలు మఱియొకరు; దువ్వుచున్ = చిక్కుదీసి చక్కఁబఱుచుచు; విహరించు సమయంబునన్ = వినోదముగాఁ దిరుగుచున్న సమయమునందు; పల్లవులు = విటకాండ్రు; కేళికిన్ = ఉపరతిక్రీడకు; అల్లప్పుడు = ఆ క్రీడాసమయమునందు; అన్న తమ మాటలు = పలికిన తమయొక్క

పలుకులను - విటకత్తెలు తా మా యుపరతులకై సమ్మతించి పలికిన పలుకులను; తలంపించినన్ = జ్ఞాపకము చేయఁగా; ఉదరిపడి = (సిగ్గుచేత) ఉలికిపడి; మందస్మితంబులు = చిఱునవ్వులు; అంకురించు ఝుంకృతులన్ = పొటమరించుచున్న యవలింపులచేత; జంకించి = కసరుకొని; కంకణంబుల... తళుకులు - కంకణంబుల = ముంజేతి కడియములయొక్క; రత్నంపుఁదళుకులు = రత్నములయొక్క తళతళమను కాంతులు; చెదరన్ = నలుదిక్కులను వ్యాపింపఁగా; ఉంకించి = పూని; వైచు చేమంతి పూబంతులన్ = విసరివేయునట్టి చేమంతిపూలచెండ్లచేత; పుటపుటనై = బలిసి - అతిశయించి యనుట; మిటమిటన్ = మిటమిటయను ననుకరణకాంతితో; కాయు దట్టంపుఁ బండు వెన్నెల మెండునన్ - కాయు = ప్రకాశించుచున్న; దట్టంపు = తఱుచైన; (పా. తండంపు.) పండు వెన్నెల = ముదిరిన వెన్నెలయొక్క; మెండునన్ = అతిశయముచేత; జెండువడి = సొరముచెడి; డెందంబు = హృదయము; కంది = కమలి - తాపమును బొంది; తాల్మి = ధైర్యము; చిందువందై = మిక్కిలి చలించి; కెందలిరుపాన్పునన్ = ఎఱ్ఱని చిగుళ్ల శయ్యమీఁద; తనువు = దేహము; ఒందక = పొందక - పండుకొనియుండ ననువుపడక; లేచి; కూర్చుండి; కన్నీరు; గోటన్ = తన వ్రేలి గోటితో; మీటుచున్ = ఎగఁజిమ్ముచు; బోటితోన్ = చెలికత్తెతో; వరూథిని; ఇట్లనియెన్.

ఉ. నోములు నోఁచినమ్మలు మ ♦ నోరథముల్ దయివాఱ నిత్తఱిం
దామరతంపరై ప్రియులుఁ ♦ దారు విహారము సల్ప వీరిలో
నీమెయి దుఃఖశీల నగు ♦ నే వసియింపఁ దరంబె ? పోద మా
రామముఁ జూడ; నందు సుక ♦ రం బగు సర్వము నంబుజాననా ! 29

టీ. అంబుజాననా! = కమలమువంటి ముఖముగలదానా! - చెలియా! ఇత్తఱిన్ = ఈ సమయమునందు; నోములు నోఁచినమ్మలు = పూర్వజన్మమునందు మంచి వ్రతము లాచరించిన పుణ్యవతులు; మనోరథముల్ = తమకుఁగల కోరికలు; దయివాఱన్ = కొఱఁతలేక నెఱవేఱఁగా; (పా. తనివారన్ = తనివితీరునట్లుగా;) తామరతంపరై = కొఱఁతలేక యభివృద్ధినొంది; - యథేచ్ఛముగా ననుట; ప్రియులున్ = ప్రాణనాయకులును; తారున్ = తామును; విహారము = వేడుకగా మెలఁగుటను; సల్పన్ = చేయుచుండఁగా; వీరిలోన్ = ప్రియులతోఁగూడి విహారసుఖము ననుభవించుచున్న యీ స్త్రీలనడుమ; ఈ మెయిన్ = ఈ ప్రకారమున; దుఃఖశీలను = దుఃఖప్రవర్తనముగలదానను; అగు నేన్ = అయినట్టి నేను; వసియింపన్ = ఉండుట; తరంబె? = శక్యమా? ఆరామమున్ = శృంగారపుఁదోఁటను; చూడన్ = చూచుటకు; పోదము = మనము పోవుదము. అందున్ = ఆ తోఁటయందు; సర్వమున్ = అంతయును; సుకరంబు = సులభము; అగున్.

తా. 'ఓ చెలియా ! మంచి యదృష్టముగల పుణ్యవతులు తమకోరికలు కొనసాఁగఁగాఁ దమకుఁ దగిన ప్రాణభర్తలతోఁ గూడి విహరించుచుండెడి యీ సమయమునందుఁ బ్రియవిరహవేదనచే దుఃఖపడుచున్న నేను పరువు చెడునట్టు వారితో నెట్లు మెలఁగుదును ? ఇతరు లెవ్వరు లేని మన శృంగారపుఁదోఁటకుఁ బోయి, యక్కడ నిర్విచారముగా నుందుద' మ'న్నని వరూథిని చెలికత్తెతో ననెను. సుఖపడుచున్నవారిని జూచునపుడు దుఃఖపడువా రోర్వలేకపోవుట లోకమందు సహజముగుటచే వరూథినియు సుఖము ననుభవించుచున్న తనతోడి యప్సరసలయునికిఁ జూచి యోర్వఁజాలక కనుమఱుఁగుగాఁ బోఁదలఁచె నని భావము. అలం. కావ్యలింగము.

క. అని పలికి పాన్పు డిగి కా, మిని చంద్రాతపమువేఁడి ♦ మికిఁ బైఁటచెఱం
గున ముసుఁ గిడి నిజకేళీ, వనిఁ జొచ్చి వియోగవహ్ని ♦ వడఁబడి తెగువన్,

టీ. అని పలికి = అని చెలికత్తెతోఁ జెప్పి; పాన్పు డిగి = పఱపునుండి దిగి; కామిని = ప్రియ సంగమేచ్ఛగలదైన వరూథిని; చంద్రాతపమువేఁడిమికిన్ = వెన్నెలవలని తాపమునకు; పైఁట చెఱంగునన్ = పయ్యెదకొంగుతోఁ; ముసుఁగిడి = ముసుఁగు వేసికొని - ఎల్లయవయవములును మఱుఁగుపడఁ గప్పుకొని యనుట; నిజకేళీవనిన్ = తనదైన యాటతోఁటను; చొచ్చి = ప్రవేశించి; వియోగవహ్నిన్ = విరహాగ్నిచేత; వడఁబడి = సంతాపమునొంది; తెగువన్ = సాహసముతోఁ. తర్వాతి పద్యముతో నన్వయము.

సీ. చనుఁగప్పుదొలఁగ వాసనగాలికెదు రేఁగుఁ, బరు వొప్ప నలుఁగులఁ బాఱుకరణి
నిడుదవేసలినూనెముడి[1]వీడఁ జిగురాకుఁ, బొదఁదూఱుఁ గార్చిచ్చుఁ గదియుకరణిఁ
బసిఁడిగాజులుపైకి వెసఁద్రోచి నునుఁదీగఁ, దెమలించు నురిత్రాడు నెమకుకరణి
మొలనూలుబిగియించి వెలఁదివెన్నెలఁ జొచ్చుఁ, బిఱుదీయ కేటిలో నుఱుకుకరణి

తే. జడియ దళులకుఁ గురియు పుప్పొడుల మునుఁగు
మావికడ నిల్చు విరులనెత్తావిఁ గ్రోలు
విషమసాయకు[2]తూఁపుల విసివి విసివి
తనువుఁ దొఱఁగంగఁ దలఁచి యవ్వనరుహాక్షి. 31

టీ. అవ్వనరుహాక్షి = తామరలవంటి కన్నులు గలదైన యా స్త్రీ - వరూథిని; విషమసాయకు తూపులన్ = మన్మథుని బాణములచేత; విసివి విసివి = మిక్కిలి విసుఁగునొంది; తనువున్ = దేహమును; తొఱఁగంగన్ = విడుచుటకు; తలఁచి = ఎంచి; పరువు = పరుగు; ఒప్పన్ = ఒప్పునట్లు; అలుఁగులన్ = బాణములలో - బాణములు తనమీఁదికి వచ్చుచుండఁగా వాని కెదురుగా ననుట; (అణఁగులన్ = కత్తులమీఁద అని కొందఱు.) పాఱుకరణిన్ = పరుగెత్తు విధమున; చనుఁగప్పు = స్తనములకు మఱుఁగుగా నున్న పయఁట; తొలఁగన్ = జాఱిపోఁగా; వాసనగాలికిన్ = పరిమళముతోడి చల్లగాలికి; ఎదురేఁగున్ = ఎదురుగాఁ బోవును. కార్చిచ్చున్ = దావాగ్నిని; కదియుకరణిన్ = చొచ్చెడిరీతిని; నిడుద...ముడి - నిడుద = నిడుపైన; వేసలి = జాఱుసిగ యొక్క; నూనెముడి = దూముడి; వీడన్ = వదలిపోఁగా; చిగురాకుఁబొదన్ = చిగురుటాకుల పొదలో; తూఱున్ = చొచ్చును. ఉరిత్రాడు = మెడకు నురివేసికోఁ దగిన త్రాటిని; నెమకు కరణిన్ = వెదకునట్లు; పసిఁడిగాజులు = బంగారుకడియములు; పైకిన్ = మీఁదికి; వెసన్ = వడిగా; త్రోసి = ఎగఁద్రోసి; నునుఁదీగన్ = నునుపుగల తీగను; తెమలించున్ = కదలించును - ఇటు నటు లాగు ననుట. ఏటిలోన్ = సముద్రమునందున్; (ఏఱుశబ్దమునకు సముద్రమర్థమగుటకు "పాలేఱు వే త్రచ్చుచో" నని ప్రయోగము.) ఉఱుకుకరణిన్ = దుమికెడిలాగున; పిఱుదీయక = వెనుకదీయక; మొలనూలు = అల్లికపట్టె మొలత్రాటిని; (ఒడ్డాణము కాదు.) బిగియించి = బిగియఁదీసి; వెలఁదివెన్నెలన్ = తెల్లని వెన్నెలలో; చొచ్చున్ = చొరబడును. అళులకున్ = తుమ్మెదలకు; జడియదు = భయపడదు. కురియు పుప్పొడులన్ = వానకురిసినట్లు రాలుచున్న పుష్పపరాగములయందు; మునుఁగున్ = మునుఁగును. మావికడన్ = మామిడిచెట్టునీడను; నిలుచున్ = నిలుచుండును. విరులనెత్తావిన్ = పువ్వులయొక్క నిండిన పరిమళమును; క్రోలున్ = త్రాగును - మూర్కొను ననుట. (ఇందుఁ జెప్పఁబడిన చల్లగాలి మొదలగునవి విరహోద్రేకము

1. జాఱు. పా. 2. నేఁపుల. పా.

గలుగఁజేయునవి గనుక విరహవేదనచేఁ బ్రాణములు తల్లడిల్లఁగా దేహత్యాగము చేయఁగోరి వానిం జేరి, శరీరమును శ్రమపెట్టుచుండె నని యెఱుంగునది. విరహాతిశయమువలని పరవశత్వము తాను దేవజాతి యగుటచేతఁ దనకుఁ జావు రా దనుటను మఱపించె ననుట దీనిచే నూహ్యము.)
అలం. ఉత్ప్రేక్ష.

క. అట్టియెడ నమ్మృగేక్షణఁ, బట్టి సఖీజనము వెడఁగుఁ § బట్టీ! తగవే
యిట్టితెగువ? యనుచుఁ జెక్కులఁ, దొట్టినకన్నీరు వోవఁ § దుడుచుచుఁ బలికెన్.

టీ. అట్టియెడన్ = ఆ సమయమునందు; అమ్మృగేక్షణన్ = జింకచూపులవలె బెదరు చూపులు గల యా వరూథినిని; సఖీజనము = చెలికత్తెల సమూహము; పట్టి = పట్టుకొని; వెడఁగుఁ బట్టీ! = వెఱ్ఱిబిడ్డా! ఇట్టితెగువ = ఇటువంటిసాహసము - ఇంతతెగించుట; తగవే? = న్యాయమా? అనుచున్ = అని బుజ్జగించి పలుకుచు; చెక్కులన్ = చెక్కిళ్లయందు; తొట్టిన కన్నీరు = కాఱిన కన్నీరు; పోవన్ = పోవునట్లు; తుడుచుచున్ = వస్త్రముతో నొత్తుచు; పలికెన్.

ఉ. పూఁతపసిండివంటివల § పుం బచరించు కులంబునీతికిన్
లేఁత గదమ్మ యిత్తెఱఁగు; § లేమ! సురాంగన లెల్ల నిట్టి నీ
చేఁతకు మెత్తురమ్మ? దయ § సేయక తిన్ననిమేను వెన్నెలన్
వేఁతురటమ్మ? యింత కను § వేదుఱు సెల్లునఁటమ్మ యింతికిన్? 33

టీ. లేమ! = ఓ చిన్నదానా! - వరూథినీ! పూఁతపసిఁడివంటివలపున్ = మొలాముచేసిన బంగారమువలెఁ బైకిమాత్రము తోఁచునట్టిమోహమును; పచరించు...నీతికిన్ - పచరించు = తోఁపింపఁజేయునట్టి; కులంబు = జాతియొక్క; నీతికిన్ = న్యాయమునకు - అనఁగా మనసునందులేని మోహమును విశేషముగాఁ గల దని మీఁదికిఁ దోఁచునట్లు చేయునది యచ్చరల జాతి; అట్టి జాతిమర్యాదకనుట; ఇత్తెఱఁగు = ఈ విధము - ఇట్లు నిజముగా మోహముఁ బొంది తపించుట; లేఁత = చులకన; కదమ్మ! = కాదటమ్మా! చులకనయే యనుట. ఇట్టి నీచేఁతకున్ = ఇటువంటి నీ నడతకు; సురాంగనలెల్లన్ = దేవతాస్త్రీలందఱును; మెత్తురమ్మ? = మెచ్చుకొందురా? సరి యని యొప్పుకొనుదురా? యనుట. దయసేయక = (ఈ శరీరమునెడ) కనికరింపక; తిన్ననిమేను = అందమైన యిటువంటి శరీరమును; వెన్నెలన్ = వెన్నెలయందు; వేఁతురఁటమ్మ? = తపింపఁజేయుదురా? - ఇటువంటికోమలశరీరమును వెన్నెలయందుఁ దపింపఁజేయరా దనుట. ఇంతికిన్ = ఆఁడుదానికి; ఇంత కనువేఁదుఱు = ఇంతటి చూపుపిచ్చి - ఒకనిని జూచినమాత్రముచేతనే వలపుగొని తపించుట; చెల్లునఁటమ్మ? = తగునా? తగ దనుట.

తా. అచ్చరలజాతి లేనిమోహమును జూపి, పురుషులను వంచించునదియై యుండఁగా నట్టి కులమునందుఁ బుట్టిననీకు నొకనిని నిజముగా వలచి వాఁడు లభింపకపోయె నని యిట్లు విరహతాపమును బెంచునట్టి వెన్నెలలో దేహమును దపింపఁజేయుచుఁ గులముదైన గౌరవమును జెఱుచుట తగదు. ఇందులకు నీ కులమువా రెవ్వరును సరి యని యొప్పుకొనరు. కనుక నీ పనిని మానుకొనుము. మగవాని కెంత చూపుపిచ్చి యున్నను దగును గాని యాఁడుదాని కది తగదు. అప్సరసవైన నీవు మనుష్యమాత్రుని వలచి తపించుట మిక్కిలి యవమానకరము.

చ. ఉడుపతిబారికిన్ వెఱచి § యూఱట యా్ననని పేరుటామనిన్
ముడివడు కంతుసేనలకు § ముయ్యేలగు ట్టయినట్టి యిందు రా

నడఁగునె తాపవహ్ని ? మన ఽ మై హరిణేక్షణ ! ముల్లు పుచ్చి కొ
ట్టడిచినచంద మయ్యెఁ; [1]పోద ఽ మా యెలదోఁటఁ జరింప కింటికిన్. 34

టీ. హరిణేక్షణ! = జింకకన్నులవంటి కన్నులుగల యో వరూథినీ ! ఉడుపతిబారికిన్ = నక్షత్రములకు నాయకుఁడైన చంద్రునియొక్క హింసకు; వెఱచి = భయపడి; ఊఱటయౌ నని = ఆ హింస కొంత యుపశమించు ననుకొని; పేరుటామనిన్ = ఘనమైన యీ వసంతకాలమునందు; ముడివడు కంతుసేనలకున్ = ఒక్కచోట మొత్తముగాఁ గూడుకొనునట్టి మన్మథునిదండులకు (మన్మథునిదండు = చిలుకలు, కోవెలలు మొదలగు వానిసమూహము); ముడివడుగట్టు = కూడలి పట్టు - సంబంధించుచోటనుట; అయినట్టి యిందున్ = అయిన యీ తోఁటకు; రాన్ = వచ్చిన మాత్రముననే; తాపవహ్ని = విరహతాపమునెడి నిప్పు; అడఁగునె? = ఉపశమిల్లునా ? ఉపశమిల్ల దనుట. (ఇప్పు డీ తోఁటలోనికి వచ్చుట); మనమై = మనంతటమనమే; ముల్లు పుచ్చి = గ్రుచ్చు కొన్న ముల్లూడఁబెఱికి; కొట్టు = ఇనుపమేకును; అడిచినచందము = (ఆ ముల్లుతీసిన గాయములో) దిగఁగొట్టినవిధము; అయ్యెన్ = ఆయెను. ఎలదోఁటన్ = ఈ యుద్యానవనమునందు (లేక) లేఁతచెట్లుగల యీ తోఁటయందు; చరింపక = తిరుగక; (పా. వసింపక = ఉండక.)ఇంటికిన్ = మనయింటికి; పోదమా! = పోదము రమ్మా !

తా. ఓ వరూథినీ! నీవు కాలిలోఁ గ్రుచ్చుకొన్న ముల్లు తీసి, యా ముల్లున్నచోటనినుపమేకు దిగఁగొట్టుకొన్నట్లు చంద్రునివలనితాపమున కోర్వక మన్మథసేనలయిన చిలుకలు లోనగునవి యన్నియు నొక్క మొత్తముగాఁ జేరుకొను తావైన యీ శృంగారపుఁదోఁటకు వచ్చితివి. ఇక్కడ నా తాపము హెచ్చునుగాని తగ్గదు. ఇఁక నిలువకుము. శీఘ్రముగా నింటికిఁ బోదము రమ్ము. అలం. లోకోక్తి, కావ్యలింగము. చంద్రోపద్రవమును పోఁగొట్టుకోవలయునని యత్నింపఁగా నందులకు విరుద్ధమైన యుపద్రవము కలిగె ననుటచేత విషమాలంకారధ్వనియును.

క. అని యొడఁబడఁ బల్కుచుఁ దోడ్కొనివచ్చినఁ బొన్పుఁజేరి ఽ గురుకుచ దనపైఁ
గనకనఁ గనలెడువెలుఁగులఁ, గనికర మఱి మండు చంద్రుఁ ఽ గని కర మలుకన్.

టీ. అని = ఇట్లని; ఒడఁబడన్ = సమ్మతించునట్లు; పల్కుచున్ = చెప్పుచును;తోడ్కొని వచ్చినన్ = (చెలికత్తెలు) వెంటఁబెట్టుకొని యింటికి రాఁగా; గురుకుచ = పలుఁద చన్నులు కలదైన వరూథిని; తనపైన్ = తనమీఁద; కనకనన్ = మిక్కిలి వేండ్రముగా; కనలెడు వెలుఁగులన్ = వెలుఁగుచున్న కిరణములతో; కనికరము = దయ; అఱి = చెడి - లేనివాఁడై; మండు చంద్రున్ = మండుచున్న చంద్రుని; కని = చూచి; కరము = మిక్కిలి; అలుకన్ = కోపముతో. క్రింది పద్యముతో నన్వయము.

తా. మీఁదఁ జెప్పినచొప్పున వరూథినికి సమ్మతిపడఁజెప్పి చెలికత్తె లింటికిఁ బిలుచుకొని రాఁగా నామె మిక్కిలి వేండ్రముగా వెలుఁగుచున్న చంద్రునిఁ జూచి యధికకోపముగలదై.

క. ఓ చెల్ల ! విరహిణీవధ, మేచతురత ? నీకు; దురిత ఽ మే చేయుపనుల్
రాచఱికపుఫలమే ? యిఁక, యయ్యో చంద్ర ! వివేక మెఱుఁగ ఽ వెరొ గురుసేవన్.

టీ. ఓ చెల్ల! = అయ్యో ! (ఇది దుఃఖమును దెలుపును.) చంద్ర! = ఓరి చంద్రుఁడా! నీకు; విరహిణీవధము = ప్రియుల నెడఁబాసిన స్త్రీలను జంపుట; ఏచతురత? = ఏమి నేర్పరితనము? దురి

1. పదమా. పా.

తమే = పాపమునే; చేయుపనుల్ = కలిగించునట్టి పనులు; రాచటికపుఫలమే? = నీర
బ్రయోజనమా? గురుసేవన్ = పెద్దలను సేవించుటచేత; వివేకము = యుక్తాయుక్త
కొనునట్టి తెలివిని; ఎఱుఁగవొకో? = తెలిసికొన్నవాఁడవు కావో యేమో—అనఁగ
డయిన బృహస్పతిని సేవించి, యాయనభార్యయయిన తార నపహరించి పాపము
గాని మంచితెలివి గడించి పుణ్యకార్యము లేవియుఁ జేసినవాఁడవు కావు. కనుక
విరహిణీస్త్రీలను బాధించునట్టి పాపకార్యమునకు నొడిగట్టితివి.

సీ. తొలుదొల్తఁ గమలమిత్త్రునివంక రూపొటఁ, దక్షాధ్వరధ్వంసితన
బరివేషమిషమునఁ బాశంబు దాల్చుటఁ, గప్పు దేహమునందుఁ గా
గాలవశంబునఁ గాని తోఁపక యుంట, సతతనిష్ఠురగదా [1]న్వి
బూని పాండుక్షేత్త్రమునఁ బ్రవర్తించుటఁ, బ్రకటానురాగతార రక

తే. నంతరం బెద్ది యాత్మలో నరసి చూడ, రాజ! నీకును నల ధర్మ
బ్రాణిలోకంబు బాధలఁబఱుచునపుడు, ధర్మపద మొక్కఁ డెక్కుడా

టీ. (ఈ పద్యమునందు యమధర్మరాజునకును, జంద్రునికిని సారూప్యము చెప్ప
కనుక నర్థద్వయము గ్రాహ్యము.) తొలుదొల్తన్ = మొట్టమొదట; కమలమిత్రునివం
ములకు మిత్త్రుఁడైన సూర్యునివలన; రూపొటన్ = స్వరూపధారణము చేయుటచే
కిరణములు సోఁకఁగాఁ గళలు వృద్ధిఁబొంది స్వరూప మేర్పడుటచేత నని చంద్రపర
సూర్యునికిఁ గొడుకై పుట్టుటచేత నని యమునిపరమైన యర్థము.) దక్షాధ్వరధ్వంసి
ధ్వర ధ్వంసి = (చం) దక్షప్రజాపతియజ్ఞమును జెఱిచిన వీరభద్రునియొక్క; (య)
మును జెఱుచునట్లు చేసిన శివునియొక్క; తన్ను = కాలితాఁపును; కనుటన్ = పొ
(మార్కండేయుని నిమిత్తము శివుఁడు యమునిఁ దన్నె నను ప్రతీతి యిట నూహ్యము
వేషమిషమునన్ = గాలిగుడియను నెపముచేత; పాశంబున్ = వల్లెత్రాటిని; తాల్చ
చుటచేతను; (పరివేషము చుట్టు చుట్టుకొనియుండుట త్రాడు చుట్టుకొన్నట్లు
ననుట.) (య) సర్వత్ర ప్రాణుల నాక్రమించు నెపమున స్వతస్సిద్ధమయిన కాలపా
చుటచేతను; దేహమునందున్ = శరీరమునందు; కప్పు = (చం) కళంకరూపమయిన నలు
దనము; కానఁబడుటన్ = అగపడుటచేతను; (చంద్రుని నల్లనికళంకమును, యము
కాంతియు నిట గ్రాహ్యములు.) కాలవశంబునఁగాని = (చం) కాలాధీనతచేతఁగాని
గళ లభివృద్ధిఁ బొందినప్పుడే కాని - లేక, రాత్రికాలముననే కాని; (య) మరణకా
తోఁపక = కనఁబడక; ఉంటన్ = ఉండుటచేతను; సతతనిష్ఠురగదాన్వితుఁడవు
ప్పుడును గడుసైన క్షయరోగముతోఁ గూడుకొనియుండువాఁడవు (య) సదా
తోడఁ గూడికగల్గినవాఁడవు; ఔటన్ = అగుటచేతను; పూని = ప్రయత్నపడి; (
క్షేత్రమునన్ = తెల్లనిశరీరముతో; ప్రవర్తించుటన్ = మెలఁగుటచేతను; (య)
మునన్ = పాండురాజుభార్యయందు; ప్రవర్తించుటన్ = కామప్రవర్తనము చేయుటచే
...కుఁడవు - (చం) ప్రకట = ప్రసిద్ధమయిన, అనురాగ = ప్రేమకుఁదగిన; తారకుఁడవు
నక్షత్రములుగలవాఁడవు; అగుటన్; (య) ప్రసిద్ధమయిన యెఱ్ఱఁదనముతోడి గన

1. న్వితతఁగను. పా. 2. డగుటను. పా.

డవగుటచేతను; ఆత్మలోఁ = మనస్సునందు; అరసిచూడఁగ = విచారించి చూడఁగా; రాజ! = ఓరి రాజనామముగల చంద్రుఁడా ! నీకును; అల ధర్మరాజునకును = ఆ యమధర్మరాజునకును; ప్రాణిలోకంబుఁ = ప్రాణులసమూహమును; బాధలఁబఱుచునపుడు = పీడించునప్పుడు; అంతరంబు = తారతమ్యము; ఎద్ది? = ఎక్కడ నున్నది? ఏ విషయమునందును లేదనుట. (అయినను) ఆ ధన్యునందుఁ = ఆ పుణ్యాత్మునియందు; ధర్మపదము = ధర్మశబ్దము; ఒక్కఁడు = ఒకటి; ఎక్కుడు = అధికము; (నీవు రాజవు. ఆతఁడు ధర్మరాజు. కనుక నీకంటె నతనియందు ధర్మమువిచారించి యధార్మికులనే హింసించు గుణము కలిగియున్నది. కనుకనే ధర్మశబ్ద మొకటి యా పుణ్యాత్మునిపేరి ననుసరించియున్నది. నీవధర్మాత్ముఁడవు గనుక ధార్మికుఁడగు యమునికంటెను క్రూరుఁడ వని భావము.) అలం. రూపకము. వ్యతిరేకము గమ్యము.

చ. ఒక పెనుఁబాఁపఱేఁడు చల । మొప్ప రసాతలసీమకుం, జకో
రకములు భూతధాత్రికి, సు । రల్ దివికిం, బగ దీఱునట్లుగా
మెకమెకపాటుతోడ నిను । మ్రింగక పో రెపుడుం ద్రిలోకకం
టకుఁడవు గాన నీ యొడలు । నజ్జుగఁ జేసి కురంగలాంఛనా ! 38

టీ. కురంగలాంఛనా! = జింకవలెఁ దోఁచునట్టి కళంకము గలవాఁడా! - చంద్రుఁడా! త్రిలోకంటకుఁడవు = నీవు మూఁడులోకములకును క్షుద్రశత్రుఁడవు (బాధకుఁడవు); కానఁ = కాఁబట్టి; చలము = మచ్చరము; ఒప్పఁ = అమరునట్లుగా; రసాతలసీమకుఁ = పాతాళ ప్రదేశమునకు - పాతాళలోకమునకు ననుట; ఒక పెనుఁ బాపఱేఁడు=ఒక పెద్ద సర్పరాజు - రాహువును; భూతధాత్రికిఁ = భూలోకమునకు; చకోరకములు = వెన్నెలపులుఁగులును; దివికిఁ = స్వర్గలోకమునకు; సురలు = దేవతలును; పగతీఱునట్లుగాఁ = మూఁడులోకములకుఁగల శత్రుత్వము నశించునట్లుగా; మెకమెకపాటుతోడఁ = మిట్టిపాటుతోడ - గర్వముతో; ఎపుడుఁ = ఎల్లప్పుడును; నీ యొడలు = నీ శరీరమును; నజ్జుగఁజేసి = అణువు లణువులుగాఁజేసి; (లేక) మిక్కిలి నలఁగఁగొట్టి; నిను మ్రింగక పోరు = నిన్నుఁ గబళింపకపోరు - మ్రింగనే మ్రింగుదు రనుట.

తా. నీవు మూఁడులోకములకును బాధకుఁడవు గనుక నిన్ను మూఁడులోకముల పగయు నడఁగునట్లుగాఁ బాతాళలోకమునకు రాహువును, భూలోకమునకుఁ జకోరపక్షులును, దేవలోకమునకు దేవతలును నిన్ను మ్రింగుదురు. రాహువు పర్వములందు గ్రసించుటయు, చకోరములు కిరణములను భక్షించుటయు, దేవతలు కళలను హరించుటయు నిటఁ దెలియునది. అలం. ఉత్ప్రేక్ష.

క. వాతాపివలన నెఱిఁగితొ, శీతకిరణ ! కడుపుఁ జొచ్చి । జీర్ణింపని యీ
రీతి; నినుఁ దినియు నాయువు, చేత సురల్ చెడరుగాక । చెఱుపవె ? వారిన్.

టీ. శీతకిరణ ! = చల్లనికిరణములుగల చంద్రుఁడా ! కడుపుఁజొచ్చి = కడుపునందుఁ బ్రవేశించి - ఆహారరూపమునఁ గడుపునందుఁ జేరి యనుట; జీర్ణింపని యీ రీతిఁ = అఱుగకుండునట్టి యీ ప్రకారమును - ఈ నేర్పు ననుట; (పా. ఈనీతిని = ఈ న్యాయమును.) వాతాపివలనఁ = వాతాపి యనెడి రాక్షసునివలన; ఎఱిఁగితో = తెలిసికొంటివో - నేర్చుకొంటివా యేమి యనుట. సురల్ = దేవతలు; నినుఁ దినియును = నిన్ను భక్షించియు; ఆయువుచేతఁ = ఆయుస్సు గట్టిగానుండుటచేత; చెడరుగాక = నశింపరుగాని; వారిఁ = (నశించువారైనపక్షమున) ఆ దేవతలనుగూడ; చెఱుపవె? = నశింపఁజేయవా? - తప్పక చంపుదు వనుట.

తా. వాతాపి యను రాక్షసుఁడు మేఁక కాఁగా, మునివేషధారియైన వానితమ్ముఁ డిల్వలుఁడు వానిని ఛేదించి, యా మాంసమును వండి, మునులకు విందుఁ బెట్టఁగా, వాఁ డా మునులకడుపులలోఁ జేరి, జీర్ణము గాక స్వస్వరూపమును ధరించి, భుజించినవారు మడియ వారి కడుపుఁ జించుకొని బయటికి వచ్చుటను నీవు వాని నాశ్రయించి, యా విద్య నేర్చుకొనియో, యేమో యెవ్వ రెన్ని విధముల భక్షించినను జీర్ణింపక బయట వచ్చుచున్నావు. అయినను నినుఁ దినెడు దేవతలు చచ్చువారు కాకుండుటచే వారిని జంపలేకపోయితివి. చచ్చువారే యైన పక్షమునఁ జంపనే చంపుదువు.

తే. త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు, బండికల్లుగ నీమేను గండిచేసె;
నదియు సెలవాఁటి తెగటాఱవైతి చంద్ర!, యకట రోహిణియెడనపథ్యమునఁ జేసి.

టీ. చంద్ర ! = ఓ చంద్రుఁడా! హరుఁడు = రుద్రుఁడు; త్రిపురసంహారము = అసురులవైన మూఁడు పట్టణములయొక్క నాశమును; ఒనరించునపుడు = చేయునప్పుడు; బండికల్లుగన్ = రథచక్ర మగునట్టుగా; నీమేను = నీ శరీరమును; గండిచేసెన్ = రంధ్రముచేసెను - నీశరీరమునందు రంధ్రము గలుగఁజేసె ననుట; అదియున్ = ఆ రంధ్రముచేసిన గాయమును; సెలవాఁటి = సెలవేసి - చీముపోసి రంధ్రములు పడి యనుట. రోహిణియెడన్ = నీ ప్రియభార్యయయిన రోహిణివలని; అపథ్యమునఁజేసి = సంభోగసంబంధమయిన యపథ్యముచేత; (పా. అపథ్యంబుగలిగి.) తెగటాఱవైతి = చావవైతివి. అకట! = అయ్యో !

తా. అయ్యో ! చంద్రా ! మా యభాగ్య మేమనవచ్చును? రుద్రుఁడు త్రిపురాసురసంహారము చేయునప్పుడు నిన్నుఁ దనరథమునకుఁ జక్రముగాఁ జేసికొనుటకై నీదేహమునందు బెజ్జము చేసెను గదా! ఆ బెజ్జపుగాయము సెలవేసి రోహిణితోడి సంభోగమువలని యపథ్యముచేత దోషించి నీవు చావఁగూడదా ! మమ్ము హింసపెట్టవలసియేమో యా గండము గడచి బ్రతికితివి.

తే. పాలఁ బుట్టినమా[1]త్రాన మేలిగుణము, నేఁడు నీ కేల గల్గు నో నీరజారి ?
నీటఁబుట్టినవాఁడు గాఁడోటు వహ్ని?, గాల్చుచున్నాఁడు జగమెల్లఁ గరుణ లేక.

టీ. ఓ నీరజారి ! = ఓరి చంద్రుఁడా! పాలన్ = క్షీరమునందు - పాలసముద్రమునం దనుట; పుట్టినమాత్రానన్ = జనించినమాత్రముచేతనే; నీకు; నేఁడు = ఈ దినము; మేలిగుణము = మంచిగుణము; ఏల కల్గున్ ? = ఎందులకుఁగలుగును ? మంచిగుణము కలుగుటకుఁదాఁ బుట్టిన మంచిచోటు కారణము గా దనుట. వహ్ని = అగ్ని; నీటన్ = జలమునందు; పుట్టినవాఁడు; కాఁడోటు? = కాఁడా యేమి? నీటిలోఁ బుట్టినవాఁడే యనుట. (అయినను) కరుణలేక = దయలేక; జగమెల్లన్ = లోకము నెల్లను; కాల్చుచున్నాఁడు = దహించుచున్నాఁడు.

తా. అగ్ని నీళ్లలోఁ బుట్టి యెల్లలోకములను గాల్చుచున్నాఁడుగదా! అట్లే నీవును బాలలోఁ బుట్టి లోకమును దపింపఁజేయుచున్నావు. కనుక మంచి కలుగుటకు జన్మస్థానము కారణముగా గ్రహింపరాదు. ఉత్తమకులమునందుఁ బుట్టినను అధమకులమునందుఁ బుట్టినను నీచునకు నీచస్వభావమే కాని గొప్పస్వభావము రానేరదని భావము. అలం. ప్రతివస్తూపమ.

క. గోవధము సేయు తురకల, దైవంబవు నీవు మొదలఁ; దక్కక పాంథ
స్త్రీవధము సేయ [2]నోడుదె, నీవర్తన మేమి చెప్ప? నీరజవైరీ ! 42

1. మాత్రనే. పా. 2. రోయుదె. పా.

టీ. నీరజవైరీ! = కమలములకుఁ బగవాఁడవైన చంద్రుఁడా! నీవు; మొదలన్ = మొదటనే; గోవధముచేయు = గోవులఁ జంపు; తురకల దైవంబవు = తురకలకు దేవుఁడవు - అనఁగా తురుష్కులు చంద్రోదయమును జూడక దేవతాప్రార్థనాదులను జేయరు కనుక వారికి ముఖ్యదైవమవనుట; తక్కక = మానక; పాంథస్త్రీవధము = విరహిణీస్త్రీలయొక్క చంపుటను; చేయన్ = చేయుటకు; ఓడుదె? = వెనుదీయుదువా? వెనుదీయవనుట. నీవర్తనము = నీ నడవడి; ఏమి చెప్పఁ? = ఇఁక నే మని చెప్పవచ్చును?

తా. ఓ చంద్రా! నీవు మొదటనే గోహత్య చేయునట్టి తురకవారికి దేవుఁడవు. ఇట్టి నీకు విరహిణీస్త్రీలను బాధించు నెడల జంకు కలుగునా? అనఁగా గోహత్యచేయ భక్తుల నే ప్రేరేపించు వాఁడవైన నీ వే పాపమునకైన నొడిగట్టువాఁడవే యగుదువు గాని బ్రహ్మహత్యాది మహాపాతకములు చేయ వెనుక దీయుదువా? యని భావము. అలం. కావ్యార్థాపత్తి.

క. [1]ఉడుగక తలపయిఁ గొన్నా, ళ్లిడి చూచి కళంకి వగుట కెఱిఁగి మహేశుం
డుడుకుచు దక్షాధ్వరమున, నడుగునఁ బడవైచె; దాన నడఁగవు చంద్రా!

టీ. చంద్రా! (నిన్ను) మహేశుండు = శివుఁడు; ఉడుగక = మానక; తలపయిన్ = తనతలమీఁద (నలంకారముగా); కొన్నాళ్లు; ఇడి = పెట్టుకొని; చూచి = నీయోగ్యతను జూచి; (నీవు) కళంకివి = కళంకముగలవాఁడవు - అపవాదము గలవాఁడవు; అగుట ఎఱిఁగి; ఉడుకుచున్ = తపించుచు - కోపము నొందినవాఁ డగుచు; దక్షాధ్వరమునన్ = దక్షునియజ్ఞమునందు; అడుగునన్ = (వీరభద్రరూపముతో) తన కాలిక్రింద; పడవైచెన్ = పడవేసి త్రొక్కెను. దానన్ = అట్లు కాలియడుగునఁ బడవేసి త్రొక్కుటచేతను గూడ; అడఁగవు. అణఁగిపోవు - చావ లేదనుట.

తా. ఓరి చంద్రా! శివుఁడు తొలుత నీయోగ్యత తెలియక నిన్ను తలమీఁద నలంకారముగా నుంచుకొని, పిమ్మట నీయోగ్యత యిట్టిది యని తెలిసికొని దక్షయజ్ఞమునందు వీరభద్రరూపముతో నిన్నుఁ గాలిక్రింద వేసి త్రొక్కెనుగదా! అట్లు త్రొక్కినను మొండిప్రాణములతోఁ జావకయే యున్నావు. అలం. విశేషోక్తి.

క. గాండీవము నీచేతిది, పాండవునిం జేరఁబట్టి బ్రతికితి; మా వి
ల్లుండిన నేఁడు నిశాచర!, చెండవె యల్లునికిఁ దోడు శిత[2]భల్లములన్. 44

టీ. నిశాచర! = ఓరి రాత్రిసంచరించునట్టి రాక్షసుఁడా! - చంద్రుఁడా! నీచేతిది = నీ చేతిలో నున్నదైన; గాండీవము = గాండీవ మను పేరుగల విల్లు; పాండవునిన్ = పాండురాజు కొడుకైన యర్జునుని; చేరఁబట్టి; బ్రతికితిమి = మేము జీవించియున్నాము; ఆ విల్లు = ఆ గాండీవ ధనుస్సు; ఉండినన్ = (నీచేత నే) ఉన్నపక్షమున; నేఁడు = ఈదినము - ఇప్పుడు; అల్లునికిన్ = నీ యల్లుఁడైన మన్మథునికి; తోడు = సాహాయ్యముగా; శితభల్లములన్ = వాఁడియైన బాణములచేత; చెండవె? = (నీవు మమ్ము) ఖండింపవా? ఖండింప నే ఖండింపుదు వనుట.

తా. రాత్రి తిరుగుటచేత రాక్షసుఁ డనఁదగిన యోరి చంద్రా! తొలుత నీచేతనున్న గాండీవ మనెడి పేరుగల దొడ్డవిల్లు దైవికముగా నర్జునునిచేతఁ జేరుటవలన నేమో మాకు నీచేఁ జావక బ్రదు

1. విడువక. పా. 2. భల్లంబుల్. పా.

కుటకు నవకాశము కలిగెను; అట్లుగాక యా విల్లు నీచేత నేయున్నయెడ మన్మథునికిఁ దోడై, వాఁడి బాణములు ప్రయోగించి యెప్పుడో మమ్ముఁ జంపియుందువు. అలం. ఉత్ప్రేక్ష.

వ. అని పలికి యక్కలికి తేనియ లొలుకు పూములుకుల జళుకుఁ బుట్టించు నించువిలుతు నుద్దేశించి. 45

టీ. అని పలికి = అని చెప్పి - నిందించి యనుట; అక్కలికి = ఆ స్త్రీ-వరూథిని; తేనియలు= మకరందములు; ఒలుకు పూములుకులన్ = చిందుచున్న పుష్పబాణములచేత; జళుకున్ = భయమును; పుట్టించు నించువిలుతున్ = కలుగఁజేయుచున్న చెఱకువింటివానిని - మన్మథుని; ఉద్దేశించి = గుఱించి.

చ. తొడిఁబడఁ బాఱి పై కుఱికి ధూర్జటికంటికడిందిమంటలో
నడపొడ గానరాక తెగటాఱియుఁ గాలినయట్టి మ్రోడుకై
వడి రతిలోచనాంబువుల వాన [1]నిగిర్చితె పాంథబాధకై
మడియక నంగ! యవ్వెలఁది మంగళసూత్రమహత్త్వ మెట్టిదో! 46

టీ. అనంగ!=అంగములేనివాఁడా! - మన్మథుఁడా! (నీవు) తొడిఁబడన్=తత్తఱపడునట్లుగా; పాఱి = పరుగెత్తి; పైకిన్ ఉఱికి = (శివుని) మీఁదికి దుమికి; ధూర్జటి కంటికడిందిమంటలోన్= ఆ శివునియొక్క నిప్పుకంటివలని అధికమైన (చల్లార్ప శక్యముగాని) మంటయందు; అడపొడగానరాక = ఉన్నజాడయే కనఁబడకుండునట్లు; తెగటాఱియున్ = నశించియు; కాలినయట్టి మ్రోడుకైవడిన్ = (కారుచిచ్చుచే) కాలినటువంటి మొరడువలె; మడియక = చావక - మొదలంట నశింపక; రతి...వానన్ - రతి = రతీదేవియొక్క; లోచన = కన్నులవలన వెడలిన; అంబువులవానన్ = నీళ్లయొక్క వానచేత - దుఃఖాతిశయముచే వానవలె స్రవించిన కన్నీళ్లచేత ననుట; పాంథబాధకై = విరహిజనుల హింసకొఱకై; ఇగిర్చితె? = చిగిరించితివా ? మరల బ్రతికితివా? యనుట. అవ్వెలఁది...మహత్త్వము - అవ్వెలఁది = ఆ రతీదేవియొక్క; మంగళసూత్రమహత్త్వము = తాలిబొట్టుమహిమ; ఎట్టిదో? = ఎటువంటిదో ? మిక్కిలి యద్భుతమైన దనుట. మన్మథుఁడు తపస్సు చేయుచున్న శివుని తపోనిష్ఠఁ జెఱుపఁబోయె ననియు, నప్పు డా శివుఁడు నిప్పుకన్ను దెఱచి యా నిప్పుమంటవలన మన్మథునిఁ గాల్చి భస్మము చేయఁగా, వాని భార్యయైన రతీదేవి వైధవ్యదుఃఖము ననుభవింపలేక యేడ్చె ననియు, అంతట దేవత లామెయెడఁ గనికరించి మన్మథునికిఁ జావు లేకుండ వర మిచ్చి, యా దుఃఖమును మాన్చి రనియుఁ బురాణకథ. అలం. విషమము, ఉపమ, ఉత్ప్రేక్ష, హేతువును.

శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిన్ బయిం బంపినన్
స్వాహాకాముకుఁ డౌట నిన్నతఁడు గాకవం బోలు మోమోడి; సం
దేహంబేని రతీశ నీవు మగుడన్ దేహంబుతో నుండు టె?
ట్లాహా! దైవము దోసకారులకె తోడై వచ్చు నెప్పట్టునన్. 47

టీ. రతీశ! = ఓరి రతిమగఁడవైన మన్మథుఁడా! సాహంకారతన్ = గర్వముతోఁ గూడినతనముచేత - నీవు గర్వించినవాఁడ వగుటచేత; శంకరుండు = లోకములకు సుఖము కలుగఁజేయు శివుఁడు; అలిగి = కోపించి; నేత్రాగ్నిన్ = తననొసటి కంటినిప్పును; పయిన్ =

1. నిగుర్చితె. పా.

నీమీఁద; పంపినన్ = ప్రయోగింపఁగా; అతఁడు = ఆ ప్రయోగింపఁబడిన యగ్ని; స్వాహాకాముకుఁడు = స్వాహాదేవిని గామించినవాఁడు; కౌటన్ = అగుటచేత; మోమోడి = (కామమును బెంచువాఁడవైన నీయెడల) దాక్షిణ్యపడి; నిన్ను; కావంబోలున్ = కాపాడి యుండవచ్చును. సందేహంబేని=(నిన్ను దాక్షిణ్యపడి యగ్ని కాల్పక మన్నించె ననుటలో) సందేహమున్న పక్షమున; మగుడన్= మరల; నీవు; దేహంబుతోన్ = శరీరముతో; ఉండు టెట్లు? = ఉండుట యేవిధముగా సిద్ధించును ? దైవమున్ = దేవుఁడుఁగూడ; ఎప్పట్టునన్ = ఎప్పుడును; దోసకారులకె = పాపకార్యములు చేయువారికే; తోడై వచ్చున్ = సహాయమై వర్తించును. ఆహా ! = ఇది యాశ్చర్యము.

తా. ఓరి మన్మథుఁడా ! నీవు గర్వించియున్నావని తెలిసి, లోకముల మేలు గోరునట్టి మహాదేవుఁడు తన నేత్రాగ్నిని బ్రయోగించినను నా యగ్ని స్వాహాదేవిని గామించినవాఁడు గనుక నీయెడ దాక్షిణ్యపడి నిన్నుఁ గాల్చి చంపకపోయెను. అట్లు కానిపక్షమున నీ వెప్పుడో భస్మమై నశించి యుండెడివాఁడవు. దేవుఁడుఁ గూడ నీవంటి పాపకర్ములకే సహాయపడుచున్నాఁడుగదా ! అలం. అర్థాంతరన్యాసము.

చ. జెడ నొకయింత లేని నెఱ ✿ చక్కఁదనంబుల నెల్లఁ గూర్పఁగాఁ
బొడ వయినట్టి ధన్యుఁడవు ✿ భోగివి పూవిలుకాఁడ విట్టి నీ
వెడపక నిష్ఠురత్వమున ✿ కె ట్లలవాటుగఁ జేసి తక్కటా !
పడఁతులమీఁద నేయ రతి ✿ పయ్యెదకున్ [1]ననుపైన చేతులన్. 48

టీ. జెడను = మాంద్యము; ఒకయింత = కొంచెమయినను; లేని = లేకుండునట్టి; నెఱ చక్కఁదనంబులన్ = నిండిన సౌందర్యములను; ఎల్లన్ = అన్నిటిని; కూర్పఁగాన్ = రాశిగాఁ జేర్పఁగా; పొడవు అయినట్టి = ఒక యాకృతిగా నేర్పడిన; ధన్యుఁడవు = పుణ్యాత్ముఁడవు - అనఁగా మిక్కిలి చక్కఁదనము గలిగి జాగరూకుఁడవై వర్తించునట్టి పుణ్యాత్ముఁడ వనుట. భోగివి = ఎల్లభోగముల ననుభవించువాఁడవు; పూవిలుకాఁడవు = (మృదువులైన) పువ్వులు విల్లుగాఁగలవాఁడవు; ఇట్టి నీవు = ఇటువంటి మృదుత్వలక్షణములు గల నీవు; రతిపయ్యెదకున్ = రతీదేవిపైఁటకు; ననుపైన = ఇంపైనట్టి; చేతులన్= చేతులతో; ఎడపక = ఎడతెగక; పడఁతుల మీఁదన్ = ఆఁడువారిమీఁద; ఏయన్ = బాణప్రయోగము చేయునట్లుగా - బాణప్రయోగము చేయఁదగినంతటి యనుట; నిష్ఠురత్వమునకున్ = కఠినత్వమునకు; ఎట్లు = ఏవిధముగా; అలవాటుగన్ = అభ్యాస మగునట్లు; చేసితి? = చేసినాఁడవు? అక్కటా! = అయ్యో !

తా. ఓరి మన్మథా! నీవు లోకములోని చక్కఁదనము లన్నియు నొక్కటిగాఁ గూర్చి చేయఁబడినట్లు మిక్కిలి చక్కఁదనముగల భోగపురుషుఁడవు. మృదువులయిన పువ్వులు విల్లుగాఁ గలవాఁడవు. ఇటువంటి మృదుత్వ చిహ్నములుగల నీవు రతీదేవి పైఁటకొంగు స్పృశింపఁదగిన మృదువులైన నీచేతులను విరహిణీస్త్రీలపై బాణములు ప్రయోగించునంతటి కఠినత్వమునకు నెట్లభ్యాసపఱచితివి? అ ట్లభ్యాసపఱచుట మిక్కిలి దుఃఖకరము. అలం. విషమము.

తే. అనుచు నిందించి వలవంత ✿ యినుమడింప, నవ్వరారోహవిదళిత ✿ హల్లకముల
కమ్మపుప్పొడిపై దుమారమ్ము ౹రేఁచు, మలయ[2]మంథరపవనుపై ✿ నలుక వొడమి.

---

1. ననుపైన. పా. 2. మందిర. పా.

కుటకు నవకాశము కలిగెను; అట్లుగాక యా విల్లు నీచేత నేయున్నయెడ మన్మథునికిఁ దో
బాణములు ప్రయోగించి యెప్పుడో మమ్ముఁ జంపియుందువు. అలం. ఉత్ప్రేక్ష.

వ. అని పలికి యక్కలికి తేనియ లొలుకు పూములుకుల జళుకుఁ బుట్టించు
విలుతు నుద్దేశించి.

టీ. అని పలికి = అని చెప్పి - నిందించి యనుట; అక్కలికి = ఆ స్త్రీ-వరూథిని; తే
మకరందములు; ఒలుకు పూములుకులన్ = చిందుచున్న పుష్పబాణములచేత; జళుకున్ =
మును; పుట్టించు నించువిలుతున్ = కలుగఁజేయుచున్న చెఱకువింటివానిని - మన్మథుని
శించి = గుఱించి.

చ. తొడిఁబడఁ బాటి పై కుటికి ధూర్జటికంటికడిందిమంటలో
నడపొడ గానరాక తెగ టాఁటియుఁ గాలినయట్టి మ్రోడుకై
వడి రతిలోచనాంబువుల వాన [1]నిగిర్చితె పాంథబాధకై
మడియక యనంగ? యవ్వెలఁది మంగళసూత్రమహత్త్వ మెట్టిదో!

టీ. అనంగ! = అంగములేనివాఁడా! - మన్మథుఁడా! (నీవు) తొడిఁబడన్ = తత్తఱపడున
పాటి = పరుగెత్తి; పైకిన్ ఉటికి = (శివుని) మీఁదికి దుమికి; ధూర్జటి కంటికడిందిమంట
ఆ శివునియొక్క నిప్పుకంటివలని అధికమైన (చల్లార్ప శక్యముగాని) మంటయందు; అడప
రాక = ఉన్నజాడయే కనఁబడకుండునట్లు; తెగటాఁటియున్ = నశించియు; కా
మ్రోడుకైవడిన్ = (కారుచిచ్చుచే) కాలినటువంటి మొరడువలె; మడియక = చావక
లంట నశింపక; రతి...వానన్ - రతి = రతీదేవియొక్క; లోచన = కన్నులవలన
అంబువులవానన్ = నీళ్లయొక్క వానచేత - దుఃఖాతిశయముచే వానవలె స్రవించిన కన్నీ
ననుట; పాంథబాధకై = విరహిజనుల హింసకొఱకై; ఇగిర్చితె? = చిగిరించితివా ? మర
కితివా? యనుట. అవ్వెలఁది...మహత్త్వము - అవ్వెలఁది = ఆ రతీదేవియొక్క; మంగ
మహత్త్వము = తాలిబొట్టుమహిమ; ఎట్టిదో? = ఎటువంటిదో ? మిక్కిలి యద్భుతమైన
మన్మథుఁడు తపస్సు చేయుచున్న శివుని తపోనిష్ఠఁ జెఱుపఁబోయె ననియు, నప్పు డా
నిప్పుకన్ను దెఱచి యా నిప్పుమంటవలన మన్మథునిఁ గాల్చి భస్మము చేయఁగా, వాని భా
రతీదేవి వైధవ్యదుఃఖము ననుభవింపలేక యేడ్చె ననియు, అంతట దేవత లామెయెడఁ క
మన్మథునికిఁ జావు లేకుండ వర మిచ్చి, యా దుఃఖమును మాన్చి రనియుఁ బుర
అలం. విషమము, ఉపమ, ఉత్ప్రేక్ష, హేతువును.

శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిన్ బయిం బంపినన్
స్వాహాకాముకుఁ డొంట నిన్నతఁడు గాక వం బోలు మోమోడి; సం
దేహంబేని రతీశ నీవు మగుడన్ దేహంబుతో నుండు టె ?
ట్లాహా! దైవము దోసకారులకె తోడై వచ్చు నెప్పట్టునన్.

టీ. రతీశ ! = ఓరి రతిమగఁడవైన మన్మథుఁడా ! సాహంకారతన్ = గర్వ
గూడినతనముచేత - నీవు గర్వించినవాఁడ వగుటచేత; శంకరుండు = లోకములకు సుఖము
జేయు శివుఁడు; అలిగి = కోపించి; నేత్రాగ్నిన్ = తననొసటి కంటినిప్పును; పం

1. నిగుర్చితె. పా.

నీమీఁద; పంపినన్ = ప్రయోగింపఁగా; అతఁడు = ఆ ప్రయోగింపఁబడిన యగ్ని; స్వాహాకాముకుఁడు = స్వాహాదేవిని గామించినవాఁడు; ఔటన్ = అగుటచేత; మోమోడి = (కామమును బెంచువాఁడవైన నీయెడల) దాక్షిణ్యపడి; నిన్ను; కావంబోలున్ = కాపాడి యుండవచ్చును. సందేహంబేని=(నిన్ను దాక్షిణ్యపడి యగ్ని కాల్పక మన్నించె ననుటలో) సందేహమున్న పక్షమున; మగుడన్= మరల; నీవు; దేహంబుతోన్ = శరీరముతో; ఉండుటెట్లు? = ఉండుట యేవిధముగా సిద్ధించును ? దైవమున్ = దేవుఁడుఁగూడ; ఎప్పట్టునన్ = ఎప్పుడును; దోసకారులకె = పాప కార్యములు చేయువారికే; తోడై వచ్చున్ = సహాయమై వర్తించును. ఆహా ! = ఇది యాశ్చర్యము.

తా. ఓరి మన్మథుఁడా ! నీవు గర్వించియున్నావని తెలిసి, లోకముల మేలు గోరునట్టి మహాదేవుఁడు తన నేత్రాగ్నిని బ్రయోగించినను నా యగ్ని స్వాహాదేవిని గామించినవాఁడు గనుక నీయెడ దాక్షిణ్యపడి నిన్నుఁ గాల్చి చంపకపోయెను. అట్లు కానిపక్షమున నీ వెప్పుడో భస్మమై నశించి యుండెడివాఁడవు. దేవుఁడుఁ గూడ నీవంటి పాపకర్ములకే సహాయపడుచున్నాఁడుగదా ! అలం. అర్థాంతరన్యాసము.

చ. జడ నొకయింత లేని నెఱ ¶ చక్కఁదనంబుల నెల్లఁ గూర్పఁగాఁ
బొడ వయినట్టి ధన్యుఁడవు ¶ భోగివి పూవిలుకాఁడ విట్టి నీ
వెడపక నిష్ఠురత్వమున ¶ కెట్లలవాటుగఁ జేసి తక్కటా !
పడఁతులమీఁద నేయ రతి ¶ పయ్యెదకున్ [1]ననుపైన చేతులన్. 48

టీ. జడను = మాంద్యము; ఒకయింత = కొంచెమయినను; లేని = లేకుండునట్టి; నెఱ చక్కఁదనంబులన్ = నిండిన సౌందర్యములను; ఎల్లన్ = అన్నిటిని; కూర్పఁగాన్ = రాశిగాఁ జేర్పఁగా; పొడవు అయినట్టి = ఒక యాకృతిగా నేర్పడిన; ధన్యుఁడవు = పుణ్యాత్ముఁడవు - అనఁగా మిక్కిలి చక్కఁదనము గలిగి జాగరూకుఁడవై వర్తించునట్టి పుణ్యాత్ముఁడ వనుట. భోగివి = ఎల్లభోగముల ననుభవించువాఁడవు; పూవిలుకాఁడవు = (మృదువులైన) పువ్వులు విల్లుగాఁగలవాఁడవు; ఇట్టి నీవు = ఇటువంటి మృదుత్వలక్షణములు గల నీవు; రతిపయ్యెదకున్ = రతీదేవిపైఁటకు; ననుపైన = ఇంపైనట్టి; చేతులన్= చేతులతో; ఎడపక = ఎడతెగక; పడఁతుల మీఁదన్ = ఆఁడువారిమీఁద; ఏయన్ = బాణప్రయోగము చేయునట్లుగా - బాణప్రయోగము చేయఁదగినంతటి యనుట; నిష్ఠురత్వమునకున్ = కఠినత్వమునకు; ఎట్లు = ఏవిధముగా; అలవాటుగన్ = అభ్యాస మగునట్లు; చేసితి? = చేసినాఁడవు? అక్కటా! = అయ్యో !

తా. ఓరి మన్మథా! నీవు లోకములోని చక్కఁదనము లన్నియు నొక్కటిగాఁ గూర్చి చేయఁబడినట్లు మిక్కిలి చక్కఁదనముగల భోగపురుషుఁడవు. మృదువులయిన పువ్వులు విల్లుగాఁ గలవాఁడవు. ఇటువంటి మృదుత్వ చిహ్నములుగల నీవు రతీదేవి పైఁటకొంగు స్పృశింపఁదగిన మృదువులైన నీచేతులను విరహిణీస్త్రీలపై బాణములు ప్రయోగించునంతటి కఠినత్వమునకు నెట్లభ్యాసపఱచితివి? అట్లభ్యాసపఱచుట మిక్కిలి దుఃఖకరము. అలం. విషమము.

తే. అనుచు నిందించి వలవంత ¶ యినుమడింప, నవ్వరారోహ విదళిత ¶ పల్లకముల
కమ్మపుప్పొడిపై దుమారమ్ము రేఁచు, మలయ[2]మంథరపవనుపై ¶ నలుక వొడమి.

1. ననుపైన. పా. 2. మందిర. పా.

టీ. అనుచున్ = ఇట్లని; నిందించి = (మన్మథుని) దూషి; అవ్వరారోహ = ఆ
పిఱుందులు గలది - ఆ వరూథిని; వలవంత = మన్మథతాపము; ఇనుమడింపన్ = రెట్టిం
అంతకునంత హెచ్చఁగా; విదళిత...దుమారమ్ము - విదళిత = విరియింపఁబడిన; హల్లకముల
కలువలయొక్క; కమ్మపుప్పొడి = మంచివాసనగల పుష్పరజముయొక్క; పైదుమారము
మీఁదిదుమ్మును; రేఁచు...పైన్ - రేఁచు=తనమీఁదికి వ్యాపింపఁజేయునట్టి; మలయ = మ
గొండనుండి వచ్చెడి; మంథరపవనుపైన్ = మెల్లఁగా వీచునట్టి గాలిమీఁద; అలుక = క
పొడమి = పుట్టి. దీనికి 52-వ వచనమునందలి 'అని పలికి' అనుదానితో నన్వయము.

తా. అని యీపైని జెప్పినచొప్పున వరూథిని మన్మథుని నిందించి, మన్మథతాపము హె
నెత్తకలువల పుప్పొడితోఁ జల్లగా వీచుచున్న పరిమళముతోడి దక్షిణపుగాలిసోఁకులకుఁ
లేక యా గాలిపైఁ గోపించినదై. అలం. కావ్యలింగము.

ఉ. అక్కట ! గంధవాహ ! తగ వా హరిణాంకునిఁ గూడి పాంథులం
బొక్కఁగఁ జేయఁ ? బావకుని పొం దొనరించి జగమ్ము లేర్చు నీ
యక్కొఱగామి మాన; వది యట్టిద; చుల్కనివృత్తి దుర్జనుం
డొక్కనిఁ జొచ్చి క్రిందుపడు నొండ్లకుఁ గీ డొనరింపఁ గల్గినన్.

టీ. అక్కట! = అయ్యో! గంధవాహ! = మంచివాసనను వహించిన వాయువా ! హ
కునిన్ = జింకకళంకముగాఁగల చంద్రునిని; కూడి = కూడుకొని; పాంథులన్ = విర
పొక్కఁగఁజేయన్ = తపింపఁజేయుట; తగవా? = న్యాయమా? పావకునిపొందు = అగ్ని
సహవాసమును; ఒనరించి = చేసి; జగమ్ములు = లోకములను; ఏర్చు = కాల్చునట్టి; నీయ
గామి = నీదైన యీ యకార్యమును; మానవు = వదలవు. అది యట్టిద = ఆ దుష్టస్వభా
వంటిదే! దుర్జనుండు = దుష్టుఁడయిన మనుష్యుఁడు; ఒండ్లకున్ = ఇతరులకు; కీడు ఒనరిం
అపకారము చేయుటకు; కల్గినన్ = సందు కల్గినపక్షమున; చుల్కనివృత్తిన్ = అల్పవ
మునందు; ఒక్కనిన్ = ఎవఁడే నొక దుష్టుని; చొచ్చి = ప్రవేశించి - చేరి; క్రిందుప
(ఆ దుష్టునికిఁ దాను) లోఁబడి యుండును.

తా. ఓ మందమారుతమా! నీవు చంద్రునితోఁ జేరి, మావంటి విరహిణులను దపింపఁ
చున్నావు. ఇది న్యాయము గాకపోయినను నిప్పునకుఁ దోడుపడి లోకములను కాల్చునట్టి
స్వభావముగల నీకు న్యాయమే యగును. దుష్టుఁ డొకరికిఁ గీడు చేయ ననుకూలించినప్పు
వంటిదుష్టు నింకొకనిని దోడు చేసికొని యీ యల్పవ్యాపారమునందు వారికి లోఁబడి పె
లోకస్వభావమే. అలం. అర్థాంతరన్యాసము, పరికరాంకురము.

క. నాలుకలు రెండు నిన్నుం, గ్రోలనె కల్పించె నలువ ఘోరాహికి; న
న్నాలిగ్రహ మిపుడుఁ దెగఁ దినఁ,జాలద మృదుపవన ! విరహిజనదురితప

టీ. మృదుపవన! = ఓ మలయమారుతమా! నలువ = చతుర్ముఖుఁడైన బ్రహ్మ;
హికిన్ = భయంకరమైన పామునకు; (ఇది జాత్యేకవచనము.) నాలుకలు రెండు = రెండు
కలను; నిన్నుంగ్రోలనె = నిన్నుఁదినుటకే; కల్పించెన్ = కలుగఁజేసెను. అన్నాలిగ్రహ
కుచ్చితపుఁబిశాచము; (వేయేండ్లు జీవించిన పాము పిశాచ మగు నందురు గనుక నిట గ్ర
చెప్పఁబడెను.) ఇపుడున్ = ఇప్పటికిఁ గూడ; విరహిజనదురితమునన్ = ప్రియుల నె

తపించువారు చేసికొన్న పాపముచేతనో యేమో; తెగఁదినక = నిశ్శేషముగాఁ దినుటకు; చాలద = చాలనే చాలదు.

తా. ఓ చల్లగాలీ! నిన్నుఁ బాములకు నాహారముగాఁ జేసిన బ్రహ్మ నీ యభిపరానితనము నూహించియే వానికి రెండేసి నాలుకలు కలిగించెను. అట్లు రెండు నాలుకలు గలవయ్యు నా పాములు నాబోఁటి విరహము నొందినవారు చేసికొన్న పాపముచేతనో యేమో యిప్పటికిని నిన్ను మిగులు లేక తినఁజాలక యున్నవి. అలం. విశేషోక్తి.

వ. అని పలికి యక్కలకంఠకంఠి దీపించుతాపంబు పెల్లున మూర్ఛిల్లినం[1]జూచి దోడి పల్లవోష్ఠు లల్లనల్లన హల్లకంబుల హిమాంబుపూరంబులం గర్పూరపటీర కర్దమాసారంబులం జెంగావుల మృణాళభంగంబుల నంగంబులకు జలువ పుట్టింప నెట్టకేలకుం దెలిసె నంతఁ బ్రభాతసమయం బగుటయు నొక్క పువ్వుఁబోఁడి వరూథినితో ని ట్లనియె. 52

టీ. అని = ఇట్లని; పలికి = (చల్లగాలిని) నిందించి; అక్కలకంఠకంఠి = కోకిలస్వరము వంటి కంఠస్వరముగలదైన యా వరూథిని; దీపించు... పెల్లునన్ - దీపించు = ప్రకాశించుచున్న; తాపంబు = విరహతాపముయొక్క; పెల్లునన్ = అతిశయముచేత; మూర్ఛిల్లినన్ = మూర్ఛ పోఁగా; తోడి పల్లవోష్ఠులు = దానితోఁగూడ నున్న చిగుళ్లవంటి పెదవులు గల స్త్రీలు - యామె చెలికత్తెలు; అల్లనల్లనన్ = మెల్లమెల్లఁగా; హల్లకంబులన్ = ఎఱ్ఱకలువలచేతను; హిమాంబుపూరం బులన్ = పన్నీటి వెల్లువలచేతను - అధికముగాఁ బన్నీరుచల్లుటచేత ననుట; కర్పూర...సారం బులన్ - కర్పూర = పచ్చకర్పూరముచేర్చిన; పటీరకర్దమ = పలుచనగాఁజేసిన మంచిగందము యొక్క; ఆసారంబులన్ = వానకురిసిన ట్టెడతెగని చల్లుటలచేతను; చెంగావులన్ = ఎఱ్ఱచాయ వేసిన వస్త్రములచేతను; మృణాళభంగంబులన్ = తామరతూండ్ల తునుకలచేతను; అంగంబు లకున్ = అవయవములకు; చలువ పుట్టింపన్ = చల్లఁదనమును కలిగింపఁగా; ఎట్టకేలకున్ = అతిప్రయాసముచేత; తెలిసెన్ = (మూర్ఛవలన) తేఱెను. అంతన్ = అప్పుడు; ప్రభాత సమయంబు = తెల్లవాఱుసమయము; అగుటయున్ = కాఁగా; ఒక పువ్వుఁబోఁడి = పువ్వువలె మనోహరురాలైన యొక చెలికత్తె; వరూథినితోన్; ఇట్లనియెన్.

తా. ఈ విధముగా వరూథిని మందమారుతమును నిందించి, విరహతాపము మతిమతి హెచ్చఁగా మూర్ఛపోయెను. అప్పుడు చెలికత్తెలు బహువిధముల శైత్యోపచారములు చేసి దాని మూర్ఛ దేర్చిరి. అంతలోపలఁ దెల్లవాఱుసమయ మయ్యెను. అప్పు డొక చెలికత్తె వరూథినితో నిట్లనెను.

ఉ. పాటన సేయమిం గురులు పైఁబడి శీర్ణపటీరపంకలా
లాటికమై దరస్మితవిలాసపుఁజంద్రిక డొంకి వాడుటం
దేట దొఱంగి విన్న నగు నీమొకమో యన మాసి చంద్రుఁ డో
పాటలగంధి! వ్రాలె నదె భానురుచిం దనకందు మీఱఁగన్. 53

టీ. ఓ పాటలగంధి! = ఓ పాదిరిపువ్వుల పరిమళమువంటి పరిమళము గలదానా! వరూథినీ! పాటనసేయమిన్ = దువ్వి దిద్దకపోవుటచేత; కురులు = తలవెండ్రుకలు; పైఁబడి = పైనిగ్రమ్మి;

1. 'జూచి' కొన్నింట లేదు.

శీర్ణ...లాలాటికమై - శీర్ణ = చెదరిన; పటీరపంక = అనుకైన మంచిగంధముచేనైన;
కమై = పాపటబొట్టుగలదై; దర...చంద్రిక - దరస్మిత = చిఱునవ్వుయొక్క; విలాసపు
ప్రకాశమనెడి వెన్నెల; డొంకి = అణఁగి; వాడుటన్ = వాడిపోవుటచేత; తేట =
తొఱంగి = విడిచి - లేనిదై యనుట. విన్ననగు నీమొగమో = చిన్నవోయిన నీ ముఖమో
అనన్ = అనునట్లు; చంద్రుఁడు; మాసి = కాంతిచెడి; భానురుచిన్ = సూర్యప్రకా
తనకందు = తనయొక్క కళంకము; మీఱన్ = అతిశయింపఁగా; ప్రాలెన్ = పడియెన
మించె ననుట.

తా. ఓ వరూథినీ ! దువ్వి చక్కఁబెట్టకపోవుటచేత నీ తలవెండ్రుకలు విరియఁబ
కొని చెదరి యనుకుగా నుండెడి గంధ మంటి పాపటబొట్టువలెఁ గానరాఁగాఁ జిఱునవ్వు
ప్రకాశమనెడి వెన్నెల లేక వాడుటచేతఁ గళాహీనమై యున్న నీమొగమువలెనే
సూర్యప్రకాశముచేతఁ గాంతిహీనత నొంది తన కళంకము స్పష్టముగాఁ గనఁబడు
మించెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. సకుటుంబముగవీఁగి చరమశైలముఁ జేరు, తుహినాంశుదుముదారు దొర
నాసీర మై వచ్చు నలినబాంధవుటెక్క, యంబుపై దీపించు నద్ద
నరుణాగ్రనిబిడవాద్యములలోఁ గనుపట్టు, సమయశాంఖికుచేతి శంఖ
నినుఁడప్పుడజుఁడౌట మునుమున్న పడివాగె, గొనివచ్చు రాయంచకొదవ
తే. నుదయగిరిమీఁదఁ గోపురంబుండి నిగుడు, నహితరవిరశ్మి చేబద్ధుఁడగు
బలఁగ మైనట్టిచుక్కల వలస త్రోవఁ, జూప నేతెంచె నన వేగుఁజుక్క

టీ. సకుటుంబముగన్ = పెండ్లాము బిడ్డలు మొదలగువారితోడఁ గూడ - అ
లైన భార్యలతోను, దక్కిన చుక్కలతోను ననుట; వీఁగి = (సూర్యుఁడనెడి) శత్రువు
పాఱి; చరమశైలమున్ = పడమటికొండను; చేరు...దొర - చేరు = చేరఁబోవున్న
నాంశు = చంద్రునియొక్క; దుముదారుదొర = సేనానాయకుఁడో; అనంగన్ = అను
నాసీరమై = సేనాముఖమై - దండునకు ముందునడచునదై; వచ్చు...పైన్ - వచ్చు
చున్న; నలినబాంధవు = సూర్యునియొక్క; టెక్కెయంబుపైన్ = ధ్వజముమీఁద;
నద్దము = ప్రకాశించునట్టి యద్దమో; అనఁగన్ = అనునట్లుగాను; అరుణాగ్రనిబిడ
లలోన్ - అరుణ = సూర్యునియొక్క; అగ్ర = ఎదుటిభాగమునందు; నిబిడ =
వాద్యములలోన్ = భేరి మొదలగు వాద్యములలోపల; కనుపట్టు...శంఖము - కనుపట్టు
బడుచున్న; సమయ = కాలమనెడి; శాంఖిక = శంఖమూఁదువానియొక్క; చేతి
చేతిలోనుండెడి శంఖమో; అనఁగన్ = అనునట్లుగాను; ఇనుఁడు = సూర్యుఁడు; అప్పు
కాలమునందు - ఉదయకాలమునం దనుట; అజుఁడు = బ్రహ్మ; ఔటన్ = అ
(సూర్యుఁ డుదయకాలమునందు బ్రహ్మస్వరూపుఁడును, మధ్యాహ్నకాలమునందు
స్వరూపుఁడును, సాయంకాలమునందు విష్ణుస్వరూపుఁడు నై వెలుఁగు నందురు.) మున
ముందుముందుగానే; పడివాగెన్ = ఎక్కుటకుఁదగిన ట్టాయితము చేయఁబడిన
కొని...కొదమ - కొని వచ్చు = ఎదుటికిఁ దీసికొని వచ్చునట్టి; రాయంచకొదమ
ప్రాయముగల రాజహంసయో; అనన్ = అనునట్లుగాను; ఉదయగిరిమీఁదన్ = తూ

మీఁద; కోవురంబుండి = పగవారిజాడఁ దెలిసికొనుటకై పొంచుండి; నిగుడు...రశ్మిచేన్ - నిగుడు = ముందటికి సాగివచ్చుచున్న; అహిత = శత్రువైన; రవి = సూర్యునియొక్క; రశ్మిచేన్ = కిరణములనెడి త్రాటిచేత; బద్ధుఁడు = కట్టఁబడినవాఁడు; అగుచున్; తోడి బలఁగమైనట్టి = తనతోడి పరిజనమైనటువంటి; చుక్కల...త్రోవన్ - చుక్కల = నక్షత్రములయొక్క; వలసత్రోవన్ = ఉపద్రవమునకు వెఱచి యితరదేశములకుఁ బోవుమార్గమును; చూపన్ = కనఁబఱుచుటకై; ఏతెంచెను = వచ్చెనో; అనన్ = అనునట్లుగాను; వేగుఁజుక్క = తెల్లవాఱునపు డుదయించునట్టి శుక్రనక్షత్రము; పొడిచెన్ = ఉదయించెను. (పా. తోఁచెన్ = కనఁబడెను.) అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

మ. సకలాశాగతి నర్మకోపవిరతి ✽ శ్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుచ్చరితశ ✽ బ్దజ్ఞానమే మూల మిం
తకుఁ బోలన్ వినుఁ డంచుఁ దెల్పుగతిఁ జెం ✽ తం గొండపై పల్లెలం
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిభం ✽ గిన్ భగ్నకంఠధ్వనిన్. 55

టీ. సకలాశా...త్రయికిన్ - సకలాశాగతి = (జనులు) అన్ని దిక్కులనుగూర్చి పోవుట - జనులు వారి వారి పనులు నెఱవేర్చుకొనుటకై యెవరు పోవలసినదిక్కునకు వారు పోవుట; నర్మకోపవిరతి = ప్రణయకోపముయొక్క విరామము - స్త్రీపురుషులు ప్రణయకోపము విడిచి కూటమికిం జొచ్చుట; శ్రౌతక్రియారంభణ = శ్రుతియందు విధింపఁబడిన క్రియలను జరప నారంభించుట-వేదమునందు విధింపఁబడిన స్నానసంధ్యావందనాదులగు వారివారి ధర్మములను జేయ నారంభించుట; ఆత్మక = అను నీ రూపములయిన; వర్గత్రయికిన్ = త్రివర్గమునకు - అర్థ, కామ, ధర్మముల ప్రవృత్తికి ననుట; మదుచ్చరితశబ్దజ్ఞానమే - మత్ = నాచేత; ఉచ్చరిత = పలుకఁబడిన - నేను గూయునట్టి; శబ్దజ్ఞానమే = ధ్వని యనెడి పదముల యర్థముయొక్క తెలివియే - ధ్వని వినుటవలనఁ గలిగెడి తెలివియే; ఇంతకున్ = ఈ లోకమున కంతటికిని; మూలము = ముఖ్యకారణము. పోలన్ = తగునట్లు - పరాకులేక; వినుఁడు = (లోకులారా! మీరు) వినుఁడు! అంచున్ = అని; తెల్పుగతిన్ = తెలియఁజేయు విధమున; చెంతన్ = సమీపమునందు; కొండపై పల్లెలన్ = పర్వతముమీఁదనుండెడి చిన్న చిన్న గ్రామములందు; గృహోపరిన్ = ఇండ్లమీఁద నుండి; కృకవాకుల్ = కోళ్లు; భగ్నకంఠధ్వనిన్ = వంపఁబడిన గొంతుయొక్క ధ్వనిచేత; త్రిభంగిన్ = మూఁడు విధముల వినికిగల స్వరముతో; మొరసెన్ = కూసెను.

తా. లోకులు కోడికూఁత వినఁగానే ధనార్జనమునకై పోవలసినవారు తమతమ ధనాగమన కార్యములకుఁ బోవుదురు. సంభోగపరులైన స్త్రీపురుషులు ప్రణయకోపములతో రాత్రియంతయు వ్యర్థముగాఁ గడచిపోయెనే యని యా కోపములు మాని సంభోగింపఁజొత్తురు. వైదికధర్మనిష్ఠ గలవారు తమ యనుష్ఠానములకు సమయ మయ్యె నని స్నానసంధ్యావందనాది క్రియలు సేయఁబోవుదురు. కనుక నీ పురుషార్థములు మూఁడు నారంభించుటకు సూచన చేయుచున్నవో యనునట్లు కొక్కొరోకో యని హ్రస్వ దీర్ఘ ప్లుతరూపములయిన మూఁడు స్వరములతోఁ గోళ్లు కూసెను. (కొండపైపల్లెల ననుటచేతఁ దఱుచుగాఁ గోళ్లు పెంపఁబడుట యట్టిచోట్లయందే యనియు, చెంతన్ అనుటచేత స్పష్టముగా విసవచ్చుచున్న వనియుఁ దెలియవలయును.) అలం. ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు.

మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేరఁ దద్దీప్తి నం
జనసంబంధజ బాంధవంబున రతి శ్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్ధవళిమం దాఁ బూనెనో చొప్పుమా
ర్ప నన వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు శాతోదరీ ! 56

టీ. శాతోదరీ ! = కృశించిన కడుపుగల యో వరూథినీ ! ఇనుఁడు = సూర్యుఁడు; అస్తాద్రికిన్ = అస్తమయపర్వతమునకు; పోవన్ = పోఁగానే; దీపకళికావ్రాతంబు = మొగ్గలవంటి దీపములయొక్క సమూహము; తద్దీప్తిన్ = ఆ సూర్యుని ప్రకాశమును; కొల్లగొని = అపహరించుకొని; నేఁడు = ఈ దినము; ఏతేరన్ = ఆ సూర్యుఁడు మరల రాఁగా; చొప్పుమార్పన్ = (తాను దొంగ యనుట తెలియకుండునట్లు) స్వరూపమును మార్చుకొనుటకై; అంజన... బాంధవంబునన్ - అంజన సంబంధజ = కాటుక యొక్క సంబంధమువలనఁ గలిగిన; బాంధవంబునన్ = చుట్టఱికముచేత; రతి...నికాయంబులన్ - రతి = సంభోగ జాగరమువలన; శ్రాంత = బడలిన; అంగనా = స్త్రీలయొక్క; నేత్రకోణ = కనుఁగొనలయొక్క; నికాయంబులన్ = సమూహములయందు; డాఁచి = (తా నపహరించిన సూర్యుని కాంతిని) దాఁచిపెట్టి; తద్ధవళిమన్ = ఆ కనుఁగొనల తెల్లఁదనమును; తాన్; పూనెనో = వహించెనో యేమో; అనన్ = అనునట్లు; వెల్వెలఁబాఱెన్ = మిక్కిలి తెల్లఁబాఱిపోయెను - కాంతిహీన మయ్యె ననుట.

తా. ఓ వరూథినీ ! దీపములు సూర్యుఁ డస్తమింపఁగా నాతని ప్రకాశమును దా మపహరించి వెలుఁగుచుండి, మరల సూర్యుఁడు రాఁగలఁ డని తెలిసి, యతఁడు తమ దొంగతనమును దెలిసికొకుండుటకై మాఱువేషము వేసికొన్నవో యనునట్లు తమవలనఁ గలుగు కాటుకయొక్క సంబంధము వలని చుట్టఱికము గలిగిన - రతిశ్రమనొందిన స్త్రీలయొక్క కడగన్నులయందుఁ దమ ప్రకాశమును జేర్చి, వారి కడకన్నుల తెలుపును దాము తీసికొని తెల్లగాఁ గనఁబడుచున్నవి చూడుము. (తూర్పు తెల్లవాఱఁగానే దీపములు కాంతిహీనము లయ్యె ననియు, రాత్రియంతయు రతిపారవశ్యముచేత నిద్రలేకయున్న స్త్రీలకన్ను లెఱ్ఱవాఱె ననియు భావము.) అలం. ఉత్ప్రేక్ష.

శా. వాలారుంగొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళం బైన విపంచి నిన్న మొదలున్ నీ వంటమింజేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రు[1]లు మేళవింపఁగదవే లోలాక్షి ! దేశాక్షికిన్. 57

టీ. లోలాక్షీ! = చలించుచున్న కన్నులుగలదానా! వరూథినీ! నీవు; అలసతన్ = ప్రాలుమాలికచేత; వాలు = వాఁడి; ఆరుంగొనగోళ్లన్ = కలిగిన గోటికొనలతో; వాయించుచోన్ = మీటునప్పుడు; నాటకున్ = నాటరాగమునకు; మేళంబైన = స్వరస్థానములు కుదిర్చి జతపఱుపఁబడినట్టి; విపంచి = వీణ; నిన్న మొదలున్ = నిన్నటినుండి; నీ వంటమింజేసి = నీవు తాఁకకపోవుటచేత; అవేళన్ = ఆ రాగము పాడఁగూడని యీ కాలమందును; ప్రభాత...తంత్రులన్ - ప్రభాత = తెల్లవాఱుసమయమునందు; ఆయాత = వచ్చుచున్న - వీచుచున్న; వాత = గాలిచేత; ఆహత = కొట్టఁబడినవై; ఆలోలత్ = మిక్కిలి కదలుచున్న; తంత్రులు = ఉక్కుతీగెలు; ఆ యాలాపంబె = ఆ నాటరాగముయొక్క యభివ్యక్తినే - ఆ నాటరాగమునకుఁ గుదిర్చిన మెట్టు

1. త్రుల. పా.

వరుసకుఁ దగిన పలుకుబడిసే; పల్కెడుర్ = వాఁగుచున్నవి. (కనుక) దేశాక్షికిర్ = దేశాక్షి యను రాగమునకు - ఉదయకాలమునందుఁ బాడఁదగిన దేశాక్షి రాగమునకుఁ దగినట్టు; మేళవింపఁ గదవే! = మేళము కుదుర్పవే! - స్వరస్థానములు కుదిర్చి జతపఱుపవే! యనుట.

తా. ఓ వరూథినీ! నీవు నిన్న మధ్యాహ్నకాలమునం దప్పటికిఁ దగినట్టు నాటరాగమునకు స్వరస్థానములు కుదిర్చి మీటుచున్న వీణ, యది మొదలు నీవు దానిని ముట్టకుండుటచేత నిప్పుడును దంత్రులు గాలిచేఁ గదలఁగా నా మేళముతోనే వాఁగుచున్నది. అది యీ యుదయకాలమునకుఁ బొసఁగదు గనుక నిప్పటికిఁ దగిన దేశాక్షిరాగమున కనుకూలముగా స్వరస్థానములు కుదిర్చి జత పఱుపుము. (ఇట్లనుటచేత మధ్యాహ్నకాలమునందుఁ బాడఁదగినది నాటరాగము, ప్రాతః కాలమునందుఁ బాడఁదగినది దేశాక్షిరాగము అనుట తేటపడుచున్నది.) 1

చ. పలుకులు నేర్పువేళఁ గల * భాషిణి! నీ విటు లుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖ * ముల్ చరణాగ్రనఖాళి గోఁకుచుర్
నిలుగుచు నావులించుచు వ * నీవిహగోత్కర మెట్లు వల్కు న
ప్పలుకులె యఱ్ఱు [2]లెత్తుకొని * పల్కెడు వింటివె కీరశారికల్! 58

టీ. కలభాషిణి! = అవ్యక్తమధురధ్వనితో మాటలాడుదానా! - వరూథినీ! పలుకులు = మాటలను; నేర్పువేళర్ = అభ్యసింపఁజేయు సమయమునందు; నీవు; ఇటులుండర్ = ఇట్లు పరాధీనవై యుండుటచేత; పంజరంబులర్ = పెంపుడుపక్షుల నుంచు గూండ్లయందు; కీరశారికల్ = చిలుకలును, గోరువంకలును; అరగన్నువెట్టి = సగము మూఁతపడునట్లు కన్నులు మూసికొని - తూఁగిపడుచు ననుట; ముఖముల్ = మొగములను; చరణాగ్రనఖాళిర్ = కాలిగోటి కొనల పంక్తితో; గోఁకుచుర్ = గీఱుకొనుచును; నిలుగుచుర్ = నిక్కి మేనులు విఱుచుకొనుచును; ఆవులించుచుర్ = ఆవులింత విడుచుచును; వనీవిహగోత్కరము = అడవిపక్షులగుంపు; ఎట్లు పల్కుర్ = ఏ విధముగాఁ గూయునో; అప్పలుకులె = ఆ కూఁతలే; అఱ్ఱులెత్తుకొని = మెడలెత్తుకొని; పల్కెడుర్ = కూయుచున్నవి; వింటివె? = నీవు విన్నావా?

తా. ఓ వరూథినీ! ప్రొద్దునలేచి నీచే మాటలు నేర్పఁబడుచున్న చిలుకలును, గోరువంకలును నీవు పరాధీనురాలవై వాడుకచొప్పున మాటలు నేర్పకపోవుటచేతఁ బంజరములోఁ దూఁగిపడుచు నితరధ్వను లని, నీమాట లని భేదము తెలిసికోలేక యడవిపక్షుల కూఁతలు విని, యా కూఁతలే కూయుచున్నవి. అది విని యవి యట్లు కూయకయుండుటకై యించుక యోపిక చేసికొని లేచి వానికి మాటలు నేర్పుము. అలం. స్వభావోక్తి, భ్రాంతిమంతమును.

---

1. ఇప్పుడు రాగములన్నియు పలికించుట కనుకూలమయి యున్నరీతి నక్కాలమున వీణలు తత్తద్రాగానుకూల స్వరస్థానములను కలిగి యుండలేదు. ఏదేనొక రాగమునకు మేళవింపఁబడిన వీణ నతిప్రయాసమున రాగాంతరాలాపసమయమున మార్చవలసియుండెడిది. కొన్నియెడల ఆ యా రాగములకుఁ బ్రత్యేకముగ వీణ లేర్పడియుండెడివి. గొప్ప సంగీతవిద్వాంసుఁడును, సంగీత, సాహిత్యములం దసమానప్రతిభావిలసితుఁడును, తంజాపురప్రభువు నగు రఘునాథరాయఁడే పరిశ్రమించి వీణపయి రాగముల నన్నింటిని పలికించుటకుఁ దగిన పథకము నేర్పఱచెను.

2. లెత్తి విని. పా.

మ. ఉరుసంధ్యాతపశోణమృత్కలితమై ✽ యొప్పారు బ్రహ్మాండ మ
న్గరిడిం గాలపుహొంతకాఁడు చరమా ✽ గస్కంధముం జేర్చు ని
బ్బరపున్ సంగడమో యనన్ శశి డిగెం ✽ బ్రాగ్భూమిభృత్కైతవే
తరబాహాగ్రపుసంగడం బనఁగ మా ✽ ర్తాండుండు దోఁచెన్ దివిన్. 59

టీ. ఉరు...కలితమై - ఉరు=అధికమైన; సంధ్యాతప = ప్రాతస్సంధ్యారాగ ప్రశాశమనెడి; శోణమృత్ = ఎఱ్ఱమట్టితో; కలితమై = కూడుకొన్నదై; ఒప్పారు బ్రహ్మాండము = ఒప్పుచున్న బ్రహ్మాండము; అన్గరిడిన్ = అనియెడి సాముకూటమునందు; కాలపుహొంతకాఁడు = కాలమనెడి జెట్టి; చరమాగస్కంధమున్ = పడమటికొండయనెడి మూఁపునందు; చేర్చు...సంగడమో - చేర్చు = పెట్టుకొనిన; నిబ్బరపున్ = నిశ్చలమైన; సంగడమో = గరిడీసాదన కొదవెడి తిరుగటి వంటి వస్తువైన సాధనమో - (దీనిని సంక్తోలా - సంగిడీ అందురు.) అనన్ = అనునట్లుగా; శశి= చంద్రుఁడు; డిగెన్ = దిగువకు వ్రాలెను. ప్రాగ్భూ...సంగడంబు - ప్రాగ్భూమిభృత్కైతవ = తూర్పుకొండ యనెడి మిషచేనైన; ఇతర = మఱియొక; బాహాగ్రపు = భుజశిరస్సుయొక్క - రెండవ మూఁపునం దుంచుకొన్న యనుట; సంగడంబు .అనన్ = సంగిడీ అనునట్లుగా; మార్తండుండు = సూర్యుఁడు; దివిన్ = ఆకాశమునందు; తోఁచెన్ = కనఁబడెను - ఉదయించె ననుట.

తా. అధికమయిన ప్రాతస్సంధ్యారాగకాంతి యనెడి యెఱ్ఱమట్టి పఱపిన బ్రహ్మాండమనెడి గరిడీసాలయందుఁగాల మనెడి జెట్టి సూర్యచంద్రు లనెడి సంగిడీలజతను రెండు చేతులంబట్టి సాదన చేయుచుఁ దూర్పుపడమరకొండ లనెడి రెండు మూఁపులయందును నిలిపినాఁడో యనునట్లు సూర్య, చంద్రబింబములు గానఁబడెను - చంద్రుఁ డస్తమించు సమయమునందే సూర్యుఁడు నుదయించె నని భావము. సాముకూటమునం దెఱ్ఱమట్టి పఱుచుట ప్రసిద్ధము. అలం. రూపకము, ఉత్ప్రేక్ష, అపహ్నవమును.

చ. కరకరి గూఁటఁ గట్టియిడఁ ✽ గా మొఱవెట్టెడులీల బాలభా
స్కరకరకాండకందళవి ✽ ఘట్టన నించుక వాయివడ్డ తా
మర మొఱ వెట్టివెట్టి పలు ✽ మాఱును వాకిలి దాఁటి యాఁగుచున్
మొరయ విపంచి మీటుగతి ✽ మ్రోసి యళుల్ వెడలెం గొలంకులన్. 60

టీ. కరకరిన్ = క్రూరత్వముతో; గూఁటన్ = పక్షిగూఁటియందు; కట్టియిడఁగాన్ = కట్టిపెట్టినప్పుడు; మొఱవెట్టెడులీలన్ = పక్షులు మొఱ్ఱో యని కూయునట్లు; బాల...విఘట్టనన్ - బాలభాస్కర = లేఁతసూర్యునియొక్క; కర = కిరణములనెడి; కాండకందళ = కఱ్ఱపుల్లల యొక్క; విఘట్టనన్ = విశేషమయిన తాఁకుడుచేత; ఇంచుక = కొంచెము; వాయివడ్డ = విచ్చి, ద్వారమేర్పడిన; తామరన్ = కమలమునందు; (ఇది యిచ్చట జాత్యేకవచనము.) మొఱవెట్టి వెట్టి = దుఃఖముతో నఱచి యఱచి; పలుమాఱును = మాటిమాటికిని; వాకిలి = (విచ్చిన) ద్వారమును; దాఁటి = వెడలి; ఆఁగుచున్ = అల్లేపోక నిలుచుచును; మొరయన్ = మ్రోఁగునట్లు; విపంచి = వీణియ; మీటుగతిన్ = వాయించినరీతిగా; మ్రోసి = ఝుంకారధ్వనులు చేసి; అళులు = తుమ్మెదలు; కొలంకులన్ = సరస్సులయందు; వెడలెన్ = (తామరలలోనుండి) బయలు దేఱెను.

తా. ఎవ్వఁడేని పాప మని యెంచక క్రూరస్వభావముతోఁ గట్టిచేత గూఁటిని గ్రుచ్చఁగా నా గూఁటిలోని పక్షు లఱచునట్లు వేఁడిమి చూపునట్టి స్వభావముగలవాఁడైన సూర్యుఁడు తన కిరణములచేతఁ గమలములను విరియింపఁగా నం దున్న తుమ్మెదలు వెలుపల వచ్చియు నావలఁ బోక యక్కడనే వీణ మీటినట్లు ఝుంకారము చేయుచు నుండెను. సూర్యకిరణములు సోఁకఁగానే తామరలు విరిసె ననియు, వానిలోని తుమ్మెదలు వెలువడుచు ఝుంకారము చేసె ననియు భావము. అలం. స్వభావోక్తి, ఉపమయు.

చ. అడరు నవీనభానుకిర | ణానల మంటినఁ గూడుకొన్న పు
ష్పాడికొలు చెల్ల మోచికొని | పోయెడి సంభ్రమ మొప్పఁ గంటివే
పడఁతి ! భవద్విహారవన | పద్మసరఃకుముదాలయంబులన్
వెడలు మిళిందబృందములు | వీఁపుపిశంగిమకైతవంబునన్. 61

టీ. పడఁతి! = ఓ వరూథినీ! భవత్...దాలయంబులన్ - భవత్ = నీదైన; విహారవన = శృంగారపుఁదోఁటయందలి; పద్మసరః = తామరకొలఁకులయందలి; కుముద = కలువలనెడి; ఆలయంబులన్ = ఇండ్లయందు; వెడలు మిళిందబృందములు = బయలుదేఱునట్టి తుమ్మెదలయొక్క గుంపులు; వీఁపు పిశంగిమ కైతవంబునన్ = వీఁపుయొక్క పసుపువన్నె యనెడి మిషచేత; అడరు... అనలము - అడరు = అతిశయించిన; నవీన = క్రొత్తదైన; భానుకిరణ = సూర్యకిరణము లనెడి; అనలము = నిప్పు; అంటినన్ = తగులుకొనఁగా; కూడుకొన్న పుష్పాడికొలుచు = తమయొద్దఁ జేరియున్న పుష్పాడి యనెడి ధాన్యము; ఎల్లన్ = అంతయు; సంభ్రమము ఒప్పన్ = తొట్రుపాటు కలుగఁగా; మోచుకొని = వహించుకొని - ఎత్తుకొని; పోయెడిన్ = పోవుచున్నవి. కంటివే ?= చూచితివా ?

తా. ఓ వరూథినీ ! నీ శృంగారపుఁదోఁటలోని తామరకొలఁకులపై నీరెండ సోఁకఁగానే కలువలయం దున్న తుమ్మెద లా కలువలలోని పుప్పొడి యంటిన వీఁపులు పసుపువన్నెతో నొప్ప వానినుండి వెడలిపోవుటను జూడఁగా, నిప్పంటుకొని కాలుచున్న యిండ్లలోనుండి తాము చేర్చి పెట్టుకొన్న ధాన్యమును వీఁపులపై మోసికొనిపోవునట్టి కాఁపులవలెనే కనఁబడుచున్నవి. చూడుము! సూర్యోదయమై యెండ ప్రసరింపఁగానే కలువలు ముడిఁగెను. వానిలోఁ జిక్కక తప్పించుకొని తుమ్మెదలు లేచిపోయె నని భావము. అలం. ఉత్ప్రేక్ష, రూపకము, అపహ్నవమును.

చ. కొలకొలఁ గూయుఁ బై నొఱగుఁ | గుత్తుకఁ గుత్తుకఁ జుట్టుఁ బాఱుచి
ల్వలక్రియఁ గానరానిగతు | లన్ మయి మైఁ బెనఁచున్ జనించున
శ్రు లఱుత నొత్తు సోలు నిలు | చున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలఁపవు కంటె ? పాసినవె | తల్ దలఁపించుచుఁ గోకదంపతుల్. 62

టీ. కోకదంపతుల్ = ఆలుమగలైన చక్రవాకపక్షులజతలు; విధిచాతురిన్ = దైవముయొక్క నేర్పుచేత - దైవానుకూల్యముచేత ననుట; కూడియున్ = మరలఁ గలసికొనియు; పాసినవెతల్ = (రాత్రియంతయుఁ దాము) ఎడఁబాసియున్నప్పటి కష్టములను; తలఁపించుచున్ = ఒకటి నొకటి తలఁచుకొనునట్లుచేయుచు; కొలకొలఁగూయున్ = కొలకొల మని యఱచును. పైన్ = ఒకదానిపై నొకటి; ఒఱగున్ = ప్రెుగ్గి యానుకొనును. కుత్తుకన్ = మెడతో; కుత్తుకన్ = మెడను; చుట్టున్ = క్రమ్మును; పాఱుచిల్వలక్రియన్ = ఇటునటుఁ బ్రాఁకుచుఁ

బోవునట్టి పాములవలెను; (పా. పోరువెల్చులక్రియన్ = పోరాడునట్టి పాములవలె.)
గతులన్ = ఇది యిట్లని చూచి తెలిసికోఁగూడని రీతులతో; మయి మైన్ = దేహము
మును; పెనఁచున్ = పెనవేసికొనును. జనించునశ్రులు = పుట్టుచున్న కన్నీళ్లను; అ
ఒండొంటిమెడచేత; ఒత్తున్ = తుడుచును. సోలున్ = మైమఱచి వ్రాలును. నిలుచున్ =
దోఁచక నిలఁబడును. రతిం దలఁపవు = సంభోగము నెంతమాత్రమును దలఁపవు.
చూచితివా?

తా. ఓ వరూథినీ! చక్రవాకపక్షిదంపతులు ప్రొద్దు గ్రుంకఁగానే కన్నుఁగానక
నెడఁబాసి రాత్రి యంతయు విరహదుఃఖము ననుభవించుచుఁ గడపి ప్రొద్దు పొడువఁగా
గలసికొనియు, రాత్రి యనుభవించిన దుఃఖము నొకదాని కొకటి తెలియఁ దెలుపుకొని
ములఁ గ్రిందుమీఁదుపడుచున్నవి గాని సంభోగము నిచ్ఛించినవే కావు. చూడుము. అల
వోక్తి, కారణదీపకము, ఉపమ, విశేషోక్తియు.

ఉ. ఇందునిభాస్య! వాఁ డనఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యా యుపేంద్ర
యిందులకై వగం బొగుల నేటికి? నేఁటికి నందుఁ బోద; మా
నందనభూమి భూమిసుర నందనుఁ డుండకపోఁడు; రమ్ము; నీ
చందము నందముం గనిన జవ్వని! యెవ్వని [1]వెఱ్ఱిఁ జేయదే?

టీ. ఇందునిభాస్య! = చంద్రునివంటి ముఖముగలదానా! - వరూథినీ! వాఁడు
రుఁడు; అనఁగాన్ = అనఁగా; ఇంద్రుఁడో; చంద్రుఁడో; ఆ యుపేంద్రుఁడో = ఆ
విష్ణువో - (ఇంద్ర,చంద్ర, విష్ణువులవంటి గొప్పవాఁడు కాఁడనుట. అనఁగా నింద్ర
లోకవేళ విరక్తి హెచ్చి కానరాకపోవునంతటి మహిమ గలవారైన నగుదురుగాని మనుష
డైన యీ బ్రాహ్మణుఁ డట్టివాఁడు కానేరఁడు. ఇక్కడనే యెక్కడనో యుండు నని
ఇందులకై = వాఁడు కనఁబడక పోయినంత మాత్రమునకై; వగన్ = విచా
పొగులన్ = పరితపించుట; ఏటికిన్? = ఎందులకు? నేఁటికిన్ = నే
అందున్ = ఆ యాటతోఁటకు; పోదము = పోవుదము. ఆ నందనభూమిన్ = సంతో
యా తోఁటయందు; భూమిసురనందనుఁడు = బ్రాహ్మణ కుమారుఁడయిన ప్రవరుఁడు;
పోఁడు = ఉండనేయుండును. రమ్ము = లేచి పోదము రమ్ము. జవ్వని! = ఓ చిన
నీచందమున్ = నీ విధమును - నీవు వలచిన విధము ననుట; అందమున్ = నీ చక్క
కనినన్ = చూచినయెడ; ఎవ్వనిన్ = ఎంత విరక్తుని నైనను; వెఱ్ఱిన్ = కామవికారపు
వానిఁగా; చేయదే? = చేయకపోవునా? చేయనే చేయు ననుట. నీ కెట్లో అట్లు వాని
వికారమువలనఁ దాపము కలిగియేయుండు నని భావము. అలం. ప్రతిషేధము.

ఉ. ఏల దురంతవేదనమె యిం బొరలాడెదు తాల్మి దక్కి? మే
లే లలితాంగి? యెంతపని లెమ్మది; విప్రవరుండు గోలయున్
బాలుఁడు గాన నప్పటికిఁ బైఁబడఁ [2]గొంకెనొ కాక, వానికిన్
గా లొకచోట నిల్చునె? వ గన్ మగుడన్ నినుఁ జూచునంతకున్

1. వెట్టిసేయదే. పా. 2. గొంకెనుగాని. పా.

టీ. లలితాంగి ! = ఒప్పిదమయిన యవయవములు గలదానా ! వరూథినీ! ఏల = ఎందు లకు; తాల్మి = ధైర్యము; తక్కి = విడిచి; దురంతవేదనమెయిన్ = అంతములేని బాధచేత; పొర లాడెదు? = క్రిందు మీఁదు పడెదవు ? మేలే? = ఇది మంచిదా? - ఇది యుక్తము కాదనుట. ఇది= ఇప్పుడు నీప్రియునిఁగనిపట్టి తెచ్చుట; ఎంతపనిలెమ్మ = ఎంతమాత్రపుఁ బనిలే - అసాధ్యమైన పని కాదనుట. (ఇందు 'లెమ్ము' అనునది యలక్ష్యతను దెలుపును.) విప్రవరుండు = ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు; గోలయున్ = ముగ్ధుఁడును - యుక్తాయుక్తవివేకములేనివాఁడును; బాలుఁడున్ = పసివాఁడును; కానన్ = కాఁబట్టి; పైఁబడన్ = నీవే వానిమీఁదఁ బడి కౌఁగిలింపఁగా; అప్ప టికిన్ = ఆ సమయమునకు; కొంకెనో = ఏమి జెడద వచ్చునో యని జంకెనో యేమో; కాక = అంతేకాని; వానికిన్ = ఆ బ్రాహ్మణునికి; మగుడన్ = మరల; నినుఁ జూచునంతకున్ = నిన్నుఁ జూచునంతవఱకును; వగన్ = నిన్ను వదలిన విచారముచేత; కాలు = పాదము; ఒకచోటన్ = ఒకతావునందు; నిల్చునె? = నిలుకడగలిగియుండునా ? - ఉండ దనుట.

తా. ఓ వరూథినీ ! నీ వేమో పిచ్చిపట్టి యిట్టి మితిలేని విచారము పెట్టుకొని సంకటపడు చున్నావు. ఆ బ్రాహ్మణుని లోఁబఱచుకొనుట యెంతమాత్రపుఁబని ? వాఁడు యుక్తాయుక్త ములు తెలిసికోలేని మూఢుఁడును, బసివాఁడును గనుక నీవు పైఁబడి కౌఁగిలించుకొన్నను సంకోచ పడి తొలఁగి పోయెను గాని యితరము కాదు. అయినను నిన్ను మరలఁ జూచి మాటలాడునంత వఱకు వానికి నొకచోట నెమ్మదిగా నిలిచియుండ మన సొప్పునా? తానే నిన్ను వెదకికొని వచ్చును.

క. రా ర మ్మనుటయు దివిష, న్నారీరత్నంబు నికట ✽ నాకధునీక
ల్హారాంభోరుహమధురస, ధారాచంద్రకితసలిల ✽ ధౌతాననయై. 65

టీ. రారమ్ము = త్వరగా రమ్ము; అనుటయున్ = అని చెలికత్తె యనఁగా; దివిషన్నారీ రత్నంబు = దేవతాస్త్రీలలో శ్రేష్ఠురాలయిన వరూథిని; నికట...ఆననయై - నికట = సమీ పమునందున్న; నాకధునీ = ఆకాశగంగయందలి; కల్హార = ఎఱ్ఱకలువలయు; అంభోజ = కమల ములయు; మధురస = పూఁదేనెయొక్క; ధారా = ధారలచేత; చంద్రకిత = నెమిలిపురి కన్నులవన్నెగల - జిడ్డు దేఱునదిగాఁ జేయఁబడిన; సలిల = నీటిచేత; ధౌత = కడుగఁబడిన; ఆననయై = ముఖముగలదై. తరువాతి పద్యముతో నన్వయము.

తా. ఈ మీఁదను జెప్పఁబడినరీతిని జెలికత్తె బోధింపఁగా వరూథిని కలఁకదేఱి లేచి సమీపమునందు యెఱ్ఱకలువల నుండియుఁ, దామరలనుండియు జాఱిన పూఁదేనెచే నెమలియీఁకల లోని కన్నులవన్నెగలజిడ్డు తేఱుచుఁ బాఱుచున్న గంగనీటిలో మొగము కడుగుకొన్నదై.

సీ. ఘనసార[1]పంక మొ ✽ క్కలతాంగి దెచ్చిన
ముట్టి వ్రేలనె చుక్క ✽ బొట్టు వెట్టి
యింతి యొక్కతె పూవు ✽ టెత్తు లెత్తినఁ జూచి
విసువుతో నొకకొన్ని ✽ విరులు దుఱిమి

1. చూర్ణ. పా.

పడఁతి యొక్కతె రత్న । పాదుక లిడ నిల్చి
　　తొడుగ కవ్వలికిఁ బో । నడుగు వెట్టి
బాగాలు వెస నొక్క[1] । పద్మాక్షి యొసఁగిన
　　వెగ్గలం బని కొన్ని । వెడల నుమిసి
తే. సగము గొఱికిన యాకును । సఖులు పిలువ
సగ మొసఁగు నుత్తరముఁ దెల్వి । సగము మఱపు
సగము నయి చింతచే సగ । మగుచు [2]నరిగె
నవ్వరూథిని యంతికో । ద్యానమునకు. 66

టీ. ఒక్క లతాంగి = తీగవంటిదేహము గల యొక పరిచారిక; ఘనసారపంకము = పచ్చకర్పూరము చేర్చి యనుకుగాఁ గలిపిన గంధమును; తెచ్చినన్ = తేఁగా; వ్రేలనె = కొనవ్రేలితోనే; ముట్టి = తాఁకి; చుక్కబొట్టు పెట్టి = కొంచెమెత్తి నొసటఁ జుక్కవలె బొట్టుపెట్టుకొని; ఇంతి యొక్కతె = ఇంకొక్క చెలికత్తె; పూవుటెత్తులు = కుచ్చుగాఁగట్టిన పూదండలు; ఎత్తినన్ = ఎత్తి చేతఁ బట్టుకోఁగా; చూచి; విసువుతోన్ = విరక్తితో; ఒక కొన్ని విరులు = అందుఁ గొన్ని పువ్వులుమాత్రము; తుఱిమి = కొప్పునఁ జెరువుకొని; పడఁతి యొక్కతె = మఱియొక యువతి; రత్నపాదుకలు = రత్నములు పొదిఁగిన పావకోళ్లు; ఇడన్ = ముందఱితట్టు దెచ్చి పెట్టఁగా; నిల్చితొడుగక = సరిగా నిలిచి కాలియందు ధరింపక; అవ్వలికిఁ బోన్ = ఒక ప్రక్కకుఁ దొలఁగిపోవునట్లుగా; అడుగుపెట్టి = పాదమును బావలపై నానించి; ఒక్క పద్మాక్షి = ఇంక నొక్క తామరపూవువంటి కన్నులుగల స్త్రీ; వెసన్ = శీఘ్రముగా; బాగాలు = సన్నగా నొత్తిన పోఁకచెక్కలు; ఒసఁగినన్ = ఇయ్యఁగా; వెగ్గలంబు = అధికము; అని = అని చెప్పి; కొన్ని = ఆ పోఁకచెక్కలలోఁ గొన్నిటిని; వెడలనుమిసి = బయటికి వెడలునట్లుగా నుమిసి; సగముకొఱికిన యాకును = సగము మాత్రము కొఱికిన తములపాకును; సఖులు = చెలికత్తెలు; పిల్వన్ = పిలువఁగా; సగము = పూర్తిలేనిదిగా; ఒసఁగునుత్తరమును = ఇచ్చునట్టి మఱుమాటయు; తెల్వి = జ్ఞానము; సగమును; మఱపు = అజ్ఞానము; సగమును; ఐ = కలదై - ఉండియు లేనిదైన తెలివితో ననుట; చింతచేన్ = విచారముచేత; సగము = చిక్కి సగమైనది; అగుచున్; అవ్వరూథిని; అంతికోద్యానమునకున్ = దగ్గఱియుద్యానవనమునకు; అరిగెన్ = వెళ్లెను.

తా. వరూథిని విరహవేదనచేత విరక్తినొందినదై గంధము పూసికొనక, పువ్వులు కొప్పునఁ జక్కఁగాఁ బెట్టుకొనక, పావకోళ్లు కాళ్లఁ దొడుగక, వక్కలాకు లొల్లక, చెలికత్తె లాడు మాటలకు బదులుమాటలు సరిగాఁ జెప్పక, స్మృతిగల్గియు లేనిదానివలెనే విచారముచేఁ గృశించిన దేహము గలదై మెల్లగా నింటిదగ్గఱి శృంగారపుఁదోఁటకుఁ బోయెను.

వ. ఆ సమయంబున దేవజాతిత్వజనిత విమలజ్ఞాన పాటవంబునం దద్వృత్తాంతంబు సమస్తంబు నెఱుంగుటం జేసి. 67

టీ. ఆ సమయంబునన్ = ఆ యుద్యానవనమునకుఁ బోవునప్పుడు; దేవ...పాటవంబునన్ - దేవజాతిత్వ = దేవజాతియగుటవలన; జనిత = పుట్టిన; నిజ = తనదైన; విమల = స్వచ్ఛమైన; జ్ఞాన=

1. నొక. పా. 2. జనియె. పా.

తెలివియొక్క; పాటవంబునన్ = సామర్థ్యముచేత; తద్వృత్తాంతంబు = ఆ వరూథినీ ప్రవరుల సమాచారము; సమస్తంబున్ = అంతయును; ఎఱుంగుటంజేసి = తెలిసినవాఁ డగుటచేత. (కర్త గంధర్వుఁడు.)

శా. ఏ గంధర్వుఁడు దద్విలాసముల ము న్నీక్షించి తా నెంతయున్
రాగాంధుం డయి కోరి హ త్తక గడున్ రారాపులం గంతుఁ డు
ద్వేగం బందఁగఁ జేయ [1]రేఁబగలు ను వ్విళ్లూరుచున్ వేఁగువాఁ
డా గంధర్వకుమారుఁ డంగభవవి ద్యాపారగుం డాత్మలోన్. 68

టీ. మున్ను = మునుపు; ఏ గంధర్వుఁడు; తద్విలాసములన్ = ఆ వరూథినియొక్క శృంగార చేష్టలను; ఈక్షించి = చూచి; తాన్ = తాను; ఎంతయున్ = మిక్కిలి; రాగాంధుండు అయి = అనురాగముచేతఁ గన్నుగాననివాఁడై - మోహపరవశుఁడయి; కోరి = వరూథినితోడి కూటమి నపేక్షించి; హత్తక = జతపడక; కంతుఁడు = మన్మథుఁడు; కడున్ = మిక్కిలి; రారాపులన్ = మాటిమాటికి రాపిడిచేయుటలచేత; ఉద్వేగంబు = చిత్తభ్రమమును; అందఁగన్ = పొందునట్లు; చేయన్ = చేయఁగా; ఉవ్విళ్లూరుచున్ = (వరూథిని కూటమికై) త్వరపడుచు; రేఁబగలు = రాత్రింబగళ్లు - ఎల్లవేళల ననుట; వేఁగువాఁడు = తపించుచుండువాఁడో; అంగభవవిద్యాపార గుండు = మన్మథవిద్యయందు నిపుణుఁడయిన; ఆ గంధర్వకుమారుఁడు = యువకుఁడైన యా గంధ ర్వుఁడు; ఆత్మలోన్ = తనమనస్సునందు. క్రింది పద్యముతో నన్వయము.

తా. మును పొక గంధర్వుఁడు వరూథినిసౌందర్యమును, దాని శృంగారచేష్టలను జూచి మోహించి, యది యందులకు సమ్మతింపక పోఁగా, దానిని వలపించు నుపాయమును గానక, నాఁట నుండి మన్మథవేదన పొందుచున్నవాఁడై, వరూథిని ప్రవరుని వలచి వాఁడు తన్నొల్లమిచేత మన్మథవ్యథ పడుచున్న వృత్తాంతముఁ దెలిసికొని తన మనసులో నిట్లాలోచించెను.

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమి సేయుదు; రొక్కవేళఁ బె
న్నక్కువ నాదరింతురు; క్ష ణక్షణముల్ జవరాండ్రచిత్తముల్;
పక్కన వేసఱం జన; దు పాయములం [2]గడు నిచ్చకంబులం
జిక్కఁగఁ జేసి డాసి సతి చిత్తముఁ బట్టి సుఖంపఁగాఁ దగున్. 69

టీ. పద్మముఖులు = తామరలవంటి ముఖముగలవారు - స్త్రీలు; ఒక్కొకవేళన్ = ఒక్కొక్క సమయమునందు; ఒల్లమిసేయుదురు = అపేక్షింపకపోవుదురు. ఒక్కవేళన్ = ఒకా నొక సమయమందు; పెన్నక్కువన్ = అధికాపేక్షతో; ఆదరింతురు = ఆదరణచేయుదురు. జవ రాండ్రచిత్తముల్ = యువతులయొక్క మనసులు; క్షణక్షణముల్ = ప్రతిక్షణమును మాఱుచుండు నవి. (కాఁబట్టి) పక్కనన్ = తటాలున - కొంచెమైనను నిదానింపక యనుట; వేసఱన్ = విసుఁ గుట; చనదు = తగదు. ఉపాయములన్ = (బహువిధములయిన) ఉపాయములచేతను; కడు నిచ్చ కంబులన్ = ఎక్కువ మెప్పుమాటలచేతను; డాసి = దగ్గఱఁజేరి; చిక్కఁగఁజేసి = చిక్కించుకొని; సతిచిత్తముఁ బట్టి = ఆఁడుదానిమనసు ననుసరించి; సుఖింపఁగాన్ తగున్ = సంభోగ సుఖము ననుభవింపఁ దగును.

1. నెవ్వగల. పా. 2. దగు. పా.

తా. 'స్త్రీలు చపలచిత్తలు గనుక నొక సమయమం దొల్లనివారివలెఁ గనఁబడిన
సమయమునందుఁ దామే వలచినవారై ప్రేమఁ జూపుదురు. 'ఇప్పు డిది యనాద
దీనితో మాటలాడ రా'దని విసుఁగుకొని తొలఁగిపోరాదు. సమయముఁ జూచి తగిన
పన్ని, దగ్గఱఁ జేరి మనసు కరఁగునట్టి మెప్పుమాట లాడి లోఁబఱచుకొని, మనసు
సుఖము ననుభవించుట యుచిత' మని యాలోచించెను. అలం. అప్రస్తుతప్రశంస, క

క. అని తలఁచి యవ్విలాసిని, యనిశము గ్రీడించు పుష్పి ♦ తారామ
మును కలుగఁ జొచ్చి యొక చం, దనభూజమునీడ నిల్చి ♦ దంభం

టీ. అని తలఁచి = అని యీ విధముగా నాలోచనను చేసి; అవ్విలాసిని =
యా వరూథిని; అనిశము = ఎల్లప్పుడు; క్రీడించు పుష్పితారామంబుక = విహరి
దోఁటను; మును కలుగక = ముందుమించి - వరూథిని యా తోఁటకు రాఁగల ద
రాకముందే యనుట; చొచ్చి = ప్రవేశించి; ఒక చందనభూజమునీడక = ఒక గంధ
యందు; నిల్చి = నిలువఁబడి; దంభంబు అమరక = మాయ ఒప్పఁగా. తర్వా
నన్వయము.

సీ. అర్ధచంద్రుని[1] తేట ♦ నవఘళించులలాట, పట్టిఁ దీర్చిన గంగ ♦ మ
జెక్కుటద్దములందు ♦ జిగివెల్లువలు చిందు, రమణీయమణికుండ ♦ ల
బసిఁడివ్రాఁతచెఱంగు ♦ మిసిమిదోఁపఁ జెలంగు, నరుణాంశుకోత్తరీ ♦
సరిలేని రాకట్టు ♦ జాళువామొలకట్టు, బెడఁగారుసీర్కావి ♦ పింజె

తే. ధవళధవళములగు జన్ని ♦ దములతోడఁ
గాశికాముద్ర యిడిన యుం ♦ గరముతోడ
శాంతరస మొల్కు బ్రహ్మతే ♦ జంబుతోడఁ
బ్రవరుఁ డయ్యె వియచ్చర ♦ ప్రవరుఁ డపుడు.

టీ. అపుడు = ఆ సమయమునందు; వియచ్చరప్రవరుఁడు = గంధర్వశ్రే
చంద్రుని తేటక = అరచందమామయొక్క ప్రసన్నతను; అవఘళించు = తిర
లలాటపట్టిక = పలకవంటి నొసటియందు; తీర్చిన గంగమట్టితోడక = తిలకముగా
నదిలోని మృత్తికతోను; (స్నానముచేసి సంధ్యావార్చునపుడు నీటిలోని మట్టి ర
బెట్టుకొనుట సంప్రదాయము.) చెక్కుటద్దములందుక = అద్దములవంటి చె
జిగివెల్లువలు = ప్రవాహమువలె వ్యాపించు కాంతివిశేషములు; చిందు...తోడక
ప్రసరించునట్టి; రమణీయ = అందమైన; మణి = రత్నములు చెక్కిన;
తోడక = చెవిపోఁగులతోను; పసిఁడి...మిసిమి - పసిఁడివ్రాఁత = బంగా
నక్షరపంక్తివలె నేసిన; చెఱంగు = కొంగుయొక్క; మిసిమి = కాంతివిశేషము;
కనఁబడుచుండఁగా; చెలంగు...తోడక - చెలంగు = ప్రకాశించునట్టి; అరుణాంశ
యెఱుపురంగు గల; ఉత్తరీయంబుతోడక = జందెమువాటుగా మీఁద వేసికొ
వస్త్రముతోను; సరిలేని = ఈడులేని; రాకట్టు = రత్నములుచెక్కిన; జాళువా
బంగారుతోఁ జేయఁబడిన; మొలకట్టు = మొలత్రాడు; బెడఁగారు = అ

1. సొంపు, యొప్పు. పా.

నీర్కావి = నీళ్లలో నానఁబెట్టి యుండుటచేతఁ గొంచె మెఱ్ఱదాళు గల దోవతియొక్క; పింజె తోడన్ = వ్రేలఁజెరివిన కుచ్చెతోను; (సరిలేని = ఈడులేని; రాకట్టు = గౌరవముతోఁచునట్లు రాజకట్టుకట్టిన; జాళువా = బంగారు వికారమైన - బంగారుసరిగ నేఁతగల; మొలకట్టు = మొలను గట్టుకొన్న; బెడఁగారు = అంద మతిశయించుచున్న; నీర్కావి = నీరుకావిదోవతి యొక్క; పింజెతోడన్ = ముందఱికి వ్రేలఁజెరివిన కుచ్చెతోను, అని కొందఱు.) ధవళధవళము లగు = మిక్కిలి తెలుపులైన; జన్నిదములతోడన్ = యజ్ఞోపవీతములతోను; కాశికాముద్ర = కాశీముద్ర; ఇడిన = పెట్టిన - చెక్కిన; ఉంగరముతోడన్ = ముద్దుటుంగరముతోను; శాంత రసము; ఒలుక = చిందుచున్న; బ్రహ్మతేజంబుతోడన్ = బ్రాహ్మణతేజస్సుతోను; ప్రవ రుఁడు = ప్రవరునిరూపము ధరించినవాఁడు; అయ్యెన్.

తా. అప్పుడు నొసట గంగమట్టిబొట్టును, చెక్కిళ్లపై వ్యాపించు కాంతులు గల రత్నాల కర్ణాభరణములును, చెఱంగులం దక్షరపంక్తివలె సరిగతో నేయఁబడిన కమ్ములు గల యుత్తరీయ మును, రత్నములు చెక్కిన మొలత్రాడును; ముందరితట్టు కుచ్చెలు గల నీరుకావిదోవతియు, మిక్కిలి తెల్లగా నుండెడి యజ్ఞోపవీతములును, కాశీముద్రతోడి ముద్దుటుంగరమును ధరించి, మొగమునందు శాంతరసమును గనఁబఱచునట్టి బ్రాహ్మణతేజస్సు వెలయఁగా నా గంధర్వుఁడు ప్రవరుని రూపమును బొందెను.

క. ఇట యవ్వరూథినియు నొ, క్కొటఁ గతిపయసఖులు దన్నుఁ § గొలిచి నడువఁగాఁ
జటుల[1]ఝణంఝణరవ పద, కటకసమాకృష్టకేళి § కలహంసికయై. 72

టీ. ఇట = ఇక్కడ - అక్కడ గంధర్వుఁ డట్లుండఁగా నిక్కడ ననుట; అవ్వరూథి నియున్ = ప్రవరునిపొందునకై తపించుచున్న యా వరూథినియును; ఒక్కొటన్ = ఒక్క మొత్తముగా; కతిపయసఖులు = కొందఱు చెలికత్తెలు; తన్ను; కొలిచి = సేవించి; నడువఁగాన్ = తనవెంటరాఁగా; చటుల...హంసికయై - చటుల = చలించుచున్న; ఝణంఝణ = ఝణంఝణ యను ధ్వన్యనుకరణముతోడి; రవ = ధ్వనిగల; పదకటక = కాలియందెలచేత; సమాకృష్ట = చక్కఁగా నాకర్షింపఁబడిన; కేళికలహంసికయై = క్రీడార్థముగాఁ బెంపఁబడిన యుత్తమజాతి హంసలు గలదై - హంసలు కూయునట్లు ధ్వనించుచున్న కాళ్లయందెల ధ్వనులు విని, పెంపుడు హంసలు తన్ను వెంబడింపఁగా ననుట. ముందున కన్వయము.

సీ. ఉరగఫూత్కారధూ § మోగ్రగంధముఁ బాసి
పొలయుఁబో యీ తావి § మలయపవనుఁ
డనలాశ్రువెడబొబ్బ § నలమిన తలదిమ్ముఁ
బాయుఁబో యీ తేంట్ల § పాట మరుఁడు
ఘర్మసామీప్యసం § కలితదాహస్ఫూర్తి
[2]నీఁగుఁబో [3]యీ చల్ల § నీట మధుఁడు
గరళసోదర్యార్తి § కరసుధాకటుకత్వ
ముడుపుఁబో యీ తేనె § నోషధీశుఁ

1. ఝళంఝళ. పా. 2. నాఁగుఁబో. పా.

3. యీ నీడ నల్ల, యీ చల్లనీడ. పా. తాపాతిశయమును బోఁగొట్టుటకు 'నీడ' కంటె 'నీరే' అనుకూలమగుట నా పాఠమే యంగీకరింపఁబడినది.

తే. డనఁగఁ జంపక కురవక పనస తినిశ
నిచుల వంజుల దాడిమీ విచికిలామ్ర
పాటలీ పూగ కేసర ప్రముఖతరుల
సొబగు మీఱు నుద్యానంబుఁ జొచ్చి యచట.

టీ. మలయపవనుఁడు = మలయపర్వతమునుండి వచ్చుగాలి - దక్షిణపుఁ జల్లగాలి; ఈ
ఈ పరిమళముచేత; ఉరగ...గంధముఁ - ఉరగ = (మలయపర్వతమునందలి గందపు
జుట్టుకొన్న) పాములయొక్క; ఫూత్కార = ఫూత్తనెడి ధ్వనులతోఁగూడిన బుసలవలని
పొగచేసైన; ఉగ్ర = వేంద్రమైన; గంధముఁ = వాసనను; పాసి = విడిచి; పొలం
ప్రసరించును జుమీ! మరుఁడు = మన్మథుఁడు; ఈ తేంట్లపాటఁ = ఈ తుమ్మెదల గా
అనల...బొబ్బను - అనలాక్షు = నిప్పుకన్నుగల రుద్రునిదైన; పెడబొబ్బఁ = అధిక
సింహనాదముచేత; అలమిన తలదిమ్మఁ = క్రమ్ముకొన్న శిరోవేదనవలన; పాయుఁబో
గునుజుమీ! మధుఁడు = వసంతుఁడు; ఈ చల్లనీటఁ = ఈ చల్లని నీటిచేత; ఘర్మ...స
ఘర్మ = గ్రీష్మకాలముయొక్క; సామీప్య = దగ్గఱించుటచేత; సంకలిత = బాగుగాఁ బొ
దాహస్ఫూర్తిఁ = తాపాతిశయమును; నీఁగుఁబో = మానుకొనుఁజుమా! ఓషధీశుఁడు=చ
ఈ తేనెఁ = ఈ పుష్పఫలముల రసముచేత; గరళ...కటుకత్వము - గరళ = కాలకు
యొక్క; సౌదర్య = తోడఁబుట్టినదానితనముచేత; ఆత్త = పొందఁబడిన; కర =
యొక్క; సుధా = అమృతమునందలి; కటుకత్వము = కారమును; ఉడుపుఁబో =
కొనుఁజుమీ! అనఁగఁ = అనునట్లుగా; చంపక...తరులఁ - చంపక = సంపెఁగ;
గోరంట; పనస = పనసచెట్టు; తినిశ = తినాసము; నిచుల = ఎఱ్ఱగన్నేరు; వంజుల =
దాడిమీ= దానిమ్మ; విచికిల = సన్నమల్లె; ఆమ్ర = మామిడి; పాటలీ = కలిగొట్టు;
పోఁక; కేసర = సురపొన్న; ప్రముఖ = మొదలుగాఁగల; తరులఁ = వృక్షములచేత
మీఱు నుద్యానంబుఁ = అందము (మనోజ్ఞత) అతిశయించుచున్న యాటతోఁటను;
ప్రవేశించి; అచటఁ = అక్కడ. తర్వాతి పద్యములతో నన్వయము.

తా. ఈ తోఁటలోని గోరంట, సంపెఁగ, పనస, మామిడి, సురపొన్న మొద
వృక్షములవలని ఫలపుష్పపరిమళములచేతను, తుమ్మెదల ఝంకారములచేతను, దీర్ఘికల
చేతను, దేనెల మాధుర్యముచేతను క్రమముగా మలయమారుతమును, మన్మథుఁడును, వస
జంద్రుఁడును దమ తమ శ్రమలను బోఁగొట్టుకొనుచున్నారు. అట్లుండఁగా నితరులకొఁఅం
పోవునా? తప్పక తీఱు నను నిశ్చయముతో నా తోఁటను జొచ్చె. అలం. అప్రస్తు
ఉత్ప్రేక్షయును.

మ. పవమాన ప్లవమాన పంకజ రజః పాళీ పిశంగచ్ఛవీ
భవ దభ్యర్ణ వికీర్ణ కృత్రిమ సరిత్పాథస్తరంగాహతిం
దవపాషాణ వితర్దికాతలమునన్ నాళీక పత్త్రాక్షు లు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమల్ మీఱఁగని

టీ. పవమాన...తలమునన్ - పవమాన = గాలివలన; ప్లవమాన = తెప్పలఁ దే
నీళ్లలో నల్లలాడుచున్న; పంకజ రజః = కమలముల పరాగముయొక్క; పాళీ = సమూ

రాశిచేత; పిశంగ = పసిమియైన; ఛవీభవత్ = కాంతిగలవగుచున్న; అభ్యర్ణ = సమీపమునందు; వికీర్ణ = చెదరిన (అలలకు విశేషణము); కృత్రిమసరిత్ = కాలువలయొక్క; పాథః = నీళ్ల యందలి; తరంగ = అలలచేత; ఆహత = అంతటను గొట్టఁబడుచున్న; ఐందవపాషాణ = చంద్రకాంతపురాలచేనైన; వితర్దికాతలమునన్ = అరుఁగుమీఁద; నాళీకపత్రాక్షులు = తామరరేకులవంటి కన్నులు గలవారైన స్త్రీలు; ఉత్సవము ఒప్పన్ = వేడుక ఒప్పునట్లు; విహరించుచున్ = సంచరించుచును; సరస...ప్రౌఢిమల్ - సరస = రసవంతములైన; వాచాప్రౌఢిమల్ = మాటలయందలి నేర్పులు; మీఱఁగన్ = అతిశయింపఁగా. ముందుపద్యముతో నన్వయము.

తా. చల్లగా వీచుచున్న గాలిచే రేఁగిన తామరపుప్పొడి క్రమ్ముకొనఁగాఁబసుపువన్నెతోఁ బాఱుచున్న చేరువకాలువల నీళ్లయందు లేచిన యలలతాఁకుడు గలిగిన చంద్రకాంతమణులచే నేర్పఱుపఁబడిన యరుఁగుమీఁదఁ జేరి, యా స్త్రీలు సరసము లాడుకొనుచు విహరించుచును.

చ. బటువయి విఱ్ఱవీఁగి పరి § పాటిగఁ బూచి పరాగపుంజ మొ
క్కొటఁ గలయంగఁ బర్వఁ గొన § [1]గొమ్మను గోయిల మించ నొప్పఁ జెం
గటి యెలమావి హారరుచి § గందవొడిం గనుపట్టి నీలతా
స్ఫుటతరచూచుకం బగుచుఁ § బొల్చు వనేందిరగుబ్బచన్ననన్. 75

టీ. బటువయి = వట్రువయై; విఱ్ఱవీఁగి = మిక్కిలి నిక్కి - జొంపముగాఁ బెరిఁగి యనుట; పరిపాటిగన్ = క్రమముగా - తగుమాత్రముగా; పూచి = పుష్పించి; పరాగపుంజము = పుప్పొడి రాశి; ఒక్కొటన్ = ఒక్కసారిగా; కలయంగన్ = అంతటను - ఎల్లయెడలను; పర్వన్ = వ్యాపింపఁగా; కొనగొమ్మను = చివరనుండెడి కొమ్మమీఁద; కోయిల = కోవెల; మించన్ = అతిశయింపఁగా; చెంగటి యెలమావి = దగ్గఱనుండెడి యీ మామిడిగున్న; హారరుచిన్ = ముత్యాల పేరుల కాంతిచేతను; గందవొడిన్ = బుక్కాముపొడిచేతను; కనుపట్టి = (కంటికి మనోహరముగాఁ) గనఁబడి; నీలతా...చూచుకంబు - నీలతా = నల్లఁదనముచేత; స్ఫుటతర = మిక్కిలి స్పష్టముగాఁ దెలిపెడి; చూచుకంబు = చనుమొన గలది; అగుచున్; పొల్చు = ఒప్పుచున్న; వనేందిర గుబ్బచన్ను = వనలక్ష్మియొక్క వట్రువైన స్తనమో; అనన్ = అనునట్లుగా; ఒప్పెన్.

తా. ఈ యెదుటఁ గానవచ్చెడి గుజ్జుమామిడిగున్న చక్కఁగాఁ బూచి, పూదుమ్ము పైభాగములందంతటను గ్రమ్ముకొని, యందుమీఁదఁ గొనకొమ్మపై నల్లనికోవెల వాలియుండుటచేత, ముత్యాలహారములతోను, గందపొడి క్రమ్ముటతోను, నలుపుమీఱిన మొనతోను నొప్పుచున్న వనలక్ష్మియొక్క వట్రువైన స్తనమో యనునట్లు కానవచ్చుచున్నది. అలం. ఉత్ప్రేక్ష.

తే. వెలఁది! యిచ్చటి సంపెంగ § విరులు గహన
దేవతలయిండ్ల నెత్తిన § దీపశిఖలు;
గాక యుండినఁ బంచబం § గాళ మగుచుఁ
బాఱునే మత్తమధుకర § పటలతమము? 76

టీ. వెలఁది! = ఓ చెలియా! ఇచ్చటి సంపెంగవిరులు = ఈ తోఁటలోని సంపెంగపువ్వులు; గహనదేవతలయిండ్లన్ = వనదేవతలవైన యిండ్లయందు; ఎత్తిన దీపశిఖలు = పెట్టినట్టి దీపముల జ్వాలలు. కాకయుండినన్ = అవి దీపజ్వాలలే కాకయున్నపక్షమున; మత్త...తమము - మత్త =

1. కొమ్మున. పా.

మదించిన; మధుకర = తుమ్మెదలయొక్క; పటల = సమూహ మనెడి; తమము = చీఁకటి; పంచబంగాళమగుచున్ = చెల్లాచెదరై అగోచర మగుచు - కన్నులకుఁ గానరానిదై; పాఱునే? = పరుగెత్తిపోవునా?

తా. ఓ చెలియా! ఈ తోఁటలో నుండెడి సంపెంగపువ్వులు వనదేవతలు తమయిండ్లలో వెలిఁగించిన దీపము లేమో యన్నట్లు వెలుఁగుచున్నవి. కనుకనే వానిదగ్గఱఁ జేరక చీఁకటివలెనే నల్లగాఁ గ్రమ్ముచున్న తుమ్మెదలు తమ పోఁబడి తెలియకుండునట్లు దూరముగాఁ బాఱిపోయెను. చూడుము. దీపములకును జీఁకటికి నెట్లు విరోధమో యట్లు సంపెఁగలకును దుమ్మెదలకును విరోధ మని భావము. అలం. అనుమానము, రూపకమును.

చ. అపరిమితానురాగసుమ । నోఽలసయై చిగురాకుఁ జేతులం
దపసిని గౌఁగిలించె వని । తా! యిదె రంభ; దలంప రంభ దా
నపరిమితానురాగసుమ । నోఽలసయై చిగురాకుఁ జేతులం
దపసిని గౌఁగిలించు టుచి । తంబె కదా! యన నవ్వె రంభయున్. 77

టీ. వనితా! = ఓ చెలియా! రంభ = అరఁటిచెట్టు; అపరిమితా...అలసయై - అపరిమిత = మితిలేని; అనురాగ = అనుసరించిన యెఱ్ఱఁదనము గలిగి - ఎఱ్ఱగా నుండెడి; సుమనః = పువ్వుచేత; అలసయై = వాలి యల్లుకొను స్వభావము గలదై; చిగురాకుఁజేతులన్ = లేఁతయాకు లనెడి చేతులతో; తపసిన్ = అగిసెచెట్టును; కౌఁగిలించెన్ = ఆలింగనముచేసికొనెను - ఆవరించుకొనెను. ఇదె! = ఇదిగో చూడుము! (అని యొకతె చెప్పఁగా మఱియొకతె) తలంపన్ = విచారింపఁగా; రంభ = రంభ యనెడి యప్సరస; తాన్ = తాను; అపరిమితా...అలసయై - అపరిమిత = మితిలేని; అనురాగ = అనురక్తితోఁగూడిన; సుమనః = మంచి మనస్సుగలదగుటచేత; అలసయై = ఓపికలేనిదై - కాలవిలంబము నోర్వలేనిదై; చిగురాకుఁజేతులన్ = చిగురాకుల వంటి చేతులతో; తపసిని = తపస్సుచేసి స్వర్గసుఖ మనుభవింప వచ్చిన పురుషుని; కౌఁగిలించుట = ఆలింగనముచేసికొనుట; ఉచితంబె కదా! = యుక్తమే కదా! విశేషతపస్సుచేసి సిద్ధిపొందిన పుణ్యాత్ములు స్వర్గమునకు వచ్చి రంభాసంభోగము చేయుదురు గనుక రంభ తపస్విని గౌఁగిలించుకొనుట వింత గాదనుట. అనన్ = అనఁగా; రంభయున్ = (వారిలో నొకతెయై విహరించుచున్న) రంభ యనెడి యప్సరసయు; నవ్వెన్ = అందులకై నవ్వెను.

తా. అప్పుడొక యప్సరస మఱియొకదానితోఁ 'చెలియా! రంభ (అరటిచెట్టు) మిక్కిలి యెఱ్ఱనైన పువ్వుయొక్క బరువుచేత వాలినదై తపసిని (అగిసెచెట్టును) గౌఁగిలించెను. (చేరుకొనెను.) చూడు' మనఁగా నది మరల దానితో, 'రంభ మిక్కిలి యనురాగముతో మంచిమనసు గలదై, తపస్సుచేసి కృతార్థుఁడయి స్వర్గమునకు వచ్చిన పుణ్యపురుషునిఁ గౌఁగిలించుట యుక్తమే కదా!' యనఁగా రంభ నవ్వెను. అరఁటిచెట్టు పూచి యగిసెచెట్టుమీఁద వాలె నని చెప్పినమాటకు నర్థాంతరవివక్షచే రంభ తపస్విని గౌఁగిలించుకొనుటగాఁ గల్పించుకొని 'యది సహజమే' యనియెనని భావము. అలం. వక్రోక్తి.

ఆ. కొమ్మ! కన్నుఁగవకు । గోరగింపఁగఁ బూచి, తఱచుజొత్తు గ్రక్కు । దాసనంబు
గవియు నీ తమాల । గహనాంధకారవి, తానమునకు నుదయ । భానుఁ డయ్యె.

టీ. కొమ్మ ! = ఓ చిన్నదానా ! కన్నుఁగవకుఁ = నేత్రద్వయమునకు; గోరగింపఁగఁ = వెక్కసమగునట్లు - చక్కఁగాఁ జూడ శక్యముగాకుండునట్లు; పూచి = పుష్పించి; తలచుజొత్తు గ్రక్కుదాసనంబు - తలచుజొత్తు = అధికమైన ఎఱుపును; క్రక్కు = ప్రసరింపఁజేయునట్టి; దాసనంబు = దాసానిచెట్టు; కవియు...మునకుఁ - కవియు = క్రమ్ముకొనుచున్న; ఈ తమాల గహన = ఈ యెదుట నుండెడి చీఁకటి మ్రాఁకులతోఁ పనెడి; అంధకార వితానమునకుఁ = చీఁకటి సమూహమునకు; ఉదయభానుఁడు = ఉదయించుచున్న సూర్యుఁడు; అయ్యెఁ.

తా. సూర్యుఁ డుదయింపఁగానే చీఁకటి విరిసిపోవునట్లు ఈ దాసానిచెట్టు పూచి పువ్వుల కాంతితో వెలుఁగఁగా నా కాంతి ప్రసరించుటచేత నెదుట నున్న చీఁకటిమ్రాఁకులతోఁపు యొక్క నల్లనికాంతి విరిసిపోవుచున్నది. (దాసానిపువ్వులు ప్రొద్దుపొడుచునప్పటి సూర్యబింబము వలె నెఱ్ఱగా నుండుటయు, చీఁకటిమ్రాఁకులు చీఁకటివలెనే నల్లగా నుండుటయు సుప్రసిద్ధము.) అలం. రూపకము.

తే. శ్యామలోపరినిబిడ[1]ప । త్రాభ్రములకుఁ
గాండషండంబు దిగు వాన । కాళ్లుగాఁగఁ
బంకరుహనేత్ర ! వర్షర్తు । శంక నొసఁగు
పోఁకబోదియనవకంబు । మోకఁ గంటె ? 79

టీ. పంకరుహనేత్ర ! = కమలమువంటి కన్నులు గల యో చెలియా ! శ్యామల...అభ్రములకుఁ - శ్యామల = పసరుమించిన నలుపుగల; ఉపరి = మీఁదివైన; నిబిడ = తఱుచైన; పత్ర = ఆకులనెడి; అభ్రములకుఁ = మేఘములకు; కాండషండంబు = వానియడుగుబోదెలసమూహము; దిగు వానకాళ్లు - దిగు = నేలకు దిగునట్టి; వానకాళ్లు = ప్రారంభకాలమునందుఁ దోఁచునట్టి వర్షధారాఛాయలు; కాఁగఁ; వర్షర్తుశంకఁ = వానకాలమనెడి సందేహమును; ఒసఁగు...మోకఁ - ఒసఁగు = ఇచ్చుచున్న - కలుగఁజేయుచున్న; పోఁకబోదియ = పోఁకచెట్టు మొదటిభాగముల యొక్క; నవకంపు = మృదువైన - నునుపైన; మోకఁ = మొలకచాల్పును; కంటె? = చూచితివా?

తా. ఓ చెలియా ! ఈ తోఁటలోని పోఁకమ్రాఁకులచాలుమీఁది యాకులు నల్లఁదనముచేత మబ్బులవలెఁ గానఁబడఁగా, వానిబోదెలు వానకాళ్లవలెఁ దోఁచుచు నిది వానకాలమేమో యను సందేహమును గలుగఁజేయుచున్నవి. చూడుము. అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

ఉ. చూతమె ? డాసి పక్వతర । శుక్తిపుటాంతరదృశ్యమౌక్తిక
వ్రాతములై వెలుంగు గరు । వంపుఁగొటారుల నొప్పు తామ్రప
ర్ణీతటమట్లు జీర్ణదళ । బృందసమావృతపాండురప్రసూ
నాతిమనోజ్ఞమూలముల । నర్థి నెసంగు మధూకసాలముల్. 80

టీ. పక్వ...ములై - పక్వతర = మిక్కిలి పండఁబాఱిన; శుక్తిపుట = ముత్తెపుఁజిప్పల యొక్క; అంతర = లోపలిభాగములందు; దృశ్య = చూడఁదగిన - ఉన్న; మౌక్తిక = ముత్యములయొక్క; వ్రాతములై = సమూహములుగలవై; వెలుంగు...రులఁ = వెలుంగు=ప్రకాశించుచున్న; గరువంపు = గొప్పవైన; కొటారులఁ = రాసులుపోసియుంచు తావులచేత; ఒప్పు = ఒప్పుచున్న; తామ్రపర్ణీతటమట్లు = తామ్రపర్ణి యనెడి యేటియొడ్డువలె; జీర్ణ...మూలములఁ - జీర్ణదళ =

1. చ్ఛదాబ్ద. పా.

రాలిన పండుటాకులయొక్క; బృంద = సమూహముచేత; సమావృత = లెస్సగా నావరిం
పాండుర = తెల్లనైన; ప్రసూన = పువ్వులచేత; అతిమనోజ్ఞ = మిక్కిలి సుందరములైన;
ములన్ = మొదళ్లచేత; ఎసంగు మధూకసాలముల్ = అతిశయించిన యిప్పమ్రాఁకులను;
ప్రీతితో; డాసి = సమీపించి; చూతమె ? = మనము కనుఁగొందమా ?

తా. మొదళ్లయందు రాలిన పండుటాకులలో ముత్తెపుఁజిప్పలలోని ముత్తెములవలె
పువ్వు లొప్పఁగాఁ, దామ్రపర్ణీనదీతీరమునందలి ముత్యాలకొటారులవలెఁ గానవచ్చుచున్న
మ్రాఁకు లవిగో కానవచ్చుచున్నవి. దగ్గఱగాఁ బోయి చూతము వచ్చెదవా ? (ఇందు రా
టాకులకు ముత్తెపుఁజిప్పలతోను, ఇప్పపువ్వులరాసులకు ముత్యపురాసులతోను, ఇప్పమ్రాఁకు
ళ్లకుఁ దామ్రపర్ణీతీరముతోను బోలిక యని యెఱుంగునది. తామ్రపర్ణీనదియందు ముత్యము
ననుట ప్రసిద్ధము.) అలం. ఉపమ.

క. పంకజముఖి ! విరహులపయిఁ, గింకన్ నిజసైన్యకోటి కిని సెలవిడు
నాంకునికరతల మన నల, కంకేళిం జిగురు గాలిఁ [1]గదలుట గంటే !

టీ. పంకజముఖి ! = కమలమువంటిముఖముగల యో చెలియా ! విరహులపయిన్
జనము నెడఁబాసిన స్త్రీపురుషులమీఁద; కింకన్ = కోపముతో; నిజసైన్యకోటికిని =
సమూహమునకు; సెల...తలము - సెలవిడు = దండువెడల నుత్తరువుచేయునట్టి; మీనా
చేఁపటెక్కెము గల మన్మథునియొక్క; కరతలము = అరచేయి; అనన్ = అనునట్లుగా
అల కంకేళిన్ = ఆ యశోకవృక్షమునందు; చిగురు = చిగురాకు; గాలిన్ = గాలిచేత;
కంటే ? = నీవు చూచితివా ?

తా. ఓ చెలియా ! మన్మథుఁడు తన దండయిన తుమ్మెదలు మొదలయినవానిని
నెడఁబాసి విచారపడుచున్న స్త్రీలమీఁదికిని, ప్రియురాండ్ర నెడఁబాసిన పురుషుల
వెడలుఁడని కోపముతో నాజ్ఞాపింప వీచిన చేయియో యనున ట్లా యశోకవృక్షమున
గాలిచే నాడుచున్నది. చూడుము. అలం. ఉత్ప్రేక్ష.

చ. నునుఁజిగురాకు మేయుతఱి నోరికెలంకులఁ దేఁటి గుట్టినన్
వనతరుశాఖలం గువకు వధ్వనిఁ బాఱు పికాంగనం బికం
బనునయ మొప్ప మాన్పగతి నాత్మముఖంబు ముఖంబుఁ [2]జేర్చి చ
బన మొనరించె ; నందుసుడి మాయలుగా మగవారి కృత్యముల్ !

టీ. నునుఁజిగురాకున్ = కోమలమయిన చిగురుటాకును; మేయుతఱిన్ = తిన
నోరికెలంకులన్ = నోటిపార్శ్వములందు; తేఁటి = (ఆ చిగురాకునం దున్న) తుమ్మెద; కు
ముక్కుతోఁ బొడువఁగా; కువకువధ్వనిన్ = కువకువ యనెడి రొదతో - కువకువ యని క
ననుట; వనతరుశాఖలన్ = ఉద్యానములోని వృక్షములకొమ్మలమీఁదుగా; పాఱు పికా
పరుగెత్తుచున్న యాఁడు గోవెలను; పికంబు = మగకోయిల; అనునయము ఒప్పన్ = ఊ
ఒప్పునట్లుగా; మాన్పగతిన్ = (ఆ తుమ్మెద కుట్టినబాధను) పోఁగొట్టుదానివలె; ఆత్మము
తన మొగమును; ముఖంబుఁ జేర్చి = ఆఁడుఁగోయిల మొగముతోఁ జేర్చి; చుంబన మొనరి

1. గదలెడు. పా. 2. గూర్చి. పా.

ముద్దుపెట్టుకొనెను. మగవారికృత్యముల్ = పురుషులయొక్క పనులు; సందుసుడిమాయలుగా ! = సమయము చూచి బొంకించునట్టి యుపాయము కలవికదా !

తా. చెలియా! ఆ మామిడిచెట్టునం దొక యాఁడు గోవెల చిగురు దినఁబోయి యా చిగురునం దున్న తుమ్మెద నోటియోరఁ గుట్టఁగా నా నొప్పికిఁ దాళలేక కువకువ యని కూయుచు మ్రాఁకుల కొమ్మలమీఁదుగాఁ బాఱుచుండఁగా దానిజతయైన మగకోవెల చూచి, యా నొప్పిని మాన్పెడు దానివలె దగ్గఱఁబోయి దానిమొగముతోఁ దనమొగము చేర్చి ముద్దుపెట్టుకొనెను. దానివంచన చూచితివా! మగవారిపను లన్నియు నిట్లే సమయమునకుఁ దగినట్లు నటించు స్వభావముగలవిగా నుండును. అలం. అర్థాంతరన్యాసము.

క. అని పొగడుచు నొయ్యారపు, టనువున జెడ లల్లి [1]జిలుఁగు + లగు పయ్యెదలం
జనుకట్లు గట్టి గట్టిగ, ననిమిషకాంతలు లతాంత + హారణోత్సుకలై. 83

టీ. అనిమిషకాంతలు = దేవతాస్త్రీలు; అని = ఇట్లని; పొగడుచున్ = (ఆ తోఁటయొక్క మనోజ్ఞతను) కొనియాడుచు; లతాంతహారణోత్సుకలై = పువ్వులు కోయ వేడుకగలవారై; ఒయ్యారపుటనువునన్ = విలాసవైఖరితో; జెడలల్లి = జెడలు వేసికొని; జిలుఁగులు+అగు = సన్ననివైన; పయ్యెదలన్ = పైఁటలచేత; గట్టిగన్ = దృఢముగా; చనుకట్లు గట్టి = అవికెలమీఁదఁజేర్చి బిగఁ గట్టి. (ముందున కన్వయము.)

తా. ఆ దేవతాస్త్రీలు మీఁదఁ జెప్పినవిధముగా నుద్యానవనమును బొగడి యంతటఁ బువ్వులు గోయఁ గోరినవారై పువ్వులచెట్లకొమ్మలు మొదలయినవానికిఁ దలవెండ్రుకలు తగులుకో కుండునట్లుగా జెడలు జేసికొని, పయఁట జాఱిపోకుండునట్లుగా రొమ్ములపైఁజుట్టి బిగియఁగట్టుకొని వెడలిరి.

రగడ. నేర్పుమై నల్లయది + నెఱులఁ దోలుపూఁ దుఱిమె;
దర్పకున కర్పింపఁ + దలఁప దెంతటి పెరిమె?
యింతి ! పావురపురొద + యేల వినె? దారజేము;
వింత యేని విరహిణుల + వెతఁ బెట్టు బేరజము.
సురపొన్నక్రొన్ననలు + సొచ్చి నలుగడ వెదకు;
తఱుఁగ దందుల తావి + తండంబు క్రొవ్వెదకు.
నటిమి నను జివురునకు + నగునె కంటక మాడఁ?
జుఱుకు మనె వేఱొక్క + చోటఁ గంటక మాఁడఁ.
గుందములు నీ కొసఁగఁ + గూర్చితిని గైశికము;
నిందులకు వెల యడుగ + నేల? విడు వైశికము.
చిఱుఁదేంట్ల కొసఁగె గు + జ్జెనఁగూళ్లు గొజ్జంగ;
నెఱుఁగ కది పూ వంద + నేల యిటు రజ్జంగ?
నెదిరింపఁ బోలు నీ + వింతి! రతిపతిఁ దెగడఁ;
బొదలఁ జిగురులు తుదలఁ + బూచి యున్నది పొగడ.

1. జిల్గు. పా.

పుడుకు మల్లన గంద × వొడికి నీ ప్రేంకణము;
దడయు కిటు; నీ కిత్తుఁ × దగ రత్నకంకణము.
నెరసి పోఁ జూచెదవు × నిలునిలువుమా! కనము;
గురియుతేనెల జీబు × కొన్న దంతట వనము.
కా దల్లయది ఫుల్ల × కంకేళి; పన్నిదము;
మోదు; గోడిన నీదు × ముత్యాలజన్నిదము.
ఏటవా లైనయది × యీ యరఁటిబాలెంత;
చేటునకె యగు చూలు × చేఁ గలుగుమే లెంత ?
నెలఁత! యీ గేదంగి × నీ కబ్బె బుక్కాము;
చిలుకు నీ పుప్పొళ్లు × చెంచెతలబుక్కాము.
మితి లేని తేనె నా × మెత చేసె విరవాది;
యితరలతికల మరిగి × యేఁగు నది పరవాది.
కలిగొట్లు ప్రాఁకువే × డ్కలె నీకుఁ దఱ చెదను;
నలినాక్షి కడిమిగం × డమున కే వెఱచెదను.
గురివెంద నడె గిలుబు × కొనియెఁ బయ్యెరదొంగ;
విరులఁ గరికుంభకుచ! × వెరఁజు మై యర గ్రుంగ.
మెరమెరని కొలనిదరి × మీ లంచు లకుముకులు
మరిగె నీకన్నుదోయి; × మాయింపు చకచకలు.
ఏకాంత మని తొలఁగె × దిందు నీ వఁటె వేఱు ?
చేకొనవె మున్నాడి × చెలువ! యీ వటివేరు.
అరిది యీ యేడాకు × లరఁటె నగు కప్పురము;
సరిరాదు దాని కల × శశియొడలు కప్పురము.
పాళి కల్లది పోఁకఁ × బ్రాఁక బందము దెగియె;
నాళి యది దిగజాఱు × నట్టిచందము నగియె.
మలయపవనునిఁ బిలిచె × మావి బళి! యీవేళ
మలయుకోవెలపంచ × మస్వరం బనుసీల.
సులభమై దొరకె మం × జులవాణి! చంపకము;
చిలుక వన్నెపుఁబొదలు × చేరి యిఁక వంపకుము.
చనకుఁ డిఁక దవ్వులకు × సఖులార! పువ్వులకు-
ననుచు నలరులు గోసి × రతివ లల్లన డాసి.

టీ. (ఈ రగడయందు దేవతాస్త్రీలు పువ్వులు గోయునప్పు డొకరితో నొకరు మ
కొను రీతి చెప్పఁబడెను; కనుక నెక్కడిమాట కక్కడనే యన్వయము.) అల్లయది = అ
నేర్పుమైఁ = నేర్పుతో - ప్రౌఢత్వముతో; తొలుపూఁ = మొట్టమొదటఁ గోసిన

నెఱులన్ = తలవెంట్రుకలలో; తుఱిమెన్ = పెట్టుకొనెను. దర్పకునకున్ = మన్మథునికి; అర్పింపన్ = సమర్పణచేయను; తలఁపదు = ఎంచదు. ఎంతటిపెరిమె? = దానికిఁ బువ్వులం దెంత యధికమైన ప్రేమయే? (ఎంతటిపెరిమె = దానికి నెంతటి గౌరవమే - అది పెద్దతికముచే మన్మథుని లక్ష్యముచేయదయ్యెను. అని యిట్లు కొందఱ అర్థము సెప్పెదరు.) ఇంతి! = ఓ చెలీ! పావురపురొద = పావురాయియొక్క కూఁతను; ఏల వినెదు? = ఏలవినుచున్నావే? (ఇది యొక దాని ప్రశ్నము.) ఆరజేము = అది యింపుగా నున్నది. (ఇది యందులకు నుత్తరము.) వింతయే? = అది యింత వింతయైనదా? - ఎన్నఁడును విని యెఱుఁగనిదా? విరహిణులన్ = విరహముగల స్త్రీలను; వెతఁబెట్టుబేదజము = బాధపెట్టునట్టి కుత్సితపునడకగలది. (ఇది తొలుతటిదానిమాట.) సురపొన్న క్రొన్ననలు = క్రొత్తగాఁ బూచిన సురపొన్న పువ్వులను; చొచ్చి = ఆ చెట్లలోఁ బ్రవేశించి; నలుగడన్ = నాలుగువైపులను; వెదకు = నీవు వెదకుము. అందుల తావితండంబు = ఆ పువ్వులవలని పరిమళముయొక్క సమృద్ధి; క్రొవ్వెదకున్ = క్రొత్తదైన కొప్పునకు; తఱుఁగదు= ఎప్పుడును దగ్గదు. అతిమి = ఆక్రమించి; ననున్ = నన్ను; చివురునకున్ = చిగురాకునకై; కంట కము = కఠినపుమాట; ఆడన్ = చెప్పుట - నిందించుట; అగునె? = తగునా? వేటొక్క చోటన్=మత్తియొక తావునందు-పాదమందు; కంటకము = ముల్లు; ఆడన్-నాటుకొనఁగా; చుఱుకు మనెన్ = చుఱుకు మని నొచ్చెను. కుందములు = మొల్లపువ్వులను; నీకున్=నీకొఱకు; ఒసంగన్= నే నియ్యఁజాలను. కైశికమున్ = కొప్పునందు; కూర్చితిన్ = చేర్చితిని - పెట్టుకొన్నాను. ఇందులకున్ = ఈ పువ్వులకుఁగాను; వెల = క్రయము; అడుగన్ = అడుగుట; ఏల? వైశికము= వేశ్యాత్వమును - వంచనను; విడు = నీవు విడువుము. గొజ్జంగ=గొజ్జఁగపొదను; చిఱుఁదేంట్లకున్= పిల్లతుమ్మెదలకు; గుజ్జెనఁగూళ్లు = ఆడుకొనునప్పుడు పిల్లలు గురుగులలో వండుకొనెడు వంటక ముగా; ఒసఁగెన్ = (ఇది) ఇచ్చెను. (పా. చిఱుఁదేంట్లకొదవె గుజ్జనఁగూళ్లు = పిల్లతుమ్మెదలకు గుజ్జెనఁగూళ్లు కలిగెను.) అది = ఆ చిన్నది; ఎఱుఁగక = గుజ్జెనఁగూళ్లుగా నిచ్చుట యెఱుఁగక; పూవు = పువ్వును; అందన్ = తీసికొనఁగానే; ఇటు = ఈ విధముగా; రజ్జంగన్ = నిష్ఠురము లాడుట; ఏల? ఇంతి! = ఓ చెలియా! నీవు; రతిపతిన్ = మన్మథుని; తెగడన్ = నిందింపఁగా; ఎదిరింపఁబోలున్ = ఆ మన్మథుఁడు ని న్నెదిరించి యుండవలెను. (కనుకనే) పొగడ = పొగడ చెట్టు; తుదలన్ = కొనగొమ్మలయందు; చిగురులు = చిగుళ్లు; పొదలన్ = వృద్ధినొందఁగా; పూచియున్నది = పుష్పించియున్నది. (ఇది నీకు విరహకారి యగు నని భావము.) ఈ ప్రేంక ణమున్ = ఈ ప్రియాళువృక్షమును; గందవొడికిన్ = పరిమళముతోడి పుప్పొడికై; అల్లనన్ = మెల్లఁగా; పుడుకుము = మునివ్రేళ్లతో నొక్కినొక్కి పట్టుము. ఇటు= ఈ విధముగా; తడయకు= ఆలస్యము చేయకుము. తగన్ = (ఆలస్యముచేయక పుప్పొడి పుడికి రాల్చినందులకు) తగునట్లుగా; నీకు; రత్నకంకణము=మణులుచెక్కిన యీ ముంజేతికడియము; ఇత్తున్= ఇచ్చెదను. నెరసిపోన్= వ్యాపించిపోను - పూఁబొదలసందులలోఁ దూఱిపోవుటకు; చూచెదవు = యత్నించుచున్నావు. నిలునిలువుమా! = అట్లు పోవలదు - నిలువుము. (ఇక్కడ - నిలువుము. ఆదరమువలన ద్విరుక్తి.) కనము = మేము పిమ్మట నిన్నుఁజూడఁజాలము. (ఏల యనిన) కురియు తేనెలన్ = వానకురిసి నట్లు కాఱుచున్న తేనెలచేత; వనము = ఈ యుద్యానవనము; అంతటన్; జీబుకొన్నది =సందు లేక క్రిక్కిరిసికొని యున్నది. అల్లయది = ఆ దూరమునం దెదుటఁ గనఁబడుచుండునది; పుల్ల కంకేళి=పూచిన రక్తాశోకవృక్షము. (అని యొకతె పలికెను.) కాదు= అది కంకేళికాదు. మోదుగు మ్రాను. పన్నదము=పందెము; వేసెదను. ఓడినన్ = నీవు ఓడిపోయినపక్షమున; (అనఁగా అది

రక్తాశోకముకాక, మోదుగేయైనయెడల); నీదు ముత్యాలజన్నిదము = యజ్ఞోపవీతమువ
నట్టి నీముప్పేటముత్యాలసరము (దానిని నేఁదీసికొందునని రెండవది యనెను).-ఈయరఁటి
గెలవేసిన యీ యరఁటిచెట్టు; ఏటవాలైనయది=ఒకతట్టునకు నొఱఁగినది. చేటునకె=చే
గెలముదురఁగానే నఱకఁబడుటకే యనుట; అగుచూలుచేన్ = అయిన యీ గర్భముచే
మేలు=కలుగునట్టి మేలు; ఎంత?=ఏమాత్రము? ఈ గర్భము దానిని జెఱుప వచ్చినదే కాని
వచ్చినది కాదనుట. నెలఁత! = ఓచెలి! ఈ గేదంగిన్ = ఈ పచ్చ మొగలియందు; బు
గందవొడి; నీకబ్బెన్ = నీకు లభించెను. చిలుకు నీ పుప్పొళ్లు = ఈ రాలుచున్న పుప్పొ
చెంచెతలబుక్కాము=చెంచుజాతిస్త్రీలు వస్త్రములను వాసనకట్టెడి గందవొడి. విరవాది
తీగ; మితిలేని తేనెన్ = మేరలేని పూఁదేనెను; ఆమెతచేసెన్ = (తుమ్మెదకు) విందుచేసె
ఆ తుమ్మెద; పరవాది = ఆత్రగొట్టు; (కనుక) మరిగి = ఆసపడి - అంతటితోఁ దృ
యింకను గావలెనని యనుట; ఇతరలతికలకున్ = ఇతరములైన పూఁదీగెలను గూర్చియు;
పోవుచున్నది. నలినాక్షి! = ఓ చెలీ ! నీకున్; ఎదను = మనసునందు; కలిగొట్లు = పా
ప్రాఁకువేడ్కలె = ఱొమ్ముతో జరగుచు నెక్కుటయందలి కుతూహలములే; తఱచు=
ఏన్=నేను; కడిమిగండమునకున్=దానివలనఁ గలిగెడి దొడ్డయపాయమునకు; వెఱచెదను=
దను. కరికుంభకుచ! = ఏనుఁగుకుంభస్థలములవంటి స్తనములు కలదానా! - ఓ చెలియా!
అదిగో! పయ్యెరదొంగ = మలయమారుత మనెడి దొంగ; గురివెందన్ = బండిగురిగింజ
గిలుబుకొనియెన్ = కొల్లగొనియెను - దానిలోని పువ్వు లన్నియు నపహరించె నను
దేహము; అరగ్రుంగన్ = సగము తగ్గునట్టుగా - శరీరమును వంచి యనుట; విరులన్ =
గురిగింజ పువ్వులను; వెరఁజు = జవురుకొనుము. లకుముకులు = మీలవల్లంకు లనెడి పక్షు
మెర అని = మెఱయుచుండెడి; కొలనిదరిమీలు = సరస్సుగట్టున నుండెడి చేఁపలు; అ
అని భ్రమయుచు; నీ కనుదోయిన్ = నీ రెండు కన్నులను; మరిగెన్ = ఆశించెను; చ
చకచకలాడెడి కన్నుల కాంతులను; మాయింపు = అణచివేయుము. ఏకాంతము = రహ
మేము మాటలాడుకొనునది యేమో రహస్యము; అని; తొలఁగెదు = ఎడముగాఁ దొల
దవు. ఇందున్ = ఈ మాయందు; వేఱు = అన్యురాలవు; నీవఁటె? = నీవా? నీవును మా
దానవే కదా యనుట. ఓచెలి! చెలువ! = ఈ వటివేరు=ఇదె యీవట్టివేరు; మున్నాడి=
చేకొనవె = తీసికొనుము; ఈ యేడాకులరఁటిన్ = ఈ కానవచ్చెడి యేడాకుల య
నందు; అగు కప్పురము= కలుగునట్టి కర్పూరము; అరిది = దుర్లభము - సాధారణముగా
కాదు. దానికిన్ = ఆ కర్పూరమునకు; అల శశియొడలు = ప్రసిద్ధమయిన చంద్రునిశరీర
చంద్రబింబము; సరిరాదు = సమానము కాదు. (ఏల యనిన) ఉరము = ఆ చంద్రు
ఱొమ్ము; కప్పు; నలుపు గలది - ఆ కర్పూరము స్వచ్ఛమయిన తెలుపు వన్నె కలది; కన
ముతోఁగూడిన చంద్రబింబము దానితో సరిపోల దనుట. అల్లది = ఆ చిన్నది; పా
పూవుగెలకుఁగాను; పోఁకన్ = పోఁకమ్రానిని; ప్రాఁకన్ = ఱొమ్ము నానించి యెక్కుచు
బందము=చెట్టెక్కునప్పుడు తొలఁగిపోకుండునట్లు కాళ్లకుఁ దగిలించుకొనెడు త్రాడు; తె
తెగిపోయెను; ఆళి = దాని చెలికత్తె; అది = ఆ ప్రోఁకమానిని బ్రాఁకుచున్న పడుచు;
నట్టి చందము = ఆ మ్రాని వెంటఁగ్రిందికి జాఱునట్టి విధమును; నగియెన్ = (చూచి)
మావి = మామిడిచెట్టు; ఈ వేళన్ = ఈ సమయమునందు; మలయు...స్వరంబు - వ
తలయందుఁ దిరుగుచున్న; కోవెల = కోయిలయొక్క; పంచమస్వరంబు = వీణతం

బుట్టిన పంచమ మనెడి స్వరమువంటి కంఠస్వరము; అను + ఈలన్ = అనునట్టి యీలచేత; మలయ పవనునిన్ = చల్లగా వీచునట్టి దక్షిణపు గాలిని; పిలిచెను; బళి! = బళా! - మెచ్చవచ్చు ననుట; (గాలి లేనప్పుడు ఈలవేసిన పక్షమున గాలి వీచు నని లోకులు వాడుదురు. ఈల అనఁగా చిమట కూఁతవంటి కూఁత.) మంజులవాణి! = మనోహరమైన మాటలుగల యో చెలీ! చంపకము = సంపెంగ; సులభమై = శ్రమములేకయే; దొరకెన్ = లభించెను; అన్నెపుఁబొదలు = ఇతరములైన పూఁబొదలు; చిలుకవు = పువ్వుల నియ్యవు; ఇఁకన్ = ఇఁకమీఁద; చేరి = ఆ పొదలను సమీపించి; వంపకుము - వానికొమ్మలను వంపఁబోకుము. (పా. చిలువానెఁబూఁబొదలు చేరి యిఁక వంపకుము= ఆ పూఁబొదలను బాము చేరెను. వానిఁ జేరి యిఁక వంపకుము.) సఖులార! = ఓ చెలులారా! పువ్వులకున్; ఇఁకన్ = ఇఁకమీఁద; దవ్వులకున్ = దూర ప్రదేశములకు; చనకుఁడు = మీరు పోకుఁడు - దూరప్రదేశములకుఁ బోయినయెడలఁ బ్రొద్దెక్కి యెండచే శ్రమపడవలసి వచ్చు ననుట. అనుచున్ = అని పలుకుచు; అతివలు = ఆ స్త్రీలు; డాసి = ఒకరితో నొకరు చేరుకొని; అల్లనన్ = మెల్లఁగా - క్రమముగా; అలరులు = పువ్వులను; కోసిరి = చిదిమిరి. అలం. 'మెరమెరని...కను దోయి'- ఈ వాక్యమునందు భ్రాంతిమంతము, కావ్యలింగమును; 'అరిది...శశియొడలు కప్పురము'- ఇందు ప్రతీపము; 'చిలుప వన్నెపు...వంపకుము' - ఇచ్చోట కావ్యలింగము.

క. నాళీకమధూన్మత్త మ, రాళీ ముఖరాళి సుఖకరం బగు కొలనం
గేళీలాలసగతి డిగి, యాళీనివహంబు లోలలాడెడు వేళన్. 85

టీ. నాళీక...కరంబు - నాళీక = తామరలవలని; మధు = తూఁడ్లరసముచేతను - మకరందముచేతను; ఉన్మత్త = ఉన్మాదము నొందిన - మత్తుగొన్న; మరాళీ = ఆఁడుహంసలవలనను; ముఖర = జుమ్మని రొదచేయుచున్న; అళి = తుమ్మెదలవలనను; సుఖకరంబగు = సుఖమును గలుగఁజేయునట్టి; కొలనన్ = సరస్సునందు; కేళీలాలసగతిన్ = క్రీడవలని యత్యంతాసక్తి గల రీతితో; డిగి = దిగి; ఆళీనివహంబులు = వరూథిని చెలికత్తెల గుంపులు; ఓలలాడెడివేళన్ = ఓల యోల యని యీఁదులాడునపుడు - జలక్రీడ చేయునప్పుడు అనుట. తర్వాతి కన్వయము.

తా. తామరతూండ్లు దినియుఁ, దామరపూఁదేనెలు ద్రాగియు మత్తుగొన్న హంసలును, దుమ్మెదలును గలిగి సౌఖ్యమును గలిగించునదియై యొప్పుచున్న యొక తామర కొలనిలో దిగి, వరూథిని చెలికత్తె లందఱును జలక్రీడ చేయుచుండఁగా.

ఉ. వాడిన మోముఁదమ్మి తెలి వాలికకన్నులు విన్నఁబోవఁ దో
నాడక నెన్నొసల్ కరము నం దిడి తీరనిషణ్ణయై జలం
బాడఁగఁ బిల్చువారి నొక హస్త(పు)మ్రొక్కున నాఁడుఁ డంచుఁ దాఁ
జూడక చూచుచూడ్కి నలజో దిశల్ పరికింప నొక్కచోన్. 86

టీ. అలజోటి = ఆ యతివ - వరూథిని, వాడినమోముఁదమ్మి - విరహవేదనచేత బడలిన కమలమువంటి ముఖమును; తెలి...కన్నులు = తెలుపైన నిడుపైన కన్నులును; విన్నఁబోవన్ = వివర్ణములు కాఁగా; తోన్ = ఆ చెలికత్తెలతో; ఆడక = జలక్రీడలాడక; నెన్నొసల్ = విశాలమైన నొసటిని; కరమునందున్ = అరచేతిలో; ఇడి = పెట్టుకొని - అఱచేతితో నొసలు గప్పుకొని యనుట; తీరనిషణ్ణయై = గట్టుపయిఁ గూర్చున్నదై; జలంబాడఁగన్ = జలక్రీడ చేయు

టకై; పిల్చువారిన్ = పిలుచునట్టివారిని; ఒక హస్తపుమ్రొక్కునన్ = ఒంటిచేతి నమ
ముతో; ఆడుఁడు = మీరు క్రీడింపుఁడు; అంచున్ = అని చెప్పుచు; తాన్ =
చూడక చూచుచూడ్కిన్ = చూడ నిష్టములేక చూచునట్టి చూపుతో (పా.
మాడ్కిన్ = చూచురీతిగా); దిశల్ = నాలుగు దిక్కులను; పరికింపన్ = చూచుచు
ఒక్కచోన్ = ఒక ప్రదేశమునందు. తరువాతి పద్యముతో నన్వయము.

తా. ఆ వరూథిని విరహవేదనచే మొగము చిన్నపుచ్చుకొని చెలులతోఁ గూడి
గ్రీడింప మన సొప్పక; యా కొలనిగట్టుపయిఁ గూర్చుండి యొక చేయి నొసటి కడ్డముగాఁ
మఱియొక చేతితోఁ దన్ను జలక్రీడకుఁ బిలుచుచున్న చెలులకు మ్రొక్కి 'మీరు క్రీడి
చాలు'నని సైఁగచేయుచు వారిని జూడ నిచ్చలేక నలుదిక్కులు చూచుచుండఁగా నొక్క

మాలిని. రవిరుచిఁ ద్రసరేణు వ్రాతముల్ మించువాత్యా
నివహనిహతిలో నిం దిందిరశ్రేణు లాడం
గువలయఘనకుల్యా కూలవల్లీవనీసం
భవము లగుచు మింటం బర్వు పుప్పొళ్ళలోనన్.

టీ. రవిరుచిన్ = సూర్యప్రకాశమునందు - ఎండయందు; త్రసరేణువ్రాతముల్
నలుసులయొక్క సమూహములు; మించు వాత్యానివహ నిహతిలోన్ = అతిశయించుచున్న
సమూహముయొక్క కొట్టుటయందు - వీచుటయందు; ఇందిందిరశ్రేణులు = తుమ్మెద
ఆడన్ = సంచరింపఁగా; కువలయ...సంభవములు - కువలయ = కలువలచేత; ఘన =
మిక్కిలిగాఁ గలువలు గల యనుట; కుల్యా = కాలువలయొక్క; కూల = దరులయందు
తీఁగలయొక్క; వనీ = సమూహమునందు; సంభవములు = పుట్టినవి; అగుచున్; మింటన్
మునందు; పర్వు = వ్యాపించునట్టి; పుప్పొళ్లలోనన్ = పూవుదుమ్ములయందు.

తా. ఎండలోఁ దోఁచునట్టి చిన్న చిన్న రేణువులతోడి సుడిగాలి కొట్టఁగాఁ దు
సుడిగాలిలోఁ దగులుకొని యాడుచుండఁ, గలువలతో నిండుకొన్న కాలువదరులందు
తఁలుచుగా నల్లుకొనియున్న వనప్రదేశమునందుఁ బూచినపువ్వులలోనుండి పుప్పొళ్లు రేఁగి
మున వ్యాపింపఁగా, నట్టి పుప్పొళ్లలోపల.

సీ. పసిఁడితోరముతోడిబాహు వల్లన యెత్తి, సారెకుఁ బొదలపైఁ జాఁచి
బింబాధరంబు గంపింప నొయ్యన విపం, చీస్వరంబున జట సెప్పి
దిశల మార్గాన్వేషి దీర్ఘలోచనదీప్తి, గణముచేఁ దోరణ గట్టి క
కమనీయతనుకాంతి కనకద్రవంబున, నారామరంగంబు నలికి య

తే. యానితంబవిలంబికా లాహికల్ప, ఘనకచగ్రంథి నచటి భృం గమ
దీధితులు వడ్డికొనఁగుచు దేవపూజ, విరులు చిదిమెడి కపటభూసురునిఁ

టీ. పసిఁడి...బాహువు - పసిఁడి తోరముతోడి = బంగారు వ్రతకంకణముతో
బాహువు = భుజమును; అల్లన = మెల్లఁగా; ఎత్తి = పైకెత్తి; సారెకున్ = మాటిమాటి
లపైన్ = పూఁబొదలమీఁద; చాఁచిచాఁచి = చాఁగించి చాఁగించి; బింబాధరంబు
పండువలె మృదువై యెఱ్ఱగానుండెడి క్రిందిపెదవి; కంపింపన్ = అదరఁగా; ఒ
తిన్నఁగా; విపంచీస్వరంబునన్ = వీణాధ్వనివంటిధ్వనిగల కంఠస్వరముతో; జట

వెనుక పదములను రెట్టించి రెట్టించి చెప్పెడి వేదక్రమముతో; చెప్పి చెప్పి = వేదము పఠించి పఠించి; దిశలన్ = దిక్కులందు; మార్గాన్వేషి...గణముచేన్ - మార్గాన్వేషి = త్రోవను వెదకుచుండెడి; దీర్ఘలోచన = సోగలైన కన్నులయొక్క; దీప్తిగణముచేన్ = కాంతిసమూహముచేత; తోరణ గట్టి కట్టి = తోరణము గట్టి కట్టి - పలుమాఱు దిక్కులయందుఁ జూపులు పఱపి యనుట; కమనీయ...ద్రవంబునన్ - కమనీయ = మనోహరమైన; తను = దేహముయొక్క; కాంతి = ప్రకాశమనెడు; కనకద్రవంబునన్ = బంగారునీటిచేత; ఆరామరంగంబున్ = ఉద్యానవనప్రదేశమనెడి నాట్యస్థానమును; అలికి యలికి = బంగారు నీటివలె వెలుఁగుచున్న తన దేహకాంతి నా తోఁటయందంతటను వ్యాపింపఁజేసి యనుట; ఆనితంబ...గ్రంథిన్ - ఆనితంబ = పిఱుఁదుల వఱకును; విలంబి = వ్రేలుచున్న; కాలాహికల్ప = నల్లత్రాఁచును బోలిన; ఘన=పెద్దదైన; కచగ్రంథిన్ = సిగముడిచేత; అచటి భృంగములకున్ = అక్కడనుండెడి తుమ్మెదలకు; అసితదీధితులు = నల్లనికాంతులను; వడ్డికొసఁగుచున్= వృద్ధికై యిచ్చుచు - తుమ్మెదల నలుపును సిగముడి నలుపుచే నతిశయింపఁజేయుచు ననుట; దేవపూజవిరులు = దేవతార్చనకుఁ దగిన పువ్వులను; చిదిమెడి కపటభూసురునిన్ = కోయుచున్న మోసపుబ్రాహ్మణుని - ప్రవరుని వేషము వేసికొన్న గంధర్వుని; కనియెన్ = చూచెను.

తా. పూవులకై బంగారుతోరముతోడిచేయి పొదలమీఁదికిఁ జాఁచుచు, మనోహరమైన స్వరముతో వేదము చదువుచుఁ, దనయూరిదారి యేది యని వెదకువానివలెఁ జూపులచే నభినయించుచు, బంగారునీరుపూసినట్టు తనశరీరకాంతు లా పూఁదోఁటయం దెల్లయెడల నిండుకొనుచుండఁగా నిడుపైనజుట్టుముడి పిఱుఁదులు సోఁకునట్లుగాఁ గీలుగంటువేసికొని దేవతార్చనకై పువ్వులు కోయువానివలె నున్న ప్రవరునిరూపము దాల్చిన గంధర్వునిఁ జూచెను. అలం. ఉపమ, నిదర్శనయును.

ఉ. కాంచి కలక్వణత్కనక కాంచికయై యెదురేఁగి యప్పు డ
క్కాంచనకేతకీకుసుమ గాత్రి వయస్యల డించి తన్నికుం
జాంచలవీథిఁ దాఁటుచు ఘ నాంతచలచ్చపలాకృతిం గలం
గాంచినవస్తువుం దెలిసి కాంచినయట్లనురక్తిఁ గాంచుచున్. 89

టీ. కాంచి = అట్లు కపటబ్రాహ్మణునిఁ జూచి; అక్కాంచనకేతకీకుసుమగాత్రి = బంగారువన్నెగల గేదఁగిపూవువలె మనోహరమైన శరీరముగల యా వరూథిని; అప్పుడు = ఆ సమయమునందు; వయస్యలన్ = చెలికత్తెలను; డించి = విడిచిపెట్టి - వెంట రమ్మని పిలువక; కల...కాంచికయై = కల = అవ్యక్తమధురముగా - చెవులకింపుగా ననుట; క్వణత్ = ధ్వనిచేయుచున్న; కనకకాంచికయై = బంగారుగంటల మొలనూలు గలదై; ఎదురేఁగి = ఆ బ్రాహ్మణుని కెదురుగాఁ బోయి; ఘనాంత...ఆకృతిన్ - ఘన = మేఘములయొక్క; అంత = సమీపమునందు; చలత్ = చలించుచున్న; చపలాకృతిన్ = మెఱుపువలె; తన్ని...వీథిన్ - తన్నికుంజ = అతఁడు పూవులు గోయుచున్న యా పొదరిండ్లయొక్క; అంచలవీథిన్ = చివరచాలునందు; తాఁటుచున్ = నక్కుచు నొదిఁగి యొదిఁగి పోవుచు; కలన్ = స్వప్నమునందు; కాంచినవస్తువున్ = చూచిన పదార్థమును; తెలిసి = (నిద్రనుండి) మేలుకొని; కాంచినయట్లు = చూచిన విధమున; అనురక్తిన్ = అనురాగముతో - ప్రీతితో; కాంచుచున్ = ఆ కపటబ్రాహ్మణునిఁ జూచుచును; (లేక - అనురక్తి గాంచుచున్ = అనురాగమును బొందుచును.) ముందున కన్వయము.

తా. వరూథిని ప్రవరునిరూపము దాల్చి యట్లు కానఁబడిన గంధర్వునిఁ జూచి ప్ర
యని నిశ్చయించి కలలోఁ జూచినవస్తువు మేలుకొన్న తరువాత గానవచ్చినయెడల నా
దెంతప్రీతి కలుగునో యంత ప్రీతిగలదై, జలక్రీడ లాడుచున్న చెలికత్తెలకుఁ జెప్పక యొం
కొలనిదరినుండి లేచి తన్నుఁ జూచినయెడల మరల నెక్కడి కేని పోవు నను శంక చే నత
పూఁబొదల వరుసవెంబడినే యొదిఁగి యొదిఁగి నడచి మేఘమువెంబడి మెఱపువలెనే
అలం. ఉపమ, ఉత్ప్రేక్ష, నిదర్శనయును.

ఉ. ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్షబా
ష్పాకులకోణశోణరుచు లగ్రమునం జనఁ జూచుచూపు తీ
రై కనుపట్టెఁ దమ్మరస మంటుకొనన్ వెడవింటివాఁడు క్రో
ధైకధురీణతం గఱచి యేసిన సింగిణికోలయో యనన్.

టీ. ఆ కమలాక్షి = కమలములవంటి కన్నులుకలదైన యా వరూథిని; ఇంపునన్ =
ముతో; దృగంచలము = కడకన్ను; ఇంచుక = కొంచెము; మూసి = మూసికొన్న
చూపుతో ననుట; హర్ష ... రుచులు - హర్ష = సంతోషమువలనఁ గలిగిన; బాష్ప =
చేత; ఆకుల = తొట్రుపడునట్టి; కోణ = కన్నుగొనలయొక్క; శోణరుచులు = ఎఱ్ఱని
(పా. శోణకోణరుచులు = ఎఱ్ఱని కనుఁగొనల కాంతులు.) అగ్రమునన్ = తనకుముందు;
పోవునట్టుగా - ప్రసరించునట్టుగా; చూచు చూపు = కనుఁగొనునట్టిదృష్టి; తీరై =
వెడవింటివాఁడు = మన్మథుఁడు; క్రోధైకధురీణతన్ = కోపభారమునే ముఖ్యముగా వహిం
చేత - అధికకోపమును వహించి యనుట; తమ్మరసము = నమలిన వక్కలాకులయొక్క
అంటుకొనన్ = అంటునట్టుగా; కఱచి = ఔడుగఱచి; ఏసిన సింగిణికోలయో = ప్రయో
శృంగధనుస్సునుండి వెడలిన బాణమో; అనన్ = అనునట్లు; కనుపట్టెన్ = కనఁబడెను.

తా. అప్పుడు వరూథిని తన ప్రియుఁడు చిక్కెనను సంతోషముచేతఁ గన్నులందు
బాష్పము లొలుకఁగా నెఱ్ఱనైన కడకన్నులకు ఱెప్పలు కొంచెము వంచి యడ్డముచేసి,
రక్తిమ నిగుడఁగాఁ జూచుచుండెను. ఆ రక్తిమతోఁ గూడిన యా చూపు మన్మథుఁడు
శయముచేతఁ దమ్మరస మంటునట్లుగాఁ గసిదీఱఁ గఱచి, శృంగధనుస్సునఁ గూర్చి ప్రయో
బాణమో యనున ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచినప్పుడ, పల్లవాధరగుండెజల్లు
నట రెండుమూఁడంజలరుగునప్పుడ కాళ్లఁ, బంకజాక్షికిఁ దొట్రుపాట
డాయంగఁజనునప్పుడ ముఖాంబుజంబునఁ,గంబుకంధరకు దైన్యంబు
గదిసి నిల్చినయప్డ కనుదోయిఱెప్పల, లలనకు మిగులఁ జంచలత
తే. గటకటా! యనునపుడ గద్గదిక వొడమెఁ;
జెఱఁగు వట్టినయపుడ లేఁ జెమట గ్రమ్మె;
సొలసి మాటాడ నుంకింపఁ దలఁచి మోముఁ
[1]దేఱిచూచిన యపుడ కన్నీరు వొడమె.

1. తేఱకొనఁజూచినపుడ. పా

టీ. తొలుదొల్తన్ = మొట్టమొదట; వానిన్ = ప్రవరరూపముధరించిన యా గంధర్వుని; కన్నులన్ = కన్నులతో; కాంచినప్పుడ = చూచినప్పుడే; పల్లవాధరగుండె - పల్లవ = చిగురు వంటి; అధర = క్రిందిపెదవి గల వరూథినిదైన; గుండె = హృదయము; జల్లుమనియెన్ = జల్లుమను ననుకరణముతోఁ జలించెను. అట = అటుపిమ్మట; రెండుమూఁడంజలు = ఆ మాయాప్రవరునితట్టు రెండుమూఁడడుగులదూరము; అరుగునప్పుడ = నడచిపోవునప్పుడే; పంకజాక్షికిన్ = వరూథినికి; కాళ్లన్ = అడుగులయందు; తొట్రుపాటు = తడఁబాటు; కదిరెన్ = కలిగెను; డాయంగన్ = దగ్గఱ; చనునప్పుడ = పోవునప్పుడే; కంబుకంధరకున్ = శంఖమువంటి మెడగల యా వరూథినికి; ముఖాంబుజంబునన్ = కమలమువంటి ముఖమునందు; దైన్యంబు = దీనత్వము - మనసులోని విచారముచేనైన వెలవెలపాటు; తోఁచెన్ = కనఁబడెను. కదిసె = దగ్గఱఁజేరి; నిల్చినయప్డ = నిలిచిన సమయమునందే; లలనకున్ = వరూథినికి; కనుదోయి ఱెప్పలన్ = రెండు కన్నుల ఱెప్పలయందు; మిగులన్ = మిక్కిలి; చంచలత = చంచలభావము; పెరసెన్ = కలిగెను. కటకటా! = అయ్యయో! - అయ్యో! నన్ను మోసము చేసితివిగదా యనుట. అనునపుడ = అనుటకు యత్నించునప్పుడే; గద్గదిక = డగ్గుత్తిక; పొడమెన్ = పుట్టెను. చెఱఁగు = వానిమీఁది యుత్తరీయపుఁగొంగును; పట్టినయపుడ = పట్టుకొన్నప్పుడే; లేఁజెమట = కొంచెపుఁజెమట; క్రమ్మెన్ = దేహమునందు వ్యాపించెను. సొలసి = చొక్కి - పరవశత్వమునొంది; మాటాడన్ = వానితో మాటలాడఁగా; ఉంకింపన్ = పూనుటకు; తలఁచి = ఎంచి; మోము; తేఱిచూచినయపుడ = చక్కఁగాఁ దేటపడఁ దలయెత్తి చూచినప్పుడే; కన్నీరు = కంటినీరు; పొడమెన్ = పుట్టెను - విచారముచేఁ గన్నీళ్లు క్రమ్మెననుట.

తా. తన వలపుకాఁడయిన ప్రవరుని రూపముతో నున్న గంధర్వునిఁ జూడఁగానే వరూథినికి మనసున జంకు పుట్టెను. వానియొద్దకుఁ బోవలె నని రెండుమూఁడడుగులు పెట్టఁగానే కాళ్లు తడఁబడెను. వానిని గొంత సమీపింపఁబోఁగానే దీనత్వము కలిగెను. మిక్కిలి సమీపించి నిలువఁగానే ఱెప్ప లల్లాడసాగెను. 'అయ్యో! నన్నిట్లు మోసము చేయవచ్చునా?' యనుటకుఁ బ్రయత్నింపఁగానే డగ్గుత్తికచే నోట మాట వెడలకపోయెను. వాఁడు తన్నుఁ జూచి మునుపటి వలెఁ బాఱిపోవునేమో యని యుత్తరీయపుఁగొంగుఁ బట్టుకోఁగానే యొడలు చెమటపట్టెను. పరవశయై వానితో నేమో మాటలాడవలె నని తలఁపఁగానే కన్నీళ్లు గ్రమ్మెను. అలం. స్వభావోక్తి.

క. పాటితకరిదంతద్యుతి, పాటచ్చరగండఫలక ♦ భాగంబులపైఁ
గాటుకకన్నీ రొలుకఁగ, మాట వెడలఁ ◌గ్రేటుకొనుచు ♦ మానిని వలికెన్. 92

టీ. మానిని = స్త్రీ - వరూథిని; పాటిత...పైన్ - పాటిత = చీల్పఁబడిన; కరిదంత = ఏనుఁగుకొమ్ములయొక్క; ద్యుతి = కాంతికి; పాటచ్చర = దొంగలైన - ఆ కాంతి నపహరించునవియైన; గండఫలక = పలకలవంటి చెక్కిళ్లయొక్క; భాగంబులపైన్ = ప్రదేశములందు - విరహవేదనచేతఁ గళ తఱిఁగి తెల్లఁబోయియున్న చెక్కిళ్లమీఁదుగా ననుట; కాటుకకన్నీరు = కాటుకగలసిన కంటినీరు; ఒలుకఁగన్ = కాఱుచుండఁగా; మాట వెడలన్ = నోటనుండి మాట బయటవచ్చుటకై; క్రేటుకొనుచున్ = గొంతు సవరించుకొనుచు; పలికెన్. అలం. ఉపమ, స్వభావోక్తియు.

ఉ. ఏలర యీ చలంబు? బుడిగి ♦ యేలర బాలరసాలమాలతీ
జాలములో; శశాంకకర ♦ జాలములో వలవంత నశ్రువుల్

జాలుగ నాల్గుజాలు నిఁకఁ జాలు భవం బనునంత కాఁకకుం
బాలయి రాత్రి పంచశరు బారికిఁ జిక్కితి; నీకు దక్కితిన్.

టీ. ఈ చేలంబు = ఈ మచ్చరము - ఈ పట్టుదల; ఏలర? = ఏమిటికిరా ? ఉడిగి =
మాని; బాల...జాలములోన్ - బాల = లేఁతయైన; రసాల = తియ్యమామిడి చెట్లయొక
మాలతీ = జాజిపొదలయొక్కయు; జాలములోన్ = సమూహమునందు - వానినడుమ
ఏలర = నన్నేలుకోరా - సంభోగసుఖ మిచ్చి పాలింపు మనుట. రాత్రి = కడచినరాత్రి
జాలున్ = నాలుగుజాముల కాలమును; వలవంతన్ = మన్మథతాపముచేత; అశ్రువుల్ =
జాలుగన్ = వెల్లువయై పాఱఁగా - కన్నీళ్లువిడిచి యేడ్చుచు ననుట; శశాంకకరజాలమ
చంద్రకిరణ సమూహమునందు - మిక్కిలి ప్రకాశించుచున్న వెన్నెలయం దనుట; భవంబ
జన్మము; ఇఁకఁజాలున్ = ఇంతమాత్రము చాలును - బ్రదు కింకమీఁద నక్కఱలే దను
నంత కాఁకకున్ = అని తలఁచునంతటి తాపమునకు; పాలయి = అధీననై - లోఁబడి;
బారికిన్ = మన్మథునివైన హింసకు; చిక్కితిన్ = తగులుకొంటిని; నీకు దక్కితిన్ = నీకు వ

తా. ఓ బ్రాహ్మణుఁడా! ఏల యీ పట్టుదల ? ఈ తియ్యమామిడిగున్నల నడుమ
పొదల నడుమనుఁ గూడి నన్ను సుఖింపఁజేయుము. నీవు తొలఁగిపోయితి వన్న విచా
జరిగినరాత్రి యంతయుఁ గన్నీరు వెల్లువై పాఱఁగా నేడ్చుచు వెన్నెలవేఁడిమిని, మన్మ
సహింపలేక యీ దేహమును విడువఁ బ్రయత్నము చేయునంతటి తాపము నొందితిని. ఇప
స్వాధీనురాలను గాఁదగిన యునికితో నిన్నుఁ జేరితిని.

శా. రా, వైరాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్యచిత్తంబునన్
రావైతేఁ జవిగాని యిందులకు హోరాహోరిగాఁ బోరి యే
లా వాలాయము సేయఁగా? బ్రతుకు నీ వాచారవంతుండ వై;
చావో యెక్కుడొ నీయెడం బొడమువాంఛన్ భూసురగ్రామణీ

టీ. భూసురగ్రామణీ! = బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! - ప్రవరుఁడా! రా = నన్నేలు
రమ్ము. నీవు; కడున్ = మిక్కిలి; నిర్దాక్షిణ్యచిత్తంబునన్ = దయ (జాలి) లేని త
వైరాగ్యమున్ = విరక్తిని; పూని = వహించి; రావైతేన్ = నన్నుఁ జేరరానివాఁడ
మున; చవిగానియిందులకున్ = నీకు రుచింపని యీ పనికై; హోరాహోరిగాన్ = వద
దలతో; పోరి = పోరాడి; వాలాయముసేయఁగాన్ = నిర్బంధముచేయుట; ఏలా? =
నీవు; ఆచారవంతుండవై = సదాచారనిష్ఠ గలవాఁడవై - అనఁగా - వైశ్వదేవాది వైది
చేసికొనుచు నేకపత్నీవ్రతమును నడపువాఁడవై యనుట; బ్రతుకు = (చిరకాలము) జీ
నీయెడన్ = నీయందు; పొడము = కలిగిన; వాంఛన్ = కోరికచేత; (కలుగునది) చా
మాత్రమో; ఎక్కుడో = అంతకు మించినదో - అంతకు మించినబాధ యేమియు లేదు.

తా. 'ఓయి బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! లేనినిష్ఠ యొకటి కల్పించుకొని కఠినచిత్తుఁడవై
నన్ను విడనాడితివేని నీవలని మోహతాపముచేత నేను జచ్చుట నిజము. కనుక నీవు నీ
రము చెఱుచుకొనక చిరకాలము సుఖముగా జీవింపుము. నేను జావఁగా లోకమునకు వెలితి
దని నిష్ఠురము లాడెను. (ఇట్లనుటచేతఁ బ్రవరునివర్తనము నింద్య మని యభిప్రాయము గ

నియమ మున్నను మానుకొని తన్నుఁ గలియవలయు ననుటయే వరూథినియొక్క ముఖ్యాభిప్రాయము.) అలం. ఆక్షేపము.

క. కట్టిఁడితనమున కిట్లొడి, గట్టి మనసు తాయి సేసి కరఁగవు; మఱి నీ
పట్టినది విడువ; విఁక ని, న్నిట్టట్టన నేల మా యదృష్టం బుండన్? 95

టీ. కట్టిఁడితనమునకున్ = క్రూరత్వమునకు; ఒడిగట్టి = పాలుపడి; ఇట్లు = ఈ విధముగా; మనసు = మనస్సును; తాయిసేసి = తాతివలెఁ గఠినముగాఁ జేసికొని; కరఁగవు = మెత్తఁబడినవాఁడవు కావు - దయారసముగలవాఁడవు కాకపోయితి వనుట. మఱి = ఇంకను; నీపట్టినది = నీవుపట్టినపట్టు; విడువవు. మా యదృష్టంబు = మా భాగ్యము; ఉండన్ = ఇటువంటిదిగా నుండఁగా; ఇంకన్ = ఇఁకమీఁద; నిన్ను; ఇట్టట్టనన్ = నిష్ఠురములాడుట; ఏల? = ఎందులకు? నిన్ను నిష్ఠురము లాడి ప్రయోజనము లేదనుట.

తా. ఓ బ్రాహ్మణుఁడా! నీవు క్రూరత్వమునకుఁ బాలుపడి యెంత వేఁడుకొన్నను గనికరింపక పట్టినపట్టు మానకయున్నావు. ఇది మా దురదృష్టమువలన నీకుఁ బుట్టినబుద్ధిగాని యితరము కాదు. ఇటువంటి నిన్ను నిఁక నెంత నిష్ఠురము లాడినను ఫలము కలుగఁబోదు. అనఁగా మా యదృష్టమును నిందించుకొనుట ధర్మముగాని, నిన్ను నిందించుట ధర్మము గాదని భావము. అలం. వ్యాజనింద.

వ. అనిన నక్కుహనాభూసుర కుమారుండు. 96

టీ. అనినన్ = అని నిష్ఠురములాడఁగా; అక్కుహనాభూసుర కుమారుఁడు = కపటబ్రాహ్మణ కుమారుఁడయిన యా గంధర్వకుమారుఁడు.

సీ. కొనసాఁగి కామినీగోష్ఠిఁ బ్రౌఢములైన, యుదుటుఁజూపుల తెప్పతుదల నాఁచి
సంతసంబున ముఖాబ్జమునందుఁ జిఱునవ్వు, కందళింపకయుండ డిందుపఱిచి
పొంగారుమైఁ దోఁచుశృంగార చేష్టల, తమిఁ దెచ్చికోలుమార్ధ్యమున డాఁచి
పొడముర సావేశమున వచ్చునర్మోక్తు, లాడవి నాలుకకు రాకుండఁ గ్రుక్కి

తే. మస్తకము వాంచి యుసురని మానముద్ర
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి శిర సొకింత
యెత్తి సన్నంపుఁబలుఁకుతో నిట్టు లనియె. 97

టీ. కొనసాఁగి = కొఱఁతలేక పర్థిల్లి; కామినీగోష్ఠిన్ = కాముకురాండ్రతో ముచ్చట్లాడుటయందు; ప్రౌఢములైన = గడిదేఱినట్టి; యుదుటుఁజూపులన్ = గద్దతి (అనఁగా రసోద్ధతములైన) చూపులను; తెప్పతుదలన్ = తెప్పకొనలచేత; ఆఁచి = అణఁచి - పైకిఁ దోఁపకుండునట్లుచేసి యనుట; (ఇందులకుఁ గర్త కుహనాభూసురకుమారుఁడు. ఇట్లే యంతటను గ్రహించునది.) సంతసంబునన్ = సంతోషముచేత; ముఖాబ్జమునందున్ = కమలమువంటి ముఖమునందు; చిఱునవ్వు=మందహాసము; కందళింపక=మొలవక-తోఁపక; ఉండన్ = ఉండునట్లు; డిందుపఱిచి = అణఁచివేసి; పొంగారు మైన్=సంతోషముచే నుప్పొంగుచున్న శరీరమునందు; తోఁచు...తమిన్-తోఁచు=కనఁబడునట్టి; శృంగారచేష్టల తమిన్=హావభావాదులైన శృంగారచేష్టలయొక్క తమకమును; తెచ్చికోలుమార్ధ్యమునన్ = తెచ్చుకొన్న (అనఁగా) కలుగఁజేసికొన్న (శృంగారచేష్టల)

ఎఱుఁగమిచేత; డాఁచి=మఱుఁగుపఱిచి-అణఁచి; పొడము రసావేశమునన్=పుట్టుచున్న మో
వలని మైమఱపుచేత; వచ్చు నర్మోక్తులు = నోటికి వచ్చుచున్న సాభిప్రాయసరసములగు
మాటలను; ఒదవి = పొడమి - క్రమ్మి; నాలుకకున్ = నాలుకమీఁదికి; రాకుండన్=రా
నట్లు; క్రుక్కి = నోటిలోపలనే యణఁచి; మస్తకమున్ = ముఖమును; వాంచి = వంచుకొ
రని = ఉస్సురను ధ్వనితో నిట్టూర్పు విడిచి; మౌనముద్రన్ = మాటలాడకుండు నియ
నేలన్ - నేలమీఁద; బొటవ్రేలన్ = కాలిబొట్టనవ్రేలితో; వ్రాయుచున్ = అక్షరములు
ట్లోరయుచును; నిలిచి = నిలువఁబడి; కొంతసేపు = ఇంచుకతడవు; వెడ వెడ = కొంచెము
చింతించి = ఆలోచనచేసి - ఏమో కొంచె మాలోచించునట్లు నటించి; శిరసు = తల;
యెత్తి = కొంచెము పైకెత్తి; సన్నంపుటెలుఁగుతోన్ = హీనస్వరముతో; ఇట్టులనియెక

తా. ఆ ప్రవరునిరూపము ధరించిన గంధర్వుఁ డందులకుఁ దగినట్లు, కాముకురా
సాంగత్యములందుఁ దన కలవాటుపడిన దిట్టతనంపుఁజూపులను, ఇష్టసిద్ధి యయ్యె నను స
చేత ముఖమునందుఁ దోఁచు చిఱునవ్వును, ఆ యువతి దగ్గఱకు వచ్చుటంబట్టి తనంతట
వచ్చుచున్న శృంగారచేష్టలవలని తమకమును, మోహరసమువలని మైమఱపుచేత నోటః
సపుమాటలను దనలోనే యణఁచుకొని, వేషమునకుఁ దగినట్లు లేనిముగ్ధభావమును దెచ్చుకొ
బాధించుట కీ పడు చెక్కడనుండి వచ్చె నను చింతచే నేమియుఁ దోఁచనివానివలెఁ గ
వ్రేలితో నేలను వ్రాయుచు నేమో కొంచెము తనలో నాలోచించువానివలెఁ గొంతసే
యుండి యంతట నించుక తలయెత్తి చూచి హీనస్వరముతో నిట్లు పలికెను.

శా. తల్లిం దండ్రియు నన్నుఁ గానని మన స్తాపంబునం బొక్కఁగా,
నిల్లా లార్తిఁ గృశింపఁగా, సవనవ హ్నిశ్రేణి చల్లారఁగా,
నిల్లున్ శూన్యత నొంది సొంపు చెడఁగా నిచ్చోట నేఁ జిక్కి యో
ఫుల్లాంభోరుహనేత్ర ! యే సుఖమతిన్ భోగించెదం జెప్పవే ?

టీ. ఓ ఫుల్లాంభోరుహనేత్ర ! = వికసించిన తామరలవంటి కన్నులుగల యో
తల్లిందండ్రియున్ = నా తల్లిదండ్రు లిద్దఱును; నన్ను; కానని మనస్తాపంబునన్ = చ
కలిగిన మనసులోని సంతాపముచేత; పొక్కఁగాన్ = తపింపఁగా; ఇల్లాలు = న
ఆర్తిన్ = విరహబాధచేత; కృశింపఁగాన్ = చిక్కిపోఁగా; సవనవహ్నిశ్రేణి = య
వరుస - త్రేతాగ్నులనుట; చల్లారఁగాన్ = ఆఱి చల్లఁబడిపోఁగా; ఇల్లున్ = నా యిల్లును
నొంది = పాడుపడి; సొంపు = సమృద్ధి; చెడఁగాన్ = చెడిపోఁగా; ఇచ్చోటన్ =
నేన్ = నేను; చిక్కి = చిక్కుకొని; ఏ సుఖమతిన్ = ఏవిధమైన సుఖాపేక్షతోడ
భోగించెదన్ = నీతోఁగూడి సుఖముల ననుభవింపఁగలను ? చెప్పవే ? = నీవు చెప్పుము.

తా. నేను దమ కన్నులయెదుట లేనను విచారముచేత నా తల్లిదండ్రులు తపించుచు
నా భార్య నన్నెడఁబాయుటవలని విచారముచేతఁ జిక్కిపోఁగా, హోమాగ్నులు చ
ఇల్లు పాడుపడి సమృద్ధి చెడిపోఁగా, నే నిక్కడఁ జిక్కుకొని యల్లాడుచున్నాను.
నాకు సుఖాపేక్ష యెట్లు కలుగును ? నే నేమని నీతో భోగింతును ? నీవే యోచించి చెప్ప

ఉ. ఓ సరసీరుహాక్షి ! విన వెూ; రతిఁ గౌఁగిట నీవు జేర్చునిం
పా సురభర్త కైనఁ గల దా ? వల దంచుఁ బెనంగ నేను స

న్న్యాసినె? యొక్కటే తహతహ న్మన సొగ్గదు కేళిపై; 'ననా
శ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్యా' మనా నెఱుంగవే? 99

టీ. ఓ సరసీరుహాక్షి! = తామరలవంటి కన్నులుగల యో వరూథినీ! వినవో! = నా మాట నీవు విన్నావుగావా? రతిన్ = సంభోగమునందు; కౌఁగిట నీవు చేర్చునింపు = నీవు కౌఁగిలించు నట్టి యానందము; ఆ సురభర్తకైనన్ = (ఎల్లభోగముల ననుభవించుటయందు) ప్రసిద్ధుఁడైన యింద్రునకైనను; కలదా? = కలుగునా? వలదు = నాకక్కఱలేదు; అంచున్ = అని; పెనఁగన్ = పెనఁగులాడుటకు; నేను; సన్న్యాసినె? = యతినా? (పా. పెనంగనేమి సన్న్యాసినె = పెనఁగులాడుటకు నేను సన్న్యాసినా ఏమి?) ఒక్కటే తహతహన్ = ఒక్కటియైన (తల్లిదండ్రులు, పెండ్లాము, ఇల్లు వాకిలి యేమయ్యెనో యను) విచారముచేత; కేళిపైన్ = సంభోగముపైని; మనసు; ఒగ్గదు = మొనయదు - సంభోగేచ్ఛ మనమునఁ బుట్టదనుట. అనా...మసహ్యమ్ - మనసి = మనస్సు; అనాశ్వాసిత = ఊఱడింపఁబడనిదై - ఊఱటలేనిదై; దుఃఖితే = దుఃఖమునొందినదగుచుండఁగా; సర్వమ్ = సమస్తమును; అసహ్యమ్ = రోయఁదగినదియే; అనాన్ = అనుట; ఎఱుంగవే? = నీవు విని యెఱుఁగవా?

తా. ఓ చిన్నదానా! నా స్థితిని వినుము. నేను నీతోడఁ గ్రీడింపక పోవుటకు సన్న్యాసిని గాను. ఇంద్రునంతటివానికైనను నీవంటిదాని కూటమి సిద్ధింప దనుటయు నే నెఱిఁగినవిషయమే. అయినను మనస్సు విచారగ్రస్తమై యుండఁగా నెట్టి యుత్సాహకరమైన విషయమునందుఁగాని యిచ్ఛ పుట్ట దనుదానికిఁ దార్కాణముగాఁ 'దల్లిదండ్రు లేమయిరో? పెండ్లా మేమైపోయెనో? యిల్లువాకిలి యెట్లు పాడై పోయెనో?' యను విచార మొకటి మనసునకుఁ గలఁత పుట్టించి బాధించుచుండుటచేతనే కాని లేనిపక్షమున నీతో నింత పెనఁగులాడుదునా? అప్పుడే పైఁబడి మరులు కొందును. అలం. అర్థాంతరన్యాసము, కావ్యార్థాపత్తియును.

క. ఐనం గానిమ్ము; భవ, ద్దీనతకై వ్రతము విడిచితిం; బరులకు మే
లైనం జాలు; శరీరం, బైన నుపేక్షింపవలయు నది యట్లుండెన్. 100

టీ. ఐనన్ = అట్లయినను; కానిమ్ము = కానీ - అట్లు నామనస్సు చెడి దేనియందును నుత్సాహము లేనిదై యున్న నుండనిమ్మనుట. భవద్దీనతకై = నీదైన దీనత్వమునకై - నీవు దీనురాలవై ప్రార్థించుటచేత ననుట; వ్రతము = ఇఁకమీఁద నేదియు నక్కఱలే దని యేర్పఱచుకొన్న నియమమును; విడిచితిన్ = ఇప్పుడు విడిచిపెట్టితిని. పరులకున్ = ఇతరులకు; మేలయినన్ = మంచి కలిగినచో; చాలున్ = అంతే చాలును. శరీరంబైనన్ = ఈ దేహమునైనను; ఉపేక్షింపవలయున్ = (ఇదే కదా నా యునికి కాధారమైనది యనెడి యభిమానము వదలి) విడిచిపెట్టవలయును. అది = ఆ విషయము; అట్లుండెన్ = అట్లుండనిమ్మనుట.

తా. నాస్థితి యెట్లున్న నుండనిమ్ము. ఇప్పుడు నీ వింత దీనత్వముతో వేఁడుకొనుటచేత నా నియమమును వదలుకొన్నాను. తన దేహమైనను విడిచి యొకరికి మేలుచేయుట యుత్తమధర్మమందురు. కనుక నీ సుఖమునకై నానియమము చెఱుచుకొనుట యుక్తమే. అది యట్లుండనిమ్ము.

క. తివురక యింకొక్కటి విను, కవయునెడన్ వలయుఁగన్నుఁ గవయును మూయన్
భువి నిది యస్మద్దేశ, వ్యవహారము; కన్నుఁ దెఱవ నఘముగుఁ దెఱవా! 101

టీ. తెఱవా! = ఓ చిన్నదానా! తివురక = త్వరపడక; ఇంకొక్కటి = ఇంకొక విషయమును; విను=(చెప్పెదను) వినుము. కవయునెడన్ =సంగమము చేయునప్పుడు; కన్నుఁగవయున్ = రెండు కన్నులును; మూయన్ వలయున్ = మూసికొనవలెను; భువిన్ = ఈ భూమియందు; కన్నుఁ దెఱవన్ = కన్నులు తెఱచుటచేత; అఘము = పాపము; అగున్ = కలుగును. ఇది = ఈ సంగమకాలమందుఁ గన్నుమూసికొనుట; అస్మద్దేశవ్యవహారము = మా దేశాచారము.

తా. ఓ వరూథినీ! నీవు త్వరపడక వినవలసిన విషయ మింక నొకటి గలదు. వినుము. మాదేశమునందు స్త్రీపురుషులు సంగమము చేయునపుడు కన్ను తెఱచి యొకరి నొకరు చూచుకొనుట పాపమని కన్నులు మూసికొందురు. అందులకు నీవు సమ్మతింపవలయును. అట్లు కన్నులు మూసికొననిచో పాపము సంభవించును. (కామరూపము ధరించినవారికి సంగమకాలమందును, నిద్రాసమయమందును, మరణకాలమునందును స్వస్వరూపము వచ్చును గనుక సంగమకాలమునందుఁ దన్నుఁ జూచినపక్షమునఁ దాను గంధర్వుఁ డగుట తెలిసి తిరస్కరించునని యెంచి గంధర్వుఁడు సంగమకాలమందుఁ గన్ను దెఱవఁగూడ దని చెప్పె నని యెఱుంగునది.) అలం. కావ్యలింగము.

శా. ఈ మర్యాదకు నీ వొడంబడిన మే x లీ భంగి గాదేని మా
భూమిం జేరఁగ నెట్లు నీయొడలితోఁ x బోవంగ లేనేకదా!
యీ మందాకిని పొంత నీ మునులతో x నీ వృక్షవాటంబులో
భామా! యేఁ దప మాచరింతు విధి క x బ్రహ్మణ్యముం బెట్టుచున్. 102

టీ. భామా! = ఓ వరూథినీ! నీవు; ఈ మర్యాదకున్ = ఈ మేరకు; ఒడంబడినన్ = ఒప్పుకొన్నయెడల; మేలు = మంచిది. ఈ భంగి = ఈ ప్రకారము; కాదేని = నీకు సరిపడనిపక్షమున; ఈ యొడలితోన్ = ఈ శరీరముతో - బ్రతికియున్నంతవఱకు ననుట; ఎట్లును = ఏవిధముచేతను; మాభూమిన్ = మాదేశమును; చేరంగన్ = చేరునట్లు; పోవంగన్ లేనేకదా! = పోఁజాలనే చాలనుగదా! (ఇఁకను) ఏన్ = నేను; ఈ మందాకినిపొంతన్ = ఈ ఆకాశగంగానదియొద్దనందు; ఈ మునులతోన్= ఈ తపస్సుచేయుచున్న ఋషులతోఁగూడ; ఈ వృక్షవాటంబులోన్= ఈ మ్రాఁకుల చాలునందు; విధికిన్ = దైవమునుగూర్చి; అబ్రహ్మణ్యముం బెట్టుచున్ =నేను జంపఁదగనివాఁడ నని మొఱపెట్టుచును; తపము = తపస్సు; ఆచరింతున్ = చేసెదను.

తా. కాంతా! ఈ మేరకు నీవు సమ్మతించితివా సరి. సమ్మతింపనిపక్షమున నింక నేవిధముచేతను మాయూరికి నేను బోవుదునన్న యాశ లేనేలేదు. కాఁబట్టి బ్రతికియున్నంతకాలము నీ గంగానదీతీరమునందలి యీ వనములోఁ దపస్సు చేయునట్టి మునులతోఁ జేరికొని, 'దైవమా నేను జంపఁదగనివాఁడను. నన్నుఁ జంపకు' మని మొఱపెట్టుచు నిక్కడనే తపస్సు చేయుచుండెదను.

తే. ఇంక నొక్కటి వినుము పూ x ర్ణేందువదన!
వ్రతము చెడ సౌఖ్యమైనను x వలయుఁ గలుగ;
వాంఛితము దీఱ నను నీవు x వదలఁజెల్ల
దేను నిను సమ్మతిలఁజేసి x యేఁగుదనుక. 103

టీ. పూర్ణేందువదన! = నిండుచంద్రునివంటి ముఖముగలదానా! వరూథినీ! ఇంక నొక్కటి= ఇంక నొక మాట; వినుము. వ్రతముచెడన్ = నోముచెడినను-ఏర్పఱచుకొన్న నియమము తప్పినను;

సౌఖ్యమైనను = సుఖమైనను; వలయుఁ గలుగన్ = కలుగవలయును. వాంఛితము = నీ కోరిక; తీరన్ = నెఱవేఱఁగానే; ఏను = నేను; నినున్=నిన్ను; సమ్మతిలఁజేసి = సమ్మతిపఱచి; ఏఁగుదనుకన్ = పోవునంతవఱకు; నన్ను; నీవు; వదలఁజెల్లదు = విడిచిపెట్టఁగూడదు.

తా. ఓ వరూథినీ! 'వ్రతము చెడినను సుఖము దక్కవలె' నన్నట్లు నాకు నీవలనఁ జిర సుఖము కలుగవలయును గనుక నేఁడు నీయక్కఱ తీఱఁగానే నన్ను వదలిపొమ్మనఁబోదువేమో! అట్లుగాక నేనై నీ సమ్మతిమీఁద నిన్ను విడిచిపోవునంతదాఁక నన్ను నీవు విడిచిపెట్టఁగూడదు సుమీ! అలం. లోకోక్తి.

వ. ఇంత యేమిటికంటేనిం జెప్పెద; నేను వైదేశికుండ; బంధుమిత్రకళత్రంబులం బాసి, దైవయోగంబున నింతదూరం బేఁగుదెంచినవాఁడ; మీఁద భవదర్థంబు ప్రార్థితుండనై వ్రతహోమాద్యనుష్ఠానంబులు విడువం గలవాఁడ నగుటంజేసి యంతరంగంబునం గల తెఱంగు తేటపడం బలుకవలసె నాకర్ణింపుము. 104

టీ. ఇంత యేమిటికిన్= ఇన్ని నిబంధనలు చేసికొనుట యేల? అంటేనిన్ =అని యడిగెడిపక్షమున; చెప్పెదను; (వినుము.) ఏను; వైదేశికుండన్ =అన్యదేశస్థుఁడను. బంధుమిత్రకళత్రంబులన్ = చుట్టములను, జెలికాండ్రను, నిల్లాలిని; పాసి = ఎడఁబాసి; దైవయోగంబునన్ = దైవఘటనచేత; ఇంతదూరంబు = ఈ యధికదూరదేశమునకు; ఏఁగుదెంచినవాఁడన్ =వచ్చినవాఁడను. మీఁదన్= ఇఁకమీఁదను; భవదర్థంబు = నీకొఱకు; ప్రార్థితుండనై = నీచే వేఁడుకోఁబడినవాఁడనై; వ్రతహోమాద్యనుష్ఠానంబులు - వ్రత = సాంతపనాదులయిన వ్రతములు; హోమ= వైశ్వదేవాదిహోమములు; ఆది = మొదలుగాఁగల; అనుష్ఠానంబులు = సత్కర్మములను; విడువంగలవాఁడను = విడిచిపెట్టఁబోవువాఁడను. అగుటంజేసి = అట్లగుటచేత; అంతరంగంబునన్ = మనస్సునందు; కల తెఱంగు = ఉన్నవిధము - ఉన్న యభిప్రాయమును; తేటపడన్ = స్పష్టమగునట్లు; పలుకవలసెన్ = చెప్పవలసివచ్చెను. ఆకర్ణింపుము = వినుము.

ఉ. నీచనుదోయిసంకుమద ✽ నిర్భరవాసన మేన నూన న
య్యో! చిరసౌఖ్యముల్ గనుట ✽ యొండెఁ, దపం బొనరించి పాపముల్
రాచుట యొండెఁగా కిహప ✽ రంబుల కూరక దూరమై వయ
శ్శ్రీ చన రెంటికిం జెడిన ✽ రేవఁడ నౌదునె? నీరజేక్షణా! 105

టీ. నీరజేక్షణా! = కమలములవంటికన్నులుగలదానా! వరూథినీ! నీ... వాసన - నీచనుదోయి = నీ స్తనద్వయముయొక్క; సంకుమద = జవ్వాజిదైన; నిర్భర = మిక్కిలి యతిశయించిన; వాసన = పరిమళము; మేనన్ = దేహమునందు; ఊనన్ = నాటుకొనఁగా - క్రమ్ముకొనఁగా ననుట; చిరసౌఖ్యముల్= బహుకాలము మానని సుఖములను; కనుట = అనుభవించుట; ఒండేన్= అయినను; తపంబొనరించి = తపస్సుచేసి; పాపముల్ = చేసిన పాపములను; రాచుటయొండేన్= నశింపఁజేయుటయైనను; కాక = (లభింపవలెనే) కాని; అయ్యో! = అక్కటా! ఇహపరంబులకున్ = ఇహపర లోకములకు రెంటికిని; దూరమై = దవ్వై - ఇహసుఖముగాని, పరసుఖముగాని యనుభవింప నర్హుఁడనుగాక యనుట; ఊరక = వ్యర్థముగా; వయశ్శ్రీ = యౌవనసంపద; చనన్ = కడచిపోఁగా; రెంటికిన్ = రెండు పక్షములకును; చెడిన రేవఁడను = చెడిపోయిన రేవువాఁడను - చాకలివాఁడను; ఔదునె? = అగుదునా? ('రెంటికిం జెడినరేవఁడు' అనుటకు - ఒక

చాకలివాఁ డొక యేటిలో గుడ్డ లుదుకఁబోయి యొక ఱాతిమీఁద గుడ్డ లుదికి, య
వానిని గొంతదూరమున నున్న మఱియొక ఱాతిమీఁదఁ బెట్టుచు నుదకవలసినవానిని
దగ్గఱనే యుంచుకొని యుదుకుచుండఁగాఁ బ్రవాహము వచ్చెను. అప్పుడు వాఁడు
నుదకవలసినబట్టల నున్న తావుననే విడిచి, యుదికినబట్టలకై యా ఱాతివద్దకుఁ బ
నింతలో వఱద పెరిఁగి వచ్చి, రెండుచోట్ల నున్న వస్త్రములును గొట్టుకొనిపోయెను.
చేత నొక ఱాతిమీఁది వస్త్రములనైన నిలుపుకొన లేకపోయిన చాఁకలివానిని జన
జెడ్డ రేవఁ డనిరి. నాఁటనుండి యది లోకోక్తిగా వాడఁబడియె నని యొక కథ చెప్ప

తా. ఓ వరూథినీ! జవ్వాజి మొదలయిన పరిమళవస్తువులు చేర్చిన పచ్చగ
కొన్న నిన్నుఁ గౌఁగిలించుకొని సుఖించెడిపక్షమున నట్టి యిహసుఖమును జిరకాలము
ననుభవింపవలెను. లేదా - యెల్ల పాపములు నశించునట్లు తపస్సుఁ జేసి, పరలోకసు
వింపవలెను. ఈ రెండునుగాక నీయపేక్ష తీఱునంతవఱకుమాత్రము నిన్నుఁ గూడియుండి
నీవలని సుఖమును లేక, తపస్సును జెఱుచుకొని, రెంటికిని జెడ్డరేవువాఁడను గానేరను.
నిన్ను వదలిపోవునంతపర్యంతము నన్ను విడనాడకుండునట్లు మాట యిచ్చితివేని
చొప్పున నీతోఁగూడియుండెద. అట్లు మాట యియ్యవేని యిప్పుడే నా దారిఁబట్టి నేన
అలం. లోకోక్తి.

క. అని యాస గలుగఁ బలికిన, విని వేలుపువెలఁది మోము వికసిల్లం
దనచేతిచెఱఁగు బిగియం, బెనఁచుచుఁ దల వాంచి నగవు[2]వెలయఁగ

టీ. అని = ఇట్లని; ఆస గలుగన్ = ఆశ పుట్టునట్లు; పలికినన్ = (మాయాప్రవర
లాడఁగా; వేలుపువెలఁది = దేవతాస్త్రీ - వరూథిని; విని; మోము = ముఖము; వికసి
తెలివి నొందఁగా; తనచేతిచెఱఁగు = తనచేతఁ బట్టుకొన్న యాతని యుత్తరీయపు
బిగియన్ = బిగియునట్లు; పెనఁచుచున్ = చేతికిఁ జుట్టుకొనుచు; నగవు వెలయఁగ
రాఁగా; తల వాంచి = తల వంచుకొని; పలికెన్.

శా. [3]హా! నీ నిష్ఠురవృత్తి మాని కరుణైకాయత్తచిత్తంబునన్
మానం జాల నటంచు నేఁడు శ్రవణానందంబుగాఁ బల్కుటన్
సూనాస్త్రున్ వెల వెట్ట కేలితి; సుఖార్ణోరాశిలోఁ [4]గ్రుంకితిన్;
నా నోముల్ ఫలియించె; నా వయసు ధన్యం బయ్యె విప్రోత్తమ

టీ. విప్రోత్తమా!=ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! హా! =ఆహా!-బాగున్నది. నీ నిష్ఠు
నీదైనకఠినప్రవర్తనమును; మాని= విడిచి; కరుణైకాయత్తచిత్తంబునన్ =దయకు ఒకదా
మైన మనస్సుతో - కేవలము దయతోఁగూడిన మనసుతో; మానంజాలను = నిన్ను

1. 'రెంటికిం జెండిన రేవడ' ననుచో పల్లపుఁబంటకును, మెట్టపంటకును ఉ
నేల యగు రేవడనేల నను అర్థమును గొందఱు చెప్పుదురు. కాని రేవడమట్టికిని గొంత
ముండుటంబట్టి యా యర్థ మిట అనుగుణముగాఁ దోఁచదు.

2. బెరయఁగ. పా. 3. ఆ. పా. 4. జొక్కితిన్. పా.

అటంచుఁ శ్రవణానందంబుగాఁ = అని చెవులపండువుగా; నేఁడు = ఈ దినము; పల్కుటఁ = నీవు పలుకుటచేత; సూనాస్త్రుఁ = పుష్పబాణుని - మన్మథుని; వెలపెట్టక = జీతబత్తెములేమియు నియ్యకయె; ఏలితిఁ = బంటుగా నేలుకొంటిని. సుఖార్ణోరాశిలోఁ = సుఖ మనెడి సముద్రము నందు; క్రుంకితిఁ = మునిఁగితిని. (పా. చొక్కితిఁ = పారవశ్యము నొందితిని.) నానోముల్ = నాయొక్క వ్రతములు - నేను జేసిన వ్రతములు; ఫలియించెఁ = పండెను. నావయసు = నా ప్రాయము - యౌవనము; (పా. నాకులము = నావంశము.) ధన్యం బయ్యెఁ = కృతార్థ మయ్యెను - సార్థక మయ్యెను.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! నీవు మునుపటివలెఁ గఠినత్వమునే వహించియుండక 'నిన్ను నేను విడువ' నని దయతోఁ జెవులపండువుగా నాకుఁ జెప్పినమాటకు మిక్కిలి సంతోషించితిని. ఇఁక మన్మథబాధ లేక, తనివిదీర సుఖించెదను. నేను జేసిన పుణ్యవ్రతములు పండెను. నాప్రాయ మును సార్థక మయ్యెను. అలం. రూపకము.

వ. నీ వెట్లుచెప్పితి వట్లు సేయంగలదాన నని యతని నొడంబఱుచుసమయంబునం
దోడినెచ్చెలు లచ్చకోరాక్షిం గూడుకొని. 108

టీ. నీవు; ఎట్లు చెప్పితి = ఏ ప్రకారము నడచుకొనవలె నని చెప్పితివో; అట్లు = ఆ ప్రకారముగానే; చేయంగలదానఁ = చేసెదను - అట్లే నడచుకొనెదను. అని; అతనిఁ = ఆ మాయా ప్రవరుని; ఒడంబఱుచు సమయంబునఁ = తనతోడి కూటమికి సమ్మతింపఁజేయుచున్న సమయమునందు; తోడి నెచ్చెలులు = వరూథినితోడివారైన చెలికత్తెలు; అచ్చకోరాక్షిఁ = వెన్నెల పులుఁగులవంటి కన్నులు గల యా వరూథినిని; కూడుకొని = (వెదకుచు వచ్చి) కలిసికొని. క్రింది పద్యముతో నన్వయము.

సీ. అకట! నిర్దయబుద్ధి • వని దూఱెఁ గడు రంభ, యాహా! వివేకి వౌ • దనియె హారిణి
చేఁదుఁ ద్రిమింగెదవంచుఁ • [1]చెలఁగిన వ్వోఘృతాచి, మాయలాఁడనితి • ట్టె మంజుఘోష
న్యాయనిష్ఠుర[2]మాడి • ప్రార్థించె నూర్వశి, జంకించె రమ్మంచుఁ • జంద్రరేఖ
చెలి నేఁచి తని దిసం • తులు గొట్టె మేనక, విడువుమాయలటంచు • నొడివె హేమ
తే. [3]గొంట వనియెఁ దిలోత్తమ • గూర్మిఁ గొసరె
ధాన్యమాలిని; పుంజిక • స్థల యదల్చె;
దివిజకామిను లీరీతిఁ • దిరుగువాఁటి
గువ్వ[4]కోల్గొండ్రు దమలోన • నవ్వుకొంచు. 109

టీ. (ఇందు వరూథినిచెలులు మాయాప్రవరునిఁ బరిహసించుట చెప్పఁబడెను.) అకట! = అయ్యో! నిర్దయబుద్ధివి = దయమాలిన బుద్ధిగలవాఁడవు; అని; కడుఁ = మిక్కిలి; రంభ; దూఱెఁ = నిందించెను. ఆహా! = ఔరా! వివేకివి = తెలివిగలవాఁడవు; ఔదు = అగుదువు - ఇటువంటి యప్సరస తానై వలచి పైఁబడి వచ్చినను వదలిపోయితివి గనుక నీవు తెలివిలేనివాఁడ వనుట; (అని) హారిణి; యనియెన్. చేఁదు మ్రింగెదవు=విషము మ్రింగఁబోయెదవు - ఎంతో ప్రయత్నము చేసినను దొరకని యీ వరూథినికూటమి నీకుఁ జేఁదు మ్రింగుటవంటిది కాఁబోలు! ఎంత కష్టము

1. చికిలి. పా. 2. నిష్ఠురముల. పా. 3. కొంటు. పా. 4. కరిగొంచు, కోల్గొంచు. పా.

నీవు! అనుట. అంచున్ = అని; చెలఁగి = మీఱి; ఘృతాచి; నవ్వెను. మాయలాఁడు = ఇతఁడు మోసగాఁడు; (పా. మాయకాఁడు.) అని; మంజుఘోష; తిట్టెను. న్యాయనిష్ఠురము ఆడి = నీతితోడి నిష్ఠురపుమాటలు పలికి; ఊర్వశి; ప్రార్థించెను. రమ్మంచున్ = (బిగు వేమి?) ఇటు రమ్మని; చంద్రరేఖ; జంకించెన్ = గద్దించెను. చెలిక్ = మా చెలికత్తెను; ఏఁచితి = బాధించితివి; (పా. నొంచితి = నొప్పించితివి.) అని; మేనక; దిసంతులుకొట్టెన్ = నిందించెను. మాయలు = నీ కపటచేష్టలను; విడువు = విడిచిపెట్టుము; అటంచున్ = అని; (పా. విడువు మీల యటంచున్ = సిగ్గు విడువు మని.) హేమ; నొడివెన్ = చెప్పెను. గొంటవు = దుష్టుఁడవు; (అని) తిలోత్తమ; యనియెన్. కూర్మిన్ = ప్రేమతో; ధాన్యమాలిని; కొసరెన్ = ప్రార్థించెను. పుంజికస్థల; అదల్చెన్ = బెదరించెను. ఈ రీతిన్; దివిజభామినులు = దేవతాస్త్రీలు; తిరుగువాటి = (అతని) చుట్టును జుట్టుకొని; తమలోనన్ = తమలోఁ దాము; నవ్వుకొంచును; గుప్పకరిగొంద్రు = గుంపు గూడుకొందురు - గుమికూడిరి. అలం. 'చేఁదు మ్రింగెద' వనుచో లలితము.[1]

క. ఆ కుహనాభూసురుఁ డపు, డా కాంతల సరససమ్మ దాలాపములం
గైకొనుచు ముదితహృదయుం, డై కేళీవనము వెడలి యరిగి కుఱంగటన్.

టీ. అపుడు = ఆ సమయమునందు; ఆ కుహనాభూసురుఁడు = ఆ కపటబ్రాహ్మణుఁడైన గంధర్వుఁడు; ఆ కాంతల = ఆ దేవతాస్త్రీలయొక్క; సరససమ్మదాలాపములన్ = రసవంతము లగు సంతోషపు మాటలను; కైకొనుచున్ = అంగీకరించుచు; ముదితహృదయుండై = సంతోషించిన మనసుగలవాఁడై - మనస్సునందు సంతోషించి; కేళీవనము = ఆ యాటతోఁటను; వెడలి = విడిచి - బయలుదేఱి; అరిగి = పోయి; కుఱఁగటన్ = ఆ తోఁటకు సమీపమునందు. క్రింది పద్యముతో నన్వయము.

సీ. మృగనాభినికరంపు బుగబుగల్ గలచోటఁ, జదలేటిటితుంపురుల్ చెదరుచోట
వకుళవాటీగంధ వహుఁడు పైకొనుచోటఁ, గర్పూరతరుధూళి గప్పుచోటఁ
బసమీఱుసెలయేఱు లిసుకవెట్టినచోటఁ, జిగురుమావులసంజ నిగుడుచోట
నవమాలికల[2]తేనె నట్లుట్టిపడుచోట, మాణిక్యదీపముల్ మలయుచోటఁ
తే. బ్రమదమునఁ దేఁటు లెలుఁగెత్తి పాడుచోట
శారిక లనంగశాస్త్రముల్ చదువుచోటఁ
గీర కలకంఠములు క్రొవ్వి కేరుచోటఁ
బావురము లార[3]జంబుగాఁ బలుకుచోట. 111

టీ. మృగ...బుగల్ - మృగనాభి = కస్తూరియొక్క; నికరంబు = రాశియొక్క; బుగబుగల్ = గుప్పుగుప్పునం గొట్టెడు వాసనలు; కలచోటన్ = కలిగినతావునను; చదలేటిటితుంపురుల్ = ఆకాశగంగయొక్క నీటిచినుకులు; చెదరుచోటన్ = ప్రసరించునట్టితావునను; వకుళ...వహుఁడు - వకుళవాటీ=

---

1. పూర్వవ్యాఖ్యాత లీ పద్యమున 'గుప్పగోల్గొంచున్' అను పాఠమును గ్రహించి, 'గుంపులు గూడుకొనుచు' అను నర్థము వ్రాసి, సమన్వయము కుదురకపోఁగా, 'ఉండిరి - అను క్రియ యధ్యాహార్యము' అని వ్రాసిరి. 'గుప్పకరిగొంద్రు' అను పాఠమున పై చిక్కు లేదు.

2. తీవె. పా. 3. జంబులు. పా.

పొగడమ్రాఁకుల చాళ్లవలని; గంధవహుఁడు = చల్లనివాసనతోడి గాలి; పైకొనుచోటన్ = ప్రసరించునట్టితావునను; కర్పూరతరుధూళి = కర్పూరపుటరఁటిచెట్లయొక్క పచ్చకర్పూరపుదుమ్ము; కప్పుచోటన్ = క్రమ్ముకొనెడి తావునను; పస...ఏఱులు - పసమీఱు = సారము అతిశయించునట్టి; సెలయేఱులు = కొండపైనుండి క్రిందికిఁ బాఱునట్టి యేళ్లు; ఇసుకవెట్టినచోటన్ = ఇసుకదిన్నె లేర్పడునట్లు ప్రవహించిన తావునను; చిగురు...సంజ - చిగురు = ఎఱ్ఱని చిగుళ్లుగల; మావుల = మామిడిచెట్లయొక్క; సంజ = సంధ్యారాగకాంతి; నిగుడుచోటన్ = వ్యాపించునట్టి తావునను; నవమాలికల తేనె నట్లుట్టిపడుచోటన్ = జాజిపొదలనుండి యెడతెగక పడెడి తేనె బొట్లు రాలెడి తావునను; మాణిక్యదీపముల్ = దీపమువలె వెలిఁగెడి కెంపులు; మలయుచోటన్ = వ్యాపించిన తావునను; తేఁటులు = తుమ్మెదలు; ప్రమదమునన్ = సంతోషముచేత - లేక - అధికమదముచేత; ఎలుఁగెత్తి = గొంతెత్తి - బిగ్గఱఁగా; పాడుచోటన్ = గానముచేసెడి తావునను; శారికలు = గోరువంకలు; అనంగశాస్త్రముల్ = మన్మథ శాస్త్రములను; చదువుచోటన్ = చదివెడి తావునను; (అక్కడి గోరువంకలు అప్సరసలవలన మన్మథశాస్త్రములను నేర్చియున్నవని తెలియునది.) కీర కలకంఠములు = చిలుకలును, గోయిలలును; క్రొవ్వి = మదించి; కేరుచోటన్ = ఉత్సాహముతో సంచరించుతావునను; పావురములు = పావురాలు; ఆరజంబుగాన్ = అవ్యక్తమధురమైన ధ్వని కలుగునట్లు; పలుకుచోటన్ = కూయుతావునను - అనఁగా - మీఁదఁ జెప్పిన లక్షణములచేత మనోహరమయిన స్థలములుగల ప్రదేశమునం దని భావము. తర్వాతి పద్యముతో నన్వయము. అలం. ఉదాత్తము, రూపకము, పరిణామమును.

తే. ఆ వరూథినిమణిమండి తాలయంబుఁ
గాంచి యనురాగమునఁ బ్రవే శించి యంత
వారి నిరువురఁ గూర్చి య వ్వనజనేత్ర[1]
లాత్మగృహముల కేఁగి; ర నంతరంబ. 112

టీ. ఆ వరూథిని...ఆలయంబున్ - ఆ వరూథిని = ఆ వరూథినిదైన; మణిమండిత = రత్నములచే నలంకరింపఁబడిన; ఆలయంబున్ = ఇంటిని; కాంచి = చూచి; అనురాగమునన్ = ప్రీతితో; ప్రవేశించి = (వారందఱును) చొచ్చి; అంతన్ = అట్లు చొచ్చినతోడనే; వారి నిరువురన్ = ఆ వరూథినీ మాయాప్రవరుల నిద్దఱను; కూర్చి = జతగాఁ జేర్చి; అవ్వనజనేత్రలు = తామరపూవులవంటి కన్నులుగల రంభ మొదలైన యా యప్సరసలు; ఆత్మగృహములకున్ = తమ తమ యిండ్లకు; అరిగిరి = పోయిరి. అనంతరంబ = పిదప.

క. ఫుల్ల లవలీనవైలా, [2]వల్లీమల్లికలతోడ వాసంతికలు
ద్వల్లీల నల్లిబిల్లిగ, నల్లికొనిన యొక లతాగృ హాంతరసీమన్. 113

టీ. ఫుల్ల...తోడన్ - ఫుల్ల = వికసించిన; లవలీ = వెన్నెలతీగెలతోడను; నవ = క్రొత్తదైన - లేఁతదైన; ఏలావల్లీ = ఏలకితీగలతోడను; మల్లికలతోడన్ = మల్లెతీగలతోడను; వాసంతికలు = బండిగురిగింజతీగలు; ఉద్యల్లీలన్ = పుట్టుచున్న విలాసముచేత; అల్లిబిల్లిగన్ = అభేదముగా; అల్లికొనిన = అల్లిక వేసినట్లు పెనఁగొన్న; ఒక లతాగృహాంతరసీమన్ = ఒక్క పొదరింటియొక్క లోపలి ప్రదేశమునందు - దీనికి క్రింది పద్యములోని 'భోగింపఁదొడంగిరి' అనుదానితో నన్వయము.

---

1. గంధు. పా. 2 వల్లిమతల్లికల. పా.

క. ఆ గంధర్వకుమారుఁడు, నా గజగమనయుఁ బ్రఫుల్ల హల్లకతల్పా
భోగంబున రహి మిగులఁగ, భోగింపఁదొడంగి రాత్మఁ బొంగెడుకాంక్షన్.

టీ. ఆ గంధర్వకుమారుఁడున్ = ప్రవరరూపముదాల్చిన యా గంధర్వపుత్రుఁడును; ఆ గజగమనయున్ = ఏనుఁగునడకవంటి యొయ్యారపునడక గల యా వరూథినియును; ప్రఫుల్ల... భోగంబునన్ - ప్రఫుల్ల = చక్కఁగాఁ బూచిన; హల్లక = ఎఱ్ఱకలువలు పఱచిన; తల్పాభోగంబునన్ = పాన్పుయొక్క వైశాల్యమునందు - విరివిగల పాన్పునందనుట; రహి = ఇంపు; మిగులఁగన్=అతిశయింపఁగా; ఆత్మన్ = మనస్సునందు; పొంగెడు కాంక్షన్= మిక్కిలి హెచ్చుచున్న యిచ్ఛతో; భోగింపన్ = సంభోగముచేయ; తొడంగిరి = మొదలుపెట్టిరి.

వ. ఆ సమయంబున. 115

సీ. సహసానఖంపచ స్తనదత్తపరిరంభ, మామూలపరిచుంబి తాధరోష్ఠ
మతిశయప్రేమక ల్పితదంతసంబాధ, మగణితగ్లానిశ య్యానిపాత
మతివేలమణితయా చ్ఞార్థగల్లచపేట, మతిదీనవాక్సూచి తాత్మవిరహ
మంకురత్పులకజా లావిద్ధసర్వాంగ, మానందకృతహార వాననాబ్జ

తే. మాక్రమక్షీణనుతివర్ణ మానిమీలి
తాక్ష మాస్విన్నగండ మా యత్తచేష్ట
మాస్తిమితభూషణారవ మా వధూటి
ప్రథమసురతంబు గంధర్వ పతిఁ గరంచె. 116

టీ. సహసా...పరిరంభము - సహసా = త్వర గలుగునట్లుగా; నఖంపచ = గోరువెచ్చగానుండెడి; స్తన = కుచములచేత; దత్త = ఇయ్యఁబడిన; పరిరంభము = ఆలింగనము గలదియు; ఆమూల...ఓష్ఠము - ఆమూల = మొదలంట - ఏమియుఁ గొఱఁత లేకుండునట్లు; పరిచుంబిత = లెస్సగా ముద్దిడఁబడిన - ద్రవము పీల్చఁబడిన; అధరోష్ఠము = మోవిగలదియు; అతిశయ... సంబాధము - అతిశయ = హెచ్చిన; ప్రేమ = కూరిమిచేత; కల్పిత = చేయఁబడిన; దంత సంబాధము = పలునొక్కులు గలదియు; అగణిత...నిపాతము - అగణిత = ఎంచ శక్యముగాని; గ్లాని = శ్రమమువలని దుర్బలత్వముచేత; శయ్యా = పానుపునందు; నిపాతము = సోలిపడుట గలదియు; అతివేల...చపేటము - అతివేల = అత్యంతమైన; మణిత = రతికాలమునందు గొంతునఁ కలిగెడు గుబగుబధ్వనియొక్క; యాచ్ఞార్థ = యాచనకొఱకైన; గల్లచపేటము = చెంపపెట్టు కలదియు; అతిదీన...విరహము - అతిదీన = మిక్కిలి విచారమును దెలుపునట్టి; వాక్ = మాటలచేత; సూచిత = తెలియఁజేయఁబడిన; ఆత్మవిరహము = తమ వియోగముగలదియు; అంకురత్...సర్వాంగము - అంకురత్ = పొటమరించుచున్న; పులకజాల = గగ్గురు మొలకల సమూహముచేత; ఆవిద్ధ = చక్కఁగా గ్రుచ్చుకోఁబడిన; సర్వాంగము = ఎల్లయవయవములు గలదియు; ఆనంద...అబ్జము - ఆనంద = సంతోషముచేత; కృత = చేయఁబడిన; హారవ = హాహా యనెడి ధ్వనితోఁ గూడిన; ఆననాబ్జము = ముఖకమలముగలదియు; ఆక్రమ...వర్ణము - ఆక్రమ= క్రమక్రమముగా; క్షీణ = తగ్గిపోవుచున్న; నుతి = పొగడ్తమాటలయొక్క; వర్ణము = అక్షరములు గలదియు; ఆనిమీలితాక్షము పూర్తిగా = మూయఁబడిన కన్నులుగలదియు; ఆస్విన్నగండము = అంతటను జెమర్చిన చెక్కిళ్లు గలదియు; ఆయత్తచేష్టము = అధీనమయిన శృంగారచేష్టలు

గలదియు; ఆస్తిమిత భూషణారవము = మిక్కిలి యణఁగిపోయిన యాభరణముల ధ్వని గలదియు నైన; ఆ వధూటిప్రథమసురతంబు = ఆ స్త్రీ (వరూథిని) యొక్క తొలికూటమి; గంధర్వపతిన్ = ఆ గంధర్వరాజును; కరంచెన్ = కరఁగునట్లు చేసెను - మిక్కిలి సంతోషపెట్టె ననుట. అలం. ఉదాత్తము.

క. అన్నునఁ గనుమూయుట రొద, సన్నగిలుటఁ గాఁగిలింత ॥ సడలుట నేర్పుల్
సున్నగుట వరూథినిరతి, కన్నెటికపురతియుఁబోలెఁ ॥ గడు నింపొసఁగెన్. 117

టీ. అన్నునన్ = సంభోగపారవశ్యముచేత - కూటమివలని చొక్కుచేత; కనుమూయుటన్ = కన్నులు మూసికొనుటచేతను; రొద = గళధ్వని; సన్నగిలుటన్ = తగ్గుటచేతను; కౌఁగిలింత = ఆలింగనము; సడలుటన్ = సళ్లిపోవుటచేతను; నేర్పుల్ = రతియందలి మెలఁకువలు; సున్న = లేనివి; అగుటన్ = అగుటచేతను; వరూథినిరతి = వరూథినియొక్క సురతము; కన్నెటికపురతియుఁబోలెన్ = బోగముపడుచుయొక్క తొలినాఁటి కూటమివలె; కడున్ = మిక్కిలి; ఇంపు = ఆనందము; ఒసఁగెన్ = ఇచ్చెను. అనఁగా వరూథిని ప్రౌఢ యయినను గన్నులు మూసికొనుట యనెడి యేర్పాటుచేతఁ దన నేర్పు లేవియుం జూడక క్రీడించినను దానితోడి క్రీడ ముగ్ధతోడి ప్రథమసమాగమమువలె మిక్కిలి మనోహరముగానే యుండెనని యర్థము. అలం. ఉపమ.

క. ఈ విధమున నయ్యిరువురు, భావజతంత్రైకపరత ॥ బహుకాలము సౌ
ఖ్యావహలీలల నుండం, గా వేలుపుముద్దరాలు ॥ గర్భముఁ దాల్చెన్. 118

టీ. ఈ విధమునన్ = ఈ ప్రకారముగా; అయ్యిరువురున్ = ఆ వరూథినీగంధర్వు లిద్దఱును; భావజతంత్రైకపరతన్ = మన్మథవ్యాపారము ఒక్కదానియందే గల ఆసక్తిచేత; బహుకాలము = ఎక్కువ కాలము; సౌఖ్యావహలీలలన్ = సుఖమును కలిగించునట్టి విలాసములతో; ఉండంగాన్; వేలుపుముద్దరాలు = సౌందర్యవతియయిన యా దేవతాస్త్రీ - వరూథిని; గర్భమున్ తాల్చెన్ = వేఁకటిని ధరించెను. (ఇట్లు గర్భము ధరింపఁగానే)

క. నడ జడనువడియె నారే, ర్పడియెం జనుమొనలు నల్ల ॥ వడియెఁ వడియం
బడియెఁ గడు నొడలు పడఁతికి, బడలికయును నిదుర యరుచి ॥ బహుళంబయ్యెన్.

టీ. పడఁతికిన్ = స్త్రీకి - వరూథినికి; నడ = నడక; జడనుపడియెన్ = మందమయ్యెను. ఆరు = నూఁగారు; ఏర్పడియెన్ = స్ఫుటముగాఁ గనఁబడెను. చనుమొనలు = స్తనాగ్రములు; నల్లవడియెన్ = నలుపెక్కెను. ఒడలు = దేహము; కడున్ = మిక్కిలి; వడియంబడియెన్ = చిక్కిపోయెను - (లేక) బలము తగ్గినదాయెను. బడలికయున్ = ఆయాసమును; నిదుర = నిద్రయును; అరుచి = వస్తువులందు రుచితప్పుటయును; బహుళంబు = అధికము; అయ్యెన్. అలం. స్వభావోక్తి.

మ. [1]పలుచంబాఱుటఁ గోమలస్మితరుచుల్ ॥ పైఁ దోఁచెనా గౌరకాం
తుల గండద్వితయంబు పొల్చెఁ బ్రమదా ॥ ర్ణోరాశిఖేలన్నవో
త్కలికాభంగపరంపరోపరిసము ॥ ద్యత్పాండుడిండీరపం
క్తులనాఁ జిట్టుము లుల్లసిల్లెఁ దఱుచై ॥ తోడ్తోఁ గురంగాక్షికిన్. 120

1. పలుకంబాఱుట. పా.

టీ. కురంగాక్షికిన్ = జింకకన్నులవంటి కన్నులుగల వరూథినికి; తోడ్తోన్ =
గర్భచిహ్నము లేర్పడిన) తోడనే; గండద్వితయంబు = చెక్కిళ్లదోయి - రెండు చెక
పలుచంబాఱుటన్ = పలుచనగుటచేత; కోమలస్మితరుచుల్ = మృదువైన చిఱునవ్వు వెల
పైన్ = మీఁద; తోఁచెన్ నాన్ = కనఁబడెనో అనఁగా; గౌరకాంతులన్ = తెల్లని
లతో; పొల్చెన్ = ఒప్పెను. ప్రమద...పంక్తులు - ప్రమద = సంతోష మనెడి; అర్ణో
సముద్రమునందు; ఖేలత్ = విహరించుచున్న; నవ = నూతనములైన; ఉత్కలికా = ఇ
ప్రాప్తించు నెడల నగు కాలవిలంబము నోర్వలేమి యనెడి; భంగ = అలలయొక్క; పరం
ఎడతెగని వరుసలయొక్క; ఉపరి = మీఁదిభాగమున; సముద్యత్ = లెస్సఁగాఁ బుట్ట
పాండు = తెల్లనైన; డిండీర = నురుఁగులయొక్క; పంక్తులు నాన్ = వరుసలు అనునట్ల
ములు = నురుఁగువలె నోటినుండి వచ్చెడి నీళ్లయుమ్ములు - వేవిళ్లసంబంధమైన యోఁకిలి
కొందఱు; తఱుచై = అధికమై; ఉల్లసిల్లెన్ = ప్రకాశించెను - అతిశయించె ననుట.
గర్భము ధరించువారికిఁ జెక్కిళ్లు పలుచనై వివర్ణము లగుటయు, నురుఁగుతోడి నీళ్లు నోట
చుండుటచే మాటిమాటికి నుమియుచుండుటయు స్వాభావికములుగనుక గర్భిణియయిన వ
నా చిన్నెలు కలిగె ననుట. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

తే. నాకజలజాక్షినిఱుపేద ♦ నడుము బలిసి, యల్లనల్లన వళిసీమ ♦ నాక్రమిం
బేర్చి దివసక్రమంబున ♦ బీద బలిసి, బందికాఁడైనఁ బోరువులు ♦ బ్రదుకఁగ

టీ. నాక...నడుము - నాకజలజాక్షి = స్వర్గలోకస్త్రీయయిన వరూథినియొక్క; ని
నడుము = మిక్కిలిలేమిడినొందిన నడుము - సన్నని నడు మనుట; బలిసి = లావెక్కి; అల్లన
మెల్లమెల్లఁగా; వళిసీమన్ = కడుపుమీఁది ముడుఁతల ప్రదేశమనెడి దేశమును; ఆక్రమిం
ఆవరించుకొనెను. నడుము బలియుటచే ముడుఁతలు దానిబలుపునం దణఁగిపోయె ననుట;
పేదవాఁడు - లేక బలహీనుఁడు; దివసక్రమంబునన్ = నానాఁట - దినములవరుస
బలిసి = బలవంతుఁడై; పేర్చి = విజృంభించి; బందికాఁడు = బందిపోటుదొంగ - దొమ్మి
వారిమీఁదికి వచ్చి నిర్బంధించి దోఁచెడిదొంగ; ఐనన్ = అయిన పక్షమున; పొరువులు
గున నుండువారిగుంపు; బ్రదుకఁగనునె? = మనునా? మనలే దనుట. అలం. అర్థాంతరన్యా

క. పాటలసుగంధి పాటలు, నాటలు లేకప్పు డొప్పె ♦ నలసతఁ బథికో
త్పాటన జయ పరిశాంత, జ్యాటంకృతి చలన మదన ♦ చాపముఁబోలెన్

టీ. పాటలసుగంధి = పాదిరిపువ్వుల పరిమళమువంటి దేహపరిమళము గలది - వ
అప్పుడు = ఆ గర్భము ధరించినసమయమునందు; అలసతన్ = ప్రాలుమాలికచేత; పా
ఆటలున్; లేక; పథిక...చాపమున్ - పథిక = విరహము నొందినవారిని; ఉత్పాటన
పెఱుకుటవలననైన - బాధించుటవలననైన; జయ = గెలుపుచేత; పరిశాంత = మిక్కిలి
పొందిన - ఎంతమాత్రమును లేక నిలిచిపోయిన; జ్యా = అల్లెత్రాటియొక్క; టంకృతి
అనెడి ధ్వనియు; చలన = కదలికయును గల; మదనచాపమున్ పోలెన్ = మన్మథుని విల్ల
ఒప్పెన్ = ఉండెను.

తా. గర్భభారములవలనఁ బాటలు, నాటలు మాని, ప్రాలుమాలికతోఁ గూడియున్న
వరూథిని, మన్మథుఁడు విరహులను బీడించుపని నెఱవేర్చినపిదపఁ దన వింటి నెక్కుడిం

వైవఁగా, నల్లెత్రాటియొక్క మ్రోఁతయును, జలనమును లేక మిక్కిలి యూరకున్న యా విల్లో యనునట్లుండెను. (ఇందు వరూథినికిని మన్మథునివింటికిని, పాటలకును దాని యల్లెత్రాటి టంకారములకును, ఆటలకును దాని చలనములకును, అలసతకును పథికోత్పాటనజయపరిశాంతతకును బోలిక యని యెఱుంగునది.) అలం. ఉత్ప్రేక్ష.

సీ. మనసుకక్కుఱితి మెల్లన లేచి చేతులఁ, గాంతుని జబ్బుగాఁ గౌఁగిలించు;
నలసత మృద్గంధియైన కమ్మనినోర, నధరంబు నెడ నెడ నాని కూర్కు;
మణితాదిపవనధారణశక్తి చాలమి, నొయ్యన నర్మోక్తి నుబ్బొనర్చుఁ;
గాంక్షితక్రీడ కంగము పంపు సేయమి, నొడ్డుగానిట్టూర్పు లొలయఁబొగులు;
తే. నిచ్చ యెఱిఁగిన రతికేళి మెచ్చి పొగడు, నప్పు డక్కాంత రతిపరిహాసవేళ
జీవితేశు[1]సమేళంపుఁ జేఁత లుడుపుఁ, బ్రార్థనాపూర్వదీనసంభాషణముల.[2]

టీ. అప్పుడు = గర్భధారణముగలిగిన యాయాసముకలిగిన యాకాలమునందు; అక్కాంత= ఆస్త్రీ - వరూథిని; మనసుకక్కుఱితిన్ = మనసునందుఁగల ప్రియాపేక్షవలని లోభముచేత; మెల్లనన్ = తిన్నఁగా; లేచి; చేతులన్ = చేతులతో; కాంతునిన్ = ప్రియుని; జబ్బుగాన్ = చొరవ లేకుండునట్లుగా; కౌఁగిలించున్ = ఆలింగనము చేసికొనును. అలసటన్ = ప్రాలుమాలిక చేత; మృద్గంధియైన = మట్టికంపు గలదియైన; కమ్మనినోరన్ = రుచికరమైన నోటితో; ఎడనెడన్ = అప్పుడప్పుడు; అధరంబు = మోవిని; ఆని = చవిగొని; కూర్కున్ = నిద్రించును. మణితాది...శక్తి - మణితాది = గళరవము మొదలగువానికై; పవన = వాయువును; ధారణ = బిగఁబట్టునట్టి; శక్తి = బలము; చాలమిన్ = వలసినంత లేకపోవుటచేత; ఒయ్యనన్ = మెల్లఁగా; నర్మోక్తిన్ = పరిహాసపు మాట లాడుటచేత; ఉబ్బు = (ప్రియునికి) సంతోషమును; ఒనర్చున్ = కలుగఁజేయును. కాంక్షిత క్రీడకున్ = ప్రియుఁడు కోరిన యాటకు; అంగము = దేహము; పంపు సేయమిన్ = తాను దలఁచినట్లు స్వాధీనము కాకపోవుటచేత; ఒడ్డుగాన్ = అధికముగా; నిట్టూర్పులు = దీర్ఘశ్వాసములు; ఒలయన్ = కలుగఁగా; పొగులున్ = విచారపడును. ఇచ్చ = తన యొక్క కోరిక; ఎఱిఁగినరతికేళిన్ = తెలిసిన ప్రియునిదైన సురతక్రీడను; మెచ్చి = మెచ్చుకొని; పొగడున్= స్తుతించును. రతిపరిహాసవేళన్ = సంభోగ విషయమైన యెగతాళిమాటలాడునప్పుడు; ప్రార్థనా...భాషణములన్ - ప్రార్థనా = వేఁడుకొనుట; పూర్వ = ముందుగాఁగల; దీన = దైన్యముతోడి; సంభాషణములన్ = మాటలచేత; జీవితేశు...చేఁతలు - జీవితేశు = ప్రాణనాయకునియొక్క; సమేళంపుఁజేఁతలు = కూటమికై చేయు చేష్టలను; ఉడుపున్ = మాన్పును. అలం. స్వభావోక్తి.

క. అంత వియచ్చరుఁ డభిమత, మంతయు సమకూఱుటయును నచ్చర గర్భ
శ్రాంత యగుటయును గనుఁగొని, యింతట నిచ్చోటువాయకే నిఁక నున్నన్.

టీ. అంతన్ = అప్పుడు - మీఁదఁజెప్పినదశలో వరూథిని యుండునప్పుడు; వియచ్చరుఁడు = ప్రవరరూపుఁడైన యా గంధర్వుఁడు; అభిమతమంతయున్ = తన కోరికయంతయు; సమకూఱుటయును = సిద్ధింపఁగా; అచ్చర = అప్సరసయైన వరూథిని; గర్భశ్రాంత = వేఁకటి వలని యాయాసముగలది; అగుటయును; కనుఁగొని = చూచి; ఇంతటన్ = ఇంతటిస్థితితో;

1. సుమాళంపు. పా. 2. ఈ పద్యము కొన్ని ప్రతులలో లేదు.

ఏను; ఇచ్చోటు = ఈ తావు; పాయక = వదలక; ఇఁకన్ = ఇఁకమీఁద; ఉన్నన్ = ఇక్కడనే యుండినపక్షమున. తర్వాతి పద్యముతో నన్వయము.

క. వంచన యెఱిఁగిన మఱి శపి, యించునొ సురకాంత ? చెప్పక కేఁగినఁ బ్రేమం
బంచశరశరపరంపరఁ, బంచతఁ బ్రాపించి మీఁదఁ బాపం బిడునో ? 125

టీ. సురకాంత = దేవతాస్త్రీ - వరూథిని; వంచన = నేను జేసిన మోసమును; ఎఱిఁగినన్ = తెలిసికొన్నపక్షమున; మఱి = పిమ్మట; శపియించునొ ? = శాపముపెట్టునేమో? చెప్పక = నేను బోయెద నని చెప్పక; ఏఁగినన్ = నాయంతటఁ బోయినపక్షమున; ప్రేమన్ = స్నేహముచేత; పంచ...పరంపరన్ - పంచశర = మన్మథునియొక్క; శరపరంపరన్ = బాణసమూహముచేత; పంచతన్ = చావును; ప్రాపించి = పొంది - చచ్చి యనుట; మీఁదన్ = నామీఁద; పాపంబు = స్త్రీహత్యాదిదోషమును; ఇడునో ? = పెట్టునో యేమో ? - అనఁగా నిక్కడనే యున్నపక్షమునఁ గ్రమముగాఁ గొన్నాళ్లకు నేను బ్రాహ్మణరూపమును బొంది తన్ను మోసము చేసినసంగతి తెలిసి తిట్టునేమో! ఇక్కడ నిలువక యెక్కడికైనఁ జెప్పకయే పోయినపక్షమున నాయందుఁ గల ప్రేమాతిశయముచేత నెడఁబాటున కోర్వక చచ్చి యా చావునకు నేను గారణ మగుటంజేసి యా పాపమునకు నన్నుఁ బాలుపఱుచునో యేమో ! యని తనలోఁ దా నాలోచించెను. అలం. సందేహము.

వ. అని వితర్కించి యక్కపటవిప్రుం డెఱింగించి యనిపించుకొనియ పోవువాఁడై యప్పు డప్పువ్వుఁబోఁడి డాయం బోయి బుజ్జనం బొప్ప నిట్లనియె. 126

టీ. అని వితర్కించి = ఈ విధముగాఁ దనలోఁ దాను విచారించి ; అక్కపటవిప్రుండు = ఆ మోసపుబ్రాహ్మణుఁడు - గంధర్వుఁడు; ఎఱింగించి = వరూథినితోఁ జెప్పి; అనిపించుకొనియ = ఆ వరూథిని తన్ను సెలవిచ్చి పంపునట్లు చేసికొనియే - వరూథినివలన నుత్తరువు తీసికొనియే; పోవువాఁడై = పోవునట్లు నిర్ణయించుకొన్నవాఁడై; అప్పువ్వుఁబోఁడిన్ = పువ్వువంటి దేహము గల యా వరూథినిని; డాయంబోయి = సమీపించి; బుజ్జనంబు = ఉపలాలనము; ఒప్పన్ = ఒప్పునట్లుగా; ఇట్లనియెన్.

తే. ఎవ్వఁడేఁ బాదలేపమొక్కింత నాదు,పాదములఁబూయ నింతేసి పనులుపుట్టె
నమ్మహాయోగి బహుయోజనాధ్వగామి,యీగిరి కి నేఁగుదెంచె నేనేఁగి కంటి.

టీ. ఎవ్వఁడేన్ = ఏ సిద్ధుఁడు; పాదలేపము = అడుగులకుఁ బూసికొనెడి పసరు; ఒక్కింత = రవంత; నాదుపాదములన్ = నాయడుగులందు; పూయన్ = చరుమఁగా; ఇంతేసిపనులు = ఇంతింత విశేషకార్యములు - ఈ హిమవంతమునకు వచ్చుట, పాదలేపము కరఁగిపోవుట, దారి గానక యందందుఁ దిరిగి కడకు నిన్నుఁ జూచుట మొదలైన కార్యములు; పుట్టెన్ = కలిగెనో; అమ్మహాయోగి = ఆ దొడ్డవాఁడయిన సిద్ధుఁడు; బహుయోజనాధ్వగామి = పెక్కామడలత్రోవ నడచువాఁడు; నేఁడు; ఈ గిరికిన్ = ఈ కొండకు; ఏఁగుదెంచెన్ = వచ్చెను. ఏఁగి = నేను వెళ్లి; కంటిన్ = చూచితిని.

తా. ఈ హిమవత్పర్వతమునకు వచ్చి నానావిధములయిన యవస్థలు పడుటకుఁ గారణముగా ముందు నా యడుగులకుఁ బసరు రాసి పోయిన సిద్ధుఁ డెక్కడెక్కడనో తిరిగి నేఁ డీ కొండకు వచ్చినాఁడు. విహారార్థముగాఁ బోయినప్పుడు నే నాయనను చూచి, మాటలాడి వచ్చితిని.

క. అతఁడు మఱి తీర్థయాత్రా, వ్రతవశమున [1]వచ్చి మా పురంబు తెరువుగాఁ
గతలుగ మా సంసార, స్థితు లెల్లను జెప్పె నేమి సెప్పుదు నబలా! 128

టీ. అబలా! = ఓ వరూథినీ! అతఁడు = ఆ సిద్ధుఁడు; మఱి = మఱియును - ఇప్పుడుఁగూడ; తీర్థ...వశమునన్ - తీర్థయాత్రా = తీర్థములనుగూర్చి పోవునట్టి; వ్రతవశమునన్ = నియమవశముచేత; మా పురంబు తెరువుగాన్ = మా పట్టణపుమార్గముగా; వచ్చి; మా సంసారస్థితులు = మా కాఁపురపుస్థితులను; ఎల్లన్ = అన్నిటిని; కతలుగన్ = పురాణకథలుగా; చెప్పెను. ఏమి చెప్పుదున్? = ఇఁక నే నేమని చెప్పుదును? అదంతయు వివరించి చెప్పుటకు నాకు శక్యము కాదనుట.

సీ. పైపరా[2]మర్శ చొప్పడమిఁ బక్వముఁ దప్పి, పండఁబాఱిన పొలమెండఁబాఱెఁ
గట్టఁ గాపింప దక్షత లేమి నూరూర, బందెలఁ బడిపోయెఁ బశుగణంబు
వంచనామతిఁ బ్రాడ్వివాకులై వటువు లొ, జ్జల కొప్పగించిరి చదువు లెల్లఁ
గికురించి రిచ్చి పుచ్చుకొనుచోటులవార, లాఁకకు లోను గా కప్పు లీక
తే. గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ, గాసువీసంబు వెడలమి గ్రాసమునకు
నాహి[3]వెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని, లెస్స యుండునె గృహకర్త లేని[4]యిల్లు.

టీ. పైపరామర్శ = పైవిచారణ; చొప్పడమిన్ = లేకపోవుటచేత; పక్వము తప్పి = పరిపాకము చెడి; పండఁబాఱినపొలము = పండుట కారంభించిన భూమి; ఎండఁబాఱెన్ = ఎండిపోనారంభించెను. కట్టన్ = కట్టుమట్టునఁ గట్టివేయుటకును; కాపింపన్ = మేయఁ దోలి కాచునట్లు చేయుటకును; దక్షత లేమిన్ = దిక్కు లేకపోవుటచేత; పశుగణంబు = పసులగుంపు; ఊరూరన్ = ప్రతిగ్రామమునందు; బందెలన్ = బందెల దొడ్లయందు - పైరు మొదలగునవి మేసినందులకై నిర్బంధముగాఁ దోలియుంచెడి దొడ్లయందు; పడిపోయెన్ = చిక్కిపోయెను. వంచనామతిన్ = మోసముచేయు బుద్ధిచేత; ప్రాడ్వివాకులై = తగవులమారులై; వటువులు = చదువుచున్న బ్రహ్మచారులు; చదువులెల్లన్ = తాము చదివిన విద్యలన్నియు; ఒజ్జలకున్ = ఉపాధ్యాయులకు; ఒప్పగించిరి = అప్పగించిరి - మఱచిపోయి రనుట. ఇచ్చి = అప్పిచ్చి; పుచ్చుకొనుచోటులవారలు = తీసికొనునట్టి తావులలోని జనులు; అప్పులు = అప్పుగాఁ దీసికొన్న ధనములను; ఈక = ఇయ్యకయు; ఆఁకకున్ = అందులకై చేసిన నిర్బంధమునకు; లోనుగాక = లోఁబడకయు; కికురించిరి = మోసపుచ్చిరి. గ్రహణ సంక్రమణాదులన్ - గ్రహణ = సూర్యచంద్రగ్రహణములు; సంక్రమణ = మకరసంక్రాంతి మొదలయిన సంక్రాంతులు; ఆదులన్ = మొదలయిన పుణ్యకాలములయందు; రాచనగరన్ = రాజగృహమునందు; కాసువీసంబు = కాసుగాని, వీసముగాని - కొద్ది గొప్ప ధనాదాయము; వెడలమిన్ = బయట రాకపోవుటచేత - లభింపకపోవుటచేత; గ్రాసమునకున్ = భోజనమునకుఁగాను; క్షేత్రంబులందున్ = మాన్యపుభూములందు; కొన్ని = కొన్నిటిని; ఆహివెట్టిరి = కుదువ యుంచిరి. (కాఁబట్టి) గృహకర్త = ఇంటికి దక్షతగానుండువాఁడు; లేని యిల్లు = లేనికాఁపురము; లెస్సయుండునె? = బాగుగా నుండునా? అనఁగా

1. వచ్చె. పా. 2. పరామరిక, పరామరిస. పా. 3. నాధి. పా. 4. బ్రదుకు. పా.

నే నింట లేకపోవుటంబట్టి యిన్నివిధములచేతఁ గాఁపురము చెడిపోయె నని భావము. అలం. అర్థాంతరన్యాసము.

క. అదిగాకే నిట వచ్చిన, యది మొదలుగఁ జింతచే న । హర్నిశమును నా
కెదురెదురె చూచు చిద్దఱు, ముదుసళ్లును బుత్త్ర[1]మోహ । మున నగునార్తిన్.

టీ. అదిగాక = అట్లు కయ్యకాలువ, యిల్లు వాకిలి మొదలుగా సర్వస్వమును జెడిపోవుటే కాక; ఏన్ = నేను; ఇట వచ్చినదిమొదలుగన్ = ఇచ్చటికి వచ్చినది మొదలుకొని; ఇద్దఱు ముదుసళ్లును = వృద్ధులయిన మా తల్లిదండ్రు లిద్దఱును; చింతచేన్ = విచారముచేత; అహర్నిశమును = పగలును రాత్రియును - ఎల్లప్పుడు ననుట; పుత్త్రమోహమునన్ = కొడుకనైన నావలని ప్రేమచేత; అగు నార్తిన్ = కలుగునట్టి వ్యథచేత; నాకున్ = నా రాకకై; ఎదురెదురె చూచుచున్ = ఎదురుచూచుటయే పనిగా వర్తించుచు. తర్వాతి పద్యముతో నన్వయము.

క. తడి కంట నెపుడు దఱుఁగక, కడి దఱుఁగఁగ వడియుఁ దఱిఁగి । గాసిం బుడమిం
బడినఁ గనరాక మంచపుఁ, దొడుగఱ లైరకటా! రుజల । తో నే మందున్? 131

టీ. కంటన్ = కంటియందు; తడి = తేమ - నీరు; ఎప్పుడున్ = ఎల్లప్పుడును; తఱుఁగక = తగ్గక - దుఃఖముచేత నెల్లప్పుడును గన్నీళ్లు మితి లేక కాఱుచుండఁగా ననుట; కడి = ఆహారము; తఱుఁగఁగన్ = తగ్గఁగా; వడియున్ = బిగువును - దేహపటుత్వమును; తఱిఁగి = తగ్గి; గాసిన్ = ఆయాసముచేత; పుడమిన్ = నేలమీఁద; పడినన్ = పడియున్నను; కనరాక = కానఁబడక - మిక్కిలి చిక్కిపోయి; రుజలతోన్ = వ్యాధులతో; మంచపుఁ దొడుగఱలు = మంచముపై వేయఁబడిన కంపమండ్రపోగులు - మంచము నంటుకొని లేవలేనివారు; ఐరకటా! = అయినారఁట! ఏమందున్? = ఇఁక నా తల్లిదండ్రుల దుఃఖము నే మని చెప్పుదును? వారి దుఃఖముకొలఁది యింత మాత్ర మని నిర్ణయించి చెప్ప శక్యము కా దనుట. అలం. అతిశయోక్తి.

క. కావున వారలఁ జూడం, గా వేగమ చనఁగవలయుఁ । గమలదళాక్షీ!
నీ వెఱుఁగని ధర్మాధ, [2]ర్మావస్థితి గలదె? దీని । కై యడలకుమీ! 132

టీ. కావునన్ = కాఁబట్టి; వారలన్ = అటువంటి దశలోనుండెడి తల్లిదండ్రులను; చూడంగాన్ = చూచుటకై; వేగమ = శీఘ్రముగానే; చనఁగవలయున్ = నేను బోవలయును; కమలదళాక్షీ! = తామరరేకులవంటి కన్నులుగల యో ప్రియురాలా! నీవు; ఎఱుఁగని...వస్థితి. ఎఱుఁగని = ఎఱుఁగకయుండెడి; ధర్మాధర్మ = న్యాయాన్యాయములయొక్క; అవస్థితి = ఉనికి-మర్యాద ; కలదె? = ఉన్నదా ?-నీవు న్యాయాన్యాయప్రకారము లన్నియుఁ జక్కఁగాఁ దెలిసిన దానవు; నీకుఁ దెలియని ధర్మసూక్ష్మము లేదనుట. దీనికై = ఈ నా ప్రయత్నమునకై - నేను నిన్ను విడిచిపోవునందులకై యనుట; అడలకుమీ! = దుఃఖపడకుమా! - అనఁగా నాయందలి ప్రేమచేత నన్ను విడుచుట నీ కెంత దుఃఖకరమో నా తలిదండ్రుల నెడఁబాయుట నాకును నంత దుఃఖకరమే యని తెలిసికొని దుఃఖపడక సంతోషముతో నన్నుఁ బంపు మని భావము.

క. వడిఁ గాఁచికాఁచి యుండం, గడవలనీ రినుము ద్రావు । కైవడిఁ బైఁబైఁ
బొడమెడు కోర్కులచేఁ బె, ల్లుడికినమది భోగముక్తి । కూఱట గనునే? 133

---

1. శోక. పా. 2. ర్మావస్థలు గలవె? పా.

టీ. కాఁచికాఁచి=కొలిమిలో కాఁచికాఁచి - మిక్కిలి కాఁక యెక్కునట్లు చేసి; ఉండఁగ్ = ఉండఁగా; ఇనుము; కడవలనీరు = కడవలకొలఁదిజలమును; వడిఁన్ = వేగముతో; గ్రాపుకై వడిఁన్ = పీల్చునట్టి విధమున; పైఁబైన్ = మీఁదమీఁద; పొడమెడు కోర్కులచేన్ = పుట్టుచున్న కాంక్షల చేత; పెల్లు = అధికముగా; ఉడికిన మది = తాపమునొందిన మనస్సు - మిక్కిలియు నుద్రేకించిన మన స్సనుట; భోగముక్తికిన్ = సుఖానుభవముయొక్క విడుపునకు; ఓటమిన్ = విశ్రాంతిని; కను నే ? = పొందునా ?

తా. చక్కఁగా కాఁక యెక్కునట్లు కొలిమిలో వేసి కాఁచిన యిను మెంత నీరు పోసినను బీల్చునట్లు మీఁదమీఁదఁ బుట్టుచున్న కోరికలచేత మఱిమఱి యుద్రేకించియున్న మనస్సు మిక్కిలి యును భోగముల ననుభవించుచునే యుండఁజూచును గాని యా భోగములవలన విరమించుటకు సమ్మతించునా ? అలం. ఉపమ.

ఉ. కావున నెన్నఁడుం దెగని కాంక్ష నెపం బొకఁ డెన్ని రోసి నేఁ
బోవఁ దలంతునేని వల పున్ ననుపుం దగవుం బ్రియంబునున్
నీవలనన్ సమగ్రములు; నిల్చిన సంపెఁగపువ్వుఁదేనెక్రొ
త్తావికిఁ దేఁటి చిక్కినవిధంబునఁ జిక్కనె లోలలోచనా ! 134

టీ. లోలలోచనా! = చలించుచున్న కన్నులుగలదానా! - వరూథినీ! కావునన్ = అందువలన; ఎన్నఁడున్ = ఎప్పుడును; తెగనికాంక్షన్ = తీఱనికోరికను; రోసి = రోఁతగొని; నెపం బొకఁడు = ఏదే నొక సాకు; ఎన్ని = ఎంచి - కలుగఁజేసికొని; నేన్ = నేను; పోవన్ = నిన్ను విడిచిపెట్టి పోవుటకు; తలంతునేనిన్ = తలఁచినపక్షమున; వలపున్ = మోహమును; ననుపున్ = అనురాగమును; తగవున్ = న్యాయమును; ప్రియంబునున్ = ఇష్టమును; నీవలనన్ = నీయెడ; సమగ్రములు = సంపూర్ణములు - కొఱఁతలేక యున్నవి. నిల్చినన్ = (ఇట్లని యిప్పుడే పోక) యిక్కడ నున్నపక్షమున; సంపెఁగ...తావికిన్ - సంపెంగపువ్వు = చంపకపుష్పముయొక్క; తేనె క్రొత్తావికిన్ = మకరందముయొక్క క్రొత్త పరిమళమునకు - ఎన్నఁడు నెఱుఁగని వెగటైన పరిమళమునకు; తేఁటి = తుమ్మెద; చిక్కినవిధంబునన్ = తగులుకొన్నరీతిని; చిక్కనె ? = తగులు కోనా? తప్పక తగులుకొని తపింతు ననుట.

తా. ఓ ప్రియురాలా! భోగములు మానరానివి. కాఁబట్టి యెన్నాళ్లనుభవింతు ననుతలఁపున నేదే నొక సాకు గల్పించుకొని తొలఁగిపోదునన్న, మోహము, ననురాగమును, న్యాయమును గొఱఁత లేక వహించియున్న నీవంటిదాని నెట్లు విడిచిపోవచ్చును? విడిచి పోరా దని యిక్కడనే యుందు నన్నఁ దుమ్మెద తనకు వెగటైన సంపెఁగపువ్వునందలి క్రొత్తతేనె త్రాగఁ గోరి యందుఁ జిక్కు కొని చెడిపోవునట్లు నీతోడి సాంగత్యము నపేక్షించి చుట్టములకుఁ గానివాఁడనై చెడిపోదును గదా! తుమ్మెదలకు సంపెఁగపువ్వుల వాసనచేఁ దలదిమ్ము గలుగు ననుట సుప్రసిద్ధము. అలం. ఉపమ.

ఉ. ఎవ్వఁడు మీఁ దెఱుంగక య థేచ్ఛసుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రత హాని యశోధనహాని పుట్టుఁ, దా
నవ్వెడఁ గమ్మనుష్యపశు వయ్యవివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగఁ బాలు గౌరవము నం బడఁబాలును నిందపాలునై. 135

టీ. ఎవ్వఁడు = ఏ మనుష్యుఁడు; మీఁదు = భవిష్యత్కాలమునందు రాఁగలయట్టివానిని; ఎఱుంగక = తెలియక; యథేచ్ఛ...రతిన్ - యథేచ్ఛ = ఇచ్ఛకు వచ్చినట్టి; సుఖైకరతిన్ = సుఖమొకదానియందే యాసక్తితో; చరింపఁగాన్ = ప్రవర్తిల్లఁగా; అవ్వలన్ = పిదప; వంశహాని= కులము చెడుటయు; వ్రతహాని = నియమము చెడుటయు; యశోధనహాని = కీర్తియనెడి ధనము చెడుటయు; పుట్టున్ = కలుగునో; అవ్వెడఁగు = ఆ మూఢుఁడు; అమ్మనుష్యపశువు = అట్టి మనుష్యరూపపశువు; అయ్యవివేకి = ఆ వివేకములేనివాఁడు; తాన్; జగంబునన్ = లోకమునందు; నవ్వఁగఁబాలు = పరిహాసమునకు లోఁబడినవాఁడును; రౌరవమునన్ = రౌరవ మనెడి నరకమునందు; పడఁబాలున్ = పడుటకు లోనైనవాఁడును; నిందపాలును = నిందకు లోఁబడినవాఁడును; ఐ చెడున్.

తా. ఏ మనుష్యుఁ డుత్తరకాలమునందుఁ దనకు రాఁబోవు నాపదలను దలఁపక కేవలము సుఖమునందే యపేక్షగలవాఁడయి యిచ్ఛవచ్చినట్లు ప్రవర్తించునో, యట్టి పశుప్రాయుఁడును, మేలని, కీడని తెలిసికొను తెలివిలేనివాఁడు నైన మూఢుఁడు తనవంశమును, సదాచారమును, గీర్తిని జెఱుచుకొని, లోకులందఱుఁ దన్నుఁ జూచి నవ్వఁగా నిందఁబొంది తుదకు రౌరవ మనెడి నరకమునందుఁ గూలి నశించును. అలం. అప్రస్తుతప్రశంస.

మ. అనినం జిత్తము జల్లనన్ సొరుగున య్యంభోజపత్త్రాక్షిలో
చనగోళంబులఁ జిమ్మలై చిలుపలై జాలై తరంగంబులై
చనుదోయిం గొనబౌ కురంగమదచ ర్చల్ [1]జాఱిపో నొక్కమెం
డున బాష్పాంబుఝరంబు లుప్పతిలెఁ బో టుంబాటుగా నెంతయున్. 136

టీ. అనినన్ = అని యిట్లు మాయాప్రవరుఁ డనఁగానే; చిత్తము = మనస్సు; జల్లనన్ = జల్లుమనఁగా - దిగులు తోఁచినది కాఁగా; సొరుగు...గోళంబులన్ - సొరుగు = సోలిపడునట్టి; అయ్యంభోజపత్త్రాక్షి = తామర రేకులవంటి కన్నులుగలదైన యా వరూథినియొక్క; లోచనగోళంబులన్ = కనుగ్రుడ్లయందు; చిమ్మలై = చిన్న చిన్న బొట్లుగా వెడలినవై; చిలుపలై = కొంచెపుఁబడియలై - కొంచెము కొంచెముగాఁ బల్లపుఁదావులందు నిలిచినవై; జాలై = పిమ్మటఁ బ్రవాహమై; తరంగంబులై = కరళ్లయి; చనుదోయిన్ = స్తనద్వయమునందలి; గొనబౌ = అందమైన; కురంగమదచర్చల్ = కస్తూరిపూఁతలు; జాఱిపోన్ = కరఁగి పోవునట్లు; ఒక్క మెండునన్= ఒకటే యతిశయముతో - మిక్కిలి హెచ్చి (పా. ఒక్క యొడ్డునన్ = ఒక్క పూనికతో); బాష్పాంబు ఝరంబులు = కన్నీళ్లవెల్లువలు; పోటుంబాటు = పొంగుచు, నడఁగుచు నుండునట్టివి; కాన్ = కాఁగా; ఎంతయున్ = మిక్కిలి; ఉప్పతిలెన్ = పుట్టెను - కలిగెను.

తా. ప్రవరరూపము ధరించిన యా గంధర్వుఁడు తాను దనయూరికిఁ బోవలె నని చెప్పిన మాట చెవి సోఁకఁగానే వరూథినికి దుఃఖాతిశయముచేత దేహము పరవశమైపోవుటయేకాక, కన్నులనీళ్లు క్రమక్రమముగా హెచ్చి వెల్లువగాఁ బాఱసాగెను. ఆమె మిక్కిలి శోకించె నని భావము. అలం. సారము.

క. అత్తఱి గంధర్వవిభుం, డత్తామరసాక్షివదన మక్కునఁ గృపతో
నొత్తి మొగమెత్తి యశ్రులు, మెత్తనఁ గొనగోరఁ బాఱమీటుచుఁ బలికెన్.

1, మాసి. పా.

టీ. అత్తఱిన్ = ఆ సమయమునందు; గంధర్వవిభుండు=ఆ గంధర్వశ్రేష్ఠుఁడు; అశ్రూమరసాక్షివదనము = ఆ వరూథినియొక్క ముఖమును; కృపతోన్ = దయతో; అక్కునన్ = తనఱొమ్మునందు; ఒత్తి = చేర్చి యదిమిపట్టుకొని; మొగమెత్తి = వెంటనే దాని మొగమును దన చేతితోఁ బైకెత్తి; అశ్రులు = కన్నీళ్లు; కొనగోరన్ = తనవ్రేలిగోటికొనతో; మెత్తనన్ = మెత్తఁదనముతో - గోరు తగిలి నొవ్వకుండునట్లు; పాఱమీటుచున్ = దూరముగాఁ దొలఁగునట్లుగఁజిమ్ముచు; పలికెన్ = (ఒకమాట) చెప్పెను.

తా. అప్పుడా గంధర్వుఁడు వరూథినిదుఃఖము చూచి జాలిగొని దయతో దానిముఖము తన ఱొమ్మున నదిమిపట్టి యూఱడించి, యంతట మెల్లఁగా మొగమెత్తి పట్టుకొని కన్నీళ్లు దుడుచుచు దానిదుఃఖ ముపశమించున ట్లొకమాట చెప్పెను.

శా. ధీరస్వాంతవు; వంత నీకుఁ దగునే? దివ్యాంగనల్ కోవిదల్
గారే? యోగ వియోగముల్ సతములే? కర్తవ్యముల్ సేయరే?
పోరే రారె ప్రియంబు గల్గినజనుల్? పోరామి పోఁ బోవునే?
పోరాకుండఁగ నేమి [1]కాళ్లు దెగనే? ఫుల్లాంబుజాతేక్షణా! 138

టీ. ఫుల్లాంబుజాతేక్షణా! = వికసించినతామరలవంటి కన్నులుగలదానా! - వరూథినీ! ధీరస్వాంతవు = నీవు తాలిమితోడి మనస్సుగలదానవు. నీకున్ = నీవంటిదానికి; వంత= విచారము; తగునే? = యుక్తమగునా? దివ్యాంగనల్ = దేవతాస్త్రీలు; కోవిదల్ = మిక్కిలి వివేకము గలవారు; కారే? = కారా? - అగుదురు. యోగవియోగముల్= కూడుటలు నెడఁబాయుటలును; సతములే?= శాశ్వతములా? కర్తవ్యముల్= తప్పక చేయఁదగినపనులను; చేయరే? =(లోకు లెవ్వరును) చేయరా? - చేయనే చేయుదురు. ప్రియంబు = ప్రేమ; కల్గినజనుల్= కలిగినమనుష్యులు; పోరే? = పోవలసిన తావులకుఁ బోరా? రారె? = రావలసిన తావులకు రారా? పోరామి = కలిగినస్నేహము; పోన్ = ఎక్కడికైనఁ బోయినమాత్రముచేతనే; పోవునే? = మరలిపోవునా? ఎక్కడఁబోయినను మనసునఁ గల ప్రీతి మాన దనుట. పోరాకుండఁగన్ = పోవలసినచోటికిఁ బోక, రావలసినచోటికి రాకయుండుటకు; ఏమి? = కారణ మేమి? కాళ్లుతెగనే? = కాళ్లేమైనఁ దెగిపోయినవా? (పా. గళ్లు తెగనే = మేరలు - సంబంధములు విడిపోయెనా?)

తా. ఓ ప్రియురాలా! నీవు తాలిమి గలదానవు. దేవతాస్త్రీవి. దేవతాస్త్రీలు మిక్కిలి తెలిసినవారందురు. అట్లుండ నీ వింతదుఃఖపడుట తగదు. ఒకరితో నొకరు కూడుకొనుటయు నెడఁబాయుటయు శాశ్వతములు కావు. నేఁడు కూడను వచ్చును. రే పెడఁబాయను వచ్చును. చేయవలసినయవశ్యకార్యముల నెవరు చేయకుందురు? ప్రేమగలతావులకుఁ బోవలసినప్పుడు పోవుటయు, రావలసినప్పుడు వచ్చుటయు నాకే కా దెల్లవారికి సహజములు. పనిగలిగి యెక్కడనైనఁ బోయినమాత్రముచేతనే, మనసునఁగల ప్రేమయుఁ బోఁబోదు. ఇల్లు విడిచి కదలక యున్నచోటనే యుండుటకు మనము కాళ్లుదెగిన కుంటివారమా? కాము. కనుక నే నిప్పుడు మాయూరికిఁ బోవుట నీతోడిసంబంధమును వదలుకొని పోవుటగా నెంచవలదు. నీయందు నాకుఁగలప్రేమ నన్నక్కడ నిలువనిచ్చునా? అలం. అప్రస్తుతప్రశంస.

---

1. గళ్లు. పా.

తే. మూలముట్టుగఁ దెల్పె న య్ముని వరుండు, ప్రార్థితుండయి నాకు న య్పర
వచ్చుచును బోవు చుండెద వదల నిన్నుఁ,శుకకలాలాప! నన్నుఁ ద్రికశుద్ధి

టీ. శుకకలాలాప ! = చిలుకవలె నవ్యక్తమధురస్వరముతో మాటలాడునట్టిదానా
థినీ ! అమ్మునివరుండు = (నాకు ముందు పాదలేప మిచ్చిన) యా సిద్ధుఁడు; ప్రార్థితుం
నా చేత వేఁడుకోఁబడినవాఁడై; అప్పరమవిద్యన్ = ఉత్తమమైన యా విద్యను - పాద
నిచ్చవచ్చినచోటికిఁ బోవు విద్యను; మూలముట్టుగన్ = సమగ్రముగా; తెల్పెన్ =
జేసెను. వచ్చుచును బోవు చుండెదన్ = నేను వలసినప్పుడెల్ల నిచ్చటికి వచ్చుచుండెదను
బోవుచుండెదను. నిన్నున్; వదలన్. నన్నున్; త్రిశుద్ధిన్ = త్రికరణశుద్ధిగా; నమ్ము =

తా. ఓ వరూథినీ ! నేను మునుపటి యా సిద్ధునిఁ బ్రార్థించి, యాయనవలనఁ బా
బసరు రాచుకొని వలసినచోటికిఁ బోవునట్టి విద్యను సమగ్రముగాఁ దెలిసికొన్నాను. ఇఁ
దలఁచుకొన్నప్పు డెల్ల నీ యొద్దకు వచ్చుచు, మరల మాయూరికిఁ బోవుచు నుండెదను
వదలఁజాలను. నామాట ముమ్మాటికి నమ్ముము.

తే. అని వరూథిని నూరార్చి యచటువాసి,పోయెఁ దనయిచ్చ గంధర్వపుంగ
తప్పరాదు ఋణానుబంధంబు దెగినఁ, బ్రాణపదమైన వలపును బాసి

టీ. అని = ఇట్లు నమ్మఁదగినమాటలు చెప్పి; వరూథినిన్; ఊరార్చి = ఊఱడించి;
పుంగవుండు = గంధర్వశ్రేష్ఠుఁడు; అచటు వాసి = ఆ చోటు విడిచి; తనయిచ్చన్ = త
చొప్పున; పోయెన్. ఋణానుబంధంబు = పూర్వజన్మమునందలి యప్పు ననుసరించిన సం
తెగినన్ = తెగిపోయినచో - తీఱినచో; ప్రాణపదమైన = ప్రాణస్థానమయినట్టి - ప్రా
సమానమైన; వలపును = మోహముగూడ; పాసి చనదె ? = తొలఁగిపోదా ? - పో
తప్పరాదు = ఈ విషయముఁ దప్పించుకొన శక్యము కాదు.

తా. ఆ గంధర్వుఁడు తాను మరల వత్తునని నమ్మునటుఁ దగినమాటలు చెప్పి,
నూఱడించి, తన యిచ్చచొప్పునఁ బోయెను. ఎంత మోహము గలిగియున్నను ఋణాను
తీఱినప్పుడు తనకుఁ దానే యా మోహము తొలఁగిపోవును. అలం. అర్థాంతరన్యాసము.

వ. అనుటయుం దరువాతివృత్తాంతంబు గృపాయత్తంబగు చిత్తంబున
వలయు నని యడుగుటయును.

టీ. అనుటయున్ = అని పక్షులు చెప్పఁగానే; తరువాతి వృత్తాంతంబు = అ
సమాచారమును; కృపాయత్తంబగు = దయకు నధీనమయిన - దయగలిగిన; చిత్తం
మనసుతో; ఆనతీవలయున్ = సెలవియ్యవలెను - చెప్పవలెను; అని యడుగుటయు
యడిగినతోడనే. దీనికి నాలవ యాశ్వాసము మొదటి "ఇట్లనియె" నను క్రియతో నన్వ

శా. హిందూరాజ్యరమాధురంధరభుజా హిగ్రామణీకంచుక
త్కుండస్వచ్ఛయశోగుళుచ్ఛ ! యవన క్షోణీధవస్థాపనా
మందీభూతకృపాకటాక్ష ! యసకృ న్మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహవిగాహితోత్తరకకు ద్ధాటీసమాటీకనా !

టీ. హిందూ...గుళుచ్ఛ! - హిందూరాజ్య = హిందూదేశ ప్రభుత్వముయొక్క; రమా = సంపదయొక్క; ధురంధర = భారమును వహించిన; భుజ = బాహువనెడి; అహిగ్రామణీ = సర్పశ్రేష్ఠునకు - ఆదిశేషునకు; కంచుకత్ = కుబుసమువలె నాచరించుచున్న - కుబుసమగుచున్న; కుంద = మొల్లపువ్వులవలె; స్వచ్ఛ = తెల్లనైన; యశః = కీర్తియనెడు; గుళుచ్ఛ! = పూగుత్తిగలవాఁడా! యవన...కటాక్ష! - యవనక్షోణీధవ = అరబ్బీరాజుయొక్క; స్థాపన = ప్రతిష్ఠయందు - సింహాసనమునం దెప్పటివలె నిలుపుటయందు; అమందీభూత = చొరవగలదైన; కృపా=దయతోఁగూడిన; కటాక్ష! = కడగంటి చూపుగలవాఁడా! అసకృత్...సమాటీకనా! - అసకృత్ = మాటిమాటికి; మాద్యత్ = మదించుచున్న; కళింగ = కళింగదేశపురాజుయొక్క; అంగనా = స్త్రీలయొక్క; బందీగ్రాహ = చెఱఁగా గ్రహించుటయందు - చెఱఁబెట్టుటయందనుట; విగాహిత = ప్రవేశింపఁజేయఁబడిన; ఉత్తరకకుప్ = ఉత్తరపుదిక్కునందలి; ధాటీ = యుద్ధయాత్రయొక్క; సమాటీకనా! = ప్రయత్నముగలవాఁడా! (ఇది కృతికర్తయైన కృష్ణరాయనికి సంబోధనము.)

తా. ఆదిశేషుఁడు భూభారమును వహించినట్లు బాహుబలముచేత హిందూదేశప్రభుత్వభారమును వహించి కీర్తి పొందినవాఁడవును, లోఁబడి వచ్చిన యవనదేశపు నవాబును వాని రాజ్యమునందు స్థిరముగా నిలిపినవాఁడవును, పలుమా ఱుత్తరపుదిక్కునకు దండెత్తిపోయి మదించి యెదిరించిన కళింగరాజును గెలిచి, వాని స్త్రీలను జెఱలోఁబెట్టినవాఁడవు నైన కృష్ణరాయప్రభూ! అలం. ఉపమ.

క. తిరుమలదేవీచరణో, దరలాక్షాకల్పకల్పి ♦ తస్థలకమల
స్ఫురదిందీవరబంధుర, హరిహయమణివలయకూట ♦ హర్మ్యవిహారీ! 143

టీ. తిరుమల...విహారీ! - తిరుమలదేవీ = తిరుమలదేవి యనెడి ప్రియభార్యయొక్క; చరణోదర = కాలియడుగులందు; లాక్షాకల్ప = లత్తుకచేఁ జేయఁబడిన యలంకారముచేత; కల్పిత = కలుగఁజేయఁబడిన; స్థలకమల = మెట్టదామరలయందు; స్ఫురత్ = ప్రకాశించుచున్న; ఇందీవర = నల్లగలువలవలెనే; బంధుర = ఒప్పిదమైన; హరిహయమణి = ఇంద్రనీలమణులచే నయిన నెలకట్లుగల; వలయ = గుండ్రనైన; కూటహర్మ్య = యంత్రములతోఁగూడిన మేడయందు; విహారీ! = విహరించువాఁడా!

తా. పట్టపురాణియైన తిరుమలదేవి పాదములం దలంకారముగాఁ బూసికొన్న లత్తుకయుండుటచేత గుండ్రము గుండ్రముగాఁ గట్టఁబడిన యింద్రనీలముల నెలకట్టుతావులు మెట్టదామరల నడుమ నల్లగలువలు గూడి వెలుఁగునట్లు వెలుఁగుచుండెడి మేడయందు విహరించువాఁడా! (ఇంద్రనీలములు దాపిన నెలకట్టులలో తిరుమలదేవి కాలిలత్తుకలేఖ లంటినచోట్ల మెట్టదామరలవలెను, అది యంటనితావులు నల్లగలువలవలెను నుండెనని యెఱుంగునది.) అలం. ఉదాత్తము.

ఉత్సాహ. వర్ణనీయకీర్తివైభ ♦ వా! ప్రభూతభూతిదృ
క్కర్ణకుండలా! వితీర్ణి ♦ కర్ణ! దీర్ణహృద్భ్రమ
ద్ఘూర్ణయారిమానహారి! ♦ దుర్భరానకార్భటీ
ఘూర్ణమాన కొండపల్లి ♦ కొండవీటిమండలా! 144

టీ. వర్ణనీయ...వైభవా! - వర్ణనీయ=పొగడఁదగిన; కీర్తి = యశస్సుయొక్క; కలిమిగలవాఁడా! ప్రభూత...కుండలా! - ప్రభూత = అధికమైన; భూతి = ఐశ దృక్కర్ణ = చక్షుశ్శ్రవస్సులే - పాములే; కుండలా! = కర్ణాభరణములుగాఁగల శివు వలె అష్టైశ్వర్య సంపన్నుఁడా! యనుట. వితీర్ణికర్ణ! = దాతృత్వమునందుఁ కర్ణుఁ దీర్ణ...మానహారి! దీర్ణ = పగిలిన; హృత్ = గుండెలు గలిగి - గుండెలు పగిలినవారై తిరుగుచున్న; దుర్ణయ = దుర్నీతిపరులయిన; అరి = శత్రువులయొక్క; మాన హారి! = హరించినవాఁడా! దుర్భరా...మండలా! - దుర్భర = భరింపశక్యముగాని; యొక్క; ఆర్భటీ = ధ్వనిచేత; ఘూర్ణమాన = తిరుగుడు వడుచున్న; కొండప మండలా! = కొండపల్లి, కొండవీడు (వీనితోఁజేరిన) భూభాగము గలవాఁడా!

తా. పొగడఁదగిన కీర్తిసంపదయు, మిక్కుటమయిన యైశ్వర్యసమృద్ధియుఁ గ మాత్రముచేతనే కొండపల్లి, కొండవీడు దుర్గముల నేలెడి రాజులను గుండెలు పగి చేయువాఁడా!

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజ బుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోపత దాసాదిత చతుర్విధ కవితామతల్లి కాల్లసాని చొక్కయామ పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహా నందుఁ దృతీయాశ్వాసము.

ఈ గద్యమునకు నర్థము ప్రథమాశ్వాస గద్యమునకుంబోలె గ్రహించునది.



# స్వారోచిష మనుచరిత్రము

## టీకా తాత్పర్య సహితము

### చతుర్థాశ్వాసము



కృష్ణరాయ ! గుణర
త్నాకల్పా ! కల్పకద్రుమాధికదాన
శ్రీకుతుకాగతలోకా !
లోకాంతరసకలసుకవిలోకస్తుత్యా ! 1

టీ. శ్రీ కృష్ణరాయ! గుణరత్నాకల్పా! - గుణ = మంచిగుణములనెడి; రత్న = మణులే; ఆకల్పా!= అలంకారముగాఁ గలవాఁడా! కల్పక...స్తుత్యా! - కల్పక = కల్పక మనెడి; ద్రుమ= (దేవ) వృక్షమునకంటె; అధిక = హెచ్చైన; దానశ్రీ = ఈవికలిమియందలి; కుతుక = వేడుక చేత; ఆగత = వచ్చిన; లోకాలోక = చక్రవాళపర్వతముయొక్క; అంతర = మధ్యభాగము నందుఁగల; సకల = సమస్తమయిన; సుకవి = సత్కవులయొక్క; లోక = సమూహముచేత; స్తుత్యా ! = స్తోత్రముచేయఁదగినవాఁడా! (అని కృతిపతికి సంబోధనము. ముందు వచ్చెడి 'అవధరింపుము' అను క్రియతో నన్వయము.)

తా. సమస్తసద్గుణములును గలిగి కల్పవృక్షముకంటె హెచ్చుగా దానము చేయువాఁడవై, చక్రవాళ పర్వతముచే నావరింపఁబడిన భూమండలమునందుఁ గల యెల్ల సత్కవులును బరివేష్టించి పొగడుచుండఁగా నొప్పునట్టి శ్రీ కృష్ణదేవరాయఁడా! (చక్రవాళ మనెడి పర్వతము సర్వభూమండలమును గోటవలెఁ జుట్టుకొనియుండు నందురు.)

వ. అవధరింపుము జైమినిమునీంద్రునకుఁ బతంగపుంగవంబు లిట్లనియె. 2

తా. అవధరింపుము = చిత్తగింపుము - వినుము; జైమినిమునీంద్రునకున్ = జైమినిముని శ్రేష్ఠునితో; పతంగపుంగవంబులు = పక్షిశ్రేష్ఠములు; ఇట్లనియెన్ = ఈ రీతిగాఁ జెప్పెను.

సీ. మున్ను విప్రాకారమునఁ గూడుచో శంకఁ, గనుమూయఁబని చెనా ఖచరభర్త;
యవ్వరారోహయు నాసక్తగావున, నిచ్చలో నటు సేయ నియ్యకొనియె;
నా ప్రతిజ్ఞాపూర్తి యయ్యెఁ దనంత న, వ్వనితకు రతిపార వశ్యపటిమ;
నపుడు తత్ప్రియవరదేహసమిద్ధశిఖిదీప్తి, శాంబరీమహిమచే సంగ్రహించి
తే. నట్టి గంధర్వమూర్తిసాఖ్యానుభూతిఁ, జలనమేదినమానసాబ్జమున నిలువ
నెలసెఁ దేజోమయంబైన వృద్ధి నట్టి,మేటిగర్భంబు; నెలలు తొమ్మిదియు నిండె.

టీ. మున్ను = మునుపు; విప్రాకారమునన్ = బ్రాహ్మణరూపముతో; కూడుచోన్ = సంగమము చేయునప్పుడు; శంకన్ = (తనవాస్తవస్వరూపము వెల్లడియగుననెడి) సందేహముచేత; ఆ ఖచరభర్త = (ప్రవరరూపము ధరించిన) యా గంధర్వశ్రేష్ఠుఁడు; కనుమాయన్ = కన్నులు మూసికొనునట్లు; పనిచెన్ = నియమించెను. అవ్వరారోహయున్ = ఆ వనితయును - వరూథిని యును; ఆసక్త = తత్పరురాలు; కావునన్ = కనుక; అటు సేయన్ = అతఁడు చెప్పినట్టు కన్నులు మూసికొనుటకు; ఇచ్చలోన్ = తన మనసునందు; ఇయ్యకొనియెన్ = ఒప్పుకొనెను. అవ్వనితకున్ = మిక్కిలి యనురాగముగలదైన యా వరూథినికి; రతిపారవశ్యపటిమన్ = సంభోగమునందలి పరవశత్వముయొక్క సామర్థ్యముచేత; తనంతన్ = తనకుఁదానే; ఆ ప్రతిజ్ఞాపూర్తి = కన్నులు మూయుట యనెడి యా ప్రతిజ్ఞ నెఱవేఱుట; అయ్యెన్ - సంభోగసుఖమువలని చొక్కుచేఁ దనకుఁ దానే కన్నుఁగవ మూఁతపడిపోయె ననుట. అపుడు = ఆ సమయమునందు - రతిసమయమునందు; తత్ప్రవర...దీప్తిన్ - తత్ప్రవర = ఆ ప్రవరునియొక్క; దేహ = శరీరమునందు; సమిద్ధ = మిక్కిలి వెలుఁగుచున్న; శిఖిదీప్తిన్ = అగ్ని తేజస్సువంటి తేజస్సును; శాంబరీమహిమచేన్ = మాయాప్రభావముచేత; సంగ్రహించినట్టి గంధర్వమూర్తి = తనయందుఁ బొందించుకొన్న గంధర్వుని యాకృతి; సౌఖ్యానుభూతిన్ = సుఖానుభవముచేత; చలనము = చంచలత్వము; ఏదిన మానసాబ్జమునన్ = లేని మనఃకమలమునందు; నిలువన్ = నిలువఁగా; అట్టి మేటిగర్భంబు = ఆ ప్రవరుని రూపమువంటి రూపముతో నిలిచిన శ్రేష్ఠమయిన గర్భము; తేజోమయంబైన = తేజోరూపమయినట్టి; వృద్ధిన్ = పెంపుచేత; వెలసెన్ = వెలుఁగొందెను. (అంతట) నెలలు తొమ్మిదియున్ = తొమ్మిది నెలలును; నిండెన్ = పూర్తియయ్యెను.

తా. మునుపు చెప్పినచొప్పునఁ బ్రవరుని రూపము ధరించిన గంధర్వుఁడు తన కామరూపధారణము బయలుపడు నను సందేహముచేత వరూథిని సంభోగకాలమునందుఁ గన్నులుమూయునట్లు నియమించిన నియమ మక్కఱలేకయే క్రీడాసమయమునందలి పరవశత్వముచేత వరూథినికన్నులు తమంతనే మూఁతపడిపోయె ననియు, నట్టి సంగమముచేత ధరించిన గర్భము మిక్కిలి తేజస్సుతో వెలుఁగఁగాఁ దొమ్మిదినెలలు నిండె ననియుఁ దాత్పర్యము. అలం సమాధి.

వ. అనంతరంబ యొకానొక పుణ్యదివసంబున. 4

టీ. అనంతరంబ = తొమ్మిదినెలలు నిండినతోడనే; ఒకానొక పుణ్యదివసంబునన్ = ఒక శుభదినమునందు.

శా. తేజం బబ్జభవాండ గేహమునకున్ దీపాంకురచ్ఛాయమై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁ జేరం బోని లగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁ గాంచె సుమనో రాజన్యమాన్యుల్ జనుల్
జేజేవెట్టఁ బ్రసూనవర్ష మమర శ్రేణుల్ ప్రవర్షింపఁగన్. 5

టీ. గ్రహపంచకంబు=ఐదు గ్రహములు-అంగారకుఁడు, చంద్రుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, శనైశ్చరుఁడు అను నీయైదు గ్రహములును; రవిన్ = సూర్యుని; చేరంబోని లగ్నంబునన్ = చేరకయుండెడి లగ్నమునందు; సూర్యునిఁజేరుట యనఁగా సూర్యుఁ డున్న రాశిలోఁ జేరుట. అట్లు చేరుటకే యస్తమయ మని పేరు. అంగారకాది గ్రహములకు అస్తమయదోషములేనిలగ్నమందని యర్థము. (అస్తమయదోషము గల గ్రహములు శుభఫలము నియ్యవనుట జ్యోతిశ్శాస్త్రసంప్ర

దాయము.) రాజీవాక్షి = తామరలవంటి కన్నులుగలది - వరూథిని; తేజంబు = తేజస్సు-దేహము యొక్క ప్రకాశము; అబ్జభవాండగేహమునకున్ = బ్రహ్మాండ మనెడి యింటికి; దీపాంకుర చ్ఛాయయై = దీపపుమొలకయొక్క వెలుఁగై; రాజిల్లన్ = ప్రకాశింపఁగా; జనులు = ప్రజలు; జేజే వెట్టన్ = జయజయ యని వినుతింపఁగా; అమరశ్రేణుల్ = దేవతాసమూహములు; ప్రసూన వర్షము = పువ్వులవాన; ప్రవర్షింపఁగన్ = కురియింపఁగా; సుమనోరాజన్యమాన్యున్ = దేవరాజయిన యింద్రునిచే గౌరవింపఁదగినవానిని; కుమారున్ = కొడుకును; కాంచెన్ = కనియెను.

తా. వరూథిని యొకానొక శుభదినమునం దంగారకాదిగ్రహము లైదింటికి నస్తమయదోషము కలుగని మంచిలగ్నమునందు మిక్కిలి తేజస్సు కలిగి వెలుఁగువాఁడును, దేవేంద్రుఁడుగూడ గౌరవించుటకుఁ దగినవాఁడును నైన కుమారునిఁ గనియెను. అప్పుడు జను లందఱును జయ జయ యని పొగడసాగిరి. దేవతలు పువ్వులవానఁ గురియించిరి. అలం. రూపకము, ఉపమయు.

క. స్వరుచిస్ఫురణను శశిభా, స్కరపావకతారకాప్ర కాశము లెల్లన్
విరళములు సేయ నతనికి, స్వరోచి యను నామ మిడి ర చటి మును లెల్లన్. 6

టీ. స్వరుచిస్ఫురణను = తనతేజస్సుయొక్క ప్రకాశముచేత; శశి...ప్రకాశములు - శశి = చంద్రునియొక్కయు; భాస్కర = సూర్యునియొక్కయు; పావక = అగ్నియొక్కయు; తారకా = నక్షత్రములయొక్కయు; ప్రకాశములు = వెలుఁగులను; ఎల్లన్ = అన్నిటిని; విరళములు = ఎడమైనవిగా - అణఁగినవి యగునట్లుగా; చేయన్ = చేయుటచేత; అతనికిన్ = ఆ కనిన కుమారునికి; అచటిమును లెల్లన్ = అక్కడ నున్న ఋషులందఱును; స్వరోచి = తనకాంతి గలవాఁడు; అను నామము = అనెడి పేరు; ఇడిరి = పెట్టిరి - అనఁగా లోకమునందుఁ దేజోరూపములైన చంద్రసూర్యాదుల ప్రకాశములనెల్ల నణఁచివేయఁజాలి వెలుఁగునట్టి తేజస్సుయొక్క ప్రకాశము గలవాఁడగుటచేత నచ్చట నున్న మును లా కుమారునికి స్వరోచి యని పేరు పెట్టి రనుట. అలం. అతిశయోక్తి.

చ. మఱియు నతండు సంయమిస మాజవినిర్మితజాతకర్ముఁడై
నెఱిఁ బరివర్ధితుండు నుప నీతుఁడునై వివిధాయుధంబులం
గఱకరి యై రణస్థలుల గద్దఱియై నిగమార్థవేదియై
నెఱతనకాఁడునై మెఱసె నిర్మలకాంతివిలాసరేఖలన్. 7

టీ. మఱియున్ = వెండియు; అతఁడు = ఆ వరూథినికొడుకు; సంయమి...కర్ముఁడై - సంయమి = మునులయొక్క; సమాజ = సమూహముచేత; వినిర్మిత = చేయఁబడిన; జాతకర్ముఁడై = జాతకర్మముగలవాఁడై (జాతకర్మము=బిడ్డపుట్టినప్పుడు చేసెడి వేదవిహితక్రియ); నెఱిన్ = క్రమముతో; పరివర్ధితుండును = చక్కఁగా వృద్ధిఁబొందింపఁబడినవాఁడును; ఉపనీతుఁడునై = వడుగు చేయఁబడిన వాఁడునై; వివిధాయుధంబులన్ = నానావిధములైన యాయుధములందును - ఎల్ల యాయుధముల సాధనము చేయుటయందును; కఱకరియై = సమర్థుఁడై; రణస్థలులన్ = యుద్ధరంగములయందు; గద్దఱియై = దిట్టతనముగలవాఁడై - చలింపనివాఁడై; నిగమార్థవేదియై = వేదార్థముల నెఱిఁగినవాఁడై; నెఱతనకాఁడునై = వ్యాపకుఁడునై - అన్నిటికిని దీర్పరియై; నిర్మల...రేఖలన్ - నిర్మల = స్వచ్ఛమైన; కాంతి = లావణ్యముచేతను; విలాస = శృంగారచేష్టలయొక్క; రేఖలన్ = రీతులచేతను; మెఱసెన్ = ప్రకాశించెను.

తా. స్వరోచి యనఁబరగి యా వరూథినికొడుకు తన కచ్చట నున్న మునులు జాతకర్మమును, ఉపనయనమును జేసి, శస్త్రాస్త్రవిద్యల నేర్పి, యన్నిటియందును సమర్థునిగాఁ జేయఁగా, యౌవనవంతుఁడయి యుద్ధములయందు గడిదేఱి, వేదాంతార్థము లెఱిఁగి, యెల్ల న్యాయములు విచారించి తీర్పులు చేయ నేర్చి, సర్వవిధము లయిన శృంగారచేష్టలతోను వెలసెను.

స్రగ్ధర. గ్రుద్దున్ గోత్రాచలంబుల్ గులగుల లయిపో గోతముల్ గ్రుద్దులీలన్;
[1]ఖడ్డిం జెండాడు మ్రాఁకుల్ కవుఁగిటికొలఁదుల్ కత్తి నొక్కొక్క ఘాతం;
బ్రోద్దామప్రౌఢి వాతా ద్భుతగతిఁ బఱచున్ భూమి జవ్వాడఁగా; ని
ట్లద్దేవీనందనుం డ త్యనుపమబలుఁడై యౌవనారంభవేళన్. 8

టీ. గోత్రాచలంబుల్ = కులపర్వతములు; గులగులలయిపోన్ = పొడిపొడి యైపోవునట్టుగా; గోతముల్ = ఱా లుంచి కట్టిన జనపనారసంచులను; గ్రుద్దులీలన్ = పడికిలితోఁ బొడుచునట్లు; గ్రుద్దున్ = పిడికిటితోఁ బొడుచును. (జెట్టీలు సాధనము చేయునపుడు జనపనారసంచులలో ఱాలు పోసి కట్టి పిడికిళ్లతోఁ బొడుతురు.) కవుఁగిటి కొలఁదుల్ = కౌఁగిలించి పట్టవలసినంత లావుగలవైన; మ్రాఁకుల్ = వృక్షములను; ఖడ్డిన్ = బలముతోడి పూనికతో; కత్తిన్ = కత్తితో; ఒక్కొక్క ఘాతన్ = ఒక్కొక్క దెబ్బచేతనే; చెండాడున్ = తునుకలు తునుకలుగా నఱికివేయును. భూమి = నేల; జవ్వాడఁగాన్ = అదిరి వణఁకఁగా; ప్రోద్దామప్రౌఢిన్ = కొఱఁతలేని సామర్థ్యముచేత; (పా. ప్రోద్దామక్రీడన్ = హెచ్చయిన యాట్లాటయందు) వాతాద్భుతగతిన్ = గాలియొక్క వింతయయిన వడివంటి వడితో; పఱచున్ = పరుగెత్తును. ఇట్లు = ఈ విధముగా; అద్దేవీనందనుండు = ఆ దేవతాస్త్రీ కొడుకు - స్వరోచి; యౌవనారంభవేళన్ = యౌవనదశరా నారంభించినపుడు; అత్యనుపమబలుఁడై = సరిపోల్పరాని మిక్కుటమయిన దేహబలము గలవాఁడై. క్రింది పద్యముతో నన్వయము.

తా. ఈ విధముగాఁ బెరిఁగిన యా వరూథినికొడుకు యౌవనదశ వచ్చుచుండఁగానే సరిపోల్పరాని బలముగలవాఁడై జెట్టీలు సాధనకై ఱాలగోతములను గ్రుద్దునట్లు కులపర్వతములను గ్రుద్ది పొడిపొడి చేయుచుండు ననియు, కౌఁగిట నణఁగనంత లావుగా బలిసిన మ్రాఁకుల నొక్కొక్క దెబ్బకే తునుకలై పడునట్లు కత్తితో నఱకు ననియు, భూమి యదురునట్లు మితిలేని వేగముతోఁ బరుగెత్తుననియుఁ దాత్పర్యము. అలం. ఉపమ, అతిశయోక్తియును.

క. వేదండముతొండముసరి, కోదండముఁ దివియు నెడమఁ గుడి నిబిడజ్యా
నాదము రోదసి నిండఁగ, భేదించున్ గండశిలలఁ బృథుబాణములన్. 9

టీ. (మఱియు నతఁడు) వేదండము...కోదండము - వేదండము = ఏనుఁగుయొక్క; తొండముసరి = తొండముతో సమానమైన; కోదండమున్ = వింటిని; ఎడమన్ = ఎడమవైపునను; కుడిన్ = కుడివైపునను; నిబిడజ్యానాదము = అధికమైన యల్లెత్రాటిధ్వని; రోదసిన్ = భూమ్యాకాశముల యంతరాళమునందు; నిండఁగన్ = వ్యాపింపఁగా; తివియున్ = ఆకర్షించును. గండశిలలన్ = కొండలమీఁదినుండి నేలకు దొర్లిన పెద్ద గుండ్లను; పృథుబాణములన్ = గొప్ప బాణములచేత; భేదించున్ = పగులనేయును. అనఁగా నేనుఁగుతొండమువలె లావైన వింటిని సవ్యాపసవ్యగతులఁ దివిచి యెల్లయెడల నిండుకొనునట్లు ధనుష్టంకారము చేయు ననియు, గొప్ప బాణములను

1. గ్రద్దన్. పా.

ప్రయోగించి పెద్ద పెద్ద రాతిగుండ్లను బగులఁగొట్టు ననియుఁ దాత్పర్యము. అలం. ఉపమ, అతిశయోక్తియును.

క. అతఁడు మఱి తనకు మంథ, క్షితిభృత్తటి విశ్వకర్మ చేసిననగరిన్
వితతాటవికచమూసే, వితుఁడై సామ్రాజ్య మనుభవింప నొకతఱిన్. 10

టీ. అతఁడు = ఆ స్వరోచి; మఱి = మఱియును; తనకున్ = తనకై; మంథక్షితిభృత్తటిన్ = కవ్వపుఁగొండచఱియయందు; విశ్వకర్మ = దేవశిల్పి; చేసిననగరిన్ = నిర్మించిన పట్టణమునందు; వితత...సేవితుఁడై - వితత = విస్తారమయిన; ఆటవిక = అడవియందుండెడి బోయలయొక్క; చమూ = దండుచేత; సేవితుఁడై = కొలువఁబడినవాఁడయి; సామ్రాజ్యము = ప్రభుత్వైశ్వర్యమును; అనుభవింపన్ = అనుభవించుచుండఁగా; ఒకతఱిన్ = ఒకానొక సమయమునందు. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. ఆ స్వరోచి విశ్వకర్మచేత మందరపర్వతముచఱియయం దొక పట్టణము కట్టించుకొని, యందు బోయదండును జేర్చుకొని ప్రభుత్వము చేయుచుండెను. ఆ సమయమునందు.

క. కరకాచిటపటరవభీ, కరమై పెళపెళనినాద ఘనమై ఝంఝా
మరు[1]దంచితబిలమంద్ర, స్వరమై యక్కొండ నొక్క వర్షము గురిసెన్. 11

టీ. అక్కొండన్ = ఆ పర్వతమునందు; కరకా...కరమై - కరకా = వడగండ్లయొక్క; చిటపటరవ = చిటపట యనెడి ధ్వనిచేత; భీకరమై = భయంకరమై; పెళ...ఘనమై-పెళపెళ = పెళపెళయనెడి; నినాద = ధ్వనులతో నుఱుముచున్న; ఘనమై = మేఘములుగలదై; ఝంఝా...స్వరమై - ఝంఝామరుత్ = వానతోడి గాలిచేత; అంచిత = ఒప్పిదమైన; బిలగుహలయొక్క; మంద్రస్వరమై = గంభీరధ్వనిగలదై; ఒక్క వర్షము = ఒక వాన; కురిసెన్.

తా. మందరపర్వతమునందుఁ జిటపట ధ్వనులతో వడగండ్లు రాలఁగాఁ బెళపెళధ్వనులతో మేఘము లుఱుమఁగా వానతోడిగాలిచే గుహలు గంభీరమైన ప్రతిధ్వను లియ్యఁగా నొక్క వాన కురిసెను. అలం. స్వభావోక్తి.

క. తెలతెల వేగిన నగ్గిరి, జలజలఁ బ్రవహించుసెలల చప్పుళ్లు శిఖా
వలకుల కల కేకాకల, కలములు గల తలపొలంబు [2]గనుఁగొనువేడ్కన్. 12

టీ. తెలతెలవేగినన్ = (మీఁదఁ జెప్పినచొప్పున రాత్రియంతయు వాన కురిసి) తెల్లగాఁ దెల్లవాఱినతోడనే; అగ్గిరిన్ = ఆ కవ్వపుఁగొండయందు; జలజలన్ = జలజల యని; ప్రవహించు సెలలచప్పుళ్లు = పాఱుచున్న సెలయేళ్లధ్వనులును; శిఖావల...కలములు - శిఖావల = నెమిళ్లయొక్క; కుల = సమూహముయొక్క; కల = అవ్యక్తమధురములయిన; కేకా = కేకలయొక్క; కలకలములు = కోలాహలధ్వనులును; కల = కలిగినటువంటి; తలపొలంబున్ = కొండనెత్తపుభూమిని; కనుఁగొను వేడ్కన్ = చూడవలయు నను కుతూహలముతో. తర్వాతి పద్యముతో నన్వయము.

ఆ. అన్నగాగ్రమెక్కి యం దొక్కశశికాంత, వేదిఁ గతిపయాప్త వేష్టితుండుఁ
గుటజవిపినపవన నటదలకభరుండు, నగుచుఁ బ్రొద్దు జరపు నవసరమున.13

1. దుక్షిత. పా. 2. కనుగొన. పా.

M—27

టీ. అన్నగాగ్రము = ఆ కొండ చివర - ఆ కొండకొమ్మమీఁదననుట; ఎక్కి; అందున్ = ఆ కొండపేటునందు; ఒక్క శశికాంతవేదిన్ = చంద్రకాంతపుఱాలుపఱచిన యొక యరుఁగు మీఁద; కతి... వేష్టితుండున్ - కతిపయ = కొంతమంది; ఆప్త = కావలసిన మిత్రులచేత; వేష్టితుండున్=చుట్టుకోఁబడినవాఁడును; కుటజ...భరుండున్ - కుటజ= కొండమల్లెలయొక్క; విపిన= అడవిమీఁదుగా వచ్చుచున్న; పవన = గాలిచేత; నటత్ = కదలుచున్న; అలకభరుండున్ = ముంగురుల యతిశయముగలవాఁడును - మనోహరమైన ముంగురులు గలవాఁ డనుట; అగుచున్; ప్రొద్దు జరపు నవసరమునన్ = కాలము గడపుచుండునప్పుడు. తరువాతి పద్యముతో నన్వయము.

తా. అప్పు డా స్వారోచి యా కొండపై కెక్కి యచ్చటనున్న చంద్రకాంతపు ఱాల యరుఁగుమీఁదఁ గొండమల్లెల పరిమళముతోఁడి గాలి వీవఁగాఁ గావలసిన మిత్రులు కొందఱితోఁడఁ గూర్చుండి ప్రొద్దు పుచ్చుచుండునప్పుడు.

ఆ. ఒక్క యెఱుకుఱేఁడు నక్కకొమ్మును నిట్టి, గోఱజంబు జున్నుఁ జాఱపప్పుఁ
బీలిగఱులయంప కోలలు సెలవిండ్లుఁ, గాను కిచ్చి కరయుగంబు మొగిచి. 14

టీ. ఒక్క యెఱుకుఱేఁడు = ఒక గొప్ప బోయవాఁడు; నక్కకొమ్మును = (ఇతరులను వశముచేసికొనుట కనువైన) ఒక వనమూలికను;[1] ఇట్టిగోఱజంబున్ = కస్తూరియు; జున్నున్ = తేనెపెరయు; చాఱపప్పున్ = ఒకజాతి పప్పును; పీలిగఱుల యంపకోలలున్ = పికిలి పిట్టలయీఁకలు గట్టిన బాణములును; సెలవిండ్లున్ = సెలసుబద్దలవిండ్లును; కానుక = ఉపాయనము - నజరుగా; ఇచ్చి; కరయుగంబు మొగిచి = రెండు చేతులు జోడించి మ్రొక్కి. అనంతర పద్యముతో నన్వయము.

వ. యుగవిగమసమయసముద్భూతజీమూతపటలంబునుంబోలెఁ గైలాసగిరినితంబ
ప్రాంతకాంతారపర్యంత[2]నిరంతరయై కాఱుకొన్న యొక్క గహనరేఖం గరాం
గుళిఁ జూపి భూపతి కిట్లనియె. 15

టీ. యుగ...బోలెన్ - యుగవిగమసమయ = కృతత్రేతాది యుగములు ముగియుకాలము నందు - యుగప్రళయ సమయమునం దనుట; సముద్భూత = పుట్టిన; జీమూత = మేఘములయొక్క; పటలంబునుంబోలెన్ = సమూహమువలె; కైలాస...తరయై - కైలాసగిరి = వెండికొండయొక్క; నితంబ = మధ్యప్రదేశమునకు; ప్రాంత = సమీపమునందలి; కాంతారపర్యంత = అడవివఱకును; నిరంతరయై = ఎడతెగనిదై; కాఱుకొన్న...రేఖన్ - కాఱుకొన్న = దట్టముగాఁ బెరిఁగిన (కారుకొను = చీఁకటి క్రమ్ము అని కొందఱు); ఒక్క గహనరేఖన్ = ఒక యడవిచాలును; కరాంగుళిన్=చేతి వ్రేలితో; చూపి = కనఁబఱిచి; భూపతికిన్ = రాజుతో - స్వారోచితో; ఇట్లనియెన్.

తా. ప్రళయకాలమునందుఁ గలిగెడి నల్లమబ్బు చాల్పువలెనే కైలాసపర్వతముదాఁక దట్టపుఁదనముచేత నల్లగాఁ గానవచ్చుచున్న యొక యడవివరుసను రాజునకు వ్రేలితోఁ జూపి, యా యెఱుకు యీ మీఁదఁ జెప్పెడిరీతిగాఁ బలికెను. అలం. ఉత్ప్రేక్ష.

---

1. పూర్వవ్యాఖ్యాత లిచట 'ఒకజాతినక్కకు మనుఁబోతులకుఁబోలె నడినెత్తిని గొమ్ముండు నందురు. అట్టి నక్క కొమ్ము నని యర్థము.' అని యర్థమును వ్రాసిరి. ఆ యర్థము సంగత మగునట్లు తోఁచదు.

2. పర్యంతంబు నిరంతరంబై. పా.

క. అల్లదె కంటే? పొనపొన, దెల్లనిగట్టుంత మబ్బు ♦ దేఱెడు పొలమం
దెల్లెడఁ జూచిన ధరణీ, వల్లభ! సీరాముసేన ♦ వాలుమెకంబుల్. 16

టీ. ధరణీవల్లభ! = రాజా! అల్లదె! = అదిగో కనఁబడుచున్నది! కంటే! = చూచితివా? పొనపొన = చూపుఁజాయగా; తెల్లనిగట్టుంతఱ్ = వెండికొండకు దాపున; మబ్బుదేఱెడు పొలమందుఱ్ = చీఁకటి క్రమ్ముచున్న యడవియందు; చూచినఱ్ = చూడఁగా; ఎల్లెడఱ్ = అన్నిచోట్లను; వాలుమెకంబుల్ = క్రూరమృగములు (అడవిపందులని కొందఱు); సీరాముసేన = శ్రీరామునిదండు - అపరిమితము - అనఁగా అదిగో! వెండికొండ వెంబడి నల్లగ గనఁబడుచుండెడు నడవియందుఁ గ్రూరమృగములు లెక్కలేక యున్న వని తాత్పర్యము. అలం. లోకోక్తి.

సీ. కండూతికై రాయుఁ ♦ గర్కశంబగు తుంటిఁ
బీఁటవెట్టినమ్రాను ♦ పెల్లగిల్లఁ
జెవి దార్చి విని చీమ ♦ చిటు కన్న నొకసారి
[1]సెలవి వెంపరలాడు ♦ జిట్టలెల్లఁ
[2]జప్పరించువెదుళ్లు ♦ సట లుబ్బ దంష్ట్రాగ్ని
చొంగ పైఁబడి చుంయి ♦ చుంయి మనఁగఁ
జంద్రనిప్పులువ్రాలెఁ ♦ దీండ్రించుకనుమించు
లెనఁగ నొండొంటిపై ♦ నెక్కఁబాఱుఁ
తే. వెట్టదినముల మడుఁగుల ♦ మట్టి కలఁప
బుడబుడధ్వని వెడలు బు ♦ ద్బుదములందుఁ
జిలుపచిలుపనినేతులు ♦ జిడ్డుదేఱు
నేమి చెప్పుదుఁ? గ్రొవ్విన ♦ యేకలములు. 17

టీ. క్రొవ్విన యేకలములు = మదించిన యడవిపందులు; కండూతికై = దురదకై; కర్కశంబగు = బిరుసెక్కినట్టి; తుంటిఱ్ = పిఱుఁదుల క్రిందిభాగముచేత; పీఁటవెట్టినమ్రాను = తాను జక్కఁగా నూని కూర్చుండిన వృక్షము (పాదుకొన్న వృక్షము అని కొందఱు); పెల్లగిల్లఱ్ = పాదు కదలి వ్రేళ్లతో లేచునట్లు; రాయుఱ్ = రాచును. చీమచిటుకన్నఱ్ = చిటుక్కు మని చీమ చప్పుడు చేసినను - ఏమాత్రము ధ్వని గలిగిన ననుట; చెవి దార్చి = చెవి యొగ్గి - విని; ఒకసారి = ఒక్కసారిగానే; సెలవి = కోఱతోఁ జిమ్మి; జిట్టలెల్లఱ్ = వెదురువెన్ను లన్నిటిని; వెంపరలాడుఱ్ = చెదరఁగొట్టును. (పా. అటఁబాటి సెనవి వెంపరలాడుఁజెట్టులెల్లఱ్ = ధ్వనిగలిగిన దిక్కునకుఁ బరుగెత్తుచుఁ బోయి కోఱలతోఁ జెట్లనెల్ల నఱికి పీడించును.) సటలు = మెడమీఁది వెండ్రుకలు; ఉబ్బఱ్ = నిక్కకొనఁగా; దంష్ట్రాగ్ని = కోఱల రాపిడివలనఁ బుట్టిన నిప్పు; చొంగ = నోటినుండి కాఱెడి జొల్లు; పైఁబడి = మీఁదఁబడి; చుంయి చుంయి మనఁగఱ్ = చుంయి చుంయి మనెడి ధ్వనులు పుట్టింపఁగా; వెదుళ్లు = లేఁతవెదురు మొల్లలను; చప్పరించుఱ్ = చదియ నములును. (పా. చప్పరించును వెన్నుసట లుబ్బఱ్ - వెన్ను = వీఁపును; సటలు = మెడమీఁది వెండ్రుకలును; ఉబ్బఱ్ = ఉబుకఁగా; చప్పరించును.) చంద్రనిప్పులువోలెఱ్ = చంద్రకట్టెల

1 సెలసి. పా. 2. చప్పళించు. పా.

నిప్పులవలె; తీండ్రించు కనుమించులు = ప్రకాశించునట్టి నేత్రకాంతులు; ఎసఁగన్ = అతిశయింపఁగా; ఒండొంటిపైన్ = ఒకదానిమీఁద నొకటి; ఎక్కన్ = ఎక్కుటకయి; పాఱున్ = పరుగెత్తును. వెట్టదినములన్ = వేసంగికాలమునందు; మడుఁగులన్ = నీటిమడుఁగులను; మట్టి = కలయఁద్రొక్కి; కలఁపన్ = నీళ్లు కలఁగింపఁగా; బుడబుడ ధ్వనిన్ = బుడబుడ యను శబ్దముతో; వెడలు బుద్బుదములందున్ = పైకి లేచునట్టి బుడగలయందు; చిలుప...జిడ్డు - చిలుపచిలుపని = కొంచెము కొంచెముగా వెడలునట్టి; నేతులజిడ్డు = చమురుల మెఱుఁగు; తేఱున్ = మీఁదికిఁ దేలును. ఏమి చెప్పుదున్? = ఇఁక వానిక్రొవ్వు నే నేమి చెప్పుదును? - చెప్పశక్యముకా దనుట. అవి కలియఁబెట్టిన బురదయందే జిడ్డుండఁగా, వాని క్రొవ్వెంత యధికముగా నుండునో చెప్పలే నని భావము. అలం. అతిశయోక్తి, ఉపమ, స్వభావోక్తియు.

చ. బల మిఁక నేమి సెప్ప? విను; పండువెదుళ్లవలీల మోరత్రో
పులఁ బడఁ జొప్ప వంచికొను పోలిక వంచి తదగ్రధాన్యముల్
సెలవుల ఫేన ముట్టిపడ జిట్టలతోడనె చప్ప[1]రించు; న
ప్పొలమువరాహపోతములు భూవర! తొండములేని యేనుఁగుల్. 18

టీ. భూవర! = రాజా! విను = వినుము. అప్పొలము వరాహపోతములు = ఆ యడవిలోని పందిగున్నలు; తొండములేని యేనుఁగుల్; ఇఁకన్; బలము = వానికిఁ గల బలము; ఏమి చెప్పన్?= ఏమని చెప్పుదును? పండువెదుళ్లు = వెన్ను దీసి పండినవెదురుకఱ్ఱలను; అవలీలన్ = అనాయాసముగా; మోరత్రోపులన్ = ముట్టెలతోఁ ద్రోయుటలచేత; పడన్ = వాలిపడునట్లు; చొప్ప= జొన్నలోనగువాని దంటును; వంచికొనుపోలికన్ = వంగఁదీసికొనునట్లు; వంచి = వంగఁదీసి కొని; తదగ్రధాన్యముల్ = ఆ వెదుళ్లకొనయం దుండు ధాన్యములను; సెలవులన్ = పెదవుల మూలలందు; ఫేనము ఉట్టిపడన్ = నురుఁగు అతిశయింపఁగా; జిట్టలతోడనె = వెన్నులతోనే; చప్పరించున్ = నమలి రసము పీల్చును.

తా. ఆ యడవిలోని పందిపిల్లలు మదపుటేనుఁగులవలె బలిసి క్రొవ్వినవై చొప్పదంటును వంచినట్లు పండినవెదురుకఱ్ఱల ననాయాసముగా మోరలతోఁ ద్రోసి వంచుకొని వాని కొనలం దుండు వెదురుధాన్యమును వెన్నులతోడనే నమలి మ్రింగుచుండును. అలం. రూపకము, ఉపమయు, స్వభావోక్తియు.

క. పొడిచినకైదువునకుఁ జము, రిడఁగా వల; దగ్గికాఁక నించుక యిడినం
[2]బెడిదంబగు గుండెల నం, జుడు మంటలఁ దగిలి నెయ్యి జొటజొట వడియున్.

టీ. పొడిచినకైదువునకున్ = ఆ పందులను బొడిచిన యాయుధమునకు; చమురు = నూనె; ఇడఁగాన్ = త్రుప్పుపట్టకుండుటకై పూయుట; వలదు = అక్కఱలేదు. అగ్గికాఁకన్ = నిప్పుసెగయందు; ఇంచుక = కొంచెము; ఇడినన్ = పెట్టఁగా; బెడిదంబగు = గట్టిదైన; గుండెలనంజుడు = ఆ పందుల గుండెలమాంసము; మంటలన్ = ఆ నిప్పు మంటలను; తగిలి = అంటి - మంటలు సోఁకుటచేత ననుట; నెయ్యి = చమురు; జొటజొట వడియున్ = జొటజొట యను ధ్వనితో స్రవించును. (అనఁగా నా పందులను బొడిచిన యాఁటె లోనగు నాయుధములకుఁ ద్రుప్పు పట్టకుండుటకై చమురు పూయవలసిన యక్కఱలేదు. వానిదేహములోని చమురే

1. ళించు. పా. 2. జెడుగఱ్ఱలగ్రుచ్చిన, జెడుగఱ్ఱలగుట్టిన. పా.

చాలును. వానిగుండెమాంసమునకు నిప్పుసెగఁ జూపినయెడ దానినుండి చమురు ధారలుధారలుగా వడియును. పరీక్షింపుఁ డని తాత్పర్యము. అవి మిక్కిలి క్రొవ్విన వని భావము.)

తే. వలదు కుక్కల విడువంగ ♦ [1]వలవ దేయ
నడచి మొలపిడియమ్మునఁ ♦ బొడువవచ్చుఁ
బెంకము గోరిజ [2]దిగఁబడఁ ♦ బఱవలేవు
మన్ను లివ్వేళ [3]రేగటి ♦ మన్నులందు. 20

టీ. మన్నులు = ఋశ్యమృగములు; ఇవ్వేళన్ = ఈ సమయమునందు - ఈ వానకురిసి తడిసియున్న సమయమునం దనుట; రేగటిమన్నులందున్ = బంకమట్టి నేలలయందు; పంకమున్ = బురదయందు; గోరిజ = కాలిగిట్ట; దిగఁబడన్ = క్రుంగఁబడుటచేత; పఱవలేవు = పరుగెత్తిపోఁజాలవు. (కనుక) కుక్కలన్ = వేఁటకుక్కలను; విడువంగన్ = ఉసికొలుపుట; వలదు=అక్కఱలేదు. ఏయన్ = బాణములు ప్రయోగించుట; వలవదు = అక్కఱలేదు. నడచి = మెల్లఁగా నడచిపోయి; మొలపిడియమ్మునన్ = నడికట్టునందుఁ జెక్కుకొన్న బాకుతో; పొడువవచ్చున్ = క్రుమ్మవచ్చును. ('పిడియమ్మునన్ = కటిప్రదేశమున నుండెడి గుజ్జుకోలతో' అని కొందఱు చెప్పెదరు.)

తా. ఆ యడవిలోని రేగటిభూములం దిప్పుడు వాన కురిసి బురదగా నుండుటచేత మనుఁబోతులు కాళ్లు దిగఁబడఁగాఁ బరుగెత్తలేక యుండును; కనుక వానిని వేఁటాడుటకై కుక్కల నుసికొలుపకయు, బాణములు ప్రయోగింపకయు నడచిపోయి మొలలోఁ జెక్కిన బాకుతోఁ బొడిచియే వేఁటాడవచ్చును.

క. పొడచెదరి [4]బూదిచఱచిన, యొడళ్లతో నాల్గు రెండు ♦ నొకటియుఁ [5]బంగల్
వెడలిన కొమ్ములబరువున, నడు గిడఁగా లేవు బలిసి ♦ యందలి దుప్పుల్. 21

టీ. అందలిదుప్పుల్ = ఆ యడవియందలి పృషతమృగములు; (పా. అందులదుప్పుల్) బలిసి = బలుపునొందినవై; పొడచెదరి = శరీరమంతటను మచ్చలు పరవి; బూదిచఱచిన = బూడిదవన్నెగలిగిన; ఒడళ్లతోన్ = దేహములతో; నాల్గు రెండు నొకటియున్ = నాలుగేసి, రెండేసి, యొక్కటొక్కటియు నైన; పంగల్; వెడ...బరువునన్ - వెడలిన = పుట్టిన; కొమ్ములబరువునన్ = కొమ్ములయొక్క బరువుచేత; అడుగిడఁగాలేవు = అడుగెత్తి పెట్టఁజాలవు; అనఁగా సులభముగాఁ జిక్కు ననుట. అలం. అతిశయోక్తి.

ఆ. చలములొదవ ముండ్లు ♦ గల మ్రాఁకుదీములఁ, గెరలి తాఁకి కొమ్ము ♦ లురులఁ దగిలి
వాని లేవ నీడ్చి ♦ కానకే కొనిపోవుఁ, బోతరించి యిఱ్ఱి ♦ పోతు లచట. 22

టీ. అచటన్ = ఆ యడవియందు; ఇఱ్ఱిపోతులు = మగజింకలు; పోతరించి=మదించి; చలములు=మాత్సర్యములు; ఒదవన్ = కలుగఁగా; ముండ్లుగల మ్రాఁకుదీములన్ - ముండ్లుగల=ఇనుపముండ్లు దాఁపిన; మ్రాఁకుదీములన్ = మ్రానితోఁజేసిన ప్రతిరూపములను; కెరలి = ఆగ్రహించి (లేక, రేఁగి); తాఁకి = (తమతోఁ గలహమునకు వచ్చిన మృగములని యెంచి)ఎదిరించి; కొమ్ములు = తమకొమ్ములు; ఉరులన్ =(వానియందుఁ బన్నియున్న) యుచ్చులలో; తగిలి = తగులుకొని - తగులుకొనుటచేత;

1. వలువ. పా. 2. దిగుబడి. పా. 3. రేవటి. పా. 4. బోద. పా. 5. బ్రంగల్. పా.

వానిన్ = ఆ దీములను; లేవన్ = పైకి లేచునట్టుగా; ఈడ్చి = లాగి; కానకే = అడివికే; కొని
తీసికొనిపోవును. (పా. 'క్రోధ మొదవ బండగులఁ, బ్రాఁకు దీములఁ, గెరలి తాఁకి కొమ
దగిలి' - (శబ్దరత్నాకరము) క్రోధము = కోపము; ఒదవన్ = కలుగఁగా; బండగుల
లను; ప్రాఁకున్ = ఎక్కును. దీములను గెరలి తాఁకి, కొమ్మొటురులన్ = కొమ్ములపలల
ఈ పాఠము సమంజస మని తోఁపలేదు.)

తా. ఆ యడవియందలి మగజింకలు మదించి వేఁటాడువారు పెట్టిన ప్రతిరు
జూచి, యవి తమతో నెదిరింపవచ్చిన యిఱ్ఱు లనుకొని వానితో నెదిరించి పొడువఁబోయి
బన్నియున్న యురులలోఁ గొమ్ములు తగులుకొనఁగా వానిని లేవఁదీసి యెత్తుకొని యడవు
పోవును. జింకలు మిక్కిలి బలముగల వని భావము. అలం. అతిశయోక్తి.

ఆ. కప్పువెట్టి వెన్ను । కందమ్ము సమముగాఁ, బొదలి జోళ్లుగట్టి । పోరుచు
మలయుఁగాని పోవు । మానిసిఁ బొడఁగన్న, నేమి చెప్ప వాని । యీాసు

టీ. అధిప! = రాజా! (ఆ యిఱ్ఱిపోతులు) కప్పువెట్టి = దేహము నలుపెక్కి;
వీఁపును; కందమ్ము = మూఁపురమును; సమముగాన్ = చదునుగా - ఎచ్చుతక్కువలు
ననుట; పొదలి = పెరిఁగి; జోళ్లుకట్టి = రెండు రెం డొక్కొక్క జతగాఁ జేరి; పో
పోరాడుచు; ఉండి; మానిసిన్ = మనుష్యుని; పొడఁగన్నన్ = చూచినను; మలయు
కలియఁబడి పోరుచుండు నేకాని; పోవు = వెఱచి తొలఁగిపోవు. వాని యీాసులు
పోతులయొక్క క్రోధములు; ఏమి చెప్పన్? = ఏమని చెప్పవచ్చును?-చెప్పుటకు శక్యము

క. కట్టియఁ జేకొని డేగం, బట్టి యుబుసుపోకఁ బొలము । మట్టినఁ జాలు
దొట్టిన క్రొవ్వులు గలయవి, చెట్టడిచినఁ జేలెఁ; డేమి । చెప్పం బులుఁగు

టీ. కట్టియన్ = కఱ్ఱను; చేకొని = చేతఁబట్టుకొని; డేగన్ = వేఁటనేర్చిన డేగ
పట్టికొని; ఉబుసుపోకన్ = విహారముగాఁ బ్రొద్దుపుచ్చుటకుఁబోలె; పొలము = అ
మట్టినన్ = త్రొక్కినను - ప్రవేశించిన ననుట. చాలున్ = అదియే చాలును - వేఁటకై
మేమియుఁజేయ నక్కఱ లే దనుట. పులుఁగులు = పక్షులు; తొట్టిన క్రొవ్వులు గలతా
కొన్న మదములు గలిగినవి; చెట్టడిచినన్ = చెట్టు చెట్టును గఱ్ఱతోఁ దాడించినను; చె
చేటకొలఁది; (రాలును.) ఏమి చెప్పన్? = ఏమి చెప్పవచ్చును? అలం. అతిశయోక్తి.

తే. ఉడుము గరిమిడికొక్కు [1]దండదడియు వెల్ల, యెలుక [2]కల్లెక్కు తఱుచును । నే
నడవి [3]యెల్లెడఁ జూచిన । నవనినాథ!, జల్లెడయుఁబోలె లాఁగల । న

టీ. అవనినాథ! = రాజా! ఉడుము...దండదడియున్ - ఉడుము = గోధిక లను
యొక్కయు; గరిమిడికొక్కు = పందికొక్కులయొక్కయు; దండడియున్ = తఱుచున
తఱుచును - వెల్లయెలుక = తెల్లయెలుకలయొక్కయు; కల్లెక్కు = కలుఁగులలో నుండెడి
యొక్కయు; తఱుచును = బాహుళ్యమును; ఏమి చెప్పన్? = ఏమని చెప్పుదును? - చె
కాదు - అనఁగా నుడుములు, పందికొక్కులు, తెల్లయెలుకలు, కలుఁగులలో నుండెడి
నిండుకొనియుండు ననుట. అడవి; ఎల్లెడన్ = అన్నియెడలను - అంతటను; చూచినన్

1. లఁదడవ నేల? పా. 2. యెల్లెల్క. పా. 3. నెల్లెడ. పా.

పక్షమున; లాఁగలక్ = కలుఁగులచేత; జల్లెడయుఁబోలెక్ = జల్లెడవలెనే; ఉల్లసిల్లుక్ = ఒప్పుచుండును - ఎక్కువ కన్నములు గలిగియుండు ననుట. అలం. ఉపమ.

క. అనుటయు మృగయాకౌతుక, మునఁ జిత్తము చెంగలింప భూధరశృంగం
బుననుండి డిగ్గి నగరికి, ననిమిషకాంతాకుమారుఁ డరిగి రయమునన్. 26

టీ. అనుటయుక్ = అని యెఱుకువాఁడు చెప్పఁగా; మృగయాకౌతుకమునక్ = వేఁటయందలి వేడుకచేత; చిత్తము = మనస్సు; చెంగలింపక్ = పెరపెరలాడఁగా - ఉత్సాహముకలది కాఁగా; అనిమిషకాంతాకుమారుఁడు = దేవతాస్త్రీకొడుకు - స్వరోచి; భూధరశృంగంబుననుండి = కొండకొమ్మునందుండి; డిగ్గి = దిగి; నగరికిక్ = పట్టణములోనికి; రయమునక్ = వడితో - శీఘ్రముగా; అరిగి = పోయి. తర్వాతి వచనముతో అన్వయము.

వ. నగరు సొచ్చి యచ్చటం గక్ష్యాంతరశాలాంతరాళంబుల నందంద తండతండంబులై వ్రేలుతత్రెంబులం జమురంటు పలలఖండంబుల మండితంబులగు నిడుద వెదురుదండెంబులంబర్హిబర్హనిబద్ధాగ్రంబులై కొమరారుదోరెపుఁద్రాళ్లతోడం దిరుగుడుల వెడంగుఁవడి వడి దప్పునట్లు త్రాళ్లం గట్టువడి పొట్ట లదురంగ నిక్కి పరిసెనంబులు వేయునవియును, నపహసితశార్దూలకుటిలనఖకోటిపాటవంబులగు త్రోటిపుటంబులం జటక సరటాది జంతుకళేబరంబులం జరణనఖరాంకురంబుల నిఱికి చీరుచుం గేరునవియును, నాఁడునాఁటికిం బాటించి వేఁటకాం డ్రదనెఱింగి మేపు మేపులచమత్కారంబుల నిరాకరించి వీకునం దిరిగితిరిగి యీఁక దీర్చుకొనునవియును, బద నగ్గలించి కూయుచుం గడుపు నకనకంబడం గను కట్టుతోడ మోములు మలంచుచుఁ బంజరస్థిత కీర శారికా పారావతాదుల పలుకు లాకర్ణించి యెగసి యెగసి నిజావస్థిత తాదృగ్విధాధార వేణుయష్టులకుఁ జట్టుపలు చెదరం బ్రదక్షిణభ్రమణంబులం బరిభ్రమించి మగుడ నెట్టకేలకు మట్టఁకొనునవియును, మేర మీఱం దిన్న యెరల నన్నుకొని యరగన్ను వెట్టి బోరకడం బొటమరింపం గూరుకుచుం గుతికలంబడునవియునునై పరగు పలు దెఱంగుల డేగ మొత్తంబులను, గుత్తంబులగు మిగుల మెత్తని జలపోతతోలు పట్టెడలు మెడల నమరం బసుపార్చి కట్టుఁగంబంబులకుం దార్చి బంధించిన కుందనంపు గొలుసులు గల్లుగల్లు మనంగ నొడళ్లు జాడించుకొనుచుం గొనసాగి సోగలై ముంగిసమోరలుంబోని మోరలు సారెసారెకు నెత్తి బయలు పసి పట్టుచుఁ గట్టెదుటి వాజిశాలలం గట్టిన పొట్టేళ్లకై యాదిగొని నీల్గి కాలు ద్రవ్వి ఘనఘనాఘనఘుర్ఘురధ్వాననుధ్వానులు చెలంగ మ్రోఁగుచు నింగిఁ బ్రాఁకుచు నింగలంబు లుమియు నయనగోళంబుల నాభీలంబులై వివృతవదన గహ్వరవిలంబి జిహ్వాపల్లవంబులకుం గ్రూరతర దంతకోణకాంతికలాపంబులం గోరకస్తబకయోగంబు గల్పించుచు నల్పేతరగ్రస్తకీలాలపలలజాతగ్రాసంబులు నెన్నడుము సన్నఁదనంబున నఁట మిగుల డిగ్గి చనకునికిం గటితటంబులకంటెం దారె పుటపుటనయ్యె ననం దోరంబులగు బోరలం గందంబుల నందంబులు

గని బిరుదు లంకించి తమ్ము నుపలాలించు పరిపాలకుల సంస్తవంబులకుం జెవి దార్చి నసం గర్ణకిసలయంబులు ప్రాలంబడి వెండిగుండులుంబోలెఁ గన్నుల పండువులై గండభైరవు పూజవారువంబు లన మెండుకొనియుండు జాగిలంబులనుం గాంచి యందు నందును వేఁటకు నుఱవైనవాని నేర్పఱించి తెచ్చుటకు ననుచరుల నీవు నీ వని నియమించి, తానును నాఖేటకోచితపరిపాటి సన్నద్ధుం డయ్యె నయ్యవసరంబున. 27

టీ. నగరు చొచ్చి = దివాణము ప్రవేశించి; అచ్చటన్; కక్ష్యాం...బులన్ - కక్ష్యాంతర = తొట్టికట్లలోపలి; శాలా = చావళ్లయొక్క; అంతరాళంబులన్ = లోపలిభాగములయందు; అందంద = అచ్చటచ్చట; తండతండంబులై = గుంపులు గుంపులై; వ్రేలు నత్తెంబులన్ = వ్రేలాడెడి తోలుతొడుగులయందు. (అత్తెము = హస్తకవచము - డేగలను బెంచువారు వానిగోళ్లు గ్రుచ్చుకొనకుండుటకై తోలుతోఁ గుట్టి చేతికిఁ దొడుగుకొనెడిది); చమురు = జిడ్డు; అంటు పలల ఖండంబులన్ = తగులునట్టి మాంసపుఁగండలచేత - అంటినచోఁ జేతికిఁ జమురు తగులునట్టి మాంస మనుట; మండితంబులు = అలంకరింపఁబడినవి - మాంసపుముక్కలు వ్రేలఁగట్టఁబడినవి యనుట; అగు...దండెంబులన్ - అగు = అయినట్టి; నిడుద = నిడుపులైన; వెదురుదండెంబులన్ = వెదురు గడలదండములయందు; బర్హి...గ్రంబులై - బర్హి = నెమిళ్లయొక్క; బర్హ = కుంచెలచేత - ఈఁకల కుచ్చులచేత; నిబద్ధ = కట్టఁబడిన; అగ్రంబులై = కొనలుగలవై - కొనలయందు నెమిలి యీఁకల కుచ్చులు కట్టినవై యనుట; కొమ...తోడన్ - కొమరారు = అందగించుచున్న; దోరెపుఁద్రాళ్లతోడన్ = కట్టుత్రాళ్లతో; తిరుగుడులన్ = తిరుగుటలచేత; వెడంగువడి = వికారమునొంది; వడి తప్పునట్లు = వేగము లేకపోవునట్లు; త్రాళ్లన్ = దోరెపుఁద్రాళ్లచేత; కట్టువడి = బంధింపఁబడి; పొట్టలు = కడుపులు; అదురంగన్ = వడఁకఁగా; నిక్కి = నిగిడి; పరిసెనంబులు వేయునవియును = పల్లటీలు వేయునవియును; (పరిసెనము = డేగలకు మత్తుదీఱి వేఁటయందుఁ జొరవ కలుగుటకై మందిచ్చి వాంతి యెత్తించుట యని కొందఱు. ఆ పక్షమున పరిసెనంబులుసేయునవి యని పాఠము మార్చుకోవలెను.) (అలం. స్వభావోక్తి.) అపహసిత...పాటవంబులు - అపహసిత = తిరస్కరింపఁబడిన; శార్దూల = పెద్దపులులయొక్క; కుటిల = వంకరలైన; నఖ = గోళ్లయొక్క; కోటి = కొనలయొక్క; పాటవంబులు = పటుత్వముకలవి - పులుల వంకరగోళ్ల పటుత్వమును మించిన పటుత్వము గలవి యనుట. అగు త్రోటిపుటంబులన్ = అయిన దొప్పలవంటి ముక్కులచేత; చటక...కళేబరంబులన్ - చటక = పిచ్చుక; సరట = తొండ; ఆది = మొదలుగాఁగల; జంతు = ప్రాణులయొక్క; కళేబరంబులన్ = దేహములను; చరణ...బులన్ - చరణ = కాళ్లయొక్క; నఖర = గోళ్లయొక్క; అంకురంబులన్ = మొలకలచేత - సన్నని మొనలచేత ననుట; ఇఱికి = కదియఁబట్టి (లేక, అదిమిపట్టి); చీరుచున్ = చీల్చుచు; కేరునవియును = ఉత్సహించునవియును; (అలం. ఉపమ.) నాఁడునాఁటికిన్ = ప్రతిదినమును; పాటించి = అక్కఱతో విచారించి; వేఁటకాండ్రు = వేఁటాడువారు; అదను = సమయము - ఆఁకలిగొన్న సమయ మనుట; ఎఱింగి = తెలిసి; మేపు మేపుల చమత్కారంబులన్ = మేయించునట్టి మేఁతలయొక్క నేర్పులను; నిరాకరించి = అలక్ష్యముచేసి; వీకునన్ = నిక్కుచేత; తిరిగితిరిగి = మాటిమాటికిఁ దిరిగి; ఈఁకదీర్చుకొనునవియును = ఱెక్కలు చిక్కు సవరించుకొనునవియును-

వేఁటకాఁడు పెట్టునట్టిమేఁతను మురిపముచేఁ దినక యిట్లట్లు దిరిగి ఱెక్కలు చక్కఁబెట్టుకొనునవి యనుట. (అలం. స్వభావోక్తి.) పదను = మేఁతసమయము; అగ్గలించి = మీఱి; కూయుచుఁ = అఱచుచు; కడుపు నకనకంబడఁ = పొట్ట వాడఁగా; కనుకట్టుతోడఁ = కనుమూఁతతోలు కట్టుతో; మోములు = ముఖములను; మలంచుచుఁ = అటునిటుఁ ద్రిప్పుచు; పంజర...పలుకులు - పంజర = గూండ్లయందు; స్థిత = ఉండెడి; కీర = చిలుకలు; శారికా = గోరువంకలు; పారావత = పావురములు; ఆదుల = మొదలగువానియొక్క; పలుకులు = మాటలు - ధ్వనుల ననుట; ఆకర్ణించి = విని; ఎగసి యెగసి = వానితట్టునకు నెగిరి యెగిరి; నిజా...లకుఁ - నిజ = తమ యొక్క; అవస్థిత = నిలిచియుండునట్టి; తాదృగ్విధ = ఆ విధమయిన - ముందు చెప్పఁబడినట్లుండెడి దండెములయిన; ఆధార = తమకు నాధారములైన; వేణుయష్టులకుఁ = వెదురుకఱ్ఱలకు; చట్టుపలు = ఱెక్కలు; చెదరఁ = ప్రసరించునట్లుగా; ప్రదక్షిణభ్రమణంబులఁ = వలగొని తిరుగుటలచేత; పరిభ్రమించి = తిరిగి; మగుడఁ = మరల; ఎట్టకేలకుఁ = అతిప్రయాసముచేత; మట్టుకొనునవియును = ఎప్పటివలెఁ గుదురుకొనునవియును - ఎరలు తినువేళ మీఱిపోఁగా నాఁకలిగొని కూయుచును, మూతులను ద్రిప్పుచును, గూండ్లలోని పక్షులకూఁతలు విని ఱెక్కలు తాఁకునట్లు తా మున్న వెదురుగడలనుబట్టి తిరుగుచుఁ గొంతసేపటికి నెప్పటియట్లు కుదురుకొనునవి యనుట. (అలం. స్వభావోక్తి.) మేరమీఱఁ = మితికి మించునట్లు; తిన్నయెరలఁ = తినిన యాహారములచేత; అన్నుకొని = మత్తుఁగొని; అరగన్ను పెట్టి = ప్రాఁగన్నువేసికొని; బోరకడఁ = బొమ్మతట్టు; పొటమరింపఁ = కడుపునిక్కునట్లుగా; కూరుకుచుఁ = తూఁగాడుచు; కుతికిలంబడునవియును = వ్రాలఁబడునవియును - మితిమీఱఁ దినుటచే మత్తెక్కి ప్రాఁగన్నుతో నిద్రవోవున వనుట; ఐ = అయి; పర...బులను - పరగు = ఒప్పునట్టి; పలుదెఱంగుల = బహువిధములయిన - బైరి, పాళువము మొదలుగా బహుభేదములు గలిగిన యనుట; డేగమొత్తంబులను= డేగలసమూహములను; (ఇంతవఱకు డేగలవర్ణనము. ఇఁక జాగిలములవర్ణనము.) గుత్తమ్ములు = ఎచ్చుతక్కువలులేక సరిగానుండునవి; అగు...పట్టెడలు - అగు = అయిన; మిగులఁ = మిక్కిలి; మెత్తని = మృదువైన; జలపోత = బంగారు మొలాముచేసిన; తోలుపట్టెడలు - పట్టెగాఁగోసి కూర్చినతోళ్లు; మెడలఁ = కంఠములయందు; అమరఁ = ఒప్పఁగా; పసుపార్చి = పసుపునీళ్లతో స్నానము చేయించి; కట్టుఁగంబంబులకుఁ = కట్టివేయునట్టి గుంజలకు; తార్చి = చేరఁదీసి; బంధిం...గొలుసులు - బంధించిన = కట్టివేసిన; కుందనంపుగొలుసులు = మేలిమి బంగారుతోఁ జేసినసరిపెణలు; గల్లుగల్లుమనంగఁ = గల్లుగల్లుమని మ్రోఁగఁగా; ఒడళ్లు = శరీరములు; జాడించుకొనుచుఁ = వణఁకించుకొనుచు - విదిలించుకొనుచు; కొనసాగి = మొన నిక్కి; సోగలై = నిడుపులై; ముంగిసమోరలుంబోని = ముంగిసల మూతులవంటి; మోరలు = మూతులను; సారెసారెకుఁ = మాటిమాటికి; ఎత్తి = పైకెత్తుకొని; బయలు = బయటిని; పసిపట్టుచుఁ = వాసనచూచుచు; కట్టెదుటి వాజిశాలలఁ = సరియెదుటనున్న గుఱ్ఱపులాయములందు; కట్టిన = కట్టివేసియున్న; పొట్టేళ్లకై = గొఱ్ఱెపోతులకై; ఆదిగొని = పొంచువేసి; నీల్గి=ముందటికి నిక్కి; కాలుద్రవ్వి = కాళ్లతో నేలకోరాడి; ఘన...ధ్వనులు - ఘన = అధికమైన; ఘనాఘన = వర్షించుచున్న మేఘముయొక్క; ఘర్ఘరధ్వాన=ఘర్ఘరధ్వనితో - అధికధ్వనితోఁ గూడిన యుఱుముతో; సమ = సమానమైన; ధ్వనులు=మ్రోఁతలు; చెలఁగఁ =మ్రోఁగఁగా; మ్రోఁగుచుఁ =మొఱుఁగుచు; నింగిఁ = ఆకాశమును; ప్రాఁకుచుఁ = బొమ్మతో జరుగునట్లు మీఁదికి లేచుచు; ఇంగలంబులు = నిప్పులు; ఉమియు...గోళంబులఁ - ఉమియు = క్రక్కుచున్న; నయనగోళంబులఁ = గుండ్రమైన కను

ప్రగడ్లచేత; ఆభీలంబులై = భయంకరములై; (అలం. ఉపమ.) వివృత ..లన్ - వివృత బడిన; వదనగహ్వర = గుహలవంటి నోళ్లవలననుండి; విలంబి = వ్రేలుచున్న; జిహ్వా లకున్ = చిగుళ్లవంటి నాలుకలకు; క్రూర...కలాపంబులన్ - క్రూరతర = మిక్కిలి క దంత = పండ్లయొక్క; కోణ = కొనలయొక్క; కాంతి = కాంతులయొక్క; కలాప సమూహములచేత; కోరకస్తబకయోగంబు = పూగుత్తులతోడి చేరికను; కల్పించుచున్ జేయుచును (అలం. రూపకము); అల్పేతర...గ్రాసంబులు - అల్పేతర = అధికముగా; మ్రింగఁబడిన; కీలాల = రక్తముతోడి; పలలజాల = మాంససమూహముయొక్క; గ్రా ఆహారములు; సెన్నడుము సన్నఁదనంబునన్ = అందమయిన నడుముయొక్క సన్నని అంట = అవతల; మిగులన్ = మించునట్లు - నడుమును దాఁటి యనుట; ... పోవుండుటచేత; (పా. కడచిదనవునికిన్ = అతిక్రమించి పోవుండుటచే;) ... కంటెన్ = పిఱుఁదుల పార్శ్వములకంటెను; తారే = తామే - తోస్తున్నవే; పుటపుటనయో బలిసెనోయనునట్లు; తోరంబులు = స్థూలములు - బలిసినవి; అగు బోరలన్ = అగునట్టి చేతను; కందంబులన్ = మూఁపురములచేతను; అంసంబులు = చక్కఁదనములు; ... బిరుదులు = సామర్థ్యమును దెలిపెడి గుఱుతులను; అంకించి = పొగ..; ... ననుట; ఉపలాలించు...స్తవంబులకున్ - ఉపలాలించు = బుజ్జగించునట్టి; పరిపాలకుల వారియొక్క; సంస్తవంబులకున్ = పొగడ్తలకు; చెవిదార్చె వనన్ = చెవియొగ్గెననో కర్ణకిసలయంబులు = చిగురుటాకులవంటి చెవులు; ప్రాలంబత = వ్రేలాడఁగా; ... బోలెన్ = వెండితోఁజేసిన గుండ్లవలె; కన్నులపండువులై = నేత్రానందకరములై; వారువంబులు - గండభైరవు = గండభైరవదేవునియొక్క; పూజవారువంబులు = పూ గుఱ్ఱములో; అనన్ = అనునట్లు; మెండుకొని = నిండుకొని; ఉండు జాగిలంబులన్ = వేఁటకుక్కలను; (అలం. ఉత్ప్రేక్ష.) కాంచి = చూచి; అంగసంఘముల్ = ఆ దే వేఁటకుక్కలయందును; వేఁటకున్ = వేఁటాడుటకు; ఉఱవైనవాని = యుక్తమై.. ఏర్పరించి = నిర్ణయించి; తెచ్చుటకున్; అనుచరులన్ = తగినసేవకులను; నీవు ... పొమ్ము నీవు పొమ్ము అని; నియమించి = ఉత్తరువుచేసి; తానును = (స్వరోచియును పాటిన్ - ఆఖేటక = వేఁటకు; ఉచిత = తగిన; పరిపాటిన్ = క్రమమున; సన్నద్ధుండు = డయినవాఁడు; అయ్యెన్; అయ్యవసరంబునన్ = ఆ సమయమునందు.

సీ. పచ్చని[1]హురుమంజి ♦ పనివాగె పక్కెర, పారసిపల్లంబు ♦ పట్టమ...
రాణ నొప్పారుపై ♦ తాణంబుసింగిణి, తళుకు[2]లకోరిల ♦ తరకసంబు
మిహిపసిండిపరుంజు ♦ మొహదా కెలంకుల, దావు గుజ్జరి[3]నేత ♦ కేవ...
డాకెలంకున సిరా ♦ జీ కరాచురకత్తి, కుఱుఁగటఁ బ్రొవ్వాఁడి ♦ గొర...
తే. పీలి[4]కుచ్చుతలాటంబు ♦ [5]బేరజంపు, మణులమొగముట్టు వన్నె సాహిణి...
కర్త యెదుటికిఁ గొనివచ్చె ♦ గంధవాహ, బాంధవంబగు నొక మహా ♦ సైం...

టీ. పచ్చని ...వాగె - పచ్చని = పసుపువన్నెగల; హురుమంజి = పెర్షి... (హురుమంజియను) అర్మూజ్ తీరమునందగు; పని = ముత్యాలనగిషీ పనిచేసిన; వాగె...

1. హురుముంజి పా. 2. లకోరుల. పా. 3. వన్నె. పా. 4. కుంచె. పా. 5. జేర...

వాహప్రగ్రహమును - గుఱ్ఱపుకళ్లెమును; పట్టమయము = పట్టువికారమయిన; పారసిపల్లంబు = పారసీకదేశపుగంతయును; (పట్టమయము = టంగువాలు అని బ్రౌన్ దొరగారి పుస్తకమునందు వ్రాయఁబడియున్నది.) రాణన్ = మనోహరముగా; ఒప్పారు = అందగించుచున్న; పైఠాణంబు సింగిణి = పైఠాణము (ప్రతిష్ఠానము)అను దేశముదైన శృంగధనుస్సును; తళుకులకోరీల తరకసంబు- తళుకు = తళతళ మెరయుచున్న; లకోరీల = గుదులుగాఁగట్టఁబడిన బాణములుగల; తరకసంబు= అమ్ములపొదియును; మిహి... మొహదా - మిహీపసిండి = తెల్లని బంగారుతోఁ జేసిన; పరుంజు = పిడిగలిగిన; మొహదా = అడ్డకత్తియును; కెలంకులన్ = పార్శ్వప్రదేశమునందు; తావుగుజ్జరిసేఁత కేవడంబు - తావుగుజ్జరిసేఁత = స్థలఘూర్జరదేశపుఁ బనితనము గల; కేవడంబు = కేడెమును; డాకెలంకునన్ =ఎడమపార్శ్వమునందు;సిరాజీ = పెర్షియాలోని షిరాజ్ లోఁ దయారైన; కరాచురకత్తి = వాఁడియైన చిన్న కత్తియును; కుఱఁగటన్= దానిసమీపమునందు; క్రొవ్వాఁడి గొరకల పొది = క్రొత్తగాఁ బదనుపెట్టిన కత్తివాతిబాణముల పొదియును; పీలికుచ్చుతలాటంబు = పికిలిపిట్టయీఁకల కుచ్చుతురాయియును; పేరజంపుమణుల మొగముట్టు = వంటరాలు చెక్కిన ముఖపట్టమును; (పా. పేరోజంబుమణుల = క్షుద్రమరకతమణుల.) (కృత్రిమమణులు) పన్ని = అమర్చి; సాహిణి యొకండు = ఒక గుఱ్ఱపువాఁడు; గంధవాహబాంధవంబు = గాలిచుట్టము - గాలియొక్క వేగమువంటి వేగముగలది యనుట; అగు మహాసైంధవంబున్= అయినట్టి పెద్ద గుఱ్ఱమును; కర్తయెదుటికిన్ = ప్రభువైన స్వారోచియెదుటికి; కొనివచ్చెన్ = తీసికొనివచ్చెను - అనఁగా ఒక గుఱ్ఱపువాఁడు వేఁటకుఁదగిన యాయుధములతోడ గుఱ్ఱము నలంకరించి సిద్ధపఱిచి స్వారోచి యెదుటికిఁ దీసికొనివచ్చి నిలిపె నని భావము.

క. తెచ్చుటయు నిచ్చ మెచ్చి మ, రుచ్చటుల కురంగ రయ ని ♦ రోధి స్యద గ
ర్వోచ్చంబగు నత్తేజి ను, హృచ్చక్రం బలర వేగ ♦ యెక్కి వెడలినన్. 29

టీ. తెచ్చుటయున్ = (గుఱ్ఱపువాఁడు గుఱ్ఱము నాయితముచేసి) తీసికొనిరాఁగానే; ఇచ్చన్ = మనసునందు; మెచ్చి = మెచ్చుకొని; మరుత్...గర్వోచ్చంబగు - మరుత్ = వాయుదేవుని వాహనమైన; చటుల = సమర్థమయిన; కురంగ = జింకయొక్క; రయ = గమనవేగమును; నిరోధి = అడ్డగించిన; స్యద = వేగముచేనైన; గర్వ = అహంకారముచేత; ఉచ్చంబగు = అతిశయించినట్టి; అత్తేజిన్ = ఆ గుఱ్ఱమును; సుహృచ్చక్రంబు = మిత్రులసమూహము; అలరన్ = సంతోషింపఁగా; వేగ = వడిగా; ఎక్కి; వెడలినన్ = బయలుదేఱఁగా. ముందున కన్వయము. అలం. ఉపమ.

చ. జెడలు మలంచి [1]చొల్లెముగ ♦ సన్నపుఁబాగ లడంగఁ జుట్టి చ
ల్లడములు పూని మీఁదఁ బది ♦ లంబుగఁ గట్టినమట్టికాసెలం
బిడియము లంట దోఁపి పృథు ♦ భీషణబాహుల సాళువంబుల
న్నడవి కెరల్చుచుం జనిరి ♦ నాథునిమ్రోల నృపాలనందనుల్. 30

టీ. నృపాలనందనుల్= రాచకొమాళ్లు; జెడలు = అల్లిన తలవెండ్రుకల జెడలను; మలంచి = పైకిఁద్రిప్పి; చొల్లెముగన్ = మెలిచుట్టుగా; సన్నపుఁబాగలు = నయతరమైన తలపాగలను; అడంగన్ = ఆ జడలు లోపల నణఁగునట్లు; చుట్టి = చుట్టికొని; చల్లడములు = లాఁగులు; పూని =

1. సొల్లెముగ. పా.

ధరించి; మీఁదన్ = ఆ చల్లడములమీఁద; పదిలంబుగన్ = దిట్టముగా; కట్టిన మట్టికా
బిగఁగట్టుకొన్న యెఱ్ఱమట్టి నీటిలోఁ దడిపిన కాసెకోకలయందు - దట్టీలయం దనుట.
ములన్ = బాఁకులను; అంట దోఁపి = పిడివఱకు నంటునట్లుగా దోఁపి; పృథు...బులన్ -
బలిసిన; భీషణ = భయంకరములయిన; బాహుల = భుజములయందలి; సాళువంబులన్ =
తడవి = నిమిరి; కెరల్చుచున్ = రేఁపుచు; నాథునిమ్రోలన్ = ప్రభువైన స్వారోచి
చనిరి = నడచిరి.

తా. స్వారోచి గుఱ్ఱము నెక్కి బయలుదేఱఁగానే రాచకొమాళ్లు కొందఱు జెడలు
నణఁగునట్లు తలగుడ్డలతోఁ బెనఁచి తలపాగలు చుట్టుకొని, చల్లడములు దొడిగి, దట్టీలు గ
యా పట్టీలలో బాఁకులు దోఁపుకొని, డేగలను జేతులం దుంచుకొని, వానిని దువ్వి వేటకు
పించుచు, నతనిముందఱ నడవ నారంభించిరి. అలం. స్వభావోక్తి.

సీ. ఇవి కంఠపాశంబు ॥ లింత డుస్సిన మీఁదఁ, బడి దిశాకరినైన ॥ గెడపం
నివి మింటఁ బఱచుపక్షీంద్రుఁ జూపిన నీడ, బడి వాలునందాఁకఁ ॥ బఱవ
నివి గాలి కనిన మూఁకవరాహదనుజేంద్రు, నైన [1]జుట్టెంటిలో ॥ నాఁగ
నివి కాటుకొల్పిన ॥ వృద్ధకూర్మము వీఁపుఁ, జిప్పైన నెఱచికై ॥ చింప
తే. ననఁగ [2]ఘుర్ఘురగళగర్త ॥ జనితభూరి, భూభృదురుబిల భరిత భాఁ॥భాఁ
రార్భటీ దీర్ణ దిగ్భిత్తు ॥ లగుచుఁ జెలఁగె, సరిపెణలఁ బట్టి తెచ్చిన ॥ జాగిల

టీ. ఇవి = ఈ వేఁటకుక్కలు; కంఠపాశంబులు = మెడత్రాళ్లు; ఇంత డుస్సి
కొంచెము దూసినను; దిశాకరినైనన్ = దిగ్గజమునైనను; మీఁదఁబడి = పైనిబడి; కెడపఁజ
చంపఁజాలును. ఇవి; మింటన్ = ఆకాశమునందు; పఱచు పక్షీంద్రున్ = పాఱుచున్న పక్షి
గరుత్మంతుని; చూపినన్ = కనఁబఱిచినను; వాలునందాఁకన్ = ఆ గరుత్మంతుఁడు దిగు
నంతవఱకు; నీడబడిన్ = ఆ నీడవెంటనే; పఱవఁజాలున్ = పరుగెత్తఁజాలును. ఇవి
కనినన్ = పసిఁగన్నను - (పందుల) దేహవాసన తెలిసినను; మూఁకవరాహదనుజేంద్రునై
పందిరూపొందిన మూఁకుఁడనెడి రాక్షసశ్రేష్ఠునినయినను; జుట్టెంటిలోన్ = లొడితెఁడ
దూరములోపలనే; ఆఁగఁజాలున్ = పోనీక యడ్డగింపఁ జాలును. ఇవి; కాటుకొలిపినన్
చుటకై యుసికొలిపినపక్షమున; వృద్ధకూర్మము వీఁపుఁజిప్పైనన్ = విష్ణ్వవతారమయిన
కూర్మముయొక్క చిప్పవంటి వీఁపునెముకనైనను; ఎఱచికై = మాంసమునకై; చింపఁజా
చినుఁగఁదీయఁజాలును; అనఁగన్ = అనునట్లు; ఘుర్ఘుర...భిత్తులు - ఘుర్ఘుర = గురగుర
గళగర్త జనిత = గొంతురంధ్రములనుండి పుట్టిన; భూరి = అధికమయిన; భూభృత్
ములయొక్క; ఉరుబిల = పెద్ద గుహలయందు; భరిత = నిండింపఁబడిన; భాఁభాఁ భయంకర
భాఁభాఁ అనెడి భయంకరములైన ధ్వనులచేత; దీర్ణ = బ్రద్దలయిన; దిగ్భిత్తులు = దిక్కుల
గలవి; అగుచున్; సరిపెణలన్ = గొలుసులచేత; పట్టి = పట్టుకొని; తెచ్చిన జాగి
తీసికొనివచ్చిన వేఁటకుక్కలు; చెలఁగెన్ = ఒప్పెను.

తా. ఇవి దిగ్గజములనైనఁ గఱచి చంపను, ఆకాశమునందుఁ బాఱుచున్న గరు
నీడజాడ నా గరుత్మంతుఁడు నేల వ్రాలునందాఁకఁ బరుగెత్తను, పసిపట్టి పందిరూప

1. జిట్టెంటి. పా. 2. ఘుర్ఘుర. పా.

మూకాసురుఁడైన సత్త్వగించి యులుసు, మాంసాపేక్ష గలిగినయెడ నాదికూర్మము నైనఁ జిప్పనైనఁ జింపను సామర్థ్యముగలవి యనునట్లు ఘోషభీషణము లాఁపలేక బర్వతగుహాలందుఁ బ్రతిధ్వని పుట్టించుచున్న వేఁటకుక్కలు ఘటలు గొలుసులు వేసి కట్టి యలసవంటఁ దేఁబడియెను.

చ. పులియఁడు బూచిగాఁడసుర ✽ పోతులరా జనుమంతిగాఁడు చెం
గలువ సివంగి భైరవుఁడు ✽ గిత్తెని సంపఁగి వెండిగుండు మ
ల్లెలగుది వాయువేగి చిటి ✽ లింగఁడు సాళ్వుఁడు వత్సనాభి యే
కలములమిత్తి గబ్బి యసఁ ✽ గాఁ గలవాని గ్రహించి యుద్ధతిన్. 32

టీ. ఇంచు పులియఁడు మొదలగునవి కుక్కలకుఁ బెట్టఁబడిన పేళ్లు. ఈ పేళ్లుగల కుక్కలను; గ్రహించి = పట్టుకొని (దీనికిఁ గర్త తరువాతి పద్యములోని 'వాగురికుల్'); ఉద్ధతిన్ = గర్వముతో; 'అరిగిరి' అనెడి క్రింది రెండవ పద్యములోని క్రియతో దీని కన్వయము.

ఉ. కట్టిననీలిదిండ్లు సెల ✽ కట్టియవిండ్లును విండ్లగాసెనల్
చుట్టి నొసళ్లపై నిడిన ✽ జుంజుటుఁ బల్లసిగల్ గటీతటిం
బెట్టిన మోటకత్తులును ✽ మేనులఁ గార్కొనుకప్పు లేర్చి చేఁ
బట్టిన వేఁటయమ్ములును ✽ బాగగువాగురికుల్ మహాధ్వనిన్. 33

టీ. కట్టిన నీలిదిండ్లున్ = నడుమున బిగఁగట్టిన నీలిచాయగల బొంతలవంటి దట్టీలును; సెలకట్టియవిండ్లును = సెలసు కట్టిల ధనుస్సులును; విండ్లగాసెనల్ = ధనుస్సులుంచెడి యొఱలును; చుట్టి = మెలిచుట్టి; నొసళ్లపైన్ = నొసటిప్రదేశముల మీఁదికి వచ్చునట్లు; ఇడిన జుంజుటు పల్లసిగల్ = పెట్టుకొన్న చింపిరి ఎఱ్ఱి జుట్లును; కటీతటిన్ = మొలవెనుక; పెట్టిన మోటకత్తులును = చెక్కుకొన్న మస్తుకత్తులును; మేనులన్ = దేహములందు; కార్కొనుకప్పులు = చీఁకట్లు క్రమ్ముచున్న నలుపులును; ఏర్చి = ఏర్పఱించి; చేఁబట్టిన వేఁటయమ్ములును = గ్రహించిన వేఁటకుఁదగిన బాణములును; బాగగు వాగురికుల్ - బాగగు = ఒప్పుచున్న; వాగురికుల్ = ఉరులు పన్ని వేఁటాడెడి వేఁటకాండ్రు; మహాధ్వనిన్ = అధికధ్వనితో - అధికముగా ధ్వనికల్గునట్లు మాటలాడుచు ననుట. క్రింది పద్యములో నన్వయము. అలం. స్వభావోక్తి.

సీ. సట లెత్తుకొని యొత్తు ✽ కిటినైన మోటాన, పడి యేయఁబోడుతు నీ ✽ పాదమాన;
కలగుండువడఁ జెండు ✽ కరినైనఁ జెవిపట్టి, బలిమిమైఁ దెత్తు నీ ✽ పాద మాన;
సెల నెప్పుకొని రొప్పు ✽ పులినైనఁ బీడించి, పడవైతుఁ జొచ్చి నీ ✽ పాదమాన;
తెరఁదూటి వెఱఁబాఱు ✽ గురుపోతుపైనైనఁ, బడియెక్కి పొడుతు నీ ✽ పాదమాన;

తే. యితరదుర్బలమృగపఙ్క్తు ✽ లేమి లెక్క?, కండగరువంపుమాటలు ✽ గావు సుమ్ము
చూడుమమ్మని పంతంబు ✽ లాడుకొనుచు, నవ్వరూథినిసుతుఁ గొల్చి ✽ యరిగిరవుడు.

టీ. సటలు = మెడమీఁది వెండ్రుకలు; ఎత్తుకొని = నిక్కించుకొని; ఒత్తుకిటినైనన్ = త్రోసికొనివచ్చు పందినైనను; మోటు = మఱుఁగుగా నుంచుకొను మనుష్యాద్యాకృతిని; ఆసపడి = అపేక్షించి - మనుష్యాద్యాకృతిని మాటు చేసికొని యనుట; ఏయన్ = బాణముప్రయోగింపను; పొడుతున్ = దగ్గఱకుఁబోయి బల్లెముతోఁ బొడిచెదను. నీపాద మాన = నీయడుగులతోడు. (ఇది పంతపుమాట.) కలగుండుపడన్ = కలఁతపడునట్లుగా; చెండు కరినైనన్ = ఎగురఁజిమ్మునట్టి

యేనుఁగునైనను; చెవిపట్టి; బలిమిమైన్ = బలాత్కారముగా; తెత్తున్ = ఈడ్చుకొనివత్తు
పాదమాన. సెలన్ = కొండయేటిని; నెప్పుకొని = పాదుచేసికొని; రొప్పు పులినైనన్ =
ముతో గాండ్రించునట్టి పెద్దపులినైనను; చొచ్చి = చేరఁజొచ్చి; పీడించి = నొప్పించి;
వైతున్ = నేలఁ బడఁద్రోయుదును. నీపాద మాన. తెరఁదూఱి = వలవంటి తెరచీరనుండి
లికిఁ జని; వెఱన్ = భయముతో; పాఱు = పరుగెత్తునట్టి; గురుపోతుపైనైనన్ = గవయము
మీఁదనయినను; పడి = మ్రొగ్గి; ఎక్కి = ఆరోహించి; పొడుతున్ = పిడికిటితోఁ బొడు
నీపాద మాన. ఇతర...పంక్తులు - ఇతర = వీనికంటె వేఱయిన; దుర్బల = బలములేని;
పంక్తులు = మృగముల బారులు; ఏమిలెక్క? = లెక్కయేమి ?-వానివిషయమై లక్ష్యమే లేదు
కండగరువంపుమాటలు = కండబలిసిన క్రొవ్వుచేతఁ జెప్పెడి (వ్యర్థపు) మాటలు; కావుసు
కావుసుమీ; మఱ్ఱున్; చూడు = నీవు (వేఁటయందు) చూడుము; అని; పంతంబులు =
లను; ఆడుకొనుచున్ = చెప్పుకొనుచు; అవ్వరూథినిసుతున్ = వరూథినికొడుకైన
స్వరోచిని; కొల్చి = సేవించి; అపుడు = ఆ సమయమునందు; అరిగిరి = (వాగురికులు) పో
అలం. కావ్యార్థాపత్తి.

ఆ. మువ్వ గదల నత్తెములనుండి యెగురుచుఁ, బదను మీఱ నెరల వెదక
పదువు వట్టి దండపాణులై నడచిరి, విభునిగెడల డేగ వేఁటకాండ్రు.

టీ. డేగవేఁటకాండ్రు = డేగలచే వేఁటాడించువారు; మువ్వ = కాలికిఁగట్టియు
గజ్జె; కదలన్ = చలించునట్లు; అత్తెములనుండి = హస్తకవచములందుండి; ఎగురుచున్ =
కెగయుచును; పదను = సమయము - ఎరయిచ్చుసమయ మనుట; మీఱన్ = అతిక్రమిం
ఎరలన్ = ఆహారములను; వెదకు డేగపదువు = వెదకునట్టి డేగలయొక్క గుంపును; పట్టి =
లందుఁ బట్టుకొని; దండపాణులై = కఱ్ఱలు చేతులఁ బూనినవారై; విభునిగెడలన్ =
స్వరోచియొక్క ప్రక్కలలో; (పా. ప్రోలన్ = ముందటిప్రక్క;) నడచిరి. అలం. స్వభా

ఆ. గూనివీఁపు లదుర గొణఁగి తిట్టుచు నేకుఁ, గఱచినట్టి కుక్క గండ్లనం
మూతినరపమీసములబోయముదుసళ్లు, పందివలలు మోచి పఱచి ర

టీ. గూనివీఁపులు = నడుము వంపుగలవీఁపులు; అదురన్ = వణఁకఁగా; గొణఁగి =
గొణయని - విశదపడన ట్లనుట; తిట్టుచున్ = (అధికారులను) తిట్టుచును; ఏకు...నంగన్ - ఏ
దూదిచుట్టను; కఱచినట్టి = నోటఁగఱచుకొన్న; కుక్కగండ్లు అనంగన్ = కుక్కపోతులో
నట్లు; మూతి...ముదుసళ్లు - మూతి = నోటిముందటిభాగమునందలి; నరపమీసముల =
మీసములుగల; బోయముదుసళ్లు = ముసలిబోయవాండ్రు; అపుడు; పందివలలు = పం
బన్నునట్టి వలలను; మోచి = మోసికొని; పఱచిరి = పరుగెత్తిరి. అలం. ఉత్ప్రేక్ష, స్వభా

వ. ఇట్లరిగి యమ్మహారణ్యంబు సొచ్చి విచ్చలవిడి నచ్చటం బచ్చికబయళ్ల వ
లచ్చుపడం దటిచ్చటులంబగు లోచనప్రభాపటలంబు దిక్తటంబులం
దాఱుమాఱుపడ నిడికొనిన మొగంబులతో నేణీజిహ్వాపల్లవోల్లిహ
నాంగంబు లగు సారంగంబుల ఖురళికారంగంబులనం గనుపట్టు చెలికపట్టు
బిట్టైసంగు నాఁకటం దట్టువడి పొట్టకై పుట్టకూటికిం జీమలకుం జెద

నెలుంగులు గులగుంం బుట్టలు నిశితనిజనఖరకులిశకోటులం గోరాడ నా దండఁ గాచుకొనియుండి వెడలి చను విషవిస్ఫురద్భుజంగంబుల సల్లడం గబళించి గెంట కుండ దంటుచప్పరించుగతిం జప్పరించుచు నొండొంటికిం బేరెంబులువాఱి కుప్పించి తప్పించుకొను దుప్పుల ఖురజ రజశ్ఛటల నెసకమెసంగు మసమసకల మఱుంగునడియుండు గండోపలంబులును, బరిహసితసితేతరపాషాణపాటవంబు లగు విషాణపరిఘంబు లొండొంటిందాఁకి కఠిల్లుపెఠిల్లుమనం బోరు కారుపోతుల కోలాహలంబులం బ్రతిశబ్దంబులీను కోనలును, మద మొదవ నెదపదనునం బొదలు వెట్టలకుం జుట్టంబులై చిల్లరసలుగులం బిల్లలం జల్లరంబుల సొగసిచ్చి గమికి వెనుకయై మలయుచుం బిఱుందం దిరుగు చిఱు గున్నలకు వెన్నాడు తోఁడేళ్ల సివంగులం దిరిగి తిరిగి మొత్తి పోనొత్తి చరియించు నేకచరంబుల ఘుర్ఘురధ్వానంబుల ఘూర్ణమానంబులగు పరిగె పక్కి పలుమేరు రేఁగు వేము పులుగుడు గురివెంద యీఁదు గేదంగి మోదు గౌరు కోరింద కనుము కానుగు మొదలగు పొదలం బొడువగు నానావిపినపాదపకలాపంబులును, మాటి మాటికి మానిసికాటు మరగి తెరువులు గాచికాచి దగ్గుత్తికపడం దిను పెద్ద పొలవలనం బుటపుటనై త్రుప్పళ్లు డుల్లి త్రుళ్లి గంతులిడు గబ్బిబెబ్బులుల నలఁగుడుల దొడ్డజనంబులు మంత్రించి పొరక దిగిచిన నీరు మేపుడిగి గిరులు గ్రక్కదల వాపోవుచుం దిరిగి తిరిగి వాకట్టు విడిచినప్పుడు దప్పికై పాఱి సెల యేటిచెంకులం బాఱమ్ములు ఱొమ్ముకెలంకులం గాఁడ గాండ్రు గాండ్రు మని రొప్పి నొప్పి కుప్పరంబుగా వియత్తలంబునకు విల్లెత్తుపొడ వెగసి నెత్తురులు గ్రక్కుచుఁ గూలు క్రోల్పులుల ఘుర్ఘురధ్వనుల గుండియ లవిసి కలఁగుండు వడు కారండవంబుల పక్షపుటపటపటాత్కారంబుల బోరుకలంగు సెలయేటి చెంకులును, మేఁతవెంబడిం బొలముపల్లంబులం దిరిగి తిరిగి వెంట్రికలువెట్టు వెంటపట్టునకు వచ్చి యచ్చటం గ్రుచ్చి కానరాకుండ మునుమున్న మృగ యుండు బిసయొడ్డి సంఘటించిన కాలిబోనులంబడి బెగడక యుద్దారు వీడ్చుకొని యీరములఁ దఱియంబడి యన్వాలికై వెడలి చనలేక గెడసి తన్నుకొను మన్నె మెకంబుల యాక్రందనంబులం గ్రందుకొను విషమప్రదేశంబులును, జిఱుత గండ్లగమిచేత దైవికంబున డాప్రక్క మీఁదువడ దాఁటువడి యవి గొంతు క్రొన్నెత్తురులై క్రోలి విడిచి చన మార్మెడలువడి మశక వనదంశమ్ములు మూఁగ మాఁగంబాఱిన కొండగొఱియ ముఱుగుడు బొందులకు సందడించు కంక గృధ్రావళుల మొల్లంబుల ముసుంగువడు పల్లంబులును, [1]మేఁపుతఱి పీఁచెక్కి ఱేఁ చొకటి మూఁపురంబు గఱచి కఱచి యొఱచి పడవైవం దోడి యొక రెండు మూఁడు వెనుకముందఱ నందంద కాళ్లంబెనంగుచు నత్తునుక లేఱి యేఱి

1. మేయు. పా.

తినఁగా వెడలినయెడ మందు తద్వేదనకుంగాక మట్ట లెత్తుకొని యె
పొదరుటడవులు చొరంబాఱు పిడికడితికదుపునురవడికి విఱిగిపడిన విటపి
బులం దడుకు వ్రేడిచినగతి నొందునెడలును, బదులుపదులు నూఱులున
వేలువేలు గుములుగట్టి దట్టంబగు నెయ్యంబున వెదురుబియ్యంబు లో
కొనంగఁ గరివర కరేణువులు వంప [1]ముంపుచెడి యిట్టట్టుపడి తిట్టలగ
సంకటంబులగు డొంకలు నీక్షించి హర్షించి యెక్కుడుఁదమి నొక
నడుగు వెడలనిటెంకిఁ గని పాఱుగవులునకు మొకము దిగ దని యెన్ని
దూర్పెత్తించి గాలి పరికించి దిగువదెస [2]దొడ్డివల పన్ని యెగువ ప
బారాదియగు దూరంబేఁగఁ బోఁగువాఱించి యత్త్రాట వలమోవం బె
యెత్తినతెరఁ దుత్తుమునుగాఁ జించుకొని పాఱినం బోనీక బారిసమ
వలచుట్టునుం జెట్టుదండఁగొని నిలువ నలువుగల పుళిందులఁ గొందఱ
యమ్మంటి పిఱుంద జాగిలంబులతోడ వాగురికుల నిలువ నియమించి
లోనగువాని నందుఁ బడంగొట్టించియు గట్టువెంట దట్టంబుగా జోపుడు
నెక్కించి మఱి కలయ గహనతలంబున నెల్లం బెల్లుగా విల్లువేఁటకు నేట
మేటివిలుకాండ్ర మృగములు వెలువడుటకు హరిచ్ఛదచ్ఛటావృత
ధనుష్కోటులై కొట్టికొనిం జూపెట్టుకొని యెదురుమాటులు గాకుండ
చెదరి పొరదెరువులం బఱవకుండ నీరముల సందుసందులం దమత
మోటకత్తుల నొండొండ ఖండితంబులగు మందగల కంపమండలు
మునుములం గనుమ లోనరించుకొనం బంచి తాను నొక్కొక్కయెడం
చారియు నొక్కొక్కయెడఁ దురగాధిరూఢుండునునై యెల్లెడల మెల
గూఁత లెగయఁ బణవ మృదంగ దుందుభి ప్రముఖతూర్యంబులు గొట్టి
గాహళులు వట్టించియు నగ్నియంత్రంబులు ముట్టించియు రొద మిన్ను
జోపువెట్టించిన.

టీ. ఇట్లు = ఈ విధముగా; అరిగి = పోయి; అమ్మహారణ్యంబు = ముందుచెప్పిన పె
వెంబడి గొప్ప యడవిని; చొచ్చి = ప్రవేశించి; విచ్చలవిడిన్ = యథేచ్ఛముగా; అచ్చట
యడవియందు; పచ్చికబయళ్లన్ = పచ్చగడ్డి పెరిఁగిన బయళ్ళయందు; మచ్చికలు =
ములు; అచ్చుపడన్ = స్పష్టమగునట్లు; తటిచ్ఛటులంబగు = మెఱపువలెఁ జలించునట్టి; 
పటలంబు - లోచన = కన్నులయొక్క; ప్రభా = కాంతులయొక్క; పటలంబు = సమ
దిక్తటంబులన్ = దిక్కులకొనలయందు; పర్వన్ = వ్యాపింపఁగా; తాఱుమాఱుపడన్ =
పడునట్లు - ఒక క్రమము లేకుండునట్లనుట; ఇడికొనిన మొగంబులతోన్ = పెట్టుకొన్న
లతో; ఏణీ...బులు - ఏణీ=ఆఁడుజింకలయొక్క; జిహ్వాపల్లవ=చిగుళ్లవంటినాలుకలచేత;
మాన = ఎగనాకఁబడుచున్న; అంగంబులు = దేహములుగలిగినట్టివి; అగు; సారంగంబుల
రంగంబులు = మగజింకలయొక్క గరిడీసాలలో; అనన్ = అనునట్టు; కనుపట్టుచెలికపట

1. గుంపు. పా. 2. దొడ్డ. పా.

అగపడుచున్న విరివిగల బీటినేలలును - అనఁగా నచ్చటఁ బచ్చిక కడుపాఱ మేసి హాయిగాఁ బండుకొని తమకుఁ బ్రియులైన లేళ్లు నాకుచుండఁగా నందులకుఁ దగినట్లు మెడలు త్రిప్పుకొనుచుండెడి యిఱ్ఱిగుంపులకు గరిడీసాలలో యనఁదగిన కంచెపొలము లని తాత్పర్యము. (అలం. స్వభావోక్తి, ఉత్ప్రేక్షయు.) బిట్టు = మిక్కిలి; ఎసంగునాఁకటన్ = అతిశయించుచున్న యాకటిచేత; తట్టువడి = డీలుపడి - డస్సి; పొట్టకై = కడుపునకై - తిండికై యనుట; పుట్టకూటికిన్ = పుట్టలోని యాహారము (తేనె) కొఱకును; (చీమగ్రుడ్లచే ముద్దముద్దగా నేర్పడిన పుట్టమట్టికొఱకును అని పూర్వవ్యాఖ్య.) చీమలకున్ = చీమలకొఱకును; చెదలునకున్ = చెదపురుగులకొఱకును; ఎలుంగులు = ఎలుఁగుగొడ్లు; గులగులన్ = గులగులయను ధ్వనితో; పుట్టలు = చీమపుట్టలను; నిశిత...కోటులన్ - నిశిత = వాఁడియైన; నిజ = తమయొక్క; నఖరకులిశ = వజ్రాయుధమువంటి గోళ్లయొక్క; కోటులన్ = కొనలతో; కోరాడన్ = మట్టి చెదరఁద్రవ్వఁగా; ఆ దండన్ = ఆ పుట్టలవెంబడి; కాచుకొనియుండి = కనిపెట్టుకొనియుండి; వెడలి = (ఎలుఁగుగొడ్లు త్రవ్వెడి పుట్టలలోనుండి) బయలుదేఱి; చను...బులన్ - చను = పోవుచున్న; విష = విషముచేత; విస్ఫురత్ = తేజరిల్లుచున్న; భుజంగంబులన్ = పాములను; నల్గడన్ = నాలుగుదిక్కులను జేరి; కబళించి = నోళ్ళతోఁ గవ్విపట్టి; గెంటకుండన్ = ఇటునటుఁ దెమలకుండునట్లు; దంటు చప్పరించుగతిన్ = చొప్పకఱ్ఱను పండ్లతో నదిమి రసము పీల్చునట్లు; చప్పరించుచున్ = పండ్లతోనొక్కి నెత్తురు పీల్చుచు; ఒండొంటికిన్ = ఒకటిమీఁది కొకటి; పేరెంబులువాఱి = పరుగెత్తి; నుప్పించి = నేలఁగాళ్లూని యెగిరి; తప్పించు...ఛటలన్ - తప్పించుకొను = తమపైఁబడి వచ్చువానికిఁ జిక్కకుండఁ దొలఁగిపోవుచున్న; దుప్పుల = పృషతమృగములయొక్క; ఖురజ = గిట్టలవలనఁ గలిగిన; రజశ్ఛటలన్ = ధూళిపరంపరలచేత; ఎసకమెసంగు మసమసకలన్ = అతిశయించుచున్న కొంచెపుఁజీఁకటియందు; మఱుంగువడి = చాటువడి - కానరానివై; ఉండు గండోపలంబులును = ఉండునట్టి పెద్ద గుండుఱాలును - అనఁగా నాహారార్థముగా నెలుఁగుగొడ్లు పుట్టలు త్రవ్వి కుళ్లగించునప్పు డా పుట్టలలోనుండి విషము గ్రక్కుచు వెడలివచ్చుచున్న పాములను గనిపెట్టియుండి పట్టి తినుచున్న దుప్పులు క్రొవ్వి యొకటి నొకటి మీఱదాఁటి గంతులు వేయుచుండె ననియు, వానికాళ్ళత్రొక్కుళ్ళచేత లేఁగిన దుమ్ముచేత నందున్న పెద్ద పెద్ద ఱాలు కప్పఁబడుచుండె ననియుఁ దాత్పర్యము. (అలం. స్వభావోక్తి, ఉపమయు.) పరి...బులగు - పరిహసిత = ఎగతాళిచేయఁబడిన - తిరస్కరింపఁబడిన; సితేతర = నలుపైన; పాషాణ = ఱాలయొక్క; పాటవంబులగు = పటుత్వముగలిగినట్టి; విషాణపరిఘంబులు = గుదియకఱ్ఱలవంటి కొమ్ములు; ఒండొంటిన్ = ఒకటితో నొకటి; తాఁకి = తగిలి; కఠిల్లు పెఠిల్లు మనన్ = కఠిల్లు పెఠిల్లు మని ధ్వనింపఁగా; పోరు...బులన్ - పోరు = పోట్లాడుచున్న; కారుపోతుల = అడవిదున్నపోతులయొక్క; కోలాహలంబులన్ = కలకల ధ్వనులచే; ప్రతిశబ్దంబులు = మాఱుమ్రోఁతలు; ఈను కోనలును = పుట్టించుచున్న కొండ సందుగొందులును - అనఁగాఁ గారుమన్నపోతులు నల్లఱాలవలెఁ గఠినములైన తమకొమ్ము లొకటితో నొకటి తగిలి మ్రోఁగునట్లు పోట్లాడఁగా నా ధ్వనులకు నచ్చటి కొండలనడిమి గొందులు ప్రతిధ్వను లిచ్చుచుండె నని తాత్పర్యము. (అలం. స్వభావోక్తి, ఉపమయు.) మదము ఒదవన్ = యౌవనగర్వము కలుగఁగా; ఎదపదనునన్ = చూలు కాలమునందు; పొదలు పెట్టిలకున్ = కామము వర్ధిల్లుచున్న యాఁడుఁబందులకు; చుట్టంబులై = మిత్రములై - తగులాటముగలవై యనుట; (దీనికి ఏకచరంబులు కర్త.) చిల్లరసలుగులన్ = సామాన్యములైన పందులను; పిల్లలన్ = లేఁతపిల్లలను; చుల్లరంబులన్ = ఎడవయసుగల పందులను; సాగనిచ్చి = జరిగిపోనిచ్చి; గమికిన్ = గుంపునకు;

వెనుకయై = వెనుకతట్టు చేరి; మలయుచుఁ = పెనఁగుచు; పిఱుందఁ = వెనుక; తిరుగు చి
లకుఁ = మెలఁగునట్టి చిన్న పిల్లలకు; వెన్నాడు తోఁడేళ్లఁ = వెంబడించి వచ్చునట్టి య
లను; సివంగులఁ = తరక్షువులనెడి మృగములను; తిరిగి తిరిగి = పలుమాఱు తిరిగి; మొత్తి
పోనొత్తి = పోఁదఱిమి; చరియించు...బులఁ - చరియించు = సంచరించుచున్న; ఏకచ
అడవిపందులయొక్క; ఘుర్ఘురధ్వానంబులఁ = గురగుర యనెడి ధ్వనులచేత; ఘూర్ణి
లగు = తిరుగుడుపడుచున్నట్టి; పరిగె...పొదలఁ -పరిగె = పరిగెచెట్టు; పక్కి = పిచు
మేరు=పలుమేరువు; రేఁగు = బదరి; వేము = వేఁపచెట్టు; పులుగుడు = వాతఘ్ని; గురివెం
ఈఁదు = ఈఁతచెట్టు; గేదంగి = కేతకి - పచ్చ మొగలి; మోదుగు = కింశుకము; ఔ
ణము - అవురుగడ్డి; కోరింద = జతూక; కసుము = కసుపగడ్డి; కానుగు = కరంజము;
పొదలఁ = మున్నగు పొదలచేత; పొడువు అగు = ఉన్నతమైనట్టి; నానా...బులును -
అనేకములైన; విపినపాదప = అడవిమ్రాఁకులయొక్క; కలాపంబులును = సమూహ
అనఁగా వయసువచ్చి యెదయయిన సమయమునందు మగవానికూటమివలని కోరికలు పెరు
పెంటిపందులందుఁ దగులాటము గలిగి, సామాన్యపుఁ బందులను, బిల్లలను, నెడగున్నలను గ
ముందు సాగిపోవునట్లు చేసి, యా గుంపునకు వెనుకఁజేరి పెనఁగుచుఁ దమ వెనుక వచ్చెడి
బట్టుకొనిపోవుటకై వెంబడించి వచ్చెడి తోఁడేళ్ళను, సివంగులను వెనుకకు మరలి మరలి
ముచుఁ జరియించునట్టి యడవిపందుల గురగుర ధ్వనులచే నిండుకొన్న పొదలతఱుచునఁ
గుల యడవిమ్రాఁకుల సమూహము లొప్పుచుండె నని తాత్పర్యము. (అలం. స్వభావో
మాటికిఁ = పలుమాఱు; మానిసికాటు = మనుష్యులను గఱచుట; మరగి = అల
తెరువులు కాచికాచి = మనుష్యులు నడచు త్రోవలను కనిపెట్టి; డగ్గుత్తికపడఁ = గొం
దట్టునట్లు; తిను పెద్దపొలవలనఁ = భక్షించునట్టి మనుష్యమాంసమువలన; పుటపుటనై =
బలిసి; త్రుప్పుళ్లు = మేనఁబెరిఁగిన వెండ్రుకలు; దుల్లి = రాలి; త్రుళ్ళి = పొతరించి; గం
దుముకులు వేయునట్టి; గబ్బిబెబ్బులుల నలఁగుడులఁ = తమకకుండెడి పెద్దపులులయొక్క
చేత; దొడ్లజనంబులు = పసులదొడ్లలోని మనుష్యులు; మంత్రించి = వాకట్టుమంత్రము
పొరక దిగిచినఁ = గడ్డిపోఁచతీసి దిగఁదుడువఁగా; నీరు = నీళ్లు త్రాగుటయు; మేపు
మేయుటయు; ఉడిగి = మాని; గిరులు గ్రక్కదలఁ = కొండలు మిక్కిలి కదలఁ
రఁగా; వాపోవుచుఁ = అఱచుచు; తిరిగి తిరిగి = ఇటునటుఁ బలుమాఱు తిరిగి; వాకట్టు
జనములు మంత్రించివేసిన) నోటికట్టు; విడిచినప్పుడు = వదలినప్పుడు; దప్పికై = దాహ
కొనుటకై; పాఱి = పరుగునఁబోయి; సెలయేటిటెంకులఁ = కొండయేళ్ళమడుఁగుఁజొ
పాఱమ్ములు = పాఱవాతిబాణములు; ఱొమ్ముకెలంకులఁ = వక్షస్సున కిరుప్రక్కలను;
నాటఁగా; గాండ్రు గాండ్రు మని = గాండ్రు గాండ్రు మనెడి ధ్వనితో; రొప్పి = గా
కూసి; నొప్పికిఁ = బాధకు; ఉప్పరంబుగాఁ = మీఁదుగా; వియత్తలంబునకుఁ = ఆ
మునకు; విల్లెత్తుపొడువు=వింటిబాణము పోవునంత యెత్తు; ఎగసి = ఎగిరి; నెత్తురులు గ్ర
కూలు...ధ్వనులఁ - కూలు = నేలఁగూలునట్టి; క్రోల్పులుల = పెద్దపులులయొక్క;
ధ్వనులఁ =ఘర్ఘుర యనెడి ధ్వనులచేత; గుండియ లవిసి = గుండెలు పగిలి; కలఁగుండు..
కలఁగుండువడు = కలవరపడునట్టి; కారండవంబుల = కన్నెలేళ్లనెడి పక్షులయొక్క;
దొప్పలవంటి ఱెక్కలయొక్క; పటపటాత్కారంబులఁ = పటపటధ్వనులచేత; బొ
సెలయేటిటెంకులును=మ్రోఁగుచున్న గిరినదులమడుఁగుపట్లను - అనఁగా పెద్దపులులు మ

గఱచి కఱచి వాడుకపడి మనుష్యులు నడచునట్టి త్రోవలంపుఁ జేరి, దొరకినజనులను గొట్టి చంపి తిని బలిసి మేని బొచ్చు రాలి నునుపుమీఱిన దేహములతో సంచరించుచుండు ననియు, వాని బాధకు సహింపక పసులకాఁపరిజనులు మంత్రించి వాకట్టు కట్టఁగాఁ గూయుచు నందందుఁ దిరుగుచుండి వాకట్టు వదలినప్పుడు దప్పిదీఱ నీళ్లు త్రాగ నంపలి సెలయేళ్ళసందులకు నవి పోవుచుండుననియు, నప్పుడు వేఁటకాండ్రు పాఱలవంటి మొనలుగల బాణములను బ్రయోగింపఁగా, నవి ఱొమ్ములందు నాటిన నందులనొప్పికిఁ దాళలేక గాండ్రు గాండ్రు మని యఱచుచు మింటి కెగసి నేలఁ గూలిన పులుల కూఁతలకు గుండెలు పగిలి వెఱచి టప టప ధ్వనితో నెక్కు లాడించుచు నెగిరిపోవుచున్న కన్నె లేడి లోనగు జలపక్షులు చేయురొదలతో సెలయేటిమడుఁగు లొప్పుచుండె ననియుఁ దాత్పర్యము. (అలం. స్వభావోక్తి.) మేఁతవెంబడిన్ = మేపుగొనఁబోవు వరుసవెంట; పొలము పల్లంబులన్ = అడవిలోని పల్లపుఁ బ్రదేశములందు; తిరిగి తిరిగి = చాలదూరము సంచరించి; పెంట్రికలు పెట్టు పెంటపట్టునకున్ = పేఁడ వేయునట్టి దొడ్డిపట్టునకు; వచ్చి; అచటన్ = ఆ పెంటపట్టునందు; గ్రుచ్చి = నాటి; కానరాకుండన్ = వానికిఁ గనఁబడకుండునట్లు; మునుమున్న = అవి వచ్చి పెంట పట్టు చేరకముందే; మృగయుండు = వేఁటకాఁడు; బిస = త్రొక్కఁగాఁ బిగిసికొనఁదగిన కీలు; ఒడ్డి = పన్ని; సంఘటించిన కాలిబోనులన్ = జతపఱిచిన కాలికిఁ దగులుకొను బోనులలో; పడి= తగులుకొని; బెగడక = బోనులోఁ దగులుకొన్నందులకు భయపడక; అద్దారువు = ఆ బోనుమ్రాను; ఈడ్చుకొని = లాగుకొని; ఈరములన్ = పొదరిండ్లను; తఱియంబడి = తఱిసి - చేరి; అవ్వలికై = ఆ పొదరిండ్లనుండి యవతలికి; వెడలి = దాఁటి; చనలేక = పోఁజాలక; కెడసి = క్రిందఁబడి; తన్ను...బులన్ - తన్నుకొను = కాళ్లు జాడించుకొనునట్టి; మన్నుమెకంబుల = ఋశ్య మృగముల యొక్క; ఆక్రందనంబులన్ = బాధచే నఱచు నఱపులచేత; క్రందుకొను విషమప్రదేశంబులును = సందడించునట్టి మిట్టపల్లములైన చోట్లును - అనఁగా మనుఁబోతులు మేయఁబోయి యందందుఁ దిరిగి మందపట్టునకు వచ్చి, యచ్చటఁ దాము వచ్చునంతలో వేఁటకాఁడు పన్నియున్న కాలిబోనులలోఁ దగులుకొని, యందులకు దిగులొందక, యా బోనుమ్రాని నీడ్చుకొని పొదరిండ్లఁ జొరఁబోయి, యా పొదలలోఁ జిక్కుకొని యావలఁ బోఁజాలక నేలఁబడి తన్నుకొనుచు నఱచుచుండఁగా సందడి గలిగియున్న ప్రదేశము లని తాత్పర్యము. (అలం. స్వభావోక్తి.) చిఱుతగండ్ల గమిచేతన్ = చిఱుతపులుల సమూహముచేత; దైవికంబునన్ = దైవవశమున; డాప్రక్క మీఁదువడన్ = ఎడమప్రక్క మీఁదగునట్లుగా; దాఁటువడి = చిఱుతపులుల యొక్క దాఁటుటను బొంది - చిఱుతపులు లెగిరి దుమికి పడఁద్రోయఁగాఁ బడి యనుట; అవి = ఆ చిఱుతపులులు; గొంతుక్రొన్నెత్తురులె = కుత్తుకవలని క్రొత్తరక్తములే; క్రోలి = త్రాగి; విడిచి = వదలి; చనన్ = పోఁగా; మార్మెడలువడి = వెనుకకు వ్రేలంబడిన మెడలు గలిగి; మశకవనదంశమ్ములు = దోమలు, నడవియీఁగలును; మూఁగన్ = ముసరఁగా; మాఁగం...బొందులకున్ - మాఁగంబాఱిన = క్రుళ్ల నారంభించిన; కొండగొఱియ = కొండగొఱ్ఱెలయొక్క; ముఱుగుడు బొందులకున్ = క్రుళ్లి కంపెత్తిన దేహములకై; సందడించు...బులన్ - సందడించు = ఒరసికొని తిరుగునట్టి; కంక = రాపులుఁగులయొక్కయు; గృధ్ర = గ్రద్దలయొక్కయు; ఆవళుల = పంక్తుల యొక్క; మొల్లంబులన్ = సమూహములచేత; ముసుంగువడు పల్లంబులును = ఆవరింపఁబడిన పల్లపుఁబ్రదేశములును - అనఁగా చిఱుతపులులు పడ దాఁటి మెడలుకొఱికి నెత్తురు పీల్చి విడిచి పోఁగాఁ బడియున్న కొండగొఱ్ఱెలశరీరములు ముఱిగి కంపెత్తఁగా వానిఁ బెఱుకుకొని తినుటకై బారులుగట్టి వచ్చి యావరించుకొన్న బోరువలయు, గ్రద్దలయు గుంపులతోఁ గూడిన పల్లపునేల

లని తాత్పర్యము. (అలం. స్వభావోక్తి.) మేఁపుతఱిన్ = (పిడికడుతులు) ఆహార
నప్పుడు; ఱేఁచొకటి = ఒక ఱేఁచుకుక్క; వీఁపెక్కి = వీఁపుపై నెక్కి; మూఁపు
భుజశిరమును; కఱచి కఱచి = పలుమాఱు కఱచి; ఎఱచి = మూఁపురపుమాంసమును;
క్రిందఁబడవేయఁగా; తోడి యొక రెండు మూఁడు = వీఁపెక్కియున్న ఱేఁచుజత
మూఁడు ఱేఁచులు; వెనుకన్ = (కడితికి) వెనుకతట్టును; ముందరన్ = ము
అందంద = మఱిమఱి - మాటిమాటికి; కాళ్లన్ = (కడితియొక్క) కాళ్లలో; పెన
పెనఁగొనుచు - చుట్టుకొనుచు; అత్తునుకలు = (ఆ వీఁపుమీఁది ఱేఁచుకుక్క) క్రింద
మాంసఖండములను; ఏఱి యేఱి = ఒక్కొకటిగా నేఱుకొని; తినన్ = తినుచుండఁగ
ఎడలినయెడన్ = పాదము తొలఁగినచోట - కాలెత్తిపెట్ట ననువైనపుడు; మండు తదే
మంటయెత్తుచున్న యా బాధకు; కాక = సహింపనేరక; మట్టలు ఎత్తుకొని =
పైకెత్తుకొని; ఒత్తుగల = ఱెఱుచైన; పొదరుటడవులు = పొదలుబలిసిన యడవులందు;
వడికిన్ - చొరంబాఱు = ప్రవేశింపఁబోవుచున్న; పిడికడితి = ఆఁడుగోకర్ణమృగ
కదుపు = మందలయొక్క; ఉరవడికిన్ = మిక్కుటమైన వేగమునకు; విఱిగి = త
విటపివిటపంబులన్ = నేలఁగూలిన ప్రాఁకు కొమ్మలచేత; తడుకు వొడిచినగతిన్
వేసినవిధమును; ఒందు నెడలును = పొందునట్టి ప్రదేశములును - అనఁగా అ
మేయుచుండఁగా ఱేఁచుకుక్కలు కొన్ని జతగూడి వచ్చి వానిలో నొకటొకటి
వీఁపెక్కి కఱచి మాంసపుఁగండలు పెఱికి క్రిందఁబడవేయఁగాఁ గ్రింద నుండు ఱేఁచు
తినుచు నా కడుతులను బాఱిపోనీక కాళ్ళలోఁ బెనఁగొనుచుండఁగాఁ గాలు వానివల
దీసికొని పొదలుబలిసిన యడవులు చొచ్చుటకై పాఱునప్పు డా వేగమునకు న
కొమ్మలు విఱిగిపడి వెలుఁగువేసిన ట్లున్నప్రదేశము లని తాత్పర్యము. (అలం. స్వభావో
పదులు =పది పదేసియు; నూఱులు నూఱులు = నూఱు నూఱేసియు; వేలు వేలు=వేయి
గుములుగట్టి = గుంపులు గుంపులుగాఁ గూడి; దట్టంబగు నెయ్యంబునన్ = అధిక
మితో; వెదురు బియ్యంబులు = వెదురుధాన్యమును; ఒండొంటికిన్ = ఒకటి కొకటి;
ఇచ్చుటకు; కరివరకరేణువులు = మగవియు, నాఁడువియునైన యేనుఁగులు; వంప
ళ్ళను) వంపఁగా; ముంపుచెడి = తఱుచుఁదనము చెడి - ఒకటితో నొకటి చేరిక
ఇట్టట్టువడి = ఇటునటు వాలి; తిట్టలు = ప్రోగులు; అగు = అగునట్టి; జిట్టలన్ = వె
చేత; సంకటంబులగు = ఇఱుకైనట్టి; డొంకలును = తఱుచుగా నడచుటచేతఁ బల్లమ
లును - అనఁగా మగవియు, నాఁడువియునైన యేనుఁగులు పరస్పరస్నేహముచే
నూఱేసి, వేయేసి యొక్కొక్క గుంపుగాఁ గూడుకొని, వెదురుబియ్యము రాల్చి యొ
యియ్యఁగోరి వెదురుపొదలను దొండములతో వంపఁగా నా వెదుళ్లు గుదురుఁ బా
వాలఁగా రాలిన వెదురువెన్నులు కుప్పలుకుప్పలుగాఁ బడుటచేత నిఱుకటములైన డొ
తాత్పర్యము. (అలం. స్వభావోక్తి.) ఈక్షించి = చూచి - ఈ చెప్పఁబడిన ప్రదేశ
జూచి యనుట; హర్షించి = సంతోషించి; ఎక్కుడుఁదమిన్ = అధికమయిన
ఒక్కయెడన్ = ఒకచోట; అడుగు = పాదము; వెడలనికెంకిన్ = సాగని మఱ
కని = చూచి; వాఱుగవులునకున్ = తోలుపట్టైకంపునకు; మెకము = మృగము; దిగ
నేర దని; ఎన్ని = విచారించి-ఆలోచించి; మున్ను = మట్టి; తూర్పెత్తించి = తూరా
గాలి పరికించి = గాలివాటము పరీక్షించి - ఏతట్టు గాలి గొట్టునదియుఁ దెలిసికొని; ద

గాలికి వాటముగా నుండునైవున; దొడ్డిపల = దొడ్డివలెఁ జుట్టు పాఱవచ్చునట్టి వలను; పన్ని = ఒడ్డి; ఎగువ పొలిమేరన్ = మీఁదియెల్లయందు; బారాది = అధికము; అగు దూరంబు = అయిన దవ్వు; ఏఁగన్ = పోవునట్లు; పోఁగువాఱించి = పోఁగుద్రాడు చుట్టిరాఁ గట్టించి; అత్రాఁటన్ = ఆ పోఁగుఁద్రాటియందు; వల మోవన్ = వల తాఁకునట్లుగా; తెరలెత్తి = అడ్డువల లెత్తి; ఎత్తిన తెరన్ = ఎత్తిన యడ్డువలను; తుత్తుమురుగాన్ = తునుక లగునట్లుగా; చించుకొని పాఱినన్ = చించుకొని (మృగములు) పరుగెత్తినను; పోనీక = తప్పించుకొని పోనియ్యక; బారిసమరుటకున్ = చంపుటకు; వలచుట్టును = జాలముచుట్టును; చెట్టువండగొని = వృక్షము నాసరా చేసికొని; నిలువన్ = నిలుచునట్లు; నలువు = సామర్థ్యము; కల పుళిందులన్ = కలిగిన బోయవాండ్రను; కొందఱన్ = కొంతమందిని; నిలిపి = ఉంచి; అమ్మందిపిఱుందన్ = ఆ బోయలగుంపునకు వెనుక; జాగిలంబులతోడన్ = వేఁటకుక్కలతోఁగూడ; వాగురికులన్ = ఉరు లొడ్డి వేఁటాడెడు వేఁటకాండ్రను; నిలువన్ = ఉండునట్లు; నియమించి = ఆజ్ఞాపించి; తెరకున్ = అడ్డువలకు; లోనగువానిన్ = లోఁబడినమృగములను; అందున్ = ఆ చోటనే; పడఁగొట్టించియున్ = చచ్చిపడునట్లు కొట్టించియును; గట్టువెంటన్ = కొండమీఁదుగా; దట్టంబుగాన్ = తఱుచుగా; జోపుడుఁ బ్రజన్ = రొప్పి వేఁటాడుజనమును; ఎక్కించి; మఱి = మఱియును - ఇంతేకాక; కలయన్ = ఎల్లయెడలను నిండుకొనునట్లు; గహనతలంబున నెల్లన్ = అడవిప్రదేశమంతటను; పెల్లుగాన్ = అధికముగా; విల్లువేఁటకున్ = విల్లుగొని వేఁటాడుటకు; ఏటు = ప్రయోగించిన బాణములయొక్క దెబ్బ; తప్పని మేటివిలుకాండ్రన్ = తప్పిపోకుండఁ బ్రయోగింప నేర్పుగల గొప్ప విలువిద్య నేర్చినవారలను; మృగములు వెలువడుటకున్ = జంతువులు బయట వచ్చుటకు - వేఁటకాండ్ర జాడగని పొదలలో డాఁగిన మృగములే మఱి బయట వచ్చుట కనుట; హరి...టులై - హరిచ్ఛద = పచ్చనియాకులయొక్క; ఘటా = సమూహముచేత; ఆవృత = కప్పఁబడిన; శిరః = తలలును; కటి = మొలలును; ధనుః కోటులై = విండ్లయొక్క కొప్పులును గలవారలై; కొట్టికానిన్ = వేగరిని - మృగముల పోబడి తెలిసికొనివచ్చి చెప్పునట్టివాని ననుట; చూపెట్టుకొని = చూచుచునుండి; ఎదురుమాటులు = ముందఱితట్టు మఱుఁగులు; కాపుండన్ = కాపుండునట్లు; ఉండి = నిలిచి; చెవరి = కలఁతపడి; పారదెరువులన్ = తప్పఁద్రోవలందు; పఱవక = పాఱిపోవక; ఉండన్ = ఉండునట్లు; ఈరముల సందుసందులన్ = పొదలయొక్క నడుమ నడుమ నుండు సందులందు; తమతమ కట్టిన మోటకత్తులన్ = తమ తమ నడుముల నంటఁ గట్టుకొన్న మట్టుకత్తులచేత; ఒండొండ = ఒకటివెనుక నొకటిగా - క్రమముగా; ఖండితంబులు = నఱకఁబడినవి; అగు మండ గల కంపమండలు = అయిన తఱుచయిన రెమ్మల పఱపుగల ముండ్లకొమ్మలను; త్రోచి = అడ్డముగా వేసి; మునుములన్ = మొగదలలయందు; కనుమలు = ఇఱుకుఁద్రోవలు; ఒనరించుకొనన్ = చేసికొనునట్లు; పంచి = ఆజ్ఞాపించి; తానును = స్వరోచియు; ఒక్కొక్క యెడన్ = ఒక్కొకచోట; పాదచారియున్ = కాలినడతో సంచరించువాఁడును; ఒక్కొక్క యెడన్; తురగారూఢుండునై = గుఱ్ఱము నెక్కి తిరుగువాఁడునునై; ఎల్లెడలన్ = ఎల్లదిక్కులందును; మెలంగుచున్ = తిరుగుచును; కూఁతలు ఎగయన్ = కేకలు వ్యాపింపఁగా; పణవ... తూర్యంబులు - పణవ = ఉడుక; మృదంగ = మద్దెల; దుందుభి = పెద్దనగారా; ప్రముఖ = మొదలుగాఁగల; తూర్యంబులు = వాద్యములు; కొట్టించియున్ = వాయింపించియు; కాహళులు= తుతారాలు; పట్టించియున్ = ఊఁదించియు; అగ్నియంత్రంబులు = తుపాకులు మొదలయినవానిని; ముట్టించియున్ = కాల్పించియు; రొద = వానియొక్క ధ్వని; మిన్ను ముట్టన్ = ఆకాశము నంటఁగా; చోపువెట్టించినన్ = కలఁతపెట్టింపఁగా. తర్వాతి పద్యముతో నన్వయము.

మ. చకితైణాహుతిదావ మావళిత పు చ్ఛస్వల్ప గచ్ఛత్తర
క్షుక మద్రి గ్రహయాళు భల్లుకము వ క్షోభాగ నిక్షిప్త డిం
భకవల్గత్ ప్లవగీకదంబము హ్రదాం భఃప్రోత్థితక్రోడనా
యక మాభీలముఖ ద్విపిస్థపుటితం బయ్యెన్ వనం బత్తఱిన్.

టీ. అత్తఱిన్ = ఆ సమయమునందు; వనంబు = అడవి; చకిత...దావము - చకి
పడిన; ఏణ = జింకలనెడి; ఆహుతి = వేల్చునట్టి ద్రవ్యములుగల; దావము = కార్చి
నదియు - వేఁటకాండ్రు చేసెడి మహాధ్వనులకు బెదరి పాఱి జింకలు కార్చిచ్చులోఁ
సాగె ననుట. ఆవళిత...క్షుకము - ఆవళిత = అంతటను ముడువఁబడిన; పుచ్ఛ = తోఁ
స్వల్ప = కొంచెముగా - మెల్లఁగా; గచ్ఛత్ = నడచి పోవుచున్న; తరక్షుకము = సివ
నదియు; అద్రి...భల్లూకము - అద్రి = కొండలను; గ్రహయాళు = పట్టుకొని ప్రాఁ
కము = ఎలుఁగుగొడ్లు గలిగినదియు; వక్షో...కదంబము - వక్షోభాగ= ఱొమ్ములయంద
ఉంచుకోఁబడిన; డింభక = పిల్లలుగలదై; వల్గత్ = దాఁటువేసి పరుగెత్తుచున్న; ప్లవగీ
గోఁతులయొక్క; కదంబము = సమూహము గలిగినదియు; హ్రదాంభః...నాయకము
మడుఁగులయొక్క; అంభః = నీళ్ళయందుండి; ప్రోత్థిత = బయలువెడలిన; క్రోడనా
పెనుఁబందులు గలిగినదియు; ఆభీల...స్థపుటితంబు - ఆభీల = భయంకరమైన; ముఖ =
గల; ద్విపి = పెద్దపులులచేత; స్థపుటితంబు = మిట్టపల్లములుగాఁ జేయఁబడినదియును;
(ద్విపి యన్నందులకు "వ్యాఘ్రే ద్వీపాదద్వీపినౌ మసూర శ్చండకోపనః" అని
రత్నము.)

తా. ఆ సమయమునం దా యడవియంతయుఁ గార్చిచ్చునందుఁబడి కాలిన
తోఁకలు ముడుఁచుకొని మెల్లమెల్లఁగాఁ బరుగెత్తుచున్న సివంగులును, కొండలు
యెలుఁగుగొడ్లును, ఱొమ్మునఁ గఱచుకొన్న పిల్లలతోడ దాఁటిదాఁటి పరుగెత్తుచున్న
గోతులును, మడుఁగులనుండివెడలి పాఱుచున్న పందులును, భయంకరములైన ముఖము
పులులును గలదై యొప్పెను. అలం. స్వభావోక్తి.

క. నెల వెడలియు నెఱి సడలియుఁ, జేల ముడిగియు నిదుర సెడియు జంట
గలహములడఁగియుఁ బఱచెం,బులి కిరి కరి మన్ను దున్న మొదలగు

టీ. నెలవు = నివాసస్థానము; ఎడలియున్ = విడిచియు; నెఱి = బలము; స
వదలియు; చలము = మాత్సర్యము; ఉడిగియున్ = మానియు; నిదుర చెడియున్ = నిద్ర
జంటలు ఎడసియున్ = జతలు ఎడఁబడియు; కలహములు = జగడములు; అడఁగియు
శమించియు; పులి; కిరి = పంది; కరి = ఏనుఁగు; మన్ను = ఋశ్యమృగము; దున్న
పోతు; మొదలగు మెకముల్ = మొదలుగాఁగల మృగములు; పఱచెన్ = పాఱిపోయె

ఉ. అత్తఱి వేఁపికాండ్రు యము నాంబుతరంగపరంపరాకృతిన్
[1]మొత్తములైన సూకర స ముత్కరముం గని మోటుకాండ్రు
ల్లెత్తకమున్న రాజుమది కెక్కుడునట్లుగ దీని మిత్తికిం
బుత్త మటంచుఁ బట్టెడలు బోరన డుయ్య భయంకరార్భటిన్.

1. ముత్తరమైన. పా.

టీ. అత్తఱిన్ = ఆ సమయమునందు; వేఁపికాండ్రు = కుక్కలవాండ్రు; యమునా... ఆకృతిన్ - యమునాంబు = యమునానదినీళ్లయొక్క; తరంగపరంపరా = అలల వరుసలయొక్క; ఆకృతిన్ = ఆకారముతో - విధమున; మొత్తములు+ఐన = గుంపులైనట్టి; సూకర సముత్కరమున్ = పందుల సమూహమును; కని = చూచి; మోటుకాండ్రు = కపటపు మనుష్యరూపములు మాటుచేసికొని వేఁటాడువారు; విల్లు ఎత్తకమున్న = వింటిని పైకెత్తకముందే; రాజుమదికిన్ = రాజైనస్వరోచిమనసునకు; ఎక్కుడునట్లుగన్ = ఇష్టమగునట్లుగా; దీనిన్ = ఈ పందులగుంపును; మిత్తికిన్ = మృత్యుదేవతకు; పుత్తము = బలిగా పంపుదము - చంపుద మనుట; అటంచున్ = అని; బోరనన్ = శీఘ్రముగా; పట్టెడలు = మెడలకుఁ గట్టియున్న తోలుపట్టెలను; డుయ్యన్ = దూయఁగా - వదలింపఁగా; భయంకరార్భటిన్ = భయము పుట్టించునట్టి యఱపులతో. తర్వాతి పద్యముతో నన్వయము. అలం. ఉపమ.

క. జాగిలములు మొఱసడములుఁ, జాగెఁ గలసి చాపముక్త శరగతి; నందా
జాగిలము లెదిరెఁ బందుల, కై; గోధాదికముగాలి కడరె నితరముల్. 41

టీ. జాగిలములున్ = పంది మొదలగువాని వేఁటాడెడు పెద్ద కుక్కలును; మొఱసడములున్ = ఉడుము మొదలగువాని వేఁటాడెడి చిన్న కుక్కలును; కలసి = కూడి; చాప...గతిన్ - చాప = వింటివలననుండి; ముక్త = విడువఁబడిన; శర = బాణముయొక్క; గతిన్ = పోకవంటి పోకతో - మిక్కిలి వడితో; చాగెన్ = బారులుతీరి నడచెను. అందున్ = ఆ కుక్కలయందు; జాగిలములు = పందివేఁట కుక్కలు; పందులకై = పందులమీఁదికి; ఎదిరెన్ = ఎదుర్కొనెను. ఇతరముల్ = తక్కిన ఉడుపకుక్కలు; గోధాదికముగాలికిన్ = ఉడుము మొదలైనవాని పసికి - పసిపట్టి యుడుము మొదలగువానిఁ బట్టుటకు ననుట; అడరెన్ = పూనెను.

సీ. ఎగుచుకూఁతలు ముట్టెయెత్తి బిట్టాలించి, గమికిఁ గన్నాకయి గాలియరయు
వడిఁ గుక్క లంటంగ వచ్చిన మెడ ద్రిప్పి, ఘుర్ఘురించుచు బయల్ గొమ్ముఁ జిమ్ముఁ
దారసించినచోటఁ దారునఁ జొరఁబాఱి, యొకటిరెంటిని దొబ్బ లురులనడుచుఁ
బాలచేరులు వట్టి తూలింప బలిమి నీ, డ్చుకొని డొంకలఁ దూఱి చుట్లఁబెట్టు
తే. నీఁటెపోటుఁబడి ప్రేవులీఁదులాడఁ, బోయి పోలేక దగ దొట్టి పాదలు సాచ్చి
బెండువడియును జొరనీదు పీఁటవెట్టి, చూపులనె యేర్చుఁ బ్రజ నొక్క సూకరంబు.

టీ. ఒక్క సూకరంబు = ఒక పంది; ఎగుచుకూఁతలు = వేఁటకాండ్రు తఱుముటకై వేయు కేకలను; ముట్టెయెత్తి = మోర పైకెత్తి; బిట్టు = శీఘ్రముగా - బాగుగా ననుట; ఆలించి = విని; గమికిన్ = తమగుంపునకు; కన్నాకు = అగ్రేసరము - ముందు నడచునది; అయి; గాలియరయున్ = మనుష్యుల పసిపట్టును. వడిన్ = వేగముతో; కుక్కలు = వేఁటకుక్కలు; అంటంగ వచ్చినన్ = కదియరాఁగా; మెడ = కంఠమును; త్రిప్పి = వెనుకకుఁ ద్రిప్పి; ఘుర్ఘురించుచున్ = గురగుర లాడుచు; బయల్ = ఏమియు లేని బయలియందే; కొమ్మున్ = కోఱకొమ్మును; చిమ్మున్ = విసరును. తారసించినచోటన్ = కుక్కలు మిక్కిలి సమీపించినప్పుడు; దారునన్ = తటాలున; చొరఁబాఱి = వానిపైకిఁ జొచ్చుకొనిపోయి; ఒకటిరెంటిన్ = ఒకటినో రెంటినో కుక్కలను; దొబ్బలు = మాంసపుఁగండలు; ఉరులన్ = వానిదేహమునుండి తెగిపడునట్టు; అడుచున్ = కొమ్ముతోఁ గొట్టును. పాలచేరులు = గజ్జలనరములను; పట్టి = కఱచిపట్టి; తూలింపన్ = కుక్కలు చలింపఁ

జేయఁగా - బాధింపఁగా ననుట; బలిమిన్ = బలముతో; ఈడ్చుకొని = ఆ కుక్కలను లా
డొంకలన్ = పొదకట్టు పల్లపుమార్గములందు; తూఱి = చొచ్చి; చుట్లఁబెట్టున్ = (
బెట్టును. ఈఁటెపోటులన్ = ఈఁటెలతో వేఁటకాండ్రు పొడుచు పోట్లచేత; పడి =
బడి; ప్రేవులు = కడుపులోని ప్రేవులు; ఈఁదులాడన్ = వ్రేలాడఁగా; పోయి = కొంత
పోయి; పోలేక = అవతలఁ బోఁజాలక; దగ=దప్పి; తొట్టి=వ్యాపించి - కలిగి యనుట;
పొదరులను; చొచ్చి = చొరఁబడి; బెండుపడియును = బలహీనతనొందియు; పీఁటవెట్టి =
కొని కదలక కూర్చుండి; ప్రజన్ = జనమును - వేఁటకాండ్రను; చొరనీదు = దగ్గఱ రాని
చూచుటలనె = చూపులచేతనే; ఏర్చున్ = కాల్చును - ఎఱ్ఱని కోపపుఁజూపులతో
గాల్చునట్లు చూచుచుండు ననుట. అలం. స్వభావోక్తి.

క. అట్టియెడ నొక వరాహము, బిట్టడిచిన మెఱసెఁ గుక్క ప్రేవులు దంష్ట్ర
జుట్టుకొని రొంపిఁ గలఁపఁగ, నిట్టలముగఁ దగిలినట్టి యెఱ్ఱలు వోలెన్

టీ. అట్టియెడన్ = ఆ సమయమునందు; ఒక వరాహము = ఒక పంది; బిట్టు =
అడిచినన్ = కొట్టఁగా; కుక్కప్రేవులు = ఒక కుక్కయొక్క ప్రేఁగులు; దంష్ట్రిన్ =
కోఱను; చుట్టుకొని = పెనఁచుకొని; రొంపిన్ = బురదను; కలఁపఁగన్ = కలియఁ
ఇట్టలముగన్ = అధికముగా; కలిగినట్టి యెఱ్ఱలువోలెన్ = కోఱకుఁ జుట్టుకొన్న యెఱ్ఱ
నట్లు; మెఱసెన్ = ప్రకాశించెను. అనఁగా నొక పంది తనమీఁదికి వచ్చిన కుక్కను గడు
నట్లు కోఱకొమ్ముతోఁ గొట్టఁగా నా కొమ్మునందు బురద కలియఁబెట్టునప్పుడు చు
యెఱ్ఱలో యనున ట్లా కుక్కకడుపులోని ప్రేఁగులు చుట్టుకొనియుండెను. అలం. ఉత్ప్రేక్ష

మ. హరిణం బొక్కటి కుక్కతండముఁ బుళిం దానీకముం ద్రోచి యు
ర్వరఁ గా లూఁదక దాఁటు నేటులవికిన్ వాహంబు నడ్డంబు నూ
కి రసావల్లభుఁ డేసె భల్లమున నిం గిం గాళ్లు జోడించుచో
గొరిజల్ నాలుగుఁ ద్రెవ్వ, సేన పొగడెం గోదండపాండిత్యమున్.

టీ. హరిణంబొక్కటి = ఒక జింక; కుక్కతండమున్ = కుక్కలసమూహమును;
కమున్ = బోయలగుంపును; త్రోచి = అతిక్రమించి; ఉర్వరన్ = నేలమీఁద; కాల
అడుగు మోపక; దాఁటన్ = ఎగురఁగా; ఏటులవికిన్ = బాణము ప్రయోగింప వాట
వాహంబున్ = గుఱ్ఱమును; అడ్డంబు నూకి = అడ్డముగా తోలి; రసావల్లభుఁడు =
స్వరోచి; నింగిన్ = ఆకాశమునందు; కాళ్లు జోడించుచోన్ = కాళ్లను కూడఁదీసికొ
యమునందు; గొరిజల్ = జింక గిట్టలు; నాలుగున్; త్రెవ్వన్ = తెగునట్లు; భల్లమున
మును; ఏసెన్ = ప్రయోగించెను. (అప్పుడు) కోదండపాండిత్యమున్ = అతనికిఁ గల
యందలి నేర్పును; సేన = అతనిదండు; పొగడెన్ = స్తోత్రముచేసెను. అనఁగా-ఒక జి
లకు, వేఁటకాండ్రకుఁ జిక్కక కాళ్లు నేల సోఁకనీక యాకాశమున నెగిరిపోవుచుండఁగా
రిన సమయమునం దొక్కటిగాఁ జేర్పఁబడిన దాని నాలుగు కాళ్ళగిట్టల నొక్క బాణము
నఱికెను. అందులకు మెచ్చుకొని సైనికు లందఱు నతని వింటినేర్పును గొనియాడి రని తా

క. పఱచు నొక కడితిఁ బతి ముకుఁ, జెఱమలకై యేయఁ జిప్ప చినుఁగఁగ
క్కఱఁ గాఁడి దుస్సి పాఱిన, నఱిముఱిఁ జొపరువువాఱి యల్లటు వ

టీ. పతి = రాజు - స్వారోచి; పఱచు నొక కడితిన్ = పరుగెత్తిపోవుచున్న యొక కణితిని; ముకుఁజెఱమలకై = ముక్కుపుటములకు సూటిగాఁ దాఁకునట్లు; ఏయన్ = బాణము ప్రయోగింపఁగా; చిప్ప = చిప్పవంటిముక్కు నెముక; చినఁగఁగన్ = చీలిపోవునట్లు; అది = ఆ బాణము; కాఁడి = నాటి; ఉక్కఱన్ = చేవచెడునట్లు; డుస్సి పాఱినన్ = దూసిపోఁగా; అఱిముఱిన్ = తత్తఱపాటుతో; చాపరువువాఱి = చావుపేరెమెత్తి; అల్లటు వడియెన్ = ఎదుటఁ గొంతదూరమునందుఁ బడెను. అనఁగా స్వారోచి, పరుగెత్తుచున్న యొక్క కణితి యను మృగమును ముక్కుఁజెఱమలు తెగ నేయఁగా నా మృగము కొంతదూరము మిక్కిలి వడిగాఁ బరుగెత్తి యంతట నెగిరిపడి చచ్చెను.

మ. గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱమం గాఁ గాంచి రా జేసె; నే
య వడిన్ బాణము వెంటనే నిగిడి పై కట్లేచి రా నేసె రెం
డవకాండంబుఁ; దదస్త్రముం గొనక డా యన్ వచ్చి కౌక్షేయక
ప్రవిభిన్నం బయి నేలఁ గూలెఁ బవిధా రాభిన్నశైలాకృతిన్. 46

టీ. బెబ్బులి = పెద్దపులి; గవిలోన్ = గుహాయందు; డాఁగి = దాఁగి; గ్రుడ్లు = కనుగ్రుడ్లు; మెఱమంగాన్ = చలింపఁజేయఁగా - త్రిప్పి త్రిప్పి చూచుచుండఁగా ననుట; కాంచి = చూచి; రాజు = స్వారోచి; ఏసెన్ = దానిపై బాణము ప్రయోగించెను. ఏయన్ = బాణప్రయోగము చేయఁగానే; బాణము వెంటనే = ఆ బాణము వెంబడినే; వడిన్ = వేగముతో; నిగిడి = సాగి; అటు = ఆ విధముగా; పైకిన్ = రాజుమీఁదికి; ఏచి = విజృంభించి; రాన్ = రాఁగా; రెండవ కాండంబున్ = మఱియొక బాణమును; ఏసెన్ = ప్రయోగించెను. తదస్త్రమున్ = ఆ బాణమును గూడ; కొనక = లక్ష్యముచేయక; డాయన్ = రాజుదగ్గఱ వచ్చి; కౌక్షేయక ప్రవిభిన్నంబయి = కత్తిచేత నఱకఁబడినదై; పవి...ఆకృతిన్ - పవిధారా = వజ్రాయుధముయొక్క యంచుచేత; భిన్న = భేదింపఁబడిన; శైలాకృతిన్ = కొండవిధమున; నేలన్ = భూమిపైని; కూలెన్ = పడెను.

తా. రాజైన స్వారోచి కొండగుహలో దాఁగి కనుగ్రుడ్లు త్రిప్పి చూచుచున్న పెద్దపులిం జూచి, దానిపై నొక బాణమును బ్రయోగింపఁగా నా పులి యా బాణముతోనే యెగిరి మిక్కిలి వడిగొని రాజుమీఁదికి వచ్చెను. అప్పు డతఁడు మఱియొక బాణమును బ్రయోగించియు నది దానిని సైతము లక్ష్యముసేయక దగ్గఱకు రాఁగా, తుద కతఁడు కత్తితో దానిని నఱకి చంపెను. అలం. ఉపమ, స్వభావోక్తియు.

తే. క్రొవ్వి నడగొండకయివడి గునుకు నొక్క
యొంటిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ
గొరక మే నుచ్చి ధరఁ గాఁడ శిరము విసరె
లే దసృక్పాన మనుచుఁ దెల్పెడు ననంగ. 47

టీ. క్రొవ్వి = మదించి; నడగొండకైవడిన్ = నడచునట్టి పర్వతమో యనునట్లు; గునుకు...గానిన్ - గునుకు = చిఱు పరుగెత్తుచున్న; ఒక్క యొంటిగానిన్ = ఒక పందిని; మహీనాథుఁడు = రాజు - స్వారోచి; ఒదిఁగి = ఎదురు దొలఁగి; ఏయన్ = బాణమును బ్రయోగింపఁగా; గొరక = ఆ ప్రయోగించిన బాణము; మే నుచ్చి = దేహమునందుండి దూసి; ధరన్ = భూమియందు; కాఁడన్ = నాటుకొనఁగా; అసృక్పానము = నెత్తురు త్రాగుట; లేదు = కలుగలేదు - నీ

బాణము నా నెత్తురు ద్రాఁగలేదు; అనుచున్ = అని; తెల్పెడున్ అనఁగన్ = తెలియఁజేయుచున్నదో అనునట్లు; శిరము = తలను; విసరెన్ = ఆడించెను.

తా. ఒక బలిసినపంది గునగున పరుగెత్తుచుండఁగా రాజు దానినిఁ జూచి యొక నారసమును బ్రయోగింపఁగా, నది యా పందిదేహమునందుండి యావలికి దూసిపోయి నేల నాటుకొనఁగా నా పంది తల విసరి నేలఁబడియెను. ఆ తలవిసరుట 'యో రాజా! నీవు ప్రయోగించిన బాణము నా నెత్తురు పీల్వలే' దని తెలుపుచున్నదో యన్నట్లుండెను. బాణ మధిక వేగముగా దూసికొనిపోయె నని భావము. అలం. ఉత్ప్రేక్ష.

తే. ఒక్కఁ డడుగెత్తి గొఱక వేయుచును డాఁచి
నట్టరిగి వెంకిఁ గని వీఁకఁ బట్టుటయును
మృగయు లందఱుఁ జని వెల్వరించి నిశిత
కాండములఁ జెండి రొక పెద్ద కారుపోతు. 48

టీ. ఒక్కఁడు = ఒక బోయవాఁడు; అడుగెత్తి = కాలెత్తి - మెల్లఁగా నడచి యనుట; గొఱకవేయుచును = ఎను మఱచినట్లు మెల్లమెల్లఁగా నఱచుచు; (పా. పరకవేయుచును = గడ్డిపోఁచలు పడవేయుచు.) అరిగి = పోయి; వెంకిన్ = (కారుపోతులయొక్క) వెంటపట్టునందు; ఒక పెద్ద కారుపోతున్ = పెద్దదయిన యొక కారుదున్నపోతును; కని = చూచి; డాఁచినట్టు = అక్కడ తాను దానిని డాఁచియుంచినట్లు - డాఁచిపెట్టినచోటికి దారి తప్పక సూటిగా నెట్లు పోవచ్చునో య ట్లనుట; వీఁకన్ = పూనికతో; పట్టుటయును = పట్టుకొనఁగా; మృగయులు = వేఁటకు వచ్చియున్న బోయవాండ్రు; అందఱున్ = అంతమందియును; చని = (ఆ కారుపోతుల వెంటపట్టునకు) పోయి; వెల్వరించి = దానిని వెలుపలి కీడ్చి తెచ్చి; నిశితకాండములన్ = వాఁడి బాణములతో; చెండిరి = ఖండించిరి.

ఉ. ఆ సమయంబునం జకితమై మెక మెవ్వనిమీఁదఁ బాఱె వాఁ
డేసినయమ్ము వమ్మయి మహిం బడ కొక్కటి కొండ చాలి వీ
తాసులఁ జేయ మెచ్చి వసుధాధిపముఖ్యుఁడు మోట్ల నున్న బా
ణాసనభృత్పుళిందులకు నర్థి నొసంగె నభీప్సితార్థముల్. 49

టీ. ఆ సమయంబునన్ = అప్పుడు; మెకము = మృగము; చకితమై = భయపడినదై; ఎవ్వనిమీఁదన్ = ఏ వేఁటకానిమీఁద; పాఱెన్ = పరుగెత్తివచ్చెనో; వాఁడు = ఆ వేఁటకాఁడు; ఏసిన యమ్ము = ప్రయోగించినబాణము; వమ్మయి = వ్యర్థమై; మహిన్ = భూమిమీఁద; పడక = గుఱితప్పి పడిపోక; ఒక్కటికిన్ = ఒక మృగమునకు; ఒండ = ఒక్క బాణమే; చాలి = చాలినదై; వీతాసులన్ చేయన్ = (ఆ మృగములను) పోయిన ప్రాణముకలవానినిగాఁ జేయఁగా - చంపఁగా ననుట; మెచ్చి = మెచ్చుకొని; వసుధాధిపముఖ్యుఁడు = రాజశ్రేష్ఠుఁడు - స్వరోచి; మోట్లన్ = కపటమనుష్యాకృతులమాటున; ఉన్న.. పుళిందులకున్ - ఉన్న = ఉండిన; బాణాసనభృత్ = విండ్లు పూనిన; పుళిందులకున్ = బోయలకు; అభీప్సితార్థముల్ = కోరినపదార్థములను; అర్థిన్ = ప్రీతితో; ఒసంగెన్ = ఇచ్చెను.

తా. వేఁటకాండ్రు తమ యెదుటఁబడ్డ మృగముల నొక్కొక్కదాని నొక్కొక్క బాణముతోఁ దప్పకఁ జంపఁగాఁ జూచి, వారి నేర్పునకు మెచ్చుకొని రా జందఱకుఁ దగిన బహుమానము లిచ్చి మన్నించెను.

ం బాఱినవానిని భటు, లలుంగులపాలాడి ; రధిపు కై పట్టిరి బె
బ్బులి మహిష మెలుంగు కిటి దోంౘెలు మొదలగువానిం గొన్నిటిని వేంటకరుల్.

టీ. భటులు = బంట్లు - విలువేంటకాండ్రు; వలన్ = వలలోనుండి తప్పించుకొని; పాఱిన = పరుగెత్తిపోయిన మృగములను; అలుంగులపాలాడిరి = బాణములపాలు చేసిరి - బాణములు గించి చంపిరి. వేంటకరుల్ = వేంటకువచ్చిన బోయలు; అధిపుకై = రాజునకుం గానుకపెట్టు (వలలోం జిక్కుకొన్న వానిని) బెబ్బులి = పెద్దపులి; మహిషము = కారుమన్నపోతు; ; కిటి = అడవిపంది; తోంౘెలు = తోంౙేలు; మొదలగువానిన్; కొన్నిటిని; పట్టిరి = నిరి.

తా. రాజసేవకులైన విలువేంటకాండ్రు వలలోం దగులుకొని యా వలను జించుకొని పాఱి ద్ది మృగములను బాణములు ప్రయోగించి చంపిరి. వేంటకాండ్రయిన బోయలు రాజునకుం పెట్టుటకై పెద్దపులి, కారుమన్నపోతు, పంది, తోంౙేలు మొదలయిన క్రూరమృగములను లతోనే పట్టి తెచ్చిరి.

మున్ను జాగిలములం గూడి చన్నయట్టి
యుడుపకుక్కలు కుందేళ్ల నుందురువుల
డుముల గ్రహింపం బుట్టల కండలం బొదల
సులసఱులం బసి వట్టి తిరుగుచోట. 51

టీ. మున్ను = మునుపు; జాగిలములన్ = పందుల వేంటాడెడి కుక్కలను; కూడి = చేరి; పట్టి యుడుపకుక్కలు = పోయిన యుడుము లోనగువానిని వేంటాడెడి కుక్కలు; న్ = చెవులపోతులను; ఉందురువులన్ = ఎలుకలను; ఉడుములన్ = గోధికలను; పన్ = పట్టుకొనుటకై; పుట్టలకడలన్ = పుట్టలదగ్గఱను; పొదలన్ = చెట్లపొదల ను; గిరులసఱియలన్ = కొండలయోరలయందును; పసిపట్టి = ఎలుక మొదలగువానివాసన ; తిరుగుచోటన్ = సంచరించుసమయమునందు.

రవస మొప్ప గాలితడం బాటుమెయిం గవిం దూఱి యొక్క కు
క్కురము దమంబులో వెఱంజి కోఁలచేం గబళించి పొట్టపెం
ర నుడు మంచుం దెచ్చి కని చేవ దొఱంగక దుర్గించి వై చెం ద
గురుబిరుద ప్రమాదముల కుం బతి మోద విషాదశాలి గాన్. 52

టీ. ఒక్క కుర్కురము = ఒక యుడుపకుక్క; బరవసము ఒప్పన్ = పూనిక ఒప్పంగా; బాటుమెయిన్ = పసిపట్టుటయందలి పొరపాటుచేత; గవిన్ = గుహయందు; దూఱి = ; తమంబులోన్ = చీంకటిలో; వెఱంజి = జవిరి; కోఁలచేన్ = కోఁలపండ్లచేత; కబళించి = ట్టి; పొట్టపెంజెరన్ = పొట్టపెంజెర యనెడి పెద్ద విషసర్పమును; ఉడుమంచున్ = మనుకొని; తెచ్చి = పట్టి బయటికీడ్చి తెచ్చి; కని = చూచి - పొట్టపెంజెర యని తెలిసి తద్గురు...ములకున్ - తత్ = ఆ కుక్కయొక్క; గురు = అధికమయిన; బిరుద = శూరత్వ ము; ప్రమాదములకున్ = పొరపాటునకును; పతి = రాజు; మోదవిషాదశాలి = సంతోషము , విచారముచేతను నొప్పినవాండు-సంతోషమును, విచారమును బొందినవాండనుట; కాన్ =

అగుచుండఁగా; చేవ = ధైర్యసారమును; తొలంగక = విడువక; త్రుంచి = కఱచి తునకలు చేసి; వైచెన్ = పాఱవేసెను.

తా. ఉడుపకుక్కలలో నొకటి యొక గుహలోఁ దూఱి పసిపట్టుటయందలి పొరపాటుచేత నొక పొట్టపెంజెర యను పెద్దపామును ఉడు మనెడి భ్రమచేఁ బట్టి బయటి కీడ్చుకొనివచ్చి, పిమ్మట నది పా మని తెలిసియు, వెఱవక ధైర్యము వహించి దానిని దునుకలు తునుకలుగాఁ గఱచి పడవేసెను. అది రాజు చూచి, కుక్కయేమఱుపాటునకుఁ బాము కఱచినయెడల బాధ కలిగి యుండునే యను విచారమును, బాముకాటు తప్పించుకొని తునుకలు చేసివేసినందులకు సంతోషమును బొందెను.

క. ఒడ లుబ్బ నిక్కి ముందటి, యడుగులు ధర నూఁది చిందు నలబలమునకున్
జడియ కొక గబ్బిగం డెక్కుడుఁగడిమిం దివిచెఁ గ్రుంగి కొమ్ములయుడుమున్.

టీ. ఒక గబ్బిగండు = గర్వముగల యొక బలిసిన మగకుక్క; ఒడలు = దేహము; ఉబ్బన్ = ఉత్సాహముచే నుప్పొంగఁగా; నిక్కి = నిగిడి; ముందటియడుగులు = ముందటివైనకాళ్లు; ధరన్ = భూమియందు; ఊఁది = అదిమిపెట్టి; చిందునలబలమునకున్ = వ్యాపించునట్టి సందడికి; జడియక = వెఱవక; ఎక్కుడుఁ గడిమిన్ = అధికశౌర్యముతో; క్రుంగి = ముందఱికి మ్రొగ్గి; కొమ్ములయుడుమున్ = కొమ్ములుగల యొక యుడుమును; తివిచెన్ = కలుఁగులోనుండి పట్టి పైకిఁ దీసెను. అలం. స్వభావోక్తి.

తే. కంపతోఁడు గీడ్చిన ట్లేఁదు గానఁ జన్నఁ
దెరు వెఱుంగుచు నొకఁ డేఁగి పరువుతోన
పడి యడఁగి యుండఁగాఁ బట పటన ముండ్లు
గాలిఁ గదలుటఁ గని పంట్రకోలఁ బొడిచె. 54

టీ. ఒకఁడు = ఒక వేఁటకాఁడు; కానన్ = అడవియందు; ఏఁదు = ముండ్లపంది; కంపతోఁడుగు = ముండ్లమండలమోపును; ఈడ్చినట్లు = ఈడ్చుకొనిపోయినట్లు; చన్నన్ = తనమేని ముండ్లు నేల రాచుకొనునట్లు పోవుటచేత; తెరువు = ఆ యేఁదుఁబంది పోయిన మార్గమును; ఎఱుంగుచున్ = తెలిసికొనుచు; ఏఁగి = పోయి; పరువుతోన = పరుగెత్తిపోవుటతోనే; పడి = ఒక మఱుఁగుతావునందుఁ బడి; అడఁగి యుండఁగాన్ =ఉన్నతావు తెలియకుండున ట్లణఁగి యుండఁగా; పటపటనన్ = పటపట యను ధ్వని కలుగునట్లు; ముండ్లు = మేనిముండ్లు; గాలిన్ = గాలిచేత; కదలుటన్ = చలించుటను; కని = చూచి; పంట్రకోలన్ = చిల్లలతోడి మూఁడు నాలు గలుఁగులు గల యినుపకఱ్ఱతో; పొడిచెన్ = ఆ యేఁదుబందిని గ్రుచ్చెను. అలం. ఉపమ.

వ. అత్తఱిం దత్తఱంబున మొత్తంబయి చోపుడుఁగోలలుగొని కెలంకులపొలంబులం బులుఁగులంజోపుచు డేగవేఁటకాండ్రు వేఱుపడి వేటాడం దొడంగి రందు. 55

టీ. అత్తఱిన్ =ఆ సమయమునందు; డేగవేఁటకాండ్రు=డేగలతో వేఁటాడెడి వేఁటకాండ్రు; మొత్తంబయి = గుంపుగూడి; వేఱుపడి = తా మొక గుంపుగా నేర్పడి; తత్తఱంబునన్ = తొందరతో; చోపుడుఁగోలలు = పక్షులను లేవఁదోలెడు కఱ్ఱలను; కొని = తీసికొని; కెలంకుల పొలంబులన్ = ఇరుగుపొరుగు ప్రదేశములందు; పులుఁగులన్ = పక్షులను; చోపుచున్ = లేవఁదోలుచు; వేఁటాడన్= వేఁటాడుటకు; తొడంగిరి = ప్రారంభించిరి. అందున్ = ఆ వేఁటయందు

ఉ. లీలఁ బులిందుఁ డొక్కఁడు కళిందసుతోర్మిసరోజినీదళాం
దోళితకోకరేఖఁ దన తోరపునల్లనిదీర్ఘబాహుపై
హాలహలంబపోలె విడియత్తెఱునం దల యెత్తి చూచు బల్
సాళువముల్ పడిం జను శశంబుపయిన్ విడిచెన్ మహోద్ధతిన్. ౫౬

టీ. పులిందుఁ డొక్కఁడు = ఒక బోయవాఁడు; లీలన్ = విలాసముగా; కళింద... రేఖన్ - కళిందసుతా = యమునానదియొక్క; ఊర్మి = అలలయందలి; సరోజినీ = తామర తీఁగయొక్క; దళ = ఆకునందు; అందోళిత = ఊఁగులాడింపఁబడిన; కోకరేఖన్ = చక్రవాకపక్షి వలె; తన...బాహుపైన్ - తన = తనదైన; తోరపు = లావైన; నల్లని దీర్ఘబాహుపైన్ = నల్లని నిడుపాటి చేతిమీఁద; విడియత్తెఱునన్ = మెఱయుచున్న హస్తకవచముమీఁద; హాలహలంబ పోలెన్ = కాలకూటవిషమువలెనే; తలయెత్తి = శిరస్సు మీఁదికెత్తి; చూచు బల్సాళువమున్ = చూచుచున్న పెద్ద సాళువడేగను; పడిన్ = వేగముతో; చను శశంబుపయిన్ = పోవుచున్న కుందేటిమీఁద; మహోద్ధతిన్ = మిక్కిలి యొగపుతో; విడిచెన్ = వదలెను. అనఁగా నొక బోయవాఁడు నల్లని లావైన నిడుపాటి తనచేతియందు పత్తెఱుపై దలయెత్తి యూఁగులాడుచున్న సాళువపుడేగను వేగముగాఁ బరుగెత్తిపోవుచున్న కుందేటిపై విడిచె నని తాత్పర్యము. (ఇందు యమునయందలి యలలతోఁ గిరాతుని బాహువునకును, తామరాకుతో నత్తెఱునకును, ఆ యాకుపై నున్న చక్రవాకపక్షితో డేగను నుపమానోపమేయభావ మని యెఱుంగునది.) అలం. ఉపమ.

క. మొలదట్టిచెఱఁగుఁ జెక్కుచు, బలుదిట్టకిరాతుఁ డొకఁడు పటువగు ముష్టిన్
సెలకట్టెఁ బట్టి వేఱొక, సెలకట్టెం గొట్టివైచెఁ జెమరుంగాకిన్. 57

టీ. బలుదిట్ట = మిక్కిలి సమర్థుఁడైన; కిరాతుఁ డొకఁడు = ఒక బోయవాఁడు; మొలదట్టి చెఱఁగున్ = నడుమునఁ గట్టుకొన్న కాసెకోకయొక్క కొంగును; చెక్కుచున్ = ఎగదోఁపు కొనుచు; పటువగు = దృఢమైన; ముష్టిన్ = పిడికిట; సెలకట్టెన్ = సెలకట్టె యనెడి డేగను; పట్టి = పట్టుకొని; వేఱొక సెలకట్టెన్ = మఱియొకటియైన యలుఁగుగల బాణముతో; చెమరుంగాకిన్ = చెమరుఁగాకి యనెడిపక్షిని; కొట్టివైచెన్ = కొట్టి నేలఁబడవేసెను. (ఇందు సెలకట్టె యనుదానికిఁ జిన్నకఱ్ఱ యని కొంద ఱర్థము వ్రాసియున్నారు. నిఘంటుకర్తలు బాణ మని యర్థము వ్రాసియున్నారు. జలకట్టె యను పాఠము గ్రాహ్యము కాదు.)

సీ. వెనుదవ్వుదగ దొట్టఁజని రెట్ట వడఁగొట్టె, నుడువీథి [1]వెళగువ్వ నొక్కయఱజు;
ఱెక్కతాఁకున స్రుక్క [2]నిక్కవ్రక్కలు నొక్కె, నుఱుకకల్లేటి నొకకొక్కరణంబు;
పొదఁదూఱు నొకమేటిపూరేటి వెలికిఁబోఁ, దోలి వైకొనె నొక్కతోఁచిగాఁడు;
తను నేలుదొర చిత్తమున మెచ్చఁ దీతువుఁ,జని పట్టె బిట్టొక్కఁ జాలెడేగ;
తే. విజ్జువిజ్జునఁ దన్నంగ విడువ కెలమిఁ, గఱకుటంఘ్రుల నిఱికించి గద్దె గదలఁ
గఱికి నెఱినెఱి కోలెమ్ముకయును విఱుగ,విఱిచె వడిఁ గైజు నొక పెద్దవేసడంబు.

1. బెర. పా. 2. కెక్కి. పా.

టీ. ఒక్క యణుజు = అణు జనెడిజాతి డేగ యొకటి; పెనుదవ్వు = బహుదూరము; దగ దొట్టన్ = దప్పి కలుగునట్లుగా; చని = (తఱుముకొని) పోయి; ఉడువీథిన్ = ఆకాశమార్గమునందు; జెళగువ్వన్ = పావురాపక్షిని; రెట్టవడన్ = మలము జాఱునట్లుగా - పాఱుకొని చచ్చునట్లుగా ననుట; కొట్టెన్ = ప్రహరించెను. ఒక్కోరణంబు = ఓరణ మనెడి యొకజాతిడేగ యొకటి; ఱెక్క తాఁకునన్ = తన ఱెక్క సోఁకుటచేతనే; స్రుక్కన్ = శ్రమపడునట్లు - ముడుచుకొని పోవునట్లు; ఉఱక = లక్ష్యముచేయక; కల్లేటిన్ = కల్లే డనెడు పక్షిని; నిక్కి = సగిడి; ప్రక్కలు నొక్కన్ = పార్శ్వములు కదియఁబట్టి యొత్తెను. ఒక్క తోఁచిగాఁడు = మఱియొక జాతి డేగ యొకటి; పొదన్ = పొదరునందు; తూఱు...రేటిన్ - తూఱు = మఱుఁగునఁ జొచ్చుచున్న; ఒకమేటి పూరేటిన్ = శ్రేష్ఠమయిన యొక పూరే డనెడు పిట్టను; వెలికిన్ = బయటికి; పోఁదోలి = వెడలఁదఱిమి; కైకొనెన్ = పట్టుకొనెను. ఒక్క జాలెడేగ = జాలె యనుజాతిడేగ యొకటి; తను నేలుదొర = తన్నుఁబోషించునట్టి యధికారి; చిత్తమునన్ = మనసునందు; మెచ్చన్ = మెచ్చుకొనునట్లు; చని = పోయి; తీతువున్ = తిత్తిరిపక్షిని; బిట్టు పట్టెన్ = గట్టిగాఁబట్టెను. ఒక పెద్ద వేసడంబు = వేసడ మనెడి యొకజాతిపెద్దడేగ యొకటి; కైజున్ = కైజనెడి పక్షిని; విజ్జువిజ్జునన్ = ఆ కైజు విజ్జువిజ్జను ననుకరణముతో; తన్నంగన్ = తన్నుచున్నను; విడువక = వదలక; ఎలమిన్ = సంతోషముతో; కఱకుటంఘ్రులన్ = కఠినములయిన కాళ్లయందు; ఇఱికించి = ఇఱుకఁబట్టి; గజ్జె = కాలికిఁ గట్టిన మువ్వ; కదలన్ = చలింపఁగా; కఱికి = ఒరపిడిచేసి; నెఱి నెఱికోలెమ్ముకయును = ప్రతి ఱెక్కయొక్క పెద్ద యెముకయు; విఱుగన్ = విఱిగిపోవునట్లు; వడిన్ = వేగముతో; విఱిచెను.

తా. ఆ డేగవేఁటయందు అణుజు, ఓరణము, తోఁచిగాఁడు, జాలె, వేసడము ననెడి పలు తెగల డేగలు జెళగువ్వ, కల్లేడు, పూరేడు తీతువు కైజు అనఁబడు పక్షులను బట్టి కొట్టి చంపి తమ్ముఁ బెంచినవారి కిచ్చెను. అలం. స్వభావోక్తి.

క. నింగికయి కుంచె యెత్తి వె, సం గో యని యార్వఁ బక్షసంహతిగాడ్పుల్
ఱింగని మ్రోయఁ గుజాగ్రపుఁ, గొంగల నొక లగుడు డిగ్గి కొట్టె నిలఁబడన్.

టీ. కుంచె = తోఁకయీఁకలకుచ్చును; నింగికయి = ఆకాశముతట్టునకు; ఎత్తి = పైకెత్తి - ఎత్తి వీచి విడిచి యనుట; వెసన్ = వడిగా; కోయని యార్వన్ = కో యను ధ్వనితో వేటగాఁడు కేకలు వేయఁగా; ఒక లగుడు = లగు డనెడి యొకజాతిడేగ; పక్షసంహతిగాడ్పుల్ = ఱెక్కల సమూహముయొక్క వాయువులు; ఱింగని = ఱింగను ధ్వనితో; మ్రోయన్ = ధ్వనింపఁగా; డిగ్గి = ఆకాశముతట్టునుండి దిగువకు వచ్చి; కుజాగ్రపుఁగొంగలన్ = మ్రానికొననున్న కొంగలను; ఇలఁబడన్ = నేలమీఁదఁ బడునట్లుగా; కొట్టెను. అలం. స్వభావోక్తి.

వ. ఇట్లాఖేటఖేలనంబున వివిధమృగవిహగవధం బాచరించి చాలించి యంచెలంచెలం
బంచతాపతిత చమర సృమర కీరి హరిణ రురు మహిష పృషదంశ గోధికాశశ
పిశితఖండంబు లొండొండ యువ్వొత్తుగా నాకుఁబొత్తరలం గట్టియు గుదులు
గుట్టియుఁ జిక్కంబుల నించియుఁ గావడుల నుంచియు సవరించి, దిగదిగన విసరి
బగబగన మండు చిదుఁగుసొదమంటల కడ్డంబువట్టి మీసంబులు చూఁడిచూఁడి

వాఁడులగు కత్తులం దిత్తు లొలిచి కుత్తుకలు గోసి శితముఖంబులగు నఖంబులం బెకలించి విపుల వపు రపహసిత మహాశైలంబులగు శార్దూలంబుల బొందుల నందందఁ బడవైచి, యంతంతఁ గాంతారంబున దంతురంబుగాఁ బడిన దంతావళంబుల దంతంబులు గైకొనియుఁ దత్కుంభ నిర్గతమౌక్తికంబు లేఱికొనియు, గోఱజంబుం జమరవాలంబుల బర్హిబర్హంబులం బరిగ్రహించియు మరలి, యత్తఱి గడిందినెత్తుగుంబ్రొద్దగుట వెఱ చఱవంజఱవ నేఁడు వెనుముండ్లఁ బండ్లసరియలు నెఱియలు వాఱె బోరనం గాఱు ధారాళరుధిరాసారపూరంబు నాకి నాకి నాలుకలు దిగవైచి యేచిన మహాతపోష్ణంబునం దృష్ణ వొడమి దగ నిగుడ వగ రడరి యొడలం దొడలను మెడలను బెడిదంపు నిడుద కోఱల సలుగు లడిచినయెడలం బొడబొడను వెడలెడు నుడుకునెత్తుటం బడలి తూలు కౌలేయకమ్ముల యంగమ్ము లార్ద్రకర్పటంబులం గప్పి దప్పి నిగుడ, నపాహ్లంబు పశ్చిమపుదండ నుండు వెండికొండబండలఁ జండకర కరహిండనంబునం బౌండుప్రభలు నిండి పఱచు తఱచు సెలయేఱులసూరెలం గాఱుకొను భూరుహనికాయంబుల డాయంజని తద్ఘనచ్ఛాయల నిలిచి యచ్చటం గ్రొచ్చి గరువునేలల గుంట లొనరించి లోన నుమ్మగిలి గబ్బు వలవక కమ్మతావులుగల నావురాకులు పఱచి యెఱచిలో మేలేఱి కారిజముం గందనకాయ క్రొవ్వు మొదలగు మిగులమెత్తనిపలలభిత్తంబు లందుఁ గ్రిందుకొనం గుక్కి యెక్కువతక్కువలు గాకుండఁ గండగల తింత్రిణీశలాటుసంఘాతంబు లామీఁద నెఱియం బచరించి యెసరుగాఁ దేటలగు లేటినల్లలు గుమ్మరించి లవణకణసంచయంబు నించి లావుగాఁ గావుగప్పి యుపరిప్రదేశంబులఁ గారెనుపపెంటపట్లు నీరాఱునేఱుఁబిడుకల దాల్లిడి నెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినం బెచ్చుపెరుఁగుచిచ్చు లా త్రంపులం దవిలించి చిముడ నుడికిన వెలువరించి యుప్పువెప్పునుం గల యప్పిశితఖండంబులు గనగనని నిప్పులం జమురు చిప్పిలం గాల్చిన కమ్మకఱకుట్లుం జట్రాతిపయిఁ గాత్రనికిం గుడుపువెట్టి, పిదపఁ బాళ్ల వెంబడిం బంచుకొని తారు నుపయోగించి తద్దేవతాప్రీతికై తలలుఁ దోఁకలు డొక్కలు నచటి విటపివిటపంబుల వ్రేలం గట్టి శిశిర మధుర సలిలమ్ములు ద్రావి వాగురికులు విశ్రమింప నిలింపాంగనాసుతుండును సహసమాగత చతురవలలకృతపలలఫలమూలాది శుచి మధుర మృగయోచితాహారంబులం దృప్తి వహించి పరిజనారచిత పల్లవాసనాసీనుండై గండూషిత పుండరీక మధురసాసారంబు లగు నిర్ఝరానిలకిశోరంబు లొలయ నలయికలు దీఱ యున్న సమయంబున. 60

టీ. ఇట్లు = ఈ విధముగా; ఆఖేటఖేలనంబునన్ = వేఁటయను క్రీడయందు; వివిధమృగ విహగవధంబు - వివిధ = నానావిధములయిన; మృగ = మెకములయు; విహగ = పక్షు

లయు; వధంబు = చంపుటను; ఆచరించి = చేసి; చాలించి = (వేఁట) నిలిపి; (కర్త
వాసరికులు.) అంచెలంచెలన్ = అక్కడక్కడ; పంచతా...బులు - పంచతా = చచ్చు
పతిత = పడిన; చమర = సవరపుమృగములు; సృమర = పెద్దజాతి సవరపుమృగములు
పంములు; హరిణ = జింకలు; రురు = నల్లచారలదుప్పులు; మహిష = కారెనుఁబోతులు; పృ
జంగుఁబిల్లులు; గోధికా = ఉడుములు; శశ = కుందేళ్లు - అను వీనియొక్క; పిశితఖండ
మాంసపుఁదునుకలను; ఒండొండ = వేఱువేఱుగా; ఉద్వేత్తుగాన్ = విశేషముగా; ఆ
రలన్ = మడఁతపెట్టఁబడిన యాకులందు; కట్టియు = పొట్లముగాఁ గట్టియు; గుదులుగుట్టి
వ్రేలు సరములుగాఁ గూర్చియు; చిక్కంబులన్ = సన్నత్రాళ్లతో నల్లిన చిల్లులసంచ
నించియున్ = నిండించియు; కావడులన్ = కావళ్లలో; ఉంచియున్ = పెట్టియును
రించి = జతపఱుచుకొని; దిగదిగనన్ = దిగదిగ యనునట్లు; విసరి = గాలి గలుగ బట్ట
వానితో విసరి; బగబగనన్ = బగబగ యను ననుకరణముతో; మండు చిదుఁగు సొదమంట
మండునట్టి సన్నపుల్లలచిచ్చుమంటలకు; అడ్డంబువట్టి = అడ్డముగా వ్రేలఁబట్టి; మీ
చూఁడిచూఁడి = కాల్చికాల్చి; వాఁడులగు కత్తులన్ = పదునుకలిగినట్టి కత్తులతో; తిత్తుల
చర్మను లూడఁదీసి; కుత్తుకలు కోసి = గొంతులు నఱికి; శితముఖంబులగు = వాఁడిమొన గ
నఖంబులన్ = గోళ్లను; పెకలించి = ఊడఁబెఱికి; విపుల...శైలంబులగు - విపుల =
వపుః = దేహములచేత; అపహాసిత = నవ్వఁబడిన - తిరస్కరింపఁబడిన; మహాశైలం
దొడ్డపర్వతములు గలిగినట్టి - పెనుఁగొండలవంటి పెద్ద పెద్ద యాకృతులు గలిగిన యనుట
లంబులబొందులన్ = పెద్దపులులయొక్క కళేబరములను; అందంద = అక్కడక్కడనే
డెక్కడ నవి చచ్చిపడియుండునో యక్కడక్కడనే యనుట; పడవైచి = ప్రోగు
(పులిని జంపిన వేఁటకాఁడు దాని మీసాలు కాల్చివేయవలయును. కాల్చివేయని పక్షమున
నా మీసములను సంగ్రహించి పరమాన్నములో వేసి వండి తమకు గిట్టనివారికిఁ బెట్టుదురు
మాన్నము భుజించినవారు విషమెక్కి తోడనే చత్తురని చెప్పుదురు. కనుక నచట
కాల్చి ప్రోగుపడవేసిరని చెప్పఁబడెను.) అంటంతన్ = అంతటంతట - కొంతకొంతదు
దనుట; కాంతారంబునన్ = అడవియందు; దంతురంబుగాన్ = దట్టముగా; పడిన దం
బుల దంతంబులు = పడియున్న యేనుఁగులయొక్క కొమ్ములను; కైకొనియున్ = తీసిక
తత్కుంభనిర్గత మౌక్తికంబులు = ఆ యేనుఁగుల కుంభస్థలములనుండి బయలువెడలిన
ముత్యములను; ఏఱికొనియున్ = ఏర్పఱిచి యెత్తుకొనియును; (ఏనుఁగు కుంభస్థలములందు
ముత్తెములు ఉసిరికకాయలంతేసిగా నుండునని రత్నశాస్త్రమునందుఁ జెప్పఁబడిం
ముత్తెములు పుట్టెడిచోట్లు తొమ్మిది. అవి - ఏనుఁగుతల, మేఘము, పందికోఱ,
ముత్తెపుఁజిప్ప, చేఁపతల, పాముపడగ, వెదురు, చెఱకు. ఇందు మనకు లభించునవి
జిప్పలోఁ బుట్టునవియే.) గోఱజంబున్ = గోరోజనమును; (ఇది మృగముల కడుపు
యెత్తెడి వస్తువిశేషము. దీనిని జేఁతికట్ల యనియుఁ జెప్పెదరు.) చమరవాలంబులన్
ములను; బర్హిబర్హంబులన్ = నెమిలి పురులను; పరిగ్రహించియున్ = సంగ్రహి
యును; మరలి = మరలఁబడి; అత్తఱి = ఆ సమయము; కడింది నెత్తురుంబ్రొద్దు =
యెఱ్ఱగా వెలుఁగునట్టి ప్రొద్దు - మధ్యాహ్నకాలము; అగుటన్ = అగుటచేత; వెఱ
జఱవన్ = భయము కలుగఁగాఁ గలుగఁగా - మిక్కిలి భయంకరమయి యెండ
మింపఁగా; ఏఁదు పెనుముండ్లన్ = ముండ్లపందుల పెద్ద ముండ్లచేత; పండ్లసరియలు

యొండఁగా నేతితెచ్చిన పిడుక.) దాళ్లిడి = పేర్పులుపేర్చి; నెల్లికొయ్యలు = అగ్ని
గజ్జిలను; ద్రచ్చి = మథించి; సుచ్చులు = మేఁక పెంట్రికలు; అంటించినన్ = రగి
పెచ్చుపెరుఁగు చిచ్చులు = రగులుకొని వృద్ధిపొందిన నిప్పులు; ఆ త్రంపులన్ = ఆ దా
తవిలించి = అంటించి; చిముడన్ = మెత్తఁబడునట్లు; ఉడికినన్ = పచనము కాఁగా
రించి = ఆ గుంటలలోనుండి బయటఁదీసి; ఉప్పువెప్పును = ఆవిరిపోక యుడికించుటచే నైన
(పా. అప్పువెప్పును = పచ్చియు వెచ్చియు.) కల యప్పిశితఖండంబులు = కలి
మాంసపుఁదునుకలను; గనగనని నిప్పులన్ = గనగన మండుచున్న నిప్పులయందు;
మాంసపుఁదునుకలలోని నేయి; చిప్పిలన్ = వడియునట్లు; కాల్చిన = ఇనుపసలాకల
ద్రేలఁబట్టి పక్వముగాఁ గాల్పఁగా; కమ్మ = సంబారు చేర్చుటచేఁ బరిమళించుచున్న; క
శూల్యములతో - కఱ్ఱుతోఁ గుట్టిన మాంసఖండములతో; (కఱుకుట్లు, కఱ్ఱుకుట్లు, క ఱకుట్లు
వీనిని వాడుదురు.) చట్రాతిపయిన్ = ఒక చాపఱాతిమీఁద; (ఉంచి) కాఱ్రేనికిన్
తకు; ('కాఱ్రేఁడు' పదమునకు శివుఁడు అని యర్థమయినను నిచట వనదేవత యనుటయే య
యిట్లర్థము వ్రాయనయ్యెను.) కుడుపువెట్టి = ఆరగింపుచేసి - నివేదించి; పిదపన్ = తరువా
వెంబడిన్ = తమ తమ భాగములచొప్పున; పంచుకొని = భాగించుకొని; తారును = తాను
యోగించి = భుజించి; తద్దేవతాప్రీతికై = ఆ కాటిరేని ప్రీతికొఱకు; తలలు = (ఆ మ
తలలును; తోఁకలు = వాలములును; డొక్కలును = భుజములకుఁ దొడలకు నడిమి దేహభా
అచటి విటపివిటపంబులన్ = అక్కడి మ్రాఁకులకొమ్మలందు; వ్రేలంగట్టి = వ్రేల
శిశిర మధుర సలిలమ్ములు = చల్లని తియ్యని నీళ్లు; త్రావి = త్రాగి; వాగురికులు = వేఁట
విశ్రమింపన్ = శ్రమదీఱఁ గూర్చుండఁగా; నిలింపాంగనాసుతుండును = దేవతా స్త్రీ
వరూథినికొడుకును - స్వారోచియు; సహ...బులన్ - సహ = తనతోఁగూడ; స
వచ్చిన; చతుర = నేర్పరులయిన; వలల = వంటవాండ్రచేత; కృత = వంటచేయఁబడిన
మాంసము; ఫల = పండ్లు; మూల = వేళ్లు, దుంపలు; ఆది = మొదలుగాఁగల; శుచి = ప
లైన; మధుర = రుచికరములయిన; మృగయా = వేఁటకువచ్చిన సమయమునకు; ఉచిత
ఆహారంబులన్ = భోజనపదార్థములచేత; తృప్తివహించి = భోజనతృప్తిని బొంది -
భుజించి యనుట; పరి...సీనుండై - పరిజన = పరివారజనులచేత; ఆరచిత = చక్కఁగాఁ
బడిన; పల్లవ = చిగురుటాకులచేనైన; ఆసన = పీఠమునందు - పఱపునందు; ఆసీను
కూర్చున్నవాఁడై; గండూషిత...సారంబులు - గండూషిత = పుక్కిలింపఁబడిన; పుండరీ
దామరలయందలి; మధురస = తేనెయొక్క; ఆసారంబులు = జడికలవి - తెల్లదామరలల
రందము మీఁదుగా వీచుచున్నవనుట; అగు నిర్ఝరానిలకిశోరంబులు = అగునట్టి సెలయేఱ్ఱృవీ
వీచునట్టి పిల్లవాయువులు; ఒలయన్ = మీఁద సోఁకుచుండఁగా; అలయికలు = వేఁటవల
ములు; తీఱి = నివారితమై; ఉన్న సమయంబునన్ = ఉండిన సమయమునందు. తరువా
ములో నన్వయము.

మత్తకోకిల. నిండెఁ గావిరి దిక్తటంబుల; నింగిఁ గుండలిచండరు
జ్మండలిం గనుఁగొంచు మ్రోసెను మాలకాఁకులమూఁక;
య్యుండ నిల్చి యదల్చె నప్డు శి వాళి యూళలఁ; బదన్నగ
ర్భాండభాండము ధూళిధూసర మయ్యె నుద్ధతవాత్యలన్.

టీ. కావిరి = పొగవంటి నల్లఁదనము; దిక్తటంబులన్ = దిక్ప్రదేశములందు; నిండెన్ = ండుకొనెను. నింగిన్ = ఆకాశమునందు; కుండలి...మండలిన్ - కుండలి = గాలిగుడితోడి; ండరుక్ = సూర్యునియొక్క; మండలిన్ = బింబమును; కనుఁగొంచున్ = చూచుచును; మాల కాకులమూఁకలు = తలసయితము నల్లగా నుండెడి బొంతకాకులగుంపులు; మ్రోసెన్ = కూసెను. ప్డు = ఆ సమయమునందు; అయ్యెడన్ = వారున్నచోటికి దాపున; నిల్చి = నిలఁబడి; శివాళి = క్కలబారు; ఊళలన్ = కూఁతలచేత; అదల్చెన్ = అదలించెను - భయము పుట్టునట్లు కూసె నుట. ఉద్ధతవాత్యలన్ = హెచ్చి వీచుచున్నగాలిసమూహముల; (మీఁది కెగురుచున్న సుడిగాలి చేత నని కొందఱు.) పద్మగర్భాండభాండము = కుండవంటి బ్రహ్మాండము; ధూళిధూసరితము = మ్మ్నుచే నించుకమాసిన తెల్లవన్నెగలది; అయ్యెన్. (ఇందుఁ జెప్పఁబడిన కావిరి నిండుట మొదలగునవి యరిష్టసూచకము లని తెలియునది.)

ం. ఆ కొఱగాములఁ గనుఁగొని, శాకునికుం డొకఁడు లేచి సంభ్రమ మొదవన్
జ్యాకలితశరాసనుఁడై, [1]వీకున సైనికులఁ దిట్టి విభుతో ననియెన్. 62

టీ. ఆ కొఱగాములన్ = ఆ దుర్నిమిత్తములను; కనుఁగొని = చూచి; శాకునికుండు = కునలక్షణము నెఱిఁగినవాఁడు; ఒకఁడు; లేచి = కూర్చున్నతావునుండి లేచి; సంభ్రమము = త్తఱపాటు; ఒదవన్ = కలుగఁగా; జ్యా...నుఁడై - జ్యా = అల్లెత్రాటితో; కలిత = కూడిన; రాసనుఁడై = విల్లుగలవాఁడై - ఎక్కుపెట్టినవిల్లు చేతఁ బట్టుకొన్నవాఁడై యనుట. వీకునన్ = ౌద్ధత్యముతో; సైనికులన్ = సేనాజనులను; తిట్టి; విభుతోన్ = రాజుతో; అనియెన్ = ఇట్లు లికెను. అనఁగా - శకునలక్షణము నెఱిఁగిన యొక పురుషుఁడా దుర్నిమిత్తములను జూచి లేచి యెక్కుపెట్టిన విల్లు చేతఁ బట్టుకొని సైనికుల ని ట్లేమఱియుండఁదగునా? యని కోపించి తిట్టి రాజుతో నొక మాట చెప్పె నని తాత్పర్యము.

. తఱచుగ మెకములఁ బొరిగొను, మఱపున వచ్చితిమి; దవ్వు మనపొలమిట; కి
త్తఱి నగు నిమిత్తములు నృప!, కొఱగా; విదె మనకుఁ బెద్దగొడ వగు ననినన్.

టీ. నృప! = రాజా! తఱచుగన్ = అధికముగా; మెకములన్ = మృగములను; పొరిగొను మఱపునన్ = చంపుటవలని పరాకుచేత; వచ్చితిమి. మన పొలము = మన నివాసభూమి; ఇటకున్ = ఈ ప్రదేశమునకు; దవ్వు = దూరము. ఇత్తఱిన్ = ఈ సమయమునందు; అగు నిమిత్తములు = అగునట్టి శకునములు; కొఱగావు = యుక్తములు కావు. ఇదె! = ఇదిగో! ఇప్పుడే యనుట. మనకు; పెద్ద గొడవ = అధికమైన యాపద; అగున్ = కలుగును. అనినన్ = అని చెప్పఁగా. తరువాతి పద్యముతో నన్వయము.

మ. అతఁ డాస్ఫాలితసజ్యకార్ముకుఁడు వాహారూఢుఁడుం బార్శ్వసం
భృతతూణాహ్వృతచండకాండుఁడు దిశాప్రేంఖత్కటాక్షాంచల
ద్యుతిజాలుండునునై పుళిందభటసందోహంబుతోడన్ మహో
ద్ధతి నుండన్ జయలాభసూచకనిమిత్తంబుల్ మెయిం దోఁచినన్. 64

1. వీఁకను. పా.

టీ. అతఁడు = ఆ స్వారోచి; ఆస్ఫాలితసజ్యకార్ముకుఁడుక్ - ఆస్ఫాలిత =
బడిన; సజ్య = ఎక్కువెట్టఁబడిన; కార్ముకుఁడుక్ = విల్లుగలవాఁడును - విల్లెక్కు
మ్రోయించినవాఁడనుట; వాహారూఢుఁడుక్ = గుఱ్ఱము నెక్కినవాఁడును;
కాండుఁడుక్ - పార్శ్వ = ప్రక్కను; సంభృత = చక్కఁగా వహింపఁబడిన; తూ
పొదివలననుండి; ఆహృత = తీసికోఁబడిన; చండ = వాఁడియైన; కాండుఁడుక్ =
వాఁడును; దిశా...జాలుండునై - దిశా = ఎల్లదిక్కులందును; ప్రేంఖత్ =
ప్రసరించుచున్న; కటాక్ష = కడగన్నులయొక్క; అంచల = కొనలయొక్క; ద్యుతి
కాంతి సమూహముగలవాఁడునై; పుళింద...తోడక్ - పుళింద = కిరాతులైన;
యొక్క; సందోహంబుతోడక్ = సమూహముతోఁగూడ; మహోద్ధతిక్ = మిక్కి
పముతో; ఉండక్; జయ...బుల్ - జయలాభ = గెలుపుయొక్క ప్రాప్తిని; సూచక
నట్టి - కనఁబఱచునట్టి; నిమిత్తంబుల్ = శకునములు; మెయిక్ = దేహమునందు;
కనఁబడఁగా - పురుషునికిఁ గుడికన్ను, కుడిభుజము, కుడితొడయు నదరుట శుభసూ
అట్టి శుభసూచకములు తోఁపఁగా ననుట.

తా. స్వారోచి యా మాట వినుచునే యెక్కుపెట్టిన వింటిని, బాణములతో నిం
యమ్ములపొదులను దాల్చి, గుఱ్ఱము నెక్కి, వింటినారి మ్రోయించి, యమ్ములపొదిలో
జేతఁదీసికొని, యెల్లదిక్కులు కలయఁజూచి, బోయబంట్లుండఱుఁ దనవలెనే కట్టాయిత
నప్పుడు కుడికన్నదురుట, కుడిభుజ మదురుట, కుడితొడ యదురుట మొదలగు శ
దేహమునందుఁ దోఁపఁగా.

వ. ప్రాణరక్షాసంశయం బగు మహారణక్షోభం బొక్కటి గలుగు; ప
కేలకు మితివెట్టరాని జయ మంగళంబు లగునని యంతరంగంబున
యూఱడిలు సమయంబున.

టీ. ప్రాణరక్షాసంశయంబు = ప్రాణములను గాపాడుకొనుటయే సందేహమ
అగు మహారణక్షోభంబు = అయినట్టి గొప్ప యుద్ధపుఁగలఁతపాటు; ఒక్కటి;
ముందుగాఁ గలుగును; మీఁదక్ = తరువాత; ఎట్టకేలకుక్ = అతిప్రయాసముచే
రాని = ఇంతయని మేర యేర్పఱుప శక్యముకాని; జయ మంగళంబులు = గెలుపున
అగుక్ = కలుగును. అని; అంతరంగంబునక్ = మనసునందు; నిశ్చయించి = నిర్ణయిం
సమయంబునక్ = మనసు నెమ్మదిపఱుచుకొను సమయమునందు. తరువాతి పద్యముతో

క. ఆ విపినాంతరమున 'హా, హా! వనిత ననాథ నబల నే నార్త విపన్న
గావరె! యీ పుణ్యమునం, బోవరె!' యని పలుకునాఁడునే మొఱ విన

టీ. ఆ విపినాంతరమునక్ = ఆ యడవియందుండి; హాహా! = అయ్యయ్యో!
ఆఁడుదానను; అనాథక్ = దిక్కులేనిదానను; అబలక్ = బలములేనిదానను; ఆర్త
రాలను; విపన్నక్ = ఇడుమునొందినదానను; కావరె! = నన్నుఁ గాపాడరయ్యా
మునంబోవరె! = ఈ సుకృతమునకుఁ బాలుపడరయ్యా! అని పలుకు నాఁడు మొఱ =
చున్న యాఁడుదాని దుఃఖముతోడి విన్నపము; వినఁబడియెక్.

క. ఆ మొఱ వేమఱుఁ జెవినిడి, భూమండలభర్త కరుణ బొడమఁగ నయ్యో!
యే మానిని కెవ్వనిచే, నే మాయెనొ? యనుచు నచటు నీక్షించుతఱిన్.67

టీ. భూమండలభర్త = భూవలయమునకు నధిపతి - స్వరోచి; ఆ మొఱ = ఆ దుఃఖముతోడి విన్నపమును; వేమఱున్ = పలుమాఱు; చెవి నిడి = విని; కరుణ = దయ; పొడమఁగన్ = పుట్టఁగా; అయ్యో! ఏ మానినికిన్ = ఏ స్త్రీకి; ఎవ్వనిచేన్ = ఏ పురుషునిచేత; ఏ మాయెనో ?= ఏమి బాధ కలిగెనో? అనుచున్ = అనుకొనుచు; అచటున్ = ఆ మొఱవిన్నతట్టు ప్రదేశమును; ఈక్షించుతఱిన్ = చూచునప్పుడు. తరువాతి కన్వయము.

శా. మట్టెల్ మ్రోయఁగ గబ్బిచన్నుఁగవ గం పం బంద వేణీభరం
బట్టిట్టై కటిఁ జిమ్మచీఁకటులు గా నశ్రుప్రజం బోడిక
ల్గట్టం జూపులు చిమ్మిరేఁగి దివి రో లంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండు లేని యడవిన్ మీనాక్షి దీనాకృతిన్. 68

టీ. మీనాక్షి = చేఁపవంటికన్నులుగల యొకానొక స్త్రీ; మట్టెల్ = కాలిమెట్టెలు; మ్రోయఁగన్ = ధ్వనింపఁగా; గబ్బిచన్నుఁగవ = బిగువైన స్తనద్వయము; కంపంబు అందన్ = వణఁకును పొందఁగా; వేణీభరంబు = పెద్దదైనజడ; అట్టిట్టై = వీడి యటునిటుఁ జెదరి; కటిన్ = పిఱుఁదులమీఁద; చిమ్మచీఁకటులు = పట్టపుఁజీఁకట్లు; కాన్ = క్రమ్ముకొన్నట్లు కాఁగా; అశ్రుప్రజంబు = కన్నీళ్లసమూహము; ఓడికల్ = ప్రవాహములుగా; కట్టన్ = ఏర్పడఁగా - ఎడతెగక వెల్లువయై పాఱఁగా ననుట; చూపులు = దృష్టులు; చిమ్మిరేఁగి = మిక్కిలి చెదరి; దివిన్ = ఆకాశమునందు; రోలంబాళిన్ = తుమ్మెదలబారును; కల్పింపఁగాన్ = కలుగఁజేయఁగా - బెదరుచూపులతో మీఁదఁ జూచుచు ననుట; మిట్టాడంగన్ = సంచరింపఁగా; నరుండు = మనుష్యుఁడు; లేని యడవిన్ = లేనట్టి యడవియందు; దీనాకృతిన్ = దుఃఖమునొందిన యాకారముతో. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. చేఁపవంటి కన్నులుగల ఒకానొక యాఁడుది వేగముగా నడచుటచేతఁ గాలిమెట్టెలు గల్లుగల్లని ధ్వనింపఁగా, జెడ వీడి చీఁకటి కమ్మినట్లు పిఱుఁదులపర్యంతము తలవెండ్రుక లావరింపఁగాఁ, గన్నులఁ దఱుచుగా నీళ్లు విడుచుచు, బెదరుచూపులతో మిన్ను చూచుచు, జనసంచారములేని యా యడవియందు దీనత్వముతో. అలం. స్వభావోక్తి.

క. ఒక్కతె భయశోకంబుల, వెక్కుచు మెయిఁ గల విలాస విభ్రమలక్ష్మల్
దక్కుటయును నొక యొఱపై, నెక్కొన ధరణీశు నెదుట నిలిచి వినీతిన్. 69

టీ. ఒక్కతె = అట్టి యాఁడుది యొకతెయే; భయ శోకంబులన్ = వెఱపుచేతను, దుఃఖముచేతను; వెక్కుచున్ = వెక్కిలి విడిచినట్లు ధ్వనిగలుగ నేడ్చుచు; మెయిన్ = శరీరమునందు; కల...లక్ష్మల్ - కల = కలిగిన; విలాస = ప్రియదర్శనముచేనైన నడక, చూపు లోనగువానివలని శృంగారచేష్టావిశేషముయొక్కయు; విభ్రమ = మాటలయు, నాభరణములయు విపర్యాసమువలన శృంగారచేష్టావిశేషముయొక్కయు; లక్ష్మల్ = కలుములు; తక్కుటయునున్ = లేకపోవుటయు; ఒక యొఱపై = ఒకవిధమైన సౌందర్యమై; నెక్కొనన్ = తనయందుఁ బాదుకొనఁగా; ధరణీశు నెదుటన్ = రాజైన స్వరోచియెదుట; నిలిచి = నిలువఁబడి; వినీతిన్ = వినయముతో. తర్వాతి పద్యమునందలి 'పలికెన్' అను క్రియతో నన్వయము.

తా. ఆమె ఒక్కతెయే వెక్కివెక్కి యేడ్చుచు విలాసవిభ్రమాదిశృంగారచేష్టలు త
టయు నొక్క యొప్పిదముగాఁ దోఁచుచుండఁగా వచ్చి స్వరోచియెదుట నిలిచి యిట్లు ప

క. పలుచనివాతెఱమెఱుఁగునఁ, బలుమెఱుఁగులు సందడింపఁ బాపటపై
జలిఁ జేర్చి జళుకుఁజూపులఁ, బలుకులఁ బులకండ మొలుకఁ బలికెం గల

టీ. పలుచనివాతెఱమెఱుఁగునన్ = సన్ననిపెదవియొక్క కాంతివిశేషముతోడ;
మెఱుఁగులు = దంతముల కాంతులు; సందడింపన్ = కూడి యతిశయింపఁగా; పాపటపై
కేశవీథిమీఁద; అంజలిన్ = చేమోడ్పును; చేర్చి = కూర్చి; జళుకుఁజూపులన్ = బెదరుఁ
తోను; కలఁకన్ = కలఁతపాటుతోను; పలుకులన్ = మాటలయందు; పులకండము =
చక్కెర - మాధుర్య మనుట; ఒలుకన్ = చిందఁగా; పలికెన్ = ఒక మాట చెప్పెను. అ
నా స్త్రీ స్వరోచికి మ్రొక్కి మధురవాక్యములతోఁ దనవృత్తాంతము నిట్లు చెప్పుకొనెను.

శా. ఓ రాజన్యమహేంద్ర! యో మణిగణ ప్రోతాసివాతాశన
ప్రారజ్యత్కటిచక్ర! యో ముఖరశా ర్ఙ్గక్రూరబాహార్గళా!
యో రుక్మాచలకల్ప! యో కవచిత వ్యూఢాంగ! కావంగదే!
యో రాహుత్తశిరోమణీ! నిరవధి ప్రోద్యత్ప్రతాపారణీ!

టీ. ఓ రాజన్యమహేంద్ర! = ఓ రాజవంశశ్రేష్ఠుఁడా! ఓ మణి...చక్ర! - ఓ =
మణిగణ = రత్నసమూహములచేత; ప్రోత = కూర్పఁబడిన; అసివాతాశన = పామువంటిక
ప్రారజ్యత్ = ప్రకాశించుచున్న; కటిచక్ర! = చక్రాకారమయిన పిఱుఁదులుగలవాఁడా!
బాహార్గళా! - ఓ = ఓయి; ముఖర = మ్రోఁగుచున్న; శార్ఙ్గ = సింగిణివింటితోఁగూడిన; క్ర
కఠినమయిన; బాహార్గళా! = గడెమ్రాఁకులవంటి భుజములుగలవాఁడా! ఓ రుక్మాచలకల్ప! =
బంగారు కొండవంటివాఁడా! - ధైర్యమునందును, దేహకాంతియందును మేరుపర్వతమును
వాఁడా! యనుట; ఓ కవచితవ్యూఢాంగ! = ఓయి కవచము తొడిగిన యున్నతదేహము
వాఁడా! ఓ రాహుత్తశిరోమణీ! ఓయి గుఱ్ఱపురౌతులలో శ్రేష్ఠుఁడా! నిరవధి...పారణీ!
వధి = మేరలేని; ప్రోద్యత్ = మిక్కిలి ప్రకాశించుచున్న; ప్రతాప = ప్రతాపాగ్నికి; అర
నిప్పును బుట్టించెడికఱ్ఱ యైనవాఁడా! కావంగదే! = రక్షింపవయ్యా!

తా. 'రాజవంశశ్రేష్ఠుఁడవును, రత్నములు చెక్కిన పిడి గలిగి పామువలెఁ గ్రూరమైన
ధరించినవాఁడవును, ఎక్కుపెట్టిన సింగిణివింటిని మ్రోయించుచున్నవాఁడవును, మేరుపర
వలెఁ జలింపని ధైర్యమును, బంగారుచాయగల యున్నతదేహమును గలవాఁడవును, గుఱ్ఱపు
లలో శ్రేష్ఠుఁడవును, మిక్కిలి ప్రతాపము గలవాఁడవు నైన యో మహారాజా! నన్ను రక్షి
మనియెను. అలం. ఉపమ, రూపకమును.

క. అనినఁ దలంపున నింపిన, యనుకంప నిలింపచంప కామోదసుతుం
డనునయ మొప్పఁగ నోడకు, మని నిజవృత్తాంత మడుగ నది యిట్లనిర

టీ. అనినన్ = అని యా స్త్రీ ప్రార్థింపఁగా; నిలింప చంపకామోదసుతుండు = సం
పువ్వు పరిమళమువంటి దేహపరిమళము గల దేవతాస్త్రీ కొడుకు - స్వరోచి; తలంపునన్ =
నందు; నింపినయనుకంపన్ = నిండించిన దయతో - మిక్కిలి దయతో ననుట; అనునయ

ఊఱడించుట; ఒప్పఁగన్ = ఒప్పుచుండఁగా; ఓడకుము = భయపడకుము; అని; నిజవృత్తాంతము = ఆమె వృత్తాంతమును; అడుగఁగా; అది = ఆ స్త్రీ; ఇట్లనియెన్.

తా. ఆ వచ్చిన యాఁడుది, యట్లు మొఱపెట్టి ప్రార్థింపఁగా, స్వరోచి మిక్కిలి దయగలవాఁడై దానిని వెఱవకు మని యూఱడించి, నీ వృత్తాంత మేమి చెప్పు మని యడుగఁగా నది యీ మీఁదఁ జెప్పఁ బోవురీతిని జెప్పెను.

సీ. [1]విసమానములు గాఁగ - వసతోడఁ బెనవెట్టి, నెట్టెంబుగాఁ బ్రేవుఁ - జుట్టినాఁడు;
బండికందెనచాయ - బైసిమాలినమేన, మెదడుగందపురొంపి - మెత్తినాఁడు;
కునఖంపు డాచేతి - పునుకకప్పెర నిండఁ, బ్రాణికోటులనల్లఁ - బట్టినాఁడు;
కొకిబికివేసంపు - గూనిమూఁపులమీఁద, మూఁడుపంగలయీఁటె - మోపినాఁడు;

తే. నిట్టతాడనఁ [2]బొడవుచే - నిక్కినాఁడు;
నిడుదకోఱల మిడిగ్రుడ్ల - నెగడినాఁడు;
నరవరోత్తమ! నేఁడుమూ - నాళ్లనుండి
యుసుఱుగొన వెంటఁ దిరిగెడు - నసుర యొకఁడు. 73

టీ. నరవరోత్తమ! = ఓ రాజశ్రేష్ఠుఁడా! విసమానములు గాఁగన్ = హెచ్చుతక్కువలుగా; వసతోడన్ = క్రొవ్వుపొరతో; పెనవెట్టి; నెట్టెంబుగాన్ = గుండ్రతలపాగగా; ప్రేవున్ = ప్రేఁగును; చుట్టినాఁడు = తలకుఁ జుట్టుకొన్నాఁడు; బండికందెనచాయన్ = బండియిరుసునకుఁ బూసెడి మసివన్నెవంటి వన్నెచే; బైసిమాలినమేనన్ = బాగుచెడినదేహమునందు; మెదడుగందపురొంపి = మెదడను చందనపుబురదను; మెత్తినాఁడు = దట్టముగాఁ బూసికొన్నాఁడు; కున...కప్పెర - కునఖంపు = పుప్పిగోళ్లుగల; డాచేతి = ఎడమచేతిలోని; పునుకకప్పెర = తలపుఱ్ఱెచిప్ప; నిండన్ = నిండునట్లుగా; ప్రాణికోటులనల్లన్ = జంతుసమూహముల నెత్తుటిని; పట్టినాఁడు = పట్టుకొనియున్నాఁడు; కొకిబికి = వికారమయిన; వేసంపు... మీఁదన్ - వేసంపు = వేషముగల; గూని = మీఁదికుబుకునట్లు వంగిన; మూఁపులమీఁదన్ = భుజశిరస్సులమీఁద; మూఁడు పంగల యీఁటెన్ = త్రిశూలమును; మోపినాఁడు = పెట్టుకొన్నాఁడు; నిట్టతాడు అనన్ = నిక్కి నిలిచిన తాటిమ్రానో అనునట్లు; పొడవుచేన్ = ఉన్నతిచేత; నిక్కినాఁడు = నిగిడియున్నాఁడు; నిడుదకోఱలన్ = నిడుపాటివంకర ప్రక్కపండ్లచేతను; మిడిగ్రుడ్లన్ = మీఁది కుబికిన కనుగ్రుడ్లచేతను; నెగడినాఁడు = అతిశయించినవాఁడు; అసుర యొకఁడు = ఒక రాక్షసుఁడు; నేఁడు మూనాళ్లనుండి = ఈ దినమునకు మూఁడుదినములనుండి; ఉసుఱుగొనన్ = నా ప్రాణములు తీసికొనుటకై - నన్నుఁ జంపి తినుటకై యనుట; వెంటఁ దిరిగెడున్ = నా వెంటఁ దిరుగుచున్నాఁడు - నన్ను వెంబడించి తిరుగుచున్నాఁడు.

తా. ఓ రాజా! ఒక రాక్షసుఁడు ప్రేఁగులు క్రొవ్వుపొఱతో మెలివేసి చూచువారికి వింతగాఁ దోఁచునట్లు తలకుఁ జుట్టుకొని, నల్లగా రోఁత పుట్టించుచున్న దేహమునందు మెదడు గందము పూసినట్టు దట్టముగాఁ బూసికొని, యెడమచేతిలోఁ దలపుఱ్ఱెపెంకునందుఁ బ్రాణుల నెత్తురు నిండించి పట్టుకొని వికారవేషముతోడి గూనిమూఁపునందు శూలాయుధము ప్రేలఁగా, వంకరలేక పెరిఁగిన తాటిచెట్టువలెఁ బొడుగుపాటి శరీరమును మిట్టకోఱపండ్లును మీఁది కుబికిన

1. విసుమానములు. పా. 2. పొడువు. పా.

కను(గుడ్లును గలిగి, నేఁటికి మూఁడు దినములనుండి నన్నుఁ జంపుటకై వెంబడించి
చున్నాఁడు. అలం. స్వభావోక్తి, రూపకము, ఉత్ప్రేక్షయు.

క. ఏయెడ ననదలమొఱ వా, లాయము వినవలయు 'దుర్బ § లస్య బలం
జా' యన వినవే ? ధరణీ, నాయకులకు నార్తరక్ష § ణంబులె క్రతువు

టీ. ఏ యెడన్ = ఎప్పుడును; అనదలమొఱ = దిక్కుమాలినవారి దుఃఖముతోడి విన్న
వాలాయము = అవశ్యముగా; వినవలయున్ = మీబోఁటివారు వినవలసినది. దుర్బల
రాజా - దుర్బలస్య = బలహీనునికి; బలం = బలము; రాజా = రాజేయగును; అనన్ =
వినవే ! = నీవు విన్నవాఁడవు కావా ? - వినియే యున్నావనుట. (కనుక) ధరణీనాయక
రాజులైనవారికి; ఆర్తరక్షణంబులె = దీనులను గాపాడుటలె; క్రతువుల్ = యజ్ఞ
అనాథులను గాపాడుట అశ్వమేధము మొదలయిన యజ్ఞములు చేయుటవంటి దనుట.

తా. ఓ రాజా ! బలములేని దీనులకు బలము రాజే యని పెద్దలు చెప్పుదురు; కనుక
మొఱ విని నన్నీ యాపదనుండి తొలఁగించి రక్షింపుము. దీనిచే నీకు సమస్తయజ్ఞము
ఫలము సిద్ధించును. అలం. కావ్యలింగము, రూపకము.

క. మరుదశ్వపుత్త్రి కిందీ, వరాక్షగంధర్వరాజు § వలనఁ బొడమితిన్
నరవర ! వెలసితిఁ గళలం, దు రమించుటఁజేసి భువి మ § నోరమ యన

టీ. నరవర ! = రాజా ! (నేను) మరుదశ్వపుత్త్రికిన్ = మరుదశ్వుఁడను గ
కొమార్తెకు; ఇందీవరాక్ష గంధర్వరాజువలనన్ = ఇందీవరాక్షుఁ డనెడు గంధర్వరా
పొడమితిన్ = పుట్టితిని. కళలందున్ = విద్యలందు; రమించుటఁజేసి = వినోదించ
భువిన్ = భూమియందు; మనోరమ యనఁగన్ = మనోరమ యను పేరితో; వెలసితిన్
నొందితిని. అనఁగా నే నిందీవరాక్షుఁ డనెడి గంధర్వరాజు కూఁతురను. నాతల్లి మరుదశ్వ
గంధర్వుని కూఁతురు. నేను సమస్తవిద్యలు నేర్చి, వానియందు రమించుటంజేసి నాకు మ
యని పేరు కలిగెను.

శా. రారాపిల్ల భుజాంగదంబులమణుల్ § రాలంగ విద్యాధరుల్
గారా మొప్పఁగ నెత్తికొంద్రు నను; నం § కస్థాయినిం జేయఁగా
వారిన్ వీడ్కొని సింహపీఠికఁ జల § త్వం బొందు నూతండ్రి మం
జీరం బించుక గల్లుమన్న; నవి దాఁ § జెప్పంగ నిం కేటికిన్ ?

టీ. విద్యాధరుల్ = విద్యాధరు లనెడి దేవజాతివారు; రారాపిల్లన్ = ఒకరి నొకరి
కొని వచ్చునట్టి యొరపిల్లచేత; భుజాంగదంబులమణుల్ = భుజములయొక్క భుజకీ
రత్నములు - భుజకీర్తులందుఁ బొదిగిన రత్నము లనుట; రాలంగన్ = ఊడిపడిపోవుచు
గారాము = గారాబము; ఒప్పఁగన్ = అమరునట్లు; ననున్; ఎత్తికొంద్రు = ఎత్తుకొనుచ
మాతండ్రి; మంజీరంబు = నాకాలియందె; ఇంచుక గల్లుమన్నన్ = కొంచెము గల్లుమని
నను - నేను దనయొద్దకు వచ్చుజాడ కొంచెము తెలిసిన ననుట; అంకస్థాయినిం జేయఁ
నన్నుఁ దనయొడిలోఁ గూర్చున్నదానిఁగాఁ జేయుటకు - ఒడిలోఁ గూర్చుండఁబెట్టుకొనుట
(పా. అంకస్థాయిగాఁ గొల్వులోవారిన్ = ఒడియందున్నదాన నగుటకుఁ గొలువుకూ
దున్నవారిని; ఈ పాఠము ప్రక్షిప్తమని తోఁచెడి.) వారిన్ = ఆ విద్యాధరులను; వీడ

తొలఁగిపొమ్మని; సింహపీఠికన్ = సింహాసనమునందుండి; చలత్వంబొందున్ = కదలికను బొందును - లేచి యెదురుగా వచ్చుననుట. అవి = ఆ సుఖానుభవములను; తాన్ = నేను; ఇంకన్ = ఇఁకను- ఇట్టి దుర్దశను బొందినపిమ్మట; చెప్పంగన్ = చెప్పుట; ఏటికిన్ ? = ఏమిటికి ?- చెప్పుకొనుట వలన గౌరవహానియే కాని ప్రయోజనము లేదనుట.

తా. విద్యాధరులు నేను నేనని యొకరి నొకరు త్రోసికొనివచ్చి యెత్తి ముద్దాడఁగాఁ, గొలువునందున్న మా తండ్రి వారినెల్ల నవతలఁ దొలఁగిపొండని సింహాసనము విడిచి లేచి యెదురుగా వచ్చి యెత్తి యొడిలోఁ బెట్టుకొని గౌరవింపఁగాఁ బెరిఁగినదానను నేను. ఇప్పు డవి యెల్లఁ జెప్పుకొనుట సిగ్గులచేటే కాని యితరము కాదు. కనుకఁ జెప్పుకోరాదు. అలం. స్వభావోక్తి, ఆక్షేపము, ఉదాత్తమును.

తే. దేవ ! [1]పారర్షి పట్టి క ♦ ళావతియును, నల్ల మందారవిద్యాధ ♦ రాత్మజన్మ
యగు విభావసియును నాకుఁ ♦ బ్రాణసఖులు, వారు నేనును నొకనాఁడు ♦ గారవమున.

టీ. దేవ ! = రాజా ! పారర్షిపట్టి = పారుఁడనెడి మునికూఁతురు; కళావతియును = కళావతి యనునదియు; అల్ల...జన్మ - అల్ల = ప్రసిద్ధుఁడయిన; మందారవిద్యాధరాత్మజన్మ = మందారుఁడను విద్యాధరుని కూఁతురు; అగు విభావసియును = అగునట్టి విభావసి యనునదియు; నాకున్; ప్రాణసఖులు = ప్రియురాండ్రైన చెలికత్తెలు. (పా. నాదుప్రాణసఖులు.) వారున్; నేనును; ఒకనాఁడు; గారవమునన్ = పరస్పరప్రేమతో. అనంతర పద్యముతో నన్వయము.

సీ. నెత్తమ్ము లేకొండ ♦ నెత్తమ్ములం దాడు, విద్యాధరీకోటి ♦ విటులతోడ;
నెచటి గాడ్పులఁబుట్టు ♦ విచికిలామోదంబు, శబరకాంతలగుట్టు ♦ సళ్లఁ బెట్టు;
నెన్నగేంద్రపుఁజఱుల్ ♦ మిన్నంది పెన్నంది, కోరాడుఁ దన గుబ్బ ♦ కొమ్ము లొడ్డి;
యెందుండు గురివెంద ♦ పందిళ్లఁ బూఁదేనె, జడి యిందుశిలలందు ♦ జాలువాఱు;

తే. నట్టి కలధౌతశిఖరిఁ బు ♦ ష్పాపచయము
సేయువేడుకఁ బొదరిండ్ల ♦ చాయలందుఁ
దిరుగుచుండి యొకానొక ♦ దెసఁ దృణంబు
దళముగా వాత మొలచిన ♦ బిలమునందు. 78

టీ. ఏ కొండ నెత్తమ్ములందున్ = ఏ కొండమీఁది సమప్రదేశములయందు; విద్యాధరీకోటి = విద్యాధరస్త్రీలసమూహము; విటులతోడన్ = విటకాండ్రతోడ; నెత్తమ్ములు = జూదములను; ఆడున్ = ఆడుచుండునో; ఎచటిగాడ్పులన్ = ఏ కొండమీఁది వాయువులచేత; పుట్టు... దంబు - పుట్టు = జనించుచున్న; విచికిల = చిఱుమల్లెపువ్వులయొక్క; ఆమోదంబు = పరిమళము; శబరకాంతలగుట్టు = బోయెతలమర్మమును - మన్మథవికారములను మఱుఁగుపఱుచునట్టి నేర్పు ననుట; సళ్లఁబెట్టున్ = వదలించునో - ఆ పరిమళముచే బోయెతలు మన్మథబాధితలై ప్రియులకుఁ దమ మోహమును దాఁపలేక బయలుపఱుతు రనుట. ఎన్నగేంద్రపుఁజఱుల్ = ఏ పర్వతశ్రేష్ఠము యొక్క చఱియలను; పెన్నంది = పెద్దనంది - శివునివాహనమైన నందీశ్వరుఁ డనుట; మిన్నంది = మిక్కిలి యుప్పొంగి; తన గుబ్బకొమ్ములు = తలుపుగుబ్బలవంటి తన కొమ్ములను. ఒడ్డి = మొన

1. పాదర్షి. పా.

యించి; కోరాడున్ = పొడిచి మట్టియెత్తి చల్లి యాడునో; ఎందున్ =ఏ కొండయందు; ఉండెడి; గురివెందపందిళ్ల పూఁదేనెజడి = బండిగురిగింజతీగల పందిళ్లవలని పుష్పరస ఇందుశిలలందున్ = చంద్రకాంతపు రాలమీఁద; జాలువాఱున్ = వెల్లువయై ప్రవహించుని కలధౌతశిఖరిన్ = అటువంటి వెండికొండయందు; పుష్పాపచయము చేయువేడుకన్ = కోయుటను చేయునట్టి కుతూహలముచేత; పొదరిండ్ల చాయలందున్ = తీగెయి తిరుగుచున్; ఉండి; ఒకానొకదెసన్ = అందొకతట్టు; తృణంబు = గడ్డి; దళముగాన్ ముగా; వాతన్ = ద్వారముఖమునందు; మొలచిన బిలమునందున్ = మొలచియున్న గు తర్వాతి పద్యముతో నన్వయము.

తా. విద్యాధరస్త్రీలు విటకాండ్రతోడ జూదమాడుచుండెడి మీఁదిభాగపు సమ లును, బోయెతలకు మన్మథవేదన గలిగించునట్టి చిఱుమల్లెలపరిమళములు వెదచల్లెడి గాలియ శ్వరుఁడు కొమ్ములతో గ్రొచ్చి కోరాడుచు వినోదించునట్టి చఱియపట్లును, బండిగురివెంద నుండి స్రవించునట్టి పూఁదేనె కాలువలై పాఱుచున్న చంద్రకాంతమణిప్రదేశములు యొప్పెడి వెండికొండయం దొకానొకచోటఁ బూఁబొదలయందుఁ బూవులు కో యం దొకచోట గడ్డి దట్టముగా మొలచి యావరించుకొన్న ద్వారముగల యొక గు అలం. ఉదాత్తము.

ఉ. ఊసరవెల్లిచందమున నొక్కటఁ బీఱనరాలు దేఱఁగా
మీసలు గడ్డముం జడలు మే నుదరంబును వీనులున్ జరా
ధూసరమైన రోమతతి తోఁ బెనఁగంబడి దూది రాశిగాఁ
జేసినరీతి నున్న యొక జీర్ణమునిం గని కౌతుకంబునన్.

టీ. ఊసరవెల్లి చందమునన్ = ముదిసిన తొండవలె; ఒక్కటన్ = ఏకరీతిని; బీ పెద్ద పెద్ద నరములు; తేఱఁగాన్ = తేటపడఁగా - పైకిఁ గానరాఁగా ననుట; మీసలు లును; గడ్డమున్ = గడ్డమును; జడలు = జటలును; మేను = శరీరమును; ఉదరంబు పును; వీనులున్ = చెవులును; జరాధూసరమైన = ముసలితనముచేఁ దెల్లపడిన - నరసి తతితోన్ = మేనివెండ్రుకల సమూహముతో; పెనఁగంబడి = పెనఁచుకొని; దూది = ప్రత్తి; రాశిగాన్ = ప్రోఁగుగా; చేసినరీతిన్ = చేసినవిధమున; ఉన్న; ఒక జీర్ణముని ముసలిఋషిని; కని = చూచి; కౌతుకంబునన్ = కుతూహలముతో. తర్వాతి పద్యముతో అలం. ఉపమ, ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు.

ఆ. ఇతనివదనకుహర మెద్ది? నేత్రద్వయం, బెద్ది? కర్ణయుగళ మెద్ది?
బూచివోలె నున్న వాచంయముని మోము, బాల్యచాపలమునఁ బట్టు

టీ. ఇతని వదన కుహరము = ఈ ఋషిదైన ముఖద్వారము - నోరు; ఎద్ది? = ద్వయంబు = కన్నుదోయి; ఎద్ది? కర్ణయుగళము = చెవులజంట; ఎద్ది? అనుచున్ = కొనుచు; బూచివోలెన్ = భూతమువలె; ఉన్న వాచంయముని మోము = ఉండినముని మును; బాల్యచాపలమునన్ = పసితనపుఁజపలత్వముచేత; పట్టుటయును = ప అనఁగా నోరు, కన్నులు, ముక్కు, చెవులు నేర్పడక భూతమువలె నున్న యా జూచి, పసితనపుఁజంచలత్వముచే నతని మొగముఁ బట్టుకొనఁగా.

క. ధ్యాన స్తిమితుం డగు న, మ్మౌని మదీయాంగుళీ వి ॥ [1]మర్శనములచే
మే నెఱిఁగి తొంటియనుసం, ధానము చెడి కన్ను దెఱచి ॥ దారుణఫణితిన్. 81

టీ. ధ్యాన స్తిమితుండు = ధ్యానయోగమునందుఁ జలింపనివాఁడు; అగు నమ్మౌని = అయిన యా ఋషి; మదీ...చేన్ - మదీయ = నాసంబంధమైన; అంగుళీ = వ్రేళ్లయొక్క; విమర్శనములచేన్ = విశేషమయినతాఁకుడులచేత; మే నెఱిఁగి = దేహస్మృతిగలవాఁడై; తొంటి యనుసంధానము = మునుపటి ధ్యాననిష్ఠ; చెడి; కన్ను దెఱచి = కన్ను విచ్చి; దారుణఫణితిన్ = క్రూరమయిన మాటల పలుకుబడితో. దీనికి 84-వ పద్యమునందలి 'పలికె' నను క్రియతో నన్వయము.

ఉ. ఓసి దురాత్మురాల ! గృహ ॥ మొల్లక సర్వసుఖంబులున్ నిరా
యాసమునం దొఱంగి మిహి ॥ రాంశు మరు చ్ఛద నీర నీరస
గ్రాసము దేహధారకము ॥ గా గుహలం దప మాచరించు మ
మ్మీసరణిన్ స్పృశించి నగ ॥ నేమి ఫలం బొనఁగూడెఁ జెప్పుమా ? 82

టీ. ఓసి దురాత్మురాల ! = దుష్టస్వభావముగల యో నీచురాలా ! గృహము = ఇల్లు; ఒల్లక = అపేక్షింపక - ఇల్లు వాకిలి విడిచి యనుట; సర్వసుఖంబులున్ = ఎల్ల సౌఖ్యములును; నిరాయాసమునన్ = శ్రమములేమితో - ఎట్లు మానవచ్చునను విచారము కొంచెమైనను లేక యనుట; తొఱంగి = విడిచి; మిహిరాంశు...గ్రాసము - మిహిర = సూర్యునియొక్క; అంశు = కిరణములును; మరుత్ = గాలియును; ఛద = ఆకులును; నీర = జలమునైన; నీరస = సారము లేని; గ్రాసము = ఆహారము; దేహధారకముకాన్ = శరీరమునుధరింపఁజేయునది అగునట్లు; గుహలన్ = కొండగవులయందు; తపము ఆచరించు మమ్మున్ = తపస్సు చేయుచున్న మమ్మును; ఈ సరణిన్ = ఈ విధముగా; స్పృశించి = తాఁకి; నగన్ = నవ్వఁగా - అపహాస్యము చేయుట చేత ననుట; ఏమి ఫలంబు = ఏమి లాభము; ఒనఁగూడెన్ = (నీకు) సిద్ధించెను ? చెప్పుమా !

తా. ఓసి దుష్టురాలా! ఇల్లు, వాకిలి విడిచి సుఖము నపేక్షింపక సూర్యకిరణములను, గాలిని, నీళ్లను, బండుటాకులను నాహారముగాఁ జేసికొని దేహము నిలుపుకొని, గుహలలోఁ దపస్సు చేయుచున్న నన్నుఁ దాఁకి ఇట్లు పరిహాసము చేయుటచేత నీకుఁ గలిగినలాభ మేమో చెప్పుము.

క. తిమిరంపువయసుగుబ్బల, కొమరాలవు నీకుఁ దగిన ॥ గోవాళ్ల మహిన్
వెదకి నగ రాదె ? ముదిసిన, మముఁజెనకిన నేమి గలదు ॥ మద మేమిటికిన్.

టీ. తిమి...లవు - తిమిరంపు = పొగరెక్కిన - మదముచేతఁ గన్ను గానని యనుట; వయసు=యౌవనమునందలి; గుబ్బల = బిగిచన్నులుగల; కొమరాలవు = పడుచవు; మహిన్ = భూమియందు; నీకుఁదగిన గోవాళ్లన్ = నీకుఁదగినట్టి పడుచువాండ్రను; వెదకి = వెదకి; నగరాదె ? = పరిహాసము చేయరాదా ? ముదిసిన మమున్ = ముసలితనమునొందిన మమ్ము; చెనకినన్ = తాఁకఁగా; ఏమి కలదు? = నీ కేమి లాభము గలదు ? మదము = ఇంతక్రొవ్వు; ఏమిటికిన్ ? = ఎందులకు ?

క. ముసురుకొను జరభరంబున, నసురుసురై యున్న మమ్ము ॥ నడకించితి; వి
ట్లుసురుమనఁ బట్టువడు మొక, యసురకు నీ వనుచుఁబలికె ॥ నాగ్రహ మెసఁగన్.

---

1. మర్దనముల. పా.

టీ. ముసురుకొను జరభరంబునన్ = ఆవరించుకొన్న ముసలితనముయొక్క అ
అసురుసురై = మిక్కిలి యలసి; ఉన్నమమ్మున్ = ఉండినమమ్ము; ఇట్లు; అడకించి
సించితివి. (కనుక) ఉసురుమనన్ = ఉస్సురని శ్రమపడునట్లు; నీవు; ఒక యసురకున్
నకు; పట్టుపడుము = చిక్కుకొనుము; అనుచున్; ఆగ్రహము = కోపము; ఎసఁ
యింపఁగా; పలికెను = చెప్పెను - శపించె ననుట.

తా. ముసలితనముచే నలఁతఁబొందినవానిని న న్నీవిధముగాఁ బరిహాసిం
పెట్టితివి గనుక నీ వొక రాక్షసునిచేతఁ బట్టువడి శ్రమపడు మని యా ముని నన్ను శ

క. జననాథ! యేమి చెప్పుదుఁ?, గనలుచు నవ్వగ్గుతపసి కటములు
డన చేతినాగబెత్తముఁ, గొని పసరముఁ గొట్టినట్లు గొట్టె నదయ

టీ. జననాథ! = ఓ రాజా! ఏమి చెప్పుదున్? = (అటు పిమ్మటివృత్తాంత
చెప్పుదును? అవ్వగ్గుతపసి = ఆ బక్కవాఁడగు ముని; కనలుచున్ = కోపముచే మ
కటములు = కణఁతలు; అదరఁగాన్ = చలింపఁగా; అదయుఁడై = దయమాలినవా
నాగబెత్తమున్ = తనచేతిలోనున్న యోగపుబెత్తమును; కొని = తీసికొని; పసరము
కొట్టినట్లు; (నన్ను) కొట్టెన్. అలం. ఉపమ.

క. కొట్టువడి యటకు మునుపే, తిట్టుంబడి యేడ్చు నాదు దెసఁ గని
గట్టలుక [1]పొడమి నాసఖు, లిట్టని రా మునీంద్రుతోడ నెత్తిన పెలు

టీ. కొట్టువడి = దెబ్బపడి; అటకు మునుపే = అంతకుముందే; తిట్టుంబడి = శా
ఏడ్చు నాదు దెసన్ = రోదనము చేయుచున్న నాదురవస్థను; కని = చూచి;
నాచెలికత్తెలు; మదిలోన్ = మనసునందు; కట్టలుక = అధికకోపము; పొడమి =
పెలుచన్ = కలిగిన యాగ్రహముతో; మునీంద్రుతోడన్ = ఆ మునిశ్రేష్ఠునితో; ఇట్ల

ఉ. ఓయి దయావిహీనమతి! యూరక యీ పసిబిడ్డఁ గొట్టఁగాఁ
జే యెటు లాడె నీకు? నిది చేసిన దేమి? వృథా శపింతురే?
బోయవె? యాఁడుఁదోడునను బుట్టవె? శాపనిమిత్తమే తపం
బీయెడ నున్న శాంతిపరు లే మనువా రిఁక నీ చరిత్రకున్?

టీ. ఓయి దయావిహీనమతి! = ఓయి దయలేని బుద్ధిగలవాఁడా! ఊరక
లేక; ఈ పసిబిడ్డన్ = ఈ పిన్నపడుచును; కొట్టఁగాన్ = కొట్టుటకు; చే యెటులా
నీ కెట్లు చే యాడెను? - కొట్టుటకు నీకు సంకోచము లేకపోయెనుగదా! యనుట.
చిన్నది; చేసినది = చేసినతప్పు; ఏమి? వృథా = వ్యర్థముగా; శపింతురే? = తిట్టుదు
న్యాయము కా దనుట. బోయవె? = నీవు కిరాతుఁడవా? కిరాతులకు దయలేకపోవ
ఆఁడుదోడునను = ఆఁడుదైన తోడఁబుట్టువుతో; పుట్టవె? = నీవు పుట్టినవాఁడవు కా
బుట్టిన యాఁడువారు కలవానికి నాఁడుఁబడుచులయెడ దయ యుండకపో దనుట. త
చేయునట్టి యీ తపస్సు; శాపనిమిత్తమే? = ఎవరికైన నిట్లు శాప మిచ్చుటకా?
ఇఁక మీఁద; నీ చరిత్రకున్ = ఇటువంటి నీ నడవడికి; ఈ యెడన్ = ఇక్కడ; ఉన్న శా

1. పొడమ. పా.

ఉండునట్టి సహనము గల మునులు; ఏమనువారు ? = ని న్నేమందురు ? - నిందింతురు గాని గౌర వింప రనుట.

క. పాము కడు ముదిసి కడపట, గా మగుచందమున వార్ధ కంబునఁ గ్రోధం
బేమియు [1]విడువక నుండెడు, నా ముని మునియే? తలంప న సదియుం దపమే?

టీ. పాము; కడుక్ = మిక్కిలి; ముదిసి = ముదిమినొందినదై; కడపటక్ = తుదను; గాము అగుచందమునక్ = గ్రహము అగునట్టివిధమున; (నాగుఁబాము వేయేండ్లు బ్రతికిన సరియు, వేయేండ్లు నయినపిమ్మట అెక్కలు పుట్టి గ్రహమై ప్రాణులను బాధించు ననియు, నదే యడినా గనియుఁ జెప్పుదురు.) వార్ధకంబునక్ = ముసలితనమునందు; క్రోధంబు=కోపమును; ఏమియుక్ = ఏమాత్రమును - కొంచెమైన ననుట; మానక = విడువక; మండెడు నా ముని = కోపవికారముఁ జూపువాఁడైన యా ఋషి; మునియే ? = ముని యగునా ? - ముని కాఁడనుట. తలంపక్ = విచారింపఁగా; అదియుక్ = అటువంటి కోపస్వభావముగల మునిచేయునదియును; తపమే = తపస్సా ?- కా దనుట. అనఁగా శాంతి గలిగి చేసినదే తపస్సును, అట్టితపస్సు చేయువాఁడే తపస్వియుఁ గనుక శాంతిలేని తపస్సు నిరర్థకమనుట. అలం. అప్రస్తుతప్రశంస, ఉపమయు.

క. పరులయపరాధ[2]ములకుం, గెరలక తనుఁ బొగడుచోటఁ గీడాడుచోఁ
బరితోషమును రోషము నెడఁ, జొరనీని తపస్వి సుమ్ము సుకృతి ధరిత్రిన్. 89

టీ. ధరిత్రిక్=భూమియందు; పరులయపరాధములకుక్= ఇతరుల తప్పులకు - తనయెడల నెవరైనను జేయునట్టి తప్పులకు ననుట; కెరలక = కోపింపక; తనుక్ = తన్ను; పొగడుచోటక్= స్తోత్రముచేయునెడను; కీడాడుచోక్ = నిందించునెడను; పరితోషముక్ = సంతోషమును; రోషముక్ = కోపమును - అనఁగాఁ బొగడునప్పుడు సంతోషమును, నిందించునప్పుడు రోషము ననుట; ఎదక్ = మనసునందు; చొరనీని = ప్రవేశింపనియ్యని - కలుగనియ్యని; తపస్వి సుమ్ము = తపస్సుచేయు ముని సుమీ; సుకృతి = పుణ్యాత్ముఁడు.

తా. భూమియందెవ రేమి తప్పు చేసినను సహించి, యొకరు దిట్టినను, దీవించినను మనో వికారము నొందక తపస్సు చేయునట్టి తపస్వియే పుణ్యాత్ముఁడు గాని రాగద్వేషములు గల ముని పుణ్యాత్ముఁడు కానేరఁడు. అలం. అప్రస్తుతప్రశంస.

తే. ఒండొకఁడవైన నిపుడు నీ పిండి యిడమె ?
బ్రాహ్మణుఁడ వౌట మాచేత బ్రతుకు గంటి;
తడవఁ బనిలేదు నిన్ను; గా తమునిగోవ
వనుచు వాదించి విడిచిన నాగ్రహించి.[4] 90

టీ. ఒండొకఁడవు = మఱియొకఁడవు - బ్రాహ్మణేతరుఁడ వనుట; ఐనక్ = అయినపక్షమున; ఇపుడు = ఈ సమయమునందు; నీ పిండి యిడమె ? = నీ పిండిని పెట్టమా - నీదేహమును బిండిగా నలియఁగొట్టి ముద్దగాఁ జేసివేయమా ? బ్రాహ్మణుఁడవు; ఔటక్ = అగుటచేత; మా

1. మానక. పా. 2. గతులకు. పా. 3. విషాదము లెద. పా.

4. ఈ పద్యమునకు ముందుఁ గొన్నియెడల నీ క్రింది వచనము కానంబడుచున్నది:—
"వ. ముదిమదిదప్పి, ముప్కారుండవైన నీపయిం బెగడ మదియునుంగాక."

చేతఁ; బ్రదుకుగంటి = చావక బ్రదుకునంతటి యదృష్టమును బొందితివి. నిన్నుఁ; ఇట్టివాఁడవని విచారించుట; పనిలేదు = అక్కఱలేదు; గౌతమునిగోవవు = గౌతము వాఁడవు - తాఁకినమాత్రముననే క్రిందఁబడి చచ్చి బ్రహ్మహత్య పొందించునట్టి వాఁడవు; అనుచుఁ వాదించి = అని వాదాడి; విడిచినఁ = అతనిని వదలిపెట్టి హించి = (అతఁడు) కోపించి. తరువాతి పద్యముతో నన్వయము.

తా. నీవు బ్రాహ్మణుఁడవు గాక యితరుఁడవై యున్నయెడల నింతపని నిన్నిప్పుడే దేహము నలియఁగొట్టి ముద్దచేసి పాఱవేసిపోదుము. బ్రాహ్మ ని న్నేమియుఁ జేయమైతిమి. నీవు గౌతముని గోవువంటివాఁడవు; పొమ్మనఁగా నా మఱియును గోపించి. అలం. రూపకము.

[గౌతమునిగో వన్నందులకుఁ గథ - గౌతముఁడను ఋషి యొకానొక పుణ్య దపస్సు చేసికొనుచుండఁగా, ద్వాదశవర్షక్షామము వచ్చెను. అప్పు డనేకఋషు లనా యాశ్రమమునకు వచ్చుచుండిరి. గౌతముఁడు ప్రతిదినము ప్రొద్దున లేచి యాశ్రమస శాది నేసి, పిడికెఁడువడ్లు చల్లి, యనుష్ఠానమునకుఁ బోవుచుండెను. అనుష్ఠానము తీర నంతలో నాయనతపోమహిమచేత నా వడ్లు మొలచి పైరై యెన్నుదీసి గింజపట్టి ఆ ధాన్యమును సంగ్రహించి దంచి బియ్యముచేసి, యా ఋషుల కందఱకుఁ దృప్తి పెట్టుచుండెను. ఇట్లా కఱవు తీఱునంతవఱకు జరపఁగా నా ఋషు లాయనను మెచ్చి నివాసములకుఁ బోవుచు విఘ్నేశ్వరుని ప్రేరణచేతఁ దమవెంట రమ్మని పిలువఁగా న సమ్మతింపకపోయెను. అందుమీఁద వా రాతని లోఁబఱచుకొనుటకై యొక మాయగో యతనిపైరు మేయఁదోలఁగా, గౌతముఁడు దానిని దర్భకఱ్ఱతోఁ దాఁకి యదలింపఁగా దెబ్బకు నోఱగి కూలినట్లు నేలఁగూలి చచ్చెను. అంతట వా రా గౌతమునిమీఁద గోహ నారోపించి జాలిపుట్టించి తమకు లోఁబఱిచి తీసికొనిపోయిరి. నాఁటనుండి యెవ రేని పొందుదశలో నుండువారు దగ్గఱఁ జేరునెడ 'గౌతమునిగో' వని తొలఁగి చనుచుందు

క. ముసలి శపియించె నపు డ, య్యసితాబ్జేక్షణల రాజ ‡ యక్ష్మక్షోభ
బెసఁగ నశియింప; నగు న, ద్దెసఁ బాఱుఁడు [1]సుగుణి గామి ‡ తెల్ల

టీ. అపుడు = ఆ సమయమునందు; ముసలి = ఆ వృద్ధుఁడు; ‡ అయ్యసితాబ్జేక్షు కలువలవంటి కన్నులుగలవారైన యా చెలికత్తెలను; రాజయక్ష్మక్షోభంబు = క్షయ బాధ; ఎసఁగఁ = అతిశయింపఁగా; నశియింపఁ = నశించునట్లు; శపియించెఁ అగుఁ = (అట్టి వ్యాపార మతని యోగ్యతకు) తగును; అద్దెసఁ = ఆయెడ - ఆ దనుట; పాఱుఁడు = ఆ బ్రాహ్మణుఁడు; సుగుణి = మంచిగుణము గలవాఁడు; కా డుట; తెల్లమియకదా! = స్పష్టమేకదా!

తా. అట్లు కోపించిన యా ముసలిబాపఁడు నా చెలికత్తెలను క్షయరోగ శపించెను. దానింబట్టియే యతఁ డుత్తముఁడు గాఁడని నీవు గూడఁ దెలిసికోవచ్చును

క. ఆ రుజ యప్పుడ యయ్యెం, ఘోరుహలోచనలఁ బొందె; ‡ భూవర!
వారత్రయముననుండియు, దారుణగతి నొక్కయసుర ‡ తఱిమెడు

1. సుగుడి. పా.

టీ. భూవర ! = రాజా ! అప్పుడ = తత్క్షణమే; అయ్యంభోరుహలోచనలన్ = తామరల
టి కన్నులుగల యా పడుచులను; ఆ రుజ = ఆ వ్యాధి - క్షయరోగము; పొందెన్; నన్నున్;
రత్రయముననుండియున్ = మూఁడుదినములనుండి; ఒక్క యసుర = ఒక రాక్షసుఁడు; దారుణ
న్ = క్రూరమార్గముతో; వెంటన్ = వెంబడిని - వెంబడించి యనుట; తఱిమెడున్ = తఱుము
న్నాఁడు.

ఇచ్చెద నీ కస్త్రహృదయంబు; నివ్విద్య, నరనాథ! మున్ను పినాకపాణి
యగు రుద్రుఁ డిచ్చె స్వాయంభువమనువున, కతఁ డిచ్చె మఱి వసిష్ఠాఖ్యమునికి;
నతఁ డిచ్చెఁ గరుణఁ జిత్రాయుధుం డను పేరఁ, దనరు మదీయమాతామహునకు;
నతఁ డిచ్చెఁ బెండ్లియానపు డరణంబుగా, మాతండ్రి; కతఁ డిచ్చె మమత నాకు;
తే. సకలరిపునాశకము యశస్కరము నైన
దీని వేవేగ నాచేతఁ బ్రతిగ్రహించి
యడఁపుమా ! దైత్యు, వీరు వా రనఁగ వలవ
దనఘ ! సద్విద్య యెందున్నఁ గొనఁగవలయు. 93

టీ. నరనాథ ! = ఓ రాజా ! నీకు; అస్త్రహృదయంబున్ = అస్త్రహృదయ మనెడి
ద్యను; ఇచ్చెదన్ = నే నిచ్చెదను. ఇవ్విద్య = ఈ యస్త్రహృదయవిద్యను; మున్ను =
నుపు; పినాకపాణి = పినాకమనెడి వింటిని జేతఁ దాల్చినవాఁడు; అగు రుద్రుఁడు = అయిన
ఁడు; స్వాయంభువమనువునకున్ = స్వాయంభువుఁ డనెడి ప్రథమమనువునకు; ఇచ్చెన్.
తఁడు = ఆ స్వాయంభువమనువు; మఱి = పిమ్మట; వసిష్ఠాఖ్యమునికిన్ = వసిష్ఠుఁ డనెడి ఋషికి;
చ్చెన్. అతఁడు=ఆ వసిష్ఠముని; కరుణన్ = దయచేత; చిత్రాయుధుండు అను పేరితోన్; తనరు
దీయమాతామహునకున్ = ఒప్పుచున్న మాతల్లితండ్రికి; ఇచ్చెన్. అతఁడు = మా తాత; మా
ండ్రికి; పెండ్లియౌనపుడు=వివాహకాలమునందు; అరణంబుగాన్=అల్లుని కిచ్చు బహుమానముగా;
చ్చెన్. అతఁడు = మాతండ్రి; మమతన్ = అభిమానముచేత; నాకు; ఇచ్చెన్. సకలరిపునాశ
మున్ = ఎల్లశత్రువులను నాశముచేయునదియు; యశస్కరమున్ = కీర్తి గలుగఁజేయునదియు;
న దీనిన్ = అయిన యీ విద్యను; నాచేన్ = నావలన; వేవేగ = అతిశీఘ్రముగా; ప్రతి
హించి=తీసికొని; ఆ దైత్యున్ = ఆ రాక్షసుని; అడఁపుము=అణఁగఁగొట్టుము - చంపు మనుట.
నఘ ! = పాపములేనివాఁడా ! - ఓ పుణ్యాత్ముఁడా ! సద్విద్య = మంచి విద్య; ఎందున్నన్ =
టువంటివారియొద్ద నున్నను; కొనఁగవలయున్ = గ్రహింపవలయును. వీరువారు = ఇచ్చు
ట్టివా రిటువంటివారు, అటువంటివారు; అనఁగన్ = అనుట - అని విచారించుట; వలవదు =
డదు. 'నీచాదప్యుత్తమాం విద్యాం స్త్రీరత్నం దుష్కులాదపి' అని చెప్పఁబడియున్నది
నుక విద్య నిచ్చువా రుత్తములా ? నీచులా ? యను విచారము పెట్టుకోరా దనుట.

. అనుటయు శుచియై నిలిచిన, జననాథునకుం బ్రయోగసంహారంబుల్
వనిత రహస్యంబుగఁ జె, ప్పిన నాతఁడు నెఱిఁగె; నంత భీషణభంగిన్. 94

టీ. అనుటయున్ = ఆ స్త్రీ యిట్లు పలికినతోడనే; శుచియై = ఆచమనాదికముచేసి పరి
ద్ధుఁడై; నిలిచినన్ = స్వరోచి నిలువఁగా; వనిత = ఆ స్త్రీ; జననాథునకున్ = రాజైన స్వరో
కి; ప్రయోగసంహారంబుల్ = అస్త్రమును బగవారిపైకిఁ బంపునట్టి క్రమమును, మరలించునట్టి

క్రమమును; రహస్యంబుగన్ = ఏకాంతముగా - ఇతరులకుఁ దెలియకుండున ట్లనుటి
తెలియఁజేయఁగా; అతఁడును = ఆ రాజును; ఎఱిఁగెన్ = తెలిసికొనెను. అంత
భీషణభంగిన్ = భయంకరమైన రీతితో. క్రింది పద్యముతో నన్వయము.

మ.స్ర. గళగర్తక్రోడనిర్య త్కహకహనినదో ద్గాఢహాసంబు భ
ద్బిలముల్ మ్రోయింపఁ, గాదం బినిగతిని బొగల్ పెంప మి
జలితాస్య క్రూర దంత క్షత రదవసన క్షార కీలాల వే
జ్జ్వలనజ్వాలాభ జిహ్వాంచలుఁడగుచు గదన్ జాళెముల్ ద్రి

టీ. గళగర్త...హాసంబు - గళగర్త = కలుఁగువంటి గొంతుక్రోవియొక్క;
నుండి; నిర్యత్ = బయలువెడలుచున్న; కహకహ = కహ కహ యనెడి; నినద
ఉద్గాఢ = అతిమాత్రమైన; హాసంబు = నవ్వు; భూభృద్బిలముల్ = కొండగుహలను;
ప్రతిధ్వని గలవానిఁగాఁ జేయఁగా; కాదంబినిగతిని = మబ్బుచాలువలె; పొగల
పెంపన్ = పెంచునట్లు; మిన్నెల్లన్ = ఆకాశ మంతయు; మైగాన్ = దేహము కా
చలుఁడు - చలిత = కదలింపఁబడిన; ఆస్య = ముఖమునందు; క్రూర = కఠినమైన;
యొక్క; క్షత = (కఱచుటచేనైన) గాయములు గల; రదవసన = పెదవివల
క్షార = కారమైన - వెగటయిన; కీలాల = రక్తముతోడ; వేల్లత్ = వ్రేలాడుచున్న
యనుట; జ్వలన = అగ్నియొక్క; జ్వాలాభ = మంటనుబోలిన; జిహ్వాంచలుఁడు
గలవాఁడు; అగుచున్; గదన్ = గదాయుధమును; జాళెముల్ = జాలెములు
కనఁబడునట్లు వేగముగా ననుట; త్రిప్పుకొంచున్. కర్తృపదము తరువాత
దానవుఁడు.

తా. పెద్దకలుఁగువలె నోరు తెఱచి కొండగుహలు ప్రతిధ్వని యిచ్చునట్లుగా
ధ్వనితోఁ బెడనవ్వు నవ్వుచు, నల్లమబ్బు వ్యాపించిన ట్లాకాశమునందు మిక్కిలి
దేహముయొక్క నల్లనికాంతులు వ్యాపింపఁగాఁ, గోపాతిశయముచేతఁ బెదవులక్రింద
గాయమునుండి వెడలెడి వెగటు గలిగించు నెత్తురు నాఁకుకొనుచు గదను గిరగి
అలం. స్వభావోక్తి, అతిశయోక్తి, ఉపమయు.

ఉ. దానవుఁ డుద్ధరారమణుఁ దాఁకె నుదగ్రపదాగ్రఘట్టన
గ్లాని నపాటవం బగుచు నచటి కాన ఘురట్టవిఘట్టితాకృతిం
బూని చెడన్ గిరీశగళ మూలహలాహలకాలకాంతితో
మేనఱికంబు లాడు తన మేటిత్రిశూలముఁ బూని యుద్ధతిన్.

టీ. దానవుఁడు = రాక్షసుఁడు; ఉదగ్ర...గ్లానిన్ - ఉదగ్ర = భయంకరమై
కాలియడుగులయొక్క; ఘట్టన = అణఁగఁద్రొక్కుటవలని; గ్లానిన్ = నలఁగుడు చేత
చదునై; అచటికాన = అక్కడియడవి; ఘురట్ట...కృతిన్ - ఘురట్ట = తిరుగటియం
పిండిగా విసరఁబడినదాని రూపమువంటి; ఆకృతిన్ = రూపమును; పూని = పొ
నశింపఁగా; గిరీశ...తోన్ - గిరీశ = శివునియొక్క; గళమూల = మెడ యడుగ
హాలాహల = కాలకూటవిషముయొక్క; కాల = నల్లనైన; కాంతితోన్ = ఛా
కంబులు = మేనత్త మేనమామ బిడ్డల మాటలు - తచ్చనలు; ఆడు తనమేటి త్రిశూ

జరపునట్టి - పరిహాసము చేయునట్టి యనుట; తన = తనదైన; మేటిత్రిశూలముఁ = శ్రేష్ఠమయిన మూఁడు మొనలు గల శూలాయుధమును; పూని = పట్టుకొని; ఉద్ధతిఁ = నిక్కుతో; అధ్ధరారమణుఁ = ఆ రాజును - స్వరోచిని; తాఁకెఁ = ఎదిరించెను.

తా. మీఁదఁ జెప్పినచొప్పున నా రాక్షసుఁడు భూమి నలఁగి మిట్టపల్లములు సమ మగునట్టుగాను, దారి కడ్డముగా నున్న మ్రాఁకులు విఱిగిపడి పొడిపొడి యగునట్టుగాను నడిమి యడుగు పెట్టుచు నల్లగా వెలుఁగుచున్న త్రిశూలమును బట్టుకొని వచ్చి, స్వరోచి నెదిరించెను. అలం. అతిశయోక్తి, నిదర్శన, ఉపమయును.

తే. నింగి నొరయు రాకాసిమ ♦ న్నీని మేని, నీడఁ జీఁకటిగొనె నవ ♦ నీతలంబు;
చంద్రికలు గాంచె నట్టహా ♦ సముల వెడలు, నిశితదంష్ట్రిలచేన వ ♦ నీతలంబు.

టీ. నింగిఁ = ఆకాశమును; ఒరయు...నీడఁ - ఒరయు = ఒరసికొనుచున్న - తాఁకుచున్న; రాకాసిమన్నీని = రాక్షసశ్రేష్ఠునియొక్క; మేని = దేహముయొక్క; నీడఁ = ఛాయచేత; అవనీతలంబు = భూమి; చీఁకటిగొనెఁ = చీఁకటిని బొందెను. అట్టహాసములఁ = వాని పెడనవ్వులవలన; వెడలు...చేన - వెడలు = బయలుపడునట్టి; నిశిత = వాఁడియయిన; దంష్ట్రిలచేన = కోఱలచేతనే; వనీతలంబు = అడవిపట్టు; చంద్రికలు = వెన్నెలలను; కాంచెఁ = పొందెను.

తా. ఆకాశమును దాఁకునంతటి పొడుగు గల రాక్షసుని శరీరమునీడచేత భూప్రదేశ మంతయుఁ జీఁకటి క్రమ్మిన ట్లుండెను. వాఁడు పెడనవ్వు నవ్వఁగా బయటఁబడిన కోఱపండ్ల తెల్లఁదనపుఁగాంతులచేత నడవి యంతయు వెన్నెల యావరించిన ట్లుండెను. అలం. అతిశయోక్తి.

పంచచామరము. పలాశి డాసి రాజుఁ జూచి ♦ పల్కె; నోరి నోరికిన్
పొలానఁ బెన్ బొ లాన లేక ♦ పోవ నీవు దోఁచి; తౌ;
బలా! బలాలితోడఁ బాలఁ ♦ బట్టి బిట్టు చుట్టి నిన్
హళాహళిన్ హలాహలాభ ♦ మౌ బుభుక్షఁ దీర్చెదన్. 98

టీ. పలాశి = మాంసము భుజించువాఁడు - రాక్షసుఁడు; డాసి = దగ్గఱ వచ్చి; రాజున్ = స్వరోచిని; చూచి = కనుఁగొని; పల్కెన్ = ఇట్లని పలికెను. ఓరి! = ఓరి మనుష్యుఁడా! ఈ పొలానన్ = ఈ యడవియందు; నోరికిన్ = నానోటికి; పెన్ బొల = పెద్ద మాంసము - మనుష్య మాంస మనుట; ఆనన్ = భుజింపను; లేకపోవన్ = కలుగకపోఁగా; నీవు; తోఁచితి = కనఁబడితివి - దొరికితి వనుట. ఔన్ = ఇది యుక్తమగును. బలా! = సెబాసు! - నీవంటివాని నాకుఁ జిక్కునట్లు చేసిన దైవమును మెచ్చవచ్చు ననుట. బలాలితోడన్ = సేనల బారుతోడ; బాలన్ = ఈ చిన్నదానిని; పట్టి = కలియఁబట్టి; బిట్టు = శీఘ్రముగా; నిన్ చుట్టి = నిన్నుఁ జేర్చిచుట్టి; హాలాహలాభమౌ = కాలకూటవిషమును బోలినట్టి - కాలకూటవిషమువలెఁ దపింపఁ జేయునట్టి; బుభుక్షన్ = ఆఁకటిని; హళాహళిన్ = త్వరతో; తీర్చెదన్ = తీర్చుకొనెదను - ఆఁకలిదీఱఁ దినెద ననుట.

తా. ఆ రాక్షసుఁడు స్వరోచిని జూచి దగ్గరగా వచ్చి 'యోరీ మానవుఁడా! నాకీ యడవి యందు మానవమాంసము చిక్కకపోవుటచేత నోరు చవిచెడియుండఁగా నా యదృష్టముచే నీవు చిక్కితివి. ఇఁక నోటి యరుచి తీఱ నిన్ను, నీ బలమును, నీ కన్యనుగూడఁ జేర్చి యొక చుట్టగాఁ జుట్టి శీఘ్రముగా నోట వేసికొని కడుపున రగులుకొలుపుచున్న నా యాఁకటిని దీర్చుకొనియెద. అలం. ఉపమ.

మ.స్ర. అని బాహాస్ఫోటరావాహతపతగకులం బవ్వనీశాఖిశాఖా
జనితవ్యాకీర్ణజీర్ణచ్ఛదములకరణిం జల్లనన్ రాల భూషా
ర్చి నుదీర్ణాలాతచక్రాకృతిగ [1]బిఱబిఱం ద్రిప్పి వైచెం గదన్; వై
చినఁ దేజిన్ రాజు గెంటించె దొలఁగ; నది యచ్చెంత కాంతార మేర్చెన్.

టీ. అని = ఇట్లు పలికి; బాహా...కులంబు - బాహాస్ఫోట = భుజములయొక్క చఱచుటలయొక్క; రావ = ధ్వనిచేత; ఆహత = కొట్టఁబడిన; పతగకులంబు = పక్షిసమూహము; అవ్వనీ...కరణిన్ - అవ్వనీ = ఆ యడవియందలి; శాఖి = వృక్షములయొక్క; శాఖా = కొమ్మల వలన; జనిత = పుట్టిన; వ్యాకీర్ణ = అంతటను వ్యాపించిన; జీర్ణ = పండిన; ఛదములకరణిన్ = ఆకులవలె; జల్లనన్ = జల్లురనునట్లు; రాలన్ = రాలఁగా; భూషార్చిన్ = ఆభరణముల వెలుఁగు చేత; ఉదీర్ణ...ఆకృతిగన్ - ఉదీర్ణ = దొడ్డదైన; అలాత = కొఱవియొక్క; చక్రాకృతిగన్ = చక్రముయొక్క ఆకారమువంటి యాకారముగలది యగునట్లుగా - పెద్దకొఱవిని గుండ్రముగాఁ ద్రిప్పినట్లనుట; గదన్ = తనచేతిగుదియను; బిఱబిఱన్ = బిఱ బిఱ యను ననుకరణముతోఁ ద్రిప్పి; వైచెన్ = రాజుమీఁద వేసెను. వైచినన్ = వేయఁగా; రాజు = రాజైన స్వరోచి; తొలఁగన్ = గుఱి తప్పి తొలఁగునట్లుగా; తేజిన్ = గుఱ్ఱమును; గెంటించెన్ = దాఁటించెను. అది = ఆ గదా యుధము; అచ్చెంతకాంతారము = ఆ వెంబడి నున్న యడవిని; ఏర్చెన్ = దహించెను - పాడు చేసె ననుట.

తా. అని చెప్పి యా రక్కసి భుజములు చఱవఁగా నా శబ్దమునకు నదరి యచ్చటి వృక్షములలోని పక్షులన్నియుఁ జచ్చి పండుటాకులు రాలినట్లు నేల రాలెను. అలంకరించిన యాభరణములకాంతులు వ్యాపింపఁగాఁ గొఱవివలెనే ప్రకాశించుచున్న గదను జక్రాకారముగాఁ ద్రిప్పఁబడిన కొఱవివలె నగపడునట్లు గిరగిరం ద్రిప్పి స్వరోచిమీఁద వేసెను. ఆ దెబ్బ తన్నుఁ దగులకుండునట్లు స్వరోచి గుఱ్ఱమును గుఱికిఁ దొలఁగ దాఁటించెను. అప్పుడా గదపాటున నా ప్రక్కనున్న యడవియంతయుఁ బాడయ్యెను. అలం. ఉపమ, అతిశయోక్తియును.

పృథ్వి. గదాహతికి నాత్మఁ గొంకక యెదిర్చి రాఁగా నిదౌఁ
గదా యనుచుఁ ద్రిప్పి రాక్షసుఁడు వైచె గాఢభ్రమీ
నదత్కనకకింకిణీనటనజాగ్రదుగ్రార్భటీ
వదావదమహాగుహావలభియైన శూలంబునున్. 100

టీ. గదాహతికిన్ = గుదియదెబ్బకు; ఆత్మన్ = మనస్సునందు; కొంకక = భయపడక; ఎదిర్చి = తన్నెదిరించి; రాఁగాన్ = స్వరోచి రాఁగా; ఇది = ఈ సాహసము; ఔఁగదా! = యుక్తమగును గదా! అనుచున్ = అని పలుకుచు; రాక్షసుఁడు; గాఢ...వలభి - గాఢ = అధికమైన; భ్రమీ = తిరుగుడులచేత; నదత్ = మ్రోఁగుచున్న; కనకకింకిణీ = బంగారు చిఱుగంటల యొక్క; నటన = చలించుటయందు; జాగ్రత్ = జాగరూకమై - తప్పక కలుగుచున్న యనుట; ఉగ్ర = భయంకరమైన; ఆర్భటీ = ధ్వనిచేత; వదావద = వాచాటములైన - ప్రతిధ్వని నిచ్చుచున్న; మహాగుహా = గొప్పవియైన పర్వతగుహలయొక్క; వలభి = ముందటిభాగములు గలది;

1. బిఱబిఱ. పా.

విన = అయినట్టి; శూలంబునుక్ = శూలాయుధమునుగూడ; త్రిప్పి; పైచేక్ = (స్వరోచిమీఁద) వేసెను.

తా. స్వరోచి యా గదపెట్టు తప్పించుకొని తన్నెదుర్కొని రాఁగాఁ జూచి రాక్షసుఁడు శూరుని ప్రవర్తన మిట్లుగదా యుండవలయు నని ప్రశంసించి, త్రిప్పునప్పుడు గణగణ యని మ్రోఁగుచున్న చిఱుగంటల మ్రోఁతలకుఁ గొండగుహలు మాఱు మ్రోయఁగాఁ నిన శూలాయుధమును గిరగిరఁ ద్రిప్పి స్వరోచిమీఁద వేసెను. అలం. అతిశయోక్తి.

[పృథ్వీవృత్తమునకు యతి పండ్రెండవ యక్షరముగా నప్పకవీయమునందుఁ జెప్పఁబడి యున్నది. కాని యిందుఁ దొమ్మిదవ యక్షరముగా నున్నది. వృత్తరత్నాకరములో 'జసౌ జసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీ గురుః' అని తొమ్మిదవ యక్షరమే యతిగాఁ జెప్పఁబడినది. శృంగారనైషధములోఁ గూడ ౨-వ ఆ. ౧౮౬-వ పద్యములో ఈ నియమమే పాటింపఁబడినది.]

శా. ఆ శూలం బవనీశమౌళి కులిశా ♦ హంకారహుంకారకృ
న్నైశిత్యం బభినుత్యమై నెగడు బా ♦ ణశ్రేణిఁ జెండాడి వే
కాశశ్వేతగరుత్పరంపరల నా ♦ కాశంబు దుగ్ధాబ్ధిసం
కాశంబై వెలుఁగన్ శరావళులచేఁ ♦ గప్పెం గకుప్పంక్తులన్. 101

టీ. అవనీశమౌళి = రాజశ్రేష్ఠుఁడు - స్వరోచి; కులిశా...నైశిత్యంబు - కులిశ = వజ్రాయుధముయొక్క; అహంకార = గర్వమునకు; హుంకారకృత్ = హుం అను ధ్వనిచేయుచున్న - నీ కింత గర్వమా యని యదలించుచున్న యని యర్థము - అనఁగా వజ్రాయుధముయొక్క వాఁడిమిని మించిన యనుట. నైశిత్యంబు = నిశితభావము - వాఁడిమి; అభినుత్యమై = మిక్కిలి పొగడఁదగినదై, నెగడు బాణశ్రేణిక్ = అతిశయించునట్టి బాణపంక్తిచేత; ఆ శూలంబుక్ = ఆ రాక్షసుఁడు వేసిన శూలాయుధమును; చెండాడి = తునుకలు తునుకలుగా నఱికి; వే = శీఘ్రముగా; కాశ...పరలక్ - కాశ = ఱెల్లుపువ్వులవలె; శ్వేత = తెల్లని; గరుత్ = ఱెక్కలయొక్క; పరంపరలక్ = ఎడతెగని వరుసలచేత; ఆకాశంబు = మిన్ను; దుగ్ధాబ్ధిసంకాశంబై = పాలసముద్రముతో సమానమై; వెలుఁగక్ = ప్రకాశింపఁగా; శరావళులచేక్ = బాణపంక్తులచేత; కకుప్పంక్తులక్ = దిక్కుల వరుసలను - ఎల్లదిక్కులను; కప్పెక్.

తా. అప్పుడు రాజశ్రేష్ఠుఁడయిన స్వరోచి మిక్కిలి వాఁడిమిగల బాణములు ప్రయోగించి యా రాక్షసుఁడు వేసిన శూలాయుధమును దునుకలు తునుకలుగా నఱికివేసి వెంటనే యాకాశము పాలసముద్రమువలెఁ దెల్లఁగా వెలుఁగునట్లు తెల్లగఱుల బాణముల నెల్లయెడలను నిండుకొనునట్లు ప్రయోగించెను. అలం. ఉపమ.

క. అవి యాతనిపైఁ దోలును, నవియింపఁగలేక మిడిసి ♦ యల్లటు వడఁ జూ
చి వనేచరు లేచినవెఱ, దవిలినమతి నద్దిరయ్య! ♦ దయ్యం బనుచున్. 102

టీ. అవి = ఆ బాణములు; అతనిపైతోలును = ఆ రాక్షసుని దేహముమీఁది తోలునుగూడ; అవియింపఁగలేక = భేదింపఁజాలక; మిడిసి = మిట్టి - చెదరి; అల్లటువడక్ = దూరముగాఁ బడఁగా; వనేచరులు = బోయలు; చూచి = ఆ బాణములు చెదరిపడిపోవుటను గని; ఏచినవెఱ = హెచ్చినభయము; తవిలిన మతిక్ = అంటినబుద్ధితో - బుద్ధియందు మిక్కిలి భయము పొడు

కొనఁగా; అద్దిరయ్య ! = ఔరా ! దయ్యంబు = ఇది భూతము; అనుచున్ = అని యన
అనంతర పద్యముతో నన్వయము.

తా. ఆ రాజు ప్రయోగించిన బాణములు రాక్షసునిదేహముమీఁదఁ బడి కొంచె
వానిని బాధింపఁజాలక చెదరిపోఁగాఁ జూచి వేఁటకు వచ్చియున్న బోయ లందఱును
భయపడి యౌరా ! యిది యొక పెద్ద దయ్య మని యెంచిరి.

సీ. పుక్కపుక్కన నంఘ్రిపాశముల్ వెసఁ ద్రెంచి, డేగతండముల మిం టికి
గళగళధ్వనులతోఁ గంఠశృంఖల లూడ్చి, సుడివడఁ గుక్కల నడవి
గుప్పగుప్పున మోచికొనియున్న వలలతోఁ, బలలంపుఁబొత్తరల్ పా
కంగుకంగున నేలఁ గైదప్పగాఁబడు, వేఁటమ్ము లేఱక దాఁటిదాఁ

తే. తిరిగి చూచుచు దట్లెగఁ దీసికొనుచు
దగలు దొట్టి యథాయథ లగుచు విఱిగి
యొకఁడు పోయినత్రోవ వే ఱొకఁడు పోక
చెట్టొకఁడు గాఁగఁ బఱచిరి చెంచు లపుడు.

టీ. అపుడు = ఆ సమయమునందు; చెంచులు = బోయలు; పుక్కపుక్కనన్ =
పుటుక్కనునట్లు; అంఘ్రిపాశముల్ = కాళ్ళత్రాళ్లు; వెసన్ = వడిగా; త్రెంచి = తెగఁ
తండములన్ = డేగలగుంపులను; మింటికిన్ = ఆకాశమునకు - ఆకాశమున కెగిరిపోవున
విడిచి = వదలి; గళగళధ్వనులతోన్ = గళగళయను చప్పుళ్ళతో; కంఠశృంఖలలు =
సులు; ఊడ్చి = ఊడఁదీసి; సుడివడన్ = కలఁతనొందునట్లుగా; కుక్కలన్ = వేఁట క
అడవిఁగలిపి = అడవిపాలుచేసి - వాని యిచ్చచొప్పునఁ బాఱిపోవునట్టుచేసి యనుట
గుప్పునన్ = గుప్పుగుప్పను చప్పుడులతో; మోచికొని = మోసికొని; ఉన్న వలలతోన్ =
వేఁటవలలతోడ; పలలంపుఁబొత్తరల్ = మాంసపుఁబొట్లములు; పాఱవైచి = దూరదు
బడవేసి; కంగుకంగునన్ = కంగుకంగనునట్లు; నేలన్ = భూమిమీఁద; కైదప్పకాన్ =
పాటు అగునట్లు; పడు వేఁటమ్ములు = జాఱిపడునట్టి వేఁట కొదవెడిబాణములను; ఏఱక
ఱిచి యెత్తుకొనక; దాఁటిదాఁటి = ఎగిరియెగిరి పరుగెత్తి; తిరిగిచూచుచున్ = వెనుక
(రాక్షసుఁడు తమ్ము వెంబడించెనేమో యని) జూచుచును; దట్లు = మొలనుగట్టిన కా
ఎగఁదీసికొనుచున్ = (పీడిజాఱఁగా) నెగఁద్రోసికొనుచు; దగలు దొట్టి = దప్పులు అతి
యథాయథలు = ఎక్కడివా రక్కడనే తొలఁగినవారు - ఒకరితో నొకరు సంబంధము
అగుచున్; విఱిగి = చెదరి; ఒకఁడు పోయిన త్రోవ వేఱొకఁడు పోక; చెట్టొకఁడుగా
ఒకొక్క చెట్టున కొకొక్కఁడుగా; పఱచిరి = పాఱిపోయిరి.

తా. ఆ సమయమునందు బోయ లందఱు నా రాక్షసునిఁ జూచి వెఱచి, డేగల
విప్పి, డేగలను బాఱవిడిచినవారును, వేఁటకుక్కల మెడగొలుసులు విడఁదీసి యథే
బోఁదఱిమినవారును, వలలు, మాంసపుఁగావళ్లు మొదలయిన భారములను బడవేసి పా
వారును, జేత నున్న విండ్లమ్ములు జాఱిపడిపోఁగాఁ బోయినం బోనిమ్మని వదలుకొని
వారునై యతివేగముతో నొకరి నొకరు విచారింపక యెవఁడు పట్టినత్రోవ వానిదిగా నొ

యొకటిఁ దలఁప నరుల కోదవిన, నోదవ దే
కరణి మృత్యుదేవిఁ గన్నుఁ బ్రామ.

టీ. నరులకున్ = మనుష్యులకు; నీడన్ = తమనీడను; కడపన్ పాఱన్ = మి
పాఱిపోవుటకును; నేలకున్ = భూమికిని; వెలికాఁగన్ = వెలుపలిది అగునట్లు; అడుగు
మును; పెట్టి = ఉంచి; తిరుగన్ = సంచరించుటకును; ఆత్మన్ మొఱఁగి = మనస్సును
ఒకటిన్ = ఏదే నొకదానిని; తలంపన్ = తలఁచుటకును; ఒదవినన్ = సిద్ధించినను - సా
కలిగిన ననుట; ఏ కరణిన్ = ఏ విధముచేతను; మృత్యుదేవిన్ = మృత్యుదేవతను;
బ్రామన్ = కన్నుమూయను - వంచింప ననుట; ఒదవదు = సిద్ధింపదు - సామర్థ్యము
నేరదు.

తా. నీడను మీఱి పాఱిపోవుట, నేల నంటక నడచుట, మనసునకుఁ దెలియక య
చేయుట యను నసాధ్యకార్యములు సాధ్యములయినను, మృత్యువునకుఁ జిక్కక తప్పించు
యే విధముచేతను నే మనుష్యునకును సాధ్యము కాదు. అలం. అప్రస్తుతప్రశంస.

క. చావుఁ దలపోసి మానవుఁ, డేవగ దుష్కీర్తి వొరయ కే దినములు
దై వెడలునట్లు నడవఁగ, దైవం బంటిమీఁద మేలు తాన ఘటించు

టీ. మానవుఁడు = మనుష్యుఁడు; చావున్ తలపోసి = మరణమును (తప్పక వచ్చు
తలఁచి; ఏ వగన్ = ఏ విధముచేతను; దుష్కీర్తి = అపకీర్తిని; పొరయకే = పొందక
ములు = దివసములను; పొందై = అనుకూలమై; వెడలునట్లు = నడచునట్లు; నడవఁగన్
ర్తింపఁగా; అంటమీఁదన్ = ఆ మీఁద; దైవంబు = విధి; తాన = తానే; మేలు = శు
ఘటించున్ = కూర్చును - పొందించు ననుట.

తా. మనుష్యుఁడు తాను జచ్చువాఁడ నను నిశ్చయముతో నపకీర్తి కలుగని
వర్తింపఁగా నందులకుఁ దగినట్లు దైవమును శుభము నొనఁగూర్చును; గనుక మీరు పా
యపకీర్తి తెచ్చుకొనక ధైర్యముతో నిలిచి యీ రాక్షసునిఁ జంపి జయమును, గీర్తిని బొం
అలం. అప్రస్తుతప్రశంస.

సీ. బుద్ధీంద్రియక్షోభ ములకుఁ బెట్టనికోట, విపదంబురాశి దు ర్వికృతి
ఖలదురాలాప మా ర్గణవజ్రకవచంబు, రణమహీస్థలికి శ్రీ రామర
శాత్రవదుర్గర్వ సంస్తంభనౌషధి, మొనయుచింతాశ్రేణి మూఁకవి
యోగాదిసంసిద్ధు లొనఁగూర్చు పెన్నిధి, తూలు నేకాకుల తోడునీడ

తే. సకలసుగుణప్రధానంబు సకలకార్య, జాలసాఫల్యకరణైక సాధనం
ధైర్యగుణ; మట్టిధైర్యంబు దక్కి పోరఁ, దర్తజేంతురె యకటమీఁతరము

టీ. ధైర్యగుణము = చలింపనితాలిమి యనెడి గుణము; బుద్ధీంద్రియ క్షోభములకున్ -
మతియొక్కయు; ఇంద్రియ = కన్ను, ముక్కు మొదలయిన యింద్రియములయొక్కయు;
లకున్ = కలఁతలకు; పెట్టనికోట = ఒకరు పెట్టకయే యేర్పడిన కోటవంటిది - కోట
పరులను లోపలఁ జొరనియ్యదో యట్లే మనసులోపలఁ గలఁతను జొరనీయని దనుట.
కృతికిన్ - విపత్ = ఆపదలనెడి; అంబురాశి = సముద్రముయొక్క; దుర్వికృతికిన్
మయిన వికారమునకు - ఉపద్రవమునకు; ఓడ = నావవంటిది - దాఁటించునది యనుట;

కవచంబు - ఖల = దుర్జనులయొక్క; దురాలాప = చెడ్డమాటలనెడి; మార్గణ = బాణములకు; వజ్రకవచంబు = వజ్రములతోఁగూర్చిన కవచమువంటిది - బాణములవంటి యుల్లికుట్టుమాటలవలని సంకటమును దోఁచనీయని దనుట. రణమహీస్థలికిన్ = యుద్ధభూమికి; శ్రీరామరక్ష = శ్రీరాముని దైన కాఁపుదలవంటిది. శాత్రవ...ఓషధి - శాత్రవ = పగవారియొక్క; దుర్గర్వ = చెడ్డ యహంకారమునకు; సంస్తంభన = చక్కఁగా స్తంభింపఁజేయునట్టి; ఓషధి = మూలికవంటిది- శత్రువులగర్వము సాగనియ్యని దనుట; మొన...విప్వ - మొనయు = కలుగుచున్న; చింతాశ్రేణి = దుఃఖపంక్తికి; మూఁకవిప్వ = చేరికను దొలఁగించునది - చేరనియ్యని దనుట; యోగాదిసంసిద్ధులు- యోగ = ఇష్టవస్తుప్రాప్తి; ఆది = మొదలయినవానియొక్క; సంసిద్ధులు = చక్కఁగా సిద్ధించుటలను; ఒనఁగూర్చు పెన్నిధి = జతగూర్చునట్టి రూఁకలసాఁతవంటిది; తూలు...నీడ - తూలు = చలించిన; ఏకాకుల = ఒంటరిగాండ్రకు; తోడునీడ = ఎడఁబాయని తోడైనది - సహాయము లేని వారికి సహాయమగునది; సకలసుగుణప్రధానంబు = ఎల్ల మంచిగుణములందును ముఖ్యమయినది; సకల...నంబు - సకల = సమస్తమయిన; కార్య = పనులయొక్క; జాల = సమూహముయొక్క; సాఫల్య = సఫలత్వమును - నెఱవేఱుటను; కరణ = చేయుటకు; ఏక = ముఖ్యమైన; సాధనంబు= ఉపకరణము; అట్టి ధైర్యంబున్ = అటువంటి ధైర్యగుణమును; తక్కి = విడిచి; పోరన్ = యుద్ధమునందు; మీ తరమువారు = మీ వంటివారు; తత్తఱింతురె=తమకుదురా ? - తమక సేరరనుట.

తా. ధైర్యగుణము - బుద్ధి, మనస్సు మొదలగు నింద్రియములను గలఁత నొందనియ్యదు. మేర లేని దుఃఖము నణఁచివేయును. దుర్జనులు దూషించినను జిత్తవికారము కలుగనియ్యదు. యుద్ధమునందుఁ దన్నుఁ గాపాడును. పగవానిగర్వము నణఁగఁగొట్టును. విచారమును దగ్గఱఁ జేరనియ్యదు. ఇష్టవస్తుప్రాప్తి మొదలైన మేలుల నొనఁగూర్చును. తోడు లేనప్పుడు తొలఁగని తోడగును. కావలసినపనులను గావించుటకు ముఖ్యసాధన మగును. కనుక నెల్లసద్గుణములలోపల ధైర్యము ముఖ్యమయిన సద్గుణము. అటువంటి ధైర్యగుణమును విడిచి యుద్ధమునందుఁ జలించి పాఱిపోవుట మీబోఁటి ధీరులకుఁ దగదు. అలం. రూపకము, ఉల్లేఖమును.

క. అని తెలిపి తిరుగుఁ డనుటయు, మనమున లజ్జించి యెఱుకుమన్నీ లిఁక నీ
జనపతితోడిద లోకం, బని తమతమ మొనలు ద్రిప్పి; రవియును దిరిగెన్.

టీ. అని = ఇట్లు చెప్పి; తెలిపి = తెలివిగలుగఁజేసి; తిరుగుఁడు = వెనుకకు మరలుఁడు; అనుటయున్ = అనినతోడనే; (కర్త - స్వరోచి.) ఎఱుకుమన్నీలు =బోయరాజులు; మనమునన్ = మనసునందు; లజ్జించి = సిగ్గుపడి; ఇఁకన్ = ఈ మీఁద; ఈ జనపతితోడిద = ఈ జనపతితోఁ గూడినదే; లోకంబు = మనలోకమును - అనఁగాఁ జచ్చినను, బ్రతికినను మన మీ రాజుతోఁ బాటుగా నుండవలసినవారమనుట; అని = ఇట్లు నిశ్చయించుకొని; తమ తమ మొనలన్ = తమ తమ సేనలను; త్రిప్పిరి = మరలించిరి. అవియును = ఆ సేనలును; తిరిగెన్ = మరలెను.

వ. ఇట్లు తిరిగి యుక్కెక్కి రక్కసుం డెక్క డెక్కడ నని యక్కొటబలంబు
లగుడంబులుఁ గటారు లీఁటెలుఁ బందీఁటెలు పిండ్లు గండ్రగొడ్డండ్లుఁ జిల్ల
కోలలుఁ [1]బంట్రగోలలు మెఱయ రయసముద్ధూతధూళిధూసరితధారాధరపథం
బగుచు నొక్కపరియ చీమపరి యనం గవిసె నందు. 110

1. బల్ల. పా.

టీ. ఇట్లు = ఈ విధముగా; తిరిగి = మరలినదై; అక్కాటబలంబు = ఆ బోయలదండు; ఉక్కెక్కి = శౌర్య మతిశయించి; రక్కసుండు = రాక్షసుఁడు; ఎక్కడెక్కడఁ ? = ఎక్కడ నున్నాఁ డెక్కడ నున్నాఁడు ? అని; లగుడంబులున్ = దుడ్డుఁగఱ్ఱలును; కటారులు = కత్తులును; ఈఁటెలును; విండ్లు = ధనుస్సులును; గండ్రగొడ్డండ్లున్ = చంద్రరేఖవలె వంపుగా నుండు గొడ్డండ్లును; చిల్లకోలలున్ = దోఁటివంటి చిన్న యవయవముతోడి మొనగల బల్లెములును; పంట్రకోలలున్ = మాదిగసూదివంటి మూఁడు నాలుగు అలుఁగులు గల కఱ్ఱలును; మెఱయన్ = ప్రకాశింపఁగా; రయ...పథంబు - రయ = (నడకయొక్క) వేగముచేత; సముద్ధూత = రేఁపఁబడిన; ధూళి=దుమ్ముచేత; ధూసరిత = ఇంచుక తెల్లగిలిన; ధారాధరపథంబు=ఆకాశముగలది; అగుచున్; ఒక్కపరియ = ఒక్కసారిగానే; చీమపరిఅనన్ = చీమలబారో అనునట్లు; కవిసెన్=ఆ రాక్షసు నాక్రమించెను. అందున్ = అట్లు కవిసిన యా దండునందు. తర్వాతి పద్యముతో నన్వయము.

మ. శరసంధానముతోనె కొన్ని యడుగుల్ జౌ[1]జవ్వనం బాఱి య
ద్ధరణిం గాల్కొని ద్రోణముల్ [2]దివిచి దోర్గండంబులం జేఁది యే
సిరి బోయల్ దిను మంచు [3]నార్చు పరచుం జిట్టాసలన్ డాయుచున్
గొరవంకల్ మొఱ వెట్టినట్లు గుణముల్ ఘోషింప [4]రోషంబునన్. 111

టీ. బోయల్= కిరాతులు; రోషంబునన్ = కోపముతో; శరసంధానముతోనె =బాణము వింటఁ గూర్చుటతోడనే; కొన్ని యడుగుల్ = కొన్ని యంజలపట్టు; జౌజవ్వనన్ = నేల జవజవలాడునట్లు; పాఱి = పరుగునఁ బోయి; అద్ధరణిన్ = ఆ ప్రదేశమునందు; కాల్కొని = కాలూని నిలిచి; ద్రోణముల్ = ద్రోణములను - చేపట్టుకొలఁది సన్నముగాఁ జెక్కఁబడిన దుంగలను; తివిచి = లాగి - తీసి; దోర్గండంబులన్ = కఱ్ఱలవంటి భుజములతో; చేఁది = ఆకర్షించి; - పట్టుకొని; గొరవంకల్ = గోరువంకపక్షులు; మొఱవెట్టినట్లు = గట్టిగా నఱచినట్లు; గుణముల్ = అల్లెత్రాళ్లు; ఘోషింపన్ = మొరయఁగా; చిట్టాసలన్ = కొంచెమైన యాసలతో - చావక బ్రదుకుదు మను నాశ పూర్ణముగా లేకయే యనుట; (పా. చెట్టాసలన్ = వృక్షములమాటున.) ఆర్చు పరచున్ = అఱచు; క్రూరుని - రాక్షసుని; డాయుచున్ = సమీపించుచు; తినుము = ఇదిగో! వీని భక్షింపుము; అంచున్ = అని పలుకుచు; ఏసిరి = బాణములను ప్రయోగించిరి. (తిమ్మకవి పాఠము ననుసరించి పద్యము, టీక మార్చఁబడినవి.)

తే. ఆ శరావళి నమ్మనుజాశనుండు, లీల మృగదంశకము మశకాలి నొడిసి
[5]చప్పరించువిధంబున శాతదీర్ఘ, దంష్ట్రికలఁ జప్పరించి రౌద్రమునఁ గెరలి.

టీ. అమ్మనుజాశనుండు = మనుష్యులను దినువాఁడైన యా రాక్షసుఁడు; ఆ శరావళిన్ = బోయలు ప్రయోగించిన యా బాణపంక్తిని; లీలన్ = అనాయాసముగా; మృగదంశకము = కుక్క; మశకాలిన్ = దోమలపంక్తిని; ఒడిసి = ఆకర్షించిపట్టి; చప్పరించువిధంబునన్ = అంగిట నదిమికొనునట్లు; శాత...కలన్ - శాత = వాఁడిగలవియు; దీర్ఘ = నిడుపైనవియునైన; దంష్ట్రికలన్= కోఱపండ్లచేత; చప్పరించి = అంగిట నదిమిపట్టి నమలి; రౌద్రమునన్ = భయంకరత్వముతో; కెరలి = విజృంభించి. తరువాతి పద్యముతో నన్వయము. అలం. ఉపమ.

---

1. జౌవునం. పా. 2. దివియు. పా. 3. నార్చిపరఁగం. పా. 4. రోషింపుచున్. పా
5. చప్పళించు. పా.

సీ. గళితశృంఖలమైన గంధనాగము వ్రాలెఁ, బ్రజలపైఁ బేరెముల్ పాటిపాటి
కలశాబ్ధి మథియించు కైటభాంతకులీల, జవ మొప్పఁ జేతులు సాఁచిసాఁచి
కన లూను కీనాశ కాసరమ్మునుబోలెఁ, గమిచి తట్టువగుంపుఁ జెమరి చెమరి
యమృతాపహరణార్థ మరుగు పక్షిస్వామి, గతిఁ బుళిందశ్రేణిఁ గమిచి కమిచి

తే. సెలవులు బిగించి నేత్రదంష్ట్రికలు మెఱయ
నిడుదమొగ మెత్తి మీసల నెత్తు రొలుకఁ
బటబట కపాలపంక్తులఁ బగులఁ గొఱికి
బలము నెల్లను గడియలోపల మ్రింగె. 113

టీ. గళితశృంఖలమైన = జాఱిపోయిన గొలుసులుగలదైన; గంధనాగమువోలెన్ = మదపు టేనుఁగువలె; ప్రజలపైన్ = సేనాజనులమీఁద; పేరెముల్ పాటి పాటి = పలుమాఱు పరుగులెత్తియు; కలశాబ్ధి...లీలన్ - కలశాబ్ధి=పాలసముద్రమును; మథియించు కైటభాంతకులీలన్ = త్రచ్చుచున్న విష్ణుదేవునివలె; జవము ఒప్పన్ = వేగము ఒప్పునట్లు; చేతులు సాఁచి సాఁచి = మాటిమాటికిఁ జేతులు చాఁచియు; కనలు=కోపమును; ఊను...బోలెన్ - ఊను = పొందునట్టి; కీనాశ=యమునియొక్క; కాసరమ్మునుబోలెన్ = ఎనుఁబోతువలె; కమిచి = ఒడిసిపట్టి; తట్టువగుంపున్ = మట్టపు గుఱ్ఱముల సమూహమును; చమరి చమరి = మిక్కిలి చదియఁగొట్టియు; (పా. కవిసి = తారసించి; జవిరి జవిరి = మాటిమాటికిఁ గొట్టి;) అమృతాపహరణార్థము = అమృతముఁ గొనివచ్చుటకు; అరుగు పక్షిస్వామిగతిన్ = పోవునట్టి పక్షిరాజైన గరుత్మంతునివలె; పుళిందశ్రేణిన్ = బోయలబారును; కమిచి కమిచి = ఒడిసిపట్టి మ్రింగి మ్రింగియు; సెలవులు = పెదవులమూలలను; బిగించి = బిగఁబట్టి; నేత్రదంష్ట్రికలు = కన్నులును, కోఱపండ్లును; మెఱయన్ = ప్రకాశించునట్లు; నిడుద మొగము = నిడుపైన మొగమును; ఎత్తి = పైకెత్తి; మీసలన్ = మీసములమీఁదుగా; నెత్తురు = రక్తము; ఒలుకన్ = తొనికి పడుచుండఁగా; కపాలపంక్తులన్ = తలపుఱ్ఱెలసమూహములను; పటపట = పటపట యనుధ్వనితో; పగులన్ = పగిలి పొడియగునట్లు; కొఱికి = నమలి; బలము నెల్లన్ = సమస్త కిరాతసేనను; గడియలోపలన్ = గడియకాలములోపలనే; మ్రింగెన్ = తిని వేసెను.

తా. గొలుసులవలన విడివడిన మదపుటేనుఁగు జనులపైఁబడి పాఱునట్లు వడిగొని పాఱియు, విష్ణువు పాలసముద్రమును ద్రచ్చునపుడు తఱిత్రాడు లాగుటకై చాఁచినట్లు జనులను బట్టుకొనుటకై చేతులు చాఁచియు, యమునివాహనమైన యెనుఁబోతు మట్టపు గుఱ్ఱములను జూచునెడ నేలనడఁగఁ గొట్టునట్లు గుఱ్ఱముల నణఁగఁగొట్టియు, నమృతముఁ దేఁబోవునప్పుడు గరుత్మంతుఁడు సముద్రమున నున్న నిషాదులను మ్రింగినట్లు బోయలగుంపును బట్టి మ్రింగియు, నోటినుండి నెత్తురు తొనికిపడునట్లు తలపుఱ్ఱెలు పొడిపొడిగా నమలి మ్రింగివేసియు, గడియసేపటిలోపలఁ దన్ను నాక్రమించిన కిరాతసేననెల్లను దినివేసెను. అలం. ఉపమ.

క. ఆ సమయంబున గీర్వా, ణీసుతుఁ డయ్యింతి నొక్క నికటనికుంజా
వాసమ్మున నిడి క్రమ్మఱి, వేసురరిపుఁ దాఁకెఁ దురగ వేగము మెఱయన్. 114

టీ. ఆ సమయంబునన్; గీర్వాణీసుతుఁడు = దేవతాస్త్రీయైన వరూథినికొడుకు - స్వరోచి; అయ్యింతిన్ = తనతోడ గుఱ్ఱముమీఁద నున్న యా స్త్రీని; ఒక్క...మ్మునన్ - ఒక్క = ఒకా

నొక; నికట = సమీపమునందలి; నికుంజావాసమ్మునన్ = పొదరింటియందు; ఇడి = ఉంచి - కూర్చుండఁబెట్టి యనుట; క్రమ్మఱి = మరలి; తురగవేగము = గుఱ్ఱము వడి; మెఱయన్ = ప్రకాశింపఁగా - అతిశయింపఁగా ననుట; వే = శీఘ్రముగా; సురరిపున్ = దేవశత్రువైన రాక్షసుని; తాఁకెన్ = ఎదిరించెను. అనఁగా నప్పుడు స్వరోచి తనతోడ గుఱ్ఱముమీఁద నున్న చిన్నదానిని దించి, యొక పొదరింట నుంచి, మరల రాక్షసు నెదిరించె నని తాత్పర్యము.

వ. ఇట్లు తలపడి యమ్మనుజదనుజులు బీరంబులు దొరంబులుగాఁ బోరుతఱి భూరమణుండు గృద్ధుండై, సమిద్ధరణి బద్ధపరంపర యగు నంపఱం బెంపఱం జంపరాదు నిలింపారాతి నని వితర్కించి కించిత్తును గొంచక, కాంచనద్రవ కంచుకితంబును, దరణిఖరకిరణకాండచండంబును నయి యాఖండలదోర్దండ సముజ్జృంభితవజ్రాయుధచకచకం బకపకనవ్వ వజ్రభేదియలుంగు వెలుంగ, మత్తారులకు నుత్తలంబిడు నత్తలంబును, బద్మరాగమణిచూడంబగు కేడెంబునుం గొని వేడెంబునం దురంగంబుఁ బఱపి, తెఱపి గని తఱటుచేసి యొరసి చన నుఱికించి కఱకుటరిబరి పఱియవడం బొడిచి కడచి నిలిచినం, బెలుచనం బరిగోల పోటున నాటోపించు మత్తకరివృత్తి నెత్తు రొలుక నక్తంచరుం డుదంచితగతి సవ్యదిశకొత్తి తఱుమ, నపసవ్యగతిన్ జాళెంబున హయంబుఁ బోనిచ్చుచు నచ్చరకొడుకు దిరిగితిరిగి సింగిణి నేయుచుఁ జుట్టుకొని రా మనుజాశియు నట్లట్ల వెనుక వెనుక కడు గిడుచు నడ్డంబుగా నడవికడ కొత్తికొని నడచి యొడుదొడుకగుడు బెడిదంపునడక నడరి కడకాళ్ల కొడియుం జిక్క రక్కసునకుం దుష్కారంబను నాలోన నడిదంబునం బుడమిపతి వెడవిసరు విసరి యసురవరు కరాంగుళంబులు దెగ నడిచె; నడిచిన నుడివడక మడమలఁ దాటించిన ఘోటకంబు వెగ్గలంబుగ మ్రొగ్గియు నగ్గలికచెడక మోఁకరించుకొని కొన్ని యడుగులు చని సేకరించుకొని కంచుమించుగం బఱచుట గగనచరుల వెఱఁగుపఱిచె; నట్లు పఱచినం గందంబుఁ జఱచి మొగంబు దుడిచి ప్రస్తుతులఁ గుస్తరించి యతిరభసఫూత్కార ఘోరారావంబుతో ఘోణారంధ్రనిశ్వాసగంధవాహ ప్రవాహంబు వెడలు వాహంబు దగ మట్టువడ నిట్టట్టు మట్టించుచు నా స్వారోచి నిశాచరు నుద్యోగంబు చూచికొనవలసి నిలిచి యంతన యతం డొక్క తరువుఁ గరయుగళి నిఱియంబట్టి పెల్లగింప మల్లాడునాలోనన గల్లుసం గింకిణులు మొరయ మెఱుంగు మెఱసినగతి మరల హరిం బఱపి యొకటి రెండు మూఁడు గొరకల నెఱఁకులుగాఁడ గుబ్బకొలందికిం దిగవైచి, మ్రానువిడిపించి యొలయించుకొని బయలు వెడలించి దోషాచరుండు పాషాణమ్ముల కెపు డెపుడు వంగె నపుడపుడెల్లం దురంగంబు నంటందోలి గంటి యిడి వెంటం బడుటయు, గెంటించి లేదు బంతి యన్నయ ట్లల్లంత నుండి వాగె సడలించి, పగతునిపై నిగిడి వాగెఁగుదియింప ముంగాళ్లు గగనంబున రా మగిడించి యందెచప్పుడుం గింకిణీరవంబును నురుమ గీసినగతిం దేఁటి మ్రోసినక్రియ నా దాఱక యే

మఁగా; అపసవ్యగతిన్ = కుడిప్రక్కపోవునట్లుగా; జాళెంబునన్ = ప్రక్కవాటు నడకతో; హయంబున్ పోనిచ్చుచున్ = గుఱ్ఱమును నడపుచు; అయ్యచ్చరకొడుకు = అప్సరసయయిన యా వరూథినికొడుకు - స్వరోచి; తిరిగి తిరిగి=చుట్టి చుట్టి; సింగిణిన్=శృంగధనుస్సుచేత; ఏయుచున్ = బాణములను ప్రయోగించుచు; చుట్టుకొనిరాన్ = తన్నుఁ జుట్టుకొని వచ్చుచుండఁగా; మనుజాశియున్ = నరభోజనుఁడును - రాక్షసుఁడును; అట్లట్ల = స్వరోచి యేయేరీతి పోవునో యట్లే; వెనుక వెనుకకున్; అడుగిడుచున్ = అడుగుఁబెట్టుచు; అడ్డంబుగాన్ = రాజున కడ్డముగా; అడవికడకున్ = అడవికొనవఱకు, ఒత్తికొని నడచి = త్రోసికొనిపోయి; ఒడుదొడుకు అగుడున్ = సంకటము కాఁగా; బెడిదంపు నడకన్ = వడిగలనడకచేత; అడరి=ఉత్సహించి; కడకాళ్లకున్ = కాళ్లకొనలకై; ఒడియన్ - కొంచెము పైకెగురఁగా - గుఱ్ఱముకడకాళ్లు ఒడిసిపట్టుకోఁబోఁగా; తుక్ఖారంబు = గుఱ్ఱము; రక్కసునికిన్ = రాక్షసునిచేతికి; చిక్కెన్ = చిక్కుకొనెను; అనునాలోనన్ = అని చూచువారు పలుకునంతలోపల; పుడమిపతి = భూనాయకుఁడు - స్వరోచి; అడిదంబునన్ = కత్తితో; పెడవిసరు విసరి = పెడమరలి విసరినట్టి విసరుగా విసరి; అసురవరుకరాంగుళంబులు = రాక్షసశ్రేష్ఠుని చేతులవ్రేళ్లు; తెగన్ = తెగిపోవునట్లు; అడిచెన్ = కొట్టెను. అడిచినన్= వ్రేళ్లు దెగఁగొట్టినను; సుడివడక = చలింపక; మడమలన్ = గుదికాళ్లతో; తాటించినన్= తన్నఁగా; ఘోటకంబు=గుఱ్ఱము; వెగ్గలంబుగన్= మిక్కిలిగా; మ్రొగ్గియున్= ముందటికి వాలఁబడియును; అగ్గలిక చెడక = ఉత్సాహము తప్పక; మోఁకరించుకొని = మోఁకాళ్లూని నిలిచి; కొన్ని యడుగులు చని = కొన్ని యడుగులదూరము పోయి; సేకరించుకొని = తెప్పిఱుకొని; కంచుమించుగన్ = అగోచరముగా - చూచువారికన్నులకుఁ గానరాక యనుట; పఱచుట = పరుగెత్తుట; గగనచరులన్ = ఆకాశమందుఁ జరించువారిని - దేవతలను; వెఱఁగుపఱిచెన్ = ఆశ్చర్యపడునట్లు చేసెను. అట్లు = దేవత లాశ్చర్యపడునట్లుగా; పఱచినన్ = పరుగెత్తఁగా; కందంబుఁ జఱచి = మూఁపు దట్టి; మొగంబు తుడిచి = ముఖమును దువ్వి; ప్రస్తుతులన్ = పొగడుమాటలచేత; కుస్తరించి = లాలించి; అతి...బుతోన్ - అతిరభస = మిక్కిలి వేగముగా వచ్చునట్టి; ఫూత్కార = ఫూత్తనెడి యనుకరణముతోడి; ఘోర = భయంకరమైన; ఆరావంబుతోన్ = ధ్వనితో; ఘోణా...హంబు - ఘోణారంధ్ర = ముక్కుఁగ్రోళ్లనుండి (వెడలెడి); నిశ్వాస = ఊపిరియొక్క; గంధవాహ ప్రవాహంబు = గాలియొక్క పరంపర; వెడలు వాహంబున్ = బయలుదేఱుచున్న గుఱ్ఱమును - అనఁగా రొఁజుచున్న గుఱ్ఱము ననుట; దగ మట్టువడన్= దప్పి - అలయిక తగ్గునట్లు; ఇట్టట్టు మట్టించుచున్= ఇటునటుఁ ద్రిప్పుచు; ఆ స్వరోచి; నిశాచరు నుద్యోగంబున్= రాక్షసుని ప్రయత్నమును; చూచికొనవలసి = చూచి తెలిసికోవలసి; నిలిచి; అంతన = అంతమాత్రముచేతనే; అతండు = ఆ రాక్షసుఁడు; ఒక్క తరువున్ = ఒక వృక్షమును; కరయుగళిన్= రెండు చేతులతోను; ఇఱియంబట్టి = కదియఁబట్టి; పెల్లగింపన్=వేళ్లతో నూడఁబెఱుకుటకై; మల్లాడునాలోనన = పెనఁగులాడునంతలోపలనే; గల్లునన్ = గల్లు మను ధ్వనితో; కింకిణులు = చిఱుగంటలు; మొరయన్ = మ్రోఁగఁగా; మెఱుంగు మెఱసినగతిన్ = మెఱపు ప్రకాశించినట్లు - అంత శీఘ్రముగా; మరలన్ = తిరుగ; హరిన్ = గుఱ్ఱమును; పఱపి = రాక్షసుని మీఁదికిఁదోలి, ఒకటి రెండు మూఁడు; గొరకలన్ = ఇనుపబాణములచేత; (గుజ్జీఁకెలచేత నని కొందఱు.) నెఱఁకులు = మర్మస్థానములను; కాఁడన్ = నాటుకొనునట్టుగా; గుబ్బకొలందికిన్ = అఱుఁగు క్రింది గుబ్బవఱకు; దిగవైచి = దిగఁబడ నేసి - లోపలికి దిగునట్లు బాణములు ప్రయోగించి; మ్రాను = పెల్లగింపఁబూనిన మ్రానిని; విడిపించి = విడుచునట్లుచేసి; ఎలయించుకొని = చేర

వచ్చునట్లు చేసికొని; బయలు వెడలించి = బయలుగా నుండుచోటికి రప్పించి; దోషాచరుండు = రాక్షసుఁడు; పాషాణమ్ములకున్ = ఱాలెత్తుటకై; ఎపు డెపుడు వంగెన్ = ఎప్పు డెప్పుడు వంగునో; అపుడపు డెల్లన్; తురంగంబున్ = గుఱ్ఱమును; అంటందోలి = కదియఁదోలి; గంటి యిడి = వాని దేహమునందు గాయము తగిలించి; వెంటంబడుటయున్ = వాఁడు వెంబడింపఁగా; గెంటించి = గుఱ్ఱమును దొలఁగఁదోలి; లేదు బంతి యన్నట్లు = నీకుఁ జిక్కుట బొం కన్నట్లు; అల్లంతనుండి = కొంత యెడముగా నుండి; వాగె సడలించి = కళ్లెపుఁబగ్గము సళ్లవిడిచి; పగతునిపైన్ = శత్రువైన రాక్షసునిమీఁద; నిగిడి = కవిసి; వాగెన్ = పగ్గమును; కుదియింపన్ = బిగఁబట్టఁగా; ముంగాళ్లు = ముందటికాళ్లు; గగనంబునన్ = ఆకాశమునందు - మీఁదితట్టుగా; రాన్ = వచ్చునట్లు; మగిడించి = వంచి; అందెచప్పుడున్ = (ఆ ముందటికాళ్లకుఁ గట్టిన) అందెలయొక్క ధ్వనియును; కింకిణీరవంబులు = మువ్వలయొక్క ధ్వనియును; ఉరుమ గీసిన గతిన్ = ఉరుమ యను వాద్యమును మునివ్రేళ్ల రాచినరీతిని; (ఉరుమ = తప్పెటవలె గుండ్రముగా నుండెడిదియు, చుట్టువంపఁబడినపట్టెకు సందులేర్పఱిచి, యా సందులలోఁ గంచుతేకుబిళ్లలు రెండు మూఁడు గూర్చినదియునైన వాద్యవిశేషము.) తేఁటి మ్రోసినక్రియన్ = తుమ్మెద ఝుంకారము చేసినరీతిని; నాదు = నాదము; ఆఱక = అణఁగక; ఏ దిక్కుఁజూచినన్ = చుట్టుప్రక్కల నేతట్టు చూచినను; ఆ దిక్కననే = ఆ ప్రక్కనే; వినంబడన్ = వినరాఁగా; ఎక్కడఁ జూచినన్; తానయై = తానుదప్ప మఱియేదియుఁ గానరాకుండున ట్లనుట; నీడ యేర్పడక = నీడ చక్కఁగాఁ దెలియఁబడక; పార్శ్వంబులన్ =ఇరుప్రక్కలను; కట్టు కెంబట్టు లాలసరి =కట్టిన యెఱ్ఱపట్టుజాలరు; సమకట్టు ఱెక్కలుగాన్ = జోడించిన ఱెక్కలు కాఁగా; యాతుధానుండు= రాక్షసుఁడు; అను కొండచిలువన్ = అనెడి పెనుఁబామును; ఒడియన్ = ఆకర్షించి పట్టుటకు; నేలపఱపుగాన్ = భూమిచేరువగాఁ బాఱుటవలె; ఆడు గరుడుండు అనన్ = ఱెక్కలు విచ్చి యాడునట్టి గరుత్మంతుఁడో అనునట్లు; పాయుచున్ = ఎడముగాఁ బోవుచును; డాయుచున్ = దగ్గఱవచ్చుచును; (అలం. ఉత్ప్రేక్ష.) దవ్వులన్ = దూరమునందు; పొలసి = మెలఁగి; కుఱంగటన్ తోఁచి = దగ్గఱ కనఁబడి - దూరమునం దున్నట్టుండి యంతలోనే దగ్గఱగావచ్చి యనుట; కుఱంగటన్ అని = దగ్గఱను ఉన్నదని; చూడన్ = చూచునపుడు; దవ్వులన్ పొలసి = దూరమునందు వర్తించి; దవ్వు చేరువలు = దూరమును సమీపమును; అనిర్ధార్యంబులు = నిశ్చయింప శక్యములు గానివి; కాన్ = అగుచుండఁగా; మెలఁగన్ = మెలఁగునట్లు; తేజికాశ్వంబున్ = మేలుజాతిదైన తన గుఱ్ఱమును; మెలంపుచున్ = త్రిప్పుచు; వింటనున్ = ధనుస్సుచేతను; పంట్రకోలలన్ = మాదిగసూది వంటి మూఁడు నాలు గలుఁగులు గల కఱ్ఱలచేతను; అడిదంబునన్ = కత్తిచేతను; అత్తలంబునన్ = ఈఁటెచేతను; ఏసియున్ = బాణములు ప్రయోగించియు; వ్రేసియున్ = కొట్టియు; అడిచియున్ = నఱికియు; పొడిచియున్ = గ్రుచ్చియు - వింటితో బాణములు ప్రయోగించియుఁ, బంట్రకోలలతోఁ గొట్టియుఁ, గత్తిచే నఱికియు, నీఁటెతోఁ బొడిచియు నని యర్థము. కడపలన్ కానక = తుదను కనలేక; మిడిసి = మిట్టిపడి; మృతుండును = చచ్చినవాఁడును; కాని దానవునిన్ = కాకుండునట్టి రాక్షసుని; చూచి; వేసరి = విసుగుకొని; (బడలి యని కొందఱు.) రోసంబునన్ =కోపముచేత. తరువాతి పద్యముతో నన్వయము.

క. భూపతి పావకబాణం, బేపున సంధించి తివిచి ॥ యేసిన మొయిఁ గీ
లాపటలి పొదువ నతఁ డా, రూపం బెడఁబాసి ఖేచ ॥ రులు వెఱఁగందన్.116

టీ. భూపతి = రాజు - స్వరోచి; ఏపునన్ = ఉత్సాహముతో; పావకబాణంబు = ఆగ్నేయాస్త్రమును; సంధించి = నారియందుఁ గూర్చి; తివిచి = లాగి; ఏసినన్ = ప్రయోగింపఁగా; మెయిన్ = రాక్షసునిశరీరమున; కీలాపటలి = మంటలసమూహము; పొదువన్ = క్రమ్ముకొనఁగా; అతఁడు = ఆ రాక్షసుఁడు; ఆ రూపంబు = ఆ రాక్షసాకారమును; ఎడఁబాసి = విడిచి; ఖేచరులు = ఆకాశమునందుఁ దిరుగువారు - దేవతలు; వెఱఁగు అందన్ = ఆశ్చర్యమును పొందఁగా. అనంతర పద్యముతో నన్వయము.

లయవిభాతి. ధగధగని దేహరుచి । నిగనిగని కుందనపుఁ
దగడుఁ దెగడం, జిగురు । జిగి నెగుచు మోవిన్
నగవు నిగుడం, గురుల । పొగరు మగుడన్, నయన
యుగళి వెలిదామరల । మగలమగలై డా
లెగయ, మృగనాభి భుగ । భుగ లెసఁగఁ, జామరలు
మగువ లిడ, మౌళిమణి । మిగులఁగ వెలుంగం,
దెగలు గల హారముల । జిగి చెలఁగఁగాఁ, గ్రొందమ
మొగులఁ దగు యానమున । గగనచరుఁ డయ్యెన్. 117

టీ. ధగధగని దేహరుచి = ధగధగ యని వెలుఁగుచున్న శరీరకాంతి; నిగనిగని కుందనపుఁదగడున్ = నిగనిగ యని వెలిఁగెడి యపరంజితేకును; తెగడన్ = తిరస్కరింపఁగా - అపరంజితేకును మించి వెలుఁగునట్టి దేహకాంతితో ననుట; చిగురుజిగిన్ = చిగురుయొక్క యొప్పిదపుకాంతిని; ఎగుచు మోవిన్ = దెఱచు (తిరస్కరించు) నట్టి పెదవియందు - ఎఱుపుమించిన పెదవియం దనుట; నగవు నిగుడన్ = నవ్వు వ్యాపింపఁగా - తోఁపఁగా; కురులపొగరు = తలవెండ్రుకల యొక్క (నల్లని) కాంతి; మగుడన్ = తిరుగఁగా - మరల రాఁగా ననుట; నయనయుగళి = కన్నుదోయి; వెలి...మగలై - వెలిదామరల = తెల్లతామరలయొక్క; మగల = రాజులకు; మగలై = రాజులై - శ్రేష్ఠమయిన తెల్లదామరలను మీఱినవై యనుట; డాలు = కాంతివిశేషము; ఎగయన్ = పార్శ్వములందు వ్యాపింపఁగా; మృగనాభిభుగభుగలు = భుగ భుగ మనెడి కస్తూరి వాసనలు; ఎసఁగన్ = అతిశయింపఁగా; చామరలు = వింజామరలు; మగువలు = పరిచారికలైన స్త్రీలు; ఇడన్ = వేయఁగా-వీవఁగా ననుట; మౌళిమణి = శ్రేష్ఠమయిన కిరీటము-రత్నమయమయిన కిరీటము; మిగులఁగన్ వెలుంగన్ = మిక్కిలి ప్రకాశింపఁగా; తెగలు కల = నిడుపులు కలిగిన; హారముల జిగి = కంఠహారములయొక్క ప్రకాశము; చెలఁగఁగాన్ = అతిశయింపఁగా; క్రొందమమొగులన్ = లేఁతమబ్బునందు - అప్పుడే పర్వుచున్న మబ్బునం దనుట; తగు యానమునన్ = యుక్తమయిన విమానమునందు; గగనచరుఁడు = ఆకాశమునందుఁ దిరుగువాఁడు - గంధర్వుఁడు; అయ్యెన్.

తా. అప్పు డా రాక్షసుఁడు స్వరోచి ప్రయోగించిన యాగ్నేయాస్త్రముచేఁ దన రాక్షసదేహము కాలిపోఁగా, బంగారుచాయచే నిగనిగలాడుచున్న యందమైన శరీరమును, నగుమొగమును, నిడుదలై మృదువులైన నల్లని తలవెండ్రుకలును, విశాలములై తేఁటలైన కన్నులును గల గంధర్వుఁడయి, కస్తూరి చేర్చిన మంచివాసనగల గంధపుఁబూఁతయు, రత్నమయమయిన కిరీటమును, నిడుపులైన కంఠహారములును ధరించి, పరిచారికలు వింజామరలు వేయఁగా, విమానము నెక్కి, యాకాశమునందుఁ గానఁబడియెను. అలం. ఉపమ, ఉదాత్తము.

మిక్కుటమై సమయోచితముగా స్ఫురించు బుద్ధిగలవాఁడా! యనుట; త్రయీధర్మైకసంరక్షణా!- త్రయీధర్మ = వేదవిహితధర్మములయొక్క; ఏక = ముఖ్యమయిన; సంరక్షణా! = కాపాడుట కలవాఁడా! - వేదోక్తధర్మములను దప్పక రక్షించువాఁడా! యనుట. అలం. అత్యుక్తి.

క. బహువీరహననమిళదఘ, వహనభ్రమకృత్కళంక వర్గోగ్రాసి
గ్రహిళభుజయుగళ! గజప, త్యహిపహరణతార్క్ష్య! సజ్జనావనదక్షా! 121

టీ. బహు...యుగళ! = బహు = అనేకులైన; వీర = శూరులయొక్క; హనన = చంపుట వలన; మిళత్ = కూడిన - కలిగిన యనుట; అఘ = పాపమును; వహన = వహించుటయొక్క; భ్రమకృత్ = భ్రమఁగల్గఁజేయుచున్న; కళంక = నల్లనిచాయయొక్క; వర్గ = సమూహముచేత; ఉగ్ర = భయంకరమయిన; అసి = కత్తిని; గ్రహిళ = గ్రహించిన - పట్టిన; భుజ = బాహువుల యొక్క; యుగళ! = జంటగలవాఁడా! - అనేకులను శూరులను జంపుటచేతఁ గలిగిన పాపములు దేహమునందుఁ బ్రవేశించెనో యనునట్లు నల్లనిచాయలచే భయంకరమైన కత్తిఁ జేతఁ బూనినవాఁడా! యనుట. గజ...తార్క్ష్య! - గజపతి=కళింగరాజైన గజపతిరాజనెడు; అహిప = సర్పశ్రేష్ఠమును; హరణ = పట్టుకొనుటయందు; తార్క్ష్య! = గరుత్మంతుఁడైనవాఁడా! గరుత్మంతుఁ డొక దొడ్డ పామును బట్టునట్లు గజపతిరాజు ననాయాసముగాఁ బట్టుకొన్నవాఁడా! యనుట. సజ్జనావన దక్షా! - సజ్జన = సత్పురుషులయొక్క; అవన = రక్షణమునందు; దక్షా! = సమర్థుఁడా! - మంచివారిని గాపాడఁజాలినవాఁడా! యనుట. అలం. భ్రాంతిమంతము, ఉత్ప్రేక్ష, రూపకము.

పృథ్వి సుధీమధురవాక్సుధా సుముఖ! నాగమాంబాసుతా!
మధుప్రసవసాయక స్మయవిరామ రమ్యాకృతీ!
దధీచ విధు కామధుగ్ధనద దుగ్ధసింధు ప్రథా
వధీరణపరాయణోజ్జ్వలవదాన్యతాలంకృతా! 122

టీ. సుధీ...సుముఖ! - సుధీ = విద్వాంసులయొక్క; మధుర వాక్ = చెవుల కింపైన మాటలనెడు; సుధా = అమృతమునకు; సుముఖ! = అభిముఖుఁడా! - పండితగోష్ఠియం దాసక్తుఁడా! యనుట; నాగమాంబాసుతా! = నాగమ్మకొమారుఁడా! మధు...కృతీ! మధు = వసంతునియొక్కయు; ప్రసవసాయక = మన్మథునియొక్కయు; స్మయ = గర్వమును; విరామ = నిలిపివేయునట్టి - అణఁచివేయునట్టి; రమ్య = మనోహరమయిన - అందమైన; ఆకృతీ! = ఆకారము గలవాఁడా! - వసంతునికన్నను, మన్మథునికన్నను మించిన చక్కఁదనము గలవాఁడా! యనుట. దధీచ...లంకృతా! - దధీచ = దధీచిమహర్షియొక్కయు; విధు=చంద్రునియొక్కయు; కామధుక్ = కామధేనువుయొక్కయు; ధనద = కుబేరునియొక్కయు; దుగ్ధసింధు = పాలసముద్రముయొక్కయు; ప్రథా = (దాతృత్వముయొక్క) ప్రసిద్ధిని; అవధీరణ = తిరస్కరించుట యందు; పరాయణ = ఆసక్తమైన; ఉజ్జ్వల = ప్రకాశించుచున్న; వదాన్యతా = దాతృత్వము చేత; అలంకృతా! = అలంకరింపఁబడినవాఁడా! - దాతృత్వమునందు దధీచి మొదలగువారిని మించినవాఁడా! యనుట. (పృథ్వీవృత్తమునకు ౧౨-వ యక్షరము యతి యని యప్పకవి. ఇందు శృంగారనైషధమునందువలె ౯-వ యక్షరము యతి.)

తా. కృష్ణదేవరాయలు సర్వదా పండితుల ప్రసంగములు వినుచుండువాఁడును, మన్మథ వసంతుల చక్కఁదనమును మించిన చక్కఁదనము గలవాఁడును, దధీచి, చంద్రుఁడు, కామధేనువు, కుబేరుఁడు, పాలసముద్రములకుఁ గల దాతృత్వముకన్నను మించిన దాతృత్వము కలవాఁడు నని తాత్పర్యము.

[దధీచి యింద్రునికి వజ్రాయుధము లభింపఁజేయుటకై తనదేహము నిచ్చెను. చంద్రుఁడు తన కిరణములను దేవతల కాహారముగా నిచ్చును. కామధేను వెవ రేమి కోరినను కలదు లే దనక యిచ్చును. కుబేరుఁ డెల్లలోకములకు ధనము నొసఁగును. పాలసముద్రము తన్నుఁ ద్రచ్చిన దేవతలకు నమృతము లోనగువాని ననేకముల నొసఁగెను.]

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్షపాదాం
బుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోపతాపసప్రసా
దాసాదిత చతుర్విధ కవితామతల్లి కాల్లసాని చొక్కయామాత్యపుత్త్ర
పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబు
నందుఁ జతుర్థాశ్వాసము. 123

ఈ గద్యమునకు నర్థము ప్రథమాశ్వాస గద్యమునకుంబోలె గ్రహించునది.



# స్వారోచిష మనుచరిత్రము

## టీకాతాత్పర్యసహితము

### పంచమాశ్వాసము



నందనసౌందర్య ! సు
ధీనందన ! వితరణావ ధీరితబలిరా
డ్భానుజ ! పరరాజస్వ
ర్భానుభుజాహీంద్ర ! కృష్ణ రాయ నరేంద్రా !

టీ. శ్రీనందనసౌందర్య ! - శ్రీనందన = లక్ష్మీదేవి కుమారుఁడైన మన్మథునియొక్క ; సౌందర్య!=చక్కఁదనమువంటి చక్కఁదనము కలవాఁడా ! సుధీనందన ! =విద్వాంసులను సంతోషపెట్టువాఁడా ! వితర...డ్భానుజ ! - వితరణ = దాతృత్వముచేత ; అవధీరిత = తక్కువపఱుపఁబడిన ; బలి = బలిచక్రవర్తియు ; రాట్ = చంద్రుఁడును; భానుజ = కర్ణుఁడును గలవాఁడా ! పర...హీంద్ర ! పరరాజ = శత్రురాజులనెడి చంద్రులకు ; స్వర్భాను = రాహువైన ; భుజ = బాహువనెడు; అహీంద్ర ! = సర్పశ్రేష్ఠము కలవాఁడా ! కృష్ణరాయనరేంద్రా ! (ఇది కృతిపతికి సంబోధనము.)

తా. మిక్కిలి సౌందర్యమును, దాతృత్వమును, శత్రురాజులను లోఁబఱచుకొను సామర్థ్యమును గల కృష్ణదేవరాయమహారాజా ! అలం. రూపకము, నిదర్శనము, అతిశయోక్తియు.

వ. అవధరింపుము జైమినిమునీంద్రచూడారత్నంబునకు నీడోద్భవంబు లిట్లనియె.

టీ. అవధరింపుము = చిత్తగింపుము - వినుము. జైమిని మునీంద్రచూడారత్నంబునకున్ = మునిశ్రేష్ఠులలోపల శిరోమణియైన జైమినియనెడు వానికి - మునిశ్రేష్ఠులలో శ్రేష్ఠుండైన జైమినికి; నీడోద్భవంబులు = గ్రుడ్డువలనఁ బుట్టినవి - పక్షులు - అనఁగా కథ చెప్పెడి పక్షులు; ఇట్లనియె.

తే. అపుడు గంధర్వపతి మహి కవతరించి
రాజు విస్మయమున హయ రాజు డిగ్గ
నక్కుసేర్చి ముదంబుతో ననియె దంత
కిరణములు హారకాంతులు సరసమాడ. 3

టీ. అపుడు = ఆ సమయమునందు ; గంధర్వపతి = (రాక్షసుఁడుగా నుండి స్వస్వరూపము నొందిన) గంధర్వరాజు ; మహికిన్ = భూమిమీఁదికి; అవతరించి = (విమానమునుండి) దిగి; రాజు = రాజైన స్వరోచి; విస్మయమునన్ = ఆశ్చర్యముతో; (ఆశ్చర్యమునకుఁ గారణము రాక్ష

సుఁడు గంధర్వుఁ డగుటయే యని యెఱుంగునది.) హయరాజున్ = ఉత్తమాశ్వమును ; డిగ్గన్ = దిగఁగా ; అక్కు చేర్చి = ఱొమ్ము చేర్చి - కౌఁగిలించుకొని ; ముదంబుతోన్ = సంతోషముతో; దంతకిరణములు = పలువరుసకాంతులును ; హారకాంతులు = మెడనున్న ముత్యాలపేరుల కాంతులును ; సరసమాడన్ = తచ్చనలాడఁగా - ఒకటితో నొకటి కలసికొనఁగా; అనియెన్.

తా. ఆ సమయమునందు, వెనుక రాక్షసుఁడుగా నుండి గంధర్వుఁడయిన యా గంధర్వరాజు తా నున్న విమానమువలననుండి నేలకు దిగి, తన్నుఁ జూచి యాశ్చర్యపడి గుఱ్ఱముమీఁదనుండి దిగిన స్వరోచిని సంతోషముతోఁ గౌఁగిలించుకొని యిట్లు పలికెను. అలం. ఉపమ.

సీ. భద్రమా నీకు నీ ÷ బాహాభృత[1]క్షితి, ప్రజలకు ? లెస్సలా ÷ రాచవారు ?
ధన్యుండ నైతి నీ ÷ దర్శనంబునఁ జేసి, నాదుష్కృతము లెల్ల ÷ నాశ మొందె ;
నీ జగత్త్రయి నన్ను ÷ నిందీవరాక్షాఖ్యుఁ, గీర్తించు నప్సరో ÷ గీతసరణి ;
గారాపుమీతల్లి ÷ కడవాఁడఁ గాని నే, గణుతింపఁ గడవాఁడఁ ÷ గాఁజుమయ్య!
తే. పెండ్లికొడుకవు మాకు ; నీ ÷ బిసరుహాక్షి
కూర్మినందన ; యొక మౌని ÷ ఘోరశాప
వికృతి మానిసిదిండినై ÷ యకట! దీని
ప్రాణముల కల్గఁ దలఁచితిఁ ÷ బాపబుద్ధి. 4

టీ. నీకున్ = నీకును ; నీ బాహాభృతక్షితిప్రజలకున్ = నీ భుజములచేత భరింపఁబడిన భూజనులకును ; భద్రమా ? = కుశలమా ? రాచవారు = నీ చుట్టములయిన రాజులు ; లెస్సలా ? = బాగుగా నున్నారా ? నీ దర్శనంబునఁజేసి = నీయొక్క దర్శనముచేత - నిన్నుఁ జూచుటచేత ననుట ; ధన్యుండనైతిన్ = నేను కృతార్థుఁడనైతిని. నా దుష్కృతములు ఎల్లన్ = నాపాపము లన్నియును ; నాశమొందెన్ = నశించెను. ఈ జగత్త్రయి = స్వర్గమర్త్యపాతాళము లనెడి యీ మూఁడు లోకముల సముదాయము; నన్ను; ఇందీవరాక్షాఖ్యన్ = ఇందీవరాక్షుఁడను పేరితో; అప్సరోగీతసరణిన్ = అప్సరసల సంగీతమార్గమున - అప్సరఃస్త్రీలు పాడునట్టి పాటలమూలమున ; కీర్తించున్ = కొనియాడును. గణుతింపన్ = ఎంచఁగా - విచారింపఁగా ననుట ; నేను; గారాపుమీతల్లి కడవాఁడన్ = ప్రేమాస్పదురాలైన మీతల్లికి కనిష్ఠుఁడను - తమ్ముఁడను; కాని; కడవాఁడన్ = అన్యుఁడను ; కాఁజుమయ్య ! = కాను జుమీ ! - నేను మీ తల్లితోడఁబుట్టినవాఁడను గాని యితరుఁడను గా ననుట. మాకు; పెండ్లికొడుకవు = అల్లుఁడవు; ఈ బిసరుహాక్షి = తామరలవంటి కన్నులు గలదైన యీ కన్యక ; కూర్మినందన = నాయొక్క ముద్దులకూఁతురు ; ఒక మౌని ఘోరశాపవికృతిన్ = ఒకానొక ఋషియొక్క భయంకరమైన శాపవికారముచేత ; మానిసిదిండినై = మనుష్యులను దినువాఁడనై - రాక్షసుఁడనై ; పాపబుద్ధిన్ = దుష్కృతబుద్ధితో ; దీనిప్రాణములకున్ = ఈ చిన్నదాని ప్రాణములకు ; అల్గన్ = కోపింప - ద్రోహము చేయ ; తలఁచితిన్ = ఎంచితిని - చంపఁబూనితి ననుట. అకట ! = అయ్యో ! (ఇది విచారము దెలుపును.)

తా. అయ్యా! నీకును, నీ దేశమువారికిని, నీ చుట్టములకును క్షేమమేకదా! నా పాపములు నశింపఁగా నేను నిన్నుఁ జూచి కృతార్థుఁడ నైతిని. నే నెవ్వఁడనో యని యెంచకుము. అన్యుఁ

1. క్షితిఁ బ్రజలకు. పా.

డను గాను. నీతల్లితోఁడఁబుట్టినవాఁడనైన యిందీవరాక్షుఁడను. నీవు నామేనల్లుఁడవు. ఈ చిన్నది నాకూఁతురు. ఒకానొక మునీశ్వరునిశాపముచేత రాక్షసుఁడనై కన్నబిడ్డ యను మమత నైసెతము లేక యీ చిన్నదానినే చంపి తిన యత్నించితి. అయ్యో! యిఁక నాదుఃఖ మేమని చెప్పుకొందును?

క. [1]అన విని వచ్చి మనోరమ, జనకునిపాదముల కెరఁగ • సస్నేహమతిం
గనుఁగవ నీరొలుకఁగ నం, దనమూర్ధఘ్రాణ మతఁడు • దయఁ గావించెన్. 5

టీ. అనన్ = ఇట్లని గంధర్వుఁడు చెప్పునప్పుడు; విని = ఆ కంఠస్వరమును పొదరింటి నుండియే విని - అయ్యది తన తండ్రి కంఠస్వర మగుట యెఱిఁగి యనుట; మనోరమ; వచ్చి = చేరవచ్చి; జనకునిపాదములకున్ = తండ్రియైన యా యిందీవరాక్షునియడుగులకు; ఎరఁగన్ = నమస్కరింపఁగా; సస్నేహమతిన్ = ప్రేమతోడిబుద్ధితో; కనుఁగవన్ = రెండు కన్నులందును; నీరు ఒలుకఁగన్ = జలము చిందఁగా - కాఱఁగా; అతఁడు = ఆ యిందీవరాక్షుఁడు; దయన్ = దయతో; నందనమూర్ధఘ్రాణము = కొమార్తెయొక్క నాఁడుపట్టు మూర్కొనుటను; కావించెన్ = చేసెను.

తా. అని యిందీవరాక్షుఁడు తన వృత్తాంతము చెప్పుకొనుచుండఁగా వానికూఁతురైన మనోరమ యా కంఠస్వరమును పొదరింటినుండియే తన తండ్రిదిగా యెఱిఁగి, యతనిదగ్గఱకు వచ్చి, పాదములపైఁ బడి మ్రొక్కఁగా, నతం డా కొమార్తెను జూచి దుఃఖించి కన్నీళ్లు విడుచుచుఁ బ్రేమతో నామె శిరస్సును మూర్కొని యాదరించెను.

ఆ. అపుడు విస్మితాత్ముఁ • డై వరూథినిసుతుఁ
డేమికారణమున • నే తపస్వి
యిట్టి శాప మిచ్చె? • నెఱిఁగింపు, విన వేడు
కయ్యె ననఘ! యనిన • నాతఁ డనియె. 6

టీ. అపుడు; వరూథినిసుతుఁడు = వరూథినికుమారుఁడు - స్వరోచి; విస్మితాత్ముఁడై = ఆశ్చర్యము నొందిన మనసుగలవాఁడై; అనఘ! = ఓ పుణ్యాత్ముఁడా! ఏమికారణమునన్ = ఏ హేతువుచేత; ఏ తపస్వి = ఏ ముని; ఇట్టి శాపము = ఇటువంటి శాపమును; ఇచ్చెను? ఎఱిఁగింపు = తెలియఁ జేయుము. వినన్ = వినుటకు; (నాకు) వేడుక అయ్యెన్ = కుతూహలము కలిగెను. అనినన్ = అని యడుగఁగా; ఆతఁడు = ఆ యిందీవరాక్షుఁడు; అనియెన్ = ఇట్లు పలికెను. అనఁగా గంధర్వరాజైన యిందీవరాక్షునిఁ జూచి యాశ్చర్యపడి స్వరోచి 'ఓ పుణ్యాత్ముఁడా! నీ కే కారణముచేత నే ముని యిటువంటి శాప మిచ్చెను? ఆ సంగతి నాకు విన నపేక్ష కలదు చెప్పు' మని యడుగఁగా నాతఁ డిట్లు పలికెను.

మ. కలఁ డుల్లోకయశఃపురంధ్రి జగతిన్ • గంధర్వవంశంబునన్
నలనాభాహ్వయుఁ; డేఁ దదీయతనయుం • డన్; బ్రహ్మమిత్రుండు శి
ష్యులకుం గంటను వత్తిఁ బెట్టుకొని యా • యుర్వేద మారంత ప్రా
ప్తులఁ జెప్పన్ వినుచుండి మానసమునం • దుం దజ్జిఘృక్షారతిన్. 7

టీ. జగతిన్ = భూమిపైని; ఉల్లోకయశఃపురంధ్రి = లోకాతీతమయిన కీర్తియనెడు ఇల్లాలు గలవాఁడు - లోకాతీతమైన కీర్తి గలవాఁ డనుట. గంధర్వవంశంబునన్ = గంధర్వ

1. అనునెడ. పా.

కులమునందు; నలభావ్యాయుఁడు = నలనాభుఁడను పేరు గలవాఁడు; కలఁడు = ఉండెను. ఏన్ = నేను; తదీయతనయుండన్ = అతని కొమారుఁడను. బ్రహ్మమిత్రుఁడు = బ్రహ్మమిత్రుఁడనెడి ముని; శిష్యులకున్ = విద్యార్థులయి వచ్చిన తన శిష్యులకు; కంటన్ = కంటియందు; వత్తిన్ పెట్టుకొని = దీపపువత్తిపెట్టుకొని - రాత్రివేళ. దీపము పెట్టుకొనికూడ; (జాగ్రత్తగా గమనించుట యనుటకు 'కంటవత్తిడికొని' యనునది లోకోక్తి.) ఓరంత ప్రొద్దులన్ = ఈ కాల మా కాల మనక యెల్లప్పుడును; ఆయుర్వేదము = వైద్యశాస్త్రమును; చెప్పన్ = చెప్పి చదివించుచుండఁగా; వినుచుండి = లోకులవలన నేను వినుచునుండి; మానసమునందున్ = నా మనస్సునందు; తజ్జిఘృక్షారతిన్ = ఆ వైద్యశాస్త్రమును గ్రహింపవలెననెడి యాసక్తిచేత. అనంతర పద్యముతో నన్వయము.

తా. ఈ లోకమునందు మిక్కిలి కీర్తివహించిన నలనాభుఁడనెడి గంధర్వునికొమారుఁడను నేను. బ్రహ్మమిత్రుఁడను వైద్యశాస్త్రపండితుఁడు తన శిష్యులకు రాత్రి యనక పగ లనక యెల్లప్పుడును శ్రద్ధతో వైద్యశాస్త్రము చెప్పుచున్నాఁడని విని, యా శాస్త్రము నభ్యసింపవలెనను కోరిక కలవాఁడనై.

తే. మౌనివరుఁ జేరి భక్తి న ‌ మస్కరించి
చెప్పవే నాకు నీ విద్య ‌ శిష్యకోటి
తోడఁ గూడంగ నేఁ గృతా ‌ ర్థుండ నగుదు
ననుచుఁ బ్రార్థింప నను జూచి ‌ యుపహసించి. 8

టీ. మౌనివరున్ = ఆ బ్రహ్మమిత్ర మునీశ్వరుని; చేరి = సమీపించి; భక్తిన్ = పూజ్యానురాగముతో; నమస్కరించి = మ్రొక్కి; ఈ విద్య = ఈ వైద్యవిద్యను; శిష్యకోటితోడఁ గూడంగన్ = మీ శిష్యులసమూహముతోఁబాటు; నాకున్ = నాకుఁగూడ; చెప్పవే! = బోధింపవయ్యా! నేన్ కృతార్థుండను = నేను నెఱవేఱిన కోరిక గలవాఁడను - ధన్యుఁడను; అగుదున్; అనుచున్ = ఇట్లని; ప్రార్థింపన్ = వేఁడుకొనఁగా; నన్నున్; చూచి; అపహసించి = ఎగతాళిఁ జేసి. తర్వాతి పద్యముతో నన్వయము.

క. నట విట గాయక గణికా, కుటిలవచశ్శీధురసము ‌ గ్రోలెడుచెవికిం
గటు వీ శాస్త్రము; వల; దిచ్చట నినుఁ జదివింపకున్న ‌ జరగదె మాకున్?

టీ. నట...రసమున్ - నట = నట్టువులయొక్కయు; విట = పరస్త్రీపరులయిన పురుషులయొక్కయు; గాయక = పాటపాడెడివాండ్రయొక్కయు; గణికా = భోగము పడఁతులయొక్కయు; కుటిల = వంకరయైన - నీచములైన యనుట; వచన = మాటలనెడు; శీధురసమున్ = చెఱకుపాలతోఁజేసిన మద్యరసమును; గ్రోలెడు చెవికిన్ = త్రాగునట్టి చెవికి - నట, విట, గాయకాదుల పరిహాసాదిరూపములయిన మాటలను వినుటయందు రుచిగలిగిన చెవి కనుట. ఈ శాస్త్రము= ఈ వైద్యశాస్త్రము ; కటువు = ఇంపు గానిది. వలదు = (నీ కిది) అక్కఱలేదు. ఇచ్చటన్ = ఇక్కడ ; నిన్నున్ చదివింపకున్నన్ = నిన్నుఁ జదివింపకయున్నయెడ - నీకీ చదువు చెప్పనిపక్షమున ననుట. మాకు; జరగదె? = (నిత్యకృత్యము) జరగదా! - మా కేమియుఁ గొఱఁతపడదనుట.

తా. నీవు నట్టువలు, విటకాండ్రు, పాటకాండ్రు, భోగముపడుచులు మొదలయిన
గూడి కాలము గడపువాఁడవు. నీవంటివానికి యుత్తమవిద్య పనికిరాదు. నీకీ విద్య నే
మాకు జరగకపోవునదియు లేదు. కనుక నీవు మాఱు పలుకకుండ వచ్చినదారినే పొమ్ము.

తే. అనఁగ నే నట్టివాఁడఁ గా ననఘచరిత!
యించుకించుక మీవంటి యెఱుకగలుగు
పెద్దవారలశిక్షలఁ బెరిఁగినాఁడ
నవధరింపుము శిష్యుఁగా ననిన నతఁడు.

టీ. అనఁగన్ = అని యిట్లు బ్రహ్మమిత్రుఁ డనఁగా; అనఘచరిత ! = మంచినడవడి గ
మునీశ్వరా ! నేను; అట్టివాఁడన్ = అటువంటివాఁడను; కాన్ = కాను - ఇప్పుడు నీవు
చెడ్డనడవడి గలవాఁడను గా ననుట. ఇంచుకించుక = కొంచెము కొంచెము - తగినకొలఁది
మీవంటి...శిక్షలన్ - మీవంటి; ఎఱుకగలుగు = జ్ఞానముగలిగిన; పెద్దవారల = గొ
యొక్క; శిక్షలన్ = మంచి సెబ్బరలు తెలియఁదీర్చుటలచేత; పెరిఁగినవాఁడన్ =
వాఁడను. (కనుక) శిష్యుఁగాన్ = (నన్ను నీకు) శిష్యునిగా; అవధరింపుము = అంగీక
అనినన్ = అని నేను ప్రార్థింపఁగా; అతఁడు = ఆ బ్రహ్మమిత్రుఁడు.

క. ధనరాజ్యరమామదమునఁ, గనుఁగానని నిన్ను శిష్యుఁగాఁ గైకొను
టెను నేరమి గలదే ? ననుఁ, గనలించుచుఁ బ్రేల; కిఁకఁ బొ కాలు మ

టీ. ధన...మునన్ - ధన = విత్తముయొక్కయు; రాజ్య = ప్రభుత్వముయొక్క
రమా = కలిమిచేనైన; మదమునన్ = క్రొవ్వుచేత; కనుఁగానని నిన్నున్ = కన్ను తెలియ
పరువు తెలియని నీవంటివాని ననుట; శిష్యుఁగాన్ = విద్యార్థిఁగా; కైకొనుకంటెన్ =
రించుటకన్నను; నేరమి = తెలివిలేమి; కలదే ? = (మఱియొకటి) కలదా? - అదే తె
యనుట. ఇఁకన్; ననున్; కనలించుచున్ = కోపింపఁజేయుచు; ప్రేలక = వదరక;
లుము = వెడలిపొమ్ము; అటన్నన్ = అనఁగా. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. ధనగర్వముచేతను, రాజ్యగర్వముచేతను పరువు తెలియక ప్రవర్తించెడి
శిష్యునిఁగా గ్రహించుట మిక్కిలి తప్పు కాఁబట్టి నిన్ను నేను నా శిష్యులలోఁ జేర్చుకో
ఇంకను దోఁచినట్లు వదరుచు నాకుఁ గోపము రేఁపకుము. వెడలి పొమ్మని యనఁగా.

క. అచటన్ "ద్వేష్టి గతాయుశ్చ చికిత్సక" మను నయోక్తిఁ జర్చను
వచవచనంబులఁ గోపము, ప్రచురము గానీక మౌనిపతి కిట్లంటిఁ

టీ. అచటన్ = ఆ చోట - అతనియొద్ద ననుట; గతా...కమ్ - గతాయుశ్చ =
జీవితకాలముగలవాఁడు - ఆయుస్సు తీఱినవాఁ డనుట; చికిత్సకమ్ = వైద్యుని; ద్వేష్టి
ధించుచున్నాఁడు. అను నయోక్తిచర్చనన్ = అనెడి నీతివాక్యముయొక్క విచారణము
నీతివాక్యమును దలఁచి యనుట; ఉచ్చావచవచనంబులన్ = బహువిధములయిన యతని
రపుమాటలచేత; కోపము = (నాకుఁ గలిగిన) కోపమును; ప్రచురము = అధికము;
బయలు పొంగనియ్యక; మౌనిపతికిన్ = ఆ మునిశ్రేష్ఠునితో; ఇట్లంటిన్.

తా. అప్పు డతనియొద్దఁ గార్యార్థి నగుటచే "నాయుస్సు దీఱినవాఁడు వైద్యునితో విరోధించు" నను న్యాయమును దలఁచి, యేమియును గోపము బయలు పొంగనియ్యక, యతఁ డాడిన మాటలకెల్ల నోర్చి, యీ విధముగాఁ బలికితిని. అలం. లోకోక్తి.

తే. నీవు సదివింతు వనుచు ని౹న్నియును విడిచి
బిచ్చ మెత్తంగ రాదు గా౹బేలతపసి!
కడవ నాడకు; చాలు; నీ౹గొడవ యేల?
వెజ్జుఁదన మేల? యని మది౹లజ్జ వొడమి. 13

టీ. బేలతపసి! = ఓయి తెలివిమాలినముని! నీవు; చదివింతువు = విద్యాభ్యాసము చేయించెదవు; అనుచున్; ఇన్నియును = ఈ కలిగిన ధన రాజ్యాది సంపదలన్నియు; విడిచి; బిచ్చమెత్తంగన్ = తిరిప మెత్తుట; రాదుగా! = సరిపడదుగదా! - కలిగినవాని నెల్ల ననుభవించుచునే యుండవలెను గాని మానుకోరాదుగదా యనుట. కడవన్ = మేరమీఱ; ఆడకుము = తూలనాడకుము; చాలున్ = ఇప్పటి కాడినమాటలు చాలును. నీ గొడవ యేల? = నీతోడి విచారము నా కేల? వెజ్జుఁదనము = నీ వైద్యునితనము; ఏల? = నా కెందులకు? అని; మదిన్ = మనస్సునందు; లజ్జ వొడమి = సిగ్గుపుట్టి - సిగ్గుపుట్టఁగా ననుట. అనంతర పద్యముతో నన్వయము.

తా. ఓయి తెలివిమాలిన మునీ! నీవు విద్య నేర్పుదు వని తనకుఁ గల కలుముల నెల్ల నెవ్వఁడును వదలఁడు. నీవు తారతమ్యము తెలియక హద్దుమీఱి మాటలాడఁబోకుము. ఇంతటితో నిలిపి యూరకుండుము. నాకు నీతోడి చదువు, విచారము నక్కఱలేదు. నీ వైద్యునితనము నక్కఱ లేదని చెప్పి, మన సునఁ గొంచెము లజ్జ పుట్టఁగా.

శా. కంటే బ్రాహ్మణుఁ డెన్ని కాఱు లఱచెన్౹గర్వించి? వీ రెల్ల నా
కంటెం బాత్రులె విద్య? కెట్లు నిది నేఁ౹గైకొందు; నంచున్ మదిన్
గెంటెంపుంజేల ముప్పతిల్లఁ గపటాం౹తేవాసినై శాంబరిన్
గొంటుంజందము మీఱ శిష్యులగడన్౹గూర్చుండి చర్చారతిన్. 14

టీ. బ్రాహ్మణుఁడు; గర్వించి = అహంకరించి; ఎన్ని కాఱులు = ఎన్ని కఠినపుఁ గూఁతలు; అఱచెన్? = కూసెనో? కంటే! = చూచితివా! వీరెల్లన్ = ఈ చదివెడివారందఱును; విద్యకున్ = చదువునకు; నాకంటెన్ = నాకన్నను; పాత్రులె? = తగినవారా? - వీరియందు నాయెడలేని పాత్రత యేదియుఁ గాన మనుట. ఎట్లున్ = ఏవిధముచేతనైనను; ఇది = ఈ విద్యను; నేన్ కైకొందున్ = నేను గ్రహించెదను; అంచున్ = అని; మదిన్ = మనస్సునందు; గెంటెంపుంజలము = రెట్టించిన పట్టుదల; ఉప్పతిల్లన్ = పుట్టఁగా; శాంబరిన్ = మాయచేత; కపటాంతేవాసినై = మోసపుశిష్యుఁడనై - అక్కడనున్న యతని శిష్యులవలెనే వేషము వేసికొని శిష్యుఁడనై యనుట; గొంటుంజందము = దుష్టునిరీతి - దుష్టత్వము; మీఱన్ = అతిశయింపఁగా; శిష్యులగడన్ = ఆతని శిష్యులప్రక్కను; కూర్చుండి = కూర్చున్నవాఁడనై; చర్చారతిన్ = విషయ విచారణ చేయుటయందలి యాసక్తితో. తరువాతి పద్యముతో నన్వయము.

తా. ఈ బ్రాహ్మణుఁ డిట్లు గర్వించి నన్ను తూలనాడెనే? ఇతనియొద్దఁ జదివెడువారు మాత్ర మీ విద్య నభ్యసించుటకు నాకంటె యోగ్యులా? కాని మ్మని మనసున నా విద్య నేర్చు

కొనుటయందు మిక్కిలి పట్టుదల గలవాఁడనై మాయచేఁ గపటవేషము వేసికొని యతని శిష్యులతో జేరి కూర్చుండి, యక్కఱతో విషయవిచారము చేయుచు.

తే. కాయ బాల గ్రహోర్ధ్వాంగకములు నాల్గు
శల్య దంష్ట్రా జరా వృషక సంజ్ఞ నాల్గు
నైన యష్టాంగకముతావులారఁ గల్గు
వైద్య మెనిమిదినెలల సర్వమును నేర్చి. 15

టీ. కాయ...ములు - కాయ = దేహము; బాల = పసిబిడ్డలు; గ్రహ = క్షుద్రదేవతాది; ఊర్ధ్వాంగకములు = మెడకొంకులను మీఁదివైన యవయవములు; నాల్గు = నాలుగును; శల్య... సంజ్ఞక్ - శల్య = శలాకాది; దంష్ట్రి = కోఱపంటికాటు; జరా = ముదిమి; (ఇట ముదిమి యన విషసంకలనాదులచేనైన యాసన్నమరణావస్థ.) వృష = రేతస్సు; సంజ్ఞ = ఈ పేళ్లచేనైనవి; నాల్గు = నాలుగును; ఐన యష్టాంగకముతావులు = అయినట్టి చికిత్సాంగము లెనిమిదింటి తావులు; ఆరక్ = ఒప్పునట్లు; కల్గు వైద్యము = కలిగినట్టి వైద్యశాస్త్రము; సర్వముక్ = అంతయును; ఎనిమిది నెలలక్ = ఎనిమిది మాసములలోపల; నేర్చి = అభ్యసించి. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. కాయబాలగ్రహాదులయిన యెనిమిది యంగములు గల వైద్యము నెనిమిది నెలలలోనే తుదముట్ట నేర్చుకొని.

వైద్యాష్టాంగముల లక్షణం బెట్టిదనిన - "కాయ బాల గ్రహోర్ధ్వాంగ శల్య దంష్ట్రి జరా వృషాః। అష్టావంగాని తస్యాహు శ్చికిత్సా యేషు సంశ్రితా॥" అను శ్లోకార్థమును బట్టి కాయచికిత్స, బాలచికిత్స, గ్రహచికిత్స, ఊర్ధ్వాంగచికిత్స, శల్యచికిత్స, దంష్ట్రిచికిత్స, జరాచికిత్స, వృషచికిత్స అని వైద్యమునకు నంగము లెనిమిది. అందు కాయచికిత్స యనఁగా దేహమునందుఁ గలిగెడు జ్వరము, రక్తస్రావము, పిత్తోల్బణము, అతిసారము మొదలుగాఁగల రోగముల నుపశమింపఁ జేయు చికిత్స. కాయమనఁగా దేహమేకదా; దానికిఁ జేయు చికిత్స సర్వమును గాయచికిత్సయై యుండఁగా బాలాది విశేషసంజ్ఞ లేల? యనిన-పసిబిడ్డలకును, నేత్రాద్యంగములకును జికిత్సాక్రమము భేదపడి యుండుటచేత నని యెఱుంగునది. బాలచికిత్స = పసిబిడ్డల కుపయుక్తమైన చికిత్స. ఇందు పసిబిడ్డలకుఁ దగిన యౌషధములు, వారికిఁ బాలిచ్చు దాదులు, దాదుల పాలలోని దోషాదోషములు, ఆ పాల దోషమువలనఁ గలిగెడు వ్యాధులు, వాని నుపశమింపఁ జేయు మందులు ఇవియన్నియుఁ దెలుపఁబడును. గ్రహచికిత్స = బాలగ్రహాది క్షుద్రదేవతలు మొదలుగాఁ గల గ్రహములవలననైన పీడలు శమింపఁజేయు మంత్రతంత్ర ప్రయోగాదిరూపమయిన చికిత్స. ఊర్ధ్వాంగచికిత్స = మెడకొంకులమీఁదివైన కన్ను, ముక్కు, చెవి, నోరు (లేక) తల వీనియందుఁ గలిగిన వ్యాధులను మాన్చుకొనుటకై యాశ్చ్యోతన శలాకాది క్రియలచేఁజేయు చికిత్స. ఆశ్చ్యోతన మనఁగా - "ఉన్మీలితేక్షి దృఙ్మధ్యే బిందుభి ర్ద్వ్యంగుళాద్ధితమ్" అను ప్రమాణముచొప్పునఁ గన్ను దెఱచి, దాని నడుమ రెండంగుళముల లోఁతునకు దిగునట్లు ఔషధబిందువులను విడుచుట. శలాక యనఁగా సన్నని లోహపుకడ్డిని లోపలఁ జొప్పించి శోధించుట. దీనిని శాలక్య మనియు నందురు. శల్యచికిత్స = వ్రణములదైన చికిత్స - అనఁగా బాణము, కత్తి మొదలగువానిచే నైన గాయములకుఁ జేయు చికిత్స. దంష్ట్రిచికిత్స = పాము మొదలగువాని కోఱకాటువలని

విషములను నివారణచేయు చికిత్స. ఇది విషచికిత్స యనియుఁ జెప్పంబడియెడి. జరాచికిత్స = విషసంకలనాదులచే నైన యాసన్న మరణావస్థయందు రసాయనాదులం బ్రయోగించి చేయు చికిత్స. ఇది రసాయనచికిత్స యనియుఁ జెప్పంబడు. వృషచికిత్స = రేతస్సు వికలమయినప్పుడు ఆప్యాయన ప్రసాదోపజననాది రూపమునఁ జేయు చికిత్స. దీనికి వాజీకరణచికిత్స యనియుఁ బేరు. (ఆప్యాయనము = తనుపు. ప్రసాదము = స్వాస్థ్యము. ఉపజననము = అభివృద్ధి. చికిత్స = రోగము మానుటకై చేయు ప్రతిక్రియ.)

క. ఇరుమూఁడు రుచుల దోషపు, విరసత మానన్ జ్వరాది – వృష్యాంతంబై
పరగు చికిత్సయుఁ గని శాం, బరిఁ బాసి తపస్వితోడ – మదమున నంటిన్. 16

టీ. ఇరు...విరసత - ఇరుమూఁడు రుచుల = ఉప్పు, కారము, పులుసు, తీపు, చేఁదు, వగరు ననెడి షడ్రుచులయొక్క; దోషపు = తప్పులవలననైన - లోపములవలననైన; విరసత = రసహీనత్వము; మానన్ = పోవునట్లు; జ్వరాది వృష్యాంతంబై = జ్వరచికిత్స మొదలు వృషచికిత్స తుదగాఁ గలదై; (ఇచట వృష్య మనఁగా వృషసంబంధి చికిత్సాసముదాయ మనుట.) పరగు = ఒప్పునట్టి; చికిత్సయున్ = వైద్యమును; కని = పొంది - గ్రహించి యనుట; శాంబరిన్ = మాయను; పాసి = విడిచి; మదమునన్ = గర్వముతో; తపస్వితోడన్ = ఆ మునీశ్వరునితో - బ్రహ్మమిత్రునితో; అంటిన్.

తా. ఉప్పు మొదలయిన యాఱు రసములందు నేదేని రుచింపనిపట్ల నే యే దోషమువలన నా యరుచి పుట్టునో; యా యా దోషములను, వానికిఁ బరిహారౌషధములను జ్వరచికిత్స మొదలు వృషచికిత్సవఱకు నైన వైద్య మంతయు నాహూలాగ్రముగా గ్రహించి మాయవిడిచి, కోరిక నెఱవేర్చికొంటిని గదా యను గర్వముచే బ్రహ్మమిత్రునితో నిట్లు పలికితిని.

శా. తండ్రీ! నాకు ననుగ్రహింపఁగదె వై – ద్యం బంచుఁ బ్రార్థించినన్
గండ్రల్‌గా నటు లాడి ధిక్కృతులఁ బో – కాల్మంటి; వోహో! మదిం
దీండ్రల్ గల్గినవారి కేకరణినే – నిన్ విద్య రాకుండునే?
గుండ్రా డాఁచినఁ బెండ్లి యేమిటికిఁ జి – క్కుం గష్టముష్టింపచా! 17

టీ. తండ్రీ! = ఓ నాయనా! వైద్యంబు = వైద్యశాస్త్రమును; నాకు; అనుగ్రహింపఁగదె! = దయచేసి నేర్పవయ్యా! అంచున్ ప్రార్థించినన్ = అని వేఁడుకొనఁగా; గండ్రల్‌గాన్ = పరుషములుగా; అటులు = ఆ ప్రకారము; ఆడి = నిందించి; ధిక్కృతులన్ = తిరస్కారపు మాటలతో; పోకాల్మంటివి = పో పొమ్మంటివి. ఓహో! = ఔరా! - అంతమాత్రముచేత నేమాయె ననుట. మదిన్ = మనస్సునందు; తీండ్రల్ = చొరవలు; (ఇట బహువచన మాధిక్యమును దెలుపును.) కల్గినవారికిన్ = కలవారలకు; ఏకరణినేనిన్ = ఏవిధముచేతనైనను; విద్య; రాకుండునే! = రాకయుండునా? - రానేవచ్చు ననుట. కష్టముష్టింపచా! = నీచుఁడవైన బిచ్చపు బాఁపఁడా! గుండ్రా = గుండుదాయి-పసుపు లోనగునవి దొరుకొనెడి పాత్రమును; డాఁచినన్ = దాఁచిపెట్టినను; పెండ్లి; ఏమిటికిన్ చిక్కున్? = ఎందులకు జరుగక నిలిచిపోవును? - గుండ్రాతిని దాఁచిపెట్టిన మాత్రమునఁ బెండ్లి నిలువక జరుగునట్లు, నీబోఁటి మూర్ఖులు తిరస్కరించిన మాత్రముననే విద్యాపేక్ష గలవారికి విద్య రాకపోదు. ఎట్లయినను రానేవచ్చును. కనుకనే నీవు

నన్నుఁ దిరస్కరించి వెడలి పొమ్మన్నను నే నెట్లో విద్య గ్రహింపనే గ్రహించితి ననుట. అలం. అర్థాంతరన్యాసము.

మ. అనినం గన్నులు జేవుఱింప నధరం బల్లాడ వేల్లత్పునః
పునరుద్యద్భ్రుకుటీభుజంగయుగళీ ఫూత్కారఘోరానిలం
బన నూర్పుల్ నిగుడన్ లలాటఫలకం బందంద ఘర్మాంబువుల్
చిలుకం గంతుదిదృక్షురూక్షనయన క్ష్వేళాకరాళధ్వనిన్. 18

టీ. అనినన్ = నే నిట్లని యనఁగా; కన్నులు; జేవుఱింపన్ = ఎఱ్ఱవాఱఁగాను; అధరంబు = పెదవి; అల్లాడన్ = అదురఁగాను; వేల్ల...అలన్ - వేల్లత్ = వ్రేలుచున్నదియు; పునఃపునః = మాటిమాటికి; ఉద్యత్ = ఎగయుచున్నదియు నైన; భ్రుకుటీ = బొమముడి యనెడి; భుజంగ యుగళీ = పెనఁగొన్న పాముల జంటయొక్క; ఫూత్కార = బుసయొక్క; ఘోర = భయంకర మైన; అనిలంబు అనన్ = వాయువో యనునట్లు; ఊర్పులు = నిట్టూర్పులు; నిగుడన్ = అతి శయింపఁగాను; లలాటఫలకంబు = పలకవలె విశాలమైన నొసలు; అందంద = మాటిమాటి - అధిక ముగా ననుట; ఘర్మాంబువుల్ = చెమటనీళ్లు; చిలుకన్ = కురియింపఁగాను; కంతు...ధ్వనిన్ - కంతు = మన్మథుని; దిదృక్షు = కోపదృష్టితోఁ జూడ నిచ్ఛగల; రూక్షనయన = అగ్నినేత్రము గల శివునియొక్క; క్ష్వేళా = సింహనాదమువలె; కరాళ = భయంకరమైన; ధ్వనిన్ = ధ్వనితో. అనంతర పద్యముతో నన్వయము.

తా. అని నేను గర్వించి పలుకఁగా నా మునీశ్వరుఁడు కన్నులెఱ్ఱవాఱఁగాను, పెదవు లదురఁ గాను, పెనఁగొని బుసగొట్టుచున్న పాములజంట విడుచు నిట్టూర్పులో యనునట్లు బొమముడి గల ముఖభాగమునుండి నిట్టూర్పువాయువులు వెడలఁగాను, నొసటఁ జెమటనీళ్లు కాఱఁగాను మన్మథునిఁ దీక్ష్ణదృష్టితోఁ జూచి సింహనాదము చేసిన రుద్రుని సింహనాదధ్వనియో యనునట్లు కంఠధ్వని మొరయఁగా. అలం. ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు.

వ. జటిలుండు గిటకిటం బండ్లు గొఱికి హుమ్మని కటమ్ము లదుర ముకుఁబుట
మ్ములు నటింపఁ 'గటకటా! కుటిలాత్మా! యటమటమ్మున విద్య గొనుటయుం
గాక గుటగుటలు గురువుతోనా' యని కటకటం బడి కకపాలలోని బూది కేలం
గొని, 'యాసురి యగు మాయ మాయెడం బ్రయోగించి వంచించి యుప
హసించితివి గావున నసురవై పిశితంబును, వసయును, నసృగ్గ్రాసంబు నశనంబు
లుగా మెసవి, వసుధ వసియింపు' మని బసుమంబు సల్ల, గుండె జల్లుమని
కల్లువడి మునితల్లజుపదపల్లవంబులం ద్రెళ్లి యిట్లంటి. 19

టీ. జటిలుండు = జడదారి - మునీశ్వరుఁడు; కిటకిటన్ = కిటకిట యను ననుకరణ ధ్వనితో; పండ్లుగొఱికి = పండ్లు గీటి; హుమ్మని = హుంకారము చేసి; కటమ్ములు = కణఁతలు; అదురన్ = చలింపఁగా; ముకుఁబుటమ్ములు = ముక్కురంధ్రములు; నటింపన్ = ఆడఁగా - అనఁగా కోపముచే నుచ్ఛ్వాస నిశ్వాసము లధికముకాఁగా ముక్కురంధ్రము లుబ్బుచు, తగ్గుచుండఁగా ననుట. కటకటా ! = అయ్యయో ! (ఇది కోపాతిశయమును దెలుపును.) కుటిలాత్మా ! = కపటచిత్తుఁడా ! అటమటమ్మునన్ = వంచనచేత - వంచనచేసి యనుట; విద్య; కొనుటయుం గాక = గ్రహించుటమాత్రముగాక; గుటగుటలు = గర్వపుమాటలు; గురువుతోనా ? = ఒజ్జతోనా?

(ఆడెదవు) అని; కటకటంబడి = ఆగ్రహించి; కకపాలలోని బూది = విబూదితిత్తిలోనున్న విబూదిని; కేలన్ కొని = చేతియందు గ్రహించి; ఆసురి అగుమాయన్ = అసురసంబంధమైన దయినట్టి మాయను; మాయెడన్ = మా విషయమునందు; ప్రయోగించి = ఉపయోగించి - పన్ని; వంచించి = మోసపుచ్చి; అపహసించితివి = కోడిగము లాడితివి; కావునన్; అసురవై = నీవు రాక్షసుఁడవై; పిశితంబును = మాంసమును; వసయును = కడుపులో బొడ్డుక్రింద నుండెడి యుల్లిపొరవంటి క్రొవ్వును; అసృగ్రసంబును = నెత్తురును; అశనంబులుగాన్ = ఆహారవస్తువులుగా; మెసవి = తిని; వసుధన్ = భూమియందు; వసియింపుము = ఉండుము; అని; బసుమంబు = భస్మము - చేతనున్న విబూదిని; చల్లన్ = నామీఁదఁ జల్లఁగా; గుండె = హృదయము; జల్లుమని = తల్లడిల్లి; కల్లువడి = మ్రానుపడి - నిశ్చేష్టత్వము నొంది; ముని...బులన్ - మునితల్లజు = ఆ మునిశ్రేష్ఠుని యొక్క; పదపల్లవంబులన్ = చిగుళ్లవంటి యడుగులమీఁద; ద్రెళ్ళి = పడి; ఇట్లంటిన్.

తా. ఆ మునీశ్వరుండు పండ్లు పటపట గొఱుకుచు, హుంకారము చేసి, ఆదరించి "ఓరి మోసకాఁడా! మోసము చేసి మావలన విద్య గ్రహించినదిమాత్రముగాక మీఁదుమిక్కిలి మమ్ముఁ దిరస్కరించి మాటలాడి పరిహసించెదవా?" యని తన విబూదిసంచిలోని విబూదిని జేతి కెత్తుకొని యభిమంత్రించి, "నీవు రాక్షసమాయచే మమ్ము వంచించినవాఁడవు కావున రాక్షసుఁడవై, మనుష్య మాంసము దిని, నెత్తురు ద్రాగుచు, వర్తింపు"మని శపించెను. అంతులకు నేను భయపడి యాయన పాదములమీఁదఁ బడి, యీ మీఁదఁ జెప్పఁబోవురీతిగాఁ బ్రార్థించితిని.

శా. నాయజ్ఞానము సైఁచి సంయమివరేణ్యా! కావవే! రాక్షసుం
డై యే నెట్లు భజించువాఁడ దురితం; బయ్యో! నృమాంసంబు కూ
డై యే నెట్లు భరించువాఁడ నుదరం; బార్ద్రాంతరంగుండవై
యో యయ్యా! దయసేయవే యవధి; యే నోపంగదే హింసకున్! 20

టీ. సంయమివరేణ్యా! = మునిశ్రేష్ఠుఁడా! నాయజ్ఞానము = నా తెలివిలేమిని; సైఁచి = సహించి; కావవే! = కాపాడవయ్యా! రాక్షసుండై = రక్కసుండనై; ఏన్ = నేను; దురితంబు = పాపమును; ఎట్లు భజించువాఁడన్ = ఏవిధముగా పొందఁగలవాఁడను. అయ్యో! = అక్కటా! (ఇది దుఃఖమును దెలుపును.) నృమాంసంబు = మనుష్యమాంసము; కూడై = అన్నమై - అన్నముగా భుజించి యనుట; ఏన్ = నేను; ఉదరంబు = కడుపును; ఎట్లు భరించువాఁడన్ = ఏవిధముగా పోషింపఁగలవాఁడను? ఓ యయ్యా! = ఓ నాయనా! ఆర్ద్రాంతరంగుండవై = (దయారసముచే) తడిసిన మనసుగలవాఁడవై - దయగలవాఁడవై యనుట; అవధి = మేర - ఇంతకాలము కీ కారణముచేత నీ శాపము తీఱు ననుమేర ననుట; దయసేయవే! = అనుగ్రహింపవయ్యా! - ఏర్పఱుపు మనుట. ఏన్ = నేను; హింసకున్ = ప్రాణులను హింస చేయుపనికి; ఓపంగదే! = తాళలేను గదయ్యా!

తా. ఓ మునిశ్రేష్ఠుఁడా! తెలివిమాలి నేను చేసిన తప్పు సహించి నన్నుఁ గాపాడుము. నేను పాపముల ననుభవింపను, మనుష్యమాంసముతోఁ బొట్టఁ బోచికొని జీవింపను, ప్రాణులను బాధించి చంపను ఓపను. నాయందు దయచేసి యీ శాపము తీఱుట కొక మేర నిర్ణయించి యనుగ్రహింపుము.

చ. అనినఁ బ్రసన్నుఁడై ముని కరాబ్జములన్ నను నెత్తి 'వత్స! మ
త్సునిశితశాపశూలహతి సుక్కితిగా; యిఁకఁ గొన్నినాళ్లపైఁ

దనయును మ్రింగఁబోయి యొక ♦ ధన్యుని దివ్యశరార్చిఁ బ్రేలి వే
కనియెదు భద్ర' మన్నఁ దుర ♦ గంబుపయిం బడి ప్రొద్దు గ్రుంకఁగన్. 21

టీ. అనినన్ = (అని నేను దుఃఖముతో) మనవిచేసికొనఁగా; ముని = ఋషి - బ్రహ్మమిత్రుఁడు; ప్రసన్నుఁడై = నాయందనుగ్రహము గలవాఁడై; ననున్ = నన్ను; కరాబ్జములన్ = తామరలవలె మృదువులైన తనచేతులతో; ఎత్తి = (తనయడుగులపైనుండి) లేవనెత్తి; వత్స ! = ఓరి చిన్నవాఁడా ! మత్సు...హతిన్ - మత్ = నాదైన; సునిశిత = మిక్కిలి తీక్ష్ణమైన; శాప = తిట్టనెడు; శూలహతిన్ = శూలాయుధముయొక్క పోటుచేత; క్రుక్కితిగా ! = దుఃఖించితివి గదా ! ఇఁకన్; కొన్నినాళ్లపైన్ = కొన్నాళ్లకుఁ దరువాత; తనయన్ = నీ కొమార్తను; మ్రింగఁబోయి = మ్రింగుటకు యత్నించి; ఒక...శరార్చిన్ - ఒక ధన్యుని = ఒక పుణ్యాత్ముని యొక్క; దివ్యశరార్చిన్ = దివ్యాస్త్రజ్వాలచేత; ప్రేలి = వేఁగి - కాల్పఁబడి యనుట; వే = శీఘ్రముగా - వెంటనే యనుట; భద్రము = మేలు - శాపమోక్షమును; కనియెదు = పొందెదవు; అన్నన్ = అనఁగా; తురగంబుపయిన్ = గుఱ్ఱముమీఁద; పడి = కూర్చుండఁబడి; ప్రొద్దు గ్రుంకఁగన్ = సూర్యాస్తమయమునకు. అనంతర పద్యముతో నన్వయము.

తా. అని యీవిధముగా నే నా బ్రహ్మమిత్రమునీశ్వరుని దైన్యముతో వేఁడుకొనఁగా నతఁడు తన యడుగులపయిఁ బడియున్న నన్ను లేవనెత్తి ప్రేమతో "నో చిన్నవాఁడా! నీవు నాశాపమునకు వెఱచి పాదాక్రాంతుఁడ వైతివి గనుక స్వల్పకాలములోనే నీకూఁతు నే మ్రింగఁబోయి యొక్క పుణ్యపురుషుని బాణాగ్నిజ్వాలలచేతఁ గాలి శాపమువలన విముక్తుఁడ వయ్యెదవు, పొ" మ్మనఁగా నందుండి యొక గుఱ్ఱము నెక్కి వెడలి సూర్యాస్తమయమునకు.

క. సన్నపుఁదలయేరున మయి, యన్నుకొనుచు [1]నాము దిన్న ♦ యట్లై రాఁగా
ఖిన్నుఁడనై పురి కేఁగితిఁ, దిన్నదనం బుడిగి కొన్ని ♦ దివియలు వెలుఁగన్. 22

టీ. సన్నపుఁదలయేరునన్ = కొంచెపుఁ దలనొప్పిచేత; మయి = దేహము; అన్నుకొనుచున్ = పరవశమగుచు; ఆము దిన్నయట్లై = విషముదిన్న విధమై; రాఁగాన్ = ఏర్పడఁగా; ఖిన్నుఁడనై = ఖేదమునొందినవాఁడనై; తిన్నఁదనంబు = సౌమ్యభావము; ఉడిగి = మాని; కొన్ని దివియలు = కొన్ని దివిటీలు; వెలుఁగన్ = వెలుఁగుచుండఁగా; పురికిన్ = నా పట్టణమునకు; ఏఁగితిన్ = పోయితిని.

తా. ఇంచుక తలనొప్పియు, విషము దిన్నట్లు మైకము గలిగి దేహము పరవశముకాఁగా ఖేదమునొంది యదిరిపడుచుఁ గొన్ని దివిటీల వెలుఁగున మెల్లఁగాఁ బోయి పట్టణము చేరితిని. అలం. స్వభావోక్తి.

క. అంపఁ దగువారిఁ గసరుచు, నంపి నగరు సొచ్చి వెలఁదు ♦ లారతు లీఁగా
నిం పఱుఁ గశాభిహతుల, జంపించితి వారి నన్ని ♦ శామధ్యమునన్. 23

టీ. (అట్లు పట్టణము చేరి) అంపన్ = సెలవిచ్చి పంపుటకు; తగువారిన్ = తగిన సేవకులు మొదలగువారిని; కసరుచున్ = కోపముతో నదలించుచు; అంపి = వారివారి నివాసములకుఁ బంపి; నగరు చొచ్చి = దివాణమును ప్రవేశించి; వెలఁదులు = స్త్రీలు; ఆరతులీఁగాన్ = (వాడుక

1. ఁబాము. పా.

చొప్పున) నీరాజనము లియ్యఁగా; ఇంపు అలరన్ = సంతోషము చెడునట్లు; వారలన్ = ఆ యారతులియ్య వచ్చిన స్త్రీలను; అన్నిశామధ్యమునన్ = ఆ నడిరేయిని; కశాభిహతులన్ = కొరడా దెబ్బలచేత; చంపించితిన్.

సీ. అభ్రమండలి మోచు నందాఁక నూరక, పెరిఁగినట్లౌ మేను నరవరేణ్య!
యవధిభూధరసాను వందాఁక నూరక, పఱచినట్లౌ మేను పార్థివేంద్ర!
యబ్జభూభువనంబు నందాఁక నూరక, యెగసినట్లౌ మేను జగదధీశ!
యహిలోకతల మంటు నందాఁక నూరక, పడినయట్లవు మేను ప్రభువతంస!

తే. యఖిలజగములు మ్రింగునం తాఁకలియును,
నబ్ధు లేడును జెడఁ గ్రోలు నంత తృషయు,
నచలచాలనచణమైన యదటుఁ గలిగె
నసురభావంబు ననుఁ జెందు నవసరమున. 24

టీ. నరవరేణ్య! = ఓ రాజా! అసురభావంబు = రాక్షసత్వము; ననున్ చెందు నవసరమునన్ = నన్ను పొందినసమయమునందు; ఊరక = కారణములేకయే; మేను = నాశరీరము; అభ్రమండలి = మేఘమండలము - ఆకాశము; మోచునందాఁకన్ = ఒరయునంతవఱకు; పెరిఁగినట్లు = వృద్ధిఁబొందినట్లు; ఔన్ = అగును; పార్థివేంద్ర! = ఓ రాజశ్రేష్ఠుఁడా! మేను; అవధి...దాఁకన్ - అవధిభూధర = చక్రవాళపర్వతముయొక్క; సానువందాఁకన్ = చఱియవఱకు; ఊరక = ఎడ తెగక; పఱచినట్లు = పర్వెత్తినట్లు; ఔన్ = అగును. (పా. పఱపినట్లౌన్ = వ్యాపింపఁజేసినట్లవును.) జగదధీశ! = భూలోకనాయకా! మేను; అబ్జ...దాఁకన్ - అబ్జభూ = బ్రహ్మయొక్క; భువనంబునందాఁకన్ = లోకమువఱకును - సత్యలోకపర్యంతము ననుట; ఊరక = మానక; ఎగసినట్లు = ఎగిరిపోయినట్లు; ఔన్ = అగును. ప్రభువతంస! = రాజశ్రేష్ఠుఁడా! మేను; అహిలోకతలము = నాకలోకముయొక్క యడుగుభాగము; అంటునందాఁకన్ = అంటునంతపర్యంతము; ఊరక = కారణములేకయే; పడినట్లౌన్ = దిగఁబడిపోయినట్లగును. అఖిలజగములు = ఎల్ల లోకములను; మ్రింగునంత = మ్రింగవలసినంత; ఆఁకలియున్ = క్షుత్తును; అబ్ధు లేడును = ఏడు సముద్రములును; చెడఁగ్రోలునంత = తుదముట్టఁ ద్రాగవలసినంత; తృషయున్ = దప్పియును; అచల...చణము - అచల = కొండలనుగూడ; చాలన = చలింపజేయుటకు - కదలించుటకు; చణము = చాలినది; ఐన యదటున్ = అయినట్టి యుద్ధతియును - బలగర్వమును; కలిగెన్.

తా. ఓ మహారాజా! ఆ రాక్షసత్వము నన్నుఁ బొందినతోడనే నాదేహము పరవశమై కారణము లేకయే యాకాశము నొరయునట్లు పొడుగుగాఁ బెరఁగినట్లును, చక్రవాళపర్వతపర్యంతము పరుగెత్తినట్లును, బ్రహ్మలోకపర్యంతము మీఁది కెగిరి పోయినట్లును, పాతాళలోకముదాఁక దిగఁబడిపోయినట్లును నై, యెల్లలోకములను మ్రింగునంతటి యాఁకలియు, నెల్ల సముద్రములను బుడిసిటఁబట్టి త్రాగునంతటి దాహమును, కొండలనుబట్టి కదలించునంతటి క్రొవ్వును గలిగెను. అలం. స్వభావోక్తి.

క. రక్కసుఁడనై నెపం బిడి, యొక్కొక యపరాధమునకు నొక్కొక్కఁడుగా
బొక్కఁగ లోకము పురపురఁ, బొక్కఁగఁ బాడయ్యె నంతి పురముం బురమ్మున్.

టీ. రక్కసుఁడనై = అట్లు రాక్షసుఁడనై; నెపంబిడి = మిషపెట్టి - ఏదో నొక నేరము మోపి యనుట; ఒక్కొక యపరాధమునకున్ = ఒక్కొక్క నేరమునకును; ఒక్కొక్కఁడు = ఒక్కొక్క మనుష్యుఁడు; కాన్ = అగునట్లు; బొక్కఁగన్ = భక్షించుచు రాఁగా; లోకము = జనసమూహము; పురపురఁ బొక్కఁగన్ = మిక్కిలి తపింపఁగా; అంతిపురమున్ = అంతఃపురమును; పురమున్ = పట్టణమును; పాడయ్యెన్ = పాడుపడిపోయెను. నేను, లేని నేరములు కల్పించి పట్టణములోనిజనుల నందఱను బట్టి తిన నారంభించితిని. దానిచే రాణివాసము మొదలుగాఁ బట్టణమంతయుఁ బాడుపడిపోయెను. అందులకు లోకు లందఱును బరితపించిరని తాత్పర్యము.

తే. ఊరు పాడైనఁ గెళవులఁ యూళ్లు కుఱికి
మెసవ దొరఁకొంటిఁ బ్రజ మారి మసఁగినట్లు;
తీఱెఁ గతిపయదినములఁ దేశ మెల్ల
మల్లెవట్టిన చేనిక్రమంబు గాఁగ. 26

టీ. ఊరు = నాయూరు - నా పట్టణము; పాడైనన్ = నాశమునొందఁగా; కెళవుల యూళ్లకున్ = ఇరుగుపొరుగు గ్రామములకై; ఉఱికి = దాఁటి - పోయి యనుట; ప్రజన్ = జనసమూహమును; మారిమసఁగినట్లు = మారి యనుదేవత విజృంభించి నాశము చేయునట్లు; మెసవన్ = పట్టితినుటకు; దొరఁకొంటిన్ = మొదలుపెట్టితిని. కతిపయదినములన్ = కొన్నిదినములలోపలనే; దేశమెల్లన్ = నా దేశమంతయు; మల్లెపట్టిన చేని క్రమంబు = తెగులు తగిలిన చేనివిధము; కాఁగన్; తీఱెన్ = నాశమయ్యెను. (మల్లె యనఁగాఁ బైరును జెఱచునట్టి యొకవిధమైన చెట్టు. అది బలియఁగాఁ బైరులేని చేనివలె నాశమయ్యె నని కొందఱ అర్థము వ్రాయుచున్నారు.)

తా. నా పట్టణమంతయుఁ బాడైపోఁగా నేను నిరుగు పొరుగు గ్రామములమీఁదఁబడి మారిదేవత యొకతట్టునుండి క్రమముగా జనులను జంపుచు వచ్చునట్లు సర్వజనులను జంపి తినుచు వచ్చితిని. దానిచేతఁ దెగులు తగిలిన చేనివలె దేశమంతయుఁ గొన్నిదినములలోనే పాడైపోయెను. అలం. ఉపమ.

వ. ఇవ్విధంబున విధివిధానంబున యాతుధానుండనై ధారాధరోత్సేధంబును, నతినిశితరోమసంబాధంబును, ధూమసమధామంబును, ధృతాంత్రదామంబును, జలితకపాలకుండలంబును, జ్వలితసితదంష్ట్రామండలంబును, నాగాయుతత్రాణంబును, మస్తకోత్తుంగఘోణంబును నై, యనవరతహింసానురూపంబగు రూపంబుఁ దాల్చి, శకటాంగభంగికమ్ములై యింగలమ్ములోలుకు నపాంగమ్ములం బిశంగమ్ము లగుచుఁ బశ్యజ్జనాసుమోచనమ్ములగు లోచనమ్ములు వెలుఁగ, బభ్రుకేశమ్ములు దూల, సకలభూతభయంకరమ్మగుపటిమ నిచటి యుటజమ్ముల కుఱికి, జటి యనక, వటు వనక, యతి యనక, వ్రతి యనక, గృహి యనక, సతి యనక, శిశు వనక భక్షించి భక్షించి, కుక్షింభరిత్వంబునం బ్రవర్తిల్లితి; నదియట్లుండె. వినుము. తారలకు, వర్షధారలకు, నిసుమునకుం, గసపునకు లెక్క గలిగినం గలుగుఁగాని మదీయజఠరానలజీర్ణజంతుసంతానంబునకు లెక్కయిడ నక్కమల

గర్భుండును సమర్థుండుగాఁ;డిట్టికృత్రిమదనుజభావావిష్టుండ నగు నా [illegible]ంబు సవసవగాఁ దెలిసి ముదురకయమున్న మత్కళత్రంబులం బుట్టినింటికి వా రుత్సవావలోకనవ్యాజంబున ననిపించుకొని చని నిజగృహంబుల నునిచి [illegible]చు కొని యుండి; రిపుఁడే నశనంబు గానక [illegible] కన్న యిక్కన్నియ [illegible] కాననంబునం గుసుమంబులు గోయుచానిం గని, కనికరం బుడిగి, [illegible] నను మ్రింగం దఱుముకొని వచ్చి, యిచ్చోట భవదీయదర్శనంబున [illegible] వలన విముక్తుండనై నిజప్రకృతిం బొంది కృతార్థుండనైతి. 27

టీ. ఇవ్విధంబునన్ = ఈ రీతిని; విధివిధానంబునన్ = దైవకృత [illegible]; [illegible] నై = రాక్షసుఁడనై; ధారాధరోత్సేధంబును = మేఘమండలపర్యంతమైన పొడుగు [illegible]; [illegible] బాధంబును - అతినిశిత = మిక్కిలి వాఁడియైన - [illegible] నుట; [illegible] కలచేత; సంబాధంబును = సందులేనిదియు; ధూమ...బును - ధూమ = పొ[illegible]; [illegible] సరిపోలిన; ధామంబును = కాంతి గలదియు; ధృతాంత్రదామంబును = ధరింపఁబ[illegible] సరములు గలదియు; చలిత...బును - చలిత=కదలింపఁబడిన; కపాల = పుఱ్ఱె పెంకు [illegible] లంబును = చెవిపోఁగులు గలదియు; జ్వలిత...బును - జ్వలిత = [illegible]లుఁగుచున్న; [illegible] తెల్లనైన కోఱలయొక్క; మండలంబును = సమూహము గలదియు; నాగాయుత[illegible] పదివేలయేనుఁగుల బలముగలదియు; మస్త...బునునై - మస్తక = తలమీఁ[illegible]; [illegible] ఎత్తుగా నిక్కిన; ఘోణంబునునై = ముక్కుగలదియునై; అనవరత...రూపంబు - [illegible] ఎడతెగని; హింసా = కట్టుట, కొట్టుట, చంపుట మొదలగు ప్రాణుల[illegible]; [illegible] తగినది; అగు రూపంబున్ = అగునట్టి యాకృతిని; తాల్చి = ధరించి; (అలం. స్వ[illegible] శక....మ్ములై - శకటాంగ = బండిచక్రములయొక్క; భంగికమ్ములై = విధముగలవి [illegible] లమ్ములు = నిప్పులు; ఒలుకు నపాంగమ్ములన్ = రాలుచున్న కడగన్నులచేఁ; [illegible]మ్ములు పచ్చవాఱినవి; అగుచున్; పశ్యజ్జనాసుమోచనమ్ములు - పశ్యత్ = చూ[illegible]; [illegible] జులయొక్క; అసు = ప్రాణములను; మోచనమ్ములు = విడిపించునవి - జనులు [illegible] తల్లడిల్లి ప్రాణమును విడుచునంతటి ఘోరమ్ములైన వనుట. అగు [illegible]మ్ములు = [illegible] వెలుంగన్ = ప్రకాశింపఁగా. (అలం. ఉపమ, స్వభావోక్తియును.) [illegible] తలవెంట్రుకలు; తూలన్ = చలించుచుండఁగా; సకలభు[illegible]...భయంకరమ్ము - [illegible] సమస్తమయిన ప్రాణులకు; భయంకరమ్ము = వెఱపును గలుగఁజేయునది; [illegible] అయినట్టి సామర్థ్యముచేత; ఇచటి యుటజమ్ములకున్ = ఇక్కడి [illegible]పర్ణశాలలకు; [illegible] దుమికి - ఇక్కడి మునిపల్లెల యాకుటిండ్లపైఁ బడి యనుట. జటి యనక = జడలుదాల్చిన [illegible] శ్వరుఁ డని యెంచక; వటు వనక = బ్రహ్మచారియని యెంచక; యతి య[illegible] = స[illegible] యని యెంచక; వ్రతి యనక = వానప్రస్థుఁడని తలఁపక; గృహి య[illegible] = గృ[illegible] యనుకొనక; సతి యనక = ఆఁడుది యని తలఁపక; శిశు వనక = పసిబిడ్డ య[illegible] తలఁచక; [illegible] భక్షించి = తిని తిని - ఎల్లవారిని తిని; కుక్షింభరిత్వంబునన్ = కడుపుఁ [illegible] చేత - కడుపుఁ బూడ్చుకొనుటచేత ననుట; ప్రవర్తిల్లితిన్ = చరించుచుంటిని. అది య[illegible] = ఆ నా ప్రవర్తనము అట్లుండనిమ్ము; వినుము = ఇంక నేఁ జెప్పఁబోవుదానిని వినుము. తా[illegible] = నక్షత్రములకును; వర్షధారలకున్ = వానచినుకులకును; ఇసుమునకున్ = ఇసుకకును; కసవు[illegible] =

(భూమిలో మొలచిన) గడ్డిపరకలకును; లెక్క = ఇన్నియనుసంఖ్య; కలిగినన్ = కలిగెనేనియు; కలుగఁగాని = కలుగవచ్చునుగాని; మదీయ...బునకున్ - మదీయ = నాదైన; జఠరానల = జఠరాగ్నిచేత; జీర్ణంబు = అఱిగినది; అయిన; జంతుసంతానంబునకున్ = ప్రాణిసమూహమునకు; లెక్కయిడన్ = లెక్కపెట్టుటకు; అక్కమలగర్భుండును = (సృష్టికర్తయైన) ఆ బ్రహ్మకూడ; సమర్థుండు = సామర్థ్యముగలవాఁడు; కాఁడు. ఇట్టి...విష్టుండను - ఇట్టి = ఇటువంటి; క్రూరమ... కలుగఁజేయఁబడిన - మునిశాపముచేత వచ్చిన యనుట; దనుజభావ = దానవత్వము - ... త్వము; ఆవిష్టుండను = ఆవేశించినవాఁడను - కలిగినవాఁడ ననుట; అగు నా దౌష్ట్యంబు= అయిన నాదుష్టత్వమును; సవసవగాన్ = జాడజాడగా - చూచాయగా; తెలిసి = ఎఱిఁగి; ... మున్న = ఆ దౌష్ట్యము హెచ్చకముందే; మత్కళత్రంబులన్ = నాభార్యలను; పుట్టింటివారు= వారి తల్లిదండ్రులు మొదలగువారు; ఉత్సవావలోకనవ్యాజంబునన్ - ఉత్సవ = పెండ్లి ... వేడుకలు; అవలోకన = చూచుటయనెడి; వ్యాజంబునన్ = సాకుచేత; అనిపించుకొని = ... బంపునట్లు చేసికొని; చని = పిలుచుకొనిపోయి; నిజగృహంబులన్ = తమయిండ్లయందు; ... పెట్టుకొని; రక్షించుకొని = కాపాడుకొని; ఉండిరి. ఇప్పుడు = ఈ సమయమునందు; ఏను = నేను; అశనంబు కానక = ఆహారము పొందక - చిక్కక; కానక కన్న యిక్కన్నియన్ = లేకలేక కనినట్టి యీ కూఁతును; కైలాసకాననంబునన్ = కైలాసపర్వతము దగ్గఱ ... యందు; కుసుమంబులు = పువ్వులు; కోయుచున్న దానిన్; కని = చూచి; కనికరంబు ఉడిగి = దయమాలి; కడుపుచిచ్చునకున్ = జఠరాగ్నికి - ఆఁకటికి ననుట; ... = ... వలెనని; తఱుముకొనివచ్చి; ఇచ్చోటన్ = ఇక్కడ; భవదీయదర్శనంబునన్ = ... చూపుచేత - నిన్నుఁ జూచుటచేత ననుట; వృజినరుజవలనన్ = పాపమనెడి రోగమువలననుండి; విముక్తుండనై = విడువఁబడినవాఁడనై; నిజప్రకృతిన్ = ఎప్పటి నా స్వభావమును; పొంది పడసి; కృతార్థుండను = ధన్యుఁడను; ఐతిన్ - ఆ ముని యనుగ్రహించినట్లు శాపవిముక్తుఁడనై స్వస్వరూపముం బడసితి ననుట.

క. ఈ యుపకారమునకుఁ బ్రతి, సేయఁగ శక్యంబె? జంభజిన్నిభ! శఫరా
త్యాయతలోచనయైన మ, దీయాత్మజ నీకు నిత్తు దేవీమణిగన్. 2..

టీ. జంభజిన్నిభ! = దేవేంద్రునిఁబోలిన యో మహారాజా! ఈ యుపకారమునకున్ = నీవు చేసిన శాపవిమోచనరూపమైన యీ మంచికి; ప్రతి = బదులు మేలు; చేయఁగన్ = చేయుటకు; శక్యంబె? = సాధ్యమా? - అసాధ్య మనుట; శఫరాత్యాయతలోచన - శఫర = చేప ... చేఁపలవలె; అత్యాయత = మిక్కిలి నిడుపులైన; లోచన = కన్నులుగలది; ఐన మదీయాత్మజన్ = అయినట్టి నాకొమార్తెను; నీకున్; దేవీమణిగన్ = పట్టపుభార్యగా; ఇత్తున్ = ఇచ్చెదను.

తా. ఓ మహారాజా! నీవు నాకుఁ గలిగిన శాపమును తొలఁగించి చాల మేలుచేసితివి. దీనికి దగిన మఱుమేలు చేయ నాకుఁ దరముకాదు. అయినను నా యీ కూఁతురైన మనోరమను నీకుఁ బట్టపుభార్యగా నిచ్చెదను. పెండ్లియాడుము.

క. ఆయుర్వేదముఁ గైకొని, యీ యింతిం బెండ్లియాడు మెలమి సమానా
రాయణపరిణయ గేయవి, గాయనగంధర్వమైన కవ్వపుఁగొండన్. 2..

టీ. (నీవు;) ఆయుర్వేదమున్ = (నేను నేర్చిన) వైద్యశాస్త్రమును; కైకొని = (నావలనఁ) బరిగ్రహించి; ఎలమిన్ = సంతోషముతో; ఈ యింతిన్ = ఈ నా కన్యను; రమా...గంధర్వము - రమా నారాయణ = లక్ష్మీనారాయణులయొక్క; పరిణయ = పెండ్లికథగల; గేయ = పాటలను; విగాయన = విశేషముగాఁ బాడుచుండెడి; గంధర్వము = గంధర్వులు గలది; ఐన కవ్వపుఁగొండన్ = అయినట్టి మందరపర్వతమునందు; పెండ్లియాడుము = వివాహము చేసికొనుము.

తా. నేను నాకూఁతుతోడ వైద్యశాస్త్రమును సయిత మిచ్చెదను. దానిని బరిగ్రహించి, మందరపర్వతమునకు వచ్చి, యచ్చట నా యింటిలో గంధర్వులు లక్ష్మీనారాయణుల పెండ్లిపాటలు పాడఁగా సంతోషముతో న్నా కూఁతురయిన యీ మనోరమను బెండ్లియాడుము.

లయగ్రాహి. అన్నగముపై జరఠ § పన్నగపతిస్ఫట ల
న న్నెగసి కోటతుద § ల న్నెగడు కొమ్మల్
మిన్నగల రాయ రుచిఁ § జెన్నగు విమానముల
పన్నుగడ పన్నుగఁ బ్ర § భిన్నగజఘోట
చ్ఛన్నగహనాపణము § ల న్నిగనిగద్యుతి ర
వి న్నగు మణిప్రకర § మున్నగరిమం బే
రెన్నఁగల యంగడుల § వన్నెగని సంపదల
మన్నగరి యొప్పు బల § భిన్నగరితేవన్. 30

టీ. అన్నగముపైన్ = ఆ కవ్వపుఁగొండమీఁద; జరఠ...అనన్ - జరఠ = ముదిసిన; పన్నగపతి = సర్పరాజైన శేషునియొక్క; స్ఫటలు అనన్ = పడగలో యేమో అనునట్లు; నెగసి = మీఁదికి నిక్కి; కోటతుదలన్ = ప్రాకారపుగోడయొక్క చివరలయందు; నెగడు కొమ్మల్ = అతిశయిల్లునట్టి శిఖరములు; మిన్ను = ఆకాశము; అగలన్ = ఛేదిల్లునట్లు; రాయన్ = ఒరయఁగా; రుచిన్ = ప్రకాశముచేత; చెన్నగు...గడ - చెన్నగు = అందగించుచున్న; విమానముల = మేడమీఁదఁ జప్పరములవలెఁ జౌకముదీర్చి కట్టఁబడిన కట్టడములయొక్క; పన్నుగడ = రచన; పన్నుగన్ = ఒప్పిదముకాఁగా; ప్రభిన్న...ములన్ - ప్రభిన్న = మదముపట్టిన; గజ = ఏనుఁగులచేతను; ఘోట = గుఱ్ఱములచేతను; ఛన్న = కప్పఁబడినవై; గహన = చొరరానివైన; ఆపణములన్ = అంగళ్లయందు; నిగనిగద్యుతిన్ = నిగనిగలాడుచున్న కాంతిచేత; రవిన్ = సూర్యుని; నగు మణిప్రకరము = అపహసించునట్టి రత్నములసమూహము; ఉన్నగరిమన్ = ఉన్నట్టి గౌరవముచేతను; పేరు = ప్రసిద్ధిని; ఎన్నన్ = ఎంచుటకు - కొనియాడుటకు; కల యంగడులన్ = తగిన రచ్చపట్టులచేతను; వన్నెగని = పొగడ్తను బొంది; సంపదలన్ = ఎల్ల కలుములచేతను; బలభిన్నగరితేవన్ = ఇంద్రునిదైన యమరావతీపట్టణమువలె; మన్నగరి = నాపట్టణము; ఒప్పున్ = ఉండును.

తా. ఆ మందరపర్వతముమీఁద నా పట్టణము మిక్కిలి యున్నతమయిన కొమ్మలతోడి కోటయును, మిక్కిలి వెలుఁగుచున్న మేడలమీఁది పొడుగుమీఱిన గోపురములును గలిగి, యెల్ల యెడలను మదపుటేనుఁగులును, గుఱ్ఱములును నిండుకొనఁగా, నంగళ్లయందుఁబఱపి పెట్టఁబడిన రత్నములు సూర్యుని వెలుఁగును గ్రిందుపఱిచి వెలుఁగఁగా, మెచ్చుకోఁదగిన రచ్చపట్లు వెలయఁగా

నింద్రుని యమరావతీ పట్టణమువలె నెల్ల విభవములతోను వెలయుచుండును. అలం. ఉపమ, అతిశయోక్తి, ఉత్ప్రేక్షయును.

తే. అని నిజోదంత మావంత ◊ యైన దాఁప
కంతయును జెప్ప నద్భుతం ◊ బంతరంగ
మంతయును నిండ హర్షించె ◊ నా స్వరోచి ;
యంత రవి యేఁగెఁ బశ్చిమా ◊ శాంతమునకు. 31

టీ. అని = ఇట్లు; నిజోదంతము = తన వృత్తాంతము; ఆవంతయైనన్ = అవగింజయంతయైనను - రవంతయైన ననుట; దాఁపక = మఱుఁగుపెట్టక; అంతయున్; చెప్పన్ = (తనతో నిందీవరాక్షుఁడు) చెప్పఁగా; ఆ స్వరోచి; అద్భుతంబు= ఆశ్చర్యము; అంతరంగము అంతయున్ = మనస్సు అంతటను; నిండన్ = నిండఁగా - తన మనస్సునందు మిక్కిలి యాశ్చర్యపడి యనుట. హర్షించెన్ = సంతోషించెను. అంతన్ = పిదప; రవి = సూర్యుఁడు; పశ్చిమాశాంతమునకున్ = పడమటిదిక్కు చివరకు; ఏఁగెన్ = పోయెను - సాయంకాల మయ్యె ననుట.

తా. ఈ విధముగా గంధర్వరాజైన యిందీవరాక్షుఁడు తన వృత్తాంతమంతయుఁ గొంచెమైన దాఁపక చెప్పఁగా స్వరోచి విని, మిక్కిలి యాశ్చర్యమును, సంతోషమును బొందెను. అంతటఁ బ్రొద్దు పడమటికి వాలఁగా సూర్యాస్తమయము నయ్యెను.

మ. వికసిల్లం బ్రజ చక్రపాలనము గా ◊ వించెం; గరవ్యాపృతిం
గకుబంతంబుల నాక్రమించెఁ ; బొసఁగం ◊ గా నేర్చె వర్ణాళిఁ ; గాం
తికిఁ బాపెం బెఱరాజకోటిఁ ; దుది శాం ◊ తిం బొందె దైవంబు సేఁ
తకుఁ దాపం బిఁక నే ? లనంగ నినుఁ డ ◊ స్తప్రాప్తుఁ డయ్యెం గడున్. 32

టీ. (ఇందుఁ గడవఱకు రెండర్థములు గ్రాహ్యములు.) ఇనుఁడు = సూర్యుఁడు; రాజు అని యర్థాంతరము. ప్రజ = జనసమూహము; వికసిల్లన్ = తెలివిపొందఁగా-ఇది యీ వస్తువు, ఇది మఱియొకవస్తువు అని తెలిసికోఁజాలినది కాఁగా నని యర్థము; సంతోషింపఁగా నని యర్థాం. చక్రపాలనము = జక్కవలను పాలించుటను; భూమండలము నేలుట నని యర్థాం. కావించెన్ = చేసెను. కరవ్యాపృతిన్ = కిరణములయొక్క వ్యాపనముచేత; చేతులయొక్క చాఁచుటచేత నని యర్థాం. కకుబంతంబులన్ = దిక్కులకొనవఱకుఁగల దేశము నెల్లను; ఆక్రమించెన్ = క్రమ్ముకొనెను; వశము చేసికొనె నని యర్థాం. వర్ణాళిన్ = తెలుపు, నలుపు మొదలైన వర్ణములను; బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలుగాఁగల వర్ణములను నని యర్థాం. పొసఁగంగాన్ = పొందుపడునట్లు; ఏర్చెన్ = ఏర్పాటుచేసెను-అనఁగా ఇది యిది యీ వన్నె యని తెలిసికొనునట్లు చేసె ననుట. ఈ జాతి యిట్టి యిట్టి నడతలు నడచుకోవలె నని నియమించె నని యర్థాం. పెఱరాజకోటిన్ = తనకంటె నితరుఁడైన చంద్రుని యతిశయత్వమును; శత్రురాజులయొక్క సమూహమును నని యర్థాం. కాంతికిన్ = ప్రకాశమువలననుండి; ప్రతాపముననుండి యని యర్థాం. పాపెన్ =తొలఁగించెను-చంద్రుని ప్రకాశము నణఁచివేసె ననుట. శత్రురాజుల ప్రతాపము నణఁచెనని యర్థాం. దైవంబు సేఁతకున్ =దైవము చేసినపనికి - దైవనిర్ణయమునకు; ఇఁకన్ = ఇఁకమీఁద; తాపంబు = తపింపఁజేయుట - వేఁడిమి; మనస్తాపము నని యర్థాం. ఏల అనంగన్ = ఏమిటికి ? అనునట్లు; తుదిన్ = కడపట; శాంతిన్ = వేఁడిమిలేమిని; శమగుణమును - కామక్రోధాదులు లేకుండుటను నని యర్థాం. పొందెన్.

కడుఁ = మిక్కిలి; అస్తప్రాప్తుఁడు - అస్త = అస్తమయపర్వతమును - అస్తమించుటను; చచ్చుటను అని యర్థాం. ప్రాప్తుఁడు = పొందినవాఁడు; అయ్యెన్ - అనఁగాఁ బ్రొద్దుగ్రుంకె ననుట. రాజు మృతిఁ బొందె నని యర్థాంతరము.

తా. ప్రతాపవంతుఁడయిన యొక మహారాజు తనభుజబలముచేత నెల్లదేశముల రాజుల జయించి చక్రవర్తియై, యెల్లజనులను వర్ణాశ్రమధర్మములు తప్పక జరపుచు సుఖముగా జీవించునట్లు రాజ్యపాలనము చేసి, దైవికముగా నంత్యకాలము రాఁగా శాంతి వహించి, మరణము నొందెనో యనునట్లు, సూర్యుఁడు తనవెలుఁగులచేత నీ బ్రహ్మాండ మంతయు నిండుకొనఁగాఁ జంద్రునియొక్కయు, నక్షత్రములయొక్కయు ప్రకాశ మణఁగిపోఁగాను, తెలుపు, నలుపు మొదలయినవర్ణములు తళతళ వెలుఁగఁగాను, వేఁడిమి వెదచల్లుచుఁ బ్రకాశించి సాయంకాలమునకు వేఁడిమి తగ్గఁగాఁ గ్రమముగా నస్తమించెను. ప్రొద్దుగ్రుంకె నని భావము. అలం. శ్లేషము, ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాసమును.

తే. అసురవరుఁ డైన యిందీవ రాక్షుమేన
నంటుకొన్న స్వరోచిబా ణాగ్నివోలె
నంతఁ గనుపట్టె శుకతుండ కాంతిఁ దెగడి
సాంధ్యరాగంబు పశ్చిమా చలమునందు. 33

టీ. అసురవరుఁడు = రాక్షసశ్రేష్ఠుఁడు; ఐన యిందీవరాక్షు మేనన్ = అయినట్టి యిందీవరాక్షుని దేహమునందు; అంటుకొన్న = తగులుకొన్న; స్వరోచి బాణాగ్నివోలెన్ = స్వరోచి యొక్క అస్త్రసంబంధమైన యగ్నివలెనే; అంతన్ = పిదప - ప్రొద్దుగ్రుంకినతోడనే; శుకతుండకాంతిన్ = చిలుకముక్కుయొక్క ప్రకాశమును - ఎఱుపు ననుట; తెగడి = తిరస్కరించి - మించి; సాంధ్యరాగంబు = సంధ్యాకాలమునందలి యెఱుపు; పశ్చిమాచలమునందున్ = పడమటికొండయందు - అస్తపర్వతమునందు; కనుపట్టెన్ = కనఁబడెను.

తా. మునిశాపముచేత రాక్షసత్వమునొందిన యిందీవరాక్షుఁ డనెడి గంధర్వుని దేహమునందంటుకొన్న స్వరోచియొక్క యాగ్నేయాస్త్రపు మంటలో యనునట్లు ప్రొద్దు గ్రుంకఁగానే పడమటి దిక్కునం దెఱ్ఱని చాయతో సంధ్యారాగము తోఁచెను. అలం. ఉత్ప్రేక్ష, ఉపమయును.

క. తలచూపె నప్పు డఖిలా, శల దట్టపుటిరులు చిలువ జవరాలు నభ
స్స్థలమండపకోపరిసీ, మల నిడిన సితాండపటలి మాడ్కిం జుక్కల్. 34

టీ. అప్పుడు = ఆ సమయమునందు; అఖిలాశలన్ = ఎల్ల దిశలయందును; దట్టపు... జవరాలు - దట్టపు = తఱచైన; ఇరులు = చీఁకటియనెడి; చిలువజవరాలు = సర్పస్త్రీ; నభ... సీమలన్ - నభస్స్థల = ఆకాశస్థానమనెడి; మండపక = చావడియొక్క; ఉపరిసీమలన్ = మీఁది ప్రదేశములందు; ఇడిన...మాడ్కిన్ - ఇడిన = పెట్టిన; సిత = తెల్లనైన; అండపటలిమాడ్కిన్ = గ్రుడ్లసమూహమువలె; చుక్కలు = నక్షత్రములు; తలచూపెన్ = కనఁబడెను.

తా. ఆ సమయమునం దెల్లదిక్కులయందును దట్టమైన చీఁకటి వ్యాపింపఁగా, నాకాశమునందు నక్షత్రములు ప్రకాశించెను. అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

ఆ. సాంధ్యనటనచండ చండీశపదహతిఁ, దరణిచక్ర మొరగి శరధిఁ గ్రుంగ
దొరగల్లువడియె భూరథేతరభాగ, చక్ర మనఁగ; నపుడు శశియుఁ దోఁచె.

టీ. అపుడు = ఆ సమయమునందు; సాంధ్య...హతిన్ - సాంధ్య = సంధ్యాకాలము నందలి; నటన = తాండవముచేయునప్పటి; చండ = మిక్కిలి యుద్ధతమయిన; చండీశ = శివుని యొక్క; పదహతిన్ = అడుగులతాఁకుడుచేత; తరణిచక్రము = సూర్యరూపమయిన చక్రము; ఒరగి = వాలి; శరధిన్ = సముద్రమునందు; క్రుంగన్ = దిగఁబడిపోఁగా; భూ...చక్రము - భూరథ = భూరూపమైన రథముయొక్క; ఇతరభాగ = మఱియొక తట్టుదైన; చక్రము = కల్లు; దోరగల్లువడియెన్ అనఁగన్ = ఒడ్డగిలఁబడియెనో అనునట్లు; శశియున్ = చంద్రుఁడును; తోఁచెన్ = ఉదయించెను.

తా. సూర్యాస్తమయమునందు సంధ్యాకాలతాండవము చేయుచున్న శివునియొక్క మిక్కుటమయిన యడుగుల యదుముడులచేత భూమి యనెడి రథముయొక్క యొక చక్రమయిన సూర్యుఁడు సముద్రములో దిగఁబడఁగా రెండవ ప్రక్క చక్రమైన చంద్రుం డొడ్డగిలఁబడియెనో యనునట్లు చంద్రోదయ మయ్యెను. అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

క. తమమను కాలాహి ప్రపం
చము నెరగొని యోషధీశ ! సద్యఃకృతదం
డమున మగుడంగఁ గ్రక్కెడు
క్రమమున నొయ్యొయ్య విచ్చి ! కడలకుఁ దొలఁగెన్. 36

టీ. తమము అను కాలాహి = చీఁకటి అనునట్టి కృష్ణసర్పము; ప్రపంచమున్ = లోకము నంతయు; ఎరగొని = మ్రింగి; ఓషధీశ...మున - ఓషధీశ = చంద్రుఁడనెడి రాజుచేత; సద్యః= అప్పుడే; కృత = చేయఁబడిన; దండమునన్ = శిక్షచేత; మగుడంగన్ = మరల; క్రక్కెడు క్రమమునన్ = వెడలఁగ్రక్కిన విధమున; ఒయ్యొయ్యన్ = మెల్లమెల్లఁగా; విచ్చి = విసిరి; కడలకున్ = దిక్కులకు - దూరపుగొందులలోని కనుట; తొలఁగెన్ = ఒదిఁగిపోయెను.

తా. నల్లని నాగుఁబాము కప్ప లోనగువానిని మ్రింగినట్లు, చీకటి లోకమునెల్ల నాక్రమించుకొనఁగాఁ జంద్రుఁ డుదయించెను. అంతటఁ జంద్రప్రకాశము వ్యాపింపఁగాఁ జీఁకటి తొలఁగి పోయెను. అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

వ. అనంతరంబ క్రమక్రమంబున. 37

సీ. కలయ వెల్లువగట్టి ! జలజలఁ బ్రవహించు, శశికాంతవాంతని ! ర్ఝరముజలము
మలయానిలముచేదు ! మారంబు రేఁగు సా, గంధికంబురజంబు ! కఱకుదుస్సు
నిండార విరిసిన ! బొండుమల్లెలనుండి, వడియు మరందంబు ! గుడరసంబు
తొలఁకి మింటికిఁ బొంగు ! దుగ్ధపాథోరాశి, కరడులమీఁది మీఁ!గడలమెఱుఁగు

తే. తనకు రసవర్గములుగా సు ! ధాకరుండు
సారెసారెకుఁ గరములు ! సాఁచిచాఁచి
యచ్చుతెలుపుగ నపుడు బ్ర ! హ్మాండ[1]మండ
పంబు వెన్నెలసన్నసు ! న్నంబు సేసె. 38

1. మంట. పా.

టీ. సుధాకరుండు = చంద్రుఁడనెడు సున్నపుగచ్చు చేయువాఁడు; అపుడు = ఆ సమయమునందు; కలయన్ = అంతటను; వెల్లువగట్టి = వఱదగా నేర్పడి; జలజలన్ = జలజల యనెడు ననుకరణధ్వనితో; ప్రవ...జలము - ప్రవహించు = పాఱుచున్న; శశికాంత = చంద్రకాంతమణుల చేత; వాంత = క్రక్కఁబడిన; నిర్ఝరము = జలప్రవాహముయొక్క; జలము = నీరును; మలయానిలము చేన్ = మలయపర్వతమునందలి గాలిచేత - తిన్నఁగా వీచునట్టి దక్షిణపుఁ జల్లగాలిచేత; దుమారంబు = దుమ్ము; రేఁగు...దుమ్మున్ - రేఁగు = పైకెగయునట్టి; సౌగంధికంబు = మిక్కిలి పరిమళము నించుక యెఱుపును గల కలువలయొక్క; రజంబు = పుప్పొడియనెడి; కఱకు దుమ్మున్ = ఇసుకయు; (ఒకవిధమయిన బూడిద యని కొందఱు.) నిండారన్ = పూర్ణముగా - లెస్సఁగా; విరిసిన బొండుమల్లెలనుండి = పూచిన పెనుమల్లెపువ్వులనుండి; వడియు...రసంబు - వడియు = కాఱుచున్న; మరందంబు = పూఁదేనె యనెడు; గుడరసంబు = బెల్లపునీరును; తొలఁకి = అతిశయించి; మింటికిన్ = ఆకాశమువైపునకు; పొంగు = ఉబుకునట్టి; దుగ్ధ...మెఱుఁగు - దుగ్ధపాథోరాశి = పాలసముద్రముయొక్క; కరడుల మీఁది = అలలయొక్క పైభాగమునందలి; మీఁగడల మెఱుఁగు = పెరుఁగుతెట్టె లనెడి చమురును; తనకు; రసవర్గములు కాన్ = గచ్చునకుఁగావలసిన సామగ్రులు అగుచుండఁగా; సారెసారెకున్ = మాటిమాటికి; కరంబులు = కిరణములనెడి చేతులను; చాఁచి చాఁచి = చాఁగించి చాఁగించి; బ్రహ్మాండమండపంబు = బ్రహ్మాండమనెడి పెద్ద చవిక; అచ్చతెలుపుగన్ = స్వచ్ఛమైన తెలుపుగలది యగునట్టుగా; వెన్నెల సన్నసున్నంబు = చంద్రికయనెడి పాలగార; చేసెన్ = కావించెను.

తా. ఆ సమయమునందు వెన్నెల యెల్లయెడల వ్యాపించి ప్రకాశింపఁగాఁ జంద్రుఁ డనెడు గచ్చుపూయు పనివాఁడు కరఁగి ప్రవహించుచున్న చంద్రకాంతమణిద్రవముజలమును, చల్లగాలిచే రేఁగుచున్న పుప్పొడియిసుకయును, పూఁదేనెబెల్లపునీరును, పాలసముద్రముయొక్క యలలమీఁదఁ దేలుచున్న మీఁగడ మెఱుఁగునూనెయును కాఁగా, బ్రహ్మాండ మనెడి కచ్చేరిచావడికిఁ బాలగార చేసిన ట్లుండెను. అలం. రూపకము.

వ. ఆ సమయంబునం బరిశ్రాంతుం డగు నమ్మహీకాంతుం డొక్క శశికాంత
శిలామండపంబున దట్టంబుగాఁ బఱచిన చిగురుపఱపుల గంధర్వరాజునుం
దానును సుఖాసీనుండై యిష్టకథాగోష్ఠి నా రాత్రి గడపె నంత. 39

టీ. ఆ సమయంబునన్ = అటువంటి వెన్నెలకాయుచున్న సమయమునందు; పరిశ్రాంతుండు = బడలిక నొందినవాఁడు; అగు నమ్మహీకాంతుండు = అయిన యా రాజు; ఒక్క మణికాంతశిలామండపంబునన్ = ఒక చంద్రకాంతపుఱాలచే నేర్పఱిచిన చుట్టుగోడలులేని ఱాతిమిద్దెయందు; దట్టంబుగాన్ = తఱచుగా; పఱచిన చిగురుపఱపులన్ = పఱచినట్టి చిగురుటాకులపాన్పునందు; గంధర్వరాజునుం దానును = ఇందీవరాక్షుఁడును, తానును; సుఖాసీనుండై = హాయిగాఁ గూర్చున్నవాఁడై; ఇష్టకథాగోష్ఠిన్ = ఇష్టములైనకథలు చెప్పుకొనుటచేత; ఆ రాత్రి; కడపెన్ = జరపెను. అంతన్ = పిదప. తర్వాతి పద్యముతో నన్వయము.

సీ. తనుఁ బాసి శశి దవ్వు \ చనిన నెవ్వగఁబోలెఁ
 దొలిదిక్కుజవరాలు \ వెలుకఁబాఱె;
బ్రథమాద్రిసభయందుఁ \ బఱచిన కెంబట్టు
 జముకాణ మనఁగ రా \ గము జనించె;

ధవుఁ గూర్మి కొసరుచు ✽ న్నవివోలె ముఖరాళి
వనరుహాస్యములఁ బ ✽ ద్మినులు తెఱచె;
భానూష్మభీతి ము ✽ న్పడిన చుక్కలభంగి
దొరలె వేకువగాలిఁ ✽ దరుల మంచు;
తే. కాలగుణయుక్తి మింటిచ ✽ క్కటికి నెగయ
వాసవునిపట్టి పొడువుగా ✽ వైచి యాడు
గచ్చుచమరిన దారుచ ✽ క్రంపుబిల్ల
వోలె నొయ్యనఁ బ్రాచి లేఁ ✽ బ్రొద్దు పొడిచె. 40

టీ. తొలిదిక్కుజవరాలు = తూర్పుదిక్కనెడి యువతి; శశి = చంద్రుఁడు; తనుఁ బాసి = తన్ను విడిచి; దవ్వు = దూరముగా; చనిన నెవ్వగఁబోలెన్ = పోయె ననుటచేనైన యధిక విచారముచేత నేమో యనునట్లు; వెలుకఁబాఱెన్ = వెలవెలపోయెను - తెల్లవాఱె ననుట. ప్రథమాద్రిసభయందున్ = తొలికొండ (ఉదయపర్వతము) అనెడి కొలువుకూటమునందు; పఱచిన= కూర్చుండుటకై పఱచినట్టి; కెంబట్టు జముకాణము అనఁగన్ = ఎఱ్ఱపట్టుతో నేసిన ముతకనేఁత పఱుపుబట్టయో అనునట్లు; రాగము = ఉదయరాగము - సూర్యోదయకాలమునందుఁ దూర్పు దిక్కునఁ దోఁచునట్టి యెఱ్ఱనికాంతి యనుట. జనించెన్ =కలిగెను. పద్మినులు = తామరతీగ లనెడి పద్మినీజాతి స్త్రీలు; ధవున్ = ప్రియుఁడయిన సూర్యుని; కూర్మి కొసరుచున్ = స్నేహమును ప్రార్థించుచు; ఉన్నవివోలెన్ = ఉన్నవో యనునట్లు; ముఖ...ములన్ - ముఖరాళి = మెరయు చున్న తుమ్మెదల ధ్వనులతోడి; వనరుహ = కమలములయొక్క; ఆస్యములన్ = ముఖభాగము లనెడి నోళ్లను; తెఱచెన్ = విరియించెను. భానూష్మభీతిన్ = సూర్యునివేఁడిమి యనెడి ప్రతాపము వలని భయముచేత; మున్ = ముందే - సూర్యుఁ డుదయింపకముందే యనుట; పడిన చుక్కల భంగిన్ = నేల రాలిన నక్షత్రములవలె; వేకువగాలిన్ = తెల్లవాఱుజామున వీచునట్టిగాలిచేత; తరులమంచు=వృక్షములందలి మంచు; దొరలెన్ = బొట్టుబొట్టుగా రాలెను. వాసవునిపట్టి=ఇంద్రుని కొడుకయిన జయంతుఁడు; కాలగుణయుక్తిన్ = సమయమనెడి దారముయొక్క కూడికచేత - సమయ మనెడి దారమును జుట్టి యనుట; మింటిచక్కటికిన్ = ఆకాశముతట్టునకు - మీఁది కనుట; ఎగయన్ = ఎగురునట్లు; పొడువుగాన్ =ఎత్తుగా; వైచి...పోలెన్ - వైచియాడు = వేసి యాడు కొనునట్టి; గచ్చుచమరిన = బచ్చెనపూసిన; దారు చక్రంపుబిల్లవోలెన్ = ప్రమానితోఁజేసిన గుండ్ర నైన బిల్లయో యనునట్లు; ఒయ్యనన్ = మెల్లఁగా; ప్రాచిన్ = తూర్పుదిక్కునందు; లేఁబ్రొద్దు= బాలసూర్యుఁడు; పొడిచెన్ = ఉదయించెను.

తా. తూర్పు తెల్లవాఱఁగా నుదయరాగము గలిగెను. తామరలు వికసించెను. చెట్లయం దుండి మంచుబిందువులు రాలసాగెను. సూర్యుఁడు నుదయించెను. అలం. ఉత్ప్రేక్ష.

క. ఈ గతి నత్తఱిఁ దెలతెల, వేగిన గంధర్వపతికి ✽ వేగుట విని తా
రాగమున కేఁగి కాంచిరి, రాగమ్మునఁ గొలిచి మను పు ✽ రాతన ఖచరుల్. 41

టీ. అత్తఱిన్ = ఆ సమయమునందు; ఈ గతిన్ = ఈ విధమున; తెలతెలవేగినన్ = బాగుగాఁ దెల్లవాఱఁగానే; గంధర్వపతికిన్ = గంధర్వరాజైన యిందీవరాక్షునికి; వేగుట = శుభో

దయ మగుట - శాపము తీఱుట; విని = వినినవారై; రాగమ్మునన్ = అనురాగముతో - ప్రీతితో; కొలిచి = సేవించి; మను పురాతన ఖచరుల్ = జీవించుచుండిన తొల్లిటి గంధర్వులు; తారాగమునకున్ = వెండికొండకు; ఏఁగి = పోయి; కాంచిరి = (ఆ యిందీవరాక్షుని) చూచిరి.

తా. ఇట్లు సూర్యోదయము కాఁగానే తమయేలినవానికి శాపవిమోచనరూపమైన శుభోదయమయ్యె నను వృత్తాంతము విని, యిందీవరాక్షుని ప్రాఁతకొలువుడుకాండ్రయిన గంధర్వులు వచ్చి, యతనిదర్శనము చేసికొనిరి.

ఉ. కాంచినఁ బొంగి వా రొసఁగు । కానుక లర్థిఁ బరిగ్రహించి మ
న్నించి పురప్రయాణరతి । నిక్క నరేంద్రుఁడు మున్నుగాఁ దటి
చ్చంచలవాహమై మణుల । చాయల దిక్కు లలంకరించు హా
టంచు రథంబు చాఁగు బళి । యంచు నకీబులు మ్రోయ నెక్కినన్. 42

టీ. కాంచినన్ = (తన పురాతనసేవకులయిన గంధర్వులు వచ్చి) చూడగా; పొంగి = (ఇందీవరాక్షుఁడు) సంతోషించి; వారు = ఆ గంధర్వులు; ఒసఁగు కానుకలు = ఇచ్చిన యుపహారములను; అర్థిన్ = ప్రీతితో; పరిగ్రహించి = పుచ్చుకొని; మన్నించి = (తగినట్లు) మన్ననచేసి; పురప్రయాణరతి = పట్టణమునకుం బోవలె నను సపేక్ష; నిక్కన్ = అతిశయింపఁగా; నకీబులు = వెండిబెత్తాలు పూనిన బంట్లు - వేత్రధరులు; చాఁగు = సెబాసు; బళి = బళా! అంచున్ = అని ప్రశంసచేయుచు; మ్రోయన్ = కేకలు వేసి చప్పుడు చేయఁగా; తటిచ్చంచలవాహమై - తటిత్ = మెఱుపులవలె; చంచల = చలించునట్టి - పోవుటకై త్వరపడునట్టి యనుట; వాహమై = గుఱ్ఱములు గలదై; మణులచాయలన్ = (తినయందుఁ జెక్కఁబడిన) రత్నకాంతులచేత; దిక్కులు = అన్ని దిక్కులను; అలంకరించు = కైసేయుచున్న; హాటంచు రథంబు = బంగారు పూఁతలు పూసిన పార్శ్వభాగములుగల తేరిని; నరేంద్రుఁడు = రాజు - స్వరోచి; మున్నుగాన్ = ముందుగా; ఎక్కినన్ = ఎక్కఁగానే - స్వరోచిని ముం దెక్కుమని వెంటనే తాను నెక్కఁగానే యనుట.

తా. ఇందీవరాక్షుఁడు తన తొల్లిటిసేవకులైన గంధర్వులు వచ్చి, కానుకలు పెట్టి తన్నుఁ జూడఁగా, వారు పెట్టిన కానుకలు ప్రీతితోఁ దీసికొని వారిని మన్ననచేసి, వారు తెచ్చిన వడిగల గుఱ్ఱములను బూన్చిన బంగారుపూఁతపూసిన తేరిపై బెత్తాలవా రెచ్చకలుచేసి ప్రశంసింపఁగాఁ దొలుత స్వరోచి నెక్కించి, వెనుకఁ దాను నెక్కఁగాను.

క. నందనయు నుచితరత్న, స్యందనమునఁ జనియె నర్థి । జనకునిబడి న
య్యిందీవరాక్షుఁ డీగతి, మందరమున కెగయ గగన । మార్గమునందున్. 43

టీ. నందనయున్ = వాని కూఁతురైన మనోరమయు; ఉచితరత్నస్యందనమునన్ = తగిన రత్నములుపొదిఁగిన తేరియందు; అర్థిన్ = ప్రీతితో; జనకునిబడిన్ = తండ్రివెంబడినే; చనియెన్ = పోయెను. ఈగతిన్ = ఈ విధముగా; అయ్యిందీవరాక్షుఁడు; గగనమార్గమునందున్ = మింటిత్రోవను; మందరమునకున్ = కవ్వపుఁగొండకు - కవ్వపుఁగొండమీఁదికి ననుట; ఎగయన్ = ఎగురఁగా. అనంతర పద్యముతో నన్వయము.

సీ. మండిగాలిడి దంత । శుండాగ్రహతిఁ జించి
జలధరాంభముఁ గరుల్ । చల్లులాడ,
నహిమాంశుహయహేష । లాలించి చెవివంచి
కెరలి వాజులు బయల్ । గొరిజఁ ద్రవ్వ,
ధ్వజవాతహతి నాఱ । వైద్యుతాగ్నులఁ జూఁడి
పగలు [1]దివ్వెలవారు । పంజు లెత్తఁ,
బెటులుచప్పుడు లాత్మ । భీరుస్వయంగ్రాహ
పరిరంభసుఖము ఖే । చరుల కొసఁగఁ,
తే. జామరప్రభ గగనగం । గామరాళ
చకచకభ్రమ మొదవింప । శంకరాద్రి
కాననము మోచి మందరా । గంబుదాఁకఁ
బోఁజువెట్టిరి తన్మూల । బలము దొరలు. 44

టీ. కరుల్ = (సేనలోని) యేనుఁగులు; మండిగాలిడి = ఒకకాలు ముడుఁచుకొనియు, నొక కాలు కొంచెము వంచియు నేలకు మ్రొగ్గి కూర్చుండి; దంతశుండాగ్రహతిన్ - దంత = కొమ్ముల యొక్కయు; శుండా = తొండమునయొక్కయు; అగ్ర = కొనలయొక్క; హతిన్ = దెబ్బచేత - దంతములకొనలతోఁ బొడిచియుఁ, దొండములకొనలతోఁ గొట్టియు ననుట; చించి = (మేఘములను) చినుఁగఁదీసి; జలధరాంభమున్ = ఆ మేఘములలోని జలమును; చల్లులాడన్ = ఎగఁజల్లుచుఁ గ్రీడింపఁగా; వాజులు = తేరిగుఱ్ఱములు; అహిమాంశుహయహేషలు = సూర్యుని గుఱ్ఱములయొక్క సకిలింతలను; చెవివంచి ఆలించి = చెవియొగ్గి విని; కెరలి = విజృంభించి - లేక కోపించి; బయలు = ఆకాశమును; గొరిజన్ = కాలిగిట్టలతో; (ఇక్కడ గొరిజశబ్దము జాత్యేకవచనము.) త్రవ్వన్ = త్రవ్వినట్లు కాళ్లు పైకెత్తి యాడింపఁగా - వానితోఁ గవ్వింపునమఁ బూనఁగా ననుట; పగలుదివ్వెల వారు = పగలు దివటీలను బట్టెడివారు; ధ్వజ...హతిన్ - ధ్వజ = జెండాచీరలయొక్క; వాత హతిన్ = గాలిసోఁకుటచేత; ఆఱన్ = (తమ చేతి దివిటీలు) ఆఱిపోఁగా; వైద్యుతాగ్నుల = మేఘజ్యోతి సంబంధమయిన యగ్నులయందు; చూఁడి = వెలిఁగించి; పంజులు ఎత్తన్ = దివటీలను ఎగఁ బట్టఁగాను; పెటులు చప్పుడులు = పెట్లుఁగ్రోవులయొక్క ధ్వనులు - అమురువేట్ల ధ్వనులు; ఆత్మ...సుఖము - ఆత్మ = తమయొక్క; భీరు = పిఱికితనముగల ప్రియురాండ్రయొక్క; స్వయం గ్రాహ = తమకుఁదామే గ్రహించునట్టి; పరిరంభ సుఖము = ఆలింగనముయొక్క సౌఖ్యమును; ఖేచరులకున్ = ఆకాశమునందుఁ దిరిగెడివారికి - గంధర్వులకు; ఒసఁగన్ = ఇయ్యఁగా- కలుగఁ జేయఁగా ననుట; చామరప్రభ = వింజామరలయొక్క ప్రకాశము; గగన...భ్రమము = గగన గంగా = ఆకాశగంగయందలి; మరాళ = హంసలయొక్క; చకచక = కాంతివిశేషమో యనెడి; భ్రమము = భ్రాంతిని; ఒదవింపన్ = కలుగఁజేయఁగా; శంకరాద్రికాననము = శివునిదైన కైలాసపర్వతమునడవి; మోచి = మొదలుకొని; మందరాగంబుదాఁకన్ = కవ్వపుఁగొండవఱకు; తన్మూలబలముదొరలు = ఆ యిందీవరాక్షుని ప్రధానసేనయొక్క యోధులు; పోఁజువెట్టిరి = దండు సాగించిరి.

1. దివియల. పా.

తా. ఇందీవరాక్షుఁడు స్వరోచితోను,మనోరమతోనుగూడి, తన పట్టణమునకుఁ బ్రయాణము కాఁగా, నతనిదండు తా నున్న వెండికొండతోఁ జేరిన యడవినుండి కవ్వపుఁగొండవఱకు బారుదీరి నడచెను. అప్పు డేనుఁగులు మబ్బులను భేదించి నీళ్లెగఁజల్లెను. గుఱ్ఱములు సూర్యునిగుఱ్ఱముల సకిలింతలు విని, వానితోఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వెను. పగలుదివటీలవారు ఱెండాగుడ్డలగాలిచేతఁ జల్లాఱిన తమచేతి దివటీలను మెఱుపునిప్పులయందు వెలిఁగించి పట్టిరి. పెట్లుఁగ్రోవులధ్వనులకు వెఱచి యాకాశమునందు మెలఁగుచున్న దేవతాస్త్రీలు తమకుఁ దామే ప్రియులం జేరి యాలింగనము చేసికొనిరి.వింజామరలకాంతు లాకాశగంగలోనిహంసల దేహకాంతులో యను భ్రమను బుట్టించెను. అలం. ఉదాత్తము, ఉత్ప్రేక్షయు.

క. కుంజర శతాంగ హయ భట, రంజితమై పై రజఃప ౯ రంపర లలమన్
మంజులకాంతిఁ గసీసపు, మాంజిష్ఠముఁబోలె గగన ౯ మండప మమరెన్. 45

టీ. గగనమండపము = ఆకాశమనెడిమండపము; కుంజర...రంజితమై - కుంజర = ఏనుఁగుల చేతను; శతాంగ = రథములచేతను; హయ = గుఱ్ఱములచేతను; భట = కాల్బలములచేతను; రంజితమై = ప్రకాశింపఁజేయఁబడినదై; పైన్ = వానిమీఁద; రజఃపరంపరలు = దుమ్ము దొంతరలు; అలమన్ = వ్యాపింపఁగా; మంజులకాంతిన్ = మనోహరమైన కాంతిచేత; కసీసపు మాంజిష్ఠముఁబోలెన్ = ఎఱుపుమించిన పసుపుచాయవేసిన నీలిచీరవలెనే; అమరెన్ = ఒప్పెను.

తా. ఆ సమయమునందు నిందీవరాక్షుని చతురంగసేన లాకాశమార్గమునఁ గ్రమ్మి నడవఁగా దొంతరలుగా వ్యాపించిన దుమ్మతో నాకాశ మనెడి మండపము పసుపు నెఱుపు గలపిన చాయ వేసిన నీలివస్త్రమో యనున ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. సౌరిది నీ రీతి దివిఁ దోడు ౯ సూపినట్టి
దొరలు గొలువంగ ఖచరేంద్రుఁ ౯ డరిగి యరిగి
మింట గ్రహరాజు తనసగ ౯ మింట వెలుఁగు
మంథగిరిఁ గాంచి పలికె న ౯ మ్మనుజపతికి. 46

టీ. ఖచరేంద్రుఁడు=గంధర్వరాజైన యిందీవరాక్షుఁడు; సౌరిదిన్=క్రమముతో; ఈరీతిన్= ఈ విధమున; దివిన్ = ఆకాశమునందు; తోడుచూపినట్టి దొరలు = సహాయము కనఁబఱచిన సరదార్లు; కొలువంగన్ = తన్ను సేవింపఁగా; అరిగి యరిగి = బహుదూరము పోయి; మింటన్= ఆకాశమునందు; గ్రహరాజు = సూర్యుఁడు; తనసగమింటన్ = తన మధ్య భాగమునకు సరిగా; వెలుఁగు; మంథగిరిన్ = ప్రకాశించుచున్న కవ్వపుఁగొండను; కాంచి = చూచి; అమ్మనుజ పతికిన్ = ఆ రాజునకు - స్వరోచితో ననుట; పలికెన్.

తా. గంధర్వరాజయిన యా యిందీవరాక్షుఁ డీచొప్పున సహాయులై వెంట సేవచేయుచు సరదార్లు నడుపఁగా బహుదూరము పోయి, యెదుటఁ దనమధ్యభాగమునకు సరిగా సూర్యుఁడున్న (సూర్యమండలము నతిక్రమించియున్న) కవ్వపుఁగొండను జూచి, స్వరోచితో నిట్లు పలికెను.

సీ. జరఠకచ్ఛపరాజు ౯ చరమాంగగృహమేధి, భోగివేష్టనరేఖఁ ౯ బొలుచు జాణ
కులములోఁ దరితీఁపు ౯ గలిగి మించినమేటి, మైనాకు నొరసిన ౯ మానసటీఁడు
తొలువేలుపులవేలు ౯ పులపనుల్ గొనుతేఁడు,కడలిరాయలలోఁతు ౯ గన్న గబ్బి
సురరాజునకుఁ బాండు ౯ కరిఁ జేర్చు మరకాఁడు, కల్పకంబులపంట ౯ కమ్మతీఁడు

తే. కంటె! మథిత సుధాధౌత ♦ కటకజాత
చంపకవన ప్రకంపనా ♦ కంప విసర
దఖర ముఖరవ మధుకర ♦ ముఖర శిఖర
నందరస మందిరంబగు ♦ మందరంబు. 47

టీ. జరఠ... మేధి - జరఠ = ముసలిదైన; కచ్ఛపరాజు = తాఁబేళ్లరాజైన యాదికూర్మము యొక్క; చరమాంగ = వీఁపుచిప్పయందలి; గృహమేధి = గృహస్థుఁడు - కాఁపురముచేసినవాఁడనుట; భోగి... రేఖల్ - భోగి = సర్పరాజైన వాసుకియొక్క; వేష్టన = చుట్టుకొనుటవలన నేర్పడిన; రేఖల్ = ఒత్తుడుపల్లపుగీఱచేత; పొలుచు జాణ = ఒప్పుచున్న చతురుఁడు; కులములోన్ = పర్వతసమూహములోపల; తరితీపు = మథనమాధుర్యమనెడి యాధిక్యము; కలిగి; మించినమేటి = అతిశయించిన గొప్పవాఁడు; మైనాకున్ = మైనాకగిరిని; ఒరసిన మాసటీఁడు = సరిపోలిన మల్లుఁడు; తొలు... పనుల్ - తొలువేలుపుల = అసురులయొక్కయు; వేలుపుల=దేవతలయొక్కయు; పనుల్ = త్రచ్చునట్టి పనులను; కొనుఱేఁడు=పరిగ్రహించినట్టి రాజు; కడలిరాయలలోఁతు = సముద్రములకు రాజైన పాలసముద్రపులోఁతును; కన్నగబ్బి=చూచి తెలిసికొన్న గంభీరుఁడు; సురరాజునకున్=దేవేంద్రునకు; పాండుకరిన్ = తెల్లయేనుఁగును - ఐరావతము ననుట; చేర్చు మరకాఁడు= చేరునట్లుచేసిన యోడవాఁడు; కల్పకంబుల పంట కమ్మతీఁడు - కల్పకంబుల = కల్పవృక్షముల యొక్క; పంట=ఫలమునకు-పైరుపంట కనుట; కమ్మతీఁడు = కమతకాఁడు-సేద్యపుఁగాఁడనుట; మథిత...మందిరంబు - మథిత = త్రచ్చియెత్తఁబడిన; సుధా = అమృతముచేత; ధౌత = కడుగఁబడిన - పరిశుద్ధముగాఁ జేయఁబడిన; కటక జాత = మధ్యప్రదేశమునందు పుట్టిన; చంపకవన = సంపెఁగతోఁటయందలి; ప్రకంపన = గాలివలన; ఆకంప = అంతటను జలించుటచేత; విసరత్ = విశేషముగాఁ దొలఁగుచున్న; అఖర = తీక్ష్ణములుగాని - మృదువులైన; ముఖ = మొగములవలని; రవ = రొదలుగల - ఝుంకారధ్వనులు గలిగిన యనుట; మధుకర = తుమ్మెదలచేత; ముఖర = మ్రోఁగుచున్న - ధ్వనించుచున్న; శిఖర = శృంగములచేత; నందరస = ఆనందరసమునకు; మందిరంబు = ఇల్లు; అగు మందరంబు = అగునట్టి మందరపర్వతమును; కంటె! = చూచితివా?

తా. ఓ మహారాజా! ఈ మందరపర్వతమును జూచితివా! ఇది సముద్రమథనకాలమందుఁ దన కాధారముగా నిలిచిన యాదికూర్మమువీఁపున నునికిచేసికొనియుండెను. మఱియు వాసుకి తన్నుఁ జుట్టుకొనుటచే నేర్పడిన యొత్తుడురేఖలు కలిగి పర్వతసమూహములోపల మేలిమి వహించినది. మైనాకపర్వతముతో సరిపోలినది. దేవదానవులచేత మథనరూపమయిన పని చేయించి సముద్రముదైన లోఁతు గని పెట్టి, దేవేంద్రునికిఁ దెల్లయేనుఁగును, గల్పవృక్షములను బుట్టించి యిచ్చినది. తనచేఁ ద్రచ్చి యెత్తఁబడిన యమృతముచేతఁ గడుగఁబడి పరిశుద్ధమయిన నడిమిభాగమునందు మొలచి పెరిఁగిన సంపెఁగపూఁదోటమీఁది గాలి సోఁకుటచేత రొదలుచేయుచు నెగిరిపోవుచున్న తుమ్మెదల ఝుంకారధ్వనులచేత సంతోషరసమునకు నునికిపట్టయిన శిఖరములు గలిగి యొప్పుచున్నది. (సంపెఁగలకును దుమ్మెదలకును విరోధ మగుట నిట నూహ్యము.) అలం. ఉదాత్తము.

శా. వైకుంఠాంగదహేమ మాతతవల ♦ ద్వాతాశనాకృష్టరే
ఖాకారంబులఁ జుట్టు నంటి మొలనూ ♦ లై మేటియొడ్డాణమై

శ్రీకారప్రభఁ గంఠియై శిఖరిరా ట్సింహోల్లసత్పట్టమై
యీ కొండం గనుఁగొంటె! మాయ దిపుడున్ హేరాళపుంగాంతులన్. 48

టీ. వైకుంఠాంగదహేమము - వైకుంఠ = విష్ణునిదైన; అంగద = భుజకీర్తులయొక్క; హేమము = బంగారు; ఆతత...బులన్ - ఆతత = విస్తారముగా; వలత్ = చుట్టివచ్చుచున్న; వాతాశన = సర్పమయిన వాసుకిచేత; ఆకృష్ట = (గిరగిర) నీడువఁబడిన; రేఖాకారంబులన్ = ఒత్తుడుగీఱల యాకృతులతో; చుట్టును; అంటి = అంటుకొని; మొలనూలై = అల్లికమొలత్రాడై; మేటియొడ్డాణమై = మేలైన నడుముబిగికై ధరించునట్టి తగడుపట్టెయై; శ్రీకారప్రభన్ = శ్రీకారముయొక్క ప్రకాశము (విధము) చేత; కంఠియై = కంఠాభరణమై - కంటెయై; శిఖరి...త్పట్టయై; శిఖరిరాట్సింహ = పర్వతరాజశ్రేష్ఠుఁడగుటచేత; ఉల్లసత్ = ప్రకాశించుచున్న; పట్టమై = రాజ్యాభిషేకకాలమునందు నొసటఁగట్టిన పట్టెయై; ఈ కొండన్ = ఈ పర్వతమునందు; హేరాళపుంగాంతులన్ = అధికమైన వెలుఁగులతో; ఇపుడున్ = ఈ సమయమునందుఁగూడ; మాయదు = మాసిపోదు - ఏకాకారముగాఁ బ్రకాశించుచున్న దనుట.

తా. సముద్రమథనకాలమునందుఁ గవ్వమైన యీ కొండకు వాసుకిని దరిత్రాడుచేసి క్రింద నుండి మీఁదిదాఁకఁ దిరుగఁజుట్టి లాగుటవలన వాసుకిదేహ మొరసికొని యేర్పడిన నాలుగు రేఖల యందును ద్రచ్చువారిలో ముఖ్యుఁడగు విష్ణుదేవుని బాహుపురులబంగా రంటుకొనఁగా నా నాలుగు రేఖలును గ్రిందనుండి పైవఱకు నా యా చోట్లకుఁ దగినట్లు వరుసగా మొలనూలు, ఒడ్డాణము, కంటె, రాజ్యపట్టము ననెడి నాలుగు భూషణములయి యిప్పుడుగూడ మాయక ప్రకాశించుచున్నవి చూచితివా! అలం. ఉల్లేఖము.

తే. వేదవేదాంతముల వేధ వెదకి కనని, పద్మలోచను శ్రీపాద పంకరుహము
లబ్జరేఖాంకితము లవే యచలవంశ, వల్లభుని మేఖలాసీమ నెల్ల మెఱయు.

టీ. వేధ = బ్రహ్మ; వేదవేదాంతములన్ = వేదములయందును, వేదాంతములయిన యుపనిషత్తులందును; వెదకి = శోధించియు; కనని...ములు - కనని = చూడఁజాలని; పద్మలోచను = తామరలవంటి కన్నులుగలవాఁడైన విష్ణుదేవునియొక్క; శ్రీ = సంపత్కరములయిన; పాదపంకరుహములు = చరణకమలములు; అబ్జరేఖాంకితములు = పద్మరేఖలచేత గుఱుతు పెట్టఁబడినవి; అవే! = అవిగో! అచల...సీమన్ - అచలవంశ = కొండలగుంపునకు; వల్లభుని = రాజైన యీ మందర పర్వతముయొక్క; మేఖలాసీమన్ = మధ్యప్రదేశమునందు; ఎల్లన్ = అంతటను; మెఱయున్ = ప్రకాశించుచున్నవి.

తా. బ్రహ్మయంతి దొడ్డవానికిఁగూడ వేదములయందును, వేదాంతములయందును వెదకినను జూడఁదరముకానివియై, పద్మరేఖలతోఁ బ్రకాశించునట్టి విష్ణుదేవుని పాదకమలములు కొండలలో దొడ్డదైన యీ కవ్వపుఁగొండయొక్క మధ్యప్రదేశములం దెల్లయెడలను వెలుఁగుచున్నవి. విష్ణుదేవునియడుగులగుఱుతు లీ కొండయం దెక్కుడఁ జూచిన నున్న వని భావము. అలం. విశేషము.

ఉ. నాలుకబంతి వ్రేలఁబడి నంజునఁ దోఁగి తమాలపల్లవ
శ్రీల హసింప నుబ్బి కనుఁ గ్రేవల జేవుఱు పుక్కిలింపఁగా
వాలికమేనివీఁ చెగయ వాడిన మాల్యమువోలె నాదిమ
వ్యాళము దీని పగ్గ మయి నట్టి యవస్థఁ దలంతు నెప్పుడున్. 50

టీ. ఆదిమవ్యాళము = మొట్టమొదటిదైన పాము - వాసుకి; నాలుకబంతి = నాలుకల యొక్క వరుస; వ్రేలఁబడి = క్రిందికి వ్రాలి; నంజునన్ = విషముచేత; తోఁగి = చక్కఁగాఁ దడిసి; తమాలపల్లవశ్రీలన్ = చీఁకటిమ్రానిచిగుళ్ళ కాంతిసంపదలను; హసింపన్ = పరిహసింపఁగా - మీఱఁగా ననుట; జేవురు = రక్తకాంతి; కనుఁగ్రేవలన్ = కన్నుల పార్శ్వములందు - కన్నుఁగొనలయందు; ఉబ్బి = ఉబికి - హెచ్చి; ప్రుక్కిలింపఁగాన్ = వెడల నుమియఁగా - బయట వ్యాపింపఁగా ననుట; వాలికమేనిపీఁచు - వాలిక = నిడుపైన; మేని = శరీరముయొక్క; పీఁచు = పైతోలు; ఎగయన్ = లేచిపోఁగా - దోఁచుకొనిపోఁగా ననుట; వాడిన మాల్యము వోలెన్ = వాడిపోయిన పూదండవలె; దీని పగ్గము = ఈ కొండకుఁ దరిత్రాడు; అయినట్టి యవస్థ = అయిన దుర్దశను; ఎప్పుడున్ = ఎల్లప్పుడును; తలంతున్ = తలఁచుచుందును.

తా. దేవాసురులు సముద్రమథనకాలమునందుఁ దరిత్రాడుగాఁ జేసి యీ కొండకుఁ జుట్టిన సర్పరాజయిన వాసుకిదురవస్థ నా కిప్పటికిని మఱపురాదు. అప్పుడా వాసుకి విషము గ్రక్కుచు నా విషముచేతఁ దడిసిన నాలుకలచాలు చీఁకటిమ్రానిచివుళ్లవలె నల్లగా వ్రేలాడుచుండఁ గన్నులెఱ్ఱవాఱి నెత్తురు గ్రక్కుచు వెలుఁగ శరీరముపైతోలు దోఁచుకొనిపోవ వాడిపోయిన పూలదండవలె నుండెను. అలం. ఉపమ, భావికమును.

చ. బిలముఖపంక్తి నీ ధరణి భృత్పతి వారిధినిర్భరభ్రమిన్
దలముగ మున్ను ద్రావిన సుధారసధారగుణంబునం జుమీ!
పలితవికారదూరనిర పాయసుఖస్థితిఁ గాంచె నాఁగఁ గో
మల విచల చ్ఛిరోరుహ త మాలవినీలిమరేఖ యొప్పెడిన్. 51

టీ. ఈ ధరణిభృత్పతి = ఈ పర్వతరాజు; మున్ను = మునుపు; బిలముఖపంక్తిన్ = గుహలనెడి ముఖ (నోళ్ల) సమూహముచేత; వారిధినిర్భరభ్రమిన్ - వారిధి = పాలసముద్రమునందలి; నిర్భర భ్రమిన్ = అతిశయించిన సుడిచేత; దలముగన్ = దట్టముగా - అధికముగా; త్రావిన... జుమీ! - త్రావిన = త్రాగిన; సుధారస = అమృతముయొక్క; ధార గుణంబునన్ సుమీ! = ధారయొక్క గుణవిశేషముచేతనే సుమీ! పలిత...స్థితిన్ - పలిత = నరయుటవలని; వికార = మాఱుపాటునకు; దూర = ఎడమయిన; నిరపాయ = అపాయములేని; సుఖస్థితిన్ = సౌఖ్యముయొక్క ఉనికిని; కాంచెన్ నాఁగన్ = పొందెనో అనునట్లు; కోమల...రేఖ - కోమల = మృదువైన; విచలత్ = మిక్కిలి చలించుచున్న; శిరోరుహ = శిఖరములనెడి తలలయందు మొలచిన వెండ్రుకలో యనఁదగిన; తమాల = చీఁకటిమ్రాఁకులయొక్క; వినీలిమరేఖ = మిక్కుటమైన నల్లఁదనముయొక్క పంక్తి; ఒప్పెడిన్ = ఒప్పుచున్నది.

తా. ఈ మందరపర్వతము పూర్వకాలమునందు పాలసముద్రములోఁ గవ్వమై తిరుగునప్పుడు గుహలనెడి నోళ్లతో నమృతపానము చేసిన కారణముచేతనేమో ముదిమిలేమిని నరయక నల్లగా నుండెడి దీని తలవెండ్రుకలవలె దీని శిఖరములయందలి చీఁకటిమ్రాఁకులతోఁపు లొప్పుచున్నవి. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

చ. జడధి మథింపఁ జిక్కు సుధ సౌరభ మానుటఁ జావు దక్కు తా
పడఁకులనుండి దుగ్ధభవ పాండిమ బొందుల నందమొంద నిం

దడవిమెకాలతోఁ గదుపు లై చరియించును మేఁతకై బయల్
వెడలి ఢులీ కుళీర శకు లీ మకరీ ముఖ వారిజంతువుల్. 52

టీ. జడధిన్ = సముద్రమును; మథింపన్ = త్రచ్చఁగా; చిక్కి = (కవ్వపుఁగొండక్రింద) చిక్కుకొని; సుధసౌరభమున్ = అమృతముయొక్క సువాసనను; ఆనుటన్ = ఆస్వాదించుటచేత; చావుతక్కి = మృతిలేకపోఁగా; దుగ్ధభవ పాండిమ = పాలవలన కలిగిన తెల్లఁదనము; బొందులన్ = తమ శరీరములయందు; అందమొందన్ = ఒప్పియుండఁగా; ఇందున్ = ఈ కొండయందు; ఱాపడఁకులనుండి = ఱాలసందులయందుండి; ఢులీ...వుల్ - ఢులీ = ఆఁడుదాఁబేళ్లు; కుళీర = ఎండ్రకాయలు; శకులీ = ఆఁడుచేఁపలు; మకరీ = ఆఁడుమొసళ్లు; ముఖ = మొదలుగాఁగల; వారిజంతువుల్ = జలజంతువులు; అడవిమెకాలతోన్ = వనమృగములతోపాటు; మేఁతకై = మేయుటకై; బయల్వెడలి = బయలుదేఱి; కదుపులై = గుంపులై; చరియించును = సంచరించును.

తా. పాలసముద్రమును ద్రచ్చినప్పుడు బయటఁ బోలేక కొండక్రిందఁ జిక్కుకొనియున్న తాఁబేళ్లు, మొసళ్లు, చేఁపలు, ఎండ్రకాయలు మొదలుగాఁగల జలచరములు పాలలో నున్నందునఁ దెల్లవాఱిన శరీరములు గలవై, యందుఁ బుట్టిన యమృతము సోఁకుటచేఁ జావులేనివై కవ్వమైన యీ కొండయొక్క ఱాలసందులలోనుండి మేఁతకై యడవిమృగములతోపాటు బయలువెడలి గుంపులుగుంపులై తిరిగి మేయుచుండును.

మ. అనుచుం జందనపంకపంకిలతలం బై కేతురుద్ధాతపా
ధ్వనిరుష్ణంబయి మంచకోపరికు టీవాటీనటన్నర్తకీ
జనమై యావతసర్వతఃకలితవీ క్షాతోరణస్రఙ్నిబం
ధనమై యొప్పు పురంబు సొచ్చి భవన ద్వారప్రఘాణంబునన్. 53

టీ. అనుచున్ = అని చెప్పుచు; చంద...తలంబై-చందనపంక = గుజ్జుగాఁ గలిపిన గంధపునీళ్ళచేత; పంకిల = బురదపదనైన; తలంబై = భూప్రదేశముగలదై; కేతు...రుష్ణంబయి-కేతు = జెండాలచేత; రుద్ధ = నివారింపఁబడిన; ఆతప = ఎండగలిగిన; అధ్వ = మార్గమందు; నిరుష్ణంబయి = వేఁడిమిలేమిగలదై; మంచ...జనమై - మంచక = చప్పరములయొక్క; ఉపరి = మీఁది భాగములయందలి; కుటీ వాటీ = గుడిసెలయొక్క వాడలయందు - వరుసలయందు; నటత్ = నాట్యమాడుచున్న; నర్తకీజనమై = నట్టువపడుచులుగలదై; యావత...నిబంధనమై - యావత = యువతీసమూహముయొక్క; సర్వతః కలిత = ఎల్లయెడలను కూడిన - సందుకొన్న; వీక్షా = చూపులనెడి; తోరణ = తోరణములవలెనున్న; స్రక్ = పుష్పసరములయొక్క; నిబంధనమై = కట్టుగలదై; ఒప్పు పురంబు = అమరియున్నపట్టణమును; చొచ్చి = ప్రవేశించి; భవన...బునన్ - భవన = ఇంటియొక్క; ద్వార = గుమ్మముముందఱి; ప్రఘాణంబునన్ = చావడియందు. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. ఇందీవరాక్షుఁ డీ విధముగా స్వరోచితోఁ బలుకుచు, గుజ్జుగాఁ గలిపిన మంచిగంధపుఁ గలయంపులు చల్లి, మార్గములయం దెండ సోఁకకుండ నీడలు గలుగునట్లు జెండాలెత్తి, మంచెల వరుసలమీఁది గుడిసెలలో నాట్యమాడుచున్న బోగముపడుచులచూపులు దిక్కులందుఁ బూదండల తోరణములు గట్టినట్టు వ్యాపింపఁగా నొప్పుచున్న పట్టణము చొచ్చి, తన యింటి వాకిటిముందఱి చావడిలో. అలం. రూపకము.

క. మంతుల బాంధవభటసా, మంతుల నాశ్రితుల నిలిపి ♦ మహికాంతు నిశా
కాంతమణికాంతికందళ, కాంతంబగు నొక్క దొరన ♦ గర విడియించెన్. 54

టీ. మంతులన్ = తన మంత్రులను; బాంధవ...సామంతులన్ - బాంధవ = చుట్టములను; భట = సేవకులను; సామంతులన్ = లొంగిన పొరుగుదేశములరాజులను; ఆశ్రితులన్ = తన్నాశ్రయించిన జనులను; నిలిపి = అక్కడక్కడ నిలువ నాజ్ఞాపించి; మహికాంతున్ = రాజును - స్వరోచిని; నిశా...కాంతంబు - నిశాకాంతమణి = చంద్రకాంతిమణులయొక్క; కాంతికందళ = వెలుఁగుమొలకలచేత; కాంతంబు = మనోహరమైనది; అగు నొక్క దొరనగరన్ = అయినట్టియొక రాజగృహమునందు; విడియించెన్ = బసచేయించెను.

వ. విడియించి యనంతరంబ, యంతఃపురకాంతాకరాంతతంతన్యమానమణిభాజన నీరాజనమంగళంబు లంగీకరించి, ప్రియాంగనల సంభావించి, మగుడ నాస్థాన [1]మండపంబున కేతెంచి, మతంగ మంకి మంకణ మందపాల మరీచి మాండవ్య మార్కండేయాది మహామునుల రావించి, లగ్నంబు నిశ్చయించి, గగనచర జంఘాలకరప్రేషిత లేఖతరులేఖాముఖంబులఁ జిత్రరథ చిత్రాయుధ చిత్రసేనాదు లగు గంధర్వులను, వరాహకర్ణ గజకర్ణ సుకేతు మాణిభద్ర ప్రముఖ యక్షులను, రేవంతప్రముఖ గుహ్యకులను, మందారముఖ్యవిద్యాధరులను బిలిపించి, వినయపూర్వకంబుగా విత్తాధిపతికి విజ్ఞాపనపత్రిక లిఖియించి, నిజ ప్రధానులం బంచి, నలకూబరు రావించె నంత. 55

టీ. విడియించి = స్వరోచిని రాజసౌధమున దింపి; అనంతరంబ = పిదప; అంతఃపుర... మంగళంబులు - అంతఃపురకాంతా = రాణివాసపు వనితలయొక్క; కరాంత = చేతులకొనలయందు- అఱచేతులందు; తంతన్యమాన = విస్తరిల్లఁజేయఁబడుచున్న - తాల్పఁబడుచున్న; మణిభాజన = రత్నపుఁబళ్లెరములవలని; నీరాజన = హారతులయొక్క; మంగళంబులు = శుభక్రియలను - మంగళహారతుల ననుట; అంగీకరించి; ఆదరించి; ప్రియాంగనలన్ = ప్రియభార్యలను; సంభావించి = మన్నించి - గారవించి; మగుడన్ = మరల; ఆస్థానమండపంబునకున్ = కొలువుకూటమునకు; ఏతెంచి = వచ్చి; మతంగ...మహామునులన్ = మతంగుఁడు, మంకి, మంకణుఁడు, మందపాలుఁడు, మరీచి, మాండవ్యుఁడు, మార్కండేయుఁడు మొదలుగాఁగల గొప్ప ఋషులను; రావించి = రప్పించి; లగ్నంబు = రాశ్యుదయమును - పెండ్లిముహూర్తము ననుట; నిశ్చయించి = నిర్ణయించి; గగన... ముఖంబులన్ - గగనచర = గంధర్వులైన; జంఘాల = పిక్కబలిమిగల సేవకులయొక్క - వడిగా నడవఁజాలిన బంట్లయొక్క; కర = చేతులలోఁబెట్టి; ప్రేషిత = పంపఁబడిన; లేఖతరు = దేవవృక్షములవలన గడించిన; లేఖాముఖంబులన్ = పెండ్లిజాబుల మూలమున; చిత్రరథ...సేనాదులు = చిత్రరథుఁడు, చిత్రాయుధుఁడు, చిత్రసేనుఁడు మొదలయినవారు; అగు గంధర్వులన్ = అగునట్టి గంధర్వులను; వరాహ...యక్షులను = వరాహకర్ణుఁడు, గజకర్ణుఁడు, సుకేతుఁడు, మాణిభద్రుఁడు మొదలయిన యక్షులను; రేవంతప్రముఖ గుహ్యకులను = రేవంతుఁడు లోనుగాఁగల గుహ్యకులను; మందారముఖ్య విద్యాధరులను = మందారుఁడు లోనుగాఁగల విద్యాధరులను;

1. మంటపంబున. పా.

పిలిపించి = పిలువఁబంచి; విత్తాధిపతికిన్ = ధనపతికి - కుబేరునికి; వినయపూర్వకంబుగాన్ = విశేషమయిన నమ్రత ముందు గలుగునట్టుగా - మిక్కిలి యడఁకువ తోఁచున ట్లనుట; విజ్ఞాపన పత్రిక = మనవిజాబు; లిఖియించి = వ్రాసి; నిజప్రధానులన్ = తనమంత్రులను; పంచి = పంపి; నలకూబరున్ = కుబేరునికొడుకును; రావించెన్ = రప్పించెను. అంతన్ = పిదప. తర్వాతి పద్యమున నన్వయము.

క. పసుపుల నలుఁ గిడి రైదువ, బిసరుహలోచనలు పెండ్లి పెద్దల యాజ్ఞన్
వసుధాధ్యక్షబుభుక్షున, కసితాలకభరకుఁ బేరఁ టాండ్రొగిఁ బాడన్. 56

టీ. వసుధాధ్యక్ష బుభుక్షునకున్ = రాజదేవేంద్రునకును - స్వరోచికిని; అసితాలకభరకున్ = నల్లని ముంగురులు గల పడుచునకును - మనోరమకును; ఐదువబిసరుహలోచనలు = తామరలవంటి కన్నులుగల సువాసినులు - ముత్తైదువలు; పెండ్లిపెద్దల యాజ్ఞన్ = పెండ్లితీర్పరుల యనుమతిచేత; ఒగిన్ = క్రమముగా; పేరఁటాండ్రు = పేరంటముఁ జేయవచ్చిన ముత్తయిదువలు; పాడన్ = పాట పాడఁగా; పసుపుల నలుఁగు ఇడిరి = పసుపుతోడి నలుఁగు పెట్టిరి. (పేరంటము = శుభకార్యము లందుఁ బసుపు కుంకుమ తాంబూలములకై సువాసినులను బిలుచుట; అందులకయి సువాసినులు వచ్చుటయును. పేరఁటముగలవారు పేరఁటాండ్రు. నలుగు = స్నానకాలమునందు స్త్రీ పురుషులకు సున్నిపిండి దేహములకు రాచి నలఁచుట.)

ఉ. మజ్జనమాడె రాజు కృశ మధ్యము లింపున వంప గుంపులై
గొజ్జఁగనీటివెల్లువలు గోవ[1]జవాజులనిగ్గుఁ జూపఁ; జం
చజ్జరఠాహికంచుకము చాయమడుంగుల నొత్తఁ జెమ్మనీ
రుజ్జగిలన్; వహించె మెయి నూఁదినఁ బాఱు దుకూలచేలముల్. 57

టీ. రాజు = స్వరోచి; కృశమధ్యమలు = సన్నని నడుములుగల స్త్రీలు; ఇంపునన్ = ఆనందముతో; గుంపులై = గుంపులుగూడి; వంపన్ = పోయఁగా; గొజ్జఁగనీటివెల్లువలు = పన్నీటి వఱదలు; గోవజవాజుల నిగ్గున్ = శ్రేష్ఠమయిన గోవదేశపు జవ్వాజియొక్క పరిమళాతిశయమును; చూపన్ = కనఁబఱుపఁగా; మజ్జనమాడెన్ = స్నానముచేసెను. చంచత్...మడుంగులన్ - చంచత్ = ఒప్పుచున్న; జరఠాహి = ముసలిపామైన యాదిశేషునియొక్క; కంచుకముచాయ = కుబుసమువన్నెగల - తెల్లగాఁ బ్రకాశించుచుండెడి; మడుంగులన్ = చలువవస్త్రములచేత; చెమ్మనీరు = దేహమునందుఁ దేమగానుండెడి నీరు - నీటితడి యనుట; ఉజ్జగిలన్ = విడిచిపోవునట్లు - ఆఱునట్లు; ఒత్తన్ = అద్దెను - తుడుచుకొనె ననుట; ఊఁదినన్ = నోటితో నూఁదినమాత్రమున; పాఱు = ఎగిరిపోవునట్టి - మిక్కిలి నాణెమును సన్ననివియు నైన; దుకూల చేలముల్ = పట్టువస్త్రములను; మెయిన్ = దేహమునందు; తాల్చెన్ = ధరించెను.

తా. అప్పుడు స్వరోచి పరిచారికలు ముంచి ముంచి పోయఁగాఁ బన్నీట జలకమాడి మురికిలేని చలువబట్టలతో మేనితడి తుడుచుకొని నాణెముమీఱిన శుభ్రమైన పట్టువస్త్రములు ధరించెను

అలం. నిదర్శన, అతిశయోక్తియు.

చ. గరువున కొత్తఁ జెంగలువ కచ్చు ఘటించినమాళిఁ జుట్టెఁ జెం
దిరిక చెఱంగునం బసిఁడి తీగెలు నించిన జిల్గుపాగ ; బం

1. జవాదుల. పా.

భర[1]తతి వాసనాపవన ꣹ పారణఁ దేల నలందెఁ గస్తురిన్ ;
మరకతమౌక్తికాది మణి ꣹ మండనమండితుఁడయ్యె నయ్యెడన్. 58

టీ. అయ్యెడన్ = ఆ సమయమునందు; గరువునకున్ = ఒక చెంపకు; ఒత్తన్ = ఒఱఁగు నట్లు; చెంగలువ కచ్చు=ఎఱ్ఱకలువపూల సిగబంతి; ఘటించిన మాలికన్ = కూర్చిన (ఎఱ్ఱకలువ పువ్వు రీతిగాఁ బింజెగూర్చిన యని కొందఱు) సిగపైని; చెందిరిక చెఱంగునన్ = చంద్రకావివస్త్రము కొంగునందు; (పా. చెందిరిక తెఱంగునన్ = కమ్మపైదుద్దువిధమున.) పసిఁడితీగెలు = తీగలల్లి నట్లు బంగారుసరిగపోఁగులు; నించిన జిల్గుపాగన్ = నిండినట్లు చేసిన సన్నఁదనముగల తలచుట్టు వస్త్రమును; చుట్టెన్ = చుట్టుకొనెను; బంభరతతి = తుమ్మెదలగుంపు; వాసనాపవనపారణన్ - వాసనా = పరిమళముతోడి; పవన = గాలియొక్క; పారణన్ = (మూర్కొనుట యనెడి) విందుచేత; తేలన్ = ఆనందింపఁగా; కస్తురిన్ = కస్తూరిని; అలందెన్ = శరీరమునందుఁ బూసి కొనెను. మరకత...మండితుఁడు - మరకత = పచ్చలు; మౌక్తిక = ముత్తెములు; ఆది = మొద లైన; మణి = రత్నములుతాఁపిన; మండన = ఆభరణములచేత; మండితుఁడు = అలంకరింపఁ బడినవాఁడు; అయ్యెన్.

తా. అప్పుడు స్వరోచి సరిగతీగలు పాఱవేసి కుసుంబాచాయవేసిన తలపాగ యెఱ్ఱకలువ పూబంతిఁ దాల్చిన సిగ చుట్టిరాఁ జుట్టెను. కస్తూరికలపము పూసికొనెను. రత్నములు దాఁపిన సొమ్ములు దాల్చెను.

మ. కదిసెన్ లగ్న మటంచు మంత్రులు దొరల్ ꣹ గంధర్వరాజాజ్ఞ ను
న్మదవేదండఘటా భటాశ్వ రథ సే ꣹ నాజైత్రవాదిత్రసం
పద మీఱం జనుదెంచి కాంచి ముద మొ ꣹ ప్పం జేసి రారూఢుఁగాఁ
గదళీకాంచన కక్ష్యలన్ మెఱయు లే ꣹ ఖస్వామిచౌదంతిపైన్. 59

టీ. మంత్రులు = ఇందీవరాక్షుని మంత్రులును; దొరల్ = పెండ్లిపెత్తనము చేయవచ్చిన ప్రభువులును; లగ్నము కదిసెన్ = పెండ్లిముహూర్తము సమీపించినది; అటంచున్; గంధర్వ రాజాజ్ఞన్ = ఇందీవరాక్షుని యాజ్ఞచేత; ఉన్మద...సంపద - ఉన్మద = మదముచేత నతిశయిం చిన; వేదండఘటా = ఏనుఁగుల గుంపులును; భట = కాలిబంట్లును; అశ్వ = గుఱ్ఱములును; రథ = తేరులును నైన; సేనా = చతురంగబలములయు; జైత్ర = జయశీలములైన; వాదిత్ర = భేరి మొదలయిన వాద్యములయు; సంపద = కలిమి - వైభవ మనుట; మీఱన్ = అతిశయిం పఁగా; చనుదెంచి = వచ్చి; కాంచి = స్వరోచిని జూచి; ముదము ఒప్పన్ = సంతోషము అమ రఁగా; కదళీ...కక్ష్యలన్ - కదళీ = టెక్కెములచేతను; కాంచన కక్ష్యలన్ = బంగారుతోఁ జేయఁబడిన నడికట్టుపట్టచేతను; మెఱయు = ప్రకాశించుచున్న; లేఖస్వామి చౌదంతిపైన్ = ఇంద్రునిదగు నాలుగు కొమ్ములు గల యేనుఁగుమీఁద - ఐరావతముమీఁద; ఆరూఢుఁగాన్ = ఎక్కినవానిఁగా; చేసిరి = ఎక్కించి రనుట.

తా. అంతట గంధర్వరాజైన యిందీవరాక్షునిచేత నియమింపఁబడిన మంత్రులును, పెండ్లి పెద్దలును లగ్నము సమీపించె నని చతురంగసేనతో మంగళవాద్యములు మ్రోయఁగా బయలుదేరి

1. సభ. పా.

పెండ్లికొడుకైన స్వరోచి విడిదికిఁ బోయి, యతనిదర్శనము చేసి సంతోషించి, బంగారు నడికట్టు పట్టఁ గట్టి, జెండా లెత్తి తీసికొనివచ్చియున్న యైరావతగజముపైఁ గూర్చుండఁబెట్టిరి.

ఉ. అత్తఱిఁ బట్టణంబువిక చాంబురుహాక్షులు కౌతుకంబునం
జిత్తము లుల్లసిల్లఁ గయి సేసి గృహాంగణ సౌధమాలికల్
హత్తి నరేంద్రవీథిఁ జతు రంగబలంబులుఁ గొల్వఁగా మరు
న్మత్తగజంబుపైఁ జను కు మారశిరోమణిఁ జూచి రుబ్బునన్. 60

టీ. అత్తఱిన్ = ఆ సమయమునందు; పట్ట..క్షులు - పట్టణంబు = పట్టణమునందలి; వికచాంబురుహాక్షులు = విరిసిన కమలమువంటి కన్నులు గలవారు - స్త్రీలు; కౌతుకంబునన్ = వేడుకతో; చిత్తములు ఉల్లసిల్లన్ = మనసులు సంతోషింపఁగా; కయిసేసి = అలంకరించుకొని; గృహాంగణసౌధమాలికల్ - గృహాంగణ = ఇండ్లముంగిళ్లయొక్కయు; సౌధ = మేడలయొక్కయు; మాలికల్ = వరుసలను; హత్తి = చేరి; నరేంద్రవీథిన్ = రాజమార్గమునందు; చతురంగబలంబులున్ = రథ గజ తురగ పదాతు లనెడి నాలు గంగముల సేనలును; కొల్వఁగాన్ = సేవింపఁగా; మరున్మత్తగజంబుపైన్ = దేవతల మదపుటేనుఁగైన యైరావతముమీఁద; చను కుమారశిరోమణిన్ = పోవుచున్న రాజకుమారశ్రేష్ఠుఁడయిన స్వరోచిని; ఉబ్బునన్ = సంతోషముతో; చూచిరి.

తా. ఆ సమయమునందుఁ బురస్త్రీ లందఱును మనసులందు వేడుకతో నలంకరించుకొని వచ్చి, యిండ్లముంగిళ్లయందును, మేడలయందును జేరి, రాజమార్గమునందు నైరావతము నెక్కి పోవుచున్న స్వరోచిమహారాజును సంతోషముతోఁ జూచిరి.

ఉ. అంచెలుగట్టి కాలితొడు సై చననీవు గదమ్మ ప్రోదిరా
యంచ లివేటి సంగడము లయ్యెను దయ్యమ! యేటివేడ్క నా
కంచుఁ బదంబునన్ మొరయు నందియ యూడఁగఁ దన్ని పోయి వీ
క్షించె లతాంగి యోర్తు ముర జిన్నిభు సాగరమేఖలావిభున్. 61

టీ. లతాంగి = తీగవంటి మేనుగలదయిన స్త్రీ; ఓర్తు = ఒకతె; ప్రోది రాయంచలు = పెంపుడు రాజహంసలు; అంచెలుగట్టి = వరుసలుదీఱి; కాలితొడుసై = కాళ్లయందెలమ్రోఁత వినుటవలని సంబంధము గలవై; చననీవు గదమ్మ! = పోనియ్యవుగదా! ఇవి = ఈ హంసలు; ఏటి సంగడములు ? = ఏరీతి పరివారములు? (సహచరములు అని కొందఱు.) అయ్యెను. దయ్యమ! = దైవమా! నాకున్ = నావంటి జంజాటముగలదానికి; ఏటి వేడ్క ? = వినోదము ఏమిటి ? అంచున్ = అని; పదంబునన్ = కాలియందు; మొరయు నందియ = మ్రోఁగుచున్న యందెను; ఊడఁగఁ దన్ని = ఊడిపోవునట్లు కాలు జాడించి; పోయి = తలవాకిటికిఁ బోయి; మురజిన్నిభున్ = శ్రీకృష్ణదేవునిఁబోలిన; సాగరమేఖలావిభున్ = భూపతిని - స్వరోచిని; వీక్షించెన్ = చూచెను. కాలియందెలమ్రోఁత హంసలక్రేంకారధ్వనులను బోలియుండె ననియు, అది తమజాతిపక్షులధ్వని యని యెంచి, హంసలు కాళ్లఁ జుట్టుకొని తిరుగఁగా, వానితొందర తప్పించుకొనుటకై కాలియందె నూడఁదన్నుకొని వెడలిపోయె ననియు సంబంధము.

చ. వలపులపల్లవుం డొకఁడు వట్టిచేలంబున నేఁప దీనయై
యలుకలు తీర్చి తీర్చి యొక యచ్చర వచ్చి నృపాలు నన్నగ

ర్వేలువడి చూచెఁ గాముకుఁడు ♦ వెంటనె రా నవు డాత్తఘర్మయై
వెలవెలఁబాఱెఁ దన్ముఖము ♦ వెల్వెలఁబాఱె విటాననాబ్జమున్. 62

టీ. ఒక యచ్చర = ఒక యప్సరస; వలపులపల్లవుండొకఁడు = ప్రేమాస్పదుఁడయిన యొక విటుఁడు; వట్టి చేలంబునన్ = కారణములేని మచ్చరముచేత; ఏఁపన్ = పీడింపఁగా; దీనయై = దుఃఖపడినదై; అలుకలు = ఆ విటునికోపములను; తీర్చి తీర్చి = అలుగఁగా నలుగఁగాఁ దీర్చి తీర్చి; అన్నగ ర్వేలువడి = తానున్న యా మేడనుండి వెడలి; వచ్చి = బయట వచ్చినదై; నృపాలున్ = రాజును; చూచెను. అవుడు = ఆ సమయమునందు - రాజును జూడవచ్చు సమయమునం దనుట. కాముకుఁడు = వలపుకాఁడును; వెంటరాన్ = వెంబడించి రాఁగా; ఆత్తఘర్మయై = పొందఁబడిన చెమటగలదై - మేను చెమర్పఁగా ననుట; తన్ముఖము = ఆ యప్సరసమొగము; వెలవెలఁ బాఱెన్ = తెల్లఁబోయెను - వివర్ణమయ్యె ననుట. (అంతట) విటాననాబ్జమున్ = కమలము వలె వికాసముకలిగియున్న విటకానిముఖమును; వెల్వెలఁబాఱెన్ = వివర్ణమయ్యెను.

తా. ఒక యప్సరస యొక్క వలపుకాఁడు చేలపట్టి పలుమాఱును గోపించుకొనుచుండఁగా వాని యలుక చాలసేపు తీర్చుచుండి పిదప వానిని విడిచి తన మేడ వెడలి బయటవచ్చి రాజును జూచెను. అప్పుడు విటకాఁడును దానివెంటనే వచ్చెను; గనుక నది వానితట్టు చూచినదై వానిని నిరసించి తాను రాజును జూడవచ్చినట్టు లా తన వలపుకానికిఁ దెలిసెనేమో యను విచారముచేత మేను చెమర్పఁగా ముఖము చిన్నపుచ్చుకొనెను. అప్పుడే తనపద్దు చెల్లకపోయెనే యను చింత చేత విటకాఁడును ముఖము చిన్నపుచ్చుకొనెను.

చ. చిలుకలకొల్కి కల్కి యొక ♦ చేడియ నాటకసాల మేడపై
నిలువున నాడుచుండి ధర ♦ ణీపతిఁ జూడఁదలంచి యంచునన్
నిలిచి రహిం గనుంగొనుచు ♦ నెయ్యమునం దనువల్లి యుబ్బి కం
చెల తెగిపడ్డఁ గేతనము ♦ చీరచెఱంగున మూసెఁ జన్నులన్. 63

టీ. చిలుకలకొల్కి = చిలుకముక్కువంటి కనుఁగొలుకులుగల; కల్కి = మనోహరురాలైన; ఒక చేడియ = ఒక స్త్రీ; మేడపైనిలువునన్ = మిద్దెయింటిమీఁది యంతస్తునందలి; నాటకసాలన్ = నృత్యముచేసెడి కూటమునందు; ఆడుచుండి = నృత్యము చేయుచుండి; ధరణీపతిన్ = రాజును; చూడఁదలంచి = చూడవలెనను తలంపు పుట్టి; అంచునన్ = ఆ నాటకసాలచివరను; నిలిచి = నిలువఁబడి; రహిన్ = అభిలాషతో; కనుంగొనుచున్ = స్వరోచిని జూచుచు; నెయ్యమునన్ = స్నేహముచేత - చూచుటవలనఁ గలిగిన యానందాతిశయముచేత ననుట; తనువల్లి = తీగవంటిదైన మేను; ఉబ్బి = ఉప్పొంగి - బలుపునొంది యనుట; కంచెల = అవిక; తెగి = బిగువుచే ముడితెగి; పడ్డన్ = జాఱిపడిపోఁగా - (కంచెల యనఁగా నాట్య మాడునప్పుడు మొగ్గ వాలుట మొదలగు సమయములందు బిగి సడలకుండుటకై రొమ్ములమీఁదఁ గట్టుకొనెడు వస్త్ర విశేషము అని బ్రౌన్ దొరగారు వ్రాయించిన టీకలో వ్రాయఁబడియున్నది.) కేతనముచీర చెఱంగునన్ = జెండాగుడ్డచెఱఁగుచేత; చన్నులన్ = స్తనములను; మూసెన్ = కప్పెను.

తా. ఒక్క చక్కఁదనముగల యువతి మేడమీఁది పైయంతస్తునందు నృత్యశాలలో నృత్యముచేయుచుండి రాజును జూడఁ దలఁపు పుట్టఁగా, నాటకసాలచివర నొక పార్శ్వము నందు నిలిచి, రాజును జూచి, యతనిఁ జూచుటవలని యానందాతిశయముచేత దేహ ముబ్బి బిగిసి

కొనఁగా, ఱవికముడి తెగి జాఱిపోవుటచే స్తనములు బయలుపడఁగా నచట నలంకారముకొఱ కెత్తియున్న జెండాగుడ్డకొనకొంగుతో వానిని మూసికొనెను.

ఉ. కీరమనోజ్ఞవాణి యొక ✽ కిన్నరి కిన్నెర మీటి మీటి యొ
య్యారపులీల నేఁగి వసు ✽ ధాధిపుఁ గన్గొనె జిల్గుపయ్యెదన్
హారముఁ జిక్కఁబెట్టెడు కు ✽ చాహితహస్తము పైఁడిగోళ్లు హిం
సారతి సేయు దర్పకుని ✽ సంపెఁగముల్కులఁబోలె మించఁగన్. 64

టీ. కీరమనోజ్ఞవాణి = చిలుకపలుకులవంటి యింపైన పలుకులు గలదైన; ఒక కిన్నరి = ఒకానొక కిన్నరస్త్రీ; కిన్నెర = కిన్నెరయనెడి యొకవిధమైన వీణెను; మీటి మీటి = చాలసేపు వాయించి; ఒయ్యారపు లీలన్ = విలాసవైఖరితో; ఏఁగి = రాజును జూడఁబోయి; జిల్గు పయ్యెదన్ = సన్నపుఁబయఁటను; హారము = మెడలోని ముత్యాలహారమును; చక్కఁబెట్టెడు కుచాహితహస్తము పైఁడిగోళ్లు - చక్కఁబెట్టెడు = సవరించుకొనుచున్న; కుచ = స్తనముల మీఁద; ఆహిత = ఉంచఁబడిన; హస్తము = చేతియొక్క; పైఁడిగోళ్లు = తంత్రుల మీటునపుడు దెబ్బ తగులకుండుటకై వ్రేళ్లకుఁబెట్టుకొన్న బంగారపుగోళ్లు; హింసారతి...ముల్కులఁబోలెన్ - హింసా = విరహిజనహింసయందు; రతిసేయు = ఆసక్తిపడునట్టి; దర్పకుని = మన్మథునియొక్క; సంపెఁగముల్కులఁబోలెన్ = సంపెఁగపూబాణములవలె; మించఁగన్ = అతిశయింపఁగా - తోఁచుచుండఁగా ననుట; వసుధాధిపున్ = రాజును; కన్గొనెన్ = చూచెను.

తా. ఒక కిన్నరస్త్రీ చాలసేపటినుండి కిన్నెర మీటుచుండి లేచి, రాజును జూడఁబోయి తంత్రి మీటునపుడు వ్రేళ్లకొనలకుఁ బెట్టుకొనెడి బంగారపుమీటుగోళ్లతోడి చేతితో ఱొమ్ము మీఁదిపైఁటను, హారములను సవరించుకొనుచు రాజును జూచెను. అవి యప్పుడా వ్రేళ్లలోని మీటుగోళ్లు విరహముగల స్త్రీ పురుషులను బాధింపఁగోరుచున్న మన్మథుని సంపెంగపూబాణములో యనునట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

చ. పరవశదైన్య మాడుకొను ✽ ప్రౌఢలఁ గానదు; ఘర్మవారిచేఁ
గరఁగి స్రవించు చిత్రకము ✽ గాన; దనాదృతవీటిపాటలా
ధరమున సున్న మంటినవి ✽ ధంబును గానదు; నవ్వుటాల కా
భరణము గొన్నఁ గాన; దొక ✽ బాల నృపాలునిఁ జూచి నివ్వెఱన్. 65

టీ. ఒక బాల = ఒక పడుచుచిన్నది; నృపాలునిన్ = రాజును; చూచి; నివ్వెఱన్ =(చూచుట వలననైన) విభ్రాంతిచేత; (ఇది మీఁదఁజెప్పెడి వాని కన్నిటికిని హేతువు.) పరవశదైన్యము = తనదైన చొక్కువలని దీనభావమును; ఆడుకొను ప్రౌఢలన్ = నిందించుచున్న ప్రగల్భస్త్రీలను; కానదు = చూడదు. ఘర్మవారిచేన్ = చెమటనీటిచేత; కరఁగి; స్రవించు చిత్రకము = దిగజాఱుచున్న తిలకమును; కానదు = చూడదు. అనాదృత...ధరమునన్ - అనాదృత = ఆదరింపఁబడని; వీటి = తాంబూలరసమున; పాటల = ఎఱ్ఱనైన; అధరమునన్ = క్రిందిపెదవియందు; సున్నము; అంటినవిధంబున్ = అంటుకొనుటను; కానదు = చూడదు. నవ్వుటాలకున్ = పరిహాసమునకు; ఆభరణము = తాను ధరించిన సొమ్మును; కొన్నన్ = చెలులు తీసికొన్నను; కానదు = చూడదు. అనఁగా ముగ్ధయైన యొకానొక పడుచు రాజును జూచి పరవశయై సర్వమును మఱచియుండెను. (ఇందు స్తంభ స్వేదము లనెడి సాత్త్వికభావములు చెప్పఁబడినవి.)

చ. అలికులవేణి యొక్కతె ర § తాంతమునం దన యంగవల్లికం
బులకలు చొక్కు లేఁజెమరుఁ § బుట్టఁగ నేఁగి నరేంద్రుఁ జూడ నా
పులకలు చొక్కు లేఁజెమరుఁ § బోవక యట్టుల యుండె; నట్టిదౌఁ;
జెలువగువానిఁ గన్గొనిన § చెల్వకుఁ జూపుల కావె కూటముల్. 66

టీ. అలికులవేణి యొక్కతె = తుమ్మెదబారువంటి జడగలదైన ఒక వనిత; రతాంతమునన్ = సంభోగ మయినతోడనే; తన యంగవల్లికన్ = తీగవంటి తనదేహమునందు; పులకలు = గగురులు - మేనివెండ్రుకలు నిక్కపొడుచుకొనుటలును; చొక్కు = పరవశత్వమును; లేఁజెమరున్ = చిఱుచెమటయు; పుట్టఁగన్ = కలుగఁగా; ఏఁగి = బయటఁబోయి; నరేంద్రున్ = రాజును; చూడన్ = చూడఁగా; ఆ పులకలు చొక్కు లేఁజెమరున్ = ఆ సంభోగకాలమునందుఁ గలిగిన గగురులుఁ బరవశత్వమును జిఱుచెమటయును; పోవక = అణఁగిపోవక; అట్టుల = ఆ రీతినే; ఉండెను. అట్టిది = ఆ స్థితి యట్టిది; ఔన్ = అగును. చెలువగువానిన్ = అందమయిన వానిని; కన్గొనిన చెల్వకున్ = చూచిన సుందరికి; చూపుల = చూచుటలే; కూటముల్ కావె? = సంభోగములు కావా? అగు నను‌ట - అనఁగా సంభోగజనిత రోమాంచాదులు సుందరపురుషావలోకనజనిత సాత్త్వికభావధర్మములుగాఁ బరిణమించి యట్లే నిలిచియుండె నని తాత్పర్యము. (ఇందు రోమాంచ స్తంభస్వేదములు సూచితములు.) అలం. అర్థాంతరన్యాసము.

చ. అలరులబంతి జృంభికకు § నడ్డము సేయుచుఁ గర్ణపాళిపై[1]
కలకలఁ ద్రోయుచుం దరఁగ § లౌ ప్రమదాశ్రులు గోట మీటుచుం
జెలిభుజపీఠి నొత్తిగిలి § చిల్కను దువ్వుచు వాలుఁగన్నుఁగ్రే
వల కుదధార చేర నొక § వారవిలాసిని చూచె రాసుతున్. 67

టీ. ఒక వారవిలాసిని = విలాసవతియైన యొక బోగముది; అలరులబంతిన్ = పూలబంతిని; జృంభికకున్ = ఆవులింతకు; అడ్డముసేయుచున్ = చాటుచేసికొనుచు; కర్ణపాళిపైకిన్ = చెవితమ్మెమీఁదికి; అలకలన్ = ముంగురులను; త్రోయుచున్ = ఎగసనఁద్రోయుచు; తరఁగలు ఔ = అలలు అగునట్టి; ప్రమదాశ్రులు = సంతోషబాష్పములను; గోటన్ = కడవ్రేలిగోటితో; మీటుచున్ = ఎగఁజిమ్ముచును; చెలి భుజపీఠిన్ = చెలికత్తెయొక్క పీఠమువంటి భుజముమీఁద; ఒత్తిగిలి = ఒఱగి; చిల్కను = పెంపుడు చిలుకను; దువ్వుచున్ = చేతితో నిమురుచు; వాలుఁగన్నుఁ గ్రేవలకున్ = నిడుదలైన కడగన్నులకు; ఉదధార = అనురాగాతిశయముచేఁ గలిగిన కన్నీటిధార; చేరన్ = చేరుకొనఁగా; రాసుతున్ = రాజపుత్రుఁడైనస్వారోచిని; చూచెన్.

తా. ఒక బోగముది యావులింత రాఁగా నోటి కడ్డముగాఁ బూచెండు పెట్టుకొని కన్నుల కడ్డముపడుచున్న ముంగురులు చెవులప్రక్కల కెగసనఁద్రోయుచును, జిలుకను జేతితో నిమురుచును, గన్నుల నీళ్లు గ్రుక్కుకొనుచును జెలికత్తెభుజముపైకి నొఱగి నిలుచుండి రాజును జూచెను. (ఇం దశ్రువను సాత్త్వికభావము సూచితము.)

చ. జిలుఁగులఁ బెట్టుచుం దొడలఁ § జెంద్రికపావడ యంట మైతడిం
బెళపెళలేనిచీరఁ గటి § బింకపుఁజన్నులఁ జేర్చికొంచు వే

1. తే, తలుకులు ద్రోయుమేనఁ బ్రమదాస్యలు నొయ్యన. పా.

జలకము లాడి యాడి యొక [1]చాన కరస్థితకేశయై నృపు
న్వెలువడి చూచె లోపడితి నీ కని బాసకు నిల్చెనో యనన్. 68

టీ. ఒక చాన = మఱియొక వనిత; జలకములాడి యాడి = స్నానములు చేసి చేసి; (ఇట బహువచన ద్విరుక్తు లాదరమును దెలుపును.) జిలుఁగులన్ = సన్ననివి చిన్న వస్త్రములను; పెట్టుచున్ = తడియొత్తుటకు మేనిపైఁబెట్టుకొనుచు; తొడలన్ = తొడలమీఁద; చెంద్రికపావడ = చెంద్రికావిగాగర; అంటన్ = తడిచేత నంటుకొనఁగా; మైతడిన్ = దేహమునందలి తడిచేత; పెళ పెళ లేని చీరన్ = తడిసి పెళ పెళ ధ్వని లేకుండెడి పైఁటకోకను; కటిన్ = మొలను; బింకపుఁ జన్నులన్ = బిగువుగల పాలిండ్లమీఁదను; చేర్చికొంచున్ = పొందించుకొనుచును; కరస్థితకేశయై = చేత నున్న తలవెండ్రుకలు గలదై - తడివెండ్రుకలను జేత మలఁచి పట్టుకొని యనుట. వెలువడి = బయటవచ్చి; నీకు; లోపడితిన్ = వశమైతిని అని; బాసకున్ = ప్రమాణము చేయుటకై; నిల్చెనో యనన్ = నిలిచినదేమో ? యనునట్టు (నిల్చి); నృపున్ = రాజును; చూచెన్.

తా. ఒక స్త్రీ స్నానముచేయుచుండి రాజురాక విని, సన్నవస్త్రములచే దేహమునందలి తడి నొత్తియొత్తక యా తడిచేతఁ జెంద్రకావిపావడ తొడలయం దంటుకొనుచుండఁగా మొలను గట్టుకొని, యట్లే మేనితడిచేఁ దడిసినపయఁటచీరను జన్నులఁగప్పుకొని, నీళ్లువడియుచున్న తలవెండ్రుకల నొక చేత మలఁచిపట్టుకొని, వెలుపలికి వచ్చి రాజును చూచెను. అట్లు చూచుట తన్నుఁ బరిగ్రహింపఁ గోరి 'యో రాజా! నేను నీకు స్వాధీనురాలనైతి' నని ప్రమాణము చేసెనో యన్నట్లుండెను. (లోకమునందు ఘోరప్రమాణములు చేయువారు తడితలతోను, దడివస్త్రములతోను బ్రమాణముసేయుట సుప్రసిద్ధము.) (ఇందు ఔత్సుక్య మనెడి సంచారిభావము సూచితము.) అలం. ఉత్ప్రేక్ష.

మ. ఒక నేత్రాంబుజ మొక్క గల్ల మొక చన్నొయ్యారపున్లీల వీ
థికిఁ దోఁపన్ దలుపోరఁగా నొక పురంధ్రీరత్న మీక్షించె, రా
జకిశోరంబుఁ దదీయలై వెలయు భాషాలక్ష్ములం జూచి త్ర్యం
బకభాగంబు మొఱంగి మైత్రికి శివాభాగంబ యేతెంచెనాన్. 69

టీ. ఒక పురంధ్రీరత్నము = శ్రేష్ఠురాలయిన యొక యిల్లాలు; తదీయలై = రాజకుమారుని వారలై - అతనికి వశ్యలై; వెలయు భాషాలక్ష్ములన్ = ప్రకాశించునట్టి సరస్వతిని, లక్ష్మిని - విద్యయు, సంపదయు నతనిఁ బొందియున్న వనుట; చూచి = తాను జూచినదై; మైత్రికిన్ = ఆ లక్ష్మీ సరస్వతులతోడి చెలిమికై; త్ర్యంబక భాగంబున్ = అర్ధదేహమైన శివునిభాగమును; మొఱంగి = వంచించి - దాఁచి యనుట; శివాభాగంబ = తక్కిన యర్ధదేహమైన పార్వతీభాగము మాత్రమే; ఏతెంచె నాన్ = (రాజును) జేరవచ్చెనో యనునట్టుగా; ఒక నేత్రాంబుజము = కమలమును బోలిన యొక కన్నును; ఒక్క గల్లము = ఒక చెంపయును; ఒక చన్ను = ఒక స్తనమును; ఒయ్యారపున్ లీలన్ = విలాసగతితో; వీథికిన్ = ఇండ్లనడిమిమార్గమునకు - వెలుపలి కనుట; తోఁపన్ = కనఁబడునట్టుగా; తలుపోరఁగాన్ = తలుపుప్రక్కగా - తలుపు తనకు మఱుఁగుగా నుండునట్లు కొంచెము మూసి నిలిచి యనుట; రాజకిశోరంబున్ = రాజకుమారుని - స్వరోచిని; ఈక్షించెన్ = చూచెను.

---

1. చామ. పా.

తా. ఒక యిల్లాలు స్వరోచిని జూడఁగోరి, సిగ్గుచేఁ దలవాకిటి తలుపు నోరవాకిలిగా మూసి, దాని మఱుఁగున నొక కన్ను, నొక చెంపయు, నొక స్తనమును బయటికిఁ దెలియునట్లు నిలిచి చూచెను. ఆ చూచుట శంకరార్ధశరీరయైన పార్వతీదేవి తన చెలిమికత్తెలయిన లక్ష్మీ సరస్వతులు కలిమియు, విద్యయు నై, యా రాజకుమారునికి వశ్యులైరి గనుక 'నేను వారితోఁ జేరి సుఖించెదఁ గాక' యని శివునిభాగమయిన యర్ధదేహమును దాఁచి, తనభాగమైన యర్ధదేహముతో వచ్చి, సాక్షాత్కరించెనో యనున ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

మ. కలయం గూర్మిఁ జెమర్చునంగముల లగ్నంబైన సన్నంపుమం
జులకౌశేయమునందు మించుకమలస్తోమంబుచేఁ జూచె నొ
క్క లతాతన్వి చెలంగి పొంగు మదికాంక్షల్ దీఱ మే నెల్లఁ గ
న్నులు గావించి కుమారుజవ్వనముచెన్నుం జూచుచందంబునన్. 70

టీ. ఒక్క లతాతన్వి = తీగవంటిదేహముగల యొక స్త్రీ; చెలంగి = ఉత్సహించి; పొంగు = అతిశయించుచున్న (లేక వెలిపొంగుచున్న); మదికాంక్షల్ = మదిలోని కోరికలు; తీఱన్ = నెఱవేఱఁగా; మే నెల్లన్ = దేహ మంతయు; కన్నులు కావించి = కన్నులను చేసికొని; చూచు చందంబునన్ = చూచుచున్నదో యనునట్లు; కుమారు...చెన్నున్ - కుమారు = రాజకుమారుఁడయిన స్వరోచియొక్క; జవ్వనముచెన్నున్ = యౌవనసౌందర్యమును; కూర్మిన్ = ప్రేమతో; కలయన్ = అంతటను; చెమర్చునంగములన్ = చెమటపట్టిన యవయవములందు; లగ్నంబు = అంటుకొన్నది; ఐన...నందున్ - ఐన = అయినట్టి; సన్నంపు = పలిపమైన; మంజుల = అందమైన; కౌశేయమునందున్ = పట్టుచీరయందు; మించు కమలస్తోమంబుచేన్ = ప్రకాశించునట్టి పద్మాకారపు బుట్టాల చాలుచేత; చూచెన్.

తా. ఒక యువతి పెండ్లికొడుకును జూడవలె ననెడి మిక్కుటమైన తమకముచేత దేహమంతయుఁ గన్నులుగాఁ జేసికొని చూచుచున్నదో యనునట్టు తామరపూఁబుట్టాల చీరగట్టుకొని యది యెల్లయంగములందును జెమర్చిన దేహమునం దంటుకొనఁగా వచ్చి స్వరోచిని జూచెను. అలం. పరిణామము, ఉత్ప్రేక్షయు. ఇందు స్వేదౌత్సుక్యము లనెడి సాత్త్వికభావములు సూచితములు.

వ. ఇత్తెఱంగునం గరంగు నంతరంగంబులు గల కురంగాక్షుల యపాంగంబులం దుఱంగలించు సితేతరతరళతరదృగ్రోచుల నభంగ శృంగారరసవీచులచాలునం బోలెఁ బొదువంబడి యాలంబిత చీనాంబర ప్రాలంబమాలికాచిత్రమ్ములగు నాతపత్రమ్ములు మెఱయఁ, బత్రమ్ముల డిగ్గి, దుర్గాధిపతు లేమేమ యని త్రోపుత్రోపాడుచు వీచువీచోపు లచ్చమ్ములగు కౌముదీగుచ్ఛమ్ముల సంతరింప నంతికవైజయంతికలం గ్రాలు వలువలం బొలయు చిఱుగరువలిం దూలు నీలాలకల యలక లుభయపార్శ్వసముత్తుంగ మత్తమాతంగ మదసౌరభ సంగిభృంగ సంఘంబుల నెలయింప, నింపారు కలపంబు లబ్బాటునం బేటులెత్తి యొండొరులయొత్తిడిం బొడిపొడియై యెగయు విస్రమరపరాగపూగంబు చదల నెల్లెడ నుల్లెడగట్టిన ట్టమర, దట్టదట్టమ్ముగ సాగు నాగరుల వాగారవ

మ్ములు నిగుడ, నెడవడక పొగడు పొగడికల కలకలమ్ములును, బుంఖానుపుంఖ శంఖ భేరీ పటహ కాహళ వేణు వీణాది వాదనధ్వానంబును గలమధురకిన్నరీ నిక్వాణంబులరాణం దాణఁజెఱుచు విన్నాణంపుఁగొల్పు టెలుంగులును వేల్పుగాణలు వాడు లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁబాటలం దీటుకొను తిన్నని రవంబులు గలసి బలిసికొను కోలాహలమ్ము లిమ్ముగ సందడుల నెడగలుగం జడియు వేత్రహస్తుల ప్రశస్తతర సాహోనినాదంబు సంబంధించి పెంపొలయ, నత్యంతకాంతంబయి నిరంతరగతిం గ్రంతనడవ, నడదివియలై మకుటారవింద రాగంబులు వెలుంగ, నలుగడల సామంతసందోహంబు క్రందుకొన, మందమంద గమనంబునం జను బృందారకవేదండంబుపై నుద్దండ [1]తనుచ్ఛాయాకలాపంబు జంబేటిజంబాలకదంబకంబుడంబు విడంబింపఁ దిన్నని రవంబునంగలసి బలసిన కోలాహలంబు హంసాదివిహంగ హృదయంగమరావంబును బెడంగువడ నడచు క్రంత నత్యంతదర్శనీయంబులై మెఱయు మంగళద్రవ్యంబుల నెడనెడఁ దీండ్రించు పుండ్రేక్షుదండంబులకడలఁ గడలుకొను పసరుటాకులడాలు శైవాలంబు నందంద క్రందుగా మందు చేదివియలు చెందొవలునుంగాఁ, బార్శ్వద్వయ సముత్తుంగమణిసౌధవీథికారోదోంతరాళంబున గంధగజఘటాఘనాఘన కాంతికధూళి మాగధప్రవాహంబునం గూలంకషంబగు నృపతిపథ యమునాహ్రదంబు గగనగంగావగాహనాభ్యాసంబున నిండుకొనిపోవునదియునుంబోలెఁ దనరఁ, దన సముద్దామతేజోభరంబునఁ జడిసిన మేరుగిరి మోరులుంబోలెఁ దీరుగల భుజంబులం దాఱుమాఱుగా నిడిన తారతారంపుఁ బంచసరంబులు, దోరంతరహారంబులుఁ, గేయూరహీరంబులుఁ, గరకంకణకురువిందకందళంబులుఁ, గటి కనకమేఖలాఘటితంబగు [2]చేరుకరాచురీమరకతంపుఁబిడి మెఱుంగులుం దఱిసి వెన్నెలక్రొన్నురువుల బోరన న్నగు నరపడుగు జిలుఁగుకంచుకంబును మించి వెలుపలం దోఁప, మంచు గవిసిన రోహణమహీధరంబునుంబోలె రాజభవనాంగణంబు చేరవచ్చె నంత నక్కడ. 71

టీ. ఇత్తెఱంగునన్ = ఈ విధముగా; కరంగునంతరంగంబులు = అనురాగము నొందిన మనస్సులు; కల...గంబులన్ - కల కురంగాక్షుల = కలిగినట్టి స్త్రీలయొక్క; అపాంగంబులన్ = కడగన్నులయందు; తుఱంగలించు...గ్రోచులన్ - తుఱంగలించు = ప్రకాశించుచున్న; సితేతర = నల్లని; తరళతర = మిక్కిలి చంచలములైన; దృగ్రోచులన్ = చూపువెలుఁగులచేత; అభంగ...బోలెన్ - అభంగ = చెడని - తక్కువకాని; శృంగారరస = శృంగారరస మనెడి జలప్రవాహమునందలి; వీచుల = అలలయొక్క; చాలునంబోలెన్ = పంక్తిచేత వలెను; పాదుపం బడి = క్రమ్మఁబడి; (అలం. ఉత్ప్రేక్ష.) ఆలంబిత...చిత్రమ్ములు - ఆలంబిత = పట్టఁబడిన; చీనాంబర = చీనాదేశపుఁబట్టుగుడ్డతోఁ గుట్టఁబడిన; ప్రాలంబ = (బాగుగా వ్రేలుచున్న) జాలరులయొక్క; మాలికా = వరుసలచేతను; చిత్రమ్ములు = వింతలుగొలుపునవి; అగు నాతపత్ర

1. 'తను' ముద్రితప్రతులలో లేదు. 2. చారు. పా.

మ్ములు = అయిన గొడుగులు; మెఱయఁగ = ప్రకాశింపఁగా; పత్త్రమ్ములఁ డిగ్గి = వాహనముల నుండి దిగి; ("పత్త్రం వాహనపక్షయోః" అని యమరము.) దుర్గాధిపతులు = చోరరానికోటలు గల పట్టణముల నేలువారైన రాజులు; ఏమేమ = మేమే మేమే; (సేవ చేయఁదగినవారము) అని; త్రోపుత్రోపాడుచుఁ = ఒకరి నొకరు తొలఁగఁద్రోసికొనుచు; వీచు వీచోపులు = విసరునట్టి వింజామరలు - సీవిరులు; అచ్ఛమ్ములు = తెల్లగా వెలుఁగునవి; అగు కౌముదీగుచ్ఛమ్ములఁ = అగునట్టి వెన్నెలగుత్తులను; సంతరింపఁ = కలుగఁజేయఁగా; (అలం. ఉపమ.) అంతికవైజయంతి కలఁ = సమీపమునందున్న టెక్కెములయందు; క్రాలు వలువలఁ = అల్లలాడుచున్న గుడ్డల వలన; పొలయు చిఱుగరువలిఁ = వ్యాపించుచున్న కొంచెపుగాలిచేత; తూలు...కలు - తూలు = కదలుచున్న - అసియాడుచున్న; నీలాలకల = నల్లనిముంగురులుగల స్త్రీలయొక్క; అలకలు = పొడి తలవెంట్రుకలు; ఉభయ...సంఘంబులఁ - ఉభయపార్శ్వ = ఇరుప్రక్కలనుండెడి; సముత్తుంగ = మిక్కిలి యున్నతములయిన; మత్తమాతంగ = మదపుటేనుఁగులయొక్క; మదసౌరభ = మదజలము యొక్క మంచివాసనలకు; సంగి = చేరవచ్చుచున్న; భృంగసంఘంబులఁ = తుమ్మెదగుంపులను; ఎలయింపఁ = తమదగ్గఱకు రప్పింపఁగా - స్త్రీల ముంగురులు ఏనుఁగుల చెక్కిళ్లయందలి మదజల పరిమళమునకు వచ్చి యావరించుచున్న తుమ్మెదలకుఁ దాము తుమ్మెదలే యను భ్రమ కల్పించి, వానిఁ జేరఁదీయుచుండఁగా ననుట; (అలం. భ్రాంతిమంతము.) ఇంపారు కలపంబులు = ఇష్టమును పెంచునట్టి పరిమళ వస్తువులు చేర్చిన గంధపుఁబూఁతలు; అబ్బాటునఁ = జనుల చేరికవలననైన కాఁకచేత; పేటులెత్తి = ఎండి - పెల్లలెగసి; ఒండొరుల యొత్తిడిఁ = పరస్పరము గలుగు నొఱపిడిచేత; పొడిపొడియై = నలఁగి మిక్కిలి పొడియై; ఎగయు...పూగంబు - ఎగయు = ఎగురుచున్న; విసృమర = వ్యాపించు స్వభావముగల; పరాగపూగంబు = ధూళిరాశి; చదలఁ = ఆకాశమునందు; ఎల్లెడఁ = అంతటను; ఉల్లెడగట్టినట్టు = మేలుకట్లుకట్టినట్లు; అమరఁ = ఒప్పఁగా; (అలం. అతిశయోక్తి.) దట్టదట్టమ్ముగఁ = మిక్కిలి తఱుచుగా - త్రోపుత్రోపిళ్లతో ననుట; సాగు నాగరుల వాగారవమ్ములు = బారులుదీరివచ్చుచున్న పురజనుల మాటల మ్రోఁతలు; నిగుడఁ = అతిశయింపఁగా; ఎడపడక = విరామములేక; పొగడు...మ్ములును - పొగడు = స్తోత్రము చేయునట్టి; పొగడికల = స్తుతిపాఠకుల పొగడ్తలయొక్క; కలకలమ్ములును = కోలాహలధ్వనులును; పుంఖా...ధ్వానంబును - పుంఖానుపుంఖ = తరములవెంబడి మ్రోఁగుచున్న; శంఖ = శంఖములు; భేరీ = పెద్ద నగారాలు; పటహ = తప్పెటలు; కాహళ = తుతారలు; వేణు = పిల్లనఁగ్రోవులు; వీణా = వీణెలు; ఆది = మొదలుగాఁగల; వాదన = వాద్యములు వాయించునట్టి; ధ్వానంబును = ధ్వనియును; కల...రాణఁ - కల = అవ్యక్తమయిన; మధుర = చెవులకింపైన; కిన్నరీ = కిన్నెర లనెడి వీణెలయొక్క; నిక్వాణంబుల = ధ్వనులయొక్క; రాణఁ = మనోజ్ఞతను; త్రాణ...గులును - త్రాణఁ జెఱుచు = పటిమచే నణఁచునట్టి; విన్నాణంపుఁగొల్పుటెలుంగులును = నేర్పుతోడి పాఠకులు కొనుగోలుచేయు కంఠస్వరములును; వేల్పుగాణలు = అప్సరసలు; పాడు...పాటలఁ - పాడు = పాడుచున్న; లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁబాటలఁ = లక్ష్మీ విష్ణువులయొక్క పెండ్లిపాటలచేత; దీటుకొను తిన్ననిరవంబులుఁ = నిండుకొనుచున్న మెల్లని ధ్వనులును; కలసి = ఒకటిగాఁగూడి; బలసికొను కోలాహలమ్ములు = వ్యాపించుచున్న కలకలధ్వనులు; ఇమ్ముగఁ = యుక్తముగా; సందడులఁ = సమ్మర్దములను - ఒరసికొనివచ్చు జనసమూహములను; ఎడగలుగఁ = దూరముగా; జడియు...నినాదంబు - జడియు = తొలఁగఁద్రోయునట్టి; వేత్రహస్తుల = బెత్తాలవారియొక్క - బెత్తములు చేతఁ

బట్టుకొని బరాబరులుచేయునట్టి బంట్లయొక్క; ప్రశస్తతర = మిగుల శ్లాఘ్యములయిన; సాహో నినాదంబున్ = ఎచ్చరికచేయు పలుకుల ధ్వనిని; సంబంధించి = కూడుకొని; పెంపు = అతిశయమును (లేక, అభివృద్ధిని); ఒలయన్ = పొందఁగా; అత్యంతకాంతంబై =మిగుల మనోహరమయి; నిరంతరగతిన్ = ఎడఁబాటులేనివిధమున; క్రంత నడవన్ = మగపెండ్లివారు పెండ్లికూఁతునకుఁ బ్రధానశుభద్రవ్యము లెత్తించుకొని పరిజనముతో నడవఁగా; నడదివియలై = నడచునట్టి దివిటీలై; మకుటారవిందరాగంబులు = కిరీటములయందలి పద్మరాగమణులు; వెలుంగన్ = ప్రకాశించుచుండఁగా; నలుగడలన్ = నాలుగుప్రక్కలయందును; సామంతసందోహంబు = తనకు లోఁబడియున్న ఇరుగుపొరుగు రాజులయొక్కసమూహము; క్రందుకొనన్ = సందడింపఁగా; మందమందగమనంబునన్=మెల్లమెల్లని నడకతో; చను...పైన్ -చను=పోవునట్టి; బృందారకవేదండంబుపైన్= దేవతలయేనుఁగయిన యైరావతముమీఁద; ఉద్దండ...కలాపంబు - ఉద్దండ = ఎక్కువైన; తనుచ్ఛాయా = దేహకాంతులయొక్క; కలాపంబు = సమూహము; జంబేటి...డంబున్ - జంబేటి = జంబూనదియొక్క; జంబాల = అడుసుయొక్క; కదంబకంబు డంబున్ = రాశియొక్క విధమును; విడంబింపన్ = అనుకరింపఁగా - సరిపోలఁగా ననుట; తిన్నని రవంబునన్ = మృదుధ్వనితో; కలసి = కూడి; బలసిన కోలాహలంబున్ =ఆవరించుకొన్న కలకలధ్వనియును; హంసాది...రావంబును-హంసాది= హంసలు మొదలయిన; విహంగమ= పక్షులయొక్క; హృదయంగమ = మనోహరమయిన; రావంబును = ధ్వనియును; బెడంగువడన్ = అందగించునట్లు; నడచు క్రంతన్ =నడచుచుండెడి ప్రధానద్రవ్యము గొనిపోవువారి సమూహమునందు; (అలం. ఉపమ.) అత్యంతదర్శనీయంబులై =మిక్కిలి చూడఁదగినవై - మిక్కిలి మనోహరములై; మెఱయు...బులన్ -మెఱయు=ప్రకాశించునట్టి; మంగళద్రవ్యంబులన్ = శుభవస్తువులయందు; ఎడనెడన్ =నడుమనడుమ; తీండ్రించు= వెలుఁగుచున్న; పుండ్రేక్షుదండంబుల కడలన్ = నామాలచెఱుకుగడలయొక్క కొనలయందు; కడ...డాలు - కడలుకొను = అతిశయించుచున్న; పసరుటాకుల = పచ్చనియాకులయొక్క; డాలు = వెలుఁగు - కాంతి; శైవాలంబున్ = నాఁచుతీగెల సమూహమును; అందంద = అక్కడక్కడ; క్రందుగాన్ = అధికముగా; మండు చేదివియలు; చెందొవలునున్ = ఎఱ్ఱకలువలును; కాన్ = అగుచుండఁగా; పార్శ్వ...బునన్ - పార్శ్వద్వయ = ఇరుప్రక్కలను; సముత్తుంగ = మిగులఁ బొడుగులైన; మణిసౌధ = రత్నాలమేడలయొక్క; వీథికా = వాడల నడిమిత్రోవ లనెడి; రోదోంతరాళంబునన్ = భూమ్యాకాశముల మధ్యభాగమునందు; గంధ...బునన్ - గంధగజ = మదపుటేనుంగులయొక్క; ఘటా = సమూహములనెడి; ఘనాఘన = వర్షాకాల మేఘములయొక్క; కాంతిక = కాంతివంటి కాంతిగల; ధూళి = దుమ్మతోడి - దుమ్ముగ్రమ్మిన యనుట; మాగధ = మగధదేశపు గుఱ్ఱములయొక్క; ప్రవాహంబునన్ =బారు అనెడు వెల్లువచేత; కూలంకషంబు = దరుల నొరయుచుండునది; అగు...ప్రాదంబు - అగు = అగుచున్న; నృపతిపథ = రాజమార్గమనెడి; యమునాప్రాదంబు = కాళిందీనదియందలి మడుఁగు; గగన...బునన్ - గగనగంగా = ఆకాశగంగయందు; అవగాహన = మునుఁగునట్టి; అభ్యాసంబునన్ = పరిచయముచేత; నిండుకొని = పూర్ణీభవించి; పోవునదియునుంబోలెన్ = ప్రవహించుచున్నదానివలె; తనరన్ = ఒప్పఁగా; (అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.) తన...భరంబునన్ - తన = తనదైన - స్వకీయ యనుట; సముద్దామ = అడ్డములేని; తేజోభరంబునన్ = కాంతివిశేషముయొక్క యతిశయముచేత; జడిసిన మేరుగిరిమోరులుంబోలెన్ = వెఱచిన మేరుపర్వతముయొక్క శిఖరములో యనునట్లు; తీరు = చక్కఁదనము; కల భుజంబులన్ = కలిగిన భుజములయందు;

తాఱుమాఱుగాన్ = వ్యత్యస్తముగా; ఇడిన...బులు - ఇడిన = పెట్టుకొన్న; తారతారంపు = పులుగడిగిన ముత్యాలయొక్క; పంచసరంబులున్=బన్నసరములును - అయిదుపేటల హారములును; దోరంతరహారంబులున్ = ఱొమ్మునందలి రత్నాలపేరులును; కేయూరహీరంబులున్ = బాహుపురులయందలి వజ్రమణులును; కరకంకణకురువిందకందళంబులున్ - కరకంకణ = ముంజేతికడియము యొక్క; కురువింద = కురువిందములనెడి కెంపులయొక్క; కందళంబులున్ = మొలకలును-తళతళ మెఱయు కురువిందపుఁగెంపుల కాంతు లనుట; కటి...ఘటితంబు - కటి = మొలయందలి; కనక మేఖలా=బంగారు వొడ్డాణమునందు; ఘటితంబు = కూర్పఁబడినది - ధరింపఁబడినది యనుట; అగు చేరు...మెఱుంగులున్ - అగు=అయిన; చేరు = మొలకట్టుసరముతోడి; కరాచురీ = కత్తియొక్క; మరకతంపు=పచ్చలు చెక్కిన; పిడి=చేపట్టు కామయొక్క; మెఱుంగులున్ = కాంతులును; తఱిసి= చేరి; వెన్నెల క్రొన్నురువులన్ = వెన్నెలయను క్రొత్తగాఁ గలిగిన నురుఁగులను; బోరనన్ = శీఘ్రముగా-కనఁబడినప్పుడే యనుట; నగు...బునన్ - నగు = పరిహసించునట్టి; అరపడుగు = అచ్చువెలితిగల పడుగు చేసి నేసిన; జిలుఁగు = సన్ననివస్త్రముతోఁ గుట్టిన; కంచుకంబును = అంగీని; మించి = అతిక్రమించి; వెలుపలన్ = బయట; తోఁపన్ = కనఁబడఁగా - ఆభరణముల రత్నకాంతులును, మొలకట్టు సరముతోడి కత్తియొక్క తళతళయను కాంతులును గూడి, మేనఁ దాల్చిన తెల్లపట్టుతోఁ గుట్టిన యంగీయొక్క తెల్లఁదనమును మించి వెలుఁగుచుండఁగా నని యర్థము. మంచు కవిసిన = హిమము ఆవరించిన; రోహణమహీధరంబునుంబోలెన్ = రత్నపర్వతమువలెనే; రాజ భవనాంగణంబు = రాచనగరిముంగిటిని; చేరవచ్చెన్ = దగ్గరవచ్చెను. అంతన్ = పిదప; అక్కడన్ = ఆ గంధర్వరాజు గృహమునందు. అనంతర పద్యముతో నన్వయము. అలం. ముద్ర, ఉపమయు.

క. కాంతాకదంబ కిసలయ, కాంత కరావర్జ్యమాన ✽ కనకఘటీ ని
ర్వాంత సుగంధిజలంబుల, నింతి జలకమాడి జిలుఁగు ✽ లిడి తడియొత్తెన్. 72

టీ. ఇంతి = గంధర్వరాజుకూఁతురైన మనోరమ; కాంతా...బులన్ - కాంతాకదంబ = పరిచారికలైన స్త్రీల సమూహముయొక్క; కిసలయకాంత = చిగుళ్లవలె మనోహరములయిన; కర = చేతులచేత; ఆవర్జ్యమాన = చక్కఁగాఁ బోయఁబడుచున్న; కనకఘటీ = బంగారుకుండలనుండి; నిర్వాంత = మిక్కిలి క్రక్కఁబడుచున్న - మిక్కిలి పడుచున్న; సుగంధిజలంబులన్ = మంచి వాసనతోఁ గూడిన నీళ్లచేత; జలకమాడి = స్నానముచేసి; జిలుఁగులు = సన్ననివస్త్రములు; ఇడి = పెట్టి; తడి యొత్తెన్ = ఒడలితడి తుడిచెను - అనఁగా మనోరమ పరిచారికలు బంగారు కుండలతోఁ దెచ్చి పోయఁగాఁ బన్నీట స్నానము చేసి, సన్నని మృదువస్త్రములతో దేహముతడి తుడుచుకొనెను.

చ. తళుకుదుకూల[1]చేలఁ గటిఁ ✽ దాల్చి పటీర మలంది హార కుం
డల మణిపారిహార్య రశ ✽ నా కటకాంగుళిముద్రికాది భూ
షలు తొడి పారిజాతవిక ✽ సత్ప్రసవావళిఁ బూని యొయ్య న
వ్వాలఁది వివాహవేది కలి ✽ వేణులు దేఁ జనుదెంచె సిగ్గునన్. 73

1. శాటిఁ. పా.

టీ. అవ్వేలఁది = ఆ స్త్రీ - మనోరమ; తళుకుదుకూలచేలన్ - తళుకు = సరిగపోఁగులచేఁ దళతళలాడుచున్న; దుకూల చేలన్ = తెల్లనైన పట్టుచీరను; కటిన్ తాల్చి = మొలపై ధరించి; (కటియనఁగా నడుము. పిఱుఁదులు అని కొందఱు.) పటీరము = మంచిగంధము; అలంది = (శరీరమునందు) పూసికొని; హార...భూషలు - హార = ముత్యాలపేరులు; కుండల = కమ్మలు; మణి = రత్నములు చెక్కిన; పారిహార్య = సూడిగములు - మట్టిగాజులు; రశనా = పదియాఱు పేటల మొలనూలు; కటక = ముంజేతికడియములు; అంగుళిముద్రికా = వ్రేళ్లయుంగరాలు; ఆది భూషలు = మొదలగు సొమ్ములు; తొడి = తొడిగి - ధరించి; పారి . వళిన్ - పారిజాల = కల్ప వృక్షముయొక్క; వికసత్ప్రసవ = పూచిన పువ్వులయొక్క; ఆవళిన్ = పంక్తిని - పారిజాతపుఁ బూదండల ననుట; పూని = పెట్టుకొని; ఒయ్యన్ = తిన్నఁగా; అలివేణులు = స్త్రీలు - ముత్తైదువలు; తేన్ = వెంటఁబెట్టుకొని రాఁగా; వివాహవేదికిన్ = పెండ్లియరుఁగుమీఁదికి; సిగ్గునన్ = లజ్జతో; చనుదెంచెన్ = వచ్చెను - మనోరమ తనకుఁదగిన వస్త్రాభరణములను, బుష్ప చందనములను ధరించి, ముత్తైదువలు వెంటఁబెట్టుకొని రాఁగాఁ బెండ్లియరుఁగుమీఁదికి వచ్చె నని తాత్పర్యము అలం. స్వభావోక్తి.

తే. ఇట గృహద్వారసీమకు నేఁగుదెంచు, నా కుమారున కిందీవరాక్షుఁ డెదురు
సని మరుత్కరిడిగ్గి వందన మొనర్చు,నతని దీవించి హితమంత్రియుతముగాఁగ.

టీ. ఇటన్ = ఇక్కడ - పెండ్లికొడుకునొద్ద ననుట; గృహద్వారసీమకున్ = నగరివాకిటి ప్రదేశమునకు; ఏఁగుదెంచు నా కుమారునకున్ = వచ్చిన యా పెండ్లికొడుకునకు; ఇందీవరాక్షుఁడు; ఎదురుసని = ఎదుర్కొలుచేసి; మరుత్కరిన్ = వేల్పుటేనుఁగును - ఐరావతమును; డిగ్గి = దిగి; వందనము = నమస్కారము; ఒనర్చు నతనిన్ = చేసిన యా స్వరోచిని; దీవించి; హితమంత్రి యుతముగాఁగన్ = ఇష్టులతోను, మంత్రులతోను గూడుకొనునట్టుగా. ముందున కన్వయము.

వ. భూసురాశీర్వాదనాదంబులు రోదసి నిండ నభ్యంతర గృహంబునకుం దోడ్కొని
పోవునప్పు డప్పుడమిఱేఁ డెడనెడం బుణ్యాంగన లొసంగు నీరాజనోపహారమ్ము
లాదరించుచుఁ, గక్ష్యాంతరద్వార దేశంబుల మంగళార్థంబుగా నిడిన పూర్ణకలశ
ముకురాది పదార్థంబులఁ గనుఁగొనుచుఁ, దోరణస్తంభాయమాన రంభాతరు
కిసలయోత్తాల తాళవృంతానిలంబులఁ గుంతలంబులు చలియింప మంథరగతిఁ
గింపురుషవృషభుండగు గంధర్వరాజప్రధానుం డొసంగు కైదండ గొని యల్ల
నల్లన నడచి పురోహిత బ్రాహ్మణ బంధు పురంధ్రీ సందోహ నిరంధ్రంబయి
వైవాహిక క్రియారంభ సంభార సంభ్రమ ద్రంభాది మత్తుదంభోరువుల కలికి
నునుసోగ పలుకుల కలకలంబునం గొలగొలమను కౌతుకాగారంబు సొత్తెంచి.

టీ. భూసురాశీర్వాదనాదంబులు = బ్రాహ్మణుల దీవనలధ్వనులు; రోదసి = భూమ్యాకాశ ముల మధ్యభాగమంతయు; నిండన్ = నిండుకొనఁగా; అభ్యంతరగృహంబునకున్ = నడిమి యింటికి - నగరి నడిమికూటమునకు ననుట. తోడ్కొని = పిలుచుకొని; పోవునప్పుడు = పోవునట్టి సమయమునందు; అప్పుడమిఱేఁడు = ఆ భూపతి - స్వరోచి; ఎడనెడన్ = నడుమ నడుమ; పుణ్యాంగనలు = ముత్తయిదువలు; ఒసంగు నీరాజనోపహారమ్ములు = ఇచ్చునట్టి మంగళహారతు

మర్యాదలను; ఆదరించుచున్ = ఆదరణతో నంగీకరించుచు; కక్ష్యాంతరద్వారదేశంబులన్ = ఒక్కొక్క తొట్టికట్టుయొక్కయు వాకిళ్లయందు; మంగళార్థంబుగాన్ = శుభనిమిత్తముగా- శుభసూచకముగా ననుట. ఇడిన...పదార్థంబులన్ - ఇడిన = ఉంచినట్టి; పూర్ణకలశ = నీళ్లు నింపి పూజించి యుంచిన బంగారుకుండలు; ముకుర = అద్దములు; ఆది = మొదలయిన; పదార్థంబులన్ = వస్తువులను; కనుంగొనుచున్ = చూచుచు; తోరణ...నిలంబులన్ - తోరణ = గోపుర ద్వారములయొక్క; స్తంభాయమాన = కూచేములవలె నాచరించుచున్న; రంభాతరు = అరఁటి మ్రాఁకులయొక్క; కిసలయ = మోవులనెడి - లేఁత యాకు లనెడి; ఉత్తాల = ఉన్నతములయిన; తాళవృంత = విసనకఱ్ఱలవలని; అనిలంబులన్ = వాయువులచేత - గాలిచేత; అరఁటిచెట్ల లేఁత యాకులు కదలుటచేఁ గలిగిన గాలిచేత ననుట; కుంతలంబులు = తలవెండ్రుకలు; చలియింపన్ = కదలియాడఁగా; మంథరగతిన్ = మెల్లని నడకతో; కింపురుషవృషభుండు = కింపురుషులలో శ్రేష్ఠుఁడు; అగు గంధర్వరాజప్రధానుండు = అయిన యిందీవరాక్షుని మంత్రి; ఒసంగుకైదండన్ = ఇచ్చునట్టి చేపట్టును; కొని = గ్రహించి - పట్టుకొని; అల్లనల్లనన్ = మెల్లమెల్లఁగా; నడచి; పురోహిత...నీరంధ్రంబై - పురోహిత = పురోధసుఁడు; బ్రాహ్మణ = విప్రులు; బంధు = చుట్టములు; పురంధ్రీ = ముత్తయిదువలు - అను వీరియొక్క; సందోహ = సమూహముచేత; నీరంధ్రంబయి = సందులులేనిదై; వైవాహిక...కలకలంబునన్ - వైవాహికక్రియా = పెండ్లి పనులయొక్క; ఆరంభ = మొదలుపెట్టునప్పుడు కావలసిన; సంభార = వస్తుసమూహములను దెచ్చుటయందు; సంభ్రమత్ = తత్తఱపడుచున్న; రంభాది మరుద్రంభోరువుల = రంభ మొదలయిన దేవతా స్త్రీలయొక్క; కలికి = మనోహరములైన; నును = మృదువులైన; సోగ = తీగదీసిన ట్టెడ తెగని; పలుకుల = మాటలయొక్క; కలకలంబులన్ = కోలాహలధ్వనులచేత; గొలగొలమను = గొలగొల యనెడి యనుకరణముతో సందడించుచున్న; కౌతుకాగారంబు = పెండ్లిచవికను; చొత్తెంచి = ప్రవేశించి. అనంతర పద్యముతో నన్వయము.

చ. ప్రభలు నభోవిటంకమున * భానుమరీచులఁ బ్రోదిసేయఁ గౌ
స్తుభనిభనూత్నరత్నపరి * శోభితమై గరుడాశ్మవేదిరు
గ్విభవము పొల్పుగుంజవిక * విద్రుమపాదసువర్ణపీఠిపైఁ
బ్రభుత దలిర్ప మామ పను * పన్ వసియించె నుదంచితస్థితిన్. 76

టీ. ప్రభలు = వెలుఁగులు; నభోవిటంకమునన్ = ఆకాశముయొక్క ముందటిభాగమునందలి; భానుమరీచులన్ = సూర్యకిరణములను; ప్రోదిసేయన్ = పోషింపఁగా - పెంపఁగా ననుట; కౌస్తుభ...శోభితమై - కౌస్తుభనిభ = (విష్ణునిదైన) కౌస్తుభ మను మణితో సమానమైన; నూత్నరత్న = క్రొత్తవైన రత్నములచేత; పరిశోభితమై = ఎల్లయెడలఁ బ్రకాశించునదియై; గరు...వము - గరుడాశ్మ = గరుడపచ్చలతో నేర్పఱుపఁబడిన; వేది = అరుఁగుయొక్క; రుగ్విభవము = ప్రకాశముకలిమి; పొల్పుగుంజవికన్ =ఒప్పుచున్న పెండ్లిచావడియందు; విద్రుమ...పైన్ - విద్రుమ= పగడములచేఁ జేయఁబడిన; పాద = కోళ్లుగల; సువర్ణపీఠిపైన్ = బంగారుగద్దియమీఁద; ప్రభుత = ప్రభుత్వము; తలిర్పన్ = అతిశయింపఁగా; మామ = మామయైన యిందీవరాక్షుఁడు; పనుపన్ = నియమింపఁగా; ఉదంచితస్థితిన్ = మిక్కిలి యొప్పిదమైన యునికితో; వసియించెన్ = (స్వారోచి) కూర్చుండెను.

తా. స్వరోచి ముందు చెప్పినచొప్పునఁ బెండ్లిచవిక ప్రవేశించి, మేలైన రత్నకాంతులచేత వెలుఁగుచున్న యా పెండ్లిచవికయందుఁ బచ్చలు దాఁపిన పెండ్లియరుఁగువెంబడిఁ బగడపుఁగోళ్లు వేసిన యెత్తుపీఁటమీఁద నిందీవరాక్షుఁడు కూర్చుండు మని చెప్పఁగాఁ గూర్చుండెను.

క. విధియుతముగ ఖచరుఁ డవ, న్యధినాథున కొసఁగెఁ బసిఁడి * హారివాణమునన్
మధురమఖభుగ్గవీదధి, మధురససంపర్కమయిన * మధుపర్కంబున్. 77

టీ. ఖచరుఁడు = గంధర్వుఁడయిన యిందీవరాక్షుఁడు; అవన్యధినాథునకున్ = భూపతికి - స్వరోచికి; విధియుతముగన్ = శాస్త్రోక్తక్రమముతోఁ గూడుకొనునట్టుగా; పసిఁడిహారివాణమునన్ = బంగారుగిన్నెలో; మధుర...సంపర్కము - మధుర = తియ్యనైన; మఖభుగ్గవీ = దేవతలయావుయొక్క - కామధేనువుయొక్క; దధి = పెరుఁగుతోడ; మధురస = తేనెయొక్క; సంపర్కము = కూడికగలది - కామధేనువుపెరుఁగును, దేనెయును గలసినది యనుట; అయిన మధుపర్కంబున్ = అయినట్టి పెరుఁగు, పాలు, తేనె మొదలగువానిఁ గలిపిన ద్రవ్యమును; ఒసఁగెన్ = ఇచ్చెను. కన్యాదానకాలమునందుఁ బెండ్లికొడుకునకుఁ గన్యకతండ్రి పెరుఁగు, తేనె, పాలు, నెయ్యి, యరఁటిపండు కలిపి పుచ్చుకొనుటకై యిచ్చుట మర్యాద. కనుక నా మర్యాద నడపె నని తెలియునది.

తే. అంచితాకృతి సాక్షాత్క*రించినట్టి, రమకుఁ బ్రతివచ్చు సురమనో*రమ మనోర
మ యనుదాని ననుంగుజా*మాతఁ గైట, భారిసరిగాఁగ నర్చించి*ధారవోసె.

టీ. (ఇందీవరాక్షుఁడు) అనుఁగుజామాతన్ = ముద్దులయల్లుని - స్వరోచిని; కైటభారిసరిగాఁగన్ = విష్ణునితో సమానముగా - విష్ణుదేవుని నర్చించురీతిగా ననుట; అర్చించి = పూజించి; అంచితాకృతిన్ = ఒప్పిదమైన రూపముచేత; సాక్షాత్కరించినట్టి రమకున్ = ప్రత్యక్షమైన లక్ష్మీదేవితో; ప్రతి...రమన్ - ప్రతివచ్చు = సరియగుచున్న; సుర = దేవతలయొక్క; మనోరమన్ = మనస్సులందు రమించుదానిని - దేవతలకుఁ బ్రియమైనదాని ననుట; మనోరమ యనుదానిన్ (తన కొమార్తను); ధారవోసెన్ = ధారాపూర్వకముగా దానముచేసెను - అనఁగా నిందీవరాక్షుఁడు "దాస్యామి విష్ణవే తుభ్యమ్ - విష్ణువైన నీకు నిచ్చుచున్నాను" అను వాక్యమును జెప్పి, కన్యాదానముచేయువారు దానము చేయుదురు గనుక, అల్లుని విష్ణువును బూజించినట్లు పూజించి లక్ష్మీతుల్యురాలైన ముద్దులకూఁతును ధారాపూర్వకముగా దానముచేసె ననుట. అలం. ఉపమ.

క. తదనంతరంబ హర్షము, పొదలుమదిన్ మెట్టుఁబ్రాల * పుట్టికలయెడం
గదియంబట్టిన పెందెరఁ, గదియించిరి బంధుజనులు * కన్యావరులన్. 79

టీ. తదనంతరంబ = కన్యాదానము చేసినతోడనే; బంధుజనులు = చుట్టములు; హర్షము పొదలు మదిన్ = సంతోషము పెరుఁగుచున్న మనసుతో - మనసున సంతోషించి యనుట; మెట్టుఁబ్రాల పుట్టికలయెడన్ = వధూవరుల ముందర రాశిగాఁ బెద్దలు పోయఁదగిన దీవనప్రాలగంపలున్నచోట; కదియంబట్టిన పెందెరన్ = చేరఁబట్టిన పెద్ద తెరచీరను; కన్యావరులన్ = పెండ్లికూఁతును పెండ్లికొడుకును; కదియించిరి = దగ్గఱున్నట్లు చేసిరి. కన్యాదానము చేసినతోడనే పెండ్లిపెద్దలయిన చుట్టములు పెండ్లికూఁతును, పెండ్లికొడుకును సేసఁబ్రాలగంపల వెంబడి కట్టఁబడిన తెర దగ్గఱఁ జేర్చి రనుట.

ఉ. అప్పుడు తూర్యముల్ మొరయ నమ్మిథునమ్ము విలోకనస్పృహం
దెప్పలఁ దేల వంపఁబడు తెల్లనిచీర తెరం గ్రమంబునం
గొప్పు మొగంబు నఱ్ఱుఁ జనుఁగొండలుఁ దోఁప లతాంగి పోలెఁ జె
ల్వుప్పతిలన్ సుధారసప యోనిధి పెందెరఁ బుట్టునిందిరన్. 80

టీ. అప్పుడు = ఆ సమయమునందు; తూర్యముల్ = వాద్యములు; మొరయన్ = మ్రోయఁగా - ధ్వనింపఁగా; అమ్మిథునమ్ము = ఆ వధూవరులు - పెండ్లికూఁతురును, పెండ్లికొడుకును; విలోకనస్పృహన్ = ఒకరి నొకరు చూచుకోరికయందు; తెప్పలన్ తేలన్ = తేలియాడుచుండఁగా - మిక్కిలి యిచ్ఛగలవారై యుండఁగా; వంపఁ... తెరన్ - వంపఁబడు = క్రిందికి దింపఁబడుచున్న; తెల్లని చీర తెరన్ = తెల్లనిదైన తెర-చీరయందు; క్రమంబునన్ = వరుసవెంబడిని; కొప్పును; మొగంబున్ = ముఖమును; అఱ్ఱున్ = మెడయును; చనుఁగొండలున్ = కొండలవలె నున్నతములైన స్తనములును; తోఁపన్ = కనఁబడఁగా; లతాంగి = పెండ్లికూఁతురైన మనోరమ; చెల్వు = చక్కఁదనము; ఉప్పతిలన్ = కలుగునట్లు; సుధా... పెందెరన్ - సుధారసపయోనిధి = పాలసముద్రముయొక్క; పెందెరన్ = పెద్దయలలయందు; పుట్టునిందిరన్ = పుట్టుచున్న లక్ష్మీదేవిని; పోలెన్ = పోలి యుండెను.

తా. ఆ సమయమునందు భేరులు మొదలగు మంగళవాద్యములు మ్రోఁగఁగాఁ బెండ్లికుమార్తెకుఁ బెండ్లికుమారునికి నడుమఁ బట్టఁబడియున్న తెల్లని తెరచీరను ముత్తైదువలు కొంచెము కొంచెముగా దిగువకు దించిరి. అట్లు దించునప్పుడు తెరమఱుఁగుననుండి క్రమముగా మనోరమ యొక్క కొప్పు, ముఖము, మెడ, చన్నులు గనఁబడెను. అట్లు కనఁబడుటచేత నా పెండ్లికూఁతురు పాలసముద్రముయొక్క పెద్దయలవలనఁ బుట్టుచున్న లక్ష్మీదేవిని బోలియుండెను. అలం. ఉపమ.

చ. కటకరవంబు బోరుకలఁ గన్ రమణుల్ తెరచీర వంచినం
దటుకున రాజుమోమెదుటఁ దారసమైన లతాంగినేత్రముల్
చటులత లజ్జఁ దల్లడిలె జాలరిచేవలఁ బాసి ధాత్రిపై
నటు నిటు మిట్టిమిట్టి పడు నంబుచరంబులుఁబోలె నత్తఱిన్. 81

టీ. అత్తఱిన్ = ఆ సమయమునందు; కటకరవంబు = కంకణధ్వని; బోరుకలఁగన్ = గల్లున మ్రోయఁగా; రమణుల్ = స్త్రీలు; తెరచీర = తెరగుడ్డను; వంచినన్ = క్రిందికి దింపఁగా; తటుకునన్ = తటాలున; రాజుమోము = రాజైన స్వరోచి ముఖము; ఎదుటన్ = ఎదుటితట్టు; తారసమైనన్ = సమీపింపఁగా; లతాంగి నేత్రముల్ = తీగవంటి దేహముగలదైన మనోరమకన్నులు; చటులతన్ = చంచలత్వముచేతను; లజ్జన్ = సిగ్గుచేతను; జాలరిచేవలన్ = చెంబడివానిచేతి వలనుండి; పాసి = తొలఁగి - తీసి క్రింద వేయఁబడి; ధాత్రిపైన్ = భూమిమీఁద; అటునిటున్ = ఆతట్టు నీతటును; మిట్టిమిట్టి = ఎగిరి యెగిరి; పడు నంబుచరంబులుఁబోలెన్ = పడునట్టి చేఁపలవలెనే; తల్లడిలెన్ = చలించెను.

తా. స్త్రీలు వధూవరుల నడుమఁ బట్టిన తెరగుడ్డను దించునప్పుడు పెండ్లికొడుకు మొగము పెండ్లికూఁతురుదగ్గఱఁ గానవచ్చెను. అంతటఁ బెండ్లికూఁతురు బెదరుచూపులతోఁ జూచెను. అలం. ఉపమ.

మ. అవనీశత్రిదశేంద్రుచూపుబరి కక్ న్యాగండపాళిద్వయీ
నవలావణ్యరసంబుఁ గొల్లగొని యంతం తెంత ఫాలంపురా
జు విలోకించి చలించి కైకొనిన యా సొమ్మెల్ల ఘర్మాంబుకై
తవ మొప్పన్ వెస డించి తూఁచెఁ గబరీ తాపింఛకుంజాంతమున్. 82

టీ. అవ...బరి - అవనీశత్రిదశేంద్రుఁడు = రాజదేవేంద్రునియొక్క - స్వరోచియొక్క; చూపు బరి = దృష్టియనెడి దొంగ; కన్యా...రసంబున్ - కన్యా = పెండ్లికూఁతురుయొక్క; గండపాళిద్వయీ = చెక్కిటి ప్రదేశముల జంటయొక్క; నవ = క్రొత్తయయిన; లావణ్యరసంబున్ = ముత్తెపుసీటివలెఁ దళతళలాడెడి కాంతివిశేషమును; కొల్లగొని = దోఁచుకొనిపోయి; అంతన్ = అట్లు దోఁచుకొని పోవునప్పుడు; చెంతన్ = సమీపప్రదేశమునందు; ఫాలంపురాజున్ = అర్ధచంద్రునివంటి నొసలనెడి రాజును; విలోకించి = చూచి; చలించి = దిగులుచేత వణఁకి; కైకొనిన యా సొమ్మెల్లన్ = తా నపహరించిన లావణ్యరసమనెడి ధనమునెల్లను; ఘర్మాంబుకైతవము = చెమటనీరనెడి నెపము; ఒప్పన్ = పొందుపడఁగా; వెసన్ = శీఘ్రముగా; డించి = దిగవిడిచి; కబరీ...తమున్ - కబరీ = కొప్పనెడి; తాపింఛ = చీఁకటిచెట్లయొక్క; కుంజాంతమున్ = పొదరింటిలోపలను; తూఁచెన్ = దూఱెను.

తా. రాజశ్రేష్ఠుఁడయిన స్వరోచియొక్క చూపనెడి దొంగ - చెక్కిళ్ల కాంతియనెడి ధనమును దొంగిలి వెంటనే నొసలనెడి రాజును జూచి వెఱచి వణఁకుచుఁ, జెమటయనెడి మిషచేఁ దాను దొంగిలించిన ధనమును జాఱవిడిచి, కొప్పనెడి చీఁకటిమ్రాని పొదరింటిలో దాఁగె నని తాత్పర్యము. రాజు చెక్కిళ్లను దొలుతఁ జూచి, క్రమముగా నాపల నొసటిని, గొప్పును జూచె నని భావము. (ఇందుఁ జక్షుఃప్రీతి యనెడి మన్మథావస్థయు, స్వేద మనెడి సాత్త్వికభావమును రాజునందుఁ దెలుపనయ్యెను.) అలం. రూపకము, అపహ్నుతియు.

ఆ. రాజుచూడ్కి కపుడు రాజీవముఖిచూడ్కి
యెదురుకొనియె లజ్జఁ గొదికి కొదికి
జడిసిజడిసి జహ్నుసంభవాంభోవేణి
కెదురులెక్క మీలకొదమ లనఁగ. 83

టీ. అపుడు = ఆ సమయమునందు; రాజుచూడ్కికిన్ = రాజైన స్వరోచి చూపునకు; రాజీవముఖి చూడ్కులు = పద్మమువంటి ముఖముగలదైన మనోరమచూపులు; లజ్జన్ = సిగ్గుచేత; కొదికి కొదికి = జంకి జంకి; జడిసి జడిసి = చలించి చలించి; జహ్నుసంభవాంభోవేణికిన్ = గంగానదీప్రవాహమునకు; ఎదురులెక్క = ఎదురీఁదుకొని పోవునట్టి; మీలకొదమలు అనఁగన్ = చేఁపపిల్లలో యేమో అనునట్లు; ఎదురుకొనియెన్.

తా. అపుడు పెండ్లికొడుకు పెండ్లికూఁతును జూడఁగాఁ, బెండ్లికూఁతురు పెండ్లికొడుకును జూడఁగా, నా యిరువురి చూపులు నొకటొకటి యెదురులొక్కలు చేసిన ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

మ. తనుమధ్యత్రివళుల్ సలంప నిలమీఁ దకన్ [1]మట్టియల్ మోయఁగాఁ
గనుపాపల్ పయిటెప్పలం గదియ ను త్కంఠాగ్రయై నిక్క నా

---

1. మెట్టియల్. పా.

ధునిమౌళిం దలఁబ్రాలు వ్రాసె నవలా దోర్మూలకూలంకష
స్తనవిస్ఫూర్తికి సందిదండలధళల్ సాహోనినాదం బిడన్.

టీ. తనుమధ్యత్రివళుల్ =సన్నని నడుమును, గడుపుమీఁది మూఁడు ముడుఁతలును; న
కదలియాడఁగా; ఇలమీఁదన్ = భూమిపైని; మట్టియల్ = కాలిమెట్టెలు; మోవఁగాన్ =
కనుపాపల్ = కంటినల్లగుడ్డులోని ప్రతిరూపములు; పయిఱెప్పలన్ = మీఁదిఱె
కదియన్ = చేరుకొనఁగా; ఉత్కంఠాగ్రయై = ఎత్తఁబడిన కుత్తుకకొన గలదై; నిక్కి
నిగిడి; దోర్మూల...స్ఫూర్తికిన్ - దోర్మూల = చంకలయొక్క; కూలంకష = ప్రక్కల
చున్న; స్తనవిస్ఫూర్తికిన్ = పాలిండ్లయొక్క పొంగునకు; సందిదండలధళల్ = సం
యొక్క ధళధళ యనెడి కాంతులు; సాహోనినాదంబిడన్ = పరాకు తెలిపెడి ధ్వనిని
జేయఁగా; నవలా = వనిత - మనోరమ; నాథునిమౌళిన్ = పెనిమిటియైన స్వరోచితలపై
బ్రాలు = తలమీఁదఁబోయఁదగిన సేసలను; వ్రాసెన్ - అనఁగా మనోరమ యొయ్యా
మగనితలపై సేసలు దిగఁబోసె ననుట. అలం. స్వభావోక్తి.

చ. ముడివడు కంకణప్రభల ముత్తెపుసేసలు దోయిలించి యె
త్తెడుతఱి బాహుమూల కుచ దీప్తులపైఁ బతిదృష్టి పర్వినం
బొడమినలజ్జఁ బాణియుగ ముర్వె వెస వంచియ మౌళిమీఁదికై
పొడవునఁ జల్లె లేనగవు పొల్తుక ఱెప్పల నప్పళించుచున్.

టీ. పొల్తుక = ఆఁడుది - మనోరమ; ముడి...ప్రభలన్ - ముడివడు = పెనఁగొ
కంకణప్రభలన్ = ముంజేతి కడియముల కాంతులతో; ముత్తెపుసేసలు = ముత్యాలతల
దోయిలించి = దోసిటఁబట్టి; ఎత్తెడుతఱిన్ = పైకెత్తునపుడు; బాహుమూల కుచదీప్తుల
చంకలయొక్కయు, స్తనములయొక్కయుఁ గాంతులమీఁద; పతిదృష్టి = పెనిమిటియొక్క
పర్వినన్ = వ్యాపింపఁగా; పొడమినలజ్జన్ = కలిగినసిగ్గుచేత; పాణియుగమున్ = రెండు
వెసన్ = శీఘ్రముగా; వంచియ = క్రిందికి వంచియే; లేనగవు = చిఱునవ్వును; ఱెప్పల
ళించుచున్ = కను ఱెప్పలచేత కప్పుచు; మౌళిమీఁదికై = ప్రియునితలమీఁది తట్టునకు
వునఁజల్లెన్ = ఎగఁజల్లెను.

తా. అప్పుడు మనోరమ తలఁబ్రాలు పోయుటకై సేసలు దోసిటఁబట్టి పైకెత్త
ప్రియుఁడు చంకలకాంతులమీఁదను, స్తనములమీఁదను దృష్టిపఱపెను. అది తెలిసి యూ
పైకెత్తకయే భర్తతలపైఁ బడునట్లు సేస లెగఁజల్లెను. (ఇం దవహిత్థము సూచితము.)

క. సకలక్ష్మాపతి యిడఁ గొ, మ్మకచంబులనుండి రాలె మౌక్తికముల
త్త్వికజనితగండఘర్మాం, బుకదంబాసారగరిమఁ బునరుక్తములై.

టీ. సకలక్ష్మాపతి = చక్రవర్తియయిన స్వరోచి; ఇడన్ = తలఁబ్రాలుపోయఁగా
కచంబులనుండి = మనోరమ తలవెండ్రుకలయందుండి; మౌక్తికములు = ముత్యాలు; సా
గరిమన్ - సాత్త్వికజనిత = సాత్త్వికభావమువలనఁబుట్టిన (సత్త్వము = మనోవృత్తి - ద
బుట్టినది సాత్త్వికము - సాత్త్వికము అను భావము సాత్త్వికభావము); గండ =
యందలి; ఘర్మాంబు కదంబ = చెమటనీటి సమూహముయొక్క; ఆసార = ఎడతెగక

నట్టి వానయొక్క; గరిమన్ = గౌరవముచేత - ఆధిక్యముచేత; పునరుక్తములై = ఇబ్బడించినవై; రాలెన్ = జలజల రాలెను.

తా. పెండ్లికొడుకైన స్వరోచి తలఁబ్రాలు పోయఁగా, మనోరమదేహమునందుఁ జెమట పట్టి యా చెమటబిందువులును, దలఁబ్రాల ముత్యములును జేరి యిబ్బడియై, మబ్బును బోలిన తల వెంట్రుకలనుండి యెడతెగనివాన కురిసినట్లు జలజల రాలెను. అలం. ఉపమ.

క. పతి సతిపై నిడు ముక్తా, వితతి పడందొడఁగె వడి భ విష్యత్పురుషా
యిత నిర్దయరతి రభస, చ్యుత సిత కబరీప్రసూన సూచక మగుచున్. 87

టీ. పతి = భర్తయయిన స్వరోచి; సతిపైన్ = భార్యయైన మనోరమమీఁద; ఇడు ముక్తావితతి = పోయునట్టి సేసముత్యాల సమూహము; భవిష్య...మగుచున్ - భవిష్యత్ = మీఁదటి కాలమునందలి; పురుషాయిత = పురుషునివలె నాచరించునట్టి; నిర్దయ = దయమాలిన; రతి = సంభోగముయొక్క - గాఢమయిన యుపరతియొక్క యనుట; రభస = వేగముచేత; చ్యుత = రాలునట్టి; సిత = తెల్లని; కబరీప్రసూన = కొప్పునందలి పువ్వులను; సూచకము = సూచించునది - ఇట్లు రాలునని తెలుపునది; అగుచున్; వడిన్ = వేగముతో; పడందొడఁగెన్ = రాలనారంభించెను.

తా. ఆ సమయమునందు స్వరోచి తలఁబ్రాలు పోయఁగా నా తలఁబ్రాలముత్యములు మనోరమతలపైనుండి రాలుట యిఁకమీఁద నామె చేయఁబోవు గాఢోపరతికాలమునందుఁ గొప్పునందుండి తెల్లని పువ్వు లిట్లే రాలు నని సూచించున ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

శా. కట్టెన్ మంగళసూత్రమున్ శరధిశం ఖశ్రీలకున్ బొమ్మలం
గట్టంజాలెడు కంఠపీఠి, నిఖిల క్ష్మాభర్త శోణద్యుతుల్
దట్టంబై నఖకోరకోత్కరము త ద్గ్రైవేయహైమస్ఫుర
త్పట్టస్థాపిత పద్మరాగముల పం క్తంబుల్ విడంబింపఁగాన్. 88

టీ. నిఖిలక్ష్మాభర్త = సార్వభౌముఁడయిన స్వరోచి; శోణద్యుతుల్ = ఎఱ్ఱనికాంతులు; దట్టంబై = తఱుచై; నఖకోరకోత్కరము = గోళ్లనెడి మొగ్గలయొక్క సమూహము; తద్గ్రైవేయ...పంతంబుల్ - తత్ = ఆ మనోరమయొక్క; గ్రైవేయ = కంఠాభరణమైన; హైమ = బంగారుదైన; స్ఫురత్ = వెలుఁగుచున్న; పట్ట = పట్టెడయందు; స్థాపిత = పొదుగఁబడిన; పద్మరాగముల = కెంపులయొక్క; పంతంబుల్ = వెలుఁగుల యాధిక్యరీతులను; విడంబింపఁగాన్ = వంచింపఁగా - పోలఁగా ననుట; (మహాపురుషులగోళ్లెఱ్ఱగా నుండు నని సాముద్రికశాస్త్రము నందుఁ జెప్పఁబడియున్నది గనుక స్వరోచిగోళ్ళెఱ్ఱగా నుండు నని యెఱుంగునది.) శరధిశంఖశ్రీలకున్ = సముద్రమునందలి శంఖములయొక్క సౌందర్యసంపదలకు; బొమ్మలం గట్టన్ = జయించి వానిరూపములు చెక్కిన గండపెండేరములఁ దాల్పను; చాలెడు కంఠపీఠిన్ = చాలినట్టి మనోరమ కంఠప్రదేశమునందు; మంగళసూత్రమున్ = తాలిబొట్టును; కట్టెన్.

తా. అనంతరము స్వరోచి పద్మరాగములవలెఁ జేతివ్రేళ్ళగోళ్లు రక్తకాంతితో వెలుఁగుచుండఁగా దక్షిణావర్తశంఖములను మించి వట్రువయై యొప్పుచున్న మనోరమమెడను దాలిబొట్టు కట్టెను. అలం. ఉపమ.

క. అట్టియెడఁ బెండ్లిపనులన్, దిట్టలగు పురంధ్రు లచట । నిలిపిరి వహ్నిం;
బెట్టిరి మణిపీఠి; సురీ, పట్టము పైఁ బఱచి; రందుఁ । బతియును సతియున్. 89

టీ. అట్టియెడన్ = ఆ బొట్టుగట్టిన సమయమునందు; పెండ్లిపనులన్ = పెండ్లిపనులయందు; దిట్టలు = నేర్పరులు; అగు పురంధ్రులు = అయినట్టి ముత్తయిదువలు; అచటన్ = ఆ పెండ్లియరుఁగునొద్ద; వహ్నిన్ = (హోమమునకొఱకైన) యగ్నిని; నిలిపిరి = తెచ్చియుంచిరి. మణిపీఠిన్ = రత్నములుపొదిఁగిన పెండ్లిపీఁటను; పెట్టిరి = తెచ్చివేసిరి. పైన్ = ఆపెండ్లిపీఁటమీఁద; సురీపట్టము = సురీదేశపుఁబట్టుపచ్చడమును - సూరత్తుపట్టుతాపితా ననుట; పఱచిరి = పఱపుగాఁ గప్పిరి. అందున్ = అట్టి పట్టుతాపితా కప్పిన పెండ్లిపీఁటపయిని; పతియున్ = రాజైన స్వారోచియును; సతియున్ = రాణియైన మనోరమయును. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. మాంగల్యధారణమైన పిమ్మట ముత్తయిదువలు పెండ్లియరుఁగుమీఁదఁ బెండ్లిపీఁటవేసి, దానిపై సూరత్తు పట్టుతాపితా పఱచి, దాని కెదుట హోమార్థముగా నగ్నిని పెట్టఁగా, వధూవరులా పెండ్లిపీఁటపైఁ గూర్చుండిరి.

క. ఆశు ద్విజ హుత హరిత శ, మీశాఖాశకల నినద । మేదుర విశదా
భీశు జ్వాలాజాల హు, తాశ క్రోడమున వేల్చి । రాహుతు లెలమిన్. 90

టీ. ఆశు...క్రోడమునన్ - ఆశు = త్వరితముగా; ద్విజ = బ్రాహ్మణులచేత; హుత = హోమము చేయఁబడిన; హరిత = పచ్చని; శమీశాఖాశకల = జమ్మిపుడకసమిధలయొక్క; నినద = చిటచిటధ్వనులతోడ; మేదుర = దట్టమైన; విశద = స్వచ్ఛమైన; అభీశు = ప్రకాశముగల; జ్వాలాజాల = మంటల సమూహముగల; హుతాశ = అగ్నియొక్క; క్రోడమునన్ = నడుమ; ఎలమిన్ = సంతోషముతో; ఆహుతులు = వేల్వఁదగిన నేయి మొదలగు ద్రవ్యములను; వేల్చిరి = వేసి హోమముఁ జేసిరి.

తే. తోయజామోద లాజలు । దోయిలించి
ప్రమదమున వేల్వ నొకకొన్ని । చెమట నంట
వ్రేళ్లు గనుపట్టెఁ గెంజాయ । వీతిహోత్రు
నాలుకలు సాటిరాకున్న । నవ్వ ననఁగ. 91

టీ. తోయజామోద = కమలముల వాసనవంటి దేహవాసనగల మనోరమ; లాజలు=పేలాలు; దోలియించి = దోసిటఁబట్టి; ప్రమదమునన్ = సంతోషముతో; వేల్వన్ = హోమముచేయఁగా; ఒకకొన్ని = ఆ పేలాలలోఁ గొన్ని; చెమటన్ = చెమటచేత; అంటన్ = (వ్రేళ్ళలో) అంటుకొనఁగా; వ్రేళ్లు = ఆ వ్రేళ్లు; కెంజాయన్ = ఎఱ్ఱనిచాయచేత; వీతిహోత్రు నాలుకలు = అగ్నిజిహ్వలు - నిప్పుమంటలు; సాటిరాకున్నన్ = తమ్ము సరిపోలకుండుటచే; నవ్వన్ అనఁగన్ = ఆ యగ్నిజ్వాలలను పరిహసించెనో అనునట్లుగా; కనుపట్టెన్ = కనఁబడెను.

తా. లాజహోమము చేయునప్పుడు పెండ్లికూఁతురైన మనోరమ దోసిటఁబట్టిన కొన్ని పేలాలు వ్రేళ్లనంటుకొనఁగా, నా పేలాల తెల్లనికాంతిచేత నగ్నిజ్వాల లెఱుపునఁ దమ్ముఁ బోలవని యా వ్రేళ్లు నవ్వి పరిహాసము చేయుచున్నవో యనున ట్లుండెను. (పేలాలకును నవ్వునకును ధవళకాంతి సాధర్మ్యము గ్రహింపవలయును.) అలం. ఉత్ప్రేక్ష.

తే. స్తనగుళుచ్ఛవధూదేహదాడిమీల, తామతల్లికపై హోమ ధూమ మడరె
భర్తకభిమతరతిమహాఫలవిపాక, మగుటఁ గోరి ఘటించు దోహద మనంగ.

టీ. స్తన...పైన్ - స్తన గుళుచ్ఛ = చన్నులనెడి పూగుత్తులతోడి; వధూ = పెండ్లికొమార్తె యొక్క; దేహ = శరీరమనెడి; దాడిమీలతామతల్లికపైన్ = దానిమ్మచెట్టుయొక్క శ్రేష్ఠమైన కొమ్మమీఁద; హోమధూమము = హోమముయొక్క పొగ; భర్తకున్ = పెనిమిటికి; అభిమత రతి = అభీష్టమైన సంభోగ మనెడి; మహాఫల = ఘనమైన ప్రయోజనరూపమైనపండు; విపాకము అగుటన్ =విశేషపక్వమగుటను - చక్కఁగాఁ బండుటను; కోరి=అపేక్షించి; ఘటించు దోహదము అనంగన్ = పొందించునట్టి దోహదక్రియయో అనునట్లు; అడరెన్ = వ్యాపించెను. (దోహదము అనఁగా వృక్షములు, తీగెలు మొదలగువానియందుఁ బువ్వులు లోనగునవి కలుగుటకై చేయునట్టి క్రియ; "ధూమస్పర్శాత్తు దాడిమీ" అని ఫలదోహద ప్రకరణమునందుఁ జెప్పఁబడినప్రమాణ మిట గ్రాహ్యము.)

తా. హోమసమయమునందుఁ బూచిన దానిమ్మకొమ్మవలె నున్న మనోరమ దేహముపై వ్యాపించిన పొగ, యా దానిమ్మకొమ్మయందు శీఘ్రముగా రతిరూపఫలము ఫలించి పక్వమగుటకై చేయునట్టి దోహదక్రియయో యనున ట్లుండెను. అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

మ. జగతీనాథవతంస మానతశిర స్సమ్మేళనన్ నెయ్యపుం
జగడంబుల్ ప్రియ మొప్ప మాన్పెడుతఱిం జంచత్కిరీటాగ్రర
త్నగణస్పర్శసహంబు గావలసియో నాఁ గోర్కి దైవాఱ న
మ్మగువం బాదతలంబు వట్టి సనెకల్ మట్టించె మోదంబునన్. 93

టీ. జగతీనాథవతంసము = రాజశ్రేష్ఠుఁడు - స్వరోచి; ఆనత...ళనన్ - ఆనత = వంపఁబడిన; శిరస్సమ్మేళనన్ = తలయొక్క చేరికతో; నెయ్యపుంజగడంబుల్ = (ఇఁకమీఁద) కలుగఁబోవు ప్రణయకలహములను; ప్రియము ఒప్పన్ = ప్రేమ ఒప్పుచుండఁగా; మాన్పెడు తఱిన్ = తీర్చునట్టి సమయమునందు; చంచ...సహంబు - చంచత్ = ప్రకాశించుచున్న; కిరీటాగ్ర = కిరీటము చివరయందలి; రత్నగణ = మణిసమూహముయొక్క; స్పర్శ = తాఁకుడును; సహంబు = ఓర్చుట; కావలసినయో నాన్ = కావలయుట నపేక్షించియో అనునట్లు; కోర్కి = తనయొక్క కోరిక; దైవాఱన్ = అతిశయింపఁగా; మోదంబునన్ = సంతోషముతో; అమ్మగువన్ = పెండ్లికూఁతురైన యా మనోరమను; పాదతలంబు పట్టి=అఱకాలు పట్టుకొని; సనెకల్ = సన్నెకాతిని - నూఱుడుబండను; మట్టించెన్ = త్రొక్కించెను.

తా. పెండ్లికొడుకైన స్వరోచి వంగి తలవంచి పెండ్లికొమార్తె కాలు పట్టుకొని సన్నెకల్లు త్రొక్కించెను. అది యిఁకమీఁదఁ గలుగఁబోవు ప్రణయకలహము తీర్ప మ్రొక్కునప్పుడు తన కిరీటమునందుఁ జెక్కఁబడిన రత్నములును తాఁకే కనుక వానియొరపిడి నోర్చుటకు నలవాటుచేయుటకై యామెపాదములు సోఁకునట్లు తల వంచి సన్నెకల్లు త్రొక్కించెనో యన్న ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

క. కడు నవ్వించుచుఁ జెఱఁగులు, ముడివెట్టన్ బేరఁటాండ్రు ముదిత కనుబోమల్
ముడివెట్టె నాలిసిగ్గున, ముడిపెట్టెన్ నారి చెఱఁగు మోసున మరుఁడున్. 94

టీ. పేరఁటాండ్రు = పేరంటమునకు వచ్చిన ముత్తయిదువలు; కడున్ = మిక్కిలి; నవ్వించుచున్ = నవ్వునట్లు చేయుచు; చెఱఁగులు = వధూవరుల చీరచెఱఁగులు; ముడివెట్టన్ = ముడి వేయఁగా; ముదిత = మనోరమ; నాలిసిగ్గునన్ = కపటపుసిగ్గుచేత; కనుబొమల్ ముడిపెట్టెన్ = కోపము నొందినదానివలె మొగము ముడుఁచుకొనెను. మరుఁడున్ = మన్మథుఁడును; చెఱకు మోసునన్ = చెఱకుమొలకయందు - తనవిల్లయిన చెఱకునందనుట. నారి = అల్లెత్రాటిని; ముడి వెట్టెన్ = ముడివేసెను. ఎక్కుపెట్టె ననుట.

తా. పేరఁటపు ముత్తయిదువలు నవ్వు పుట్ట మాటలాడుచుఁ గొంగుముళ్లువేయఁగా, సిగ్గుచేత మనోరమ కోపించినట్లు బొమముడి చూపెను. తోడనే వధూవరులకుఁ బరస్పరము వలపును జనించెను. అలం. ఆవృత్తిదీపకము.

సీ. పరిణమించిరి ధరామరపురంధ్రీహస్త, ఘటిత చేలాంచల గ్రంథికలనఁ;
బరిపూర్ణనిష్ఠఁ గొల్చిరి ప్రదక్షిణపూర్వ, వినతి నాలుక లార్చువేఁడివేల్పు;
వీక్షించి రుడువీథి నక్షీణసుస్థితి, స్థాయిఁ దోషితరమాధవుని ధ్రువునిఁ;
బరిణయప్రాప్తసప్తర్షిప్రియాప్రేక్ష్య, సాక్షాదరుంధతీసతి కెరఁగిరి;
తే. సకల సంయమిగణ నమస్కరణకృత్య, మాచరించి తదీయ హస్తాభిమంత్రి
తాక్షతలు మౌళిఁదాల్చి రత్యాదరమున, దంపతులు బంధుకోటికుత్సవ మెలర్ప.

టీ. దంపతులు = వధూవరు లిద్దఱును; బంధుకోటికిన్ = చుట్టాల సమూహమునను; ఉత్సవము ఎలర్పన్ = వేడుక అతిశయింపఁగా; ధరామర...కలనన్ - ధరామరపురంధ్రీ = బ్రాహ్మణులముత్తయిదువలయొక్క; హస్త = చేతులచేఁ గూర్పఁబడిన; చేలాంచలగ్రంథికలనన్ = కొంగుముళ్ల కూడికచేత; పరిణమించిరి = సంతోషించిరి. నాలుకలార్చు వేఁడివేల్పున్ = నాలుకలాడించుచున్న (జ్వాల లెగయించుచున్న) యగ్నిదేవుని; ప్రదక్షిణపూర్వవినతిన్ = ప్రదక్షిణము ముందుగలుగునట్టుగాఁ జేసెడి నమస్కారముచేత - ముందు ప్రదక్షిణమును, దరువాత నమస్కారమును జేసి యనుట; పరిపూర్ణనిష్ఠన్ = నిండిన నియమముతో; కొల్చిరి = సేవించిరి. ఉడువీథిన్ = నక్షత్రమార్గమునందు - ఆకాశమునందు; అక్షీణసుస్థితిస్థాయిన్ - అక్షీణ = తగ్గని; సుస్థితి = మంచి యునికిచేత; స్థాయిన్ = ఉండెడివానిని; తోషితరమాధవునిన్ = సంతోషింపఁజేయఁబడిన లక్ష్మీభర్తయైన విష్ణుదేవుఁడు గలవానిని - తపస్సుచేసి విష్ణువును మెప్పించినవాని ననుట; ధ్రువునిన్ = ఔత్తానపాదిని - ధ్రువనక్షత్రమును; వీక్షించిరి = చూచిరి. పరిణయ...సతికిన్ - పరిణయ = పెండ్లికి; ప్రాప్త = వచ్చిన; సప్తర్షిప్రియా = సప్తమహామునుల భార్యలలోపల; ప్రేక్ష్య = చూడఁదగినదైన; సాక్షాత్ = ప్రత్యక్షమయిన; అరుంధతీసతికిన్ = పతివ్రతాశిరోమణియైన యరుంధతీదేవికి; ఎరఁగిరి = మ్రొక్కిరి; సకల...కృత్యము - సకల = సమస్తమయిన; సంయమిగణ = మునులసమూహమునకు; నమస్కరణ = నమస్కరించుట యనెడి; కృత్యము = వ్యాపారమును; ఆచరించి = చేసి; తదీయ...క్షతలు - తదీయహస్త = వారి చేతులవలని; అభిమంత్రిత = మంత్రములచేఁ బరిశుద్ధములుగాఁ జేయఁబడిన; అక్షతలు = దీవనఁబ్రాలు; అత్యాదరమునన్ = మిక్కిలి యక్కఱతో; మౌళిన్ = తలపయిని; తాల్చిరి = ధరించిరి.

తా. ఆ దంపతులు తమ చుట్టములు హర్షింపఁగా బ్రాహ్మణులైన ముత్తయిదువలు వేసిన కొంగుముళ్లకు సంతోషించిరి. హోమాగ్నికిఁ బ్రదక్షిణనమస్కారములు చేసిరి. ధ్రువదర్శనము చేసిరి.

అరుంధతీదర్శనము చేసి మ్రొక్కిరి. పెండ్లివేడుక చూడవచ్చియున్న మునులకెల్ల నమస్కరించి, వారు వేసిన శోభనాక్షతలు తలల ధరించిరి. (వివాహకాలమునందు ఆయుర్వృద్ధికై ధ్రువదర్శనమును, పాతివ్రత్యసిద్ధికై యరుంధతీ దర్శనమును వధూవరులచేఁ జేయింతురు.)

ఉ. కూరిమిమంత్రితోడ నల ♦ కూబరుఁ డేకతమాడి పెద్ద బం
గారపుఁగోరఁ గల్పవని ♦ కాజనికాంతములైన చీరలున్
హారవిభూషణావళియు ♦ నమ్మిథునంబునకుం బ్రియంబుతో
నారదమానిచేత నద ♦ నం జదివించెఁ గుబేరుపేరుగాన్. 96

టీ. నలకూబరుఁడు; కూరిమిమంత్రితోడన్ = తన ప్రియమంత్రితో; ఏకతమాడి = రహస్యముగా నాలోచనచేసి; పెద్దబంగారపుఁ గోరన్ = పెద్దదయిన బంగారపుఁ బళ్లెరమునందు ; కల్పవనికాజనికాంతములు - కల్పవనికా = కల్పవృక్షములవనమునందు; జని = పుట్టుకకలుగుటచేత - పుట్టినవగుటచేత ననుట; కాంతములు = మనోహరములు; ఐన చీరలున్ = అయినట్టి వస్త్రములును; హారవిభూషణావళియున్ - హార = ముత్యాలపేరులు లోనగు; విభూషణ = ఆభరణముల యొక్క; ఆవళియున్ = పంక్తియును - సమూహమును; ప్రియంబుతోన్ = ప్రీతితో; అమ్మిథునంబునకున్ = ఆ దంపతులకు; నారదమానిచేత; అదనన్ = ఆశీర్వచన సమయమునందు; కుబేరుపేరుగాన్ = తన తండ్రియయిన కుబేరుని పేరిట; చదివించెన్ = కట్నము చదివించెను. ఆ దంపతులకు నాశీర్వచనసమయమునందు నలకూబరుఁడు తనతండ్రియైన కుబేరునిపేరిటఁ గల్పవృక్షము వలనఁ బుట్టిన వెలలేని వస్త్రాభరణములను జదివించె నని తాత్పర్యము.

క. కలిమి మెఱయంగ మఱియుం, గల బాంధవు లొసఁగి రపుడు ♦ కాంచనమణిభూ
షలుఁ జీరలు నరపతికిం, బొలఁతికి నుడుగరలు ముదము ♦ పొదలఁగ నంతన్.

టీ. అపుడు = ఆ సమయమునందు; మఱియున్ = నలకూబరుఁడు చదివించినపిమ్మట; కల బాంధవులు = ఉండునట్టి చుట్టములు; కలిమి మెఱయంగన్ = తమ తమకుఁ గల సంపద ప్రకాశింపఁగా - తమ తమ కలకొలఁది ననుట. కాంచనమణిభూషలున్=బంగారపుసొమ్ములును; చీరలున్ = వస్త్రములును; ముదము పొదలఁగన్ = సంతోషము వర్ధిల్లఁగా; నరపతికిన్ = రాజునకును - స్వరోచికిని; పొలఁతికిన్ = స్త్రీకిని - మనోరమకును; ఉడుగరలు = బహుమానములుగా; ఒసఁగిరి = ఇచ్చిరి - చదివించి రనుట. అంతన్ = అనంతరము. తర్వాతి పద్యముతో నన్వయము.

సీ. పొగడపూవంటి కం ♦ పుల మదాంబువులును
మధువర్ణ దంతశో ♦ భములు మెఱయ,
భీకరస్వరచారు ♦ బృంహితంబులు ఘనాం
గారకగ్రహకాంతి ♦ కన్ను లమర,
నిలఁ జుట్టువడు తొండ ♦ ములు మించు పూర్వాంగ
మెత్తరంబై పిఱుం ♦ దత్తమిల్లఁ,
గటము లుత్కటములై ♦ నిటలముల్ బటువులై
సిబ్బెంపుమొగముల ♦ నుబ్బు మీఱ,

తే. స్వర్ణకక్ష్యాంకుశ ప్రాస • శరధి శార్ఙ్గ
ఖేట కుథ ఘంటికాద్యలం • కృతులఁ జెలువ
మెసఁగు గంభీరవేదిభ • ద్రేభశతము
నల్లునకు నిచ్చె గంధర్వ • వల్లభుండు. 98

టీ. పొగడ...వులును - పొగడపూవంటి = పొగడపూవుల పరిమళమువంటి; కంపుల = పరిమళముగల; మదాంబువులును = మదజలములును; మధు...ములు - మధువర్ణ = తేనెవన్నెగల; దంతశంబములు = వజ్రాయుధములను బోలిన కొమ్ములును; మెఱయన్ = ప్రకాశింపఁగాను; భీకర...బులు - భీకర = భయంకరములైన; స్వర = కంఠస్వరముతోడి; చారు = ఒప్పిదములయిన; బృంహితంబులు = ఘీంకారములును; ఘనాం...కన్నులు-ఘన = అధికమయిన; అంగారకగ్రహ = అంగారకగ్రహముయొక్క; కాంతి=కాంతివంటి కాంతిగల-ఎఱ్ఱగానుండెడి; కన్నులు; అమరన్ = ఒప్పఁగాను; ఇలన్ = భూమియందు; చుట్టువడు = చుట్టగాఁబడుచున్న - మిక్కిలి నిడుపులైన; తొండములన్=తొండములచేత; మించు పూర్వాంగము=అతిశయించునట్టి ముందటిభాగపుదేహము; ఎత్తరంబై=ఉన్నతమయి; పిఱుందు= వెనుకటిభాగపుదేహము; అత్తమిల్లన్=ఆనతమయి యుండఁగాను - తగ్గియుండఁగాను; కటములు = చెక్కిళ్లు; ఉత్కటములై = విశాలములై; నిటలములు = నొసళ్లు; బటువులై = వట్రువులై; సిబ్బెంపుమొగములన్ = పొడలుగల ముఖములయందు; ఉబ్బుమీఱన్ = ఉబుకు అతిశయింపఁగా; స్వర్ణ...కృతులన్ - స్వర్ణ=బంగారుపూఁతగల; కక్ష్యా = నడికట్టుపట్టు; అంకుశ = అంకుశమనెడి యాయుధము; ప్రాస = ఈఁటె; శరధి = అమ్ములపొది; శార్ఙ్గ = శిఖరములుంచిన విల్లు; ఖేట = డాలువారు; కుథ = మీఁదఁబఱచెడి కంబళి; ఘంటికా = గంట; ఆది = మొదలగునవియైన; అలంకృతులన్ = అలంకారములచేత; చెలువము = అందము; ఎసఁగు...శతమున్ - ఎసఁగు = అతిశయించునట్టి; గంభీరవేది = ఎడతెగని మదముతోఁగూడిన గంభీరవేది జాతివైన; భద్రేభ = భద్రజాతి యేనుఁగులయొక్క; శతమున్ = నూటిని - నూఱు భద్రజాతి యేనుఁగుల ననుట; గంధర్వవల్లభుండు = గంధర్వరాజైన యిందీవరాక్షుఁడు; అల్లునకున్ = అల్లుఁడైన స్వరోచికి; ఇచ్చెన్ = అరణముగా నిచ్చెను. (గంభీరవేదిలక్షణము - శ్లో. "త్వగ్భేదా చ్ఛోణితస్రావా న్మాంసస్య చ్యవనాదపి। ఆత్మానం యో న జానాతి స స్యాద్గంభీరవేదికః" అనఁగా దేహమునందుఁ దోలూడినను, నెత్తురుగారినను, మాంసము తెగిపడినను దెలియని మదపుటేనుఁ గేది గలదో యది గంభీరవేది యనం బరగు నని యర్థము. అలం. స్వభావోక్తి, ఉదాత్తమును.

శా. ఉర్వీజానికి మామ యిచ్చె శిఖిపిం • ఛోద్భాసివర్ణంబుచే
నర్వాచీనఘనాళి రోహితసహ • స్రాకీర్ణగా మింటఁ బూ
షార్వస్తోమముఁ జిత్రయానముల నూ • టాడించు గాంధర్వగం
ధర్వవ్యూహము దీప్తి చండమణికాం • డస్వర్ణసన్నాహమున్. 99

టీ. మామ = శ్వశురుఁడయిన యిందీవరాక్షుఁడు; ఉర్వీజానికిన్ = భూపతియైన యల్లునికి; శిఖిపింఛోద్భాసివర్ణంబుచేన్ = నెమిలిపించెవన్నెవలెఁ బ్రకాశించునట్టి వన్నెచేత; అర్వాచీన ఘనాళి = నేలకు దిగిన మేఘపంక్తి; రోహిత...కీర్ణగాన్-రోహిత=వంకరలేని యింద్రధనుస్సులయొక్క; సహస్ర=వేయింటిచేత; ఆకీర్ణగాన్=వ్యాపించిన దగునట్లుగా; దీప్తి...సన్నాహమున్-

దీప్తి=కాంతిచేత; చండ = తీక్ష్ణములైన- మిక్కిలి వెలుఁగుచున్న; మణికాండ=రత్నసమూహములు గూర్చిన;స్వర్ణసన్నాహముꣳ = బంగారుకవచము గలదానిని; మింటꣳ =ఆకాశమునందు; పూషార్చిస్తోమమునుꣳ = సూర్యునిగుఱ్ఱముల సమూహమును; చిత్రయానములꣳ = పెక్కుతెఱఁగుల వింతనడకలచేత; ఊటాడించు...వ్యూహమున్ - ఊటాడించు = ఉఱ్ఱూఁత లూఁగించునట్టి - తిరస్కరించునట్టి; గాంధర్వ = గంధర్వులదైన; గంధర్వవ్యూహముꣳ = గుఱ్ఱములగుంపును; ఇచ్చెన్.

తా. మఱియు నల్లునికి నా గంధర్వరాజు నెమిలిపురివన్నెగలిగి పెక్కులయిన వంకరలేని యింద్రధనుస్సులతోఁడఁగూడి నేలకు దిగివచ్చిన మేఘములో యనునట్లు మిక్కిలి వెలుఁగుచు, రత్నములు గూర్చిన పల్యాణములు వైచినవానిని, ఆకాశమునఁ బాఱునట్టి సూర్యుని గుఱ్ఱములను దిరస్కరింపఁజాలిన పలుతెఱఁగుల వింతనడకలుగలవానిని, గంధర్వులవైనవానిని గుంపులకొలఁది గుఱ్ఱముల నరణముగా నిచ్చెను. అలం. ఉపమ, ఉత్ప్రేక్షయు.

క. తళతళని తరణిమెఱుఁగులఁ, దలతల మను మణుల మెఱసి ౹ తలఁచినచోటꣳ
నిలుచు విమానము ఖేచర, కులతిలకుఁడు కూర్మిపెండ్లి ౹ కొడుకున కొసఁగెన్.

టీ. ఖేచరకులతిలకుఁడు = గంధర్వవంశశ్రేష్ఠుఁడు - ఇందివరాక్షుఁడు; తళతళని తరణిమెఱుఁగులꣳ = తళతళయని వెలుఁగుచున్న సూర్యునివెలుఁగులను; తలతలము = తొలఁగుచు తొలఁగుచు; అను మణులꣳ =అనునట్టి రత్నములచేత - సూర్యకాంతులను మించి వెలుఁగునట్టి మణులచేత ననుట; మెఱసి = ప్రకాశించి; తలఁచినచోటꣳ = ఒడయఁడు తలంచినతావునందు; నిలుచు విమానముꣳ = నిలుచునట్టిదయిన యాకాశమునఁ బోవునట్టి రథమును; కూర్మిపెండ్లికొడుకునకుꣳ = ప్రేమాస్పదుఁడయిన యల్లునికి - స్వరోచికి; ఒసఁగెꣳ = ఇచ్చెను.

వ. మఱియు రజత మహారజత శయ్యాసన భాజన డోలా కలాచికా ఘట కటాహ వీటికాపేటికాది గృహోపకరణంబులును, మరకత కురువింద పురుషరత్న పురందరమణి మౌక్తికాది మహారత్నఘటిత కటక తులాకోటి కంఠికాంగదైకావళీకాంచికోర్మికాది కలాపకలాపంబులును, విచిత్ర నేత్ర పేశల కౌశేయ చీనాంశుక ధట్టంబులం బెట్టినట్టి పెట్టియలును, అమూల్యాగరు మృగమద సంకుమద కుంకుమ పటీర కర్పూర హిమాంబుపూరంబులు దట్టుపునుంగు నగరుసత్తును మంచిగందవొడి చాఁదుదయభాస్కరంబు లోనుగాఁ గల పరిమళద్రవ్య సంభార పరంపరలును, జవ్వనంపుఁగ్రొవ్వున నివ్వటిల్లి మవ్వంపువాతెఱలు విప్ప నవ్వునునుసోగ వెన్నెలలంగలసి పిసాళించు చంచల దృగంచల ప్రభలం బచారించి, మొలుంగుఁజన్నులఁ గన్నెతమ్మిమొగ్గలవన్నె నటమటించి, వెన్నెఱుల మెఱుంగుఁదుమ్మెదవన్నెఁ దటమటించి, నెన్నడుముల విన్నువెన్ను దన్ని, బటువుమిగిలి విటనికాయంబు రాయిడిం బడి పుటపుటనైన కూలంకష చాటువుల మాటకారితనంబు మెఱసి నాగరికపుఁబనుల గరగరికల గళరవచ్ఛలాలాపాచరణంబుల రవణంబుల మిసమిసలఁ బసగలిగి మేలిమైన కులుకుల రసికజనంబుల మనంబుల మరులుకొలుపంజాలి సురుచిరాభరణభూషితంబగు పరిచారికాసహస్రంబును గూతునకు నరణంబుగా నిచ్చి మఱియును. 101

టీ. మఱియున్ = (అట్లు అల్లుని కిచ్చినదిగాక) ఇంకను; కూఁతునకున్ = కొమార్తెయయిన మనోరమకు; రజత...బులును - రజత = వెండివియు; మహారజత = బంగారువియు నైన; శయ్యా = పానుపులు; ఆసన = పీఁటలు; భాజన = పళ్లెరములు; డోలా = ఉయ్యాలమంచములు; కలాచికా = తమ్మపడిగములు; ఘట = బిందెలు; కటాహ = కొప్పెరలు; వీటికాపేటికా = వక్కలాకుల పెట్టెలు; ఆది = మొదలుగాఁగల; గృహోపకరణంబులును = ఇంటిపనిముట్లును; మరకత... బులును - మరకత = పచ్చలు; కురువింద = కోయిలకన్నువన్నెగల కెంపులు; పురుషరత్న = మగ రాలు - రవలు; పురందరమణి = ఇంద్రనీలములు; మౌక్తికా = ముత్యాలు; ఆది = మొదలయిన; మహారత్న = గొప్పమణులచేత; ఘటిత = కూర్పఁబడిన; కటక = కడియములు; తులాకోటి = అందెలు; కంఠికా = కంటెలు; అంగద = బాహుపురులు; ఏకావళీ = ఒంటిపేట రత్నాల హారములు; కాంచికా = మొలనూళ్లు; ఊర్మికా = ఉంగరములు; ఆది = మున్నగాఁగల; కలాప = ఆభరణములయొక్క; కలాపంబులును = సమూహములును; విచిత్ర...బులన్ - విచిత్ర = వింత లయిన; నేత్రపేశల = చూపున కందములైన - మృదువులైన; కౌశేయ = పట్టుతోనేసిన; చీనాంశుక = చీనాదేశపుఁజీరలయొక్క; ధట్టంబులన్ = సమూహములను; పెట్టినట్టి పెట్టియలును = ఉంచినపెట్టెలును; అమూల్య...పూరంబులు - అమూల్య = వెలలేని; అగరు = చేవగందపుఁ జెక్కలు; మృగమద = కస్తూరి; సంకుమద = జవ్వాజి; కుంకుమ = కుంకుమపువ్వు; పటీర = మంచి గందము; కర్పూర = పచ్చకప్పురము; హిమాంబుపూరంబులు = పన్నీటిప్రవాహములు - కావలసి నంతపన్నీరు; తట్టుపునుఁగు = గడ్డవాటుపునుఁగు; అగరుసత్తును=అగరుగంధపుధృతియు - అగరు వలనఁ దీసిన యత్తరును; మంచిగందవొడి=మంచిగందపుఁజెక్కవలని బుక్కాముపొడి; చాఁదు = చాఁది బొట్టు పెట్టుకొనెడి ద్రవ్యవిశేషము; ఉదయభాస్కరంబు = ఉదయభాస్కర మనెడి రంజకద్రవ్యవిశేషము; లోనుగాన్ = మొదలుగా; కల...లును - కల = కలిగిన; పరిమళ = మంచి వాసనగల; ద్రవ్యసంభార = వస్తువుల సమూహములయొక్క; పరంపరలును = వరుసలును; జవ్వనంపుఁగ్రొవ్వునన్ = యౌవనమదముచేతను; నివ్వటిల్లి = అతిశయించి; మవ్వంపువాతెఱలు = కోమలములయిన పెదవులు; వివ్వన్ = విచ్చునట్లు; నవ్వు...వెన్నెలలన్ - నవ్వు = నగవులనెడి; నును = లేఁతయయిన; సోగ = తీగలుసాగుచున్న; వెన్నెలలన్ = చంద్రప్రకాశములను; కలసి = కూడి; పిసాళించు...ప్రభలన్ - పిసాళించు = ప్రకాశించుచున్న; చంచల = చలనముగల; దృగంచల ప్రభలన్ = కన్నుఁగొనల కాంతులను; పచారించి = ప్రసరింపఁజేసి; మెఱుంగుఁ జన్నులన్; కన్నె...వన్నె - కన్నె = పరువముగల; తమ్మిమొగ్గల = మొగ్గలుగా నున్న పద్మముల యొక్క; వన్నెన్ = గౌరవమును; అటమటించి = వంచించి - తిరస్కరించి; పెన్నెఱులన్ = నొక్కులు గల నిడుపాటి తలవెండ్రుకలచేత; మెఱుంగుఁ దుమ్మెదవన్నెన్ =మెరయుచున్న తుమ్మెదలయొక్క వర్ణమును; తటమటించి = వంచించి - తక్కువపఱచి; నెన్నడుములన్ = మనోహర ములయిన మధ్యములచేత; విన్ను = ఆకాశమును; వెన్నుదన్ని = వీఁపుదన్ని - లోఁబఱచుకొని; బటువు మిగిలి = దృఢత్వము హెచ్చి; విటనికాయంబురాయిడిన్ = విటకాండ్రసమూహము యొక్క యొరపిడిని; పడి = పొంది; పుటపుటనైన కూలంకషచాటువులన్ = గడిదేఱిన దరుల నొరయునట్టి - సమగ్రమైన చమత్కారపు మాటలచేత; మాటకారితనంబు = వాచాలత్వము; మెఱసి = ప్రకాశింపఁజేసి; నాగరికపుఁబనుల గరగరికలన్ = నాణెములయిన పనులయందలి మనోజ్ఞతలచేత; గళరవచ్ఛలాలాపాచరణంబులన్ - గళరవ = రతికాలమునందలి కంఠధ్వనుల వంటి కంఠధ్వనులయొక్కయు; ఛలాలాప = అభిప్రాయగర్భితములయిన మాటలాడుటయొక్కయు;

ఆచరణంబులన్ = నడపుటలచేతను; రవణంబుల మిసమిసలన్ = సొమ్ములయొక్క కాంతులచేతను; పసగలిగి = సత్తుగలిగి; మేలిమైన కులుకులన్ = శృంగారముగాఁ గదలించునట్టి మేలయిన యవయవముల కదలికలచేత; రసికజనంబుల మనంబులన్ = సరసులైన పురుషులయొక్క మనసులను; మరులుకొలుపన్ = మోహింపఁజేయను; చాలి = సమర్థమై; సురుచిరాభరణ భూషితంబు - సురుచిర = మిక్కిలి ప్రకాశించునట్టి; ఆభరణ = సొమ్ములచేత; భూషితంబు = అలంకరింపఁబడినది; అగు పరిచారికాసహస్రంబున్ = అయిన దాసీసహస్రమును - వేగురు పనికత్తెలనుట; అరణంబుగాన్ = కన్యాధనముగా; ఇచ్చి; మఱియును = ఇంకను. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. మఱియు నా గంధర్వరాజు కొమార్తెయయిన పెండ్లికూఁతునకు వెండి బంగారములతోఁ జేసిన యింటి పనిముట్లును, రత్నమయములయిన బహువిధాభరణములును, బలుతెఱఁగుల సరిగపట్టు వస్త్రములును, వస్త్రాభరణము లుంచుకొనెడి రత్నములు చెక్కిన పెట్టెలును, అగరు, జవ్వాజి, పచ్చకర్పూరము మొదలయిన పరిమళద్రవ్యములును, జక్కఁదనమును, శృంగారచేష్టలును గలిగి, యౌవనవతులయి, పనులయందు నాగరకతతో మెలఁగ నేర్చిన పెక్కండ్రు పరిచారికలను అరణముగా నిచ్చెను. అలం. ఉపమ.

సీ. అవనతాంగుష్ఠాగ్ర ♦ హార్య నిర్యద్రత్న
ఖని ఘనాంతరిత శృం ♦ గాటకములు,
మదముదావహ దివ్య ♦ మైరేయధౌరేయ
గోత్రభిద్విటపిని ♦ ష్కుటయుతములు,
మహిళాకదంబ డిం ♦ భగ్రాహ్య గృహచర
న్మృగనాభి సౌరభ్య ♦ నిర్భరములు,
ప్రఖరాఖు నఖరధా ♦ రావిదీర్ణోద్దీర్ణ
సౌవర్ణమృత్కీర్ణ ♦ జాంగలములు,
తే. కోక కలహంస ముఖరితా ♦ బ్జాకరములు,
సిద్ధ చారణ గంధర్వ ♦ సేవితములు,
మందరద్రోణిఁ గొన్ని గ్రా ♦ మములు గూర్మి
తనయ పసుపునఁ గొసఁగె గం ♦ ధర్వవిభుఁడు. 102

టీ. గంధర్వవిభుఁడు = గంధర్వరాజయిన యిందీవరాక్షుఁడు; అవనత...ములు - అవనత = వంపఁబడిన; అంగుష్ఠ = కాలి బొటనవ్రేలియొక్క; అగ్ర = కొనచేత; హార్య = హరింపఁదగినవై; నిర్యత్ = బయలుదేఱుచున్న; రత్న = మణులయొక్క; ఖని = గనులచేత; ఘన = దట్టముగా; అంతరిత = క్రమ్మకోఁబడిన; శృంగాటకములు = చదుకములు గలవియును; మద...ములు - మదముదావహ = మత్తతను, సంతోషమును కలిగించునట్టి; దివ్య = శ్రేష్ఠమైన; మైరేయ = చెఱకురసము లోనగువానితోఁ జేసిన మద్యమునకు; ధౌరేయ = భారవహులైన; గోత్రభిత్ = ఇంద్రునిదైన; విటపి = కల్పవృక్షములతోఁ గూడిన; నిష్కుటయుతములు= ఇంటి తోఁటలతోడఁ గూడినవియును; మహిళా...ములు - మహిళాకదంబ = స్త్రీల సమూహముచేతను; డింభ = పసిపిల్లల

చేతను; గ్రాహ్య = గ్రహింపఁదగిన; గృహ = ఇండ్లయందు; చరత్ = తిరుగుచున్న; మృగ = కస్తూరిమృగములయొక్క; నాభి = పొక్కిళ్లవలనఁ గలిగిన కస్తూరియొక్క; సౌరభ్య = పరిమళముల చేత; నిర్భరములు = నిండుకొన్నవియును; ప్రఖరా...ములు - ప్రఖర = మిక్కిలి వాఁడులైన; ఆఖు = ఎలుకలయొక్క; నఖరధారా = గోళ్ల మొనలచేత; విదీర్ణ = త్రవ్వఁబడి; ఉద్గీర్ణ = బయలువెడలిన; సౌవర్ణమృత్ = బంగారుమట్టిచే; కీర్ణ = చెదరి వ్యాపించిన; జాంగలములు = మెరకనేలలు గలిగినవియును; కోక...ములు - కోక = చక్రవాకపక్షులచేతను; కలహంస = రాజహంసలచేతను; ముఖరిత = ధ్వనింపఁజేయఁబడిన; అబ్జాకరములు = తామరకొలఁకులు గలిగినవియును; సిద్ధచారణగంధర్వసేవితములు = సిద్ధులచేతను, చారణులచేతను, గంధర్వులచేతను సేవింపఁబడునవియునైన; మందరద్రోణిక్ = కవ్వపుఁగొండ లోయలోనివైన; కొన్ని గ్రామములు = కొన్ని యూళ్లు; కూర్మితనయ పసుపునకున్ = ప్రియపుత్రికయైన మనోరమ పసుపుఁగుంకుమములకుఁగాను; ఒసఁగెన్ = ఇచ్చెను.

తా. తరువాత నిందీవరాక్షుఁడు తనకూఁతునకుఁ బసుపున కని మందరపర్వతము లోయలోని తనయూళ్లను గొన్నిటి నిచ్చెను. అవి కాలిగ్రేలు సోఁకినమాత్రమునఁ బెల్లగిలి వచ్చునట్టి రత్నపుగనులు గల చదుకములతోను, మత్తును, సంతోషమును బొందించునట్టి పూఁదేనె లోనగువానివలననైన మద్యముల నొసఁగెడి కల్పవృక్షములతోడను, పసిపిల్ల, లాఁడువాఁరు వలసినట్లు కస్తూరి గైకొనుట కనువుగా నిండ్లలోఁ దిరుగుచున్న కస్తూరిమృగములతోను, ఎలుకలు త్రవ్వి వెదచల్లుటచే నెల్లయెడల బంగారుమట్టి నిండుకొన్న మెరకనేలలతోను, చక్రవాకములు, హంసలు మొదలుగాఁ గల జలపక్షులకు విహారస్థానములైన సరోవరములతోను, సిద్ధచారణాదుల సంచారస్థానములతోను మనోహరములై యొప్పుచుండెను. అలం. ఉదాత్తము.

తే. పౌరయాత్రిక సుర సిద్ధ ♦ చారణాహి
యక్ష గంధర్వ సాధ్య వి ♦ ద్యాధరులను
నిజపురంబుల కనిచె నిం ♦ దీవరాక్షుఁ
డుడుగర లొసంగి విభవంబు ♦ గడలుకొనఁగ. 103

టీ. ఇందీవరాక్షుఁడు; పౌర...ధరులను - పౌరయాత్రిక = తమ తమ పురములకుఁ బయనమైన; సుర = దేవతలు; సిద్ధ = సిద్ధులు; చారణ = చారణులు; అహి = నాగులు; యక్ష=జక్కులు; గంధర్వ = గంధర్వులు; సాధ్య = సాధ్యులు; విద్యాధరులను = విద్యాధరులునయిన పెండ్లికి వచ్చినవారలను; విభవంబు కడలుకొనఁగన్ = (తనదైన) యైశ్వర్యము అతిశయింపఁగా - తన కలిమికిఁ దగినట్లనుట; ఉడుగరలు = కట్నములను - కానుకలను; ఒసంగి = ఇచ్చి; నిజపురంబులకున్ = వారివారి సొంత పట్టణములకు; అనిచెన్ = పంపెను.

వ. అనిన విని జైమినిమునీంద్రుండు మీఁదటి వృత్తాంతం బానతీవలయు నని
యడుగుటయును. 104

టీ. అనినన్ = అని పక్షులు చెప్పఁగా; విని; జైమినిమునీంద్రుండు = మునిశ్రేష్ఠుఁడయిన జైమిని; మీఁదటి వృత్తాంతంబు = తరువాతి వర్తమానము (కథ); ఆనతీవలయున్ = చెప్పవలయును; అని యడుగుటయున్ = అని యడుగఁగా. దీనికి మీఁది యాశ్వాసములోని 'బాదరాయణాంతేవాసి కిట్లనియె' ననుదానితో నన్వయము.

శా. అతులక్షాంతిగభీర ! భీరహితచిత్తాంభోజ ! భోజక్షమా
పతి విద్యాపరిపాక ! పాకరిపు శుంభద్భోగ! భోగాశిప
త్త్రితరస్స్ఫూర్త్యనుభావ ! భావభరిత శ్రీకాంత ! కాంతార పా
తితకాళింగకులేశ ! లేశతరవృత్తిక్షీణవైరివ్రజా ! 105

టీ. అతుల...గభీర ! - అతుల = ఈడులేని; క్షాంతి = ఓర్పుచేత; గభీర ! = గంభీరుఁడా ! - మిక్కిలి యోర్పు గలవాఁడా ! యనుట; భీ...భోజ ! - భీరహిత = భయములేని; చిత్తాంభోజ ! = మనఃకమలము గలవాఁడా ! - వెఱపు లేనివాఁడా ! యనుట; భోజ...పాక !- భోజక్షమాపతి = భోజరాజుయొక్క; విద్యాపరిపాక ! = విద్యాపరిపాకమువంటి విద్యాపరిపాకము గలవాఁడా ! - విశేషమైన విద్యాసంపత్తి గలవాఁడా ! యనుట; పాక...ద్భోగ ! పాకరిపు = ఇంద్రునిదైన; శుంభత్ = అతిశయించుచున్న; భోగ ! = సుఖానుభవమువంటి సుఖానుభవము గలవాఁడా ! భోగా...భావ ! భోగాశిపత్త్రి = సర్పదేహములను దినెడి పక్షియొక్క - గరుత్మంతునియొక్క; తరః = వడివంటి వడియొక్క; స్ఫూర్తి = ప్రకాశముయొక్క; అనుభావ ! = మహిమ గలవాఁడా ! భావ...కాంత ! భావ = మనస్సునందు; భరిత = భరింపఁబడిన - నిలుపఁబడిన; శ్రీకాంత = లక్ష్మీభర్తయయిన విష్ణువుగలవాఁడా ! - సదా విష్ణుస్మరణ చేయువాఁడా! యనుట; కాంతార...లేశ ! - కాంతార = కాఱడవులయందు; పాతిత = పడవేయఁబడిన; కాళింగకులేశ! = కళింగదేశాధిపతియైన గజపతిరాజుగలవాఁడా ! - గజపతిరాజును గాఱడవులకుఁ దఱిమినవాఁడా ! యనుట; లేశ...వ్రజా ! - లేశతర = మిక్కిలి తక్కువయగు; వృత్తి = జీవనోపాయమునందును; క్షీణ = క్షయించిన; వైరివ్రజా ! = శత్రుసమూహము గలవాఁడా ! - శత్రువులకు లేశమాత్రము జీవనము లేకుండునట్లు చేసినవాఁడా ! యనుట.

తా. మిక్కుటమయిన యోర్పును, వెఱపులేమియు, విద్యాసంపత్తియు, నింద్రభోగము, గరుడవేగమును, సదావిష్ణుస్మృతియు, శత్రువుల నణఁచుశక్తియు గలవాఁడా ! (ఇదియును, తర్వాతి రెండు పద్యములును గృతిపతియైన కృష్ణరాయనికి సంబుద్ధులు. అమరమున 'భోగ స్సుఖే స్త్ర్యాదిభృతా వహేశ్చ ఫణకాయయోః' అని యుండుటవలన భోగశబ్దమునకు సర్పపు శరీరమును, ఫణమును నర్థమగును గనుక తద్విశిష్టమయిన సర్పము నిట గ్రహింపవలయును.) అలం. నిదర్శన.

క. నాగాంబాసుత! జితకద, నాగతమదనాగ సంగమానూపగృహా
భోగా! భోగపురందర !, భోగీంద్రశయాన పురుష పూజాప్రవణా ! 106

టీ. నాగాంబాసుత ! = నాగమ్మకొమారుఁడా ! జిత...భోగా ! - జిత = జయింపఁబడిన; కదన = యుద్ధములవలన; ఆగత = వచ్చిన; మదనాగ = మదపుటేనుఁగులయొక్క; సంగమ = కూడికచేత; అనూప = జలప్రాయదేశమైన - జవుకునేలయైన; గృహ = ఇంటియొక్క; ఆభోగ ! = పరిపూర్ణత్వముగలవాఁడా ! భోగపురందర ! = సుఖానుభవమునం దింద్రుఁడా ! భోగీంద్ర...ప్రవణా ! - భోగీంద్ర = సర్పరాజైన శేషుఁడే; శయాన = పానుపుగాఁగల; పురుష = పరమపురుషుఁడైన విష్ణునియొక్క; పూజా = అర్చననునందు; ప్రవణా ! = ఆసక్తుఁడా !

తా. నాగమ్మ కొమారుఁడవై యుద్ధములయందు గెలుపుకొని తెచ్చిన మదపుటేనుఁగుల మదజలముచేత జవుకునేలగా నేర్పడిన నగరియందు శేషశయనుఁడైన విష్ణునిఁ బూజించుచు నివసించి వర్తించువాఁడా ! కృష్ణరాయా ! అలం. నిదర్శన.

మాలిని. సరభస జయధాటీచండ వేదండకోటీ
కరవమధుహిమానీ కంపితాశావధూటీ
పరమహిత హసంతీ భావభాగ్భూరితేజః
పరుషదహనకీలా ప్రస్ఫురచ్చక్రవాళా! 107

టీ. సరభస . చక్రవాళా ! - సరభస = వేగిరపాటుతోఁ గూడిన; జయధాటీ = దిగ్విజయముకొఱకయిన యుద్ధయాత్రయందు; చండ = భయంకరములైన; వేదండకోటీ = ఏనుఁగుల గుంపుయొక్క; కర = తొండములవలని; వమథు = తుంపురు లనెడి; హిమానీ = మంచు తెఱలచేత; కంపిత = వణఁకింపఁబడిన; ఆశావధూటీ = దిక్కులనెడి స్త్రీలకు; పరమహిత = మిక్కిలి మేలయిన; హసంతీభావభాక్ = కుంపటితనమును బొందుచున్న; భూరి = అధికమైన; తేజః = ప్రతాపమనెడి; పరుష = తీక్ష్ణమయిన; దహన = అగ్నియొక్క; కీలా = మంటలచేత; ప్రస్ఫురత్ = ప్రకాశించుచున్న; చక్రవాళా ! = చక్రవాళపర్వతము కలవాఁడా ! - అనఁగా నసంఖ్యములయిన యేనుఁగులదండు గలిగి యీ భూమియం దెల్లయెడలను వ్యాపించిన ప్రతాపము చేత వెలసినవాఁడా ! కృష్ణరాయా ! యనుట. అలం. రూపకము.

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధ కవితామతల్లి కాల్లసాని చొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము. 108

ఈ గద్యమునకు నర్థము ప్రథమాశ్వాస గద్యమునకుంబోలె గ్రహించునది.



# స్వారోచిష మనుచరిత్రము

## టీకా తాత్పర్య సహితము

### షష్ఠాశ్వాసము



క. శ్రీకృష్ణరాయమనుజేం
ద్రా! కాంతాపంచబాణ! నరసింహధరి
త్రీకాంత గర్భవార్నిధి
రాకాహిమధామ! కర్పరదళవిరామా! 1

టీ. శ్రీకృష్ణరాయమనుజేంద్రా! = శ్రీకృష్ణదేవరాయఁ డను పేరుగల మహారాజా! కాంతాపంచబాణ! = స్త్రీలకు మన్మథుఁడా! - స్త్రీలను మోహింపఁజేయుటయందు మన్మథునివంటివాఁడా! నర... ధామ - నరసింహ = నరసింహదేవరాయ లనెడి; ధరత్రీకాంత = రాజుయొక్క; గర్భవార్నిధి = కడుపనెడి సముద్రమునకు; రాకాహిమధామ! = నిండు పున్నమ నాఁటి చంద్రుఁడా! కర్పరదళవిరామా! - కర్పరదళ = ధూర్తులయిన తురకలదండుయొక్క; విరామా! = నిలుపుదల గలవాఁడా! - తురకలదండు నణఁచినవాఁడా! యనుట.

తా. చక్కఁదనముచేత మన్మథునివలె స్త్రీలకు మోహము పుట్టించువాఁడవును, నరసింహదేవరాయని కొమారుఁడవును, దుష్టులయిన తురకలదండు నణఁచినవాఁడవు నైన శ్రీకృష్ణదేవరాయ మహారాజా! (ఇది కృతిపతికి సంబోధనము.) అలం. రూపకము.

వ. అవధరింపుము శకుంతంబు లబ్బాదరాయణాంతేవాసి కిట్లనియె నంత నొక్క
నాఁడు. 2

టీ. అవధరింపుము = చిత్తగింపుము - వినుము; శకుంతంబులు = కథచెప్పెడి పక్షులు; అబ్బాదరాయణాంతేవాసికిన్ = ఆ వ్యాసశిష్యుఁడయిన జైమినిమునితో; ఇట్లనియెన్ = ఇట్లని చెప్పెను. అంతన్ = పెండ్లివేడుకలన్నియు నైనతరువాత; ఒక్కనాఁడు = ఒక దినమునందు.

సీ. పాండురప్రభఁ గ్రిందు వడిన చీఁకటివోలె, జిగి నొప్పు నీలంపు జగతి మెఱసి
యౌన్నత్యమున మ్రింగికొనట్టినింగులు గ్రక్కు, కరణిధూపము గవాక్షముల వెడల
ధారుణీసతి సుగంధద్రవ్యములు దాఁచు, నరలపేటిక వోలెఁ బరిమళముల
నెలవులై చెలువారు నిలువులవిలసిల్లి, కోణిగఁ బారావత కులము వదరఁ

తే. బసిఁడినీట లిఖించిన ప్రతిమ లమర, నీఁగ వాలిన నందంద యెలుఁగులొసఁగు
నట్టి సకినలమంచము లాదిగాఁగ, మెఱయు పరికరముల నొప్పు మేడమీఁద.

టీ. పాండుర ప్రభఁ = తెల్లని కాంతిచేత; క్రిందువడిన చీఁకటివో లెఁ = అడుగంటిన చీఁకటియో యనునట్లు; జిగిఁ = మెఱుఁగుచేత; ఒప్పు నీలంపుజగతిఁ = ఒప్పునట్టి యింద్రనీల మణులు దాఁపిన నేలచేత; మెఱసి = ప్రకాశించి; ఔన్నత్యమునఁ = పొడుగుచేత; మ్రింగినట్టి నింగులఁ = తనలోపల నణఁచుకొన్న యాకాశములను; క్రక్కు-కరణిఁ = వెడలఁగ్రక్కు-నట్లు; ధూపము = అగురు మొదలగువాని వాసనతోడిపొగ; గవాక్షములఁ = కిటికీలనుండి; వెడలఁ = బయలువెడలుచుండఁగా; ధారుణీసతి = భూమి యనెడి యిల్లాలు; సుగంధద్రవ్యములు = పరిమళ వస్తువులను; దాఁచు నరల పేటికవోలెఁ = దాఁచిపెట్టునట్టి యరలు గలిగిన పెట్టెవలె; పరిమళ ముల నెలవులై = మంచివాసనల కునికిపట్లయి; చెలువారు నిలువులఁ = అందగించుచున్న యంత స్తులచేత; విలసిల్లి = ఒప్పి; కొణిగఁ = ముంజూరునందు; పారావతకులము = పావురాలగుంపు; పదరఁ = కూయుచుండఁగా; పసిఁడినీటఁ = బంగారపునీటిచేత; లిఖించిన ప్రతిమలు = వ్రాయఁ బడినచిత్తరుబొమ్మలు; అమరఁ = ఒప్పఁగా; ఈఁగవాలినను; అందంద = అప్పటి కప్పుడే; ఎలుఁ గులు = ధ్వనులు; ఒసఁగునట్టి సకినలమంచములు = ఇచ్చునట్టి కృత్రిమపక్షులు కీఁచుబిళ్లలు గల పట్టెమంచములు; ఆదిగాఁగఁ = మొదలుగా; మెఱయు పరికరములఁ = ప్రకాశించుచున్న యుపకరణములతో; ఒప్పు మేడమీఁదఁ = ఉండునట్టి యుప్పరిగమీఁద. తరువాతి కన్వయము.

తా. దిగువతట్టు నీలాలు దాఁపిన యరుఁగు లొప్పఁగాను, మిన్నంటిన పొడుగుగలిగి కిటికీల నుండి ధూపములపొగలు వెడలఁగాఁ బరిమళములచే నిండుకొన్నయంతస్తు లొప్పఁగాను, బంగారు నీటిచేతఁ జిత్తరువులు వ్రాయఁబడి కీచుబిళ్లలు మొదలగునవి యమర్చిన పట్టెమంచములు లోనగు వానిచే నొప్పుచున్న యుప్పరిగమీఁదను. అలం. ఉత్ప్రేక్ష, అతిశయోక్తియు.

క. రమణునికడ కనుప మనో, రమకుఁ మజ్జనము దీర్చి ॥ రవరవ కచపిం
ఛమునకుఁ గాలాగురుధూ, పము వెట్టి జవాది నంటు ॥ వాపి నిపుణతన్. 4

టీ. రమణునికడకుఁ = ప్రియునియొద్దకు; అనుపఁ = పంపుటకై; మనోరమకుఁ = పెండ్లికూఁతురైన మనోరమకు; మజ్జనము తీర్చి = అభ్యంజనస్నానము నెఱవేర్చి - చేయించి; (క్రింది పద్యములోని 'నెచ్చెలుల పిండు' కర్త.) రవరవకచపింఛమునకుఁ = తళతళ మెఱయుచున్న నెమిలికుంచెవంటి తలవెండ్రుకల సమూహమునకు; కాలాగురుధూపము = నల్లయగరుపొగ; పెట్టి = వేసి; జవాదిఁ = జవ్వాజిమెఱుఁగుచేత; అంటు పాపి = ఆ తలవెండ్రుకల చిక్కు- తీసి; నిపు ణతఁ = నేర్పుతో. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. చెలికత్తెలు మనోరమను ఔనిమిటియొద్దకుఁ బనుపుటకై తలయంటి స్నానము చేయించి, తళతళలాడుచున్న నెమిలికుంచెనుబోలిన తలవెండ్రుకలకు నల్లయగరుధూపము వేసి, జవ్వాజిమెఱుఁ గుతో నా తలవెండ్రుకల చిక్కు- దీసిరి. అలం. రూపకము.

సీ. చెంగల్వపూఁదండ ॥ [1]చెరివి పెందుఱుముపై, ఘనసారమున సూస ॥ కము ఘటించి
పన్నీటితోఁ గదం ॥ బము చేసి మృగనాభిఁ, బూసి కుంకుమ సేస ॥ బొట్టు తీర్చి
విశద ముక్తాదామ ॥ రశనఁ జందురకావి, వలిపపు వలువపై ॥ నలవరించి
యెఱుత వెన్నెలగాయు ॥ హార మొక్క-టి పెట్టి, మణులసొమ్ములు మేన ॥ మట్టుపఱిచి

1. చేర్చి. పా.

తే. కన్నుఁగవ గెల్చి డాకాలఁ గట్టెననఁగ, ఘల్లుఘల్లునఁ బెండెంబుఁ గండుమీలు
గదల నల్లన నడపించి పొదివి తెచ్చె, నెచ్చెలులపిండు యువతి నా నృపతికడకు.

టీ. నెచ్చెలులపిండు = స్నేహాతిశయముగల చెలికత్తెల సమూహము; చెంగల్వపూదండ = చెంగల్వపూవుల సరమును; చెరివి = కొప్పునఁదురిమి; పెందురుముపైన్ = పెద్దదైన యా కొప్పు మీఁద; ఘనసారమునన్ = పచ్చకర్పూరముతో; సూసకము = పుష్పమాలికలు గూర్చి చేసిన కొప్పువలను; (తిరుగుడుబిళ్ల నని కొందఱు. ఘనసార మనఁగా అధికమయిన స్థిరాంశము; అట్టి స్థిరాంశముగల జడబిళ్ల నమర్చి యని కొందఱు.) ఘటించి = కూర్చి; పన్నీటితోన్ = హిమాంబువుతో; కదంబుముచేసి = కలిపి; మృగనాభిన్ = కస్తూరిని - కస్తూరిచందనము ననుట; పూసి = దేహమునందుఁ బూసి; కుంకుమన్ = కుంకుమపువ్వుతో; సేసబొట్టు తీర్చి = అక్షింతలబొట్టు దిద్ది - నొసటఁబెట్టి యనుట; విశద...రశనన్ - విశద = స్వచ్ఛమయిన; ముక్తాదామ = ముత్యాలసరములచే రచియించిన; రశనన్ = మొలనూలిని; చందుర...పైన్ - చందురకావి = కుసుమపూవన్నెగల; వలిపపు = సన్నఁదనముగల; వలువపైన్ = చీరమీఁద; అలవరించి = సవరించి - పెట్టి యనుట; అఱుతన్ = మెడను; వెన్నెలగాయు హారము = వెన్నెలగాయునట్లు తెల్లనికాంతులు వెదచల్లుచున్న ముత్యాలపేరు; ఒక్కటిపెట్టి = ఒకటే ధరింపఁజేసి; మణులసొమ్ములు = రత్నములు చెక్కిన యాభరణములను; మేనన్ = దేహమునందు; మట్టుపఱచి = గుత్తముగాఁబెట్టి; కన్నుఁగవన్ గెల్చి = కన్నులజంటచేత జయించి - ఓడింపఁబడి; డాకాలన్ = ఎడమకాలియందు; కట్టెన్ అనన్ = కట్టివేసెనో యేమో అనునట్లు; ఘల్లుఘల్లునన్ = ఘల్లుఘల్లను చప్పుడుతో; పెండెంబుగండుమీలు = కాలి యందెలందుఁ గూర్పఁబడిన బంగారఁపుఁ జేఁపరూపులు; కదలన్ = చలింపఁగా; యువతిన్ = జవరాలైన మనోరమను; అల్లనల్లన్ = మెల్లమెల్లఁగా; నడపించి; ఆ నృపతికడకున్ = పెండ్లికొడుకైన యా స్వరోచియొద్దకు; పొదివి = క్రమ్ముకొని; తెచ్చెన్ = తీసికొని వచ్చెను.

తా. అనంతరము మనోరమచెలికత్తెలు ఆమెకు నేర్పుతోఁ దలదువ్వి కొప్పుపెట్టి, కొప్పునిండఁ జెంగల్వపూదండలు చెరివి; దానిపైఁ బచ్చకర్పూరముగూర్చిచేసిన పువ్వుల కొప్పువల యమర్చి, చంద్రకావివలిపపుఁజీరగట్టి ముత్యాలమొలనూలు దానిమీఁద నడుమున ధరింపఁజేసి కస్తూరి పన్నీరు చేర్చి కలిపిన కలపము పూసి, కుంకుమపువ్వు చాఁది చుక్కబొట్టుపెట్టి, యొంటిపేటముత్యాల హారము మెడలో వేసి, గుత్తముగా రత్నాభరణములు దొడిగి, కాలియందెలు ఘల్లుఘల్లున మ్రోఁగఁగా మనోరమను మెల్లమెల్లఁగా నడపించుకొని యామె ప్రియుఁడైన స్వరోచియొద్దకుఁ దీసికొనివచ్చిరి. అలం. ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు.

క. తెచ్చుటయుఁ గేళిభవనముఁ, జొచ్చెనొ చొరదో యనంగ సుదతులనీడం
జొచ్చి పయిఁ గొప్పు దోఁపఁగ, నచ్చేడియ తలుపుదండ నల్లన నిలిచెన్. 6

టీ. తెచ్చుటయున్ = చెలికత్తె లిట్లు తీసికొనిరాఁగా; అచ్చేడియ = ఆ స్త్రీ - మనోరమ; కేళిభవనమున్ = క్రీడాగృహమును - పడుకటింటిని; చొచ్చెనో చొరదో = ప్రవేశించెనో ప్రవేశింపలేదో; అనఁగన్ = అని తలఁచునట్లు; సుదతులనీడన్ = చెలికత్తెలనీడయందు; చొచ్చి = ప్రవేశించి; పయిన్ = మీఁదెతట్టు; కొప్పు తోఁపఁగన్ = కొప్పుమాత్రము కనఁబడఁగా; తలుపుదండన్ = తలుపువెంబడిని; అల్లనన్ = మెల్లఁగా - సద్దు గాకుండునట్లు; నిలిచెన్. అనఁగాఁ జెలి

కత్తెలట్లు పిలుచుకొనిరాఁగా వచ్చి మనోరమ తనవచ్చినజాడ తెలియకుండునట్లు చెలికత్తెలమ
గునఁ బడుకటింటి తలుపువెంబడి నిలువఁబడె ననుట.

క. తదనంతరంబ బోటులు, చదురుల నగవులను బ్రొద్దు జరిగినఁ గేళీ
సదనము నొక్కొకపనినెప, మొదవఁగ వెడలుటయుఁ జిత్త మువ్విళ్లూర

టీ. తదనంతరంబ = అట్లు మనోరమ నిలువఁబడినతోడనే; చదురులన్ = కోడిగపుమ
చేతను; నగవులన్ = నవ్వులచేతను; ప్రొద్దు = కొంతసేపు; జరిగినన్ = కడవఁగా; బోటు
మనోరమచెలికత్తెలైన స్త్రీలు; ఒక్కొక పనినెపము = ఒక్కొక రొక్కొక పని కలదను నె
ఒదవఁగన్ = తమకుఁ గలుగఁగా - కలుగఁజేసికొని యనుట; కేళీసదనమున్ = క్రీడాగృహ
వెడలుటయున్ = బయలువెడలిపోఁగా; చిత్తము = స్వరోచిమనస్సు; ఉవ్విళ్లూరన్ =
ఝల్లఁగా. తరువాతి పద్యముతో నన్వయము.

సీ. దట్టంబు నీకట్టి నట్టి చెంగావికి, బాగు గాదని కేలఁ బయఁట నిమిరె
గోరంటా గోళ్లని క్కవపుఁగెంపో యని, చెయి పట్టి నయమున సెజ్జ సే
నగరుధూపము [1]కాఁకనయ్యో తనూవల్లి, సెక సోఁకు నని యెదఁజెయ్యి
మృగనాభికామకరికలఁ గ్రపముమించె, ననిమూరుకొనుచుఁ జుంబన మొన

తే. హారమణు లిటు సూపు, నా యఱుత నున్న
హారమణులకుఁ గాంతి నీ డౌనో కావొ
యనుచు నక్కునఁ గదియించు నా నెపమునఁ
గంపమును బొందు సతిమేను గాఁగిలించె.

టీ. (స్వరోచి,) దట్టంబు = పావడ; నీకట్టినట్టి చెంగావికిన్ = నీవు కట్టుకొన్న చెం
చీరకు; బాగు కాదు = అందముగా లేదు; అని; కేలన్ = చేతితో; పయఁట = పై
మీఁదివస్త్రమును; నిమిరెన్ = తడవెను. గోరంటా = గోరంటాకు రసమంటిన యొ
గోళ్లనిక్కవపుఁగెంపో = గోరులయొక్క నిజమయిన ఎఱుపో; అని; చెయిపట్టి = చేయిపట్టు
నయమునన్ = మృదుత్వముతో; సెజ్జ చేర్చెన్ = పాన్పును చేరునట్లుచేసెను - పాన్పు
జేరఁదీసెననుట; అగరుధూపముకాఁకన్ = అగరుచెక్క వేఁడిమిపొగచేత; తనూవల్లి =
వంటిదైన నీదేహము; సెకసోఁకెన్ వేఁడెక్కినదాయెను; అయ్యో! యని = అక్క
యని; ఎదన్ = ఱొమ్ముపైని; చెయ్యివెట్టెన్ = చేయిపెట్టి చూచెను; మృగనా
మకరికలన్ = కస్తూరిచేత వ్రాయఁబడిన మకరికాపత్రములందు; క్రపము = పచ్చకర్పూ
మించెన్ = హెచ్చాయెను; అని; మూరుకొనుచున్ = మూచూచుచు; చుంబనమొనర్చెన్
ముద్దుపెట్టుకొనెను; హారమణులు = ముత్యాలపేరునందలి పూసలను; ఇటుచూపుము = ఈ
కనఁబఱుపుము; నాయఱుతన్ = నా మెడయందు; ఉన్న. హారమణులకున్ = ఉండునట్టి ప
లోని పూసలకు; కాంతిన్ = లోపలి నిగ్గుయొక్క ప్రకాశముచేత; ఈడు ఔనో = సమ
అగునో; కావో; అనుచున్ = అని పలుకుచు; అక్కునన్ = ఱొమ్మునందు; కదియించు నె
మునన్ = ఆనించి చూచు మిషచేత; కంపమును బొందు సతిమేను = సాత్త్వికచేష్టచే
చున్న ప్రియురాలి దేహమును; కాఁగిలించెన్ = ఆలింగనము చేసికొనెను.

1. చేత. పా.

తా. అప్పుడు స్వరోచి ప్రియురాలిదగ్గఱఁ జేరి నీవు కట్టినపావడ పై చెంగావిచీరకుఁ దగినది కాదని చెప్పుచుఁ బయఁట నంటి, వ్రేళ్ల గోరంట పెట్టికొంటివా? యని యడుగ చేయిపట్టి పాన్పునకుఁ జేరఁదీసి, యటుపిమ్మటఁ గ్రమముగా నొక్కొక్క నెపముచే నొక్కొక్క శృంగార చేష్ట చేయుచుఁ గడపట హారములలోని ముత్యాలపూసలు సరిచూచుట యను మిషచేత ఱొమ్ముతో ఱొమ్ముఁజేర్చి కౌఁగిలించుకొనెను. అలం. పర్యాయోక్తము.

వ. అట్లు కవియం దమకించి త్రస్తరులఁ గుస్తరింప నింపు గలిగియు మునుమున్న మనంబునం బొడమియుండు నడ లప్పుడు తలంపునం బాఱిన సమర్థుండగు నతనిచే నది తీర్పించుకొనంగలయదియై, నవోఢగావున మాటలం దేటపడం జెప్ప శంకించి స్త్రీస్వభావంబునం దొరఁగు కన్నీరు కంకణక్రేంకృతులు మీఱ గోరఁ బాఱమీటుచు నూరకయున్నం గనుంగొని యవనిపతిపుంగవుం డంతరంగంబునం జెంగలించు కౌతుకాంకురంబు కరఁగువడ వెఱఁగుపడి యుద్వేగసమన్వితుండై సంభ్రమించుచుఁ జెక్కుటద్దంబులు నొక్కి, కురులు చక్కం ద్రోయుచుం 'దోయజాక్షీ! యక్షయానందసంధాయకంబగు నిట్టి క్రీడాసమయంబున వగపునకుం గారణం బేమి? నాయెడం గల్ల యేమేనియుం బాటిల్లదు గదా! యెవ్వరే మప్రియంబు గావించి రెఱింగింపు వారిన్ దండించెద నేమి సాధింపవలయుఁ జెప్పు మది వేధచే నున్న సాధించెద. మదీయంబులగు నర్థజీవితంబులు భవదధీనంబు లుమ్మలిక యింత యేటి' కనుటయు నబ్బోటి గ్రేఁటుచు నిట్లనియె. 9

టీ. అట్లు = ఆ రీతిని; కవియన్ = తన్నుఁ జేరుటకు; తమకించి = త్వరపడి; త్రస్తరులన్ = పరిహాసపుమాటలచేత; కుస్తరింపన్ = సమాధానపఱుపఁగా; ఇంపు గలిగియున్ = కూటమికి నిష్టముగలదయ్యును; మునుమున్న = మొట్టమొదటనే - పెండ్లిగాకమునుపే యనుట; మనంబునన్ = తన మనసునందు; పొడమియుండు నడలు = పుట్టియున్న విచారము; అప్పుడు = ఆ సమయమునందు; తలంపునం బాఱినన్ - మనసునఁ బ్రసరింపఁగా - జ్ఞప్తికిరాఁగా; సమర్థుఁడు = సామర్థ్యము గలవాఁడు; అగు నతనిచేతన్ = అయిన యా మహాపురుషునిచేత; అది = దానిని - ఆ విచారము; తీర్పించుకొనఁగలయదియై = మాన్పుకోఁ దలచినదై; నవోఢకావునన్ = క్రొత్త పెండ్లికూతురు కనుక; మాటలన్ = మాటలతో - సిగ్గువిడిచి మాటలాడియనుట; తేటపడన్ చెప్పన్ = స్పష్టమగునట్లు ప్రియునితోఁ జెప్పుటకు; శంకించి = జంకి; స్త్రీస్వభావంబునన్ = ఆఁడుదగుటకుఁ దగిన స్వభావముచేత; తొరఁగు కన్నీరు = కాఱుచున్న కంటినీటిని; కంకణక్రేంకృతులు = గాజులయొక్క గలగల ధ్వనులు; మీఱన్ = అతిశయింపఁగా; గోరన్ = వ్రేలిగోటితో; పాఱమీటుచున్ = తొలఁగఁజిమ్ముచు; ఊరకయున్నన్ = ఏమియు ననక మిన్నకుండఁగా; కనుంగొని = చూచి; అవనిపతిపుంగవుండు = రాజశ్రేష్ఠుఁడు - స్వరోచి; అంతరంగంబునన్ = మనసునందు; చెంగలించు కౌతుకాంకురంబు = అతిశయించునట్టి వేడుకమొలక; కరఁగువడన్ = తగ్గఁగా; వెఱఁగుపడి = ఆశ్చర్యపడి; ఉద్వేగసమన్వితుండై = నెమ్మదిలేమితోఁ గూడుకొన్నవాఁడై; సంభ్రమించుచున్ = తత్తఱిల్లుచు; చెక్కుటద్దంబులు=అద్దములవంటి మనోరమచెక్కిళ్ళను; నొక్కి= పుణికి పట్టి; కురులు = తలవెంట్రుకలను; చక్కంద్రోయుచున్ = సరిగా నెగదువ్వుచు; తోయ

జాక్షీ ! = తామరలవంటి కన్నులుగల యో ప్రియురాలా ! అక్షయా...కంబు - అక్షయ = తఱుఁగని; ఆనంద = సంతోషమును; సంధాయకంబు = కూర్చునది - పొందించునది; అగు...బునన్ - అగు = అయిన; ఇట్టి; క్రీడాసమయంబునన్ = సంభోగకాలమునందు; వగపునకున్ = విచారమునకు; కారణంబు = హేతువు; ఏమి? = ఏమిటిది ? నాయెడన్ = నాయందు; కల్ల ఏమేనియున్ = వంచన ఏదియును; పాటిల్లదుగదా ! = కలుగదుగదా ! ఎవ్వరు = ఇతరులెవ్వరు; ఏమప్రియంబు = ఏమి తప్పు; కావించిరి ? = చేసిరి ? ఎఱింగింపు = తెలియఁజేయుము - చెప్పుము; వారిన్ = ఆ తప్పు చేసినవారిని; దండించెదన్ = శిక్షించెదను. ఏమి సాధింపవలయున్ ? = దేనిని సమకూర్పవలయును? చెప్పుము = నాతోఁ జెప్పుము. అది = ఆ సమకూర్పవలసిన వస్తువు; వేధచేతనున్నన్ = బ్రహ్మదేవునిచేత నున్నను; సాధించెదన్ = సమకూర్చెదను. మదీయంబులు = నావి; అగు నర్థజీవితంబులు = అయినట్టి ధనమును, ప్రాణమును; భవదధీనంబులు = నీ వశములు. ఉమ్మలిక = దుఃఖము; ఇంత ఏటికి ? = ఇంతవిశేషము ఏల ? - ఎందులకు ? అనుటయున్ = అని ప్రియుఁ డడుగఁగా; అబ్బోటి = ఆ స్త్రీ - మనోరమ; క్రేటుచున్ = గొంతు సవరించుకొనుచు; ఇట్లనియె.

ఉ. అక్కట! నాయెడన్ మిగుల § నక్కఱ గల్గి చరించు నెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ § జెందిన దుర్దమరోగబాధలం
బొక్కుచు నున్నవారు వన § భూములఁ; దద్దశ మాన్పవేని నా
కెక్కడి సౌఖ్య ? మన్నఁ దర § ళేక్షణఁ జూచి స్వారోచి యిట్లనున్. 10

టీ. అక్కట ! = అయ్యో ! నాయెడన్ = నా విషయమునందు; మిగులన్ = మిక్కిలి; అక్కఱ గల్గి = అపేక్ష కలిగినవారై; చరించు నెచ్చెలుల్ = ప్రవర్తించునట్టి ప్రియసఖులు; మునీంద్రశాపహతిన్ = ఒకానొక మునిశ్రేష్ఠుని శాపపుదెబ్బచేత; చెందిన...బాధలన్ - చెందిన = పొందినటువంటి; దుర్దమ = అణఁపరాని; రోగబాధలన్ = వ్యాధిపీడలచేత; చిక్కి పొక్కుచున్ = చిక్కుకొని, తపించుచు; వనభూములన్ = అడవినేలలయందు; ఉన్నవారు. తద్దశ = వారిదైన యా దురవస్థను; మాన్పవేనిన్ = నీవు పోఁగొట్టనిపక్షమున; నాకు; ఎక్కడి సౌఖ్యము ? = సౌఖ్య మెక్కడిది ? - నాకు సుఖము కలుగ నేరదనుట. అన్నన్ = అని మనోరమ యనఁగా; తరళేక్షణన్ = చలించుచున్న కన్నులుగలదైన మనోరమను; చూచి; స్వారోచి; ఇట్లనున్.

తా. నాయందు మిక్కిలి ప్రేమ గల చెలికత్తెలు మునీశ్వరుఁ డొకఁడు శపింపఁగా మానని వ్యాధిచేఁ బీడింపఁబడుచు నడవులందుఁ బడియున్నారు. వారి వ్యాధి మాను నుపాయము గానక దుఃఖించుచున్నదానను; కనుక నీ వా వ్యాధిబాధ నివారింతువేని నాకు సుఖేచ్ఛ పుట్టును. నివారించునంతకు నిట్లు దుఃఖపడఁగలదాననే యనఁగా స్వారోచి యిట్లు వచియించెను.

క. పరితాప మింక నేటికి?, హరిణాక్షి ! మదీయసంచి § తాయుర్వేద
స్ఫురణమునఁ బరిహరించెద, నరు దనఁగ భవత్సఖీజ § నామయభరమున్. 11

టీ. హరిణాక్షి ! = జింకకన్నులవంటి కన్నులుగల యో ప్రియురాలా ! ఇంకన్ = ఇఁక మీఁదను; పరితాపము = దుఃఖమువలని యారాటము; ఏటికిన్ ? = ఏమిటికి ? మదీయ...మునన్ - మదీయ = నాదైన; సంచిత = సంగ్రహింపఁబడిన - నేనభ్యసించినట్టియనుట; ఆయుర్వేద = వైద్యశాస్త్రముయొక్క; స్ఫురణమునన్ = స్ఫూర్తిచేత - సామర్థ్యముచేత; భవ...మున్ - భవ

త్సఖీజన = నీ చెలికత్తెలయొక్క; ఆమయభరముఁ = రోగాతిశయమును; అరుదు = ఇది యాశ్చర్యము; అనఁగన్ = అని చూచినవా రనునట్లుగా; పరిహరించెదన్ = మాన్పెదను - అనఁగా - ఓ ప్రియురాలా! నేను నేర్చిన వైద్యసామర్థ్యముచేత నీ చెలికత్తెల వ్యాధి మాన్పెదను. నీ విఁక నీ విచారము మాను మనియెను.

క. నావెనుక రమ్ము నీసఖు, లే వనమున నున్నవార లిపుడ చికిత్సం
గావింతు ననుచు రయమున, నా వనితయుఁ దాను నచటి కరిగి యొకయెడన్.

టీ. నీ సఖులు = నీ చెలికత్తెలు; ఏ వనమునన్ = ఏ యడవియందు; ఉన్నవారలు? = ఉన్నారు? ఇపుడ = ఇప్పుడే; చికిత్సన్ = తగినవైద్యమును; కావింతున్ = చేసెదను. నా వెనుకన్ రమ్ము = నా వెంబడి రమ్ము; అనుచున్; ఆ వనితయున్ = ఆ స్త్రీయు - మనోరమయు; తానును; రయమునన్ = వడితో; అచటికిన్ = ఆ మనోరమచెలికత్తె లున్న యడవికి; అరిగి = పోయి; ఒకయెడన్ = అందొక ప్రదేశమునందు. తర్వాతి పద్యముతో నన్వయము.

ఉ. ఆ రజనీశబింబ రుచి రాస్యలఁ గాంచి తదామయవ్యథా
భారము మాన్పఁగాఁ దమి నృ పాలుఁడు తత్కలధౌతగోత్ర కాం
తార పదంబునం దుపచి తం బగు మందును దత్క్రియోచితా
హారము నెమ్మి నిచ్చుచు న నామయధన్యలఁ జేసె వన్నెగాన్.[1] 13

టీ. ఆ రజనీశబింబరుచిరాస్యలన్ = చంద్రబింబములవలె వెలుఁగుచున్న ముఖములు గల యా పడుచులను; కాంచి = చూచి; నృపాలుఁడు = రాజు - స్వరోచి; తదామయవ్యథాభారమున్ = వారి వ్యాధి బాధాతిశయమును; మాన్పఁగాన్ = పోఁగొట్టుటకై; తమిన్ = తమకముతో; తత్కలధౌత...నందున్ - తత్కలధౌతగోత్ర = ఆ వెండికొండయొక్క; కాంతారంబునందున్ = అడవిపట్టునందు; ఉపచితంబు = పెరిఁగినది; అగు మందును = అయినట్టి యౌషధమును; తత్క్రియోచితాహారమున్ = ఆ యౌషధక్రియకుఁ దగిన యాహారమును; నెమ్మిన్ = ప్రీతితో; ఇచ్చుచున్; వన్నెగాన్ = కాంతియుక్త లగునట్లుగా; అనామయధన్యలన్ = వ్యాధి లేమిచేతఁ గృతార్థలనుగా; చేసెన్.

తా. వ్యాధిగ్రస్తలయిన యా మనోరమచెలికత్తెలను జూచి, స్వరోచి వారి వ్యాధి మానునట్టి మందు లా వెండికొండ యడవులలోనే సంపాదించి యిచ్చి, యందులకుఁ దగినట్లు పథ్యము పెట్టి, రోగమువలని దేహవికారము పోయి, వన్నె హెచ్చునట్లు వారి రోగమును మాన్పి, కృతార్థలనుగాఁ జేసెను.

శా. ఆ దివ్యౌషధరాజిచేఁ దమ మహా వ్యాధివ్యథల్ దీఱినన్
మోదంబంది లతాంగు లంబుజకులం బుర్ నవ్వ కందోయితో

1. పయి పద్యమునకు బదు లీ క్రింది పద్యము కొన్ని వ్రాఁతప్రతులలోఁ గలదు:—

ఉ. ఆ రమణీలలామముల ♦ నారసి కాంచి తదామయవ్యథా
భారము మాన్పవేఁడి సుర ♦ భామినికూరిమిపట్టి దాను కాం
తారపథంబునం దిరిగి ♦ తాలిమి నౌషధరాజిఁగూర్చి, యిం
పారఁగ నిచ్చి మాన్చెఁ దన ♦ యంగన సంతసమందునట్లుగన్.

సౌదామన్యభిరామదేహరుచితో సంపూర్ణచంద్రానన
శ్రీదర్పోన్నతితోఁ జెలంగి సురనారీసూనుఁ గీర్తించుచున్. 14

టీ. లతాంగులు = మనోరమచెలికత్తెలు; ఆ దివ్యౌషధరాజిచేన్ = వెండికొండయందు సంగ్రహించి యిచ్చిన యా మంచి మందుల సమూహముచేత; తమ మహావ్యాధివ్యథల్ = తమ యొక్క యధికమైన రోగబాధలు; తీఱినన్ = నివారణము కాఁగా; మోదంబు అంది = సంతోష మును పొంది; అంబుజకులంబున్ = తామరలసమూహమును; నవ్వు కందోయితోన్ = పరిహసించు నేత్రద్వయముతోను; సౌదామ... రుచితోన్ - సౌదామనీ = మెఱపుఁదీగవలె; అభిరామ = ఒప్పిదమయిన; దేహరుచితోన్ = శరీరకాంతితోను; సంపూర్ణచంద్ర = నిండుచందురునివంటి; ఆనన = ముఖముయొక్క; శ్రీ = కాంతిసంపదయొక్క; దర్ప = గర్వముయొక్క; ఉన్న తితోన్ = ఆధిక్యముతోను; చెలంగి = ఒప్పి; సురనారీసూనున్ = దేవతాస్త్రీకుమారుఁడయిన స్వరోచిని; కీర్తించుచున్ = పొగడుచును. తర్వాతి పద్యముతో నన్వయము. అలం. ఉపమ.

క. మా కుపకార మొనర్చితి, నీకుం బ్రతిసేయ నెట్లు నేరుతు? మైనన్
లోకోత్తర! మావలనను, జేకొను కార్యములుఁ గలవు చెప్పెద మెలమిన్.

టీ. లోకోత్తర ! = లోకమునందు శ్రేష్ఠుఁడవైన యో మహారాజా ! మాకు; ఉపకారము = మేలు; ఒనర్చితి = చేసితివి. నీకు; ప్రతిసేయన్ = మఱుమేలు చేయుటకు; ఎట్లు నేరుతుము ? = ఏ విధముగా సమర్థుల మగుదుము ? - మేము మఱుమేలు చేయఁగలవారము గా మనుట. ఐనన్ = మఱుమేలు చేయలేనివారమయినను; మావలనను = మావలనఁగూడ; చేకొను కార్యములున్ = గ్రహింపఁదగిన పనులును; కలవు = కొన్ని గలవు. ఎలమిన్ = సంతోషముతో; చెప్పెదము = ఆ పనులను చెప్పెదము (వినుము).

తా. ఓ మహారాజా! నీవు మాకు నుపకారము చేసితివి. అందులకుఁ బ్రత్యుపకారము చేయ మేము చాలినవారము కాము. అయినను మావలనఁగూడ నీకు గ్రహింపఁదగినవి కొన్ని గలవు. వానిని జెప్పెదము వినుము.

క. మును మాదగు వృత్తాంతము, వినిపింపఁగవలయు నీకు విశ్రుతముగ; భూ
వినుత! విను మనుచు నందొక, వనజేక్షణ పలికె మధుర వాగ్జితశుకియై. 16

టీ. భూవినుత ! = భూమియందుఁ బొగడఁబడిన యో మహారాజా ! మును = ముందు; మాదగు వృత్తాంతము = మాదైన సమాచారము; విశ్రుతముగన్ = చక్కఁగాఁ దెలియునట్లు; నీకు; వినిపింపఁగవలయున్ = శ్రుతపఱుపవలయు - చెప్పవలెను; వినుము. అనుచున్ = అని పలుకుచు; అందొక వనజేక్షణ = వారిలో నొక చిన్నది; మధురవాగ్జితశుకియై = తియ్యనిమాటలచే గెలువఁ బడిన యాఁడుఁజిలుక గలదై - చిలుకపలుకులవంటి పలుకులు కలదై యనుట; పలికెన్ = చెప్పెను. అనఁగా ఆ మనోరమ చెలికత్తెలలో నొకతె "ముందు సమాచారము చెప్పెదను. విను"మని యింపైన మాటలతోఁ జెప్ప నారంభించెను. అలం. ఉపమ.

తే. అనఘ మందారవిద్యాధరాత్మ[1]భవను, నను విభావసి యంద్రు గంధర్వవరులు;
తెలిసియుండుదు నిమ్మహీతలము నందుఁ, బరగు మృగ పక్షి జాతుల భాషలెల్ల.

1. జన్మ. పా.

టీ. అనఘ ! = పాపములు లేనివాఁడవైన యో రాజా ! (నేను) మందార...భవను - మందార = మందారుఁడను పేరుగల; విద్యాధర = విద్యాధరునియొక్క; ఆత్మభవను = కూఁతురను; ననున్; గంధర్వవరులు = గంధర్వశ్రేష్ఠులు; విభావసి; అంద్రు = అని చెప్పుదురు; ఇమ్మహీతలమునందున్ = ఈ భూమండలమునందు; పరగు మృగపక్షి...భాషలు - పరగు = ప్రవర్తిల్లునట్టి; మృగ పక్షి జాతుల = మృగజాతులయొక్కయు, పక్షిజాతులయొక్కయు; భాషలు = మాటలు; ఎల్లన్ = అన్నియును; తెలిసియుండుదున్ = నేను గుర్తెఱిఁగియున్నాను.

క. అమ్మేటి విద్య నాచే, నిమ్ముగ నంతయు నెఱింగి ♦ నృప ! నన్ను వివా
హమ్మగు మనవుడు రెండవ, కొమ్మ మదిం బ్రేమ గడలు ♦ కొన నిట్లనియెన్. 18

టీ. నృప ! = రాజా ! అమ్మేటివిద్య = పూజ్యమయిన యా విద్యను; నాచేన్ = నావలన; ఇమ్ముగన్ = బాగుగా; అంతయున్ = సర్వమును; ఎఱింగి = తెలిసికొని; నన్ను; వివాహమ్మగుము; అనవుడున్ = అనఁగానే; రెండవ కొమ్మ = దానితోడిదైన మఱియొక వనిత; మదిన్ = మనసునందు; ప్రేమ కడలుకొనన్ = ప్రియము - అనురాగము అతిశయింపఁగా; ఇట్లనియెన్.

ఆ. పారుఁడనఁగ బరఁగు ♦ బ్రహ్మర్షి మాతండ్రి, యతఁడు విద్యలెల్ల ♦ నభ్యసించి
[1]తపము నిచ్చఁ జేయ ♦ దలపోసి కీర భృం, గాలి రమ్యమైన ♦ యాశ్రమమున.

టీ. మా తండ్రి; పారుఁడనఁగన్ = పారుఁడను పేరిచేత; పరగు బ్రహ్మర్షి = ప్రసిద్ధుఁడైన బ్రహ్మఋషి; అతఁడు; విద్యలెల్లన్; అభ్యసించి = నేర్చి; ఇచ్చన్ = మనసునందు; (నిచ్చ = ఎల్లపుడును అని కొందఱు.) తపమున్ చేయన్ = తపస్సును చేయునట్లు; తలపోసి = తలఁచి; కీరభృంగాలిన్ = చిలుకలయుఁ దుమ్మెదలయు బారులచేత; రమ్యము = మనోహరము; ఐన యాశ్రమమునన్ = అయినట్టి తపోవనప్రదేశమునందు. తర్వాతి పద్యముతో నన్వయము.

మ. ఫల మూలచ్ఛదనాంబు భుక్తిఁ బవనా ♦ భ్యాసక్రియాయుక్తి ని
ర్దళితాంతర్గతశాత్రవప్రకరజా ♦ గ్రద్గర్వసర్వస్వుఁడై
చలికిన్ వానకు నెండకున్ మన మను ♦ త్సాహంబు గానీక కం
దళితానందమునన్ ముకుందచరణ ♦ ధ్యానావధానంబునన్.[2] 20

టీ. ఫల...భుక్తి - ఫల = పండ్లయొక్కయు; మూల = వేళ్లయొక్కయు; ఛదన = ఆకులయొక్కయు; అంబు = నీటియొక్కయు; భుక్తిన్ = భోజనముచేతను; పవనాభ్యాసక్రియాయుక్తిన్ = వాయుధారణము వాడుక చేయునట్టి వ్యాపారముయొక్క కూడికచేతను - వాయుధారణచేయుటచేత ననుట; నిర్దళిత...సర్వస్వుఁడై - నిర్దళిత = ఖండింపఁబడిన; అంతర్గత = తనలోపలనుండెడి కామక్రోధాదులయిన; శాత్రవ = శత్రువులయొక్క; ప్రకర = సమూహము

1. ఈ పంక్తికి బదులుగ వ్రాఁతప్రతియం దిట్లున్నది:—
"శోక శుకకదంబ ♦ కోకిల కాకలీ, కలకలాకులాశ్రమ ♦ కాననమున.

2. ఈ పద్యమునకు బదులు వ్రాఁతప్రతిలో నీ క్రింది పద్యము కానవచ్చుచున్నది:—
మ. "ఫలమూలాదులఁ దృప్తిఁబొంది పవనా ♦ భ్యాసక్రియారంభ ని
శ్చలవృత్తిం దనలోని శాత్రవులయు ♦ త్సాహంబడంగింపుచుం
జలికిన్ వానకు నెండకున్ మనమునన్ ♦ శంకింప కానందకం
దళితాత్ముండగుచున్ మురారిచరణ ♦ ధ్యానావధానంబునన్.

యొక్క; జాగ్రత్ = హెచ్చరికగల - అతిశయించిన; గర్వసర్వస్వుఁడై = సర్వగర్వము గల వాఁడై - అరిషడ్వర్గము నణఁచినవాఁడై యనుట; చలికిన్ = శీతబాధకును; వానకున్; ఎండకున్; మనము=మనస్సు; అనుత్సాహంబు కానీక = ప్రయత్నము మాలినది కానియ్యక - చలి, వాన, ఎండ-వీనివలనబాధను సహించి యనుట; కందళితానందమునన్ = మొలచుచున్న సంతోషముతో; ముకుంద...బునన్ - ముకుంద = విష్ణుదేవునియొక్క; చరణ = పాదములయొక్క; ధ్యాన = ఎడ తెగక తలఁచుచుండుటయందలి; అవధానంబునన్ = ఎచ్చరికతో. తరువాతి కన్వయము.

తా. పండ్లు, వేళ్లు, దుంపలు, పండుటాకులు నాహారముగా, వాయుధారణచేసి యరిషడ్వర్గము నణఁచి, చలి, యెండ, వానలవలని బాధచేత మనస్సును చలింపనీక, స్థిరముగా నిలుపుకొని, సంతోషముతో విష్ణుదేవుని పాదములను ధ్యానించుటయందుఁ బరాకు లేనివాఁడై.

క. అంగుష్ఠము నిల మోపి ప, తంగునిపైఁ జూపు సాఁచి । ధగధగ[1]దర్చి
స్తుంగత నింగులు నాకెడు, నింగలములు నాల్గు దెసల । నిడుకొని కడఁకన్. 21

టీ. అంగుష్ఠమున్ = కాలి బొటనవ్రేలిని; ఇలన్ మోపి = భూమియందు నిలిపి; పతంగుని పైన్ = సూర్యునిమీఁద; చూపు చాఁచి = దృష్టిని పఱపి; ధగ...గతన్-ధగధగత్ = దగదగ యనెడి; అర్చిస్తుంగతన్ = మంటలయొక్క పొడుగుచేత - మీఁదికెగసిన మంటలచేత ననుట; నింగులు = ఆకాశమును; (ఇచ్చట బహువచనము హెచ్చును దెలుపును.) నాకెడు నింగలములు = అంటుచున్న యగ్నులు; నాల్గుదెసలన్ = నాలుగుప్రక్కలను; ఇడుకొని = ఉంచుకొని; కడఁకన్ = పూనికతో. తర్వాతి కన్వయము.

తా. కాలిబొటనవ్రేలు నేలమీఁద మోపి నిలిచి, సూర్యునిఁ జూచుచు, మిన్నంట మండుచున్న యగ్నులు చుట్టు నుంచుకొని, పూనికతోను—పంచాగ్నిమధ్యమున మిన్ను చూచుచుఁ గాలి బొటనవ్రేలితో నిలిచి యని భావము. అలం. అతిశయోక్తి.

క. సుర గరుడ యక్ష రాక్షస, నర కిన్నర సిద్ధ సాధ్య । నాగోత్కర మి
ట్లరు దనఁగఁ దప మొనర్చెం, బురుహూతుఁడు దాన నాత్మఁ । బొడమిన భీతిన్.

టీ. సుర...త్కరము = దేవతలు, గరుడులు, యక్షులు, రాక్షసులు, నరులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, నాగులు అను వారియొక్క సమూహము; ఇట్లు = ఈ విధముగాఁ దపస్సు చేయుట; అరుదు = దుర్లభము; అనఁగన్ = అనునట్లుగా; తపము = తపస్సు; ఒనర్చెన్ = చేసెను. దానన్ = అట్లు తపస్సు చేయుటచేత; పురుహూతుఁడు = ఇంద్రుఁడు; ఆత్మన్ = మనస్సునందు; పొడమిన భీతిన్ = పుట్టిన భయముతో - మనస్సునందు భయముగలవాఁడై యనుట. (ఇంద్రుఁ డెవ్వరేని ఘోరతపస్సు చేయునపుడు వారు తపస్సిద్ధిఁ బొందిరేని తన త్రిలోకాధిపత్యము నాక్రమింతు రని వెఱచి వారి తపస్సులు చెఱుచుచుండు నందురు.)

క. తనయొద్దఁ బుంజికస్థల, యను నచ్చరలేమ యున్న । నమ్మునికడకుం
జను మని యనిపినఁ బతిశా, సనమున వని కేగుదెంచె । సంభ్రమలీలన్. 23

టీ. తనయొద్దన్; పుంజికస్థల యను నచ్చరలేమ = పుంజికస్థల అను పేరుగల యప్సరస్త్రీ; ఉన్నన్ = ఉండఁగా; (దానిని;) అమ్మునికడకున్ = ఆ తపస్సు చేయుచున్న ఋషిదగ్గఱకు; చనుము = నీవు పొమ్ము; అని; యనిపినన్ = పంపఁగా; (అది) పతిశాసనమునన్ = తన ప్రభువు

1. లర్చి. పా.

యొక్క యాజ్ఞచేత; సంభ్రమలీలన్ = తొందరతోడి విలాసముతో; వనికిన్ = (ఆయన తపస్సు చేయుచున్న) వనమునకు; ఏఁగుదెంచెన్ = వచ్చెను.

చ. [1]చిలుకలు ముద్దుఁబల్కులకుఁ ♦ జేరఁగ రా నెఱివేణికాంతికిన్
మలయుచుఁ బైపయిన్ మధుప ♦ మాలిక వాయక సంచరింపఁగా
నలసవిలాసయానమున ♦ నమ్మునిపాలికి వచ్చె వేల్పుఁదొ
య్యలి నునుసానఁబట్టిన య ♦ నంగుని మోహనబాణమో యనన్. 24

టీ. వేల్పుఁదొయ్యలి = దేవతాస్త్రీయయిన పుంజికస్థల; ముద్దుఁబల్కులకున్ = తనయొక్క మనోహరములైన మాటలకు; చిలుకలు; చేరఁగరాన్ = (చిలుకలే మాటలాడుచున్నవని) దగ్గఱ రాఁగా; నెఱివేణికాంతికిన్ = అందమయిన జడయొక్క ప్రకాశమునకు; మధుపమాలిక = తుమ్మెదల చాలు; పైపయిన్ = మీఁద మీఁద; మలయుచున్ = పర్వుచు; వాయక = ఎడఁబాయక; సంచరింపఁగా = తిరుగఁగా - తుమ్మెదలు జడను జూచి తుమ్మెదలచాలని భ్రమించి, యావరించి, సంచరింపఁగా ననుట; అలస...మునన్ - అలస = మెల్లని; విలాసయానమునన్ = ఒయ్యారము తోడి నడకతో; నును...బాణమో - నును = నునుపైన; (బాణమునకు విశేషణము.) సానఁబట్టిన = సానయందుఁ బదునురా నూఱిన; అనంగుని = మన్మథునియొక్క; మోహనబాణమో అనన్ = మోహమును గలిగించుటచే మోహన మనెడి బాణమో యేమో అనునట్లు; అమ్మునిపాలికిన్ = ఆ ఋషి యొద్దకు; వచ్చెన్.

తా. చిలుక పలుకులవంటి మనోహరములైన మాటలును, తుమ్మెదలబారును బోలిన జడయును, ఒయ్యారముతోడి మెల్లని నడకయు నొప్పఁగా, మన్మథునిదైన మోహనబాణమువలె వలపు పుట్టించునదియై యా యప్సరస తపస్సుచేయుచున్న పారుఁడనెడి మునియొద్దకు వచ్చెను. అలం. ఉత్ప్రేక్ష, ఉపమ, భ్రాంతిమంతమును.

వ. ఆ సమయంబున. 25

చ. అనువగు సుళ్లనొప్పు మల ♦ యానిల వాహము నెక్కి తేంట్లన
ల్లిన నిడువాగెఁ బూని లవ ♦ లీ నవవల్లిక లెమ్మెసొమ్ములై
పనుపడఁ జెట్లువట్టి మను ♦ ప్రాఁత దళమ్ములతోడఁ దోలె నా
మనిదొర మంచురాజు మడి ♦ మంచగఁ గోఁకులగంట మ్రోయఁగన్. 26

టీ. (ఇందు వసంతర్తువును బగతునిపై దండెత్తు నొక రాజుఁగాఁ గవి రూపించుచున్నాఁడు.) ఆమనిదొర = వసంతఋతువనెడి రాజు; అనువగు సుళ్లన్ = యుక్తమయినట్టి చుట్టిచుట్టి వీచుట లనెడి దేవమణి మొదలయిన సుళ్లచేత; ఒప్పు మలయానిలవాహమున్ = ఒప్పిదమైన గందపుఁ గొండనుండి వచ్చునట్టి చల్లగాలి యనెడు గుఱ్ఱమును; ఎక్కి; తేంట్లన్ = తుమ్మెదలచేత; అల్లిన నిడువాగెన్ = పెనఁచిన నిడుపైన కళ్లెపుఁబగ్గమును; పూని = వహించి - పట్టి; లవలీ నవవల్లికలు = క్రొత్త వెన్నెలతీగలు; ఎమ్మెసొమ్ములై = అందమైన యాభరణములై; పనుపడన్ = జతపడఁగా; చెట్లువట్టి = వృక్షముల నాశ్రయించి; మను ప్రాఁతదళమ్ములతోడన్ = వర్తించునట్టి పండుటాకు లనెడి జీవించునట్టి పురాతనభృత్యుల దండులతో; మంచురాజు = మంచుకాల మనెడి పగరాజు;

---

1. ఈ పద్యమునకు ముందు వ్రాఁతప్రతిలో నిట్లున్నది:— వ. అంత.

మడిమంచఁగన్ = బలహీనుఁడుకాఁగా; కోయిలగంట=కోయిలకూఁతయనెడి ఘంట; మ్రోయఁగన్ = వాఁగుచుండఁగా; తోలెన్ = తఱిమెను.

తా. సుడిసి సుడిసి వీచుచున్న చల్లగాలితోడను, బారులుతీరి మొరయుచున్న తుమ్మెదలతోడను, వెన్నలతీగల పెంపుతోను వసంతఋతువు మంచి సుళ్లుగల గుఱ్ఱము నెక్కి, కల్లెపువాఱు బిగఁబట్టి, మనోహరములైన సొమ్ములు ధరించి వచ్చునట్టి మహారాజువలెఁ, బెంపుతగ్గిన మంచుకాలమనెడి పగరాజును వృక్షములందలి పండుటాకు లనెడి పురాతనభటుల సేనలతోడఁ దఱుమఁగొట్టి కోయిల కూఁతలనెడి జయఘంటను మ్రోఁగించెను. మంచుకాలము కడచిపోఁగా వృక్షముల యాకులు పండి రాలె ననియు, వసంతఋతువు రాఁగా దక్షిణపుఁ జల్లగాలి వీవఁగాఁ తుమ్మెదలు బారులుదీరి తిరుగసాగెననియు, వెన్నెలతీగలు చిగిర్చి యల్లుకొనసాగె ననియు భావము. అలం. రూపకము.

సీ. సానదేఱి పొటమరించి నెఱెవాసినయట్టి, యాకురాలుపుగండ్లయందుఁదొలఁగి
యతిబాలకీరచ్ఛదాంకురాకృతిఁ బొల్చి, కరవీరకోరకగతిఁ గ్రమమున
నరుణంపు మొగ్గలై యరవిచ్చి పికిలియీఁ, కలదండు లట్లు గుంపులయి పిదప
రేఖ లేర్పడఁగ వర్ధిలి వెడల్పయి రెమ్మ, పసరువాఱుచు నిక్కఁ బసరుకప్పు
తే. పూఁట పూఁటకు నెక్కఁగఁ గప్పునకుఁ దగిన
మెఱుఁగు నానాఁటికిని మీఁదఁ గిఱి[1]కొనఁగ
సోగయై యాకు వాలంగ జొంప మగుచుఁ
జిగురు దళుకొత్తెఁ దరులతాశ్రేణులందు. 27

టీ. సానతేఱి = ద్రవము తేటగాఁ గనఁబడి - చెమ్మయుబికి యనుట; పొటమరించి = మొలకెత్తి; నెఱె = సందు; వాసినయట్టి = విచ్చినటువంటి; ఆకురాలుపు గండ్లయందున్ = ఆకులు రాలిన పల్లములయందుండి; తొలఁగి=బయలువెడలి; అతి...కృతిన్ - అతి = మిక్కిలి; బాలకీర = పసివైన చిలుకపిల్లలయొక్క; ఛదాంకుర = ఱెక్కమొలకలయొక్క; ఆకృతిన్ = ఆకారముతో; పొల్చి = ఒప్పి; క్రమమునన్ = వరుసవెంబడిని; కరవీరకోరకగతిన్ = ఎఱ్ఱగన్నేరు మొగ్గలవలె; అరుణంపు మొగ్గలై = ఇంచుక యెఱుపైన ముకుళములై; అరవిచ్చి = సగము విరిసి; పికిలియీఁకల దండలట్లు = పికిలిపిట్టల యీఁకలతోఁ గూర్చిన సరములవలె; గుంపులయి = గుబురులై; పిదపన్ = తరువాత; రేఖలు = ఈనెల గీఱలు; ఏర్పడఁగన్ = ఏర్పడునట్లు; వర్ధిలి = వృద్ధిపొంది; వెడల్పయి = విశాలమై; రెమ్మ = చిఱుఁగొమ్మ; పసరువాఱుచున్ = పచ్చగిల్లుచు; నిక్కన్ = ఎగపుదొంచఁగా; పసరు = పచ్చగిల్లఁగానైన పచ్చఁదనము; పూఁట పూఁటకున్ = ఒక్కొక్క పూఁటకు; కప్పు = నలుపు; ఎక్కన్ = కలదికాఁగా; కప్పునకున్ = ఆ నలుపునకు; తగిన మెఱుఁగు = యుక్తమయిన ప్రకాశము; మీఁదన్ = పైభాగమునందు; నానాఁటికిన్ = దినదినమునకు; గిఱికొనంగన్ = ఆవరింపఁగా; సోగయై = నిడుపై; ఆకు; వాలంగన్ = వ్రేలఁబడఁగా; జొంపము = గుబురుకొన్నది; అగుచున్; తరులతాశ్రేణులందున్ = మ్రాఁకుల యొక్కయు, తీగలయొక్కయు వరుసలయందు; చిగురు; తళుకొత్తెన్ = ప్రకాశించెను.

తా. వసంతఋతువు రాఁగా మ్రాఁకులు తీగలు, మొదలగువానియందలి పండుటాకులు రాలఁగా, నా యాకులు రాలినచోటులందుఁ జెమ్మగలిగి మోసులు పొటమరించి, తొలుత గ్రుడ్డువిచ్చి వెడలిన

1. గొనంగ. పా.

చిలుకపిల్లలకొక్కుల మొలకలవలెఁ దోఁచి, పిమ్మట నెఱ్ఱగన్నెరుపూవన్నె మొగ్గలై, యనంతర మా మొగ్గలు విరిసి పికిలిపిట్ట యాఁకలవలె నేర్పడి, తరువాత నీనెలు బలియ నెదిగి, పసరువన్నె గలిగి, యా పసరువన్నె నల్లఁబాఱి యందులకుఁ దగిన కాంతితో నిడుపై యాకు వాలఁబడఁగా గుబురుగొని చిగురు ప్రకాశించెను. అలం. స్వభావోక్తి.

క. హిందోళంబునఁ బాడిరి, బృందారకసతులు విరహి ♦ బృందార్తిగఁ; ద్రేఁ
చెం దేఁటులు వాసంతిక, విందునఁ; బికశిశువు దాది ♦ వెడలం దోలెన్. 28

టీ. (ఆ సమయమునందు) బృందారకసతులు = దేవతాస్త్రీలు; విరహిబృందార్తిగన్ = ప్రియుల నెడఁబాసిన స్త్రీలయొక్కయు, ప్రియుల నెడఁబాసిన ప్రియులయొక్కయు సమూహము నకు బాధ గలుగునట్లుగా; హిందోళంబునన్ = హిందోళ మనెడి రాగముతో; పాడిరి = గానము చేసిరి. తేఁటులు = తుమ్మెదలు; వాసంతికవిందునన్ = బండిగురివెందపూఁదేనె త్రాగుట యనెడి ప్రియభోజనముచేత; ద్రేఁచెన్ = తృప్తినొంది త్రేనుపు విడిచెను. పికశిశువున్ = కోవెలపిల్లను; దాది = పెంపుడు తల్లియైన కాకి; వెడలందోలెన్ = గూఁటినుండి వెడలఁగొట్టెను - కోవెల కూసె ననుట. (వసంతకాలమురాఁగానే కోవెల కూయుటయు, నా కూఁత విని కాకి కోవెలను గూఁటినుండి వెడలఁదఱుముటయు సుప్రసిద్ధము.) శ్లో. "శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళ రాగకః - శిశిరఋతువుయొక్కయు, వసంతఋతువుయొక్కయుఁ జేరికయందు హిందోళ రాగముతో గానముచేయవలయు" నను ప్రమాణముచేత వసంతాది యగుటంబట్టి హిందోళంబునఁ బాడి రని చెప్పఁబడెను.

సీ. చలిగాలి బొండుమ ♦ ల్లెలపరాగము రేఁచి, నిబిడంబు సేసె వె ♦ న్నెలరసంబు;
వెన్నెలరస ముబ్బి ♦ వెడలించె దీర్ఘికా, మందసౌగంధిక ♦ మధునదంబు;
మధునదం బెగఁబోసె ♦ మాకందమాలికా, క్రీడానుషంగి భృం ♦ గీరవంబు;
భృంగీరవం బహం ♦ కృతిఁ దీగెసాగించెఁ, బ్రోషితభర్తృకా ♦ రోదనముల;
తే. విపినవీథుల [1]వీతెంచెఁ ♦ గుపితమదన
సమద భుజ నత సుమధను ♦ ష్టాంకృతములు
సరస మధుపాన నిధువనో ♦ త్సవ విలీన
యువతి యువకోటి కోరికల్ ♦ చివురులొత్త. 29

టీ. చలిగాలి = చల్లగాలి; బొండుమల్లెల పరాగమున్ = బొండుమల్లెపూవులందలి పుప్పొడిని; రేఁచి = రేఁగించి; వెన్నెలరసంబున్ = చంద్రప్రకాశముయొక్క నీటిని; నిబిడంబుచేసెన్ = నిండుకొనునట్లు చేసెను. వెన్నెలరసము; ఉబ్బి = ఉబికి - పొంగి; దీర్ఘికా...నదంబున్ - దీర్ఘికా = నడబావులయందలి; అమంద = తక్కువకాని - అధికమైన; సౌగంధిక = మిక్కిలి పరిమళముగల చెంగలువలవలని; మధునదంబున్ = పూఁదేనెయొక్క ఏటిని; వెడలించెన్ = బయలు వెడలించెను - ప్రవహింపఁజేసెను. మధునదంబు = ఆ పూఁదేనెయేఱు; మాకంద...రవంబున్ - మాకందమాలికా = తియ్యనిమామిడిచెట్లయొక్క వరుసలయందలి; క్రీడా = విహారములతోడ; అనుషంగి = కూడుకొన్న; భృంగీరవంబు = ఆఁడుతుమ్మెదలయొక్క ఝుంకారధ్వనిని; ఎగఁబోసెన్ = అతిశయింపఁజేసెను. భృంగీరవంబు = ఆ యాఁడుతుమ్మెదలరొద; అహంకృతిన్ = గర్వముచేత;

1. నేతెంచె. పా.

ప్రోషితభర్తృకారోదనములన్ = భర్త దేశాంతరగతుఁడై యుండుటచే ఖేదమునొందిన స్త్రీల యొక్క ఏడ్పులను; తీగెసాగించెన్ = మిక్కిలి పెంచెను. కుపిత...కృతములు - కుపిత = కోపించిన; మదన = మన్మథునియొక్క; సమదభుజ = మదముతోఁగూడిన బాహువులచేత; నత = వంపఁబడిన; సుమధనుః = పూవింటియొక్క; టాంకృతములు = టంకారధ్వనులు; సరస...కోరికలు - సరస = రసవంతమైన; మధుపాన = మద్యము త్రాగుటయందును - మద్యముత్రాగి యనుట; నిధువన = సురతక్రీడ నడపుటయొక్క; ఉత్సవ = వేడుకయందును; విలీన = ఐక్యమైయున్న; యువతి = యౌవనముగల స్త్రీలయొక్కయు; యువ = యువకులయొక్కయు; కోటి=సమూహము యొక్క; కోరికల్ = అభీష్టములు; చివురులొత్తన్ = చిగిరింపఁగా - పెరుఁగఁగా ననుట; విపిన వీథులన్ = వనమార్గములయందు - ఉద్యానవనములం దనుట; వీతెంచెన్ = విసరెను - వ్యాపించెను.

తా. ఆ వసంతసమయమునందుఁ జల్లగాలిచే రేఁగిన పెనుమల్లెల పుప్పొడిచేత వెన్నెలవలన ద్రవించుచున్న నీరు చిక్క నయ్యెను. వెన్నెలనీటినింపుచేత నడబావులలోని చెంగలువలవలని పూఁదేనె యేఱులై పాఱెను. ఆ పూఁదేనెవెల్లువలచేతఁ దియ్యమామిడిమ్రాఁకులలో విహరించు తుమ్మెదల రొదలు హెచ్చెను. ఆ తుమ్మెదరొదలచేత మగలు దేశాంతరమందుండుటచే దుఃఖపడుచున్న యువతులయేడ్పు లతిశయించెను. ఆ యేడ్పులచేత మన్మథుని పూవింటిమ్రోఁత లుద్యానవనములందు వ్యాపించెను. ఆ వింటిమ్రోఁతలు వ్యాపింపఁగా రుచ్యములయిన మద్యములు త్రాగి క్రీడించుచున్న స్త్రీ పురుషుల కోరికలు కొనసాగెను. వసంతఋతువు రాఁగానే చల్లగాలియు, వెన్నెలయుఁ దుమ్మెదల రొదలును, కోవెలకూఁతలును మనోహరములై యొప్పెననియు, వానిచేత విరహిణీస్త్రీలకుఁ దాపమును, ప్రియులతోఁ గూడియుండు స్త్రీలకు నిష్టార్థసిద్ధులును సిద్ధించె ననియు భావము. అలం. కారణమాల, కావ్యలింగమును.

క. అత్తఱి మురిపపునడఁ జెలి, కత్తియగమి గొలువ మృదుల § కలభాషలఁ ద
ళ్కొత్తెడు వెడనగవులతోఁ, జిత్తభవుం డార్వ ననలు § చిదుము నెపమునన్. 30

టీ. అత్తఱిన్ = ఆ వసంతసమయమునందు; మురిపపునడన్ = యౌవనగర్వముతోడి నడకతో; చెలికత్తియ గమి = చెలికత్తెలయొక్క గుంపు; కొలువన్ = సేవింపఁగా; మృదులకల భాషలన్ = సులభోచ్చారణగల యింపైన మాటలతోను; తళ్కొత్తెడు వెడనగవులతోన్ = ప్రకాశించుచున్న చిఱునవ్వులతోను; చిత్తభవుండు = మన్మథుఁడు; ఆర్వన్ = కేకలువేయఁగా; ననలు చిదుము నెపమునన్ = పువ్వులు కోయుట యనెడి సాకుచేత. తర్వాతి పద్యముతో నన్వయము.

చ. అలకనిజీబులోఁ గుసుమ § మద్దిన పావడ దోఁపఁ గొప్పుచెం
గలువలవల్పుఁ జన్నుఁగవ § కస్తురితావియుఁ బ్రస్తరింప నం
దెలరొద మీఱఁ బెన్నిధిగ § తిన్ వ్రతికిం బొడకట్టె వేల్పుఁదొ
య్యలి చిఱుసానఁ బట్టిన య § నంగుని మోహనబాణమో యనన్. 31

టీ. వేల్పుఁదొయ్యలి = దేవతాస్త్రీయైన పుంజికస్థల; అలకనిజీబులోన్ = సన్నని వలిపపుఁ జీరలో; కుసుమము అద్దిన = ఎఱ్ఱచాయ వేసిన; పావడ = గాగరా - కుచ్చెకోక; తోఁపన్ = పైకిఁ గనఁబడఁగా; కొప్పుచెంగలువలవల్పున్ = కొప్పునందుఁదుఱిమిన చెంగల్వపూలయొక్క పరిమళమును; (ఇచట 'చెంగలువల = ఎఱ్ఱకలువలయొక్క' అని పూర్వవ్యాఖ్యాత లర్థము వ్రాసిరి.

ఆ కలువలను కొప్పునఁ దుఱుముట యప్రసిద్ధము.) చన్ను... తావియున్ - చన్నుఁగవ= స్తనద్వయమునందుఁ (బూయఁబడిన); కస్తురి తావియున్ = కస్తూరియొక్క పరిమళమును; త్రస్తరింపన్ = తచ్చనలాడఁగా - నలుప్రక్కలను వ్యాపింపఁగా; అందెలరొద = కాలియందెలయొక్క ధ్వని; మీఱన్ = అతిశయింపఁగా; పెన్నిధిగతిన్ = పెద్ద నిక్షేపమువలె; చిఱుసానన్ = చిన్నదైన మెఱుఁగుసానయందు; పట్టిన అనంగుని ...బాణమో = పదునుగా నూఱిన మన్మథునిదైన మోహమును బుట్టించు నరవిందబాణమో; అనన్ = అనునట్లు; వ్రతికిన్ = వ్రతనిష్ఠగలవాఁడయిన యా మునీశ్వరునకు; పొడకట్టెన్ = కనఁబడెను.

తా. అప్పుడు పుంజికస్థల కుసుంభాచాయవేసిన పావడ గట్టుకొని, దానిపై వలిపపుఁబయ్యఁట చీర ధరించి, మంచివాసనగల చెంగలువపువ్వులు కొప్పునఁ జెరివి, ఱొమ్మునందుఁ గస్తూరిగంధము పూసికొని, వానిపరిమళము లెల్లయెడలను వ్యాపింపఁగా, మన్మథునిదైన మోహనమనెడి బాణమో యనునట్లు కాలియందెలు మ్రోయ, నొయ్యారపు నడకతో నా మునీశ్వరునెదుటఁ బెన్నిధివలెనే నిలువఁబడెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. అత్తెఱంగున నదరిపా ౹ టారజంపు
వన్నెఁ బొడకట్టి తాఁ బాడు ౹ సన్నరవళి
పాట లళిఝంకృతిశ్రుతిఁ ౹ బాదుకొనఁగఁ
జూడకయ చూచుచూపుతో ౹ సుడియుటయును. 32

టీ. అత్తెఱంగునన్ = ఆ విధముగా; అదిరిపాటు = ఉన్నట్లుండి - అకస్మాత్తుగా; ఆరజంపు వన్నెన్ = మనోహరమైన వేషముతో; పొడకట్టి = ఆ మునికిఁ గనఁబడి; తాన్ = తాను - ఆ యచ్చర; పాడు సన్నరవళి పాటలు = పాడునట్టి సన్నని ధ్వనితోడి పాటలు; అళిఝంకృతి శ్రుతిన్ = తుమ్మెదల జుమ్మను రొదలనెడి స్తుతియందు; పాదుకొనఁగన్ = నెలకొనఁగా-లయింపఁగా ననుట. చూడకయ చూచుచూపుతోన్ = చూడనట్టే చూచు యోరచూపుతో; సుడియుటయును = చుట్టిచుట్టి మెలఁగఁగా.

తా. ఆ విధముగా నుట్టిపడినట్టు మనోహరమయిన వేషముతో నా పుంజికస్థల యా మునీశ్వరునకుఁ గనఁబడి తుమ్మెదల ఝుంకారధ్వనితో లయించునట్లు సన్ననియెలుగుతోఁ బాటపాడుచు నోరచూపులతో నాతనిఁ జూచుచుఁ జుట్టిచుట్టి తిరుగుచుండఁగా. ముందున కన్వయము.

చ. తలకొని దాని తమ్మలపుఁ ౹ దావియు మోవియుఁ గౌను మేను న
గ్గలపుమెఱుంగు లీను తెలి ౹ గన్నులుఁ జన్నులు భృంగమాలిక
న్గెలిచిన యారుతీరుఁ దగు ౹ నెన్నడలుం దొడలున్ వివేకముం
గలఁపఁగఁ గాంచి పంచశర ౹ కాండ విఖండిత ధైర్యసారుఁడై. 33

టీ. దాని తమ్మలపుఁదావియున్ = ఆ యప్సరసదైన తాంబూలపుఁబరిమళమును; మోవియున్ = అధరమును; కౌనున్ = నడుమును; మేనున్ = దేహమును; అగ్గలపుమెఱుంగులు = అధికమైన కాంతులను; ఈను తెలికన్నులున్ = పుట్టించునట్టి స్వచ్ఛములయిన కన్నులును; చన్నులున్; భృంగమాలికన్ = తుమ్మెదలబారును; గెలిచిన యారుతీరున్ = జయించిన (మించిన) నూఁగారు చక్కఁదనమును; తగు నెన్నడలున్ = తగిన మనోహరమయిన నడకలును; తొడలున్; తలకొని = పూని; వివేకమున్ = మంచిచెడ్డల నెఱిఁగెడి తనతెలివిని; కలఁపఁగన్ = కలఁతనొందింపఁగా;

(మునీశ్వరుఁడు); కాంచి = (పుంజికస్థలను) చూచి; పంచ...సారుఁడై - పంచశర = మన్మథుని యొక్క; కాండ = బాణములచేత; విఖండిత = లెస్సగా నఱకఁబడిన; ధైర్యసారుఁడై = ధీరత్వముయొక్క స్థిరాంశముగలవాఁడై. అనంతర పద్యముతో నన్వయము.

తా. ఆ పుంజికస్థలయొక్క తాంబూలపుఁబరిమళమును, దానియవయవముల మనోహరత్వమును, దాని చూపుల తీరును, దాని నడకల యందమును జూచి, యా పారుఁడు తాలిమిచెడి మన్మథ వేదనగలవాఁడై. అలం. ఉపమ, కావ్యలింగము.

క. మేను గరుపాఱఁ దమి న, మ్మౌని జపముఁ దపముఁ దన్ను ♦ మఱచి యనంగ
గ్లానిఁ బడి కదిసి వడఁకుచు, హీనస్వర మెసఁగఁ బ్రోవ ♦ వే నన్ననుచున్. 34

టీ. అమ్మౌని = ఆ మునీశ్వరుఁడు; మేను గరుపాఱన్ = దేహము గగుర్పొడువఁగా; తమిన్ = తమకముచేత; జపమున్ = మంత్రావృత్తిని; తపమున్ = నియమముతోడి నిశ్చలమైన యునికిని; తన్నున్ = తనదైనస్థితిని; మఱచి; అనంగగ్లానిన్ = మన్మథతాపమును; పడి = పొంది; కదిసి = ఆ యప్సరసదగ్గఱచేరి; వడఁకుచున్ = సాత్త్వికభావజనితమైన వణఁకును బొందుచు; హీనస్వరము ఎసఁగన్ = ఎలుఁగుతగ్గుట అతిశయింపఁగా; నన్నున్ బ్రోవవే = నన్ను రక్షింపవా! అనుచున్ = అని వేఁడుకొనుచు. తర్వాతి కన్వయము.

తే. చెయ్యిపట్టినమాత్రాన ♦ శిరసు వంచి, యవశచందానఁ బైవ్రాలు ♦ నవ్వధూటిఁ
బర్ణశాలాంతరముఁ జేర్చి ♦ బ్రాహ్మణుండు, కెరలుకోర్కులఁ గందర్ప ♦ కేళిఁ దేలె.

టీ. చెయ్యిపట్టినమాత్రానన్ = చేయిపట్టుకొన్నమాత్రముచేతనే; శిరసువంచి = తలను వాల్చి; అవశచందానన్ = మోహపరవశయైన విధమున; పైవ్రాలు నవ్వధూటిన్ = మీఁదికొరగిన యా యప్సరస్త్రీని; పర్ణశాలాంతరమున్ చేర్చి = ఆకుటింటిలోపలికిఁ దీసికొనిపోయి; బ్రాహ్మణుండు = ఆ బ్రహ్మర్షి - పారుఁడు; కెరలు కోర్కులన్ = అతిశయించుచున్న యపేక్షలతో; కందర్పకేళిన్ = మన్మథక్రీడయందు - సురతమునందు; తేలెన్ = ఓలలాడెను - సుఖించెననుట.

క. తప మంతయుఁ బొలివోవఁగ, నపు డన్నియు నుజ్జగించి ♦ యయ్యంగనతోఁ
దపసి మనోజక్రీడా, విపులైశ్వర్యంబు లనుభ ♦ వించుచు నుండెన్.[1] 36

టీ. తపసి = తపస్సుచేయుచున్న యా ఋషి; తపమంతయున్ = తానుజేసినతపస్సంతయు; పొలివోవఁగన్ = వ్యర్థమైపోఁగా; అపుడు = ఆ సమయమునందు; అన్నియున్ = తపోజపాదు లన్నియు; ఉజ్జగించి = విడిచి; అయ్యంగనతోన్ = ఆ పుంజికస్థలతో; మనోజక్రీడావిపులైశ్వర్యం

1. పాఠాంతరము. క. తపనోదయాస్తసమయము, లిపు డని కాలప్రమాణ ♦ మెఱుఁగనితమి న
చ్చపలాక్షిఁ గూడి రతిసుఖ, విపులైశ్వర్యంబు లనుభ ♦ వించుచు నుండెన్.

టీ. ఇపుడు = ఈ సమయమునందు; తపనోదయాస్తసమయములు = ప్రొద్దుపొడుచుటయుఁ, గ్రుంకుటయును; (అగును) అని; కాలప్రమాణము = వేళకొలఁది; ఎఱుఁగనితమిన్ = తెలియని తమకముతో; అచ్చపలాక్షిన్ = ఆ పుంజికస్థలను; కూడి = కలసి; రతిసుఖవిపులైశ్వర్యంబులు = సంభోగసుఖమువలని విశేషమైన కలుములను; అనుభవించుచుండెన్ = పొందుచుండెను. అనఁగా నతఁడా పుంజికస్థలతోడి సురతసుఖము ననుభవించునపుడు సూర్యుఁ డుదయించునదియు, నస్తమించునదియుఁ దెలియకయుండెను.

బులు=సంభోగములవలని అధికమైన సుఖసంపదలను; అనుభవించుచుఁ ఉండెన్-అనఁగా నా పారుఁడను ముని తనతపస్సంతయు వ్యర్థమగునట్లు జపము, తపము, స్నానము మొదలయిన నియమములన్నియు మాని, యా యప్సరసతో సంభోగసుఖముల ననుభవించుచుండెను.

క. ఈ రీతిఁ గొంతకాలం, బారామమహామహీధ్రారణ్యములం
దా రామవలలఁ దగిలి వి, హారము సలుపంగ గర్భమై తటి యగుడున్. 37

టీ. ఈ రీతిన్ = ఈ విధముగా; కొంతకాలంబు; ఆ రామవలలన్ = ఆ పుంజికస్థలపైఁ గల వలపులందు; తగిలి = ఆసక్తిగలిగి-దానికి వశుఁడై; ఆరామ...ములన్- ఆరామ = ఉద్యానవనములందును; మహామహీధర = గొప్ప కొండలయందును; అరణ్యములన్ = అడవులయందును; విహారము సలుపంగన్ = సంభోగప్రవర్తనమును చేయఁగా - జరపఁగా; గర్భమై = అది చూలు దాల్చి; తటి యగుడున్ = ప్రసవసమయము కాఁగా. అతఁ డట్లు పుంజికస్థలతోఁగూడఁ గొంత కాలముద్యానవనములు మొదలయిన రమ్యప్రదేశములందు రమింపఁగా నది గర్భము ధరించి ప్రసవసమయము నయ్యెను.

క. అంత ననుఁ గాంచి యది విపి, నాంతరమునఁ బాఱవైచి యరిగెఁ; గృపార్ద్ర
స్వాంతుఁడగు సంయమీంద్రుఁడుఁ, జింతింపక పోయె; నేమి చెప్పుదు నధిపా!

టీ. అధిపా! = రాజా! అంతన్ = అంతట - ప్రసవము కాఁగానే యనుట; అది = ఆ యప్సరస; ననున్ కాంచి = నన్ను కని; విపినాంతరమునన్ = ఆ యడవినడుమ; పాఱవైచి = విసరి పడవేసి; అరిగెన్ = పోయెను. కృపార్ద్రస్వాంతుఁడు = కరుణచేఁ గరఁగిన మనసు గలవాఁడు; అగు సంయమీంద్రుఁడున్ = అగునట్టి మునిశ్రేష్ఠుఁడును; చింతింపక పోయెన్ = నన్ను విచారింపక పోయెను. ఏమి చెప్పుదున్? = ఇఁక నే నేమి చెప్పఁగలను? కన్నతల్లిదండ్రు లిద్దఱును బసిపాపనైన నన్ను విచారింపక యెవరంతట వారు పోయి రనఁగా నా దుర్దశ యిట్టి దని చెప్పుటకు నేమి గల దనుట.

వ. అట్లు వైచి చనుటయు నాఁకటం గటకటం బడుచుండి తీండ్రించు శశిమండలంబున వెడలు శిశిరకిరణప్రణాళికామిళదమృతరసగ్రాసంబునం జేసి కొన్ని పూఁటలం బుటపుటనైన నన్నుం గనుంగొని మునీంద్రుండు ప్రియంబంది నిజాశ్రమంబునకుం గొని చని శశికళాసంవర్ధిత నగుటం జేసి నాకుం గళావతి యను నామం బిడి పెనుచుచుండ నేనును జనకసేవాపరతం బ్రవర్తిల్లుచుండునంత. 39

టీ. అట్లు = ఆ విధముగా; వైచిచనుటయున్ = ఆ యప్సరస పాఱవేసి పోఁగా; ఆఁకటన్ = క్షుత్తుచేత; కటకటంబడుచుండి = బాధపడుచుఁ బడియుండి; తీండ్రించు శశిమండలంబునన్ = మిక్కిలి వెలుఁగుచున్న చంద్రమండలమునుండి; వెడలు...గ్రాసంబునంజేసి - వెడలు = స్రవించుచున్న; శిశిరకిరణ = చల్లని వెలుఁగులయొక్క; ప్రణాళికా = పరంపరతోడ; మిళత్ = కూడుకొనుచున్న; అమృతరస = సుధారసముయొక్క; గ్రాసంబునంజేసి = ఆహారముచేత; కొన్ని పూఁటలన్ = కొన్ని దినములలో; పుటపుటన = పెరుఁగుట కలదానను; ఐన నన్నున్ = అయినట్టి నన్ను; కనుంగొని = చూచి; మునీంద్రుండు = మునిశ్రేష్ఠుఁడయిన యా పారుఁడు; ప్రియంబు

అంది= ప్రేమను వహించి; నిజాశ్రమంబునకున్ = తన యాశ్రమమునకు; కొనిచని = తీసికొనిపోయి; శశికళాసంవర్ధితన్ = చంద్రకళలచేత వృద్ధిఁబొందినదానను; అగుటంజేసి = అగుటచేత; నాకు; కళావతి; అను నామంబు = అనునట్టి పేరు; ఇడి = పెట్టి; పెనుచుచుండన్ = వృద్ధిఁబొందించుచుండఁగా; నేనును; జనకసేవాపరతన్ = తండ్రిని సేవించుటయందలి యాసక్తతచేత; ప్రవర్తిల్లుచుండునంతన్ = మెలఁగుచుండఁగా. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. ఆ విధముగాఁ గన్నతల్లి యడవిలో దిగవిడిచి పోఁగా, నే నాఁకలిగొని బాధపడుచుండి యప్పుడు వెలుఁగుచున్న చంద్రమండలంబుననుండి స్రవించుచున్న యమృతధార లాహారంబుగాఁ గొన్ని దినములు పెరిఁగితిని. అనంతరము నా తండ్రియైన పారుఁడు నన్నుఁ జూచి కరుణించి తన యాశ్రమమునకుఁ దీసికొనిపోయి కళావతి యని పేరుపెట్టి పెంచెను. నేను నా తండ్రికి సేవ చేయుచుంటిని.

[పైవచనమునర్థమే రెండు పద్యములుగాఁ బ్రత్యంతరములం దుండె ననియు, నవి ప్రక్షిప్తములని వచనమే గ్రహింపనయ్యె ననియు బ్రౌన్ దొరగారి ప్రతిలో వ్రాయఁబడియున్నది. ఆ పద్యము లిందును నీక్రిందఁ గనఁబఱుపనయ్యెడి.]

ఉ. ఆ సమయంబునం బొగులు • చాఁకటిపెల్లున నంతకంతకున్
గాసిలి పైపయిన్ వదన • గహ్వర మెండఁగ నేడ్చి యేడ్చి యే
మాసయుఁ గాన కంతఁ దుహి • నాంశుఁడు దోఁచినఁ దత్కళారస
గ్రాసవిధిన్ శరీర మమ • రంగ భజించితి దైవికంబునన్. 40

టీ. ఆ సమయంబునన్ = అట్లు తల్లి పాఱవేసి పోయిన సమయమునందు; ఆఁకటిపెల్లునన్ = క్షుత్తుయొక్క యాధిక్యముచేత; పొగులుచున్ = తపించుచు; అంతకంతకున్ = అప్పటి కప్పటికి; గాసిలి = శ్రమనొంది; పైపయిన్ = మీఁదమీఁద; వదనగహ్వరము = గుహవలెఁ దెఱవఁబడిన నోరు; ఎండఁగన్ = తడియాఱునట్లు; ఏడ్చి యేడ్చి = చాలసేపేడ్చి; ఏ మాసయున్ = ఏ విధమయిన యాశయు; కానక = పొందక; అంతన్ = అనంతరము; దైవికంబునన్ = దైవసాహాయ్యమువలన; తుహినాంశుఁడు = చంద్రుఁడు; తోఁచినన్ = ఉదయింపఁగా; తత్కళారసగ్రాసవిధిన్ = ఆ చంద్రకళల ద్రవము నాహారముగాఁ జేసికొనుటచేత; శరీరము = దేహమును; అమరంగన్ = ఒప్పఁగా; భజించితిన్ = సేవించితి - కాపాడుకొంటి ననుట.

సీ. ఏ నవ్విధంబున • మేను పెంచుచు నుండ, నాచంద మంతయు • నాత్మ నెఱిఁగి
కడు సంభ్రమమున న • క్కడికి నేతెంచి యిం, పెసఁగ మైనిండిన • కసటు[1] కడిగి
తనయురంబునఁ జేర్చు • కొని పోయి యాశ్రమ, స్థలమున నిజపర్ణ • శాల నునిచి
విధుకళాంశాహార • విధి వసించితిఁ గాన, నాకుఁ గళావతీ • నామ మొసఁగి
తే. నయము మీఱంగఁ బెనుప నా • నాఁటఁ బెరిఁగి
శైశవము మాని యౌవనో • త్సవముఁ జెంది
జనకు నేమైన నడుగుచు • సంతతంబు
నోపి శుశ్రూష చేయుచు • నున్నచోట. 41

1. తుడిచి. పా.

టీ. ఏను = నేను; అవ్విధంబునన్ = ఆ ప్రకారమున; మేను పెంచుచు నుండన్ = దేహమును పెంచుకొనుచుండఁగా; ఆ చందము = అట్లు నేను పెరుఁగుచుండువిధము; అంతయును; ఆత్మన్ = మనసునందు; ఎఱిఁగి = తెలిసికొని; కడు సంభ్రమమునన్ = మిక్కిలి తత్తఱపాటుతో; అక్కడికిన్ ఏతెంచి = నేనున్నతావునకు వచ్చి; ఇంపు ఎసఁగన్ = సంతోషము అతిశయింపఁగా; మైన్ = నా దేహమునందు; నిండిన కసటు = నిండుకొన్న మురికిని; కడిగి; తన యురంబునన్ = తన ఱొమ్మునందు; చేర్చుకొని పోయి = అంటఁబట్టి యెత్తుకొని పోయి; ఆశ్రమస్థలమునన్ = తపోవనప్రదేశమునందు; నిజపర్ణశాలన్ = తనదైన యాకుటింటియందు; ఉనిచి = పెట్టి; విధుకళాంశాహారవిధిన్ = చంద్రకళల యంశముల నాహారముగాఁ జేసికొనుటచేత; వసించితిన్ కాన = ఉంటిని కనుక; నాకు; కళావతీనామము = కళావతి యను పేరు; ఒసఁగి = ఇచ్చి; నయము మీఱంగన్ = సుకుమారత్వము అతిశయింపఁగా; పెనుపన్ = పెంచఁగా; నానాఁటన్ = దినక్రమమున; పెరిఁగి = వర్ధిల్లి; శైశవము మాని = పసిబిడ్డతనము వదలి; యౌవనోత్సవమున్ = పరువపుగరువమును; చెంది = పొంది; జనకున్ = తండ్రిని; ఏమైన = ఏదియైనను; అడుగుచున్; సంతతంబు = ఎల్లప్పుడును; ఓపి = ఓపిక కలిగి; శుశ్రూష చేయుచున్ ఉన్నచోటన్ = సేవ చేయుచుండునప్పుడు.

క. ఎవ్వారు చూచినఁ జూపుల, చివ్వకుఁ బద నడఁగి నడచు సిగ్గున నొఱపై
రవ్వకు మొదలగు పాపపు, జవ్వన మెదిరించె జిగి యెసఁగ నామేనన్. 42

టీ. ఎవ్వరు చూచినన్ = ఎవరు నన్నుఁ జూచినను; చూపులచివ్వకున్ = చూపులజగడమునకు - ఎదిరించి తిరిగి చూచుట కనుట; పదను అడఁగి = వాడిమి తగ్గి; నడచు సిగ్గునన్ = వర్తించునట్టి లజ్జచేత; ఒఱపై = అందమై; రవ్వకున్ = అల్లరికి - ఇట్లున్న దని యట్లున్నదని చూచినవా రాడిపోసికొనుటకు; మొదలు = మూలము - కారణము; అగు పాపపు జవ్వనము = అగునట్టి దోషాస్పదమయిన వయసు; నామేనన్ = నా దేహమునందు; జిగి ఎసఁగన్ = నిగనిగని కాంతి అతిశయింపఁగా; ఎదిరించెన్ = ఎదుర్కొనెను - కలిగె ననుట.

తా. నన్నుఁ జూచినవారిని మరలఁ గన్నెత్తి చక్కఁగాఁ జూచుటకు సంకోచము కలిగించునట్టి సిగ్గు హెచ్చఁగా, నీ పడు చిట్లున్న దట్లున్న దని చూచిన జను లాడిపోసికొనుటకుఁ జోటయిన యౌవనము నాకుఁ గలిగెను. యౌవనవంతురాల నైతి నని భావము.

శా. ఆవేళం బొడగాంచి ఖేచరుఁ డొకం డాసక్తి దేవాపిసం
జ్ఞావంతుండు సబాంధవుం డగుచు నిశ్శంకన్ ననున్ వేఁడువాఁ
డై వాచంయముఁ డగ్నికార్యనిరతుం డై యున్నచోఁ బర్ణశా
లావాసంబున కేఁగుదెంచి నిజభావాకాంక్ష సూచించినన్. 43

టీ. ఆ వేళన్ = అట్టి నా యౌవనకాలమునందు; ఖేచరుఁ డొకండు = ఒక గంధర్వుఁడు; దేవాపిసంజ్ఞావంతుండు = దేవాపి యను పేరుగలవాఁడు; పొడగాంచి = నన్నుఁజూచి; ఆసక్తిన్ = నన్నుఁ బెండ్లాడవలె ననెడి యపేక్షతో; సబాంధవుండు = చుట్టములతోఁ గూడినవాఁడు; అగుచున్; చుట్టములతోఁ గూడ ననుట; నిశ్శంకన్ = జంకులేనితనముతో - జంకక యనుట; నన్నున్ వేఁడువాఁడై = నన్ను అడుగునట్టివాఁడై; వాచంయముఁడు = నాతండ్రియైన పారుఁడను ముని; అగ్నికార్యనిరతుండు = హోమకార్యమునం దాసక్తుఁడు - హోమము చేయుచున్న

వాఁడు; ఐ యున్నచోన్ = అయియున్నప్పుడు; పర్ణశాలావాసంబునకున్ = ఆకుటిల్లయిన యునికిపట్టునకు; ఏఁగుదెంచి = వచ్చి; నిజభావాకాంక్షన్ = తన మనసులోని కోరికను; సూచించినన్ = సూచన చేయఁగా - తెలియఁజేయఁగా ననుట.

తా. అట్లు నేను యౌవనవంతురాలనై యుండఁగా దేవాపియనెడి గంధర్వుఁడొకఁడు నన్నుఁజూచి వలచి చుట్టములతోఁగూడఁ బారునితపోవనమునకు వచ్చి, యాయన హోమకార్యము నడుపుచుండు సమయమునందుఁ బర్ణశాలఁ జొచ్చి 'యీ మునీశ్వరునిఁ గన్నె నిమ్మని యడుగుట యె' ట్లని జంకక తన మనసులోని కోరిక యాయనకుఁ దెలియఁజేయఁగా.

సీ. శిఖిపింఛదళపరి ష్కృతములై సేమంతి, విరులతీరగు శిరో వేష్టనములు
నెఱగంటిచూడ్కిఁ దా యెతులబాహులు వంచి, నారాజులల్లార్చు నారజములుఁ
గాదంబరీగంధ గర్భంబులై వల్చు, ఘనసారమిళదాస్య గంధములును
దరహాసములఁ దోఁచు తాంబూలసేవాంధ, కారితాధరరద క్షతుల యొఱపుఁ

తే. జిటులు గందంపుఁబూఁతలు జిహ్వికలకు
ననుపు నెఱవాదిబంటుపం తపుఁ బదరులు
ఘనమగు జుగుప్స పెనుప న జ్జనముఁ జూచి
ఋషి మనంబునఁ గడు నస హ్యించుకొనుచు. 44

టీ. శిఖి...ములై - శిఖిపింఛదళ = నెమిలిపురియొక్క ఈఁకలచేత; పరిష్కృతములై = అలంకరింపఁబడినవై; సేమంతివిరులతీరు = చేమంతిపువ్వువిధము గలవి; అగు శిరోవేష్టనములును = అగునట్టి తలపాగలును; ఎఱగంటిచూడ్కిన్ = మద్యపానము చేయుటచే నెఱ్ఱవాఱిన కన్నుల చూపుతో; తాయెతులబాహులు = సందిటితాయెతులుగల చేతులను; వంచి = వంగునట్లుపట్టి; నారాజులు = కత్తులను; అల్లార్చునారజములున్ = ఆడించునట్టి (త్రిప్పునట్టి) యందములును; కాదం...బులై - కాదంబరీగంధ = మద్యముయొక్క వాసన; గర్భంబులై = లోపలఁగలవై; వల్చు...ములును - వల్చు=వాసనకొట్టునట్టి; ఘనసార = పచ్చకర్పూరముతోడ; మిళత్ = కూడిన; ఆస్యగంధములును = నోటికంపులును; దరహాసములన్ = చిఱునవ్వులతోడ; తోఁచు...యొఱపున్ - తోఁచు = కనఁబడుచున్న; తాంబూలసేవా = విడెముచేయుటచేత; అంధకారిత =కనఁబడనివిగాఁ జేయఁబడిన; అధర = పెదవులయందలి; రదక్షతుల = పంటినొక్కులయొక్క; ఒఱపున్ = మనోహరత్వమును; చిటులు గందంపుఁబూఁతలును = దట్టముగాఁ బూసికొనుటచే నెండి పేటెత్తినచందనపుఁబూఁతలును; జిహ్వికలకున్ = నాలుకలకు; ననుపు...బదరులును - ననుపు = వాడుకపడిన; నెఱవాది = చతురత్వముగల; బంటుపంతపు = శూరులవైన ప్రతిజ్ఞలతోడి; పదరులును = తత్తఱపుమాటలును; ఘనము = అధికము; అగు జుగుప్స = అయినట్టిరోఁతను; పెనుపన్ = వృద్ధిఁ బొందింపఁగా; అజ్జనమున్ = కన్యక నడుగవచ్చిన యా గంధర్వులసమూహమును; ఋషి = ముని - మాతండ్రియయిన పారుఁడు; చూచి మనంబునన్ = మనస్సునందు; కడున్ అసహ్యించుకొనుచున్ = మిక్కిలి రోఁతపడుకొనుచును. తరువాతి పద్యముతో నన్వయము.

తా. మునియైన మా తండ్రి కన్యనడుగఁ దనయింటికి వచ్చిన యా గంధర్వులు నెమిలియీఁకలుగూర్చి చుట్టిన గుండు తలపాగలును, మద్యపానము చేయుటచే నెఱ్ఱవాఱిన చూపులును, సందిటి దండలతోడి చేతులందుఁ ద్రిప్పఁబడుచున్న కత్తులును, కల్లుకంపు తోఁపకుండు కట్లు

తాంబూలముతోఁ జేర్చి వేసికొన్న పచ్చకర్పూరపు నోటికంపును, చిఱునవ్వులును, పలునొక్కులు కానరాకుండునట్లంటిన తమ్మలపు రక్తిమతోఁ గూడిన యధరములును, చిట్లు గందపుఁ బూఁతలును, నేర్పుతోడి తత్తరపుఁ బలుకులును గలిగి, మనసునకు రోఁత పుట్టింపఁగాఁ జూచి యసహ్యపడుచు. అలం. స్వభావోక్తి.

శా. ఆహా! ధన్యుఁడ నైతి, మద్విమల వంశాచారవిద్యాతప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుది ఫలించెన్ నాగవాసంబు మ
ద్గేహక్షోణికి బిడ్డ వేఁడుటకు నేతేఁగాంచుటన్; బ్రాహ్మ్యమిం
కోహో! చాలుఁ; బొకాలిపోయెదరొ పోరో; నోటిక్రొవ్వేటికిన్? 45

టీ. ఆహా ! = ఔరా ! నాగవాసంబు = భోగమువారిగుంపు; మద్గేహక్షోణికిన్ = నా యింటిపట్టునకు; బిడ్డన్ వేఁడుటకున్ = కన్యకను అడుగుటకై; ఏతేఁగాంచుటన్ = వచ్చునంతటి యదృష్టమును బొందుటచేత; ధన్యుఁడనైతిన్ = నేను కృతార్థుఁడ నైతిని. మద్విమల... హోమాదులు - మత్ = నాయొక్క; విమల = స్వచ్ఛమైన - నిర్దోషమైన; వంశ = కులము; ఆచార = సద్వర్తనము; విద్యా = చదువు; తపశ్శ్రీ = తపస్సుయొక్క సంపత్తి; హోమ = వైశ్వదేవాది హోమములు; ఆదులు = మొదలుగాఁగలవన్నియు; నేఁడుగా = ఈ దినముగదా; తుది = కడపలగా; ఫలించెన్ = పండెను. ఓహో ! = బళీ ! ఇఁకన్; బ్రాహ్మ్యము = బ్రాహ్మణత్వము; చాలును. నోటిక్రొవ్వు = నోటియొక్క క్రొవ్వు - క్రొవ్వుతోడి మాట లనుట. ఏటికిన్ ? = ఎందులకు ? పొకాలిపోయెదరో = ఇంతటితో వెడలి పోయెదరా ? పోరో = పోకుందురా ? (చెప్పుఁడు.)

తా. ఔరా ! భోగమువారి గుంపంతటిది నాబిడ్డ నడుగవచ్చునంతటి భాగ్య మబ్బెను. నేను కృతార్థుఁడనైతిని. నా వంశాచారములు పావనము లయ్యెను. నా చదువు, సంధ్య, జపము, తపము మొదలుగాఁ గలవన్నియు ఫలించెను. నా బ్రాహ్మణత్వ మింతమాత్రము మేలిమిపొందినది చాలును. ఈ నోటిక్రొవ్వుమాటలు మాని మీ రిప్పుడు వెడలిపోయెదరా? లేదా? చెప్పుడు. అలం. వ్యాజస్తుతి.

క. మీతరమువార లేతఱి, నేతరితనమునఁ దపస్వి గృహ కన్యకలన్
వీతభయవృత్తి వేఁడిరొ, కో తముఁ దర్కింప కౌర ! క్రొవ్వు లటంచున్. 46

టీ. మీ తరమువారలు = మీవంటివారు - మీవంటి నీచజాతిజను లనుట. ఏతఱిన్ = ఎప్పుడైనను; ఏతరితనమునన్ = ధూర్తత్వముతో; తపస్విగృహకన్యకలన్ = తపస్సుచేసికొనునట్టి బ్రాహ్మణుల యింటి పిల్లలను; వీతభయవృత్తిన్ = భయములేని వర్తనముతో - వీరి నెట్లడుగవచ్చునను భయములేక యనుట; తమున్ = తమ్ము - తమయోగ్యతను; తర్కింపక = విచారింపక; వేఁడిరొకో = అడిగిరా ? - అడిగినవారు కారుగదా యనుట; ఔర ! = ఆశ్చర్యము ! క్రొవ్వులు = ఏమి మీ మదములు? అటంచున్ = అని పలుకుచు. తరువాతి పద్యముతో నన్వయము.

తా. ఇంతకుమును పెన్నఁడును మీవంటికులహీనులు తమ యోగ్యత యిట్టిది యను విచారము లేక తపస్సు చేసికొనునట్టి మావంటి యుత్తమబ్రాహ్మణుల కన్యకలను దమ కిమ్మని యడిగియెఱుఁగరు. ఇప్పుడు మీ రడుగుట చూడఁగా మీవంటి క్రొవ్వుపట్టిన దుష్టులు మీరేకాని యితరులు కారని తోఁచుచున్న దని పలుకుచు.

క. వసుధేశ ! ముక్కు డుస్సిన, పసరముక్రియఁ గెరలి తిట్టెఁ § బక్కన ఋషి; వా
రుసురు మని వెడలిపోయిరి, ముసలి గదా పుట్టినిల్లు § ముఖ్యోష్ణతకున్ ! 47

టీ. వసుధేశ ! = ఓ రాజా ! ఋషి = నా తండ్రియైన ముని; ముక్కుడుస్సిన పసరము క్రియన్ = ముక్కుఁద్రాడు దూసిపోయిన యెద్దువలె; కెరలి = రేఁగి; పక్కనన్ = తటాలున - ముందువెనుకఁ జూడక యనుట; తిట్టెను. వారు = ఆ గంధర్వులు; ఉసురుమని = నిరాశచేసైన విచారము గలవారై; వెడలిపోయిరి = బయలుదేఱిపోయిరి. ముఖ్యోష్ణతకున్ = ప్రధాన తీక్ష్ణత్వమునకు - కోపము వచ్చుటకు ననుట; పుట్టినిల్లు = జన్మస్థానము; ముసలిగదా ! = వృద్ధుఁడేకదా ! ఎవనికిఁగాని, ముదిమి హెచ్చుకొలఁదిని గోపముహెచ్చుట స్వాభావికముగదా ! - అనఁగా నా వృద్ధమునీశ్వరుఁడు కోపము రేఁగి తిట్టినంతట నన్నడుగవచ్చిన యా గంధర్వులేల యితనిం బడుచు నడుగవచ్చితి మను మనస్తాపముతో లేచిపోయిరి. అలం. ఉపమ, అర్థాంతరన్యాసమును.

వ. అట్టియెడం దన మనోరథంబు విఫలం బగుటకుఁ గ్రోధాంధుండై నన్నభిలషించు గంధర్వుం డిట్లనియె. 48

టీ. అట్టియెడన్ = ఆ సమయమునందు; నన్నభిలషించు గంధర్వుండు = నన్నుఁ గోరిన గంధర్వుఁడు; తన మనోరథంబు = తనకోరిక; విఫలంబు అగుటకున్ = ఫలింపనిది అయినందులకు; క్రోధాంధుండై = కోపముచేతఁ గన్నుగాననివాఁడై - మిక్కిలి కోపించి యనుట; ఇట్లనియెన్.

శా. నీ వైశిష్ట్యము తిట్టులన్ మెఱయునే ? § నీకంటె నేఁ దక్కువే ?
యీవే కన్యక నీవు గాక, మఱి మ § ద్వృత్తాన్వయాచారముల్
నీవా పేర్కొనుపాటివాఁడ ? విలఁ గా § నీ, నిల్తు గా కేమి ? పో
పో విప్రాధమ ; నిన్నుఁ బోల నిఁక న § ల్పుల్ లేరు దంభవ్రతా ! 49

టీ. నీ వైశిష్ట్యము = నీ విశిష్టత్వము - నీ సదాచారసంపన్నత్వము; తిట్టులన్ = శాపములచేత; మెఱయునే ? = ప్రకాశించునా ? నీకంటెన్; నేన్; తక్కువే ? = తక్కువయినవాఁడనా ? నీవు; కన్యకన్ = పడుచును; ఈవేకాక = ఇయ్యకపోయినఁ బోయితివిగాని; మఱి = మఱియును - మీఁదు మిక్కిలి; మద్వృత్తాన్వయాచారముల్ - మత్ = నావైన; వృత్త = ప్రవర్తనమును; అన్వయ = వంశమును; ఆచారముల్ = శీలమును; పేర్కొను పాటివాఁడవు = ఇట్టివట్టివని చెప్పునంతటి యోగ్యత గలవాఁడవు; నీవా ? ఇలన్ = భూమియందు; నిల్తుగాకేమి ? = నిలువఁగలవా ? కానీ = కానిమ్ము. విప్రాధమ ! = నీచబ్రాహ్మణుఁడా ! పో పో = పొమ్ము పొమ్ము. దంభవ్రతా ! = కపటపు వ్రతచర్యగలవాఁడా ! ఇఁకన్ = ఇఁకను; నిన్నుఁబోలన్ = నీవంటి; అల్పులు = నీచులు; లేరు.

తా. ఓరి నీచబ్రాహ్మణుఁడా ! తిట్టులచేతనా నీ సదాచారసంపత్తి ప్రకాశించును ? నీకంటె నేను దక్కువైనవాఁడనా ? నీవు పడుచు నియ్యకపోయినఁ బోవచ్చుఁగాని నా కులశీలముల నెంచవచ్చునా ? ఇఁక భూమిలోఁ బ్రాణముతో నుండఁగలవా ? వ్రతచర్యగలవానివలె వేషము వేసికొన్న నీకంటె నీచులు మఱి యెవరును లేరు.

తే. అనుచుఁ బగ చాటి పోయి నాఁ § డర్ధరాత్ర
సమయమున శస్త్రనిహతి మ § జ్జనకుఁ జంపె;

నట్లు యగుఁగాక ! పుడమిఁ గా మాంధచిత్తుఁ
డెవ్వరి వధింపఁ ? డెటు సేయఁ ? డేమి గాఁడు ? 50

టీ. అనుచున్ = ఆ గంధర్వుఁ డట్లు పలుకుచు; పగచాటి = విరోధమును చాటించి చెప్పి; పోయి; నాఁడు = ఆ దినము; అర్ధరాత్ర సమయమునన్ = నగము రాత్రివేళ; శస్త్రనిహతిన్ = కత్తిదెబ్బచేత - కత్తితో నఱకి యనుట; మజ్జనకున్ = నా తండ్రిని; చంపెన్. అట్లయగుఁగాక ! = అట్లేయగునుగాని - అట్లగుట సహజమే యనుట; పుడమిన్ = భూమియందు; కామాంధచిత్తుఁడు = కాముకత్వముచే మంచి చెబ్బరలు విచారింపనేరని మనస్సు గలవాఁడు; ఎవరిన్ = ఎవరిని; వధింపఁడు ? = చంపఁడు ? - ఎటువంటి పూజ్యులనైనను జంపనే చంపును. ఎటుచేయఁడు ? = ఏ విధమైన దుష్కార్యములు చేయఁడు ? ఏమిగాఁడు ? = ఎట్టి దుష్టుఁడు గాఁడు ?

తా. అని యీ విధముగా నా గంధర్వుఁడు పగచాటిపోయి, యా దినము నడురాత్రియే వచ్చి, మా తండ్రిని గత్తితో నఱికి చంపెను. కాముకుండగువాఁ డట్లు చేయుట వింతకాదు. ఇంతకంటెను గ్రూరములయిన పనులైనఁ జేయును; దేనికిని వెనుకఁదీయఁడు. అలం. అర్థాంతరన్యాసము.

తే. అపుడు మెడ గోయ ముని రోఁజు టాలకించి
మేలుకొని దివ్వె యిడి సంభ్ర మించి యేడ్చు
నన్నుఁ బొదివిరి పొరుగిండ్ల నున్న తపసు ;
లా దురాచారుఁడును బాఱె [1]నటకుమునుప. 51

టీ. అపుడు; మెడగోయన్ = గొంతు నఱకఁగా; ముని = నా తండ్రియైన ముని; రోఁజుట = ఎగరొప్పుట; ఆలకించి = విని; మేలుకొని = మెలఁకువను బొంది; దివ్వెయిడి = దీపముపెట్టి; సంభ్రమించి = తత్తఱిల్లి; ఏడ్చు నన్నున్ = ఏడ్చుచున్న నన్ను; పొరుగిండ్లన్ = ఈవలావలి యిండ్లయందు; ఉన్న తపసులు = ఉండిన మునులు; పొదివిరి = వచ్చి కమ్ముకొనిరి. అటకు మునుప = వారు వచ్చుటకు మునునే; ఆ దురాచారుఁడును = చెడ్డనడవడిగల యా గంధర్వుఁడును; పాఱెన్ = పరుగెత్తిపోయెను.

వ. అంతం దెలతెలవేగుటయుఁ బ్రభాతసమయంబున. 52

టీ. అంతన్ = అటుపిమ్మట; తెలతెలవేగుటయున్ = చక్కఁగాఁ దెల్లవాఱఁగా; ప్రభాతసమయంబునన్ = ప్రాతఃకాలమునందు.

క. ధారాళక్షతజోక్షిత, ఘోరజరాధవళితోరు కూర్చముగఁ గరా
చూరిని మెడ దెగి యుటజా, గారంబునఁ బడిన మూఁడుగాళ్ల ముసలికిన్. 53

టీ. ధారాళ...ముగన్ - ధారాళ = అడ్డములేక స్రవించుచున్న; క్షతజ = నెత్తుటిచేత; ఉక్షిత = తడుపఁబడిన; ఘోర = భయంకరమైన; జరా = ముసలితనముచేత; ధవళిత = తెల్లగాఁ జేయఁబడినదై - తెల్లగా నరసి; ఉరు = గొప్పదైన; కూర్చముగన్ = గడ్డము మీసము కలుగునట్లుగా; కరాచూరిని = వాఁడియైన కత్తిచేత; మెడతెగి; ఉటజాగారంబునన్ = ఆకుటింటి

1. నటక. పా.

యందు; పడిన మూఁడుగాళ్లముసలికిన్ = పడియున్న లేవలేని వృద్ధునకు. మూఁడుగాళ్ల ముసలి యనఁగా ఊఁతకఱ్ఱతో నడుచునట్టివాఁ డని భావము.

ఆ. అగ్ని యిచ్చి 'యకట! యాబాల్యముగ నన్నుఁ
బెనిచెఁ దల్లి వైచి చనిన పిదపఁ
దానె తల్లిమాఱు నై నెమ్మి నట్టి మ
జ్జనకుఁ డీల్గె నేటి మనికి?' యనుచు. 54

టీ. అగ్నియిచ్చి = అగ్ని సంస్కారముచేసి - దహనముచేసి యనుట; అకట! = అయ్యో! తల్లి; వైచి చనిన పిదపన్ = పాఱవేసిపోయిన పిమ్మట; ఆబాల్యముగన్ = చిన్నప్పటి నుండి; తానె; తల్లిమాఱునై = తల్లికి బదులు తల్లియునై; నెమ్మిన్ = ప్రీతితో; నన్ను; పెనిచెన్ = వృద్ధిపొందించెను. అట్టి మజ్జనకుఁడు = అటువంటి నా తండ్రి; ఈల్గెన్ = చచ్చెను. ఏటి మనికి? ఇఁక నాబ్రదు కేమి బ్రదుకు? - ఇఁక బ్రతికియు సుఖ మేమియుఁ గలుగ దనుట; అనుచున్ = అనుకొనుచు.

తా. అంతట దహనము మొదలయిన యుత్తరక్రియలు జరపి 'యయ్యో! తల్లిపాఱవేసి పోయిన నన్నుఁ దల్లికిమాఱు దల్లియునై చిన్నప్పటినుండి పెంచి పెద్దచేసిన తండ్రి చనిపోయిన పిదప నేను జీవించి యేమి సుఖము ననుభవింతు' నని విచారించి.

క. వందురి వగలన్ దేహము, పొం దెడలఁగఁ జూచు నన్నుఁ బొడగని దివిఁ దా నెందుల కేఁగుచునో గిరి, నందన దిగి వచ్చి కరుణ నా కిట్లనియెన్. 55

టీ. వగలన్ = విచారములచేత; వందురి = సంతాపించి; దేహముపొందు = శరీరబంధమును; ఎడలఁగన్ = విడుచుటకై; చూచు నన్నున్ = యత్నించినట్టి నన్ను - దేహత్యాగము చేయఁదలఁచిన నన్ననుట; గిరినందన = పార్వతీదేవి; తాన్ = తాను; దివిన్ = ఆకాశమార్గము నందు; ఎందులకేఁగుచునో = ఎక్కడికో పోవుచును; పొడగని = చూచి; దిగివచ్చి; కరుణన్ = దయతో; నా కిట్లనియెన్ = నాతో నిట్లు పలికెను.

తా. తల్లిదండ్రులను బోఁగొట్టుకొని యీ దిక్కుమాలిన బ్రదుకు బ్రదుక నేల? యని చచ్చుటకు నేను యత్నించుచుండు సమయమునం దాకాశమార్గమున నెక్కడికో పోవుచున్న పార్వతీదేవి నన్నుఁ జూచి కరుణించి నేలకు దిగివచ్చి నాతో నిట్లు పలికెను.

మ. అతిసౌందర్యనిశాంత మీతను వల భ్యం; బిట్లు శోకాతురా
న్వితవై దీనిఁ దొఱంగఁగాఁ దగునె? తన్వీ! చాలు నీసాహసం;
బతిలోకుండు స్వరోచి నీకుఁ బతియౌ; నా రాజుఁ జేపట్టి యు
ప్రతిమశ్రీవిభవంబుఁ గాంచెదవు; నా పల్కొండు గానేర్చునే? 56

టీ. తన్వీ! = ఓ చిన్నదానా! ఈ తనువు = ఈ దేహము; అతిసౌందర్యనిశాంతము = మిక్కిలి చక్కఁదనమునకుఁ జోటైనది; అలభ్యంబు = ఇట్టి దేహము లభించుట యరుదు. ఇట్లు; శోకాతురాన్వితవై = శోకముచేతఁ బీడింపఁబడినదానవై - దుఃఖాతిశయముచేత ముందువెనుకలు విచారింపక; దీనిన్ = ఇటువంటి చక్కఁదనపు శరీరమును; తొఱంగఁగాన్ = విడువఁగా; తగునె? = ఉచితమగునా? ఈ సాహసంబు = ఈ తెగువ; చాలున్ = చాలును - ఈ తెగువ

వల దనుట; అతిలోకుండు = లోకాతీతుఁడు - మిగుల దొడ్డవాఁ డనుట; స్వరోచి; నీకు; పతి ఔౕ= పెనిమిటి అగును. ఆ రాజుౕ= ఆ స్వరోచి మహారాజును; చేపట్టి = పెండ్లాడి; అప్రతిమ శ్రీవిభవంబుౕ = సరిలేని ఐశ్వర్యముయొక్క కలిమిని; కాంచెదవు = పొందెదవు. నా పలుకు = నామాట; ఒండు = ఇతరము; కానేర్చునే ? = కాఁగలుగునా ? - నా మాట వ్యర్థము కాఁజాల దనుట.

తా. 'ఓ చిన్నదానా ! ఇట్టి చక్కఁదనముగల దేహమును బడయుట సామాన్యముకాదు. దుఃఖాతిశయముచేత ముందువెనుకలు విచారింపక యిట్టి శరీరమును విడువ యత్నించుచున్నావు. ఇది మిగుల సాహసము. ఇట్టి సాహసమును చేయరాదు. మిక్కిలి గొప్పవాఁడయిన స్వరోచి యను మహారాజు నీకు భర్త యగును. ఆ మహారాజును బెండ్లాడి మితిలేని సౌఖ్యముల ననుభవించెదవు. నా మాట నమ్మి యీ దేహమును గాపాడుకొ' మ్మని పార్వతి పలికెను. అలం. కావ్యలింగము.

క. విను మదియుఁ గాక పద్మిని, యనఁ బరగిన విద్య నేఁ బ్రియంబున నిత్తుం
గొను నీవు; తత్ప్రసాదం, బున నీకు నభీష్టసౌఖ్యములు సిద్ధించున్. 57

టీ. వినుము; అదియుఁగాక = అట్లామహారాజును బెండ్లాడునట్టి మహాభాగ్యము నీకుఁ గలుగుటయేకాక; నేౕ; ప్రియంబునౕ= ప్రేమతో; పద్మిని అనఁబరగిన విద్యౕ = పద్మిని అనఁగాఁ బేరొకనఁబడిన విద్యను; ఇత్తుౕ= ఇచ్చెదను. నీవు; కొను = దానిని పరిగ్రహింపుము. తత్ప్రసాదంబునౕ = ఆ విద్యయొక్క యనుగ్రహముచేత; నీకు; అభీష్టసౌఖ్యములు = కోరిన సుఖములు; సిద్ధించుౕ = లభించును.

తా. నీకు నిఁకమీఁద నా మహారాజును బెండ్లాడుభాగ్యము లభించుటయే కాక నీవు కోరిన సుఖములు కలుగఁజేయునట్టి పద్మిని యను విద్య నుపదేశించెదను. దానిని గ్రహింపుము.

వ. అని రహస్యంబుగా నవ్విద్య నాకు నుపదేశించి ముక్కంటివాల్గంటి మింటి
చొప్పునం జనియె. నేనును దద్వచనామృతాస్వాదనంబ యూఁతగా బ్రాణం
బులు పట్టుకొని యున్నదాన; నా స్వరోచి నీవకాఁ దలంచెద; వంచనాలాపంబు
లుడిగి యప్పద్మినీవిద్యారత్నంబుతోఁగూడ నన్నుఁ బరిగ్రహింపు మనిన
నంగీకరించి యమ్మహీవిభుండు. 58

టీ. అని = ఇట్లానతిచ్చి; రహస్యంబుగాౕ = గోప్యముగా; అవ్విద్య = ఆ పద్మిని యను విద్యను; నాకు; ఉపదేశించి = ఉపదేశముచేసి; ముక్కంటి వాల్గంటి = శివునిల్లాలైన పార్వతీదేవి; మింటిచొప్పునౕ = ఆకాశమార్గమున; చనియెౕ = పోయెను. నేనును; తద్వచనామృతాస్వాదనంబ = ఆమె యానతిచ్చిన మాటలనెడి యమృతమును ద్రాగుటయే - అమృతమువలెఁ దనుపు నొందించునట్టియామె మాటలవినికియే; ఊఁతగాౕ= అవలంబ మగుచుండఁగా - ఆధారముకాఁగా ననుట; ప్రాణంబులు పట్టుకొని = ప్రాణములను దేహమునందు నిలుపుకొని; ఉన్నదానను; ఆ స్వరోచి = స్వరోచియనెడి యీ మహారాజు; నీవకాౕ = నీవే యని; తలంచెదౕ = ఎంచుచున్నాను. వంచనాలాపంబులు ఉడిగి = మోసపు ముచ్చటలు మాని; అప్పద్మినీవిద్యారత్నంబుతోఁగూడౕ = శ్రేష్ఠమయిన యీ పద్మినీవిద్యతోఁగూడ; నన్నుౕ; పరిగ్రహింపుము = స్వీకరింపుము; అనినౕ = అని చెప్పఁగా; అంగీకరించి = అందులకు నొప్పుకొన్నవాఁడై; అమ్మహీవిభుండు = ఆ భూపతి - స్వరోచి. అనంతర పద్యముతో నన్వయము.

క. ఏకాగ్రత నవ్విద్యలు, గైకొని పుణ్యాహపూర్వ కంబుగ గుణర
త్నాకరుఁ డయ్యిద్దఱ న, స్తోకోన్నతిఁ బెండ్లియయ్యె సుముహూర్తమునన్.

టీ. గుణరత్నాకరుఁడు = గుణము లనెడి రత్నములకు సముద్రమయినవాఁడు - స్వారోచి; ఏకాగ్రతన్ = స్వస్థచిత్తతతో; అవ్విద్యలు = ఆ మృగపక్షిభాషలు తెలియునట్టిదియు, పద్మిని యనునదియు నైన యా రెండు విద్యలను; కైకొని = పరిగ్రహించి; పుణ్యాహపూర్వకంబుగన్ = పుణ్యాహవాచనము ముందు గలుగునట్లుగా; సుముహూర్తమునన్ = మంచి లగ్నమునందు; అస్తోకోన్నతిన్ = మిక్కిలి ఘనతతో; అయ్యిద్దఱన్ = విభావసి, కళావతి యను నయ్యిద్దఱు పడుచులను; పెండ్లియయ్యెన్.

తా. అంతట స్వారోచి ఆ యిద్దఱు పడుచులవలనను నా రెండు విద్యలను పరిగ్రహించి, యొక మంచి ముహూర్తమునందుఁ బుణ్యాహవాచనము చేసికొని, మిక్కిలి ఘనతతో వారిని బెండ్లాడెను.

ఉ. ఆ సమయంబునన్ మొరసె నభ్రపథంబున దేవదుందుభుల్
సేసలు చల్లి రచ్చరలు సిద్ధనికాయము చేరి సన్నుతుల్
సేసెఁ బ్రసూనవృష్టి గురిసెన్ జనరంజనకారి వాసనో
ల్లాసములై చెలంగె శుభ లక్షణదక్షిణగంధవాహముల్. 60

టీ. ఆ సమయంబునన్ = ఆ పెండ్లిజరిగిన కాలమునందు; అభ్రపథంబునన్ = మేఘమార్గమునందు - ఆకాశమునందు; దేవదుందుభుల్ = దేవతల భేరీవాద్యములు; మొరసెన్ = మ్రోఁగెను. అచ్చరలు = అప్సరసలు; సేసలు = శుభాక్షతలు; చల్లిరి. సిద్ధనికాయము = సిద్ధులయొక్క సమూహము; చేరి = దగ్గఱఁజేరి; సన్నుతుల్ సేసెన్ = పొగడెను. ప్రసూనవృష్టి = పువ్వులవాన; కురిసెన్; జన...ములు - జనరంజనకారి = జనులకు నాహ్లాదము కలుగఁజేయునట్టి; వాసనా = పరిమళముచేత; ఉల్లాసములై = ఒప్పునవియై; శుభ...ముల్ - శుభలక్షణ = మేలైన చిహ్నములు గల; దక్షిణగంధవాహముల్ = దక్షిణపు వాయువులు - మలయమారుతములు; చెలంగెన్ = చక్కఁగా వీఁచెను.

క. ఈ విధమున నుద్వాహం, బై వేలుపు వెలఁదిపట్టి యంచితమతి న
ప్పూవుంబోఁడులు మూవుర, తో వివిధ విహార [1]సంగ తులఁ దత్పరుఁడై. 61

టీ. వేలుపువేలఁదిపట్టి = దేవతాస్త్రీయయినవరూథినికొడుకు - స్వారోచి; ఈ విధమునన్ = ఈ రీతిని; ఉద్వాహంబై = విభావసీ కళావతులను బెండ్లాడి; అంచితమతిన్ = మేలైన బుద్ధితో; అప్పూవుంబోఁడులు మూవురతోన్ = పువ్వులవలె మనోజ్ఞురాండ్రయిన యా ముగ్గురు భార్యలతోను; వివిధవిహార సంగతులన్ = నానావిధములై వేడుకగా సంచరించునట్టి ప్రవర్తనముల యందు; తత్పరుఁడై = ఆసక్తుఁడై. తరువాతి కన్వయము.

సీ. గంగాతరంగిణీ రంగత్తరంగశీ, కర శీత సైకతో త్కరములందు
మందార మాకంద మకరంద తుందిలేం, దిందిరానందక స్యందనములఁ

1. రతిగతుల. పా.

గాంత నిశాకాంత కాంత వితర్దికా, క్రాంత భూభృద్బృంద కందరముల
మసృణబిసాహార మాంసల హంసికా, సంసదాసార కాసారతటులc
తే. దమక తమక ప్రియుం డని తమక మెసcగc
బడcతు లుప్పొంగc గ్రీడించెc బద్మినీ ప్ర
భావఘటితాన్నపాన భూషావిశేష
మాల్యవస్త్రానులేప సామగ్రిc జెంది. 62

టీ. గంగా...లందుక్ - గంగాతరంగిణీ = గంగానదియందు; రంగత్ = చలించుచున్న; తరంగ = అలలయొక్క; శీకర = తుంపురులచేత; శీత = చల్లనైన; సైకత = ఇసుకదిబ్బల యొక్క; ఉత్కరములందుక్ = సమూహములందును; మందార...ములక్ - మందార = మందారపుcజెట్లయొక్కయు; మాకంద = తియ్యమామిడి చెట్లయొక్కయు; మకరంద = పూcదేనెలచేత; తుందిల = బలిసిన - తృప్తిగాc బూcదేనె త్రాగిన; ఇందిందిర = తుమ్మెదలకు; ఆనందకృత్ = సంతోషమును గలుగcజేయుచున్న; నందనములక్ = ఉద్యానవనములందును; కాంత...ములక్ - కాంత = మనోహరములైన; నిశాకాంతకాంత = చంద్రకాంత మణులచేతc గట్టcబడిన; వితర్దికా = అరుcగులచేత; ఆక్రాంత = ఆక్రమింపcబడిన - చుట్టcబడిన; భూభృద్బృంద = కొండల సమూహముయొక్క; కందరములక్ = గుహలయందును; మసృణ...తటులక్ - మసృణ = నునుపైన - మెత్తనయిన; బిస = తామరతూండ్లయొక్క; ఆహార = తిండిచేత; మాంసల = బలిసిన; హంసికా = ఆcడుహంసలయొక్క; సంసత్ = గుంపులయొక్క; ఆసార = అంతటను సంచరించుటలు గల; కాసార తటులక్ = కొలcకుల తీరములయందును; పడcతులు = స్త్రీలు - భార్యలు ముగ్గురును; తమక తమక = తమకే తమకే; ప్రియుండు = ప్రేమగలవాcడు - ఒక్కొక్కతెయుc బ్రియుcడు తక్కినవారికంటెc దనయందే ప్రేమగలిగి యున్నాcడు; అని; ఉప్పొంగక్ = సంతోషింపcగా; పద్మినీ...సామగ్రిక్ - పద్మినీ = పద్మిని యనెడి విద్యయొక్క; ప్రభావ = మహిమచేత; ఘటిత = కూర్పcబడిన - కలిగిన యనుట; అన్న = అన్నము; పాన = త్రాగcదగిన తేనె, పాలు, మంచినీళ్లు మొదలయినవి; భూషావిశేష = సొమ్ములు మొదలైన విశేషములు; మాల్య = పూదండలు, వస్త్ర = కోకలు; అనులేప = గందపుcబూcతలు; సామగ్రిక్ = అను వీనియొక్క సమగ్రతను - కొఱcతలేమిని; చెంది = పొంది; క్రీడించెన్; సుఖించె ననుట.

తా. స్వరోచి ప్రియురాండ్రు ముగ్గురును బ్రీతితో ననుసరింపcగాc బద్మినీ విద్యాప్రభావముచేత నన్నపానీయములకును, వస్త్రాభరణములకును, గంధపుష్పములకును నే కొఱcతయు లేకయుండcగా, గంగానదిలోని చల్లని యిసుకదిన్నెలయందును, పూcదేనెలతో నిండుకొనియున్న తుమ్మెదల రొదలతోడి యుద్యానవనములందును, చంద్రకాంతమణుల యరుcగులచే నందగించుచున్న కొండగుహలయందును, హంసలు తామరతూండ్లు దిని గుంపులుగూడి మెలcగుచున్న సరోవరముల తీరములందును విహరించుచుc గ్రీడించెను. అలం. ఉదాత్తము.

[1]మ. అరవిందాక్షులుc దాను నిట్లభిమత వ్యాపారముల్ సల్పుచుక్
ధరణీశుం డొకచోటc గాంచె లఘు శీ తస్వచ్ఛవాఃపూరముక్

1. ఈ పద్యము మొదలుకొని 83-వ పద్యమువఱకును వ్రాcతప్రతిలో లేవు.

వరకీరవ్రజచంచుపాటిత తట ♦ వ్యాకీర్ణమందారకే
సరమాకందవినిస్సరత్ఫలరసా ♦ సారంబుఁ గాసారమున్. 63

టీ. ఇట్లు = ఈ విధముగా; ధరణీశుండు = రాజు - స్వరోచి; అరవిందాక్షులున్ = భార్యలును; తానున్; ఇట్లు; అభిమత వ్యాపారముల్ = కోరిన విహారకార్యములను; సల్పుచున్ = చేయుచును; ఒకచోటన్; లఘుశీతస్వచ్ఛవాఃపూరమున్ - లఘు = తేలికైన; శీత = చల్లనైన; స్వచ్ఛ = తేటయైన; వాఃపూరమున్ = జలసమృద్ధిగలిగినదానిని; వర...సారంబున్ - వర = శ్రేష్ఠమయిన; కీర వ్రజ = చిలుకల గుంపుయొక్క; చంచు = ముక్కులచేత; పాటిత = చీల్పఁబడినవై; తట వ్యాకీర్ణ = దరులయందు నిండుకొన్న; మందార = మందారపుఁ జెట్లవలనను; కేసర = పొగడవ్రాఁకులవలనను; మాకంద = తియ్యమామిడి వ్రాఁకులవలనను; వినిస్సరత్ = విశేషముగా స్రవించుచున్న; ఫలరస = పండ్లరసములయొక్క; ఆసారంబున్ = ఎడతెగని వాన గలదానిని; కాసారమున్ = సరస్సును; కాంచెన్ = చూచెను.

తా. స్వరోచి యిట్లు ప్రియురాండ్రతో యథేచ్ఛముగాఁ గ్రీడించుచుండి యొకచోటఁ దేలికై చల్లనైన తేటనీటిచే నిండుకొన్నదియు, దరులవ్రాఁకులందుండి చిలుకల ముక్కులచేఁ జీల్పఁబడిన పండ్లనుండి కాఱుచున్న తియ్యని రసముతోఁ గూడినదియు నైన యొక సరోవరమును జూచెను.

క. కని తత్తటస్థలంబున, ననుమతి విహరించె సవిధ ♦ హరిహయవరనం
దననందనహరిచందన, వనపవనార్భక వినోద ♦ వశగతుఁ డగుచున్. 64

టీ. కని= (స్వరోచి) సరస్సును జూచి; తత్తటంబునన్=దాని దరిని; సవిధ...వశగతుఁడు- సవిధ = సమీపమునందలి; హరిహయ = ఇంద్రునియొక్క; వర = శ్రేష్ఠమయిన; నందన = నందనవనమనెడి యుద్యానసంబంధియైన; (హరిహయవరనందన = జయంతునియొక్క; నందన = నందన మనెడి వనమునందలి; అని కొందఱు.) నందన = తన యుద్యానవనమునందలి; హరిచందన= హరిచందనము లనెడి దేవవృక్షములయొక్క; వన = తోఁపులవలననుండి వీచునట్టి; పవనార్భక= పిల్లవాయువులచేత - మలయమారుతములచేత ననుట; వినోద = విహరించుటకు; వశగతుఁడు = అధీనమైనవాఁడు - ఆసక్తిగలవాఁడు; అగుచున్; అనుమతిన్ = ఇష్టముతో; విహరించెన్= వినోదముగా మెలఁగెను.

తా. స్వరోచి యట్టి సరస్సును జూచి, దానివెంబడి నింద్రుని నందనవనమువలెనే హరిచందనము మొదలయిన దేవవృక్షముల తోఁపులుగల తన శృంగారపుఁదోఁటమీఁదుగా వచ్చునట్టి చల్లని మెల్లని గాలిచే వినోదింపఁ గోరినవాఁడై యిష్టముతో నా కొలనిదరిని గొంతసేపు విహరించెను.

ఉ. అం దొక యంచలేమ గహ ♦ నానిల సంచలదూర్మిమాలికా
మందవిహార సౌఖ్యమున ♦ మత్తిలి దవ్వుల నున్న చక్రవా
కిం దగఁ జేరఁ బిల్చి 'పరి ♦ కించితె యెంత తపం బొనర్చి రీ
యిందునిభాస్యలుం బతియు ♦ నేకమతిం గవగూడి యుండఁగాన్. 65

టీ. అందున్= ఆ కొలఁకునందు; ఒక యంచలేమ = ఒక హంస స్త్రీ; గహనా...మునన్- గహన = ఉద్యానవనముమీఁదుగా వచ్చుచున్న; అనిల = గాలిచేత; సంచలత్ = బాగుగాఁ

గదలుచున్న; ఊర్మిమాలికా = అలల పరుసలయందు; అమంద = తక్కువకాని - అధికమైన; విహార = వినోదసంచారముపలని; సౌఖ్యమునన్ = సుఖముచేత; మత్తిలి = మత్తుగొని; దవ్వులన్ = దూరమునందు; ఉన్న చక్రవాకిన్ = ఉండిన యాఁడుజక్కవను; తగన్ చేరఁబిల్చి = తగునట్లు దగ్గఱగాఁ బిలిచి; ఈ యిందునిభాస్యలున్ = చంద్రునివంటి ముఖముగల యీ స్త్రీలును; పతియున్ = వీరి పెనిమిటి యయిన యీ రాజును; ఏకమతిన్ = అభేదబుద్ధితో; కవగూడి ఉండఁగాన్ = జతగూడి ఉండుటకు; ఎంత తపంబు = ఎంత యధికమైన తపస్సు; ఒనర్చిరి = చేసిరో! పరికించితె! = (వీరి విహారవైఖరిని) చూచితివా?

తా. అప్పుడా సరస్సునందు విహారసుఖము ననుభవించుచున్న యొక యాఁడుహంస తనకుఁ గొంతదూరమునందు విహరించుచున్న యాఁడుజక్కవను జేరఁబిలిచి, యా దంపతులను జూపి 'వీరిట్లరమరలేక జతగూడి విహరింపఁ దొల్లి యెంత తపస్సుచేసిరో! మిక్కిలి హాయిగా విహరించుచున్నారు. చూడు' మనియెను. ఇట్టి విహారసుఖము మిక్కుటమయిన తపస్సు చేయకయే లభింపనేర దని భావము.

క. మెలఁతకుఁ బతిపైనైనను, మెలఁతుకపైఁ బతికినైన మేలగు టెందుం
గలయది; మెలఁతకుఁ బతికిన్, వలపు సమం బగుట జన్మ వాసన చెలియా!

టీ. చెలియా! = ఓ చెలీ! మెలఁతకున్ = స్త్రీకి - భార్యకు; పతిపైనైనను = పెనిమిటి మీఁదనేనియు; మెలఁతుకపైన్ = భార్యమీఁద; పతికినైనన్ = భర్తకైనను; మేలు అగుట = మోహము గలుగుట; ఎందున్ = ఎచ్చోటను; కలయది = సహజము. మెలఁతకున్ = స్త్రీకిని - భార్యకును; పతికిన్ = భర్తకును; వలపు సమంబగుట = మోహము ఎచ్చుతక్కువలులేక సరిగా నుండుట; జన్మవాసన = పూర్వజన్మసంబంధియైన సంస్కారము.

తా. ఓ చెలీ! పెండ్లామునందుఁ బెనిమిటికో, పెనిమిటియందుఁ బెండ్లామునకో మోహ మతిశయించియుండుట లోకమునందు సహజముగాని యాలుమగ లిద్దఱికిని సమానమయిన మోహము గలిగియుండుట సహజముకాదు. అట్లుగాక యుభయులకు వలపు సరిగానుండుట పూర్వజన్మము నందుఁ జేసిన పుణ్యఫలమే కాని యితరము గాదు.

ఉ. కావున వీరియందు నధి కం బగు కూరిమి గల్గియుండు నీ
భూవలయాధినాథునకుఁ బొల్పుగ; నీ విభునందు నగ్గలం
బీ వనజాయతాక్షులకు నిచ్చఁ బ్రియం; బదిగాన పూవునుం
దావియుఁబోలె జాలఁ బ్రమ దం బొనరించిరి నాకు నెచ్చెలీ!' 67

టీ. నెచ్చెలీ! = ఓ స్నేహితురాలా! కావునన్ = కనుక; వీరియందున్ = ఈ స్త్రీల యందు; ఈ భూవలయాధినాథునకున్ = ఈ రాజునకు; అధికంబు = హెచ్చు; అగు కూరిమి = అయిన ప్రేమ; పొల్పుగన్ = ఒప్పిదముగా; కల్గియుండున్ = కలిగియున్నది. ఈ విభునందున్ = ఈ రాజునందు; ఈ వనజాయతాక్షులకున్ = ఈ స్త్రీలకును; ఇచ్చన్ = మనసునందు; ప్రియంబు = ప్రేమము; అగ్గలంబు = అధికము; అదిగాన = అట్లగుటచేత; పూవునుం దావియుఁబోలెన్ = పువ్వును, బరిమళమునువలె (ఎడఁబడని కూడిక గలవారై); నాకు; చాలన్ = మిక్కిలి; ప్రమదంబు = సంతోషమును; ఒనరించిరి = (వీరు) కలుగఁజేసిరి.

తా. ఓ చెలియా! ఈ స్త్రీలయం దీ రాజునకు ననురాగము కలిగియున్నట్టే యీ రాజునం దీ స్త్రీలకు ననురాగము కలిగియున్నది. ఇది యెట్లున్నది యన్నఁ బువ్వుతోఁ బరిమళము సంబంధించి యున్నట్లున్నది. దానిచే వీరిని జూడఁగా నాకు మిక్కిలి సంతోషమగుచున్నది. అలం. ఉపమ.

వ. అని పలుకు నమ్మరాళలోలనయనపలుకు లాలంబుచేసి చక్రవాకి యిట్లనియె.

టీ. అని = ఇట్లని; పలుకు నమ్మరాళలోలనయన పలుకులు = చెప్పినట్టి యా హంసస్త్రీ మాటలు; ఆలంబుచేసి = ఉపేక్షచేసి - సరి యని యొప్పుకొనక; చక్రవాకి = చక్రవాకస్త్రీ; ఇట్లనియెన్.

చ. "ముదమున నిమ్మహీశుఁ డొక § ముద్దియ చూడఁగ నొక్క కాంతతో
సదమదమై కడంగి రతి § సల్పుట తెల్లమిగా నెఱింగియున్
మది వివరించి రోయ కభి § మానము దక్కిన వీరి కూరుముల్
వదలక పెద్ద సేసెదవు § వందిగతిం, దగ వీ విచారముల్. 69

టీ. ముదమునన్ = సంతోషముతో; ఇమ్మహీశుఁడు = ఈ రాజు; ఒక ముద్దియ = ఒక్క యువతి; చూడఁగన్ = చూచుచుండఁగా; ఒక్క కాంతతోన్ = ఇంకొక మగువతో; సదమదమై = పెనఁగి; కడంగి = పూని; రతిసల్పుట = సంభోగము చేయుట; తెల్లమిగాన్ = స్పష్టముగా; ఎఱింగియున్ = తెలిసియు; మదిన్ = మనసునందు; వివరించి = ఇతఁ డితరస్త్రీప్రియుఁ డని తెలిసి; రోయక = రోఁతపడక; అభిమానము = చిత్తౌన్నత్యమును - గౌరవమును; తక్కిన వీరికూరుముల్ = వదలిన యీ స్త్రీల చెలుములు; వదలక = మానక; వందిగతిన్ = బట్టువానివలె; పెద్ద సేసెదవు = ఏమో గొప్పగాఁ దలఁచి పొగడెదవు; ఈ విచారముల్ = ఈ యాలోచనలు - ఇట్లు తలఁచి పొగడుటలు; తగవు = యుక్తములు కావు.

తా. ఈ రాజు సంతోషముతో నొకదానితో రమించుట స్పష్టముగా నెఱిఁగియుఁ దక్కిన స్త్రీ లందులకు రోసి కోపింపక మానముచెడి యట్టి పురుషునం దనురాగము గలవారై యుండుట యెక్కువ యని స్తుతిపాఠకునివలె నీ వేమో పొగడుచున్నావు. కాని యది సరి యని నే నెంచఁ జాలను. అలం. ఉపమ.

చ. పలువురయందు నొక్కనికి § బ్రాఁతియు, నొక్కనియందుఁ జూడ న
గ్గలమగు ప్రేమ పల్వురకుఁ § గల్గుట యద్భుత; మట్లు గాన యి
వ్వేలఁదులయందుఁ గూర్మిపస § వీనికి నేమియు లేదు; వీనియం
దలవడఁగల్గ దీ జలరు § హాక్షులకుం బ్రియ మెవ్విధంబునన్. 70

టీ. చూడన్ = ఆలోచించి చూడఁగా; పలువురయందున్ = అనేక స్త్రీలయందు; ఒక్కనికిన్ = ఒక పురుషునికి; బ్రాఁతియున్ = ప్రేమయును; ఒక్కనియందున్ = ఒక పురుషునియందు; పల్వురకున్ = పలువురు స్త్రీలకు; అగ్గలమగు ప్రేమ = అధికమగునట్టి యనురాగమును; కల్గుట = కలిగియుండుట; అద్భుతము = ఆశ్చర్యము. అట్లుగాన = కాఁబట్టి; ఇవ్వేలఁదులయందున్ = ఈ స్త్రీలయందు; వీనికిన్ = ఈ పురుషునకు; కూర్మిపస = అనురాగాతిశయము; ఏమియు లేదు = కొంచెమయినను లేదు. వీనియందున్ = ఈ పురుషునందు; ఈ జలరుహాక్షు

లకుఁ = ఈ స్త్రీలకును; ప్రియము = ప్రేమ - అనురాగము; ఎవ్విధంబునన్ = ఏ విధముచేతను; అలవడన్ = పనుపడుట; కల్గదు = కలుగనేరదు. ("శ్లో. ఏకత్రై వానురాగశ్చే త్తిర్యఙ్ మ్లేచ్ఛ గతోఽపి వా, యోషితో బహుసక్తిశ్చ రసాభాస స్త్రిధా స్మృతః" అనునది యిందులకుఁ ప్రమాణము.)

తా. ఒక పురుషునకుఁ బలువురు స్త్రీలయందును, బలువురుస్త్రీల కొక పురుషునియందును ననురాగము కలుగుట యరుదు. కాఁబట్టి యిప్పు డీ పురుషునియం దీ స్త్రీలకుఁగాని యీ స్త్రీలయం దీ పురుషునికిఁ గాని యనురాగము కొంచెమయినను లేదు.

క. మనుజేశుఁడు కొలిచిన పరి, జనములతో నిష్టగోష్ఠి సలిపెడిచో నె
ట్లనురాగ మట్ల కూరిమి, వనితలు పెక్కండ్రయం ద వశ్యము పతికిన్. 71

టీ. మనుజేశుఁడు = రాజు; కొలిచిన పరిజనములతోన్ = తనకొలువు చేయునట్టి పరివార జనులతో; ఇష్టగోష్ఠి = ప్రియసల్లాపము - ప్రీతితో మాటలాడుట; సలిపెడిచోన్ = జరపునప్పుడు, అనురాగము = ప్రేమ; ఎట్లు = ఏ విధమో; అట్ల = ఆ విధముగానే; వనితలు పెక్కండ్ర యందున్ = పెక్కు స్త్రీలయందు; పతికిన్ = భర్తకు; కూరిమి = ప్రేమ - అనురాగము; అవశ్యము = నిశ్చయమైనది. (కలుగు నని యభిప్రాయము.) అనఁగా రాజునకుఁ బరివారజనులందుఁ బోలెఁ బురుషులకుఁ బలువురు స్త్రీలయందు ననురాగము కలిగియుండునేకాని యొకతెయయిన ప్రియభార్యయందుఁబోలె దృఢానురాగము కలిగియుండదు.

క. ఈ నెలఁత లీ మహీశు న, హీనగతిం దగిలిరేని యితఁ డొక లేమం
దా నెలమిఁ గూడునెడ నే, మానిని ప్రాణేశుమీఁది మమత మెలంగున్? 72

టీ. ఈ నెలఁతలు = ఈ స్త్రీలు; ఈ మహీశున్ = ఈ రాజును; అహీనగతిన్ = తక్కువ కాని విధముతో - మనసునం దే కొఱఁతయు లేక; తగిలిరేనిన్ = వలపుగొన్నవారైన పక్షమున; ఇతఁడు = ఈ రాజు; తాను; ఒక లేమన్ = ఒక స్త్రీని; ఎలమిన్ = ప్రీతితో; కూడునెడన్ = సంగమము చేయునప్పుడు; ఏ మానిని=వీరిలో నే యాఁడుది; ప్రాణేశుమీఁదిమమతన్= పెనిమిటి మీఁది యనురాగముతో; మెలంగున్ ? = ప్రవర్తించును ? దేనితోఁ గలసియున్నప్పు డది యనురక్తయైనట్టు మెలఁగునేకాని యందఱును నన్నియెడలను ననురాగము గలిగియుండ దనుట.

క. కావున దాసీనికరము, కైవసమై సంచరించు క్రమమున విద్యా
ప్రావీణ్య వైభవోన్నతి, చే వచ్చినవారి వీరిఁ జెప్పకు మింకన్. 73

టీ. కావునన్ = అటుగనుక; దాసీనికరము = పరిచారికలసమూహము; కైవసమై = స్వాధీనమై; సంచరించు క్రమమునన్ = మెలఁగునట్టిరీతిని; విద్యా... చేన్ - విద్యాప్రావీణ్య = విద్యలయందలి నేర్పుయొక్క; వైభవ = సంపత్తివలని; ఉన్నతిచేన్ = ఆధిక్యముచేత; వచ్చినవారిని = లభించినవారిని; వీరిన్ = ఈ స్త్రీలను; ఇంకన్; చెప్పకుము = హెచ్చుగాఁ జెప్పకుము.

తా. కాఁబట్టి పరిచారికలు పెక్కండ్రొక్కనికి లోఁబడి మెలఁగునట్లు విద్యల కలిమివలని గొప్పతనముచేత నతనికి లభించిన యా స్త్రీల విషయమయి మెప్పులు పలుకవలదు.

ఆ. తగులు నెవ్వఁ డొక్క తరుణికి, నొకనికి మెలఁత వలచు నదియ మే లనంగ
వచ్చుఁ; గాని పెక్కు వనితలపైఁ గూర్మి, గలుగు ననుట బొంకుగాదె తరుణి !

టీ. తరుణి ! = ఓ వనితా ! ఎవ్వఁడు = ఏ పురుషుఁడు; ఒక్క తరుణికిన్ = ఒక జవరాలియెడ; తగులున్ = వలపునొందునో; మెలఁత = ఒక జవరాలు; ఒకనికిన్ = ఒక్క పురుషునియెడ; వలచున్ = వలపుగొనునో; అదియ = ఆ వలపే; మేలు అనంగవచ్చున్ = శ్రేష్ఠమయినది అని చెప్పవచ్చును. కాని; పెక్కు వనితలపైన్ = పలువురు స్త్రీలమీఁద; కూర్మికలుగును = అనురాగము ఒకనికిఁ గలిగియుండును; అనుట = అని యెంచుట; బొంకు కాదె ! = కల్ల కదా !

తా. ఓ చెలియా ! ఒక పురుషుని కొక్క స్త్రీమీఁదను, ఒక స్త్రీ కొక్క పురుషునిమీఁదను వలపుగల దన్న ననవచ్చునుగాని, పలువురు స్త్రీలయందు నొక పురుషునికి వలపు గలదనుట సత్యము కాదు.

చ. పలుకులు వేయు నేమిటికి ? ౹ భాగ్యసమన్విత నేన; మద్విభుం
డిలఁ గల ధన్యుఁ" డంచు నెలుఁ ౹ గెత్తి వరూథినిపట్టి ముందటం
బలుకు రథాంగమానవతి ౹ పల్కు లతం డిల జంతుమండలీ
విలసదశేషభాషలఁ బ్ర ౹ వీణుఁడు గాన యెఱింగి సిగ్గునన్. 75

టీ. పలుకులు = మాటలు; వేయున్ ఏమిటికిన్ ? = అనేకములు ఎందులకు ?- పలు పలుకుల వలనఁ బ్రయోజనము లేదనుట. భాగ్యసమన్వితను = అదృష్టముతోఁగూడినదానను - అదృష్టవంతురాలను; నేన = నేనే. ఇలన్ = భూమియందు; కల ధన్యుఁడు = ఉన్న భాగ్యసంపన్నుఁడు; మద్విభుండు = నామగఁడు. అంచున్; వరూథినిపట్టిముందటన్ = అని వరూథిని కొడుకైన స్వరోచియెదుట; ఎలుఁగెత్తి = గొంతెత్తి-గట్టిగా వినునట్లు; పల్కు రథాంగమానవతిపల్కులు = చెప్పుచున్న చక్రవాకస్త్రీయొక్క మాటలు; ఇలన్ = భూమిలోఁ గలిగియుండెడి; జంతు... భాషలన్ - జంతుమండలీ = ప్రాణిసమూహములయొక్క; విలసత్ = ఒప్పుచున్న; అశేష = సమస్తమయిన; భాషలన్ = మాటలయందు; ప్రవీణుఁడు = నేర్పరి - ఎల్ల జంతువుల భాషలు నెఱిఁగినవాఁ డనుట; కాన = కనుక; ఎఱింగి = తెలిసికొని; సిగ్గునన్ = లజ్జచేత. తరువాతి కన్వయము.

తా. 'వేయి మాట లేల ? నేనే యదృష్టవంతురాలను; నామగఁడే కృతార్థుఁడు' అని యెదుట గొంతెత్తి చక్కఁగా వినఁబడునట్లు పలుకుచున్న యా యాఁడుజక్కవమాటలు విని, స్వరోచి యెల్లజంతువులమాటలు తెలిసినవాఁడు గనుక, నా మాటల యభిప్రాయము తెలిసికొని సిగ్గుతో.

క. తల వాంచి యుస్సు రని మదిఁ, దలపోయుచు మానరాని ౹ తమకంబున నా
నెలఁతలతో నూఱేఁడులు, విలసితగతి సౌఖ్య మనుభ ౹ వించుచు నెలమిన్. 76

టీ. తల వాంచి = తల వంచుకొని; ఉస్సురని = ఉస్సను ననుకరణముతో నిట్టూర్పువిడిచి; మదిన్ తలపోయుచున్ = మనస్సునందు (తిర్యగ్జంతువులకుఁగూడ మన విహారము పరిహాసమునకుఁ జోటయ్యెనే యని) విచారపడుచు; మానరాని తమకంబునన్ = వదలఁగూడని వలపుచేత; ఆ నెలఁతలతోన్ = ఆ స్త్రీలు ముప్పురతోను; విలసితగతిన్ = మనోహరమైన రీతితో; నూఱేఁడులు = నూఱు సంవత్సరములు; ఎలమిన్ = ప్రీతితో; సౌఖ్యము అనుభవించుచున్ = సుఖమును పొందుచు. అనంతరమున కన్వయము.

శా. కాంచెన్ భూవిభుఁ డొక్కనాఁడు కనకా ౹ ఖర్వప్రభామంజులా
స్యాంచన్మేచకరత్నవిభ్రమసనా ౹ థానూనదృగ్రోచులన్
మించుంబ్రాయపులేటిపిండు తనుఁ గూ ౹ ర్మిం జుట్టి రాఁ దద్వనో
దంచద్భూమిఁ జరించు నొక్క హరిణో ౹ త్తంసంబు నింపారఁగన్. 77

టీ. భూవిభుఁడు = రాజు - స్వరోచి; ఒక్కనాఁడు; కనకా...దృగ్రోచులన్ - కనక = బంగారుయొక్క; అఖర్వప్రభా = అధికమయిన కాంతులఁబోలిన కాంతులచేత; మంజుల = మనోహరములైన; ఆస్య = ముఖములందు; అంచత్ = ఒప్పుచున్న; మేచకరత్న = నీలమణుల యొక్క; విభ్రమ = విలాసమువంటి విలాసముతో; సనాథ = కూడిన; అనూన = తక్కువకాని; దృగ్రోచులన్ = చూపులవెలుఁగులచేత; మించుం...పిండు - మించుంబ్రాయపు = వెలుఁగుచున్న యౌవనముగల; లేటిపిండు=ఆఁడుజింకలగుంపు; తనున్; కూర్మిన్=అనురాగముతో; చుట్టిరాన్= పరివేష్టించి రాఁగా; తద్వనోదంచద్భూమిన్ = ఒప్పుచున్న యా వనభూమియందు; చరించు... త్తంసంబున్ - చరించు = తిరుగుచున్న; ఒక్క హరిణోత్తంసంబున్ = శ్రేష్ఠమయిన యొక యిఱ్ఱిని; ఇంపారఁగన్ = సంతోషమతిశయింపఁగా; కాంచెన్ = చూచెను.

తా. అట్లాస్త్రీలతో సుఖించుచుండునట్టియెడ నా స్వరోచి యొకనాఁడు విహారమునందు బంగారుచాయ ముఖములును, నీలముల కాంతులవంటి కాంతులు గల చూపులును గల లేళ్లతోఁగూడి తిరుగుచున్న యొక యిఱ్ఱిని జూచెను. అలం. నిదర్శన.

క. కని సతులకుఁ జూపెడుతఱి, ఘనముగఁ దమచెవుల వాలుఁ ౹ గన్నులు సోలన్
మొనసెలవి యెత్తి ప్రియునా, ననమున్ మూర్కొనుచు నట్లు ౹ నాకెడువేళన్.

టీ. కని = అట్లున్న మృగమును జూచి; సతులకున్ = తన ప్రియురాండ్రకు; చూపెడు తఱిన్ = (స్వరోచి) చూపునప్పుడు; (ఆఁడు మృగములు;) ఘనముగన్ = మిక్కిలిగా; తమ చెవులన్ = తమ చెవులయందు; వాలుఁగన్నులు = వాలికలైన (దీర్ఘములైన) కన్నులు; సోలన్= ఒరగఁబడఁగా - చెవులవఱకు వ్యాపించి విశాలములయిన కన్నులతో ననుట; మొనసెలవి ఎత్తి = ముందఱిపెదవిమూల - మోర మొని పైకెత్తి; ప్రియు నాననమున్ = తమ ప్రియుఁడైన యిఱ్ఱి యొక్క ముఖమును; మూర్కొనుచున్ = మూచూచుచు; అట్లు నాకెడువేళన్ = మెడ నాకు నప్పుడు. తరువాతి కన్వయము.

తా. అట్లు తిరుగుచున్న మృగమును స్వరోచి తన ప్రియురాండ్రకుఁ జూపునపుడు దానితోడి పెంటిమృగములు తమ విశాలనేత్రములు చెవులవఱకు వ్యాపించి యొప్పఁగా, మోరలెత్తి యా మృగముయొక్క మొగమును మూర్కొనుచు, మెడను నాకుచు నుండెను. ఆ సమయమునందు. అలం. స్వభావోక్తి.

శా. హుంకారం బొనరించి "వే తలఁగుఁ డో, ౹ హో! నేను స్వారోచినే ?
పంకేజాక్షులతోడ నెల్లపుడు ద ౹ ర్పస్ఫూర్తిఁ గ్రీడింప; ల
జ్జాంకూరం బడఁగించినారు; తలపో ౹ యన్ నాకు రోఁ తయ్యె; మీ
రింకం బోయి వరింపుఁ డొక్కరుని; భో ౹ గేచ్ఛన్ నివారించితిన్. 79

టీ. (ఆ మృగము పెంటిమృగములను జూచి) హుంకారంబు = హుమ్మనెడి కోపమును దెలిపెడి ధ్వనిని; ఒనరించి = చేసి; ఓహో ! = ఓ స్త్రీలారా ! వే = శీఘ్రముగా; తలఁగుఁడు = తొలఁగిపొండు; ఎల్లప్పుడున్ = సర్వదా; దర్పస్ఫూర్తిన్ = మదాతిశయముచేత; పంకేజాక్షుల తోడన్ = తామరలవంటి కన్నులుగలవారితో - అందకత్తెలయిన స్త్రీలతో; క్రీడింపన్ = రమింపను; నేను; స్వారోచి నే? = స్వరోచి యను రాజనా? - ఎల్లప్పుడును స్త్రీలలో లుఁడై విహరించుట స్వరోచికిఁ దగునుగాని నాకుఁ దగ దనుట. లజ్జాంకురంబు = సిగ్గు మొలకను; అడఁగించినారు = (మీరు) అణఁచివేసినారు - బొత్తిగా సిగ్గు విడిచినా రనుట. తలపోయన్ = (మీ సిగ్గులేనితనమును) విచారింపఁగా; నాకు; రోఁతయ్యెన్ = అసహ్యమయ్యెను. మీరు; ఇంకన్; పోయి = ఎక్కడనేని పోయి; ఒక్కరునిన్ = మఱియొక పురుషుని; వరింపుఁడు = కోరుకొనుఁడు; భోగేచ్ఛన్ = స్త్రీసుఖమునందలి యపేక్షను; నివారించితిన్ = (నేను) నిలిపివేసితిని - మానితిని.

తా. ఆ మృగము పెంటిమృగముల నదలించి "యెల్లప్పుడును నాఁడువారితోఁగూడి క్రీడించుటకు నేను స్వరోచిని గాను. మీరు సిగ్గువిడిచి చరించుచున్నారు. మీనడతలు చూచిన నాకు రోఁత యగుచున్నది. కనుక మీతోడి సుఖము నొల్లను. వలయు నేని మీ రింకొక పురుషుని వరింపుఁడు. పొం" డనియెను.

చ. బరు వన కింతులం దనకుఁ ౯ బల్వురఁ గూర్చుట భోగవాంఛఁ గా
కరయఁగ నొండు గాదు; ధన ౯ మన్న ధ్రువంబుగ నంగనాజనో
త్కరసముపార్జితం; బటులు ౯ గావున వీనికి లే దిహంబునుం
బరమును; నన్ను నట్ల పలు ౯ పం బని లే; దిది చెప్ప నేటికిన్ ? ౫౦

టీ. బరువు అనక = భారము - కష్టము అని యెంచక; తనకున్ = తనకై; ఇంతులన్ = స్త్రీలను; పల్వురన్ = పెక్కండ్రను; కూర్చుట = కూర్చుకొనుట; భోగవాంఛన్ కాక = సుఖానుభవాపేక్షచేతనే కాని; అరయఁగన్ = విచారింపఁగా; ఒండు గాదు = ఇతరము గాదు. ధనము అన్నన్ = ధనమో అనినను; ధ్రువంబుగన్ = స్థిరముగా; అంగ...తంబు - అంగనాజనోత్కర = ఈ స్త్రీలసమూహముచేతనే; సముపార్జితంబు = సంపాదింపఁబడినది. అటులు గావునన్ = అట్లు గనుక; వీనికిన్ = ఈ రాజునకు - స్వరోచికి; ఇహంబునున్ = ఈ లోకపుమేలును; పరమును = పరలోకపుమేలును; లేదు = కలుగదు. నన్నును = నన్నుఁగూడ, అట్ల = ఆ విధముగానే; పలుపన్ పనిలేదు = పాటుపడఁజేయుట అక్కఱలేదు. ఇది = ఈ స్త్రీలవలని సుఖమును; చెప్పన్ = ఇట్టిది యని చెప్పుట; ఏటికిన్ ? = ఎందులకు ? - అక్కఱలేదు.

తా. పురుషుఁడు తనకుఁ గలుగు శ్రమమును దలఁపక పెక్కుమంది స్త్రీలను గూర్చుకొనుట భోగవాంఛచేతనేకాని మఱి దేనిచేతను గాదు. ఈతని ధనసంపద యా స్త్రీలమూలముననే సంపాదింపఁబడినది. ఇది స్థిరమయినమాట. విచారించునెడ నింతకంటె నితర మేదియుఁ గానరాదు. కాఁబట్టి యీ రాజునకు నిహపరములు రెంటను మేలు గానరాదు. ఇతనివలెనే నన్ను వ్యర్థునిఁగా నెంచవలదు. ఈ విషయ మిట్లని వివరింపను నక్కఱలేదు.

క. వీని విధంబున వనితా, ధీనుఁడనై పెంపు దక్కి ౯ తిరుగుచు నుండం
గా నే వెఱ్ఱినె ? తమకము, మాని చనుం" డన్న నవియు ౯ మసలక చనియెన్.

టీ. వీని విధంబునన్ = ఈ స్వరోచివలె; వనితాధీనుఁడనై = స్త్రీలకు లోఁబడినవాఁడనై; పెంపు తక్కి = గౌరవము చెడి; తిరుగుచున్ = సంచరించుచు; ఉండంగాన్ = ఉండుటకు; నేన్ వెఱ్ఱినె? = నేను పిచ్చివాఁడనా? తమకము మాని = మోహము విడిచి; చనుఁడు=పొండు. అనన్ = అని పలుకఁగా; అవియున్ = ఆ యాఁడు మృగములును; మసలక = ఆలస్యము చేయక - అంతట నక్కడ నిలువక; చనియెన్ = వెడలిపోయెను.

తా. ఈ స్వరోచివలె స్త్రీవశ్యుఁడనై చరింప నేను వెఱ్ఱివాఁడనుగాను. నాపలని మోహము మాని వెడలి పొండు. అనఁగా నా యాఁడుజింకలు వెంటనే వెడలిపోయెను.

క. ఈ కరణి దూఱ నాడిన, యా కృష్ణమృగంబుపల్కు లట యున్నఁగ న
క్కోకసతి యన్నమాటలు, నేకంబై తనమనంబు నెరియంజేయన్. 82

టీ. ఈ కరణిన్ = ఈ విధముగా; దూఱ ..పల్కులు - దూఱన్ ఆడిన = నిందించుటగా పల్కిన; ఆ కృష్ణమృగంబు పల్కులు = ఆ నల్లని యిఱ్ఱియొక్క మాటలును; అట యున్నఁగన్ = అంతకుమునుపు; అక్కోకసతి = ఆ చక్రవాకస్త్రీ; అన్నమాటలును; ఏకంబై = ఒక్కటయి; తన మనంబున్ = తన మనస్సును; ఎరియంజేయన్ = దహింపఁగా. తరువాతి కన్వయము.

ఉ. 'ఆరయ నిట్టి రోఁతలకు నాలయముల్ జలజాక్షు; లేటికిన్
వీరలతోడిసంగ? మిఁక వీడెద' నంచుఁ దలంచి తోన దు
ర్వారములైన కోరికల వంక వివేకముచొప్పు దక్కి యిం
పారఁగ నాఱునూఱుసుర హాయనముల్ చరియించెఁ గ్రమ్మఱన్. 83

టీ. ఆరయన్ = విచారింపఁగా; ఇట్టి రోఁతలకున్ = ఇటువంటి యసహ్యములకు; జలజాక్షులు = స్త్రీలు; ఆలయముల్ = ఉనికిపట్లు. వీరలతోడి సంగము = ఇట్టి యీ స్త్రీలతోడిదైన సహవాసము; ఏటికిన్? = ఎందులకు? ఇఁకన్ = ఇఁకమీఁద; వీడెదన్ = విడిచిపెట్టెదను. అంచున్ తలంచి = అని తనలో నెంచుకొని; తోన = తోడనే - వెంటనే; దుర్వారములు = నివారింప శక్యములుకానివి; ఐన కోరికల వంకన్ = అయినట్టి కోరికలవలన; వివేకముచొప్పు = ఆ తెలివియొక్క మార్గము; తక్కి = వదలి; క్రమ్మఱన్ = మరల; ఇంపారఁగన్ = ఆనందము నిండుకొనఁగా; ఆఱు నూఱు సురహాయనముల్ = దేవమానమున నాఱువందల యేండ్లు; చరియించెన్ = ఆ భార్యలతోఁగూడి విహరించెను.

తా. అట్లు మనస్తాపము పొంది స్వరోచి "తనలో విచారింపఁగా నిట్టి రోఁతల కన్నిటికి నునికి పట్లు స్త్రీలు గనుక నీ స్త్రీలతోడి సహవాసము మాని ఘనత వహించెద" నని యెంచి, యంతలోనే యా తెలివి మాసిపోఁగా నెప్పటివలె నా ముగ్గురు భార్యలతోడను గూడి దేవమానమున నాఱునూఱేండ్లు విహరించెను.

వ. తదనంతరంబ క్రమక్రమంబున మనోరమయందు విజయుండును, విభావసియందు మేరునందనుండును, కళావతియందు విభావసుండును నను నందనులం గాంచి, పద్మినీవిద్యాప్రభావంబునం బాకశాసన దిశాముఖంబున విజయునకు విజయాఖ్యపురంబును, గిన్నరేశ్వరహరిదంతంబున మేరునందనునకు గంధవతి యను పుటభేదనంబును, దక్షిణంబున విభావసునకు ధారాహ్వయోదార

మహానగరంబునుం గల్పించి, యనల్పవిభవంబున నక్కుమారుల నప్పట్టణం
బులకుఁ బట్టంబు కట్టి కృతార్థుండై యొక్కనాఁడు. 84

టీ. తదనంతరంబ = పిదప; క్రమక్రమంబునన్; మనోరమయందు; విజయుఁడును; విభావసి యందు; మేరునందనుండును; కళావతియందు; విభావసుండును; అను నందనులన్ = అను పేళ్లు గల కొడుకులను; కాంచి = కని; పద్మినీవిద్యాప్రభావంబునన్ = పద్మిని యను విద్యయొక్క మహిమచేత; పాకశాసనదిశాముఖంబునన్ = తూర్పుదిక్కు మొగదలను; విజయునకు; విజయాఖ్య పురంబును = విజయ మను పేరు గల పట్టణమును; కిన్నరేశ్వరహరిదంతంబునన్ = కుబేరుని దైన యుత్తరపుదిక్కు మొగదలను; మేరునందనునకు; గంధవతి యను; పుటభేదనంబును = పట్టణమును; దక్షిణంబునన్; విభావసునకు; ధారాహ్వయోదారమహానగరంబునున్ = ధార యను పేరు గల ఘనతవహించిన పెద్దపట్టణమును; కల్పించి = నిర్మించి - కట్టి; అనల్పవిభవంబునన్ = తక్కువ కాని వైభవముతో; అక్కుమారులన్ = ఆ ముగ్గురుకొడుకులను; అప్పట్టణంబులకున్ = ఆ మూఁడు పట్టణములకును; పట్టంబుగట్టి = పట్టాభిషిక్తులనుగాఁ జేసి; కృతార్థుండై = ఎల్లకోరికలు నెఱవేర్చుకొన్నవాఁడై; ఒక్కనాఁడు.

ఉ. శాసితశత్రుఁ డానృపతి చంద్రుఁడు తూణధరుండు సజ్యబా
ణాసనపాణిపంకజుఁడునై మృగసంఘము లెల్లఁ బెల్లు సం
త్రాసము నొందఁ గ్రూరత నరణ్యమునన్ మృగయాకుతూహలో
ల్లాసమునం జరించెఁ జలలక్ష్యవిభేదవిధావధానుఁడై. 85

టీ. శాసితశత్రుఁడు = శిక్షింపఁబడిన పగవారుగలవాఁడైన; ఆనృపతిచంద్రుఁడు = ఆ రాజశ్రేష్ఠుఁడు - స్వారోచి; తూణధరుండున్ = అమ్ములపొదులు దాల్చినవాఁడును; సజ్య...జుఁడునై - సజ్య = ఎక్కుపెట్టఁబడిన; బాణాసన = వింటితోఁగూడిన; పాణిపంకజుఁడునై = హస్తకమలము గలవాఁడునై - ఎక్కుపెట్టినవిల్లు చేతఁబట్టినవాఁ డనుట; మృగసంఘములు = మెకములగుంపులు; ఎల్లన్ = అన్నియును; పెల్లు సంత్రాసమున్ ఒందన్ = మిక్కిలి భయమును పొందఁగా; క్రూరతన్ = కఠినత్వముతో; మృగయా...మునన్ - మృగయా = వేఁటయందలి; కుతూహల = వేడుకలవలననైన; ఉల్లాసమునన్ = ఉత్సాహముతో; అరణ్యమునన్ = అడవియందు; చల...నుఁడై - చల = చలించునట్టి; లక్ష్య = గుఱియొక్క - గుఱియైన మృగములయొక్క; విభేద విధా = చక్కఁగా భేదించుటయనెడి వ్యాపారమునందు; అవధానుఁడై = ఎచ్చరిక గలవాఁడై యు; చరించెన్ = సంచరించెను.

తా. పగవారి నెల్లను గెలిచి, వాసికెక్కిన యా స్వారోచిమహారాజు వేఁటాడఁగోరి, యమ్ముల పొదులు, విల్లును గొని, యడవికిఁ జని, యందలి మృగములు తన్నుఁ గని వెఱచి పోవుచుండఁగా గుఱితప్పకుండ బాణములు ప్రయోగించి వేఁటాడుచు సంచరించెను.

క. కుటిలకృశసాంధ్యరజనీ, విటకోరకకోమలచ్ఛవి స్ఫుటదంష్ట్రో
ద్భటపోత్రఖనిత్రాగ్ర, స్ఫుటితవనీధాత్రి నొక్క పోత్రిం గనియెన్. 86

టీ. కుటిల...ధాత్రిన్ - కుటిల = వంకరయై; కృశ = సన్నగిల్లిన; సాంధ్యరజనీవిట కోరక = సంధ్యాకాలమునందలి బాలచంద్రరేఖవలె; కోమలచ్ఛవి = మృదువైన కాంతిచేత; స్ఫుట = స్వచ్ఛముగా వెలుఁగుచున్న; దంష్ట్రి = కోఱలచేత; ఉద్భట = నిక్కిన; పోత్ర

ఖనిత్ర = ముట్టెయనెడి గుద్దలియొక్క; అగ్ర = మొనచేత; స్ఫుటిత = భేదింపఁబడిన; వనీ ధాత్రిన్ = అడవిభూమిగలదానిని - తెల్లగాఁ బ్రకాశించుటచేతఁ జంద్రరేఖవలెనే కనఁబడుచున్న కోఱలతోడి ముట్టెతో వనభూమిని ద్రవ్వునట్టిదాని ననుట; ఒక్క పోత్రిన్ = ఒక యడవిపందిని; కనియెన్ = చూచెను. అలం. నిదర్శన; రూపకమును.

[ఈ క్రిందిపద్యము పైపద్యము నర్థమే కలదై యున్నది. ఇది ప్రక్షిప్తమని బ్రౌన్ దొరగారి పుస్తకములో వ్రాయఁబడియున్నది.]

సీ. జంభారిభిదురసం * రంభంబు వీక్షించి, జరుగు నంజనమహా * శైల మనఁగ
ఝుంఝూప్రభంజనా * స్ఫాలనంబునకుల్కి, యరుగు సంవర్తకా * లాభ్ర మనఁగఁ
గఠినకంఠేకాల * కంఠమూలము వాసి, వెస వచ్చు నుజ్జ్వల * క్ష్వేళ మనఁగఁ
గలుషధూర్వహఖలో * త్కరముపైఁ బఱతెంచు, దండధరక్రూర * దండ మనఁగ
తే. ఘుర్ఘురారావసంఘాత * ఘూర్ణమాన
సప్తపాథోధిపాథఃప్ర * చండనక్ర
తిమితిమింగిల మగుచు న * భ్రమును మహియుఁ
గ్రమ్ముకొని వచ్చు నొక యేక * లమ్ముఁ గనియె. 87

టీ. జంభారిభిదురసంరంభంబున్ = ఇంద్రుని వజ్రాయుధముయొక్క యాటోపమును; వీక్షించి = చూచి; జరుగు నంజనమహాశైలము అనఁగన్ = తొలఁగిపోవునట్టి గొప్ప కాటుక కొండయో అనునట్టుగాను; ఝుంఝూ...బునకున్ - ఝుంఝూప్రభంజన = వానతోడి పెనుగాలి యొక్క; ఆస్ఫాలనంబునకున్ = చఱపునకు - తాఁకునకు; ఉల్కి = భయపడి - బెదరి; అరుగు సంవర్తకాలాభ్రము అనఁగన్ = పోవునట్టి ప్రళయకాలమునందలి నీలమేఘమో అనునట్టుగాను; కఠిన...మూలమున్ - కఠిన = క్రూరమైన (క్ష్వేళమునకు విశేషణము); కంఠేకాల = శివుని యొక్క; కంఠమూలమున్ = మెడయడుగును; పాసి = విడిచి; వెసన్ = వేగముతో; వచ్చు నుజ్జ్వలక్ష్వేళము అనఁగన్ = వచ్చునట్టి వెలుఁగుచున్నవిషమో అనఁగాను; కలుష...పైన్ - కలుష ధూర్వహ = పాపభారము వహించునట్టి - మిక్కిలి పాపకృత్యములు చేయునట్టి; ఖలోత్కరము పైన్ = దుర్జనుల సమూహముమీఁద; పఱతెంచు...దండము - పఱతెంచు = వడిగొనివచ్చునట్టి; దండధర = యమునియొక్క; క్రూరదండము = కఠోరమైన దండాయుధమో; అనఁగన్; ఘుర్ఘుర...గిలము - ఘుర్ఘుర = గుర గుర యనెడి; ఆరావ = ధ్వనియొక్క; సంఘాత = అధికమైన దెబ్బలచేత; ఘూర్ణమాన = తిరుగుడుపడుచున్న; సప్తపాథోధి = ఏడుసముద్రములయొక్క; పాథః = నీటిలోనుండి వెడలిన; ప్రచండ = భయంకరమైన; నక్ర = మొసళ్లు; తిమి = తిము లనెడి పెనుఁజేఁపలు; తిమింగిలము = తిములను మ్రింగునట్టి మిక్కిలి పెద్దవైన చేఁపలును గలది; అగుచున్; అభ్రమును = ఆకాశమును; మహియున్ = భూమియును; క్రమ్ముకొని = ఆక్రమించు కొని; వచ్చు నొక యేకలమ్మున్ = వచ్చునట్టి యొక పందిని; కనియెన్ = చూచెను.

మ. కని మార్వెనినదంబు సేయుచు భుజం * గక్రూరనారాచముం
దనదోర్దండకృతాంతదండనిభకో * దండంబునం [1]గూర్చి బో

1. పూన్చి. పా.

రన నేయం దమకించుచుండ నొక సా ౹ రంగాంగనారత్న మ
జ్జననాథాగ్రణిఁ జేరి పంచజనభా ౹ షాప్రౌఢిమై నిట్లనున్. 88

టీ. కని = ఆ పందిని జూచి; మౌర్వీనినదంబు చేయుచున్ = వింటినారిమ్రోఁతను కలుగఁ జేయుచు; భుజంగక్రూరనారాచమున్ = పామువలెఁ గ్రూరమైన యినుపబాణమును; తన...దండంబునన్ - తన = తనదైన; దోర్దండ = కఱ్ఱవంటి చేతిలోని; కృతాంతదండ = యముని దండాయుధముతో; నిభ = పోలిన; కోదండంబునన్ = వింటియందు; కూర్చి = సంధించి; బోరనన్ = శీఘ్రముగా; ఏయన్ = ప్రయోగించుటకు; తమకించుచుండన్ = త్వరపడుచుండఁగా; ఒక సారంగాంగనారత్నము = మేలయిన యొక యాఁడుజింక; అజ్జననాథాగ్రణిన్ = ఆ రాజశ్రేష్ఠుని; చేరి = సమీపించి; పంచజనభాషాప్రౌఢిమైన్ = మనుష్యులమాటలవంటి మాటలయందలి నేర్పుతో; ఇట్లనున్.

తా. స్వరోచి యా పందిని జూచి, వింటినారి మ్రోయించి, వాఁడియైన యొక యినుపబాణమును వింటియందు సంధించి, ప్రయోగింప యత్నించుచుండఁగా, నొక యాఁడుజింక యా రాజును జూచి, మనుష్యులమాటలతో నిట్లు పలికెను. అలం. ఉపమ, నిదర్శనయు.

క. నృప! యీ క్రోడము నీ కే, యపకారము సేసె ? దీని ౹ కలుగఁగ నేలా ?
కృప మదిఁ జొనుపక నాపై, నిపు డీ శర మేసి నిగ్ర ౹ హించుట యొప్పున్. 89

టీ. నృప ! = ఓ రాజా ! ఈ క్రోడము = ఈ పంది; నీకు; ఏ యపకారము సేసెన్ ? = ఏ కీడు చేసెను? దీనికిన్ = ఈ పందియెడల; కృప = దయను; మదిన్ = మనసునందు; చొనుపక = ప్రవేశింపఁజేయక - కలవాఁడవుగాక; అలుగఁగన్ ఏలా ? = కోపించుట ఎందులకు? ఇపుడు; ఈ శరమున్ = ఈ బాణమును; నాపైన్ ఏసి = నామీఁద ప్రయోగించి; నిగ్రహించుట = త్రోపాడుట; ఒప్పున్ = తగును.

తా. ఓ రాజా ! ఈ పంది నీ కేమియుఁ గీడు చేయలేదే ! దీనిపైఁ గోపించి చంప యత్నించుట యేల ? ఇప్పుడు దీనిఁ గరుణించి విడిచి, నామీఁద నా బాణము వేసి నన్నుఁ జంపుము. అది యుక్తముగా నుండును.

క. అని పలుక నతఁడు 'నీ వీ, తనువుపయిన్ రోయ నేల ? ౹ తద్దయుఁ గృశమై
యునికియుఁ గాదు గదా చెపు', మనవుడు నా హరిణి వల్కె ౹ నవనీపతికిన్. 90

టీ. అని పలుకన్ = అని యాఁడుజింక యనఁగా; అతఁడు = ఆ స్వరోచి; నీవు; ఈ తనువుపయిన్ = ఈ దేహముమీఁద; రోయ నేల ? = అసహ్యపడ నేల ? తద్దయున్ = మిక్కిలి; కృశమై = చిక్కి; ఉనికియున్ = ఉండుటయును; కాదుగదా ! చెపుము = నాతోఁ జెప్పుము. ఆహారాదులు లేమిచేఁ జిక్కియున్నను రోయఁదగునుగాని యేదియులేక రోయ నేల యనుట; అనవుడున్ = అని యడుగఁగా; అవనీపతికిన్ = రాజుతో; ఆ హరిణి = ఆ యాఁడుజింక; పల్కెన్ = ఇట్లు చెప్పెను - అనఁగా స్వరోచి తనతో నట్లు పలికినలేడిని జూచి 'నిన్నుఁ జూడఁగా సుఖముగా జీవించుచున్నదానివలెఁ దోఁచుచున్నదే ! ఇట్లు దేహత్యాగము చేయఁగోర నేల ? యని యడుగఁగా నది యిట్లు ప్రత్యుత్తరము చెప్పఁబూనెను.

ఆ. 'అన్యసతులయందు ౹ నాసక్తుఁడగువానిఁ
దమక మొదవి కూడఁ ౹ దలఁచుకంటె

మరణమైన మేలు మది వితర్కింపంగ'
ననుచుఁ బలుకుటయును నవనివిభుఁడు. 91

టీ. అన్యసతులయందుఁ = ఇతరస్త్రీలయందు; ఆసక్తుఁడు అగువానిఁ = మక్కువకలిగిన వాఁడగునట్టి పురుషుని; తమకము = వలపు; ఒదవి = కలిగి - పొంది; కూడఁ తలఁచుకంటెఁ = కలయుటకు ఎంచుటకన్నను; మదిఁ = మనస్సునందు; వితర్కింపంగఁ = విచారింపఁగా; మరణమైనఁ = చావైనను - చచ్చినను; మేలు = మంచిది; అనుచుఁ బలుకుటయుఁ = అని యనఁగానే; అవనివిభుఁడు = రాజు. తరువాతి పద్యముతో నన్వయము.

క. 'తావకహృదయం బెవ్వని, పై వదలక నిలిచె ? నీదు భావము దెలియం
గా వలయుఁ జెప్పు' మన్న ధ, రావల్లభుతోడ హారిణి క్రమ్మఱఁ [1]బలికెన్. 92

టీ. తావకహృదయంబు = నీ మనస్సు; ఎవ్వనిపైఁ = ఏ పురుషునిమీఁద; వదలక = మానక - తప్పక; నిలిచెఁ ? = పొందెను ? నీదుభావము = నీ తలఁపు; తెలియంగావలయుఁ = నేను దెలిసికోవలయును. చెప్పుము; అన్నఁ = అనఁగానే; హారిణి = లేడి; ధరావల్లభుతోడఁ = రాజుతో - స్వరోచితో; క్రమ్మఱఁ = మరల; పలికెఁ = ఇట్లు చెప్పెను.

చ. 'చెదరక నామనంబు నృప శేఖర! నీయెడ నిల్చి మన్మథ
ప్రదరపరంపరానిహతి పాల్పడి వ్రేఁగెడు; నట్లు గాన నా
యద టడఁగింపు' మన్న 'హరి ణాంగన వీవు, నరుండ నే, ముదం
బొదవఁగ నీకు నాకు మిథు నోచితకృత్యము లెట్లు చేకుఱున్ ?' 93

టీ. నృపశేఖర ! = రాజశ్రేష్ఠుఁడా ! నా మనంబు = నా మనస్సు; నీ యెడఁ = నీయందు; చెదరక = చలింపక - తప్పక; నిల్చి = చేరినదై; మన్మథ...పాల్పడి - మన్మథ = మన్మథునివైన; ప్రదరపరంపరా = బాణములయొక్క ఎడతెగని వరుసలయొక్క; నిహతి పాల్పడి = దెబ్బలపాలై; వ్రేఁగెడుఁ = తపించుచున్నది. అట్లుగాన = అటుగనుక - కాఁబట్టి; నా యదటు = నా తమకమును; అడఁగింపుము = అణఁపుము; అన్నఁ = అనఁగా (రాజు); ఈవు = నీవు; హరిణాంగనవు = మృగస్త్రీవి; నేఁ నరుండఁ = నేను మనుష్యుఁడను. నీకుఁ; నాకుఁ; ముదంబు ఒదవఁగఁ = సంతోషము కలుగునట్లు; మిథునోచితకృత్యములు = ఆలు మగల కూడికకుఁ దగిన వ్యాపారములు; ఎట్లు; చేకుఱుఁ ? = సిద్ధించును ?

తా. 'ఓ రాజశ్రేష్ఠుఁడా ! నామనస్సు నీయందే తగిలి మన్మథవేదనచేఁ దపించుచున్నది. నీవు నా తమకము నణఁపు' మనఁగా, రాజు 'నీవు మృగస్త్రీవి; నేను మనుష్యుఁడను; మన కెట్లు దాంపత్యధర్మము సిద్ధించును?' అనియెను.

క. నావుడు 'నను నాలింగన, మీ వనురాగమునఁ జేయు మింతియ చాలుఁ
భూవర!' యన్నఁ గృపార్ద్రుఁడు, గావున నానృపతి హరిణిఁ గౌఁగిటఁ జేర్చెఁ.

టీ. నావుడుఁ = అని రాజు పలుకఁగానే; (లేడి;) భూవర ! = రాజా ! ఈవు = నీవు; నన్నుఁ; అనురాగమునఁ = ప్రేమతో; ఆలింగనము చేయుము = కౌఁగిలించుకొనుము; ఇంతియ = ఈ కౌఁగిలించుటయే; చాలును. అన్నఁ = అనఁగా; ఆ నృపతి = ఆ స్వరోచిమహా

---

1. ననియెఁ. ముద్రి. పా.

రాజు; కృపార్ద్రుఁడు కావునన్ = దయచేత మెత్తవడినవాఁడు కనుక; హరిణిన్ = ఆఁడు జింకను; కౌఁగిటఁజేర్చెన్.

సీ. వల్లీమతల్లిలా ♦ వణ్యసర్వస్వంబు, విమలాంగరేఖ నా ♦ విర్భవింప
మంజులమంజరీ ♦ మహితసౌభాగ్యంబు, పరివృత్తకుచవృత్తిఁ ♦ బరిణమింపఁ
బల్లవచ్ఛదచారు ♦ భావానుభావంబు, మృదుహస్తలీల మూ ♦ ర్తీభవింప
రమణీయముకుళవి♦భ్రమభాగధేయంబు, కరరుహస్ఫూర్తి సా ♦ క్షాత్కరింపఁ
తే. జేసి మృగియై వహించు న ♦ క్షిద్వయంబు
భాసురంబుగఁ దనయంక ♦ పాళిలోన
మించుక్రొమ్మించు నుపమించు ♦ మెలఁత యగుచు
నిలుచు నవ్వనదేవత ♦ నృపతి సూచి. 95

టీ. వల్లీ...స్వంబు - వల్లీమతల్లి = శ్రేష్ఠమయిన తీగెలయొక్క; లావణ్యసర్వస్వంబు = కాంతివిశేషముయొక్క సౌందర్యమంతయును; విమలాంగరేఖన్ - విమల = నిర్మలమైన; అంగరేఖన్ = అవయవములయొక్క సౌష్ఠవప్రకారముతో; ఆవిర్భవింపన్ = పుట్టఁగా - దేహ మేర్పడఁగా; మంజుల...సౌభాగ్యంబు - మంజుల = మనోహరమయిన; మంజరీ = పూగుత్తులయొక్క; మహిత = పూజ్యమైన; సౌభాగ్యంబు = సుభగత్వము - అందము; పరివృత్తకుచవృత్తిన్ - పరివృత్త = అంతటను వట్రువైన; కుచవృత్తిన్ = స్తనప్రవర్తనముతో - స్తనములై; పరిణమింపన్ = మాఱఁగా - ఏర్పడఁగాను; పల్లవ...భావంబును - పల్లవచ్ఛద = చిగురుటాకుల యొక్క; చారుభావ = ఒప్పిదముయొక్క; అనుభావంబు = గొప్పతనము; మృదుహస్తలీలన్ = మెత్తనైన చేతుల ప్రకారముచేత - చేతులై; మూర్తీభవింపన్ = స్వరూపము నొందినదికాఁగా; రమణీ...భాగధేయంబు - రమణీయ = అందమయిన; ముకుళ = పూమొగ్గలయొక్క; విభ్రమ = విలాసముయొక్క; భాగధేయంబు = భాగ్యము - కలిమి; కరరుహస్ఫూర్తిన్ = గోళ్ళయొక్క స్ఫురణచేత - గోళ్లుగాఁ బ్రకాశించుటచేత; సాక్షాత్కరింపన్ = ప్రత్యక్షముకాఁగా - కనఁబడఁగాను; చేసి = కావించి (కర్త - వనదేవత); మృగియై = మృగస్త్రీయై; వహించు నక్షిద్వయంబు = తాల్చిన కన్నులజంట; భాసురంబుగన్ = (కన్నులై) ప్రకాశింపఁగా; తన యంకపాళిలోన్ = తన కౌఁగిటియందు; మించు క్రొమ్మించున్ = మెఱయుచున్న క్రొత్త మెఱపును; ఉపమించు మెలఁత = సరిపోలునట్టి స్త్రీ; అగుచున్; నిలుచు నవ్వనదేవతన్ = నిలిచిన యా వనాధిదేవతను; చూచి; నృపతి = రాజు. తర్వాతి పద్యముతో నన్వయము.

తా. అప్పుడు మృగీరూపముతో నున్న వనదేవత వనములోని లేఁతతీగలే తనకు సుందరమయిన దేహమును, పూగుత్తులే స్తనద్వయమును, చిగురాకులే హస్తములును, పూమొగ్గలే గోళ్లును, లేడియై యున్నప్పటి కన్నులే కన్నులునై యొప్పఁగాఁ దళతళ మెఱయుచున్న మెఱపుఁదీగవలె స్వారోచి కౌఁగిట నొక మనుష్యస్త్రీరూపముతోఁ గనుపట్టెను. అప్పుడు దానిఁ జూచి యా రాజు. అలం. ఉపమ.

క. పూనిన విస్మయరసమున, 'మానిని! మృగివై చరించి ♦ మఱి యంగనవై
కానంబడితివి; చిత్రం, బే నెన్నఁడు నెఱుఁగ; జెప్ప ♦ వే తెలియంగన్.' 96

టీ. పూనిన విస్మయరసమునన్=పొందిన ఆశ్చర్యరసముతో - ఆశ్చర్యమును బొంది యనుట; మానిని ! = ఓ వనితా ! మృగివై = ఆఁడుజింకవై; చరించి = వర్తించి; మఱి = పిమ్మట; అంగనవై = మనుష్యస్త్రీవై; కానంబడితివి. చిత్రంబు = ఇది వింతగా నున్నది. ఏన్ ఎన్నఁడున్ = నేను ఎప్పుడును; ఎఱుఁగన్ = (ఇట్టి వింత చూచి) యెఱుఁగను. తెలియంగన్ = ఇట్లగుటకుఁ గారణము తెలియఁబడునట్లు; చెప్పవే! = నాతోఁజెప్పుము.

తా. అప్పుడు దానిం జూచి స్వరోచి 'యో చిన్నదానా ! నీవు తొలుత మృగస్త్రీవై యుండి, పిమ్మట మనుష్యస్త్రీవై కనఁబడుచున్నావు. ఇది వింతగా నున్నది. ఇట్లగుటకుఁ గారణమేమో నాకుఁ దెలియఁజెప్పు' మనియెను.

సీ. నావుడు నమరకాం తాతనూభవుఁ జూచి, 'యివ్వనదేవత నే నరేంద్ర !
సకలభూభువనర క్షాదక్షు మనువర్యు, నీయందుఁ బడయునె న్నిక సమస్త
దివిజులు నన్నుఁ బ్రా ర్థించిన వచ్చితి, ననురాగవతినైన నను వరించి
పడయుము నాయంద పత్యంబు దీన నీ,కగుఁ బుణ్యలోకసం ప్రాప్తి' యనిన
తే. 'నట్ల కా' కని యయ్యంబు జాయతాక్షి, నేకచిత్తంబుతోడ నం గీకరించె
బాల యిట్లు సుఖాంబుధిఁ దేలుచుండి, యంత గర్భిణియై శుభం బగుదినమున.

టీ. నావుడున్ = (అని స్వరోచి) యనఁగా; అమరకాంతాతనూభవున్ = దేవతాస్త్రీ కొడుకైన యా స్వరోచిని; చూచి = (వనదేవత) చూచి; నరేంద్ర ! = రాజా ! ఏన్ ఇవ్వనదేవతన్ = నేను ఈ యడవికి నధిదేవతను. సకల...దక్షున్ - సకల = సమస్తమయిన; భూభువన = భూలోకముయొక్క; రక్షాదక్షున్ = రక్షించుటయందు సమర్థుఁడైనవానిని - చాలినవానిని; మనువర్యున్ = శ్రేష్ఠుఁడైన మనువును; నీయందున్ = నీవలన; పడయునెన్నికన్ = కను తలఁపుతో; నన్ను; సమస్తదివిజులున్ = ఎల్ల దేవతలును; ప్రార్థించినన్ = వేఁడఁగా, వచ్చితిన్; అనురాగవతిని = అనురక్తిగలదానను; ఐన ననున్ = అయినట్టి నన్ను; వరించి = పరిగ్రహించి; నాయందున్ = నావలన; అపత్యంబు పడయుము = సంతానమును పొందుము. దీనన్ = ఈ సంతతిచేత; నీకు; పుణ్యలోక సంప్రాప్తి = పుణ్యలోకములపొందు - సద్గతి యనుట. అగును; అనినన్ = అని వనదేవత చెప్పఁగానే; అట్లకాక! = అట్లే కానిమ్ము; అని; అయ్యంబుజాయతాక్షిన్ = తామరవలె వెడలుపులైన కన్నులుగల యా స్త్రీని; ఏకచిత్తంబుతోడన్ = ఒకటే మనసుతో - మనసున నన్యథాభిప్రాయములేక; అంగీకరించెన్ = (స్వరోచి) పరిగ్రహించెను. బాల = ఆ స్త్రీ; ఇట్లు; సుఖాంబుధిన్ = సౌఖ్యసముద్రమునందు; తేలుచున్ = ఈఁదులాడుచు; ఉండి= ఉన్నదై - అతనితోఁ గూడి మేరలేని సుఖము ననుభవించుచుండి యనుట; అంతన్ = పిమ్మట; గర్భిణియై = గర్భము ధరించినదై; శుభంబు అగు దినమునన్ = మంచిదగునట్టి యొకానొక దినమునందు. తర్వాతి కన్వయము.

తా. అట్లు స్వరోచి తన వృత్తాంతము నడుగఁగా నా స్త్రీ 'నే నీ వనదేవతను. నీవలన మనువు కాఁదగిన యొక కుమారునిఁ బడయుటకై దేవతలు ప్రార్థింపఁగా నీయొద్దకు వచ్చితిని. నన్నుఁగూడి కొడుకుం బడయుము. ఆ కొడుకువలన నీకుఁ బుణ్యలోకప్రాప్తి యగు' ననఁగా, నందుల కొప్పుకొని, యాతం డామెం బరిగ్రహించి సుఖించుచుండఁగా, నది గర్భము ధరించి యొక శుభ దినమునందు.

శా. కాంచెం బుత్త్రు విశాలనేత్రుఁ బృథువ • క్షఃపీఠవిభ్రాజితుం
బంచాస్యోద్భటశౌర్యధుర్యఘనశుం • భద్బాహుఁ దేజోనిధిం
బంచాస్త్రప్రతిమాను మానఘను సా • మ్రాజ్యైకహేతుప్రభూ
తాంచల్లక్షణలక్షితుఁ సుగుణర • త్నానీకరత్నాకరున్. 98

టీ. విశాలనేత్రుఁన్ = విశాలమైన కన్నులు గలవానిని; పృథు...జితున్ - పృథు = విశాలమైన; వక్షఃపీఠ = పీఁటవంటి ఱొమ్ముచేత; విభ్రాజితున్ = ప్రకాశించువానిని; పంచా... బాహున్ - పంచాస్య = సింహముయొక్క; ఉద్భట = హెచ్చయిన; శౌర్య = శూరత్వమువంటి శూరత్వమునకు; ధుర్య = భారవాహులైన; ఘన = దొడ్డవైన; శుంభద్బాహున్ = ఎగుభుజములు గలవానిని; తేజోనిధిన్ = ప్రతాపమునకు స్థానమైనవానిని; పంచాస్త్రప్రతిమానున్ = (సౌందర్యముచేత) మన్మథునితో సమానుఁడయినవానిని; మానఘనున్ = చిత్తౌన్నత్యముచేత నధికుఁడయినవానిని; సామ్రా...లక్షితున్ - సామ్రాజ్య = మహామండలేశ్వరత్వమే; ఏక = ముఖ్యమైన; హేతు = కారణముగాఁగల; ప్రభూత = గొప్పవై; అంచత్ = ఒప్పుచున్న; లక్షణ = సాముద్రిక చిహ్నముల చేత; లక్షితున్ = చూడఁబడినవానిని - చక్రవర్తిలక్షణములు గలవాని ననుట. సుగుణ...కరున్ - సుగుణ = మంచిగుణము లనెడి; రత్నానీక = రత్నములయొక్క సమూహమునకు; రత్నాకరున్ = సముద్రుఁడైనవానిని; పుత్త్రున్; కాంచెన్ = ప్రసవించెను.

తా. వెడలుపయిన కన్నులును, ఱొమ్మును, సింహపరాక్రమమువంటి పరాక్రమమును, హెచ్చైన ప్రతాపమును, మన్మథుని చక్కఁదనమువంటి చక్కఁదనమును, చక్రవర్తి చిహ్నములును, సకల సద్గుణములును గలిగిన యొక సత్పుత్త్రు నామె గనియెను. అలం. ఉపమ, రూపకమును.

క. వేడుక నయ్యవసరమున, నాడిరి సురసతులు కిన్న • రాంగన లర్థిం
బాడిరి గంధర్వులు గొని, యాడిరి సురతూర్యనినద • మగ్గలమయ్యెన్.[1] 99

టీ. అయ్యవసరమునన్ = ఆ కొడుకు పుట్టిన సమయమునందు; వేడుకన్ = కుతూహలముతో; సురసతులు = దేవతాస్త్రీలు, ఆడిరి = నాట్యము చేసిరి. అర్థిన్ = ప్రీతితో; కిన్నరాంగనలు = కిన్నరస్త్రీలు; పాడిరి = గానము చేసిరి; గంధర్వులు = దేవగాయకులు; కొనియాడిరి = స్తోత్రములు చేసిరి. సురతూర్యనినదము = దేవవాద్యములధ్వని; అగ్గలమయ్యెన్ = అధికమయ్యెను.

తే. అట్లు జనియించి స్వారోచి • షాఖ్య నతఁడు
శాంతి దాంతి దయా సత్య • శౌచనిరతుఁ
డై యకామతఁ జిరతపం • బాచరించె
నచ్యుతునిఁగూర్చి యంతఁ గృ • పార్ద్రుఁ డగుచు. 100

టీ. అట్లు = ఆ విధముగా; జనియించి = పుట్టి; అతఁడు = ఆ కుమారుఁడు; స్వారోచిషాఖ్యన్ = స్వారోచిషుఁ డను పేరితో; శాంతి...నిరతుఁడై - శాంతి = శమమునందును - కామక్రోధాది గుణములు లేకుండుటయందును; దాంతి = దమమునందును - బ్రహ్మచర్యము మొదలయిన తపస్సులవలని శ్రమము నోర్చుటయందును; దయా = కరుణయందును; సత్య = నిజమునందును;

1. దీనికి బదులు వ్రాఁతప్రతులలో నీ క్రింది పద్య మున్నది:—

క. వేడుక నపుడు సురల్గొని, యాడిరి; వేలుపువెలందు • లందఱు నాట్యం
బాడిరి; కిన్నరులర్థిం, బాడి; రమరతూర్యనినద • మంగళమొప్పెన్.

శౌచ = పరిశుద్ధతయందును; నిరతుఁడై = ఆసక్తుఁడై; అకామతన్ = కోరికలేనితనముతో; అచ్యుతునిఁగూర్చి = విష్ణు నుద్దేశించి; చిరతపంబు = విశేషకాలము జరపునట్టి తపస్సును; ఆచరించెన్ = చేసెను. అంతన్ = పిమ్మట; కృపార్ద్రుఁడగుచున్ = దయారసము గలవాఁ డగుచు - మిక్కిలి దయగలవాఁడై. తర్వాతి కన్వయము. (క_ర్త. లక్ష్మీశ్వరుండు.)

సీ. నీలమేఘముడాలు ♦ డీలుసేయఁగఁ జాలు
మెఱుఁగుఁజామనచాయ ♦ మేనితోడ
నరవిందములకచ్చు ♦ లడఁగించుజిగిహెచ్చు
నాయతంబగు కన్ను ♦ దోయితోడఁ
బులుఁగురాయనిచట్టు ♦ పలవన్నె నొరవెట్టు
హొంబట్టుజిలుఁగు [1]రెం ♦ టెంబుతోడ
నుదయార్కబింబంబు ♦ నొఱపువిడంబంబుఁ
దొరలంగ నాడు కౌ ♦ స్తుభముతోడ

తే. జయజయధ్వని మౌళి నం ♦ జలులు సేర్చు
శర్వ శతధృతి శతమన్యు ♦ శమన శరధి
పాలకైలబిలాది దే ♦ వాలితోడ
నెదుటఁ బ్రత్యక్షమయ్యె ల ♦ క్ష్మీశ్వరుండు. 101

టీ. లక్ష్మీశ్వరుండు = లక్ష్మీనాయకుఁడయిన విష్ణువు; నీలమేఘముడాలు=నల్లమబ్బు కాంతిని; డీలుసేయఁగన్ = క్రిందుపఱుచుటకు; చాలు... మేనితోడన్ - చాలు = చాలిన - సమర్థమైన; మెఱుఁగు = మినమినమెఱయుచున్న; చామనచాయ మేనితోడన్ = శ్యామలవర్ణముతోఁగూడిన దేహముతోను; అరవిందముల కచ్చులు = తామరలయొక్క నిక్కులను; అడఁగించు జిగిన్ = అణఁచివేయునట్టి కాంతిచేత; హెచ్చు = అతిశయించునట్టి; ఆయతంబు = విశాలమైనది; అగు కన్నుదోయితోడన్ = అయినట్టి కన్నుల జంటతోను; పులుఁగు...వన్నెన్ - పులుఁగురాయని = పక్షిరాజైన గరుత్మంతునియొక్క; చట్టుపలవన్నెన్ = రెక్కల వర్ణమును; ఒర...తోడన్ - ఒరవెట్టు = మచ్చునకై యొరయునట్టి - సరిపోలిన; హొంబట్టు = బంగారు వన్నె పట్టయిన; జిలుఁగు = సన్నఁదనముగల; రెంటెంబుతోడన్ = జమిలినేఁత వస్త్రముతోను; ఉదయా... విడంబంబు - ఉదయ = ఉదయించునప్పటి; అర్కబింబంబు = సూర్యునిబింబముయొక్క; ఒఱపు విడంబంబు = సౌందర్యముయొక్క పోలికను; తొర...తోడన్ - తొరలంగనాడు = మార్చి వేయునట్టి - అణఁచివేయునట్టి; కౌస్తుభముతోడన్ = కౌస్తుభ మణితోను; జయజయధ్వనిన్ = జయ జయ యనెడి ధ్వనితో; మౌళిన్ = తలయందు; అంజలులు = చేమోడ్పులు; చేర్చు... తోడన్ - చేర్చు = పెట్టుకొన్నట్టి; శర్వ = శివుఁడు; శతధృతి = బ్రహ్మ; శతమన్యు = ఇంద్రుఁడు; శమన = యముఁడు; శరధిపాలక = వరుణుఁడు; ఐలబిల = కుబేరుఁడు; ఆది = మొదలుగాఁగల; దేవాళితోడన్ = దేవతల పంక్తితోను; ఎదుటన్ = ఆ స్వారోచిషునియెదుట; ప్రత్యక్షమయ్యెన్ = సాక్షాత్కరించెను.

1. గెంటెంబు. పా.

తా. నీలమేఘచ్ఛాయతోడి దేహమును, తామరలవలె విశాలమయిన కన్నులును, బంగారువన్నె పట్టుపచ్చడమును, నుదయకాలమునందలి సూర్యబింబమువలె వెలుఁగుచున్న కౌస్తుభమణియు నొప్పఁగా, బ్రహ్మ, రుద్రుఁడు, యముఁడు, వరుణుఁ, డింద్రుఁడు, కుబేరుఁడు మొదలుగాఁగల దేవతాసమూహములు బద్ధాంజలులై సేవింపఁగా, విష్ణుదేవుఁడు స్వారోచిషునికిఁ బ్రత్యక్షమయ్యెను.
అలం. ఉపమ, ఉదాత్తము.

క. ఈ తెఱఁగునఁ దోఁచిన హరి, కాతఁడు సాష్టాంగ మెరఁగి ♦ యంగము పులకా
స్వీతంబుగ హర్షాశ్రువు, లేతేరఁగఁ జూచి భక్తి ♦ నిట్లని పొగడెన్. 102

టీ. అతఁడు = ఆ స్వారోచిషుఁడు; ఈ తెఱఁగునన్ = ఈ విధముగా; తోఁచిన హరికిన్ = ప్రత్యక్షమయిన విష్ణుదేవునకు; సాష్టాంగము ఎరఁగి = ఎనిమిది యంగములతోను గూడుకొనునట్టుగా - చాఁగిలఁబడి నమస్కరించి; అంగము = దేహము; పులకాన్వితంబుగన్ = గగుర్పాటుతోఁ గూడుకొనఁగా - గగుర్పొడువఁగా; హర్షాశ్రువులు = సంతోషమువలని కన్నీళ్లు - ఆనందబాష్పములు; ఏతేరఁగన్ = రాఁగా - పుట్టఁగా, చూచి; భక్తిన్ = భక్తితో; ఇట్లని = ఇఁకమీఁదఁ జెప్పఁబోవునట్లు; పొగడెన్ = స్తుతించెను.

కవిరాజవిరాజితము

జయ జయ దానవదారణకారణ ♦ శార్ఙ్గరథాంగగదాసిధరా!
జయ జయ చంద్రదినేంద్ర శతాయుత ♦ సాంద్రశరీరమహఃప్రసరా!
జయ జయ తామరసోదరసోదర ♦ చారుపదోజ్ఝితగాంగఝరా!
జయ జయ కేశవ! కేశినిషూదన! ♦ శౌరి! హరీ! దురితాపహరా! 103

టీ. దాన...ధరా! - దానవదారణ = రాక్షసులయొక్క భేదమునకు - చంపుటకు; కారణ = హేతువులైన - సాధనములైన; శార్ఙ్గ = సింగిణివిల్లు; రథాంగ = చక్రము; గదా = గుదియ; అసి = కత్తి; ధరా! = (అను నీయాయుధములను) ధరించినవాఁడా! జయ జయ = గెలువుము, గెలువుము - ఎల్లశత్రువులను గెలిచి, యెల్లలోకములందు నధికుఁడవై వర్తింపు మనుట. చంద్ర...ప్రసరా! - చంద్ర = చంద్రులయొక్కయు; దినేంద్ర = సూర్యులయొక్కయు; శతాయుత = పదిలక్షలయొక్క - అనేక చంద్రసూర్యులయొక్క యనుట; సాంద్ర = దట్టమయిన - అధికమైన; శరీరమహః = దేహకాంతివంటి దేహకాంతియొక్క; ప్రసరా! = వ్యాపనము గలవాఁడా! జయ జయ. తామర...ఝరా! - తామరసోదర = తామరపువ్వులయొక్క లోపలిభాగమునకు; సోదర = తోడఁబుట్టువైన - సరిపోలిన; చారు = సుందరమైన; పద = అడుగులవలన; ఉజ్ఝిత = విడువఁబడిన - వెడలింపఁబడిన; గాంగ = గంగానదీ సంబంధమయిన; ఝరా! ప్రవాహము గలవాఁడా! - గంగానదికి జన్మస్థానమైన పాదకమలములు గలవాఁడా! యనుట; జయ జయ. కేశవ! = బ్రహ్మరుద్రులకు జన్మస్థానమైనవాఁడా! - (లేక) మంచి తలవెండ్రుకలు గలవాఁడా! కేశినిషూదన! = కేశి యను రాక్షసునిఁ జంపినవాఁడా! శౌరి! = శూరునివంశమునందుఁ బుట్టినవాఁడా! హరీ! = హరిశబ్దవాచ్యుఁడా! దురితాపహరా! = పాపములను బరిహరించువాఁడా! జయ జయ.

తా. రాక్షసులను జంపఁ జక్ర, గదా, ఖడ్గ, శార్ఙ్గములు ధరించినవాఁడవును, పెక్కండ్రు సూర్యచంద్రులు వెలుఁగునట్లు వెలుఁగుచున్న శరీరకాంతి గలవాఁడవును, గంగకుఁ బుట్టినచోటై

నట్టి పాదపద్మములు గలవాఁడవును, బ్రహ్మరుద్రులకు జన్మస్థానమైనవాఁడవును, కేశి యను రాక్షసునిఁ జంపినవాఁడవును, శూరవంశమునఁ బుట్టినవాఁడవును, పాపపరిహారకుఁడవు నైన యో హరీ! యెల్లశత్రువులను గెలిచి, యెల్లవారియందు నధికుఁడవై వర్తింపుము. అలం. ఉపమ.

సీ. అవ్యయానంత! వి శ్వాత్మక! విశ్వేశ!, బ్రహ్మవు నీవ; క పర్ది వీవ;
యింద్రుండ వీవ; వహ్నివి యనిలుఁడ వీవ; వరుణుండ వీవ; భాస్కరుఁడ వీవ;
యముఁడ వీవ; వసూత్కరము నీవ; రుద్రులు, నీవ; యాదిత్యులు నీవ; విశ్వు
లీవ; మరుత్తులు నీవ; మంత్రములు నోం,కృతి వషట్కృతి శ్రుతి స్మృతులు నీవ;

తే. వేద్య మీవ; యీ వచ్చిన విబుధగణము
సర్వమును నీవ; యెట్లన్న సర్వగతుఁడ
వగుట మఱి నీవు గానివాఁ డనఁగ నెవ్వఁ?
డరయఁగను శేషభూతసమస్త! శేషి! 104

టీ. అవ్యయ! = శుభస్వరూపుఁడా! అనంత! = అంతము లేనివాఁడా! విశ్వాత్మక != సర్వస్వరూపుఁడా! విశ్వేశ! = ఎల్లలోకములకు నీశ్వరుఁడా! బ్రహ్మవు = సృష్టికర్తయయిన చతుర్ముఖుఁడవు; నీవ = నీవే. కపర్దివి = సంహారకర్తయయిన రుద్రుఁడవు; ఈవ = నీవే. ఇంద్రుఁడవు = త్రిలోకాధిపతియయిన దేవేంద్రుఁడవు; నీవ = నీవే. వహ్నివి = దిక్పాలకులలో నొకఁడయిన యగ్నివి; అనిలుఁడవు = దిక్పాలకులలో నొకఁడయిన వాయువు; ఈవ = నీవే. వరుణుండవు = పడమటిదిక్కు నేలెడి వరుణుఁడవు; ఈవ = నీవే. భాస్కరుఁడవు = ఎల్ల లోకములకు వెలుఁగు గలుగఁజేసెడి సూర్యుఁడవు; ఈవ = నీవే. యముఁడవు = దక్షిణదిక్పాలకుఁడైన యముఁడవు; ఈవ = నీవే. వసూత్కరముఁ = వసువుల సమూహమును - అష్ట వసువులును; నీవ. రుద్రులు = ఏకాదశరుద్రులును; నీవ. ఆదిత్యులు = ద్వాదశాదిత్యులును; నీవ. విశ్వులు = పదునలువురు విశ్వేదేవతలును; ఈవ = నీవే. మరుత్తులు = నలువదితొమ్మండ్రు వాయువులును; నీవ. మంత్రములును = గాయత్రి మొదలగు మంత్రములును; ఓంకృతి = ఓంకారమును; వషట్కృతి = యజ్ఞములయం దుపయోగించెడి వషట్కారమును; శ్రుతి = ఋగ్వేదాది వేదములును; స్మృతులు= ధర్మశాస్త్రములును; నీవ = నీవే. వేద్యము = తెలియఁదగిన ప్రధానవస్తువును; ఈవ = నీవే. ఈ వచ్చిన విబుధగణము = ఇప్పు డిక్కడ వచ్చియుండెడి దేవతాసమూహము; సర్వమును = అంతయును; నీవ. ఎట్లన్నన్ = అది యెట్లనఁగా; సర్వగతుఁడవు అగుటన్ = సర్వభూతాంతర్యామివి అగుటచేత; మఱి అరయన్=మఱియును విచారింపఁగా; నీవు గానివాఁడు= నీవు గాకుండువాఁడు, అనఁగన్ = అనఁగా; ఎవ్వఁడు = ఎవఁ డున్నాఁడు? శేషభూత సమస్త = నీకు లోనయిన ప్రవృత్తులుగల సమస్త ప్రాణులు గలవాఁడా! శేషి = సర్వ ప్రపంచమునకును స్వామియైనవాఁడా!

మ. పరతత్త్వంబగు నీకు మ్రొక్కెదఁ గరముల్! పద్మాక్ష! కీర్తించెదం
బురుషార్థస్థితి నొప్ప నిన్నుఁ గరుణాంభోధిన్; భవార్తున్ జడున్
శరణార్థిన్ ననుఁ గావఁగాఁ దగుఁ; బ్రధా నవ్యక్త! కాలాత్మ! యీ
శ్వర! భూతంబుల కీవె కర్తవును బ్రో వన్ భర్తవున్ హర్తవున్. 105

టీ. పద్మాక్ష ! = తామరలవంటి కన్నులు గలవాఁడా ! పరతత్త్వంబు = పరబ్రహ్మము; అగు నీకున్ = అయినట్టి నీకు; మోడ్పుఁగరముల్ = అంజలి బంధము - నమస్కారము. పురుషార్థస్థితిన్ = చతుర్విధ పురుషార్థముల యునికిచేత; ఒప్పు నిన్నున్ = అమరియున్న నిన్ను; కరుణాంభోధిన్ = దయారసమునకు సముద్రుఁడైనవానిని; కీర్తించెదన్ = స్తుతించెదను. భవార్తున్= సంసారముచేఁ బీడితుఁడనైనవానిని; జడున్ = ఏమియుఁ దెలియనివానిని; శరణార్థిన్ = శరణు గోరినవానిని - శరణాగతుని; నను్ = నన్ను; కావఁగాఁదగున్ = రక్షింపఁదగును - రక్షింపుము. ప్రధానవ్యక్త! = సర్వశేషి యనఁ దేటపడుచుండువాఁడా ! కాలాత్మ ! = కాలస్వరూపుఁడా ! ఈశ్వర ! = సర్వనియామకుఁడా ! భూతంబులకున్ = ప్రాణులకు; కర్తవున్ = సృష్టికర్తవును; ప్రోవన్ = పోషించుటకు; భర్తవున్= భారవాహియైనవాఁడవును; హర్తవున్= సంహరించువాఁడవును; ఈవె = నీవే.

తా. ఓ హరీ ! పరబ్రహ్మమైన నీకు మ్రొక్కెదను. మిక్కిలి భూతదయగలవాఁడవును, ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధ పురుషార్థముల నెలకొలుపువాఁడవు నైన నిన్నుఁ బొగడెద. సర్వశేషివై యొప్పువాఁడవును, కాలస్వరూపుఁడవును, సర్వనియామకుఁడవు నై, సర్వప్రాణుల సృష్టి స్థితి సంహారము లాచరింతువు గావున సంసారబద్ధుఁడనై, మూఢుఁడనై, శరణు చొచ్చిన నన్నుఁ గాపాడుము.

చ. విలయతమిస్రవేళ నతి ♦ వేలమహాంబుధి నూర్ధ్వలోకవా
సులు నతులై కనుంగొనెడు ♦ చూడ్కుల కౌర్వహుతాశనక్రియా
కలితగతిన్ వెలుంగు ఘన ♦ కాయవిజృంభణఁ జోఁటిమీనవై
కలియఁగఁ గ్రాలు నీవెడఁద ♦ కన్నులు ప్రోచు మమున్ మురాంతకా! 106

టీ. మురాంతకా! = మురాసురునికి యముఁడా! - మురాసురునిఁ జంపిన యో హరీ! విలయతమిస్రవేళన్ = ప్రళయకాలపు రాత్రి సమయమునందు; అతివేలమహాంబుధిన్ = చెలియలికట్ట నతిక్రమించి లోక మంతటను వ్యాపించిన మహాసముద్రమునందు; ఊర్ధ్వలోకవాసులు = స్వర్గము మొదలుగాఁగల మీఁది లోకములయం దుండువారు; నతులై = నమ్రులై - మ్రొక్కుచున్నవారై; కనుంగొనెడు చూడ్కులకున్ = చూచునట్టి చూపులకు; ఔర్వ...గతిన్ - ఔర్వహుతాశన = బడబాగ్నియొక్క; క్రియా = వ్యాపారముతోడ; కలితగతిన్ = ఒప్పుచున్న రీతిచేత; వెలుంగు = ప్రకాశించుచున్నట్టి (ఇది కన్నులకు విశేషణము); ఘన...జృంభణన్ - ఘనకాయ = గొప్ప దేహముయొక్క; విజృంభణన్ = స్ఫూర్తిచేత; చోఁటిమీనవై = చోఁటి యనెడి చేఁపవై ; కలయఁగన్ = అంతటను; క్రాలు నీవెడఁద కన్నులు = ప్రకాశించుచున్న నీవైన విశాలనేత్రములు; మమున్ = మమ్ము; ప్రోచున్ = రక్షించుఁగాక !

తా. మురాసురునిఁజంపిన శ్రీహరీ ! ప్రళయకాలమునందలి రాత్రియందు లోకమును ముంచిన మహాసముద్రమునందు మీఁదిలోకములనుండి నమస్కరించుచుఁ జూచువారైన నిత్యసూరుల కన్నులకు బడబాగ్నియో యనునట్లు వెలుఁగుచున్నవియు, మహాదేహము గల చోఁటిచేఁపవైన నీవియు నైన కన్నులు మమ్ము రక్షించుఁగాక ! కాయము ఘనముగా విజృంభింపఁగా, దానికిఁ దగినట్లు కన్నులును అతివిశాలములై వెలుఁగుచు బడబాగ్నివలె మీఁదనుండువారికి నా రాత్రి చీఁకటియందుఁ గానిపించిన వని భావము. విశాలములును, ప్రకాశమానములు నగుటవలన బడబాగ్నుల

వలెఁ దోఁచినవనుట. విశాలము లగుటకు ఘనకాయవిజృంభణ హేతువు. ప్రకాశమానము లగుటకు విలయతమిస్రవేళ పోషకము. అలం. ఉపమ.

చ. చటులకృపీటసంస్థితర సాస్థలి ప్రీలకయుండ గార యి
చ్చుటకునుబోలె శంఖమణి శుక్తికదంబము నుగ్గుగా విశం
కటచరమాంగమంథగిరి ఘట్టనఁజేసి ఘరట్టమై కృపా
పటిమ జగంబుఁ బ్రోచు నల ప్రాక్కమఠంబు నినున్ భజించెదన్. 107

టీ. చటుల...స్థలి - చటుల = చలించుచున్న - మంథరము తిరుగుటచేత మిక్కిలి చలించి మీఁదికి వ్యాపించుచున్న; కృపీట = నీటియందు; సంస్థిత = ఉండునట్టి; రసాస్థలి = భూతలము; ప్రీలకయుండక = విరిసిపోకుండుటకై; గారయిచ్చుటకునుబోలెన్ = సున్నపు గచ్చు చేయుటకో యనునట్లు; శంఖ...కదంబము - శంఖ = సంకులయొక్కయు; మణి = రత్నములయొక్కయు; శుక్తి = ముత్తెపుఁజిప్పలయొక్కయు; కదంబము = సమూహము - రాశి; నుగ్గుగాన్ = పొడియగుటకు; విశంకట...ఘట్టనఁజేసి - విశంకట = విశాలమయిన; చరమాంగ = వీఁపుఁజిప్పయొక్కయు; మంథగిరి = కవ్వపుఁగొండయొక్కయు; ఘట్టనఁజేసి = ఒరపిడిచేత; ఘరట్టమై = తాను దిరుగలియై; కృపాపటిమన్ = దయాసమృద్ధిచేత; జగంబున్ = లోకమును; ప్రోచు నల ప్రాక్కమఠంబున్ - ప్రోచు = పోషించునట్టి; అల = ప్రసిద్ధమైన; ప్రాక్కమఠంబున్ = ప్రాఁత తాఁబేటిని - ఆదికూర్మమును; నినున్ = నిన్ను; భజించెదన్ = సేవించెదను.

తా. నీళ్లయందుఁ దేలుచుండెడి భూమండలము విరిసిపోకుండుటకై సున్నపుగార చేయనో యేమో యనునట్లు తన వీఁపుఁజిప్ప యడుగురాయియు, కవ్వపుఁగొండ మీఁదిరాయియుఁ గాఁగాఁ, దాను దిరుగలియై, శంఖములయు, రత్నములయు, ముత్తెపుఁజిప్పలయు రాశియనెడి సున్నమును నూఱి లోకమును గాపాడెడి యాదికూర్మమైన నిన్ను సేవించెదను. అలం. ఉత్ప్రేక్ష.

చ. ఉరుతరవిగ్రహస్ఫురణ నుబ్బిననీ రుపరిచ్ఛిదాముఖాం
తరమునఁ దోరమై యెగయు ధార నజాండము గాజుకుప్పెతో
సరి యనఁగాఁ దలాతల రసాతల సీమలు సించి ధాత్రి ను
ద్ధరణ మొనర్చినట్టి నిను నాదివరాహము నాశ్రయించెదన్. 108

టీ. ఉరుతర...స్ఫురణన్ - ఉరుతర = మిక్కిలి పెద్దదయిన; విగ్రహ = దేహము యొక్క; స్ఫురణన్ = అదురుచేత - కదలికచేత; ఉబ్బిన నీరు = ఉబికిన జలము; ఉపరిచ్ఛిదాముఖాంతరమునన్ - ఉపరి = మీఁదిభాగముయొక్క; ఛిదా = కోఁతదయిన - గండిదియయిన; ముఖాంతరమునన్ = ద్వారముయొక్క సందునుండి; తోరమై = అధికమై - ధారారూపమై; ఎగయు ధారన్ = పైకెగయునట్టి ధారచేత; అజాండము = బ్రహ్మాండము; గాజుకుప్పెతోన్ = గాజుమట్టితోఁజేసిన బుడ్డితో; సరి అనఁగాన్ = సమానము అనునట్లు కాఁగా; తలాతల రసాతల సీమలు = తలాతలము రసాతలము ననెడి క్రిందిలోకములను; చించి = చీల్చి - రంధ్రంబు చేసి; ధాత్రిన్ = భూమిని; ఉద్ధరణము ఒనర్చినట్టి నినున్ = మీఁది కెత్తుటను చేసిన నిన్ను; ఆదివరాహమున్ = తొలుతటిదైన యజ్ఞవరాహమును; ఆశ్రయించెదన్ = అండగొనియెదను.

తా. మిక్కిలి పెద్దదైన నీ వరాహమూర్తి బ్రహ్మాండమునందలి మహాజలమును ప్రవేశింపఁగానే యా దేహసమృద్ధిచేత నా జలము మిక్కుటముగాఁ బొంగి బ్రహ్మాండముపైచిప్ప భేదించుకొని మీఁదికి నిగుడు ధారగా నెగసి బ్రహ్మాండముపై నంతయు వ్యాపింపఁగా, జలవ్యాప్తమైన బ్రహ్మాండము గాజువలె మెఱయఁగాఁ, బైకెగసిన నీటిధార సోగమెడవలె నొప్పఁగా, నా బ్రహ్మాండము సోగమెడగల యొక గాజుసీసాలాగునఁ దోఁచెను. ఇట్లది తోఁచుచుండఁగాఁ గ్రిందిలోకముల నెల్ల భేదించి, భూమిని బైకెత్తిన వరాహమూర్తివైన నిన్నాశ్రయించెదను. అలం. ఉపమ.

మ. కరుణించుఁ గాత మము నట్టి నీదు భుజయు ✽ గ్మం బెద్ది పూనెన్ సభో౦
తరసీమన్ దితిజాంత్రసక్తనఖసం ✽ తానంబుతో నో నృకే
సరి ! రాత్రించరభీతికై త్రిభువనా ✽ స్థానీయవీథిన్ విక
స్వరశోణస్రగలంకృతక్రకచభా ✽ స్వత్తోరణస్తంభతన్. 109

టీ. ఓ నృకేసరి ! = నృసింహుఁడవైన యో స్వామీ ! ఎద్ది = ఏ భుజద్వయము; నభోంతరసీమన్ = ఆకాశమధ్యభాగమందు; దితి...తోన్ - దితిజ = దితికొడుకైన హిరణ్యకశిపుని యొక్క; ఆంత్ర = ప్రేఁగులతోడ; సక్త = కూడుకొన్న; నఖసంతానంబుతోన్ = గోళ్ల సమూహముతో; రాత్రించరభీతికై = రాక్షసుల వెఱపునకై; త్రిభువనాస్థానీయవీథిన్ = స్వర్గపు కొలువుకూటముయొక్క మార్గమునందు - తలవాకిటియం దనుట; వికస్వర... స్తంభతన్ - వికస్వర = వికాసమునొందిన - విరిసిన; శోణ = ఎఱ్ఱనైన; స్రక్ = పూదండలచేత; అలంకృత = అలంకరింపఁబడిన; క్రకచ = అంపములచేత; భాస్వత్ = ప్రకాశించుచున్న; తోరణస్తంభతన్ = గోపురద్వారపుఁ గంబము లగుటను; పూనెన్ = వహించెనో; అట్టి నీదు భుజయుగంబు = అటువంటి నీదైన భుజద్వయము; మమున్ కరుణించున్ = మమ్ము ననుగ్రహించుఁగాక ! (హిరణ్యకశిపుఁడు స్వర్గము నేలుచుండె ననియు, సభాద్వారమునందు వాఁడు నృసింహదేవునిచేఁ జంపఁబడె ననుటయుఁ బురాణప్రసిద్ధి గనుక 'త్రిభువనాస్థానీయవీథిన్ = స్వర్గ మర్త్య పాతాళము లనెడి మూఁడులోకములయొక్క సభాశ్రేణులయందు' అని వ్రాయఁబడిన యర్థము సమంజసము కాదని తోఁచెడి.)

తా. ఓ స్వామీ ! నృసింహుఁడవైన నీవు చేతిగోళ్లయందు హిరణ్యకశిపుని కడుపులోని ప్రేఁగులు వ్రేలఁగా, బాహువు లెత్తుకొని స్వర్గసభాద్వారమునందు నిలిచినప్పుడు నీ బాహువులు రాక్షసులకు బెదరు పుట్టించుటకై యెఱ్ఱని పువ్వుదండలచే నలంకరింపఁబడి అంపములు గట్టి నిలిపిన గోపురద్వారపు స్తంభములవలె నుండెను. అట్టి నీ భుజద్వయము మమ్ము రక్షించుఁగాక ! ఇచట కడుపులోని ప్రేఁగు లెఱ్ఱని పూదండలుగాను, గోళ్లు అంపములుగాను, భుజములు తోరణస్తంభములుగాను వర్ణితములు. అలం. నిదర్శన.

చ. దనుజకులేంద్రదత్త కర ✽ తామరసస్థిత దానధారచే
ననిమిషదైన్యదుఃఖిత మ ✽ హామునిమండలదృశ్య కశ్యపాం
గనసయనాంబువుల్ గడిగి ✽ కంజభవాండము మోవ లీల మైఁ
బెనిచిన దంభవామను ను ✽ పేంద్రుని నిన్ను సమాశ్రయించెదన్. 110

టీ. దనుజ...ధారచేన్ - దనుజకులేంద్ర = దానవవంశశ్రేష్ఠునిచేత - బలిచక్రవర్తిచేత; దత్త = ఇయ్యఁబడిన; కరతామరస = హస్తకమలమునందు; స్థిత = ఉండిన; దానధారచేన్ =

ఈవి యప్పటి నీటి ధారచేత; అనిమిష...బువుల్ - అనిమిష = దేవతలయొక్క; దైన్య = పేదరికముచేత; దుఃఖిత = దుఃఖమునొందిన; మహామునిమండల దృశ్య = సప్తమహర్షి మండలమునందుఁ జూడఁదగిన; (కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు జమదగ్ని అను వారు సప్తమహామునులు.) కశ్యపాంగన = కశ్యపమహామునిభార్యయయిన యదితి యొక్క; నయనాంబువుల్ = కన్నీళ్లు; కడిగి = తుడిచి - ఆమె దుఃఖము మాన్పి యనుట; కంజభవాండము = బ్రహ్మాండము; మోవన్ = అనునట్లు; లీలన్ = విలాసముగా - అనాయాసముగా; మైన్ పెనిచిన దంభవామనున్ = దేహము పెరుఁగునట్లు చేసిన కపటపుఁబొట్టివానిని - వంచన చేయుటకై పొట్టివాఁడుగాఁ బుట్టినవానిని; ఉపేంద్రునిన్ = ఇంద్రునితమ్ముఁడైనవానిని; నిన్నున్; సమాశ్రయించెదన్ = లెస్సగా నాశ్రయించెదను.

తా. బలిచక్రవర్తిచేత మూఁడడుగులభూమి దానముగాఁ బుచ్చుకొని, బ్రహ్మాండమంతయు నాక్రమించిన కపటవామనుని, నింద్రునికిఁ దమ్ముఁడై యవతరించుటచే నుపేంద్రుఁడనఁబరగిన వానిని నిన్ను నే నాశ్రయించెదను. (మునిమండలదృశ్యయైన కశ్యపాంగన యనుటవలన దానధార తీసికొన్నతోడనే మునిమండలమువఱకుఁ బెరిఁగినాఁడని పెరుఁగుటయొక్క వేగము స్ఫురించుచున్నది.) అలం. పర్యాయోక్తము.

చ. తనదగు సంతతిం గనలి ౹ తానె వధించిన పాపముల్ చెడన్
మునిఁగెడు నా గుణోగ్రకిణ ౹ ముల్ మొనయంగ శమంతపంచక
మ్మునఁ బితృతర్పణచ్ఛలన ౹ మున్కలు వెట్టు భవద్భుజాయుగం
బున కిదె వందనంబు భృగు ౹ పుంగవరూప! విహంగవాహనా! 111

టీ. భృగుపుంగవరూప! = భార్గవశ్రేష్ఠుని రూపముగలవాఁడా! - పరశురామావతారమెత్తినవాఁడా! విహంగవాహనా! = పక్షివాహనుఁడా! - విష్ణుదేవుఁడా! తనది = తనవలననైనది; అగు సంతతిన్ = అయినట్టి సంతానమును - అనఁగా క్షత్రియుల సమూహమును; (పరమపురుషుఁడయిన విష్ణుని బాహువులవలన క్షత్రియులు పుట్టిరని శ్రుతులు పలుకుచున్నవి గనుక నా పురుషోత్తముని యవతారమైన పరశురాముని బాహువులు తమవలనఁ బుట్టిన క్షత్రియుల సమూహమును వధించె నని సంబంధము.) కనలి = కోపించి; తానె వధించిన పాపముల్ = కనిన తానే చంపిన పాతకములు; చెడన్ = నశించుటకై; మునిఁగెడునాన్ = మునుఁగుచున్నదో యనునట్టుగా; గుణోగ్రకిణముల్ = అల్లెత్రాటి యొఱపిడిచే గల్గిన భయంకరములైన కాయలు - గట్టిపడిన స్పర్శస్థానములు; మొనయంగన్ = ముందటికి మొగ్గఁగా; శమంత పంచకంబునన్ = క్షత్రియ రక్తములచే నైదు మడుఁగులు గావించిన పుణ్యతీర్థములందు; పితృతర్పణచ్ఛలనన్ = తండ్రికిఁ దర్పణము చేయుట యను మిషచేత; మున్కలువెట్టు భవద్భుజాయుగంబునకున్ - మున్కలు పెట్టు = మునుఁగునట్టి - స్నానము చేయునట్టి; భవద్భుజాయుగంబునకున్ = నీ భుజములజంటకు; ఇదె! = ఇదిగో! వందనంబు = నమస్కారము. ('విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్' అను శ్లోకార్థ మిచ్చుట సూచింపనయ్యెను.)

తా. పరశురామావతారమెత్తిన యో పురుషోత్తమా! క్షత్రియులు నీ బాహువులవలన జనించినవా రగుటచే బాహుజు లనంబరగిరిగదా! అట్లు తమబిడ్డలయిన రాజులను దామే చంపిన పాపము తొలఁగుటకై పితృతర్పణము చేయుట యను మిషచేత వింటినారి సోఁకి కాచినకాయలు

ముందటికి బ్రయోగ్గఁగా రాజరక్తములచే నైదు మడుఁగులై శమంతపంచక మనంబరగిన పుణ్యతీర్థము లందు మునుఁగుచున్న నీ రెండుబాహువులకు నిదిగో మ్రొక్కుచున్నాను. అలం. అపహ్నవము.

చ. పవిధారాపతనంబు గైకొనని య * ప్పౌలస్త్యుమై సప్తధా
తువులం దూఱుపరిశ్రమంబునకు ను * ద్యోగించెనా సప్తసా
లవిభేదం బొనరించి నిల్వక సలీ * లం జన్న యుష్మన్మరు
జ్జవనాస్త్రం బొసఁగుఁ జిరుల్ రఘుకుల * స్వామీ! రమావల్లభా! . 112

టీ. రఘుకులస్వామీ! = రఘువంశపురాజైన శ్రీరామా! రమావల్లభా! = లక్ష్మీప్రియుఁడా! పవిధారాపతనంబు = వజ్రాయుధముయొక్క పాటును; కైకొనని యప్పౌలస్త్యుమైఁ - కైకొనని = లక్ష్యము చేయని; అప్పౌలస్త్య = ప్రసిద్ధుఁడయిన రావణునియొక్క; మైఁ = దేహమునందుఁగల; సప్తధాతువులఁ = వస, అసృక్కు, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్లము అనునట్టి సప్తధాతువులందు; (రోమములు, త్వక్కు, మాంసము, అస్థి, స్నాయువు, మజ్జ, ప్రాణము అనెడివి సప్తధాతువు లని కొందఱు.) దూఱు పరిశ్రమంబునకుఁ = చొచ్చునట్టి యభ్యాసమునకు; ఉద్యోగించెఁ నాఁ = ప్రయత్నము చేసెనో అనునట్లు; సప్తసాలవిభేదంబు - సప్తసాల = ఏడు ఏపె మ్రాఁకులయొక్క (పా. సప్తతాల=ఏడు తాటిచెట్లయొక్క); విభేదంబు ఒనరించి = తెగనఱకుటను చేసి; నిల్వక = అంతటితో నిలువక; సలీలఁ = విలాసముతో - ఆట్లాటవలె ననుట; చన్న... స్త్రంబు - చన్న = భూమిలోనికిఁ దూఱిపోయిన; యుష్మత్ = నీదైన; మరుజ్జవన = వాయువేగమువంటి వేగముగల; అస్త్రంబు = బాణము; (నాకు) సిరుల్ = సంపదలు; ఒసఁగుఁ = ఇచ్చుఁగాక!

తా. రఘురాముఁడవై యవతరించిన యో లక్ష్మీవల్లభా! వజ్రాయుధముదెబ్బను లక్ష్యము చేయని రావణుని దేహమునందుఁ జొచ్చి వసాదులైన యేడుధాతువులను భేదించుపనికి నలవాటు చేసికొననో యనునట్లు సప్తసాలములను భేదించి, యంతటితో నిలువక భూమిలోఁ దూఱిపోయిన నీ వడిగలబాణము నాకుఁ గలుముల నిచ్చుఁ గాక! (మిక్కిలి కష్టసాధ్యమైనపని చేయవలసియున్న యెడల మునుముట్ట నట్టి పనుల నభ్యాసము చేయుట స్వాభావికము. రావణునిదేహము వజ్రపుదెబ్బఁగూడ లక్ష్యము చేయనంత యతికఠిన మగుటచే నందలి యేడు ధాతువులను దూఱుట కష్టసాధ్య మగును గాన నందులకై మునుముట్ట నభ్యాసము చేయుచున్నదో యనునట్లు లేడు సాలములఁ దూఱివచ్చిన దని భావము.) అలం. ఉత్ప్రేక్ష.

క. పెరుఁగు ప్రలంబుని వీఁపునఁ, గరిపైఁ హరివోలె విశద * కాంతి నిలిచి త
త్కరణం బారాటము గాఁ, బరిమార్చిన నీదు బలిమిఁ * బ్రణుతింతు హరీ!

టీ. హరీ! = ఓ విష్ణుఁడా! పెరుఁగు ప్రలంబుని వీఁపునఁ - పెరుఁగు = పొడుగుగా నెదుగుచున్న; ప్రలంబుని వీఁపునఁ = ప్రలంబాసురునియొక్క వీఁపునందు; కరిపైఁ = ఏనుఁగు మీఁద; హరివోలెఁ = సింహమువలె; విశదకాంతిఁ = తెల్లనివెలుఁగుతో; నిలిచి = నిలువఁబడి; తత్కరణంబు = వాని శరీరమును; ఆరాటముకాఁ = పరితాపముకాఁగా; పరిమార్చిన నీదు బలిమిఁ = చంపిన (బలరాముఁడవైన) నీ బలమును; ప్రణుతింతుఁ = స్తోత్రముచేసెదను - బలరామావతారమెత్తి ప్రలంబాసురుని సంహారించిన హరీ! నిన్నుఁ బొగడెద ననుట. అలం. ఉపమ.

